## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్ధం మహానుభావులైన శ్రీ డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా వెబ్ సైట్: http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

# డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా వారి వెబ్ సైట్

## http://www.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# మనమా !

కీ. శే. శ్రీ సూరాబత్తుల సూర్యనారాయణ

693

అనురాగంబను మాయజీవిత ఫలం బాశించి మేలెంచుచున్
ధనధాన్యంబులఁ గూర్పఁ జాలినను సంధానంబుగాఁబో దిహం
బున సౌఖ్యంబు పరం బిఁకేగతిని నబ్బున్ బూని వైరాగ్యమున్
మనమా ! నిశ్చల పూర్ణభావమున బ్రహ్మానందమున్ జెందుమా.

తినుచున్ మూర్కొనుచున్ ధరించుచును బ్రీతిన్ బొందుచున్ వింతలన్
గని సంతోషముఁ జెందుచున్ మమత నాకర్ణించుచున్ గేరుచున్
దనియంబోకుము లేదు దాన సుఖమందన్; బూని వైరాగ్యమున్
మనమా ! నిశ్చల పూర్ణభావమున బ్రహ్మానందమున్ బొందుమా.

ఘనవంశంబున సంభవించినను రాకాచంద్రునింగేరు శో
భన రూపంబునఁ బెంపుఁగాంచినను సంభావ్యంపు సంసారమం
దనువౌ సంతతిగాంచినన్ సుఖముగద్దా ? పూని వైరాగ్యమున్
మనమా ! నిశ్చల పూర్ణభావమున బ్రహ్మానందమున్ బొందుమా.

మన పంతంబులు దీరునంచు నితరుల్ మారాడలేరంచు హా !
మనకెంతే బలగంబు కద్దని సదా మా తంత్రముల్ సాగునం
చని యుప్పొంగ సుఖింపఁ గల్గునది కద్దా ? పూని వైర్యామున్
మనమా ! నిశ్చల పూర్ణభావమున బ్రహ్మానందమున్ బొందుమా.

అనయంబున్ మితిలేని కోరికలతో నల్లాడుచున్ గూడి వ
చ్చిన సంతోషముతోడఁ బొంగి చెడినన్ చింతించుచున్ గ్రుంగి యా
తన తబ్బిబ్బుల మున్గి యేల వగఁగుందన్ బూని వైరాగ్యమున్
మనమా ! నిశ్చల పూర్ణభావమున బ్రహ్మానందమున్ బొందుమా.

కనువిందై భ్రమియింపఁ జేయుచు సదా గాసిన్ బడన్ద్రోయు వం
చన కార్యావళి యెండమావుల క్రియన్ సౌఖ్యం బిదేలోకమం
దొనఁగూడున్ బ్రతినిత్య మేమిఫలమయ్యో! పూని వైరాగ్యమున్
మనమా! నిశ్చల పూర్ణభావమున బ్రహ్మానందమున్ బొందుమా.

కనరా దేయెడ మేలు జీవికి ధరన్ గత్యంతరం బెంచఁగా
ననుతాపంబున మిత్తినోటి కబళంబై జన్మముల్ దాల్చు కుం
దున దా నుక్కిరిబిక్కిరిన్ శ్రమలఁజెందున్ బూని వైరాగ్యమున్
మనమా! నిశ్చల పూర్ణభావమున బ్రహ్మానందమున్ బొందుమా.

అనురక్తిన్ బహులోభివై సకల మీ వాశించి యేవారికిన్
దృణమేనిన్ లభియింపరాదనుచు నుద్దేశింతువే కూడదా
పని నీ స్వార్థపుఁ బుట్టిమున్గ దనుకంపన్ బూని వైరాగ్యమున్
మనమా! నిశ్చల పూర్ణభావమున బ్రహ్మానందమున్ బొందుమా.

ఎనరారాదిఁక నాకు వేరెవరు నేనే భాగ్యశాలిన్ బరుల్
నను పైవానిగనెంచి కొల్వవలదా నాయాజ్ఞ పాలించు చిం
పున నంచెంచక దాటఁజూచుకొని ముప్పున్బూని వైరాగ్యమున్
మనమా! నిశ్చల పూర్ణభావమున బ్రహ్మానందముఁ బొందుమా.

జను లీలోకమె సౌఖ్యదాయి యను నిస్సందేహభావంబుతో
దినముల్పుచ్చెద రెందు మేలొదవెడున్ గన్గొన్న కష్టంబులెం
దును పీడించెడు చూడు పొందవిఁక డిందున్; బూని వైరాగ్యమున్
మనమా! నిశ్చల పూర్ణభావమున బ్రహ్మానందమున్ బొందుమా.

తనువాందోళనమైనవార్ధి గుణధర్మంబింతకున్ వాయుతా
డనచేఁ దూగుచు రేఁగు పెన్కెరటముల్ డంభంబు గాంభీర్యమా
మణులా సద్గుణముల్వహించియుఁ దరింపన్బూని వైరాగ్యముఁ
మనమా నిశ్చల పూర్ణభావమున బ్రహ్మానందముఁ బొందుమా.



# ఆరాధన

శ్రీమదాచార్యా రఘునాథచక్రవర్తి

ఆరాధన అనే శీర్షికతో వ్యాసాలు ఎన్నిసార్లు ప్రకటింపబడినా, ఎందరిచే రచింపబడినా లేక ఒకరి చేతనే పెక్కుపర్యాయములు ప్రచురింపబడినా అవి పత్రికకు నిండును చేకూర్చుతవి గాని వెక్కసము కాబోదు. వాస్తవానికి ఇది పత్రికకు బలుపే గాని వాపు అనిపించుకోదు.

ఆరాధన అనే శబ్దముకూడా అనేకార్థములుగలది. ఈశబ్దమే సందర్భానుసారంగా ఆయాచోట్లలో సొగసును చేకూర్చడం కూడా మనకు గోచరిస్తున్నది.

"ఆరాధ్యైనం శరవణభవం దేవముల్లంఘితాధ్వా" కాళిదాసు మేఘదూతంలోని దీ పద్యపాదము. శరజన్ముడైన ఈ దేవుని ఆరాధించి......అక్కడ మేఘుడు కుమారస్వామిపై పుష్పవృష్టి కురిసి తన మార్గమువెంట ప్రయాణం చేయాలి అని యక్షుడు మేఘునితో చెప్పినట్లు కాళిదాసు నిబంధించాడు.

"శ్రద్ధారాద్ధగురుశ్లథీకృతదృఢగ్రంధిః సమాసాదయత్." శ్రద్ధచే ఆరాధించబడిన గురువుచే సడలించబడిన బ్రహ్మముడి గలవాడై శిష్యుడు ఈ గ్రంథాన్ని పఠించవలసివుంటుంది, అనగా అవగాహన చేసుకోవలసివుంటుంది. కాని ప్రాజ్ఞమ్మన్యమానసుడై సాహసించి ఇందులో విహరించదగదు అని ఒక అభియుక్తోక్తి.

"తవార్హతి శ్రీ భుజారాధనం"—దశకుమార చరితంలో ప్రమతి కథలో ఒక వృద్ధ బ్రాహ్మణుడు ప్రమతి అనే రాజకుమారుణ్ణి రాజాస్థానములోనికి తీసికొని వచ్చి ఈమాట అన్నాడు. ప్రమతి రాజుయొక్క శ్రీ భుజమును ఆరాధించుటకు తగును అని దీని సారాంశము. ఇచట ఆరాధించటం అంటే రాజు భుజమును పూజించి అంటే పనిచేయనక్కరలేకుండాచేసి శత్రు సంహారము తానే చేయటం అవుతుంది.

"ఆరాధింపగ రాదె యోబయనృసింహాధ్యక్షు సత్కీర్తులన్" ఇలాచేస్తే చంద్రుని కరిమేహరోగం నయమైపోతుంది; కీర్తి తాదాత్మ్యం చంద్రునికి అబ్బుతుంది.

"ఆరాధనాయాస్య సఖీసమేతాం" పరమశివునికి శుశ్రూష చేయుటకొరకు చెలికత్తెతోపాటు పార్వతిని హిమవంతుడు నియోగించాడు. ఇచట శివుని చిత్తమును బడయుట సూచితము.

"నిశ్శంకం గజపతి దానవారిధారా - మారాధ్య భ్రమర దినా న్యమూ న్యనైషీః" ఓ భ్రమరుడా! నదురూ బెదురూ లేకుండా భద్రగజముయొక్క దానవారిధారను ఆరాధించి అంటే ఆరగించి (ఆస్వాదించి అనే అర్థం వస్తుంది.) ఇన్నిరోజులూ గడిపితివి.

"మత్ప్రసూతి మనారాధ్య - ప్రజేతి త్వాం శశాపసా" రఘువంశములోని దీ శ్లోకము. కామధేనువు దిలీపుని శపించినదట. తన సంతతిని పూజించక పోతే దిలీపునికి సంతతి కలుగదని. అంటే గోపూజ లేదా పసులకాపరిపని - ఆ వైనంకూడా చెప్పబడింది. "స్థితః స్థితా ముచ్చలితః ప్రయాతాం" ఇత్యాదిగా.

"నమూర్ఖజనచిత్త మారాధయేత్" మూర్ఖుని మనసు కెక్కునట్లు మనము నడుచుకోలేము. అనగా మూర్ఖుని మనస్సును అనుసరించలేము అన్నమాట.

ఈవిధంగా ఆరాధన శబ్దము అనేకార్థములలో వాడబడుచున్నది. ఆరాధనము అంటే కనిపెట్టుకొని ఉండడము అనికూడా అనవచ్చు.

దీనికే 'సమ్' అనే ఉపసర్గ జేరిస్తే సమారాధనము అనగా విందు, సంతర్పణ అనే అర్థం వస్తుంది.

తిరువారాధన ప్రారంభంలో 'అథ భగవదారాధన క్రమం వక్ష్యే' అని ఒక వాక్యం ఉంటుంది. ఇది

పూర్వాచార్యులు వారివారి సంప్రదాయానుసారం అవలంబించిన క్రమాన్ని తెలుపుతుంది. ఈక్రమాన్నే ఇంగ్లీషులో ప్రొసీజర్ అంటారు. సంస్కృతంలో కల్పం అంటారు.

ఈ వైనం పాంచరాత్రాగమంలో చెప్పబడి ఉంటుంది.

ఈ పాంచరాత్రాగమ నిర్మాత సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే. యతిరాజసప్తతిలో గురుపరంపరను అభివర్ణిస్తూ వేదాంత దేశికులు

"కమప్యాద్యం గురుం వందే
కమలా గృహమేధినం
ప్రవక్తా ఛందసాం వక్తా
పంచరాత్రస్య యస్స్వయం"

అని ప్రస్తావించాడు.

అయితే భగవంతుడు తన్ను ఈ విధంగా ఆరాధించవలసినదని చెప్పుకుంటాడా అంటే- యజమాని తన సేవకులకు ఆయా పనులు విభజించి ఒప్పజెప్పటం లోకంలో అనుభవసిద్ధమే. భగవద్గీతాది గ్రంథములలోనూ ఈ విషయం పేర్కొనబడుతునే ఉన్నది—

"పత్రం, పుష్పం, ఫలం, తోయం - యో మే భక్త్యా ప్రయచ్ఛతి" అన్న వాక్యంచే భగవదాశయం విదితమౌతున్నది.

ఈ ఆరాధనకాండలో షోడశోపచారములు చెప్పబడి ఉంటవి. వాటివైనం మరొక పర్యాయం వివరించబడగలదు.

ఇవికాక భగవంతునికి ఏ విధంగా అన్వయించిన పనియైనా ఆరాధనగానే పరిణమిస్తుంది. ఉడతాభక్తి ఈ తరగతిలోనిదే.

ఆముక్తమాల్యదలో,

"గృహ సమ్మార్జనమో, జలాహరణమో అనే పద్యంలో పేర్కొనబడినవన్నీ ఆరాధనగానే పర్యవసిస్తవి.

తిక్కన సోమయాజి హరిహరనాథుని సంబోధించి భారతాంధ్రీకరణకు పూనుకున్నాడు. ఇదికూడా ఆరాధనావిశేషంగానే పేర్కొనబడ్డది.

దేవుని యెదుట నృత్తగీతాదికళాప్రదర్శమున్నూ ఆరాధనలోనివే. ఈ విషయమే "ఆరాధ్యైనం శరవణభవం...." అనేచోట పొందుపరచబడినది.

"పశ్చా దనుయాగం విధాయచ" అని పూర్వదిన చర్యలో చెప్పబడినది. పశ్చాత్ అంటే దేవతార్చన అయిన తర్వాత అనుయాగం అనగా దేవతానివేదితాన్నభోజనము విధాయ ఒనర్చి అని. ఇదికూడా దేవతాచిత్తారాధనముగానే పరిణమిస్తుంది.

"తైర్దత్తా నప్రదాయైభ్యో - యోభుంక్తే స్తేన ఏవ సః" అని భగవద్గీత.

అనుయాగం అన్నచోట యాగ శబ్దము యజ ధాతువుపైన 'ఘఞ్' ప్రత్యయముచేర్పగా ఏర్పడిన రూపము. యజధాతువు దేవపూజా సంగతి కరణ దానాద్యర్థములయందు వాడబడుచున్నది. ఏతావతా ఇది పూజాంగమే అని తాత్పర్యము.



# కర్మసిద్ధాంతము

శ్రీ జటావల్లభుల పురుషోత్తము, ఎం. ఏ.

### కర్మ - కర్మఫలము

ప్రతి కర్మకును ఫలముండుననునది కర్మ సిద్ధాంతములోని ప్రాతిపదికనియమము. దీని యర్థమును స్పష్టముగా తెలిసికొనవలసి యున్నది; తెలిసికొందుమేని యీ నియమమును నమ్ముటయు నమ్మక పోవుటయు నను విచారణమునకే యవకాశముండదు. ఈ నియమ మొకస్వయంప్రకాశసత్యముగాగోచరించును.

కర్మయు, కర్మఫలమును అనునవి రెండు భిన్న వస్తువులు కాదు. కర్మయొక్క చివరిస్వరూపమే, లేదా చివరిదశయే, కర్మఫలము. ఫలమనునది క్రొత్తగా వచ్చు మరొకవస్తువు కాదు. పూవు, పిందె, కాయ, పండు - ఇవి యేరీతిగా క్రమావస్థలో యట్లే ఒకపాపము చేయుట.... దుఃఖ మనుభవించుట క్రమావస్థలు. ఇక్కడ మొదటిఅవస్థయు, చివరి అవస్థయు మాత్రము మనకు కన్పట్టుచున్నవి; మధ్యావస్థలు మనకు కన్పట్టుటలేదు. ఆ మధ్యావస్థలనుకూడ చూడగల్గిన శక్తి మహర్షులకుండెడిది. ఏ కర్మ యేరీతిగా ప్రారంభమై యేయే మధ్యపరిణామములను పొంది యే చివరి పరిణామములో మనకు వ్యక్తమగుచున్నదో మహర్షులకు తెలిసి యుండెను. ఆ మధ్యావస్థల పరిజ్ఞానము మనకు లేకపోయినను మహర్షుల వాక్యమందు విశ్వాసముంచి యే కర్మకు నే ఫలమని వారు చెప్పినారో గుర్తించి సుఖమార్గము నాశ్రయించి దుఃఖమార్గమును విడచుట ఆస్తిక్యమున కొక లక్షణముగా చెప్పబడినది. ఏ కర్మ కెట్టి ఫలముండునను విషయములోనే వారియందు విశ్వాస ముంచుట యవసరము; కాని కర్మయు ఫలమును ఒకే వస్తువుయొక్క రెండు దశలని తెలిసికొనుట యనుభవసిద్ధమే.

ఒక డాహారము తినుటయను కర్మను చేయగా క్షున్నివారణమను ఫలము వచ్చినది. నోటవేసికొన్న ఆహారము నమలబడుట, లోపలకు పంపబడుట, ఉదరమును నింపుట, బాధను తగ్గించుట మున్నగు పనులన్నియు నొకే మహాకార్యములో నంగభూతములుగా నున్నవేకాని యివి యేవియు క్రొత్తగా నెక్కడనుండియో వచ్చిన వేర్వేరు కర్మలుకావు. ఆకలిని తగ్గించుట యనునది ఆరంభింపబడిన భక్షణకర్మయొక్క చివరి స్వరూపమే కాని మరొకటికాదు.

ఒక చెరువులో మధ్యను ఱాతిని విసరివైచినామనుకొనుడు, తత్ఫలితముగా అలలు చిన్న చిన్నవి యొడ్డును తాకుచున్నవని చెప్పుదుము. కాని చెఱువు మధ్యలో ఱాయిపడుటయును దానియొక్క కొనసాగింపే యీ అలలొడ్డునకు వచ్చుటయని గుర్తింపవలయును. ఆ ఱాయి పడుటకును అలలు తీరమును చేరుటను మాత్రమే చూచినవాడు అది కార్యము ఇది ఫలము - లేదా అది కారణము, ఇది కార్యము - అను కొన్నను మధ్య విషయములను చూచినవాడు ఈ ఫలమనునది ఱాయిపడుట యొక్క చివరి స్వరూపమే కాని క్రొత్త వ్యాపారము కాదని గుర్తింపగలడు.

ఈనాడు మనము చేసిన యేకర్మయు అంతతో నంతరింపదనియు దానికి తరువాత స్వరూపమేదియో యుండి తీరుననియు స్పష్టమగుచున్నది. ప్రస్ఫుటముగా పైకి గోచరించు నొకానొక కర్మావస్థకే కర్మఫలమను పేరును మనము వాడుచున్నాము. కనుకనే సంస్కృతభాషలో కర్మ శబ్దము చేయబడు పనికే కాక అనుభవింపబడు ఫలములకు కూడ వాడబడుచున్నది. "కురుకర్మ", "అనుభూయతేకర్మ" ఇత్యాది ప్రయోగములు చూడదగును. చేయబడునదియు,

అనుభవింపబడునదియు నొకే కర్మయొక్క ప్రథమ చరమావస్థలగుటయే యీ ప్రయోగములకు కారణము.

బీజములో వృక్ష మిమిడియున్నట్లు కర్మలో కర్మ ఫల మిమిడియుండి కాలాంతరమున పైకి వచ్చు చున్నది. ఆ కాలము క్షణమే కావచ్చును; కొన్ని శతాబ్దములైనను కావచ్చును.

కర్మ, కర్మఫలములకు గల యీ సంబంధము తెలియనివాడు ఇచ్చవచ్చిన పనులనుచేసి ఫలమునకు వెఱవడు. అరచేతితో బల్లపై గట్టిగా కొట్టినవాడు తాను బల్లను కొట్టినాననుకొనుచున్నాడు. కాని వాడు బల్ల నెంతగా కొట్టినాడో బల్లకూడ వాని చేతినంత గట్టిగానే కొట్టినదని పదార్థవిజ్ఞానశాస్త్రము (Physical Science) మనకు చెప్పుచున్నది. బల్ల బలహీనమైన దైనచో నది విరుగును; బలముగలదగుచో వీని చేయి విరుగును. చేయి విరిగినను విరుగకపోయినను ఎంత యొత్తిడి బల్లపై వీడు గల్గించినాడో అంత యొత్తిడియు వీనిచేతికి తగిలియేయున్నది.

ఇది కర్మసిద్ధాంతముయొక్క రహస్యము. ఒకడు నిరపరాధిని చెంపపైకొట్టి బలగర్వముతో విఱ్ఱవీగును. ఏదో యొక ఉత్తరకాలములో, ఉత్తర జన్మలో, దాని ఫలము వీని కనుభవములోనికి వచ్చును. ఈ మధ్య నున్న అనుసంధాన కాలవ్యాపారమునకు "అపూర్వము" అను పేరును పూర్వమీమాంసకులు వాడి యున్నారు.

చేయని దేదియు ననుభవింపవలసియుండదని శాస్త్ర నిర్ణయము. అట్లనుభవింపవలసి యుండుననుట అకృతాభ్యాగమమను దోషమని తర్కశాస్త్రము చెప్పు చున్నది. మరి చేసిన దేదియు అనుభవింప నక్కర లేకుండపోదు. అట్లు పోవుననుట కృతప్రణాశదోష ముగా తార్కికులు చెప్పుదురు. ఈ రెండు దోషము లను తప్పించుకొనుచునే కర్మ, కర్మఫలవిషయక సిద్ధాంతములు నడచుచుండును.

అకృతాభ్యాగమదోషమున కొడిగట్టుదుమేని మనకు వచ్చు కష్టములు మనము స్వయముగా తెచ్చి పెట్టుకొన్నవి కావనియు, ఈశ్వరుడు తెచ్చిపెట్టిన వనియు చెప్పినవార మగుచున్నాము. అట్లే మనకు వచ్చు కష్టములనుకూడ అకారణముగానే మన కీశ్వ రుడు కల్గించుచున్నా డనవలసివచ్చును. దీనివలన ఈశ్వరునకు పక్షపాతము, దయారాహిత్యము - అను రెండు దోషములు వచ్చిపడును. అది యెవ్వ రికిని ఇష్టాపత్తికాదు. బాదరాయణులు బ్రహ్మసూత్ర ములలో నైర్ఘృణ్యవైషమ్యేత్యాది సూత్రముచే నీ యంశమును స్పష్టపరచి యున్నారు.



# భక్తిసారస్వతము - కంచెర్ల గోపన్న

డాక్టరు బి. రామరాజు, M. A. Ph. D.

[పద్య వాఙ్మయ దృష్టితో చూస్తే పోతన్న భాగవతాన్ని మించిన భక్తిరసమయ కావ్యం తెలుగులో మరొకటి లేదు. పురాణాలు కాని ఉపపురాణాలు కాని ఏవైనా భక్తి ప్రబోధకాలే కావచ్చును. కాని భక్తిరస విషయంలో భాగవతానికున్న స్థానం మరో గ్రంథానికి లేదనడం సాహసం కాదు. అయితే మన కున్న సారసత్వం కేవలం పద్యాత్మకమే కాదు. దేశితెలుగుకి ప్రాణంపోసిన - సహజ కవితామృత స్రవంతిలో ఓలలాడే జానపదుల అతిమధురమైన గేయ సారస్వతం - ఒక్కొక్క పాట - ఒక్కొక్క మాట - ఒక్కొక్క భాగవతంగా వెలయగల అమూల్యమైన గేయ సారస్వతం వున్నది. రాజాదరణ లేక కాల ప్రవాహంలో కొట్టుకొనిపోయినది పోగా మిగిలినది జానపదుల్లో ఆ నోటా ఆ నోటా పడి కొనఊపిరితో యింకా బ్రతికున్నది. ఆ కొనఊపిరితో ఉన్న సారస్వతాన్ని పునరుజ్జీవనం చేసే ప్రయత్నంలో శ్రమిస్తున్న ప్రముఖుల్లో డాక్టర్ బి. రామరాజుగారొకరు. జానపద వాఙ్మయంలో ఉన్న భక్తి సారస్వతం గురించి శ్రీ రామరాజుగారి వ్యాసాలను ప్రతి నెలా "ఆరాధన" పాఠకులకు క్రమంగా అందిస్తాము. ఎడిటర్]

"స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే।
స్వాత్మ తత్త్వానుసంధానం భక్తిరిత్యపరేజగుః॥"

అని శంకరుడు ఆత్మపదార్థయాథార్థ్యవిచారతత్త్వమును భక్తితో మేళవించెను. కర్మభక్తిజ్ఞానమార్గములందు భక్తిమార్గమే సులభసాధ్యము. తక్కిన రెండు మార్గములకున్న విధినిషేధపు కట్టుదిట్టము లీ మార్గమునకు లేవు. బ్రహ్మజిజ్ఞాసకు సాధనచతుష్టయ మవసరమని శంకరులును సమగ్రవేదాధ్యయన మావశ్యకమని జైమిన్యాదులును, ఆ వేదాధ్యయనమునకు బ్రహ్మక్షత్రియ వైశ్యజాతులవారే యర్హులని వేదాంతులును మీమాంసకులును తీరుతీరుల కట్టుదిట్టము లేర్పరచినారు. భక్తిమార్గమున నిట్టి యాటంకములులేవు. ఈ మార్గ మవలంబించుటకు చదువుసంధ్యలుకాని అభిజాత్యముకాని యనవసరము. భగవదనుగ్రహమున విశ్వాసమును తదనుగ్రహమున మోక్షప్రాప్తియు గలుగునను నిశ్చయమును ఉన్న చాలును.

"మాం హి పార్థ వ్యపాశ్రిత్య
యేఽపి స్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా
స్తేఽపి యాంతి పరాంగతిమ్"

అని శ్రీకృష్ణభగవానుడును,

"కిరాత హూణాంధ్ర పుళింద పుల్కసా
అభీర కంకా యవనాః కషాదయః
యేన్యేచ పాపా యదుపాశ్రయాశ్రయాః
శుద్ధ్యంతి తస్మై ప్రభవిష్ణవే నమః"

అని శ్రీ శుకుడును భక్తికి అర్హులగు వారినిగూర్చి చెప్పియున్నారు. కనుకనే ఇట్టి సులభసాధ్యమగు మార్గము నవలంబించి యనేకులు తరించిరి.

భక్తికి పూజ్యపూజక భావము బీజము. పూజ్యమూర్తి నాయా మతములవారు తమకు తోచినటుల నిర్ణయించుకొనిరి. కొందరు శివకేశవాది సాకార సగుణబ్రహ్మమును, కొందరు తద్బ్రహ్మ ప్రతీకమును, కొంద రా సగుణబ్రహ్మ యవతారమూర్తులను, కొందరు జీవత్వమును, కొందరు సమస్తవిశ్వాకారమును, మరి కొందరు కేవలమాత్మను పూజ్యపదార్థముగా నారాధించి భక్తిచేతురు. ఈ భక్తి—

"గుణమాహాత్మ్యాసక్తి, రూపాసక్తి, పూజాసక్తి, స్మరణాసక్తి, దాస్యాసక్తి, సఖ్యాసక్తి, వాత్సల్యాసక్తి, కాంతాసక్తి, ఆత్మనివేదనాసక్తి, తన్మయతాసక్తి, పరమవిరహాసక్తి, రూపా ఏకధా అపి ఏకాదశధా భవతి" యని పదునొకండు విధములు. భక్తులు తమ తమ మనోభావముల కనుకూలముగా నయ్యైతీరుల భగవంతు నారాధించి సంస్కృతమునను దేశభాష లందును వేనవేలు గేయములు, సంకీర్తనములు రచించిరి. భక్తిసారస్వతము దక్షిణమున ఆళ్వారుల చేతను, మతాచార్యులచేతను, నాయన్మారులచేతను పెంపొందినది. ఉత్తరభారతమున రామానందుడు, రవిదాసు, నరసింహ మెహతా, కబీరు, మీరాబాయి, తులసీదాసు, వల్లభాచార్యులు, నానకు మున్నగువారును మహారాష్ట్రప్రాంతమున నామదేవు, తుకారాం, సమర్థ రామదాసు, మున్నగువారును, వంగదేశమున చైతన్యుడు, విద్యాపతి, చండీదాసు, గోవిందదాసు, రామప్రసాదు, మున్నగువారును, భక్తి సారస్వతము నితోధికముగా రచించిరి. ఆంధ్రదేశమున గూడ శైవవైష్ణవభక్తిగేయములు లక్షలకొలది రచింపబడినవి. పూర్వశైవుల తుమ్మెద పదము లిప్పటికిని నిల్చియుండుట మన భాగ్యవిశేషము. తాళ్ళపాకవారి సంకీర్తనములకు లెక్కయే లేదుకదా! క్షేత్రయ్య నాల్గువేల సుమారుగా పదములు రచించెనట. త్యాగరాయ లెన్ని కీర్తనలు రచించిరో కాని మిగిలినవి మాత్రము వందలలెక్కలో నున్నవి. కాని యవి యెక్కువగా సంగీతజ్ఞులసొమ్మైపోయినవి. సామాన్య ప్రజానీకమందుగూడ అధికాదరణము పొందిన గేయకవులలో నగ్రగణ్యుడు కంచెర్ల గోపన్న. ఈతనికే భద్రాచల రామదాసని ఇంకొకపేరు. ఇటులే తూము నరసింహదాసు, పరాంకుశదాసు, నిట్టల ప్రకాశదాసు వంటి భక్తుల గేయములుకూడ బహుళ ప్రచారము గాంచినవి.

ఆంధ్రదేశమున పోతరాజు, గోపరాజు, త్యాగరాజు మహాభక్తులు. పోతన్న భక్తి భాగవతకల్పతరువుగా నవతరించినది. త్యాగరాయలవారి భక్తి నాదసుధారసమై దక్షిణభారతీయసంగీతము నమరము చేసినది. దీనిలో సంగీతముపాలు హెచ్చు. ఈ యిరువురమధ్యనున్న గోపన్నగారు సంగీత సాహిత్యములను సమముగా మేళవించి భక్తిసారస్వత సస్యముల దేశము నలుమూలల వెదజల్లిరి. శ్రీరామచంద్రున కాంధ్రత్వము కల్పించినది గోపరాజు. రామదాసుగారి యనుగుజాడల నడచిన తూము నరసింహదాసు రామదాసు చరిత్రమునకు ప్రచారము కల్పించెను. "భద్రాచల మాహాత్మ్యము"న రామదాసు మరియు నరసింహదాసుల కవిత్వములు పాలు పంచదారలై పోయినవి. సింగరిదాసుకూడ నరసింహదాసు కోవలోనివాడే. వీరు సమకాలీనులగు భక్తులు. గోపన్న తానీషా కాలమువాడని కొందరు చారిత్రకులు నిర్ణయించినారు. మరి కొందరీ గాథను పుక్కిట పురాణమనిరి. తానీషా క్రీ. శ. 1658-1687 ప్రాంతము లందు గోలకొండరాజ్యమును పరిపాలించెను. గోపన్న తానీషా రాజ్యమున భద్రాచలప్రాంతములకు తహసీలుదారుడై ప్రభుత్వద్రవ్యమును వెచ్చించి శ్రీరామాలయము మున్నగునవి నిర్మించి యా నేరమునకు పండ్రెండు సంవత్సరములు కారాగారమునం దుండెననియు, తుదకు రామలక్ష్మణులు వచ్చి నవాబునకు పైకము చెల్లించి గోపన్నను విడిపించిరనియు చెప్పుకొందురు. గోపరాజు రామభక్తి యపారము కనుకనే యాతడు రామదాసని పేరుగాంచెను. దాశరథీ శతకము రామదాసుగారి పద్యకవిత్వమునకు చక్కని యుదాహరణము. "భద్రాచల మాహాత్మ్యము." "రామదాసు చరిత్రము" మున్నగు గ్రంథములందు గోపన్న జీవిత చరిత్ర మంతయు విపులముగా వర్ణింపబడినది. హరిదాసులచేతను, దాసరులచేతను, భక్తులచేతను రామదాసుపేర బహుళప్రచారము గావింపబడిన కొన్ని కీర్తనములను స్థాలీపులాకన్యాయమున నిట విచారింతును.

కబీరుదాసు రామదాసుగారికి తారకమంత్ర ముపదేశించిరట. అప్పుడే యా భక్తుడు మహాసంతోషముతో నుప్పొంగిపోయి,

"తారకమంత్రము కోరిన దొరికెను
ధన్యుడనైతిని ఓరన్నా

మీరిన కాలునిదూతల పాలిటి
మృత్యువయని నమ్మికయున్నా"

యను కీర్తనమును పాడుకొనెను. ఈ కీర్తనమున రామదాసు "అన్నిటికిది కడసారి జన్మము సత్యంబిక పుట్టుట సున్న" యనుటచే భక్తియే మోక్షసాధనముగా నాతడు భావించెనని మనము నిశ్చయించవచ్చును. ప్రేమరూపమైనభక్తిముక్తిరూపమగు బ్రహ్మానందమే యని "అమృతస్వరూపాచ" యను నారదభక్తి సూత్రము వెల్లడిచేయుచున్నది.

గోపన్న శ్రీరామచంద్రుని కాలమున పుట్టకపోతిని గదా యని పరితపించిన గేయ మత్యద్భుతముగా నున్నది.

"ఆశపుట్టెనే శ్రీరాములతో హాహా నే పుట్టనైతిని రఘురాములతోనే పుట్టనైతిని"— దీనియందున్న ఉదాత్తభావములను పరికింపుడు.

"జనకుడు హరికి జానకిని పెండ్లిసేయగా వారిద్దరికి సేసబియ్యమునే దెత్తును... అమ్మకు హరికి ఆకులు మడచి యిత్తును....కైకేయిని నే కాదందునుగద, అడవికి పోగా నంటిపోదుగద,....హరిదుఃఖింపగా అమ్మజాడనే దెత్తును, సర్వజ్ఞమూర్తి చాలు నీ విరహ మందును, విశ్వములో నందరు విననట్టె ఊరకుండిరి, సురవరులందరు ముఖము చూచుచుండిరి, అయ్యో ఇదియేమని ఆ బ్రహ్మాదుల శపియింతును గద, అమ్మకు మారుగ అగ్నిలో జొత్తును, బ్రహ్మాదులు హరి ప్రస్తుతింపగా. తల్లి మారుతికి దండవెయ్యగా, నాతల్లి యప్పుడు నాకు వేయునుగద, కష్టపడితినని కరుణించునుగద." యని భావించినట్టి గోపన్న భక్తి జ్ఞానమువలెనే అవస్థా, కాల, స్థితి భేదములు లేనిది. జ్ఞానమార్గమున నీ యభేదస్థితి గహనమైనది. గోపన్న యింతటి గహనవిషయమును భక్తిమార్గమున సాధారణీకరణ మొనర్చెను.

"శ్రీరామనామం మరువాం మరువాం, సిద్ధము యమునికి వెరువాం వెరువాం" అను కీర్తనము ఆబాలగోపాలము నోటికెక్కినది. దీనిలో "శ్రవణం, కీర్తనం, విష్ణోః స్మరణం పాదసేవనం - అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మ నివేదనమ్"— అను ప్రహ్లాదుడు చెప్పిన వివిధ భజనము లున్నవి.

కోదండరామ కోదండరామ -
కోదండరామ కోదండరామ
నీదండనాకు నీవెందుబోకు
వాదేలనీకు వద్దు పరాకు
ఏ బుద్ధివీడు ఎరుగనివాడు
పాపడువీడు బడలియున్నాడు
పాపనులేపి ప్రజలను గల్పి
ఆపదబాపి అటుప్రీతి జూపి
నమ్మిన మాచిన్నవాడెందునున్న
మమ్ములగన్న మా యన్నవన్న"

యని వేడుకొని చనిపోయిన కుమారుని బ్రతికించుకొన్న గేయముకూడ మిక్కిలి వ్యాప్తిగాంచినది.

ప్రభుత్వధనమును వ్యయమొనర్చిన నాపద సంభవించునని యితరులన గోపన్న ధైర్యముతో

"తక్కువేమి మనకు-రాముండొక్కడుండువరకు
ప్రక్కతోడుగా భగవంతుడు మును
చక్రధారియై చెంతనె యుండగ"-

అని పాడుకొనెను. ఇది "యత్ ప్రాప్య న కించి ద్వాంఛతి, నద్వేష్టి, నరమతే, నోత్సాహీ భవతి" యను నారదభక్తిసూత్రమునకు వ్యాఖ్యానము. ఇటులే

"ఏతీరుగ నను దయజూచెదవో
ఇనవంశోత్తమ రామా !
నాతరమా భవ సాగరమీదను
నళినదళేక్షణ రామా" యనుకీర్తనమును,

"గరుడగమన రారా నను నీ కరుణ నేలుకోరా
పరమపురుష యే వెరవులేక నీ
మరుగుజొచ్చితిని అరమరచేయకు"

అను కీర్తనమును,

"ఏమిరా రామా నావల్ల నేరమేమిరా రామా"

యను కీర్తనమును,

"ఇన్నిగల్గిన మీ యారకున్న నే నెవరివాడనౌదు
కన్నతండ్రివలె రక్షించుటకును కరుణయేలరాదు
పక్షపాత మెడలించిన చేతిలో పరుసవేదిలేదా

ఈక్షణమున దయగలిగిన సంచిత ధనమున్నదికాదా కనుగొని నిర్హేతుక కృపజూచిన కల్పతరువులేదా" యను కీర్తనమును యావదాంధ్రమున మార్మోగుచు గోపన్న భక్తి ప్రవంతిని తెలుగునేల నాలుగు చెరగుల ప్రవహింపజేయుచున్నది.

"యద్ జ్ఞాత్వా మత్తో భవతి, స్తబ్ధో భవతి, ఆత్మా రామో భవతి" యనుటచే భగవద్భక్తుడు పిచ్చివానివలె ఒకపరి నవ్వును, ఒకపరి యేడ్చును, ఒకపరి నృత్య మొనర్చును, ఒకపరి కుపితుడగును, ఒకపరి నిందించును, మరియొకపరి స్తోత్ర మొనర్చును, రామదాసులో నీ లక్షణములన్నియు గాననగును. చెరలో పలు బాధలు పడుచున్న రామదాసున కెంత వేడుకొన్నను రామచంద్రుడు దర్శన మీయడయ్యెను. అప్పుడాతడు "ఇక్ష్వాకుకులతిలక ఇకనైన పలుకవే రామచంద్రా-నన్ను రక్షింపకున్నను రక్షకులెవరయ్యా రామచంద్రా" యని పాడిన కీర్తనలో శ్రీరామచంద్రుని చక్కగా నుపాలంభించెను.

"చుట్టు ప్రాకారములు సొంపుతో చేయిస్తి రామచంద్రా
ఆ ప్రాకారముకు పట్టె పదివేల వరహాలు ,,
సీతమ్మకు చేయిస్తి చింతాకు పతకాము ,,
ఆ పతకామునకు పట్టె పదివేల వరహాలు ,,
కలికి తురాయి నీకు పొలుపుగ చేయిస్తి ,,
నీవు కులుకుచు తిరిగేవు ఎవరబ్బ సొమ్మని ,,
మీ తండ్రి దశరథ మహరాజు పెట్టెనా లేక
మీ మామ జనక మహారాజు పంపెనా"

ఇటుల భగవంతు నుపాలంభించి పశ్చాత్తప్తుడై
"అబ్బ తిట్టితినని ఆయాసపడబోకు రామచంద్రా-ఆ దెబ్బల కోర్వక అబ్బ తిట్టితినయ్యా రామచంద్రా" యని వేడుకొనెను. ఇట్టివే

"నిన్ను బోనిచ్చెదనా సీతారామ నిన్ను బోనిచ్చెదనా"

"అడుగుదాటి కదలనియ్యనూ నా కభయమివ్వక కదలనియ్యనూ" వంటి కీర్తనలు. సీతారామచంద్రులపై రామదాసునకున్న స్వాతంత్ర్యము వారితో గల చనువు ఇంతంతకాదు. రామచంద్రుని వేడుకొని విసిగి యా పరమభక్తుడు సీతమ్మ తల్లి నాశ్రయించెను. తండ్రికన్న తల్లిహృదయము మెత్తనకదా! అందును సీతమ్మ హృదయము నవనీతము.

"రామచంద్రులు నాపై చలముచేసినారు సీతమ్మ చెప్పవమ్మ" యను కీర్తనమునందును,

"నను బ్రోవుమని చెప్పవే సీతమ్మ నను బ్రోవుమని చెప్పవే" యను కీర్తనమునందును రామదాసు సీతమ్మతో శ్రీరామచంద్రునికి సిఫారసు చేయించుకొనుట కాననగును. ఈ కీర్తనములందు మృదు మధుర భావములున్నవి.

ఈ విధముగా మహాభక్తుడగు కంచెర్ల గోపన్న ఆంధ్రదేశమంతటిని భక్తిసారస్వతమున ముంచి యెత్తెను. ఈ శాఖయందు గోపన్న కీర్తనలు మకుటాయమానములు. పోతన్నతో పాటు గోపన్నను గన్న తెలంగాణము ధన్యము.



# అమరుడు

శ్రీ గొట్టిపాటి సుబ్బరాయలు

మాటలకు చేతలను మాటి మాయదారి
లోకమున కొన్ని ప్రత్యేకపోకడలకు
పేరు వడసిన బౌద్ధు లుదారగుణులు
సర్వసమతత్పరులు గల సమయమద్ది.

రాతి గుండెల సరదార్ల రీతి మాన్పి
రాతికే గుండె కుదిరించి నీతి శాస్త్ర
గాథలకు కావ్యసిద్ధిని గలుగజేయు
అల యశోకుని వారసు లలరునాడు.

స్వార్థ మవతార మెత్తిన వ్యర్థజీవి
తన పురోహితు చాడీల వెనుకనున్న
కల్మషంబు నెరుంగని గర్వ రోగి
పుణ్య పాపాల లెక్కించు భూవిభుండు.

ప్రజల సంస్కారమును బెంచు పనుల బుద్ధి
మంతు లెవరైన నున్నచో అంతుఁ జూడ
నెంచి వెదకించి గాలించి ఏదియేని
నేరమును మోపి శిక్షించు క్రూరవిధుల.

నేరమేమని అడిగిన నూరుకోడు
ఔనటన్నది కాదను టన్నిటికిని
మించిపోయిన తప్పు వాంఛించు నద్ది
లేదటంచు వచించిన లేదు బ్రతుకు.

నాడు ఆరేడు ఇర్వది నల్వురకును
మరణ శిక్షను విధియించె వరుసగాఁగ
నిలువగాఁ బెట్టి కోరగాఁ దలతురేని
వ్యవధి నిత్తును దయ నని వార్చె నవ్వు.

ఒక్కరును గూడ దీనికి "ఊ" యటంచు
"ఆ" యటంచును పల్కలేే దంతమంది
లోన నొకరును వాంఛకు లోనుగారు
జంకు గొంకులు లేవు నవ్వంకురించు.

ఎవరికిని గూడ కోరిక లేమిలేవ ?
వాయిదా కొన్నినాళ్లైన వలద ? యేల
పలుక కున్నారు మీరని మరల ప్రశ్న
వైచె భూమీధవుఁడు బౌద్ధ వ్రాజమునకు.

అంతలో తాటియాకులం దంత వఱకు
ఘంటమున నేదియో వ్రాయుచుంట దీని
నంతగా లక్ష్యపెట్టని అమరసింహు
డడుగు ముందుకు వైచిన ఆ క్షణాన.

బౌద్ధ పరివ్రాజ మంతయు పైకి క్రింది
కట్టులే దిక్కులకుఁ జూచె పట్టుదప్పి
కొలువు కూటాన ఆశ్చర్య మొలికి తొణికె
రాజగురు నేత్రముల మంట రగులుచుండె.

అమరు డిట్లనె రాజుతో " అయ్య నేను
వ్యవధి నడుగుట జీవితవ్యసనములకు
లోగి కాదిట రచనలో ఆగినట్టి (సాగుచున్న)
కోశమున కింక నొక కాండ కూర్చుకొరకు."

రాజు తల యూపె తీర్పులో వ్రాయఁబడియె
దినదినం బొక్కరిని నురిదీయునట్లు
ఎట్టకేలకు అమరుని కట్టకడకు
చంపుటకు నిర్ణయం బొండు జరిగిపోయె.

నిముసమేని వృథా జననీక మంచి
నీళ్ళ నేనియు ముట్టక నిద్రబోక
అవులింపక తుమ్మక అమరు డేర్చి
కూర్చి నానార్థ కాండము తీర్చి దిద్దె.

ఊట లింకను తగ్గలే దూహాలందు
కాంక్ష పడిపోవదు నిఘంటుకరణదీక్ష
గంట మ్రోగెను అంతిమ ఘడియ చిహ్న
మమరసింహున కావేళ మతిశయించె.

మ్రింగె పుట్టెడు కోర్కెల వంగె నురికి
తలను దూర్చెడు తలపుతో తనదు జీవ
శక్తి పణముగ గూర్చిన శబ్దకోశ
మంకితముఁజేసి బుద్ధున కమరుఁడవుడు.

చంపఁబడితివి అయినను చావులేదు
అమరుఁడవు నీవు సాహితీ అంకమందు
దోచుకొనఁబడె జీవ సందోహ శక్తి
ధనికుఁడవు నీవు కోశసంధానమందు.

సాహితికి న్యాయమునకు సంస్కారమునకు
కళలఁ బుట్టించి కాంతిని వెలుగు జిలికె
నీ తపస్సున పండిన నిండుదనము
ధీ మహస్సున పండిన దీప్తిరుచులు.

కవివరేణ్యులు నీదు కడపమానికి మ్రొక్కి
దోసిళ్ళతో భిక్ష దీసికొనిరి
పండిత మాన్యులు పడిగాపులం గాచి
పరిగ లేరిరి నీదు పంట నేల
తర్క మీమాంసకుల్ తడవకు పుడిసెడు
నీరు ద్రావుదురు నీ తీర భూమి
లలిత కళావేత్త లులిని కుంచెను గొంతు
సానఁ బట్టుదురు నీ చట్టునందు
సంస్కృత క్షేత్రమున పంటకాపువగుట
అలఘులకు నెల్ల కులపతివైన నీదు
మధుర జీవిత మద్భుత మమరసింహ!
నాట నేటను ఈ నాట దీటులేరు.

---

# చతుర్మత తత్త్వం - శాంకరాద్వైతం

శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులు

[ఒకే వ్యక్తి మూలంగా మొట్టమొదట ఉద్యమరూపంలో వెలసిన మతం బౌద్ధం - అంతకుముందు ఆర్షమతం అనే పేరుతో ఒక మతం లేకపోలేదు. అయితే బౌద్ధం బుద్ధ నిర్మితమైనట్లు ఆర్షమతం ఏక వ్యక్తి నిర్మితం కాదు. బుద్ధునికి చాలాకాలం తరువాత ప్రచ్ఛన్న బౌద్ధుడని పేరుగాంచిన శంకరాచార్యులవారు అద్వైతాన్ని స్థాపించగా రామానుజాచార్యులవారు విశిష్టాద్వైతాన్ని - మధ్వాచార్యాదులు అద్వైత శుద్ధా ద్వైతాలను ప్రతిపాదించారు. త్రిమతాలనగానే మామూలుగా మనకు గోచరమయ్యేవి ద్వైతాద్వైత విశిష్టా ద్వైతాలు మాత్రమే. మొదటి బౌద్ధం కాని తర్వాతి శుద్ధాద్వైతం కాని లెక్కలోకి రావు. మన మతాలపై సిద్ధాంతరీత్యా పరిశోధనాత్మకమైన చర్చలు తక్కువగా జరిగాయి. సుప్రసిద్ధ పండితులు విమర్శకులు అయిన శ్రీ వేదాల తిరువేంగళాచార్యులుగారు "చతుర్మత తత్త్వం" అనే శీర్షికతో అద్వైత - ద్వైత - విశిష్టా ద్వైత - శుద్ధాద్వైత మత సిద్ధాంతాలపై వ్రాసిన పరిశోధనాత్మకమైన అభిప్రాయ విశేష పుంజాన్ని ఆరాధన పాఠకులకు క్రమంగా అందిస్తున్నాము. ఎడిటర్.]

నారాయణం పద్మభవం వశిష్ఠం
శక్తిం చ తత్పుత్రపరాశరాంశ్చ
వ్యాసం శుకం గౌడపదం మహాన్తం
గోవిందయోగీన్ద్ర మథాస్య శిష్యం
శ్రీ శంకరాచార్య మథాస్య పద్మ
పాదం చ హస్తామలకంచ శిష్యం
తం త్రోటకం వార్త్తికకార మన్యా
నస్మద్గురూన్ సన్తత మానతోఽస్మి.

మన కందరికీ కన్పడుతూన్న యీ ప్రపంచంలో చేతనాలుగా కొన్ని అచేతనాలుగా మరికొన్ని ఉన్నవి. ఈ రెండు రకాల వస్తువులు ఎక్కడనుండి వచ్చినవి? ఈ విషయాన్ని గూర్చి మన పూర్వులు, పెద్దలు, మహర్షులు, మహావిద్వాంసులు నానా ఆలోచించారు. అందులో కొంతమంది తమ తపశ్శక్తితోను, మరి కొంతమంది యోగాన్ని ఆధారపరచుకొనీ, ఇంకా కొందరు ఊహలతోనూ నిర్ణయించదానికి ఆరంభించారు. ఈ రకాలన్నీ సామాన్యంగా ఋగాది* వేదాలల్లోనూ, చాలా ఉపనిషత్తుల్లోనూ, అందులోగూడ ముఖ్యంగా శ్వేతాశ్వతరంలో కన్పడతవి.

* "కో అద్ధా వేద క ఇహ ప్రవోచత్, కుత ఆజాతా కుత ఇయం విసృష్టిః
అర్వాగ్దేవా అస్య విసర్జనేన, అథ కో వేదయత ఆబభూవ
ఇదం విసృష్టిర్యత ఆబభూవ, యది వాదధే యదివానదధే
అస్యాధ్యక్షః పరమేవ్యోమన్, సో అంగవేద యదివానవేద."
నాసదీయ సూక్తం, ఋగ్వేదం. ౧౦. మండలం.

ఇదంతా కూడా ఉపనిషత్తులే అంటే యీ దీర్ఘతమఋషి ఋక్కును గమనించండి.

"నవిజానామి యది వేదమస్మి నిణ్యః సన్నద్ధో మనసా చరామి
యదామాగన్ ప్రథమజా ఋతస్యా విద్వచో అశ్నువేభాగమ స్యాః"

ఇక శ్వేతాశ్వతరం చూద్దాం.

"కింకారణం బ్రహ్మ కుతస్మజాతా జీవామ కేన క్వచ సంప్రతిష్ఠా
అధిష్ఠితాః కేన సుఖేతరేషు వర్తామహే బ్రహ్మవిదో వ్యవస్థాం
కాలః, స్వభావః, నియతిః, యదృచ్ఛా భూతాని, యోనిః పురుష ఇతి చిన్త్యా
సంయోగ ఏషాం నత్వాత్మభావాత్ ఆత్మాప్యనీశః సుఖదుఃఖహేతోః."

మొట్టమొదట్లో వేరేవేరే వస్తువులకు వేరేవేరేగానే కారణాలుండినవని తోచింది. కాని క్రమక్రమంగా మానవులకు విజ్ఞానం పెరిగినకొద్దీ యాలోచనలు కొత్త కొత్త తోవలు తొక్కినవి. చాలా ఆకులు, చాలా కాయలు, పళ్లు, కొమ్మలు, ఊడలు వీటన్నింటి తోను మహా పెద్దయెత్తున పెరిగే మఱ్ఱిచెట్టుకు, చిన్న గింజ ఒక్కటి మూలకారణంగా కన్పడుతున్నది. అట్లాగే నానారకాల నామరూపాలు, క్రియా విజ్ఞానాలు, విచిత్రంగావుండే పరిణామవివర్తాలు, ఊహించడానికి వీలుకాని, ఊహ కెంతమాత్రమూ అందని యేవేవో చిత్రవిచిత్రాతిచిత్రాలుగా వుండే సన్నివేశాలు, అంతకంటేకూడా నిరూపించడానికి దొరకని తీరులతో ఏయేలోకాలలోకో తీసుకొని పోతున్న భావాలు, అందులోనూ, ఏయే రకరకాల సుఖదుఃఖాలో, ఏయే కామక్రోధాది వికారాలో తమను తిప్పుతుంటే, మనసులోని లోతుల కెంతమాత్రము అందని అనుభవాలు, కళ్ళకు కన్పడుతున్నా నిరూపణకు అందని రూపవిన్యాసాలు, కర్త, కార్యము, భోక్త, భోగ్యము, భోగము ఇవేమీ అసలే లేక పోవడం అనే నానారకాలైన వికల్పాలు ఈ ప్రపంచం అంతటా నిండి వుండటంవల్ల ఇది ఇట్లా అని నిరూపించడం మాట అట్లా వుండనిచ్చి అసలు ఇది యిట్లా వున్నదని తెలియడం కూడా చాలా దుర్ఘటం గానే వుంది. ఇంత విస్తృతిగా వున్న యీ సమూహాని కంతటికీ గూడా వెనుక మనమనుకొన్న మఱ్ఱి చెట్టుకు వలెనే యేదోవొక సూక్ష్మమైన, వ్యాపకం ఐన బీజం మూలకారణం ఒకటి వుండి తీరవలెనని ఊహ తోచింది. అంతేకాక ఆమూలం ఈకార్యాలల్లో వున్న గుణాలతో నిండి నిబిడీకృతమే ఆయి వుండాలని గూడ ఊహతట్టింది. లేకపోతే ఇంతటి వైవిధ్యంగల కార్యా లెట్లా పుడతవి? అని తార్కికులు ఆలోచించారు. ఈ యాలోచనలు తలా వక రకంగాపోయి విస్తరించినవి. ("తర్కం" అంటే "ఊహ.")

అందులో ఒకరి ఆలోచన యిది, ఈ జగత్తుకు మూల మేదైనా వుంటే అది శూన్యమే కావలెను. ఏమంటే—ఒకదానితో నొకటి పొసగనివి, విరుద్ధాలైనవీ చాలా పదార్థాలు కన్పడుతున్నవి. ఈ నానారకాలకు మూలకారణంలో గూడా ఇన్ని రకాలధర్మాలూ ఉండవలసిందే కదా; అటువంటి దొక్క భావము ఎక్కడా ఎన్నడూ వుండదు. ఉండటం అసంభవం. ఏ భావపదార్థాన్ని చూచినా దానిలో విరుద్ధధర్మాలు కనుపడడంలేదు. మట్టికుండలో మన్ను, బంగారము రెండూ, కన్పడవు కదా! ఒక్క మన్నువల్లనే ఆ కుండ యేర్పడింది కాని బంగారముకూడా కలియడంవల్ల కాదుకదా! కాబట్టి కార్యమునందున్న ధర్మాలే కారణంలో వుండడం స్వభావంగా వున్నది. అటువంటిదశలో ఈ ప్రపంచంలో వున్న అనేక తీరుల పదార్థాలకు మూలకారణంలోగూడ ఈ కార్యాల అనేకతీరు లుండేతీరాలి. అప్పుడా మూల కారణం భావం కావడాని కెంతమాత్రంకూడా వీలుండదు; భావం ఐనదాంట్లో విరుద్ధాలయిన ధర్మాలుండబోవుకనుక. కాగా చిట్టచివరకు ఆ మూల కారణం శూన్యం అనే అనగా అభావం అనే మనం తప్పక అకామేనాపీ అంగీకరించాలి. అట్లాకాక కార్యసాజాత్యాన్ని పురస్కరించుకొని సత్తుగా కన్పడే యీ ప్రపంచానికి సత్తే కారణంగా వుండాలి అన్నుకొంటే అది - ఆ కారణము ఈ ప్రపంచంగా పరిణమించాలి కనక దానిలో పరస్పరవిరుద్ధాలయిన యీ కార్యమండలిలో వున్న ధర్మాలన్నీ వున్నవనాలి. అది అసంభవం. నీరుకు నిప్పుకు వకటే కారణంగా వుంటుందా? ఇట్లా గజసింహాలు సర్పనకులాలు మొదలైన పరస్పరవిరుద్ధాలన్నీ మూలకారణాన్నుంచే అనగా సత్తైనకారణాన్నుంచే పుట్టినవంటే మనంగానీ లోకంలో యే వక్కడుగానీ వప్పుకొంటాడా? వప్పుకోవడానికి వీలుందా? లేదు.

కనక ఈ సకల విరుద్ధకార్యాలకు కారణంగా వక సత్తు ఉండజాలదు. ఏల? సత్తులో పరస్పరవిరుద్ధ ధర్మా లుండజాలవనేదే సూత్రం.

అంతేకాక యేదైనా వక మామిడిమొక్క మొలచిందనుకోండి. దాని విత్తనాన్ని నేలలో పాతినపుడు ఆగింజ నశిస్తేనేకాని ఆమొక్క మొలవటం లేదు.

అంటే ఆ విత్తనం రూపు చెడినతరువాతే ఈమొక్క మొలుస్తుంది. ఇది మన కందరికీ తెలిసిందే. ఇపుడేం తేలింది. మామిడి విత్తనాన్నుండి మామిడిమొక్క మొలవడం లేదు. అక్కడా గింజేది? ఇకేమి? శూన్యాన్నుంచే మామిడిమొక్క పుట్టిందని మనకు స్పష్టంగానే వుందికదా! కనకనే పెద్దలు "నానుప మృద్య ప్రాదుర్భావాత్" అన్నారు.

అంటే తాత్పర్యం ఏమిటి? కుమ్మరి మన్నుముద్దను సారెమీద పెట్టాడనుకోండి. సారె తిరుగుతున్నకొద్దీ ఆ మంటిముద్ద క్రమంగా రూపరిపోతుంది. చివర కసలే ఆముద్దకన్పడకుండాపోతుంది. అపుడు కుండ, దాక, చట్టి, మూకుడు మొదలైనవన్నీ పుట్టుకొస్తాయి. ఇపుడు మంటిముద్ద 'ఉపమర్దిత' మైతేనే కుండ మొదలైనవి పుట్టినవి కదా! ఉపమర్దనం—రూపరి పోవడం, లేకపోతే కుండ మొదలైనవి పుట్టజాలవు కదా! కనక మంటిముద్దనుండి కుండ పుట్టడం లేదు. ఇంకేమిటి? శూన్యంనుండే కుండ వగైరా పుట్టుతున్నవి. అదీకాక ఒక కుండనుండి మరొక కుండ పుట్టుతున్నదా? ఎవరైనా అట్లా అని అన గలరా? కనక సత్తునుండి సత్తు పుట్టుతుందనడం యుక్తియుక్తంకాదు, అదీకాక అనేక విరుద్ధధర్మాలు కార్యాలల్లో వుండేవి, దాని మూలకారణం ఐన సత్తులో వుండడం కూడా సంభవంకాదు— అని ఇది వరకే అనుకొన్నాము.

అయితే యీవిరుద్ధ ధర్మాలు ఎక్కడ సమన్వయ మవుతవి? అంటే ఒక్క శూన్యంలోనే నని చెప్పాలి. అదెట్లాగంటే ఒక చతురశ్రాన్ని తీసుకోండి. దాని తూర్పు కోణమూ పడమర కోణమూ పరస్పరం విరుద్ధాలు కదా! ఇట్లాగే దక్షిణ కోణం ఉత్తర కోణం గూడాను. అవన్నీ—ఈ విరుద్ధ కోణాలన్నీ గూడా ఎక్కడ సమన్వయిస్తవి? ఒక్క శూన్యం—సున్నలోనే. ఈ సున్న—శూన్యంలోనే అన్ని కోణాలు ఇమిడి వుంటవి. సున్ననుండే చతురశ్రం ఏర్పడుతుంది. "○" ఇట్లా వున్న శూన్యంలోనుండి "□" చతురశ్రం పుట్టడాన్ని ప్రత్యక్షంగా మన అనుభవంలో గ్రహించవచ్చు. చతురశ్రం సున్నలో లీనమై—ఇమిడి, యుండడం గూడా ప్రత్యక్షంగానే గ్రహించవచ్చు. "□" ఇట్లా వుండే చతురశ్రానికి "○" ఇట్లా కోణాలు అణిగితే శూన్యమే—సున్నే అవుతుందికదా! సున్నకు కోణాలు దిద్ది తీర్చవచ్చు. కోణాలను అణచి సున్నలో ఇముడ్చవచ్చు. ఇవి రెండూ గూడా ప్రత్యక్షానుభవంలోవే. కనక శూన్యం లో నుండే ఉత్పత్తి తిరిగి శూన్యంలోకే చేరడం రెండు మనకు స్థిరపడినవి. కాగా ఈ ప్రపంచంఅంతా శూన్యంనుంచే పుడుతుంది. తిరిగి శూన్యంలోకే చేరు తుంది అని మనం నిర్ణయించుకోవచ్చు. కనక ఈ ప్రపంచమంతా శూన్యంయొక్క పరిణామమే. ఇపుడు కార్యసాజాత్య న్యాయం కానీ సత్కార్యవాదం కానీ యుక్తంకాదని తేలిపోయింది.

అయితే ఈ ప్రపంచ మేదీ మనకు శూన్యంగా కన్పడడం లేదే అని మనకు సందేహం తోచవచ్చు. దీన్ని వివేచించి బోధిస్తేనేగాని సరిగా తెలుసుకో లేరు. అపనే చేస్తాం. నిజాని కీప్రపంచం అంతా మనకు ఇట్లా వున్నట్లుగా తోస్తూన్నదేకాని అసలు లేదు. ఏమంటే వక ఉదాహరణ చెప్తాం గమనిం చండి. తాడును చూచి ఒకడు "పా"మను కొంటాడు. మరొకడు "నేలపగులు"అనుకొంటాడు. ఇంకొకడు "నీటిబార" అనుకొంటాడు. ఈ అనుకోవడాలల్లో అసలు నిజం ఏది? నిజంగా తాడే అక్కడవుంటే పాము ఎట్లా అవుపడింది? నేలపగులు, నీటిచార ఎట్లా కన్పడ్డవి. అవి కన్పడకపోతే అనుకోరుకదా! లేనిదేదీ కన్పడకపోవడం, తెలియందేదీ అనుకోక పోవడం మీ అందరికీ తెలిసిందే. కాబట్టి అసలక్కడ తాడుకానీ, పాముకానీ మరొకటిగానీ ఉన్నదనుకో వడం కుదరదు. ఏ వొక్క భావపదార్థం వుందన్నా కడమభావాలు ఎట్లా కన్పడ్తవి? కాగా అవేవీ అక్కడ అసలు లేవనడమే సరియైనమాట. అయితే అవన్నీ ఎట్లా కన్పడ్డవి? దీనికి సమాధానం చెప్ప వలసి వుంది. దృష్టాంతంతో దీన్ని వివరిస్తాం. ఒక స్త్రీ శవం అక్కడ పడివుందనుకోండి. దాన్నిచూచి దాని విటుడు తన భోగ్యవస్తువని భావిస్తాడు. కుక్కకు

తాను తినే మాంసమని తోస్తుంది. సన్యాసికి హేయమైన పదార్థంగా తోస్తుంది. అక్కడ అసలుండేదేమిటి? స్త్రీశవం. అనగా అభావం - శూన్యపర్యవసానం. దీన్నిజూచిన పై ముగ్గురికీ మూడు రకాల ఊహలు తోచినవంటే ఇవి చూచేవాళ్ళ తలలో ఏర్పడ్డవేకాని, అసలక్కడ లేవనేకదా తేలింది. అట్లాగే ప్రకృతంలో - తాడు వద్దకూడా ఏమీ లేకపోవడమే వాస్తవం అదేమంటే అన్నిరకాల ఊహలెట్లా వస్తవి? అయితే తాడుకూడా లేదంటారాయేం? అవును. అదికూడా లేకపోవడమే వాస్తవం. దీన్ని వివేచించి బోధిస్తాం. గ్రహించండి. అసలు తాడంటే యేమిటి? కొన్ని పీచుల పోగేకదా! ఆ పీచులకన్న వేరేలేదు కదా ఆ పోగు! కనక పీచులేకాని, దానికన్న వేరుగా పోగుగానీ ఆ పోగైన తాడుకానీ లేదని తేలింది కదా! అనగా తాడనే అవయవి - అవయవములు కలిగి వానికన్న వేరుగానుండే మరియొక వస్తువు లేదని స్పష్టమైందికదా! ఆ పీచులు కూడా వాటి అవయవాలు మాత్రమే. ఇట్లా క్రమంగా అవయవాలపరిగణనం చేసుకుంటూపోతే చివరకెక్కడికి పోతుంది? పరమాణువులవరకు పోతుంది? అక్కడకుగాని యీపరిగణనం మీ తార్కికులకు నిల్వదు. అవైనా వున్నవికదా శూన్యం ఎట్లాగంటారేమో? అదీకూడా కుదరదు. ఏమంటే ఆ పరమాణువులు అని మనం అంటాం కాని-అవి మన కంటికగుపడుతున్నయ్యా? అసలవి అవుపడతవా? లేదు కద! ఎన్నడూ ఎవ్వరికీ ఏ చోటాగూడా ఏ వొక్కపరమాణువు కన్పడదనే కదా మీ తార్కికుల సిద్ధాంతం. అసలీపరమాణువుగూడా వాళ్ళ అవయివావయవవిభావాన్నిబట్టి లెక్కకు చూపవలసిందేకాని వాస్తవానికి ఆ పరమాణువుకూడా ఎక్కడా లేదు. ఏమంటే ఎవ్వరికీ ఎక్కడా ఏ కాలానా కన్పడనిది అసలు లేదనడమే సబబు మీభర్తృహరేం అన్నాడు? "అత్యన్తావర్ణనేనస్యా దసత్త్వం ప్రతి నిశ్చయః" (వాక్యపదీయం. ౩ కాం. ౧౩ ఉద్దేశ. ౧౧ శ్లో.) కాగా అవయవి - తాడు. అవయవములనేవానికన్న వేరేలేదు కనుక అదీ కన్పడదు అవయవములు - చివరకు పోనుపోను లెక్కకు తేలినవి - పరమాణువులూ కన్పడవు కనక లేవు. అవి యింద్రియాలకు కనరావని మీ తార్కికులే వప్పుకొంటారు కదా. కాగా దీని పర్యవసానంయేమిటి? అక్కడతాడూలేదు. పేడూలేదు పరమాణువులులేవు. ఏవీలేవు కనక ఇహ మిగిలిందేమిటి? శూన్యమే. అదే అక్కడ మన కగపడేది? దానినుండే యీ తాడు, పాము మొదలైన ఆలోచనలన్నీ ఏర్పడినవి అని తేలింది. అయితే అక్కడ శూన్యం కనపడక ఈతాడు వగైరా యెట్లా కన్పడ్డవి? ఇందాకటి స్త్రీశవం దృష్టాంతం జ్ఞాపకం చేసుకోండి. చూచేవాళ్ళ కదివరలో అనాదిగావున్న సంస్కారాలకొద్దీ ఆయా ఆలోచనలు కల్గినవి. అంతేకాని అక్కడ తాడు వగైరా వుండికాదు. ఈ విషయం "తాడు" అక్కడ వుందనేవారైనా అంగీకరించాలె. తప్పదు. ఏమంటే వారి యిష్టప్రకారంగా అక్కడ తాడు ఉన్నా, కడమపాము, నీటిచార వగైరా అక్కడ లేవు కదా మరి? ఆ యాలోచనల కేం కారణం చెప్పగలరు? మేమన్నట్లుగా వారివారికి అనాదిగా వున్న సంస్కారాలే కారణం అనితీరాలె. కనక "భక్షితే ఒపి లశునే న రోగశాన్తిః" అన్నట్లుగా తాడు నొకదాన్ని అక్కడ వప్పుకొన్నా మళ్ళీ అనాది సంస్కారాలనుబట్టే ఆ యాలోచనలు ప్రసరించడాన్ని అంగీకరింపక తప్పదు.

అటువంటప్పుడు ఈ తాడును మాత్రం ఒక్కదాన్ని ఎందుకొప్పుకోవడం? ఈ తెద్దు నాకి ఉపవాసాన్ని చెడగొట్టుకోవడంవల్ల కల్గే లాభం ఏముంది? నిజానికి తాడుకూడ అక్కడలేదని ఇదివరకే మేము నిరూపించాంకదా! కనక అక్కడ శూన్యమే కాని మరొకటి ఏమీలేదు. ఉండడానికి అవకాశమూలేదు. కాగా ఇక్కడల్లేనే సర్వే సర్వత్ర ఈ ప్రపంచంలో శూన్యమే కన్పడుతుంది. వస్తువుకాదు కన్పడేది: దాన్ని ద్రష్ట తన సంస్కారం కొద్దీ వేరువేరుగా భావిస్తాడు. అంతే ప్రపంచం అనేదేమీలేదు. దానికి కర్తా లేడు. కనక భగవంతుడు ప్రపంచం నిర్మించాడనే వాదం అంతా వట్టి కోలాహలమే.

అదేమయ్యా! ఈ ప్రపంచంలో నరులు, జంతువులు, కొండలు, నదులు, చెట్లు ఇట్లా నానారకాల వస్తువు లగపడుతున్నవే. వీటి నన్నింటిని కాదని శూన్యమే ననడం సబబుగావుందా? అని సంశయాత్మ లడుగుతారు. వారికొక సమాధానం చెప్తాం.

ఏమంటే--శ్రోత్రియ బ్రాహ్మణునకు మాలవానిని చూచినతోడనే తొలగి దూరంగా పోవలెనని తోస్తుంది. కడమవాళ్ళకు—శూద్రాదులకుగానీ, తదితరులైన మాలలకుగానీ ఈ తీరుగా తోస్తున్నదా? లేదు. ఏమి? ఎందుకలా తోచలేదు? అసలక్కడ - ఆ మాలవాడిలో దూరంగా తొలగిపోవలసిన దోషం యేమీ లేకపోవడమే అందుకు కారణం అయితే శ్రోత్రియబ్రాహ్మణుడి కెందుకట్లా తోచింది? అతనికి అతడి తండ్రి తాతల నాటినుండీ కూడా ఆ సంస్కారాలే అలవాటు పడ్డాయి. ఆ వాతావరణంలోనే పెరిగాడు కనుక ఆ బ్రాహ్మడు అట్లా అనుకొన్నాడు. దాని ప్రకారంగా అతడు ప్రవర్తించాడు. అతనికీ సంస్కారం అతని తండ్రినుండి ఏర్పడింది. అతడికి అతడి తండ్రినుండి, అతగాడికి ఆతని తండ్రినుండి. ఈ తీరుగా ఏనాడిది మొదలైందో మన కెరుగరానంతటి అనాదికాలంనుండీ ఈ సంస్కారం ఆ కోవలో ఏర్పడివుందని సులభంగానే తెలుస్తుంది కదా! ఇట్లాగే కడమ సంస్కారాల విషయంకూడా ఊహించుకోవలసింది. ఇట్లాగే అనాదీయాలైన అనేక సంస్కారాల పుట్టవల్లనే ఈ ప్రపంచం అంతా ఏర్పడింది? నడుస్తున్నది. కనుక మనకీ ప్రపంచంలో ఏరకం జ్ఞానం కల్గినా ఇదివరలో మన మనస్సుల్లో అనాదిగా ఏర్పడివున్న సంస్కారాలవల్ల వాటి కనురూపంగా కల్గేదేకాని తదితరంకాదు. మరొక విధంగా వుండనూ వుండదు. వుండడం సంభవమూకాదు. కాగా ఈ ప్రపంచం అంతా ఊరికే ఇట్లా వున్నట్లు తోచేదే కాని అనగా - ప్రాతిభాసికమే కానీ వస్తుతః ఏమీలేదు. మన అన్తఃకరణం - (మనస్సు) యొక్క సంస్కారాలవల్ల ఇది ఇట్లా తోస్తూందే కాని వస్తుతః ఏమీలేదు. శూన్యమే అంతా, అదే యీ ప్రపంచాని కంతటికీ ఉపాదానం—మూలకారణం. అది దేనివల్లా పుట్టేదికాదు. చచ్చేదికాదు. కనక ఈ శూన్యమైన ప్రపంచాన్ని నిర్మించడానికని దేవుడి నొకణ్ణి తెచ్చిపెట్టుకో నక్కరలేదు. అని శూన్యవాదం చేస్తారు కొందరు.

మరి కొందరు పై విషయమంతా బాగానే వుందని అంగీకరిస్తారు. కాని యీ ప్రపంచం తోచడానికొక ఆధారమేదైనా ఉండకతీరదంటారు. ఆ ఆధారం శూన్యంకాజాలదు. ఏమంటే అసలు "తాడు" అనే ఆధారంలేకుండా "పాము" మొదలైన వెట్లాగూ తోచవుకదా! అట్లాగే ఏదో వొక ఆధారం వుండి తీరాలె యీ ప్రపంచం ఇట్లా తోచడానికి. అదేమిటయ్యా? అంటే ఆ ఆధారం విజ్ఞానమేనని అంటారు. వీరు విజ్ఞాన వాదులనీ వీరిది విజ్ఞాన వాదం అనీ అంటారు. ఈ విషయాన్నంతా ముందు మాయావాదంలో విస్తరించి నిరూపిస్తాం.

అయితే ఈ వాదాలను—మనసు ఈ ఆలోచనలను వేటినీ *సాంఖ్యులు అంగీకరించరు. ఏమంటే మనకు ఈ ప్రపంచం కన్పడే తీరునుబట్టి మనం

---

* సాంఖ్యులు సద్వాదులని అంద రెరిగిందే. సద్వాదులంటే కార్యము తాను పుట్టక పూర్వమునుండే కారణములో దాని రూపములతో (కారణపు రూపంతో) వుందంటారు; సత్తైనదే - అదివరలో వున్నదే కర్తయొక్క ప్రయత్నంవల్ల వ్యక్తం అవుతుందంటారు. అంతేకాని క్రొత్తగా - అపూర్వంగా కార్యం పుట్టుకొనిరాలేదని వారి తలంపు—

కారణ రూపంలోనే కార్యం ఉందనీ అది వ్యక్తమయ్యే స్వభావం కలదైతే దాన్ని స్వభావమే వ్యక్తం చేస్తుందనీ, కర్తయొక్క ప్రయత్నం ఆ పనిలో - కార్యాన్ని వ్యక్తం చేయడంలో, స్వభావానికి తోడ్పడుతుందనీ చార్వాకు లంటారు.

చార్వాకుల తలంపుయొక్క వాస్తవం ఇది. సాంఖ్యులకు అదివరలో లేని "కుండ, చట్టి" మొదలైన దశలు, మట్టి కెట్లా కర్తయొక్క ప్రయత్నంవల్లనే ఏర్పడతవో అట్లాగే "భూమి, నీరు, నిప్పు, గాలి" వీటిలో లేని - అదివరలో అవి వేరువేరుగా వుండేటప్పుడు కన్పడని, జ్ఞానాదులు, శరీరంగా ఏర్పడిన అనగా ఈ సరిక్రొత్త తీరుతో మేళగించిన పై భూమ్యాదులం దేర్పడతవని. ఇది ప్రాచీన చార్వాకుల మతం. ఇక నవీన చార్వాకులూ, లోకాయతులూ గూడా పై

ఊహించాలె. అంతేకాని దానికి విరుద్ధంగా మన "ఊహాలు సాగిస్తే మనం తప్పయిపోతాం, మనకు ఈ ప్రపంచంలో ఏదీ శూన్యంగా అవుపడడం లేదు. కుండ వున్నది. గుడ్డ వున్నది" అని ఈ తీరుగానే అన్నీ భావాలుగానే—(సత్తులుగానే) కన్పడు తున్నవి కానీ, అభావాలుగా - శూన్యంగా కన్పడడం లేదు. చిట్టచివర కభావంకూడా భావరూపంలోనే కన్పడుతుంది. ఎట్లాగంటే కుండలేదని ఎక్కడ అనుకొంటున్నామో అక్కడ ఆకుండ లేకపోవడం ఉన్నట్టుగానే కన్పడుతుంది. అంటే కుండలేనిచోటు మన కంటికి సత్తుగా కన్పడ్డప్పుడే దానియందు కుండ యొక్క లేకపోవడం - అభావం, ఉన్నట్లగుపడుతుంది. కుండ లేకపోవడాన్ని కన్పరచే భూభాగంగానీ కుండ లేకపోవడంగానీ అక్కడ లేదని మనం అనుకోము గదా! కనక అభావంగూడా అధికరణ రూపంగానో లేక స్వయంగానో అడ్కడున్నదే - అనగా భావరూపమే అయి తీరింది.

(సశేషం)



---

పృధివ్యాదుల్లో బీజరూపంగా జ్ఞానం వుందనీ అదే శరీరంలో బాగా వ్యక్తం అవుతుందనీ ఈ శరీర రూపంగా వున్న భూమ్యాది భూత చతుష్టయంయొక్క కలయికలోని దశలనుబట్టి యీ జ్ఞానంయొక్క అవస్థలు కూడా మారుతుంటవనీ అంటారు. ఇందు కొక యుక్తి కూడా చూపుతారు. "సత్వాత్సంజాయతే జ్ఞానం" అని భగవద్గీతలో వుంది. సత్వం అంటే ప్రకృతియొక్క గుణం. అది త్రిగుణాత్మిక అని సాంఖ్యులూ అంటారు కదా. జ్ఞానానికి కారణం ఐన సత్త్వగుణం ప్రకృతిలోనే వుందంటే భూమ్యాదులం దున్నదనే కదా చివరకు తేలేది. ఏమంటే ఆ ప్రకృతి భూమ్యాదుల రూపంగానేగా ఈ ప్రపంచం అయింది. అనగా సురనరాదుల శరీరంగా ఏర్పడింది అంతేకాక "దైవీహ్యేషాగుణమయీ మమమాయా దురత్యయా" అని గీతలో ఉన్న విషయాన్నే "మాయాంతు ప్రకృతిం విద్యాత్" అని వేదం ప్రమాణిస్తుంది. ఇందువల్ల విచిత్ర కార్యకారి కావడంవల్ల "మాయ" అనబడే యీ ప్రకృతిలో జ్ఞానాన్ని కల్గించే సత్వగుణం వున్నదని వైదికులే అంగీకరించారు. కాగా వారు ప్రకృతి అన్నా మేం చెప్పే పృథివ్యాపస్తేజో వాయువులు కాదనరు కదా! అని నవీన చార్వాకుల యుక్తి. వీరు అక్కడక్కడ తమ మతాన్ని ఇతర దార్శనికులకు ప్రదర్శించేటప్పుడు పై తీరున శ్రుతి స్మృత్యాదికాన్ని ప్రమాణంగా పేర్కొంటారు. తానే వారికి శ్రుతి స్మృత్యాదులందు ప్రమాణబుద్ధి లేదు. ఊరక ప్రతివాదులు చేసే ప్రతివాదాన్ని ఎదుర్కోవడానికే అంతవరకే వారికి శ్రుతి స్మృత్యాదులతోడి ఉపయోగం.

# ధృతరాష్ట్రుడికి విదురుడు చెప్పిన నీతులు

శ్రీ బుద్ధవరపు కాశీరాజు

"కయ్యమనే తలపు తొలగిపోయే విధంగా, కడు నెయ్యముతో తియ్యగా మాట్లాడాలి, నువ్వు. శాంతి మార్గాన కార్యవిధానం నడిపించి అందరూ ఒకటై బ్రతికే పథానికి ఒప్పించి తిరిగి రా," అని చెప్పి ధృతరాష్ట్రుడు సంజయుణ్ణి ఉపప్లావ్యంలో విడిసి ఉన్న పాండవులకడకు పంపించాడు. సంజయుడు పాండవులను చూచి, మాట్లాడి తిరిగి హస్తినాపురం చేరాడు. రాజమందిరంలో, అంతఃపురంలో ధృతరాష్ట్రుణ్ణి కలుసుకున్నాడు. "జూదంనాడే పుట్టింది చిచ్చు. నీ ఉపేక్ష ఇప్పటికే ఎంతో కాల్చివేసింది. ధర్మరాజు ఎలాటివా డనుకున్నావు? అతడు మెత్తని పులి. యావన్మందీ అధర్మాన్ని నీకు అంటగట్టాక ఇంకేమీ వినిపించుకోడు, చూడడు. ఆ తర్వాత అతణ్ణి మరల్చడం నీకూ నాకూ సాధ్యమవుతుందా? మహావేగంతో రావడంవల్ల ఒళ్ళంతానొప్పులు పెడుతున్నది. మనస్సు నిశ్చలంగా లేదు. ఇప్పటికే చాలా ప్రొద్దుపోయింది కూడాను. ఇప్పుడు నేను శలవు తీసుకుంటాను. రేపు నువ్వూ, నీ కొడుకులు, బంధువులు, ఆప్తులు యావన్మందీ ఉన్నప్పుడు మన వ్యవహారం యావత్తు సవిస్తరంగా మనవిచేస్తాను" అన్నాడు. "అలాగే," అంటూ సంజయుణ్ణి పంపేశాడు, ధృతరాష్ట్రుడు.

ధృతరాష్ట్రుడు ఒక్కడే కూర్చుని సుదీర్ఘంగా ఆలోచించాడు. ఒక సేవకుణ్ణి పిలిచి విదురుణ్ణి వేగంగా తీసుకురమ్మన్నాడు. విదురుడు వడివడిగా వచ్చినాడు.

"పాండవుల్ని చూసి సంజయుడు ఇప్పుడిప్పుడే ఇక్కడికి వచ్చాడు. నన్ను చాలా చీవాట్లుపెట్టి, రేపు అక్కడి వార్తలు చెపుతానంటూ వెళ్ళిపోయాడు. అప్పటినుంచి నాకు మహావిచారం పట్టుకొంది. మనస్సు తత్తరపడుతోంది గుండె కుమిలిపోతోంది. ఒళ్ళు నిప్పుల్లో కాలుతున్నట్లుంది. కంటిమీద కునుకు రావడంలేదు." అన్నాడు, ధృతరాష్ట్రుడు.

"బలవంతుడు తనపైకి యుద్ధానికి ఎత్తివచ్చినప్పటి బలహీనుడు, ధనం పోగొట్టుకొన్నవాడు, దొంగ, జారుడు వీరు నలుగురు నిద్రరాక బాధపడతారు. ఈ బాధల్లో ఏదో నీ మనస్సును పట్టుకొని పీడిస్తున్నట్లున్నది. ఇతరుల సొమ్ము తినదల్చుకున్నావు కాబోలు! కాకపోతే నిద్ర చెడడానికి గల నిజమైన కారణం ఏమిటో చెప్పు." అన్నాడు, విదురుడు.

"ధర్మరాజు ఇతనితో ఏమేమి చెప్పాడో తెలియక బాధపడుతున్నాను. నీకు తెలుసు గనుక అదేమిటో కొంచెం నాకు అర్థమయ్యేట్లా చెప్పి నా బాధ బాపరాదా?" ధృతరాష్ట్రుడు క్రుద్ధంగా అన్నాడు.

"అయ్యో! ధర్మరాజు నీకు బాంధవుడు చెలికాడు భటుడు గురువు పెన్నిధి కాదా? అతడు సత్యసంధుడు; శాంతమూర్తి; వినయము వివేకము శీలము కలవాడు. అతడు హాని తలపెడతాడా? వారిని నువ్వూ నీ కొడుకూ దూషించేశారు; అదే చాలు.... వారికి ఉచితమైన పాలు పంచి ఇవ్వండి. ఎలుకను పట్టుకొన్న పిల్లిలాగ ప్రవర్తిస్తే చెల్లుతుందా? మీరు శకుని, కర్ణ, దుశ్శాసనులమీద రాజ్యభారం పెట్టుకొని ఉన్నారు. ఇది తుదకునెగ్గదు. ఎందుచేతంటావా? తమను తాము తెలుసుకొనుట, తొందరపడకపోవుట, ఓరిమి కలిగి ఉండుట, పట్టువిడుపు కలిగి ఉండుట ఇవి లేని ప్రభుత్వం ఉంటుందా? ఈ సుగుణాల్లో, మచ్చుకు ఒక్కటైనా, వీరిలో

ఎంత వెదికినా కనిపిస్తుందా? ధర్మరాజు నువ్వే నిజంగా తండ్రివని నమ్మకుని ఓర్మితో ఉన్నాడు. అది నువ్వు ఎరుగుదువు," అన్నాడు, విదురుడు.

"రేపు సంజయుడిచెప్ప కార్యవిధానం యావత్తు విన్నాక మనము ఏదిచేయాలో అది చేయిద్దువుగాని. ఇప్పుడు నామనస్సు తల్లడిల్లిపోతోంది. కొంచెంసేపు ఊరటకలిగేట్లా, హితమైనమాటలు చెపుదూ. నువ్వు ధర్మాధర్మాలు, మంచిచెడ్డలు తెలిసినవాడివి. నా మనోవ్యధ ఉపశమించేట్లాగ నీ వచనామృతం కొంత నామీద చల్లుమా." ధృతరాష్ట్రుడు కోరినాడు.

"కానిపనులకుపోక, పరులసిరికి ఈర్ష్యపడక. అందరూ ఆమోదించే విధాన పలువురతో పొత్తు కలిగి జీవించడం మంచిది. కోపము, అతిశయము, గర్వము, అసంతృప్తి, దురభిమానము, నిర్వ్యాపారత్వము అనేవి దుష్ట లక్షణాలు. ఏలినవానిని, దైవాన్ని, భార్యని, బంధువుల్ని సముచితవిధాన ఆరాధించి సంతోషపెట్టని మూర్ఖుడు, అందని చెట్టు పళ్ళకు ఆశపడేవాడు అవుతాడు. ఉపాయం తెలియని తెలివిహీనులు తమమీద అనురాగం కలవారిని త్రోసిపుచ్చి, తమను త్రోసిపుచ్చేవారివెనుక తిరుగుతు, చివరకు తాము నిరాకరించినట్టివారి ఆధిక్యతను తెలుసుకుని తొట్రుపడతారు. ధనము, విద్య, వంశము, దుర్జనులకు పొగరుబోతుతనాన్ని కలిగిస్తాయి; ఇవే సజ్జనులకు అడకువ వినయము కలిగిస్తాయి. గొప్ప విలుకాని అస్త్రం అరుదుగా గురి తప్పినా తప్పవచ్చు. కాని, నేర్పు కలవాడి బుద్ధిబలం శత్రురాజునీ, రాజ్యాన్నీ చెఱచగలదు. ప్రజ్ఞను అవలంబించి, ధర్మము అధర్మము తెలిసి, ఈషణత్రయమును పురుషార్థములను వశంచేసుకొని, అయిదు ఇంద్రియాలను గెల్చి, అరిషడ్వర్గమును తెలుసుకొని, సప్తవ్యసనములను వదలి వర్తించేవాడు వివేకవంతుడు. మత్తుగొలిపే ఆహారం పుచ్చుకొనుట, అంతా నిద్రపోతూంటే మేలుకొని ఉండుట, కార్యాలోచనముచేయుట, ప్రయాణముచేయుట ఇవేవీ ఒంటరిగా చేయడం తగదు. నడవడి అనే మహా సముద్రాన్ని దాటించగల గొప్ప ఓడ సత్యము. దీనిని మించిన గుణం ఇంకేదీలేదు. క్షమించేవాళ్ళనుచూచి అశక్తులని అవహేళన చేస్తారు. అయినా, క్షమాగుణం గొప్పభూషణం. ఉత్తమమైన సౌందర్యం కోరేవారు ఈ భూషణం ధరిస్తారు. మానవుడు 'ఉత్తముడు' అనిపించుకోడానికి రెండు మార్గాలున్నాయి. మొదటిది, ఎన్నడూ పరుషంగా మాట్లాడకపోవడం; రెండవది, దుర్మార్గపుచేష్టలు చేయకపోవడం. ప్రతీకారం చేయగల సమర్థుడయినప్పటికి సహనం కలవాడు, పేదరికంలో ఉన్నప్పటికి కలిగిన దానిలో కొంచెం దానం చేసేవాడు పుణ్యులని పెద్దలు చెపుతారు. న్యాయార్జితమైన విత్తానికి రెండు విధాలైన ఆపత్తులు రావచ్చు, మొదటిది, అపాత్రులకు ఇవ్వడం; రెండోది పాత్రులకు ఇవ్వకపోవడం. వెలయాలు, జూదము, త్రాగుడు, వేట, పరుషంగా మాట్లాడుట, క్రూరంగా శిక్షించుట, సొమ్ము నిష్ప్రయోజనంగా వమ్ముచేయుట అనే ఏడు వ్యసనాల్లో తగుల్కొకూడదు. తగినవేషం ధరించడం, తనను తాను పొగడుకొనకపోవడం, నొచ్చినా దుర్భాషలాడకపోవడం, ఇచ్చి విచారించకపోవడం, ఎంత కష్టం కలిగినా నీతిమార్గం తప్పకపోవడం నడవడికి ఒప్పు తెస్తాయి. స్నేహము, సంభాషణము, వివాదము, వియ్యము, కయ్యము, వ్యవహారము తమతో సమానమైనవారితో చేయాలిగాని తమకంటె అధికులతోగాని హీనులతోగాని పనికిరాదు. కొంచెమైనా సరే మరొకరితో పంచుకొని తినడంమేలు. కార్యసాధనప్పుడు కష్టాలకు ఓర్చి, కించిత్తైనా సుఖం అనుభవించడం మంచిది. శత్రువయినా సరే యాచిస్తే ఇవ్వడంలోమేలు. సజ్జనుడు తనను లోకం తెగ పొగడుతూంటే విని ఉబ్బడు; కాగా, ఇంకా మంచిపనులు చేస్తూంటాడు. దుష్టత్వాన్ని తన చేరువలోనికి చొరనీయడు. ఇటువంటి మంచి గుణాలన్నీ ధర్మరాజుకు ఉన్నాయి," అంటూ విదురుడు ఆ అవకాశం వినియోగించుకొని పాండవుల్ని ప్రశంసించినాడు. "నువ్వు వారిని పెంచి పెద్దచేసి రక్షించావు. ఇప్పుడు ఉపేక్షించి వారు ఎక్కడో దూరంగా ఉంటే ఊరుకోవచ్చా? తగినభాగంయిచ్చి, వాళ్ళనురప్పించి,

నీకొడుకులతోబాటు చూడుము. మీరూ వారూ ఏకమైతే మీమైపుకు దేవతలు కూడా తేరిచూడలేరు," అన్నాడు.

ధృతరాష్ట్రుడు ఊరక ఊకొడుతున్నాడు. "నా మంచి ఏమిటో, కర్తవ్యం ఏమిటో, నీకు తెలుసు. ధర్మరాజు విధానం ఏమిటో నీకు బాగా విదితం. అందుచేత అన్ని విషయాలు ఆలోచించి, నామనస్సు ఊరటిల్లేట్లా చెప్పు," అన్నాడు, ధృతరాష్ట్రుడు.

"ఓహో! అలాగా! నువ్విలాగ నన్ను నొక్కి నొక్కి అడిగితే ఉన్నది ఉన్నట్లుగా చెప్పుతాను, శ్రద్ధగావిను. రాజ్యం దక్కిందికదా అని, తమ్ముడి భాగం యివ్వకుండా ఎగవేసి అంతా నువ్వే మ్రింగుదామని చూస్తున్నావు. అది ఎలాగ జరుగుతుంది? మాంసపు ముక్క రుచిచూడాలనే దురాశతో గబుక్కున గాలం మ్రింగిన చేపలాగ అయిపోతావు, జాగ్రత్త! మోసగాడైన నీకొడుకు గుండెల్లో గల కోర్కెలు చెల్లుతాయని ఆశించకు," అని విదురుడు నిర్మొహమాటంగా అనేసరికి ధృతరాష్ట్రుడికి నోటమ్మట మాట పెగల్లేదు. కొయ్యబొమ్మలా కూర్చున్నాడు. పరిపరివిధాలైన ఆలోచనలు అతనిని కలవరపర్చినవి. నిద్రహాని ఆతణ్ణి వేధించినది.

"ఇందాకా నువ్వు చెప్పిన మాటలవల్ల మనస్సులోని బాధ కొంత ఉపశమించినది. శాస్త్ర మంచీ చెడ్డా చెప్పుదూ," అన్నాడు, నిట్టూరుస్తూ.

"పండని కసుకాయ కోస్తే రుచి లేకపోవడమే గాక విత్తనం కూడా చెడిపోతుంది. బాగా పండిన పండు అయితే రుచీ ఉంటుంది, విత్తనంచెడదు. కార్యసాధన విధానంకూడా ఇలాగే ఉంటుంది. పూలమాల కట్టే మాలి పువ్వుల్ని కోసేటట్లుగా, తేనెటీగ పువ్వుల్లో తేనె తీసుకొనేటట్లుగా, ఎదటి వారు నొచ్చుకుండా, సున్నితంగా కార్యం నెరవేర్చ గలగడమే గొప్పవిషయం. బొగ్గుగనిలాగ, మొదటి కంటా పొడవకూడదు. పరుల సిరిని, విద్యాసంపదని, తేజాన్ని, బలాన్ని మనస్సులో దుఃఖిస్తూ అసహ్యించుకొనే మానవుడు రోగంలేని మరణబాధ అనుభవిస్తాడు. ఎదటివాళ్ళకు హితమైన ప్రియమైన, మనస్సులకు యింపైన మాటలు ఎన్ని మాట్లాడినా మంచిదే. అలాగ కాకపోతే, అది ఇది అనకుండా నోరుమూసుకొని ఊరుకోవడం మంచిది. మాట పడ్డప్పుడు స్నేహం విరోధంగా మారుతుంది; బుద్ధి చెడుతుంది; ధర్మం పాపగతిని పోతుంది; అనురాగం తులువతనం అవుతుంది. అందుచేత పరుషంగా మాట్లాడకూడదు. కత్తి గొడ్డలితో తెగిన ద్రుమమైనా చిగురుస్తుంది కాని దుర్భాషలవల్ల చెడి తెగిపోయిన కార్యం మాత్రం ఎన్నటికీచక్కబడదు. శరీరంలో నాటిన ములుకులు ఎలాగో కష్టపడి తీయవచ్చుగాని మనస్సులో నాటిన మాటలు మాత్రం తీయడానికి ఏమీ ఉపాయంలేదు. ధర్మరాజు నోటమ్మట ఒక్కనాడైనా ఒక్క పరుషవాక్యమైనా వచ్చిందా? అయ్యయ్యో! నీ కొడుకులు ఒకరిని మించి ఒకరు అనేకవిధాల అనేక ప్రేలాపనలు ప్రేలుతూఉంటే నువ్వు అణుమాత్రమైనా విచారించక వింటూ ఊరుకుంటావు. చెడిపోయే కాలం వచ్చినప్పుడు చెడ్డమాటలు, తప్పుడుత్రోవలు, చెడుపనులు ఎంతో మంచివిగా తోస్తాయి. మంచివి అవినీతివని మనస్సు నిశ్చయిస్తూంటుంది. పాండవులతో విరోధాన్నుండి నీ బుద్ధి మరలకపోవడమే పాపం. అంతే! ఏం చేస్తాము? మన వంశంలో తేజస్సుకు, ధైర్యానికి, ధార్మికత్వానికి ఎన్నదగిన ధర్మరాజును నీ సంపత్తుకు వెలిచేసి అలాగ దూరం చేయడం న్యాయమేనా? అతడు నీ పెద్దతనం చూచి ఓర్పు వహించాడు," అన్నాడు, విదురుడు.

"నువ్వు చెప్పిన నీతివాక్యాలవల్ల నాకు తనివి తీరలేదు. ఇంకా చెప్పు." ధృతరాష్ట్రుడు కోరినాడు.

"అన్నివిధాల పుణ్యకర్మలూ ఒకయెత్తు; న్యాయం తప్పకపోవడం ఒక్కటీ ఒకయెత్తు. దీనిని వేదశాస్త్రాలన్నీ ఎంతో గొప్పగా పొగడుతున్నాయి. న్యాయం పాటిస్తే ఇహలోక సుఖాలు అనుభవించడమే గాక, ఘనకీర్తి కూడా దక్కుతుంది. ఈ లోకంలో ఎంతకాలం పేరు నిలబడి ఉంటుందో అంతకాలం పుణ్యలోకాలు కలుగుతాయి. పూర్వం ప్రహ్లాదుడు, రాక్షసజాతిలో పుట్టినవాడైనా, తన కొడుకు విరోచనుడూ అంగిరసుడనే బ్రాహ్మడి

కొడుకు సుధన్వుడూ తమ తమ ప్రాణాల్నే ఒక ధర్మసందేహం నిమిత్తం పందెంపెట్టి తనను అడిగే సరికి, 'వీడు కొడుకు వాడు క్రొత్తవాడు' అనే భేద బుద్ధిలేకుండా, తాను మధ్యవర్తిగా ఉండి సుధన్వుణ్ణి గెలిపించాడు. తరువాత అతనిని ప్రార్థించి, తన కొడుకు జీవితం దానంగా గ్రహించి, కొడుకును బ్రతికించుకొన్నాడు. అలాగే నువ్వూ. ధర్మం విడ వక, అధర్మపరులైన నీ కొడుకులపట్ల పక్షపాత బుద్ధి విడిచిపెట్టి, న్యాయమైన పనిచెయ్యి. వారూ వీరూ కూడా ఆపత్తులు లేక హాయిగా బ్రతుకుతారు. నీకా అనవసరమైన ఈ ఏడుపు ఉండదు. పాపపు పనులే కర్తవ్యంగా పెట్టుకొని విరివిగా చేస్తోంటే కడకు అవే యింపనిపిస్తాయి. ధర్మమైనపని అధర్మ మైనదిగా మార్పు పొందినా అదికూడా అలాగే యింపనిపిస్తోంది. బుద్ధిమంతులు లేని సభ సభకాదు; ధర్మం వక్కాణించనివాడు బుద్ధిమంతుడు కాడు ; సత్యపూరితం కానిది ధర్మం కాదు; ఏదో నెపంమీద గతితప్పేది సత్యం కాదు. నీతిమార్గాన బ్రతుక గలగడం ఉత్తమం ; శౌర్యం చూపించి సంపదలు పొందడం మధ్యమం; అధికభారంగా నడిచే జీవితం అధమం. నీతి బాహ్యులైనవాళ్ళను ఉత్తములు మెచ్చుకోరు....నీ కొడుకులు ఎప్పుడూ కయ్యానికి కాలుద్రవ్వుతూ ఉంటారు. కర్ణుడు మొదలైన మీ మంత్రులు అంతకుముందే పేచీకి దిగుతారు, నువ్వు నీతిమార్గం త్రొక్కవు. పాండవులు యుద్ధానికి ఇష్ట పడరు. నీతిమార్గాన కార్యం సాధించ పూను కున్నారు. అకారణంగా ఎదురుచెప్పి రెచ్చగొడితే మండుతారు. చివరకు ఆర్పడానికి ఎవరికీ సాధ్య పడదు తమ తండ్రియందు వలెనే నీయందు కూడా భక్తితో ఉండి, సజ్జన పద్ధతిని నడచుకొంటారు. అట్టివారిని నువ్వు నిష్కల్మషమైన బుద్ధితో కన్న కొడుకులులాగా చూచుకోడం మంచిది. ఏకారణం లేకుండా, కేవలం ఉపకార బుద్ధితో, పరుల పనుల నిమిత్తం బాధలు అనుభవించేవారి జీవితమే జీవితం. ఒకరి సహాయంవల్ల పేరు ప్రసిద్ధి పుష్క లంగా సంపదలు పొందిన పిదప అటువంటి దాతకు కడకు కీడు కలిగించిన కృతఘ్నుడి పీనుగునైనా, రోతపడకుండా పీక్కుని తినడానికి కుక్కలుకూడా సిద్ధపడవు. కనుక న్యాయం ఆలోచించకపోవడం హానికరం. పాండురాజు నీకు పరమభక్తుడు. పాండవులు నీకు ప్రఖ్యాతితెచ్చి పెట్టినారు. వారిని ఆద రించు.బ్రతుకుచావు, భూషణదూషణ, దానం ఇచ్చుట, దానం వేడుట ఇలాగ సుఖదుఃఖాలు అప్పుడప్పుడు వస్తూ ఉంటాయి, పోతూ ఉంటాయి. దుఃఖంవల్ల బలం తగ్గుతుంది, రూపం చెడుతుంది, మతి తప్పు తుంది, రోగం వస్తుంది. దుఃఖంతో క్రుంగికృశిస్తూ ఉంటే శత్రువులు సంతోషిస్తారు.అందుచేత ఏడుపు మానేసెయ్యి." అన్నాడు, విదురుడు.

"శుష్కప్రియాలతో మహాత్ముడైన ధర్మరాజును బాధపెట్టాను. దుర్మార్గులైన నా కొడుకులకు యుద్ధంలో చావు తప్పదు. ఏడుపుకాక యింకేమి మిగులుతుంది? ఏంచేయాలో చెపుదూ" అన్నాడు ధృతరాష్ట్రుడు.

"తపస్సు, ఇంద్రియ నిగ్రహము, విద్య శాంతికి కారణాలు. వీటి అన్నిటికంటె మేలైన శాంతికారణం లోభం లేకపోవడమే. జ్ఞాతులకలహం, గోవుల దొంగతనం, బ్రాహ్మణనాశం, స్త్రీలహింస, జరగ నిచ్చేవాడు నశిస్తాడు. జ్ఞాతులంతా ఒకరి అభివృద్ధి ఒకరుకోరుతూ, సంఘీభావంతో కలసి మెలసి, అను రాగంతో వర్తిస్తే, తామరపువ్వులు ఉన్న కొలనులాగ, సిరిసంపత్తులకు ఆటపట్టు కాగలదు. ఒంటరిగా ఉన్న చెట్టును ఏనుగు, గుఱ్ఱం, గాలి మొదలైనవి అతి సులభంగా విరిచేస్తాయి. అలాగకాక, అనేక చెట్లు దట్టంగా గుబురుగా ఉంటే యేబాధా లేకుండా ఉంటాయి. అలాగే అన్నదమ్ములు కలిసి ఉంటే, ఎవరికైనాసరే ఆసాధ్యులవుతారు. అలాగకాక విడి పోతే ప్రతివారికీ లోకువై చెడిపోయి దుఃఖాలపా లవుతారు. కనుక కౌరవులూ పాండవులూ ఒకళ్ళ కొకళ్లు అండగా నిలబడితే ఎదటివారికి అజేయులు కాగలరు. పరులవల్ల బాధలేని రాజ్యం పూజనీయం కాగలదు. వనవాసంలో దుఃఖాలనుభవించిన పాండ వుల్ని తక్షణం పిలిపించి, వారికి అర్హమైనస్థానం యేర్పరచి నిలపడం, నీ కొడుకుల్ని నిలబెట్టుకోవడం

అవుతుంది. ముఖప్రీతిమాటలు చెప్పేవాళ్ళు చాలా మంది ఉంటారు. కాని, అయిష్టమైనా అప్రియమైనా సరేనని యదార్థం చెప్పేవారు లేరు. జూదమప్పుడు నేను అడ్డపడి అయిష్టమైనవని సందేహించక హితవు చెప్పాను. అది నీకు రుచించక, రోగికి పథ్యం వికారం కలిగించినట్లయింది. అయినా యిప్పుడు మళ్ళీ చెబుతా విను. కాకుల్ని కాంక్షించి, నెమళ్ళను విసర్జించినట్లు, పిల్లులకోసం సింహాలను తిరస్కరించినట్లు దుర్యోధనాదులకోసం ధర్మరాజాదులను త్యజించావు. ఈనాడు, అంతా ముంచుకువచ్చేసరికి దారీతెన్నూ తెలియక, తగులడుతున్నట్లు తల్లడిల్లుతున్నావు. వంశంకోసం ఒకణ్ణి విడిచిపుచ్చడం నీతి అని పెద్దలు చెపుతారు. మంచిమాట వినక, దుర్నయపరుడైతే దుర్యోధనుణ్ణయినాసరే మనం వెళ్ళగొట్టేస్తే ఏమవుతుంది? అది అలా ఉండనీ. సంపత్తు సహాయంపైన ఆధారపడి ఉంటుంది; సహాయం సంపదవల్ల లభిస్తుంది. ఇలాగ యివి ఒకదానివల్ల ఒకటి కలుగుతాయి కనుక నీ సంపద పాండవులకు, వారి సహాయం నీకు లభ్యమయ్యేట్లాగ ఒండొరుల కలయిక మేలు. అంతేకాని మనబలం వెలితిచేసుకోవడం మంచిదా? కౌరవవంశోద్ధారకులైన భీష్మ ధర్మరాజులు, పరాక్రమవంతులైన కర్ణార్జునులు, ప్రతాపవంతులైన భీమదుర్యోధనులు, శస్త్రాస్త్ర పారంగతులైన అభిమన్యు లక్ష్మణు లున్నగు కుమారులు, ఆగ్రహానుగ్రహసమర్థులైన ద్రోణద్రుపదాది ఆప్తులు, వారివారిబంధుమిత్రులు యింతమంది ఏకమై నీ అనుజ్ఞప్రకారంచేస్తోంటే, నువ్వు ఎదురులేకుండా, నిరాఘాటంగా ఈ యావత్తుజగత్తును శాసించి నడుపుతూ ఉంటే, నీ వైభవం మహోజ్జ్వలంగా వెల్లుతూంటే ఎంత గొప్పగా ఉంటుందో ఒకసారి ఆలోచించు. ఒకవేళ పాండవులు భీరులై, విరోధం లేకుండా ఊరికే వైదొలగిపోయినా కొద్దికాలంలో నానాచిక్కుల్లోపడి చెడిపోతుంది గాని దుర్యోధనుడివల్ల రాజ్యపాలనసాగగలదా?" అన్నాడు విదురుడు.

"నువ్వు చెప్పినమాటలు నిర్మలమైనవే, నైపుణ్యంగలవే, రాజనీతిమార్గబోధకాలే. అయినా నా కొడుకును వెళ్ళగొట్టలేను. ధర్మోజయతి అనుకుని ఊరుకుంటాను." అన్నాడాతడు "జ్ఞాతులు గుణహీనులైనా విడువరాదని చెప్పుతూ ఉంటే, సద్గుణాలు కలిగి నీ సేవ కోరుతున్న పాండవుల్ని దిగవిడువవచ్చా? వారి జీవనోపాధికోసం కొన్ని అల్పమైన పల్లెటూళ్ళయినా, దుర్యోధనుణ్ణి ఒప్పించి యిప్పిస్తే మంచిదని చూస్తున్నాను వారిని విడిచిపెట్టమని చెప్పానంటే, వెనుకులాట వివాద పశ్చాత్తాపము పుట్టకతప్పదు. దానికిఅప్పుడు ప్రతీకారం లేదు. ఏరోగంవల్లనో, ముసలితనంవల్లనో చావు ఎలాగు తప్పదు. కనుక రాజ్యభాగాలకొరకు యుద్ధంచేసిగాని చావకూడదనా? ఏనుగులు, గుర్రాలు మున్నగుగొప్ప సంపదలు, కాంతలతో విహారాలు, ప్రజానురాగంగన్న పరిపాలన, యుద్ధాల్లో విజయం, పేరు ప్రసిద్ధి విభవము గల రాజాధిరాజులంతా చావక నిల్చారా? నామాట వినగలిగితే యిహపరాల్లో సిరి, విభవం, కీర్తి అన్నీ దక్కటం తథ్యం. నీలోనువ్వు దాగాఆలోచించుకో, ధర్మరాజును దిగవిడువకు. పొత్తుకుదిరే విధానం నీకొడుకులకూ మంత్రులకూ స్థిరనిశ్చయంతోచెప్పి నడిపించు." అని విదురుడు బోధించినాడు.

"తమ్ముడూ! నీమాటలు వింటూంటే విచారం మటుమాయమైంది. బుద్ధి తెలివివొందింది. అలాగే చేస్తాను. ఇదే కర్తవ్యం. ధర్మం. యశం. లాభం." అన్నాడు, ధృతరాష్ట్రుడు. ఆనందం. ఆపసమ్మరం ఒక్కసారిగా విదురుడి మనస్సును కల్లోలపెట్టాయి.

"అబ్బ! ఎంతసేపటికి నీమనస్సు ఒక నిశ్చయానికి రాగలిగింది. అన్నయ్యా! మళ్ళీ, దుర్యోధనుణ్ణి చూచేసరికి నీదృఢనిశ్చయం ఊగులాడి అతడు వ్రాలినవైపుకు వ్రాలకపోతే, అహో! మేమంతా ఎంత సంతోషిస్తామో!" అన్నాడు, నిట్టూరుస్తూ. "నేను అలాగచేయను, ఇలాగచేస్తాను అని నిష్కర్షగా చెప్పడం దైవానికి చెల్లుతుంది గాని మానవుడి వశమా? పౌరుషంకంటె దైవమే ఎక్కువ అన్నయ్యా!" అన్నాడు, విదురుడు. "ధర్మపదం, నీతిమార్గం చక్కని మాటల్లో నాకు తెలియజెప్పావు." ధృతరాష్ట్రుడు విదురుణ్ణి మెచ్చుకొన్నాడు. ★

# అదృష్ట మనునది ఉన్నదా లేదా ?

శ్రీ వారణాశి సుబ్రహ్మణ్యశాస్త్రి

'ప్రత్యాత్మనియమాద్భుక్తే రస్తిహేతు రలౌకికః'
(కుసుమాంజలి)

లోకములో ఆత డదృష్టవంతుడని, అది వాని అదృష్టమని వ్యవహారము సుప్రసిద్ధమై యున్నది.

ఆ లోకప్రసిద్ధి 'నహ్యమూలా ప్రసిద్ధిః' అను న్యాయమున మూలము లేకుండ సంభవింపదు. కాబట్టి ఆ మూలమేదియో పరిశీలింతము—

లోకులు విషయోపభోగములకై లౌకిక (లోక విదిత) కారణముల నాశ్రయించి బహుధా ప్రయత్నించుచుండుట కార్యసిద్ధి కారణాధీనమని గుర్తించియే కదా.

ఆ లౌకిక కారణములను సమకూర్చుకొనకుండ ఎవ్వడును కార్యసిద్ధికి ప్రయత్నింపడు.

ఇట్టి స్థితిలో యావచ్ఛక్తి ప్రయత్నించి ఎంత సమర్థుడును కార్యవైఫల్యమును పొందుచునే యున్నాడు. ఏమి కారణము ? కార్యవైకల్యమునకు కారణవైకల్యమే మూల మనవలెను. ఆ కారణములు లౌకికములే అయి అవన్నియు కూర్చబడి యున్నపుడు కార్యవైకల్యమునకు అవకాశ మేది ? అందుచేత ఆ కార్యహాని లౌకికకారణ వైకల్యముచే గాక అలౌకిక (అదృష్ట) కారణ వైకల్యముచే కలిగిన దనక తప్పదు. కనుకనే అట్టి సమయములలో అదృష్టము లేదని దురదృష్టమని లోక మనుకొనుచుండెను.

ఆ అదృష్టమునకు పుణ్యమని దురదృష్టమునకు పాపమని నామాంతరము. లోకుల కది దృష్టము కాకుండుటచేత అదృష్టమనబడుచున్నది ఆ అదృష్ట దురదృష్టములు ప్రజలాచరించు ధర్మాధర్మములను బట్టి యేర్పడుచు వారివారికి కార్యసిద్ధినో కార్యహానినో కలిగించుచుండును. మరియు "కాలేశ్వరా దృష్టాదీనాం కార్యమాత్రం ప్రతికారణత్వమ్" అను సిద్ధాంతమును బట్టి విచిత్రమైన ఈ సృష్టికి విచిత్రమైన వారివారి అదృష్ట విశేషమే కారణమయి యున్నది. ఉత్పత్తిసిద్ధములైన అంగ వైకల్య అంగ సౌష్ఠవములేమి, సురూప కురూపములేమి, మూఢత్వ బుద్ధిమత్త్వములేమి. సుఖదుఃఖ ప్రభేదములేమి. అల్పాయుష్య దీర్ఘాయుష్యములేమి. ఆరోగ్యానారోగ్యములేమి, ఇట్టి భేదములన్నిటికిని వారివారి అదృష్ట భేదమే కారణమనుటకంటె గత్యంతర మేమున్నది?

లోకములో పరిజ్ఞానము కలిగి దూరదృష్టితో వ్యవహరించు మహాపురుషులు బహు ప్రయాసకరములును సద్యఃఫలరహితములును అగు యాగ-దాన-హోమ-జప-తపో-బ్రహ్మచర్యాదులను అతిశ్రద్ధతో ఆచరించుచున్నారు. అవి నిష్ఫలములైనచో బుద్ధిమంతులగు అట్టి మహాపురుషులు వాని నాచరింపరు. వాని ఆచరణకు వర్తమాన స్థితిలో తగిన ఫలమా కనబడదు. కనుక ఆ మహాపురుషులు జన్మాంతర-లోకాంతర ఫలాపేక్షులై అట్టి ఫలమీయగల అదృష్టము నార్జింపదలచియే ఆ కార్యములందు శ్రమకోర్చి ప్రవర్తించుచున్నారనకతప్పదు. లోకములో ఎవని సుఖదుఃఖానుభవము వానిదే అగుచున్నది కాని ఒకనిది మరియొకనికి సంక్రమించుట లేదు. అందుచే ప్రతివ్యక్తికిని అదృష్టము భిన్నభిన్నముగా నుండి తదనుగుణములైన సుఖదుఃఖములను కలిగించుచున్నదనక తప్పదు.

మరియు నక్షత్రగ్రహ చక్రముయొక్క గతి భిన్నభిన్నముగా కనబడుచున్నది. ఆ గతి విశేషమును బట్టి లోకమునకు శుభాశుభఫల మేర్పడుచున్నది.

అట్టి ఫలము సుభిక్షదుర్భిక్షాదిరూపన సర్వజన సాధారణముగను, లాభ నష్ట-సుఖదుఃఖాదిరూప

మున తత్తద్వ్యక్తిగతముగనుకూడ ప్రత్యక్షమగుచున్నది.

లోకమున కిట్టి ఫలప్రాప్తిని గనబరచు ఆ గ్రహ చక్రముయొక్క ఋజు వక్రాదిగతులు అట్టి ఫలమనుభవింపవలసియున్న లోకుల అదృష్ట విశేషమూలకముగా కలుగుచున్నవనక తప్పదు.

లోకులకు ఆ అదృష్టభేదము వారివారి శుభాశుభ కర్మమూలకముగా ఏర్పడుచుండును. పురాకృత శుభాశుభకర్మమూలమున ఆ నక్షత్ర గ్రహ చక్రము అహర్నిశములు భ్రమణము చేయుచు లోకమునకు గలుగు శుభాశుభఫలములను ప్రకటించుచున్నదను విషయమిట్లు చెప్పబడినది.

'నక్షత్ర గ్రహపంజర
మహర్నిశం లోకకర్మవిక్షిప్తమ్
భ్రమతి శుభాశుభమఖిలం
ప్రకాశయ త్పూర్వజన్మకృతమ్.'

ఇట్లు పరిశీలింపగా లోకులకు గలుగు సుఖదుఃఖాద్యనుభవమునకు వారివారి అదృష్టమే కారణమై యున్నదని అందుచే ఆతడదృష్టవంతుడని యితడు దురదృష్టవంతుడని సర్వజనసాధారణముగా నున్న వ్యవహారము ప్రమాణసిద్ధమే అని తేలినది.

అట్టి అదృష్టము ప్రజలుచేయు శుభాశుభ కర్మలను బట్టి ఏర్పడుచుండుననియు తేలినది.

సుఖపడదలచిన ప్రజలు శుభకర్మలనే ఆచరింపవలె ననియు అశుభ కర్మాచరణమున దురదృష్ట మేర్పడుచు దుఃఖమును ప్రాప్తింపజేయుననియును తేలినది.

ఇక అదృష్ట దురదృష్టములను కలిగించు ఆ శుభా శుభకర్మ లేవి? అవి మన బుద్ధికి తోచినవా? కావు. ఏమనగా, మనుజులకు దుష్కర్మలను చేయుటకు మాత్రమే శక్తియున్నది కాని వాని దుష్టఫలితములను పరిహరించుకొన గల శక్తిలేదు. చేసిన కర్మకు ఫలమునిచ్చువాడు భగవంతుడే. ఆ భగవంతునిచే నిర్దిష్టములైనవే శుభాశుభ కర్మలు. అవి శాస్త్రోక్తములై యున్నవి. ఈ విషయమును భగవద్గీతయే చాటుచున్నది—

"యశ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః
నససిద్ధి మవాప్నోతి నసుఖం నపరాం గతిమ్"
"తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్యవ్యవస్థితౌ"



# మాధ్యమిక శూన్యవాద సమీక్ష

పండిత శ్రీ గోపదేవ్

మాధ్యమిక శూన్యవాదము బౌద్ధ దర్శనముల వికాసఫలిత మనదగియున్నది. ఈ వాదము రెండు వేల సంవత్సరములకు పూర్వమే రూపొందినది. అఖండ తాపస జీవితము, భౌతిక విలాసమయ జీవితము, నీ రెంటికి మధ్యమముగానుండు నొక మార్గము తథాగతు డనుసరించి యుండెను. తత్త్వ వివేచనమున బుద్ధు డత్యంత శాశ్వత వాదమును గానీ యత్యంతోచ్ఛేద వాదమునుగానీ యంగీకరింపక మధ్యమ మతమును గ్రహించియుండెను. అందువలన నీ తత్త్వము మాధ్యమికమనియును, శూన్యము పరమార్థముగా నంగీకరించుటచే శూన్యవాదమనియును చెప్పబడుచున్నది.

ఈ వాదమునకు దార్శనిక స్వరూపము నొసంగినవాడు ఆర్య నాగార్జునుడు. ఇతడు క్రీస్తుశకము రెండవ శతాబ్దము (క్రీ. శ. 166_196) వాడైన గౌతమీ పుత్రుడు యజ్ఞశ్రీ (ఆంధ్రరాజుకు) సమకాలికుడందురు.

ఆచార్య నాగార్జునుడు శూన్యవాద ప్రతిష్ఠాపకుడు. ఆర్యదేవాదు లితని యనుచరులు,

ఈ శూన్యవాదుల దృష్టిలో మానవుడు శూన్యవాదము నంగీకరింపనినాడు సాంసారిక దుఃఖముల నుండి విముక్తి నొందజాలడు. ఆత్మ, శరీరము, పుత్ర మిత్రులు, ధన ధాన్యాదులు నన్నియు సత్ పదార్థములని యంగీకరించువారికి వానియందు రాగాదు లేర్పడును. విరోధులయెడ ద్వేషాదులు కలుగును. ఈ రాగద్వేషముల మూలమున మానవులు శుభా శుభ కర్మల నొనర్చి జన్మ మరణ రూపచక్రమున చిక్కుకొని క్రింద మీదగుచుందురు. కావున శూన్యవాదము నంగీకరించు వారి కీ యిక్కట్టులుండవు. వారు రాగ ద్వేషములకు గురికారు. అందువలన ద్వేషరాగ మూలకములగు శుభాశుభ కర్మల నాచరింపరు. కాబట్టి జన్మ మరణములలో జిక్కువడరు. ఇంతేకాక, ప్రపంచసత్తా నంగీకరించువారు రాగాదులతో నాత్మకు స్వాభావిక సంబంధము నంగీకరింప వలసినవా రగుదురు.

స్వాభావిక సంబంధము విడువరానిదగును. కావున నాత్మరాగాదులనుండి విముక్తియు కాజాలదు. కాని, శూన్యవాదుల దృష్టిలో నాత్మ కానీ, రాగాదులు కానీ సద్వస్తువులుగావు. అవి యసత్తులు. అందువలననే వానిలో పరస్పర సంబంధము నుండజాలదు.

రాగాదులు శూన్యములనుట యుక్తిసిద్ధము. రాగాదు లేపదార్థములనుండి యుత్పన్నములగునని చెప్ప బడునో బాగుగ విచారించి చూచిన ఆ వస్తువులు రాగాదులకు కారణరూపమున సిద్ధము కాజాలవు. ఒక వస్తువుమీద నొకనికి రాగమున్న దానిపై మరి యొకనికి ద్వేషముండును ; మూడవవ్యక్తికి దానిపై మోహము కలుగుటయు చూడనగును. రాగము కలిగించుట వస్తుస్వభావమగునెడల నావస్తువు ఒకనికి ద్వేషము, నింకొకనికి మోహము కలిగింపరాదు. కాని, యొకే వస్తువు విషయమున విరుద్ధబుద్ధు లొకే కాలమున గలుగుట చూచుచున్నాము. కావున వస్తువునకు సత్తాలేదు. మనుష్యుడు కల్పనద్వారా వస్తువును రాగాదులకు కారణము చేయుచున్నాడు. కల్పింపక రాగాదు లేర్పడవు. అందువలన రాగాదులకు వాస్తవికమయిన యునికిలేదు.

లోకమున స్త్రీపురుషులలో పరస్పరానురాగము చూడబడుచున్నది. కాని, యంతమాత్రమున రాగాదులు సత్యములని యెంచరాదు. స్త్రీ పురుషులు స్వస్వభావమువలన పరస్పర బంధమునకు కారణులగు నెడల వారెన్నడు బంధనవిముక్తులు కాజాలరు.

కారణ మేమన స్వభావమెన్నడు విడువబడదు. కాని లోకమున స్త్రీపురుషుల పరస్పర సంబంధము విడివడుటయు చూచుచున్నాము. అందువలన రాగము బంధమునకు కారణముకాదు. కావుననే స్త్రీ పురుషులును, రాగము మున్నగు సమస్త పదార్థములును స్వభావశూన్యములని యెంచవలయును.

బుద్ధభగవానుడు శూన్యతను ప్రతిష్ఠించుటకొఱకే సమస్త ధర్మములు, పదార్థములన్నియు ననిత్యములనెను. ప్రపంచమునగల భూతములు, భౌతికములు, జ్ఞానము, జ్ఞానముద్వారమున ఉత్పన్నములగు వస్తువులు (చిత్త-చైత్త రూపములు) నన్నియు సమూహరూపమున నుత్పన్నములైనవేకాని యవయవిరూపమున నొక్కటియు ప్రకటముకాదు. ఈ సమూహములును కార్యకారణభావముపై నాశ్రితములై యుండును. కార్యము కారణములవలన నుత్పన్నమగును. అది యనిత్యమగును. అనిత్య మనత్యమగును - సద్వస్తువుకాదు. ఇట్లుపదేశించు బుద్ధుడే తథాగతుడు - యథార్థబోధసంపన్నుడగును. అనిత్య శబ్ద మసారము, నవస్తువునగుదానికి వాచకము.

ఆచార్యుడగు నార్యదేవుడు చతుఃశతకమున-

"సర్వం కార్యార్థముత్పన్నం తేన నిత్యం న విద్యతే" యని నుడివియున్నాడు. (చతుఃశతకము ౯. పరిచ్ఛేదం.)

ఈ వాదమునకు విరుద్ధముగా నైయాయికులు ఉత్పన్నమగు కార్యవస్తు వనిత్యమందురు. ఘటపటము లుత్పన్నములగును. అవి యనిత్యములు అవి నశించును. ఉత్పత్తివినాశములులేనివి అనిత్యములనబడవు. ఆకాశము, కాలము, పృథివ్యాదుల పరమాణువులు. నుత్పత్తివినాశములు లేనివి. అందువలన నవి నిత్యములు.

కాని యీ మతము శూన్యవాదులకు యుక్తమని పింపదు. వారిదృష్టిలో లోకమున జూడనగు సుఖదుఃఖాదులన్నియు స్వస్వకారణములవలన నుత్పన్నము లగును. పదార్థములన్నియు ప్రతీత్య సముత్పన్నములు. (అవి వానివాని కారణముల కలయికవలన నుత్పన్నములగును.) ప్రత్యయముల పరస్పర మేళనమువలన నేర్పడునవి. ఇట్లు కారణముల కలయికవలన నేర్పడని వస్తువుల కునికియే లేదు. వంధ్యాపుత్రుడు, ఆకాశకుసుమము మున్నగునవన్నియు నిట్టి కల్పితవస్తువులే యగుచున్నవి కారణముల వలన నేర్పడని యాకాశము, పరమాణువులు మున్నగునవన్నియు నిట్లే కల్పితవస్తువులే కాని వాస్తవికములు కావు.

నైయాయికు లిందుకు సమాధానముగా నిట్లందురు: సుఖ దుఃఖాదులు ప్రతీత్యసముత్పన్నములే. అనిత్యములే. కాని, వానికి సమవాయి కారణము ఆత్మ అసద్వస్తు వగు శశశృంగమువంటి వస్తువు కారణము కాగలదు. అందువలన నాత్మ అసత్తు కాదు. అది సత్పదార్థము. అయినను ఆత్మకు వేరొక కారణములేదు. అందువలన నది నిత్యము. ఉనికిగలదై కారణములేనిది నిత్యముగును ఆత్మ సదృశములగు నితర పదార్థములు నిట్లే నిత్యములగును.

శూన్యవాదు లియ్యది దోషయుక్తమని చెప్పుదురు. కారణములేని వస్తువుండదు. కారణము గలిగిన వస్తువు నిత్యముకాదు, కావున ఆకాశాదులు కల్పితములేకాని వాస్తవికములు కావు.

'నైయాయికు లిందులకు ఘటపటములు, సుఖాదులు నన్నియు ఉత్పన్నము లగుచున్నవి, అందువలన నవి యనిత్యములు, దీనింబట్టియే యుత్పన్నము కాని వస్తువులు నిత్యములని సిద్ధమగుచున్నది' అని యందురు.

'ఉత్పత్తిగల వస్తువు లనిత్యములగుట చూచి, యుత్పన్నములు కానివి కొన్ని యున్నవియనియు, నవి నిత్యములనియు నెంచుట యుక్తముకాదు అట్టివి కల్పితములయిన అసద్వస్తువులేయగును. కాని, నైయాయికులు ఆకారమును దృష్టాంతముగా నిడుకొని ఆత్మాదులను నిత్యములని నిరూపింతురు. వాస్తవమున నాకాశమను నొక నిత్య వస్తువేలేదు. జనులు రూపాభావమునే యాకాశమందురు. రూపము లేని తావున రూపముగలవస్తువు లుత్పన్నములగును. కావున రూపాంతరభావ మాకాశమనబడును. రూపాంతరము లేనపుడు భావములు ప్రకాశితములగు

చుండును. అందువలన రూపాభావమే ఆకాశమన బడు చున్నది. (కాశంతే భావా అస్య ఆన్తః ఇతి ఆకాశః) నామకరణము చేసినంత మాత్రమున నొక వస్తువు సత్యము కాజాలదు. లౌకికులగు మానవులు కూడ ఆకాశమును నొక వస్తువుగా నెంచరు పృథివి జలము, మున్నగు వస్తువులు చక్షురాదులచే గ్రహింప బడును. 'ఇంద్రియములకు గోచరముగాని స్వరూపము గల వస్తువొకటి నామమాత్ర కల్పన వలన సిద్ధింప నేరదు.' అని శూన్యవాదు లందురు. దీనికి సమాధానముగా 'ఆకాశము విభుపదార్థము. విభుపదార్థములు నిత్యములు. అనిత్యములగు భావవస్తువులు వ్యాపకములుకావు. ఘటపటము లనిత్యములు. అవ్యాపకములును' అని నైయాయికులందురు. కాని, శూన్యవాదములను ఉత్పన్నముకాని వస్తువు అసత్తగును. దానికి ఉనికి యుండదు. అట్టిది వ్యాపకముకాని, పరిచ్ఛిన్నము కానేరదు. మరియొక వస్తువున కాధారమును కాదు. ఇంతేకాక యాకాశము వ్యాపకము కాదనుట కింకొక కారణమున్నది. ఆకాశము ప్రదేశములు కలది (ప్రదేశి) గ చెప్పబడుచున్నది. ఆకాశావయవములే దాని ప్రదేశములు. ఆకాశముయొక్క యొక ప్రదేశము దూరముననుండు మరియొక ప్రదేశముతో సంయోగము కలిగియున్న పక్షమున నొక ప్రదేశముతో సంబంధము కలిగియున్న ఘటాదులు కూడ సమస్త స్థానములందును కనబడవలెను. కాని ఘటాదులున్న స్థానముననే కనబడుచు అన్య స్థానములందు కనిపింపవు. అంతేకాక ప్రదేశము సమస్త స్థానములందు నున్న పక్షమున వ్యాపకమగుటవలన పై ప్రదేశము కలదాని (ప్రదేశి) వలె ప్రదేశముండదు. ప్రదేశములేనినాడు ప్రదేశియు నుండదు. ఈ దోషమునుండి తప్పించుకొనుటకు సమస్త ప్రదేశిని వ్యాప్తముచేయు ప్రదేశ సత్తా నంగీకరింపని పక్షమున పరిచ్ఛిన్న ప్రదేశము నంగీకరింప వలసి వచ్చును. ఒక పరిచ్ఛిన్న ప్రదేశము నంగీకరించిన నన్య ప్రదేశములను నంగీకరింపక తప్పదు. అప్పుడాకాశము విభువు కాజాలదు. అనేక ప్రదేశములు (అవయవములు) కలది విభువు కాజాలదని భావము. ఘటపటాదులు అనేక ప్రదేశములు గలిగి యుండుటవలననే యవి విభువులుకావు.

మరియు ప్రదేశములకంటె భిన్నముగా ప్రదేశియు నుపలబ్ధముకాదు. అందువలన నాకాశసత్తయే సిద్ధింపదు. ఇక దాని విభుత్వమెట్లు సిద్ధింపగలదు? కాగా నిత్యత్వ మసలే లేదని తెలుచున్నది.

నై : సమాధానము—

శ్రీ ఆర్యదేవాదులు పదార్థము లనిత్యములగుట వలన నవి శూన్యములనుచున్నారు. కాని, అనిత్యము, శూన్యము ననునవి రెండు భిన్నపదార్థములు. అవి యొక్కటికాదు. ఉత్పన్నమై నశించునవి యనిత్యము లనబడును. ఉత్పన్నముకాక, నశింపక మరియు నెన్నడు నునికి (సత్తా) లేనివి శూన్యములనబడును. అనిత్యము లయినవి కొంత కాల మునికి (సత్తా) గలిగి యుండును. ఈ యునికినే శూన్యవాదులు వ్యావహారికసత్త యందురు. అందువలన నవి శూన్యములుకావు. ఘటపటాదులు శూన్యములగు నెడల నవి జ్ఞానేంద్రియగోచరములు - అనుభవ విషయములు కాజాలవు. స్వప్నప్రతీతములగు భవనాది పదార్థములు శూన్యములనుటయు నుచితముకాదు.

ఇట్లే నిత్యపదార్థములను నిషేధించుటయు యుక్తమనిపింపదు. ఉత్పత్తి వినాశములులేని పదార్థములన్నియు శూన్యములు కావు. ప్రమాణములలో కొన్నింటి ద్వారమున వస్తువుల యునికి సిద్ధమై వాని యుత్పత్తి వినాశములు లభింపనిపక్షమున నవి యసత్తులు శూన్యము లనజనదు. అవి కారణజన్యములు కాకున్నను ప్రమాణసిద్ధము లగుచున్నవి. ఆకాశ మిట్టిపదార్థమే. శబ్దము గుణము. దాని కాధారముగా నొక ద్రవ్యముండుట యనివార్యము. గుణము లాధారములేక యుండనేరవు.

పృథివ్యాదులు శబ్దము నుత్పన్నముచేయుచున్నట్లు కానిపింపవు. కావున పృథివ్యాదులకంటె భిన్నమగు ద్రవ్యమొండు శబ్దమున కాధారము కావలసియున్నది. శబ్ద మన్నియెడల నుత్పన్నమగుట జూచుచున్నాము. అందువలన దాని కాధారమగు నాకాశముకూడ నన్ని

యెడల నుండనగును. కావుననే యది వ్యాపకము, నిత్యము నగుచున్నది.

ఆకాశము ప్రదేశములు కలదియై, దాని యొక ప్రదేశము మరియొక ప్రదేశములతో సంబంధము కలిగియున్నను లేకున్నను రెండు దశలలో దోషము వాటిల్లునని మాధ్యమికులనుచున్నారు; కాని వాస్తవమున నాకాశము ప్రదేశములు కలది-ప్రదేశి కాదు. వ్యాపకమగుటకు ప్రదేశములు కలిగియుండుట యావశ్యకముకాదు. ప్రదేశములున్న వ్యాపకవస్తువు స్వరూపము సిద్ధింపదు. సమస్త స్థానములందును శబ్ద ముపలబ్ధమగుట వలన నాకాశ మన్నియెడల నున్నట్లు సిద్ధమగుచున్నది. కాని దాని ప్రదేశము లన్నియెడల నుండుటవలన కాదు. కావున మాధ్యమకు లెన్ని వికల్పము లుద్భావించియు సత్తును సత్తుగా రూపింపజాలరు. ఆకాశము ప్రదేశమంత మనుట యౌపచారికము. పృథివ్యాదులతో నాకసమునకు సంబంధమున్నది. పృథివ్యాదులు ప్రదేశవంతములగు ద్రవ్యములు. వానితో సంబంధ మున్నంత మాత్రమున నాకాశ మవయవములు కలది కానేరదు. పృథివ్యాదులయు, ఆకాశముయొక్కయు స్థితి వానిలో సంబంధములేక యుండజాలదు. ఆకాశము వ్యాపకమగుటవలన దానితో నన్యద్రవ్యములకు సంబంధ ముండుట యనివార్యము. వ్యాపక పదార్థములతో నితరములకు సంబంధముండును. అది సంయోగము కావచ్చు లేక మరియొక నామముతో వానిని పేర్కొనవచ్చు. సంబంధము తప్పక యుండును. సంబంధ మేర్పడుటకు సంబద్ధ వస్తువులు రెండును తప్పక సర్వవిధముల సమానములగుట యావశ్యకముకాదు. అగ్నికి జలముతో సంబంధమున్నది. కాని యవి రెండును సర్వవిధముల సమానములా ? కాదు. అట్లే ప్రదేశహీనమైన ఆకాశంతో ప్రదేశవంతములగునగ్ని జలాదులకు సంబంధమేర్పడుటలో నాశ్చర్యమేమి? అన్యద్రవ్యములకు నవయవములుండుటవలన వానిలో పరస్పరసంయోగ మేర్పడుచున్నది. కాని యవయవ రహితమైన ఆకాశముతో సంయోగసంబంధ మేర్పడజాలదందురేని సంయోగముకాక మరియొక విలక్షణసంబంధ మేర్పడునని యంగీకరింపుడు. సంబంధ మేదోయొకటి యుండకతప్పదు.

ఇట్లు వ్యాపకము, నిత్యమునగు నాకాశముసిద్ధించిన మీదట నన్య నిత్యపదార్థములును సిద్ధించును. పృథివ్యాదులకంటె విలక్షణులగు ద్రవ్యముల నంగీకరింపక తప్పదని భావము. బౌద్ధమతాచార్యులలో గూడ కొందరు 'అహేతుక పదార్థములు సర్వవిధముల సత్తులో లేక యసత్తులో యగును' అని నుడివియున్నారు.

"నిత్యం సత్వ మసత్వం వాఽహేతోరన్యా నపేక్షణాత్" అహేతుకములగు పదార్థములు కొన్ని యసత్తులగుటజూచి యహేతుకములన్నియు నసత్పదార్థములనుట యుక్తముకాదు.

వంధ్యాపుత్రుడు, ఆకాశకుసుమము మున్నగునవి యహేతుకము లయినందున నవి యసత్వ పదార్థములనబడవు; కాని యే ప్రమాణమువలనను వాని యునికి నిరూపింపబడనందున నవి యసత్పదార్థములనబడుచున్నవి. కాబట్టి రూపాభావ మాకాశమనుట సరికాదు. అది శబ్దమున కాధారమగు ద్రవ్యమైయున్నది.

నిత్య పదార్థముల యునికియే కాక యనిత్య పదార్థముల యునికియు కల్పితమేయని శూన్యవాదులలో ననేకులు నిరూపించియున్నారు. వారి యుక్తులను కొన్నిటి నిట విచారించుట యుచితముగా దోచుచున్నది.

శూన్యవాదులలో విగ్రహవ్యావర్తనిగ్రంథరచయితయగు నాగార్జునుడు ప్రసిద్ధ విద్వాంసుడు. అతడు 'పదార్థములు సత్యము'లని యంగీకరించు వారిని గురించి 'వారు లక్షణప్రమాణముల ద్వారమున వస్తుసిద్ధిని సాధింతురు; కాని వస్తువులలో లక్ష్యలక్షణభావము కానీ, ప్రమాణ ప్రమేయభావము కానీ ఉపపన్నముకాదు' అని నుడివియున్నాడు. ఇందు లక్ష్యలక్షణభావమెట్లు ఉపపన్నము కాదో ముందుగా నిట విచారించి చూతము.

ఆచార్య నాగార్జునుడు సత్పదార్థవాదుల నిట్లు ప్రశ్నించును. 'లక్ష్యము లక్షణముకంటె భిన్నమా ? అభిన్నమా ? లక్ష్యముకంటె లక్షణము భిన్నమగు

నెడల నది లక్ష్యమునకు లక్షణము కాజాలదు. లక్షణ రూపమున నుండని పదార్థములు లక్షణములుకావు. అవి యలక్షణములై లక్ష్యముకంటె భిన్నములగును. లక్షణములగు పదార్థములుకూడ లక్ష్యముకంటె భిన్నములయిన పక్షమున నవికూడ నలక్షణములతో సమానముగ లక్షణ రూపములు కాకయుండవలెను. ఇట్లే లక్ష్యముకూడ లక్షణముకంటె భిన్నమగుటయు బొసగదు. అలక్ష్య పదార్థములు లక్షణములకంటె భిన్నములగును. లక్ష్యములుకూడ నలక్ష్యములతో సమానముగ లక్షణములకంటె భిన్నములగుటవలన నలక్ష్యములు కావలసియుండును, ఒకవేళ లక్ష్యము లక్షణముకంటె నభిన్నమందుమేని, లక్ష్యము లక్షణము లేనిదని యంగీకరింపవలసివచ్చును. లక్షణ రహితమగునది యాకాశ కుసుమమువలె నసత్పదార్థమగును. ఈవిధముగ లక్ష్యము శూన్యమని యంగీకరింపక తప్పదు. లక్ష్యము లక్షణాభిన్నమగు నెడల లక్ష్యస్వరూపముకూడ నుండజాలదు. లక్షణ స్వరూపము లక్షణాభిన్నమే యగును. లక్ష్యము లక్షణముకంటె భిన్నముకాని పక్షమున లక్ష్యమునకు స్వస్వరూపముండ నేరదు. అప్పుడది లక్షణరూపమే యగును. ఇట్లే లక్షణముకూడ లక్ష్యరూపమై తన (లక్షణ) రూపమున నుండజాలదు.' అను నీ యభిప్రాయమునే నాగార్జునాచార్యులు మాధ్యమిక కారికలో నిట్లు నుడివియున్నాడు.

"లక్ష్యాల్లక్షణ మన్యచ్చేతస్యాత్తల్లక్ష్య మలక్షణమ్
తయోరభావాన్యత్వేతు విస్పష్టం కథితంత్వయా"
మా.వృత్తి. పు 17.

ఇట్లే కారణభావమును గూడ శూన్యవాదులు ఖండించియున్నారు.

'కార్యము కారణములవలన నుత్పన్న'మగునేని: ఆకార్యము ప్రథమమున (సత్తా, లేక అసత్తా?) నుండెనా? లేదా? ఉన్నదందురేని మరల పుట్టుట వ్యర్థము. లేదందురేని అది యెన్నడు పుట్టజాలదు, ఇసుకలోలేని దుగ్ధమెంత యత్నించినను జనింప జాలదుగదా? ఇట్లు లక్ష్యలక్షణభావములను, కార్య కారణభావమును ఖండించు నీ యుక్తులను బాగుగ పరిశీలించి చూచిన నవి యసారములని సిద్ధములగును ప్రథమమున లక్ష్యలక్షణభావమును తిరస్కరించు యుక్తులనుగూర్చి యాలోచింతము. లక్ష్యలక్షణములు రెండును పరస్పరము భిన్నములగుట తథ్యము. లక్ష్యం కంటె లక్షణము భిన్నమనినంతమాత్రమున లక్షణమా లక్షణముకాదు. అట్లే లక్షణముకంటె లక్ష్యము భిన్నమనినది యలక్ష్యమును కాదు, లక్ష్యముకంటె భిన్నములైన కొన్ని పదార్థములు లక్షణములు కాని మాట వాస్తవమే. కాని, లక్ష్యముకంటె భిన్నములగు పదార్థము లన్నియు నలక్షణములుకావు. లక్షణము లక్ష్యముకంటె భిన్నమై తన స్వరూపము గలిగి యుండును. అదియలక్ష్యములకంటెను భిన్నమగును. అట్లే లక్ష్యములకంటెను భిన్నమగును. లక్ష్యము, అలక్ష్యమునని రెండే పదార్థములు కావు; లక్షణమను పేరుగల మరియొక పదార్థముకూడగలదు. గోవుకంటె నశ్వము భిన్నమే. కాని, గోవుకంటె భిన్నములయిన వన్నియు అశ్వములుకావు. ఒంటెకూడ గోవుకంటె భిన్నమేకదా! గోవుకంటె భిన్నమైనందున నదియు గుఱ్ఱమే యనుట యుక్తముకాజాలదు. లక్షణముకూడ లక్ష్యముకంటె భిన్నమగుటయేకాక యలక్షణముల కంటెను భిన్నమగుచున్నది. గోవుకంటెను, ఆగోవగు గుఱ్ఱముకంటెను ఒంటె భిన్నమైనట్లు లక్షణముకూడ లక్ష్యము, అలక్ష్యము నను రెంటి కంటెను భిన్నమే యగుచున్నది. అలక్షణము, లక్ష్యమునను నీ రెండును లక్షణముకంటె భిన్నము లగు నంశమున సమానములే; కాని యా రెంటి యందును భేదముకూడ నున్నది. అలక్షణమునకు లక్ష్యముతో సంబంధముండదు: కాని, లక్షణమునకు లక్ష్యముతో సంబంధముండును. ఇట్లే లక్ష్యవిషయక దోషమునుగూడ పరిహరింపనగును.

కార్యకారణ భావవిషయమున జూపిన ఆక్షేపము కూడ యుక్తముకాదు. కార్యము ఉత్పత్తికి పూర్వము సదాత్మకమే యగును. కాని యవ్యక్తరూపమున నుండును. అవ్యక్తకార్యమును వ్యక్తపరుచుటకే కారణవ్యాపార మవసరమగుచున్నది. పెరుగులో వెన్న యుండును, కాని, దానిని ప్రకట మొనర్చుటకు

చిలుకుటయను వ్యాపార మవసరము. ఇట్లు సత్కార్య వాదమునందు శంకకు తావే యుండదు.

ప్రపంచము మీది యాసక్తిని దూరమొనర్చుటకై శూన్యవాదులు శూన్యవాదము నంగీకరించుటయవసరమనుచున్నారు. శూన్యవాదము నంగీకరింపకున్నను ఆసక్తి దూరముకాగలదు. అనిత్యములు, నస్థిరములునగు ప్రాపంచిక పదార్థముల సంబంధము దుఃఖ కారణమగుచున్నది, అందువలన వివేకి వాని యందాసక్తుడుకాడు. రాగద్వేషము లేక కర్తవ్య బుద్ధితో శుభప్రద కర్మముల నాచరించు వ్యక్తి క్లేశముల జిక్కుకొనక యుండగలడు.

సత్కార్య వాదమునను సరించి విచారించినచో త్రివిధములగు సత్పదార్థములు గోచరించును. ఘృతము, నవనీతము, దధియను నీమూడును నాకారమున భిన్నములు కాని, పరస్పరము కార్య కారణములగుచున్నవి. వీనికన్నింటికి కారణము దుగ్ధము. ఈ విధముగ నాలోచించిన మీదట ప్రపంచములోని జడపదార్థములన్నియు కొండొక కారణ పరిణామములనుట నిక్కువము. ఆ కారణము జడపదార్థమై యుండవలెను. జడము యొక్క పరిణామము జడరూపమే యగును, కాబట్టి సమస్త జడ ప్రపంచము కొండొక జడకారణ పరిణామము. ఆ మూల కారణ మనాది, అది యొకప్పుడు పృథ్వి, జలాదులను ప్రకట మొనర్చును, మరియొకప్పుడు ప్రకటము చేయదు. అప్పుడది కార్యరూపమున నుండకపోయినను కారణ రూపమున నవశ్యముండును. ఘటము విచ్ఛిన్నము కావచ్చును; కాని, మృత్తికా రూపమున నదియుండును. సూర్య చంద్రాదులన్నియు నొక జడ కారణ పరిణామములే. ఆ కారణము సూర్యాదులు లేనపుడు నుండును. దీనినే మూల ప్రకృతియందురు.

లోకమున జడపదార్థములవలె చేతన పదార్థముల యనుభవము మనకు కలుగుచున్నది. జడపరిణామము చేతనము కాజాలదు. అందువలన చేతన మపరిణామమై నిత్యమగుచున్నది. ఇట్లే యొక చేతనమునకు మరియొక చేతనము పరిణామము కాజాలదు. కావున నొకే కాలమున సుఖి, దుఃఖి, జ్ఞాని, అజ్ఞాని రూపమున తెలియబడు చేతనము లనేకములై యుండవలయును. వీనినే జీవులని సద్భావ వాదులు వ్యవహరింతురు.

ప్రకృతి జీవులు నను నీ పదార్థములకంటె భిన్నముగా మరియొక తత్వమును గలదు. చేతనులగు జీవులల్పజ్ఞులు నల్పశక్తిమంతులును. వారు ప్రకృతిని సూర్య చంద్రాది రూపమున పరిణమింపజేయ జాలరు. వానిని మూల ప్రకృతినుండి యుద్భూత మొనర్చు చేతనము జీవులకంటె విలక్షణమైనదొకటి యున్నది. దీనినే ఈశ్వరుడు, బ్రహ్మము, విష్ణువు, అగ్ని, ప్రాణము, ఇంద్రుడు నని యనేకవిధముల వైదికులు వాకొనుచున్నారు.

'ఏకంసద్ విప్రాబహుధావదన్తి' ఋ వే.

విద్యుత్సంబంధ మాత్రమున పెద్దపెద్ద యంత్రములన్నియు గతిమంతములగుచున్నట్లు చేతన బ్రహ్మ సంసర్గమున ప్రకృతి నానావిధములగు పరిణామములను ప్రకటించును. బ్రహ్మమునకు ప్రకృతితో సంసర్గము మాత్ర ముండును. మరియే విధమగు వికారబ్రహ్మమున కలుగదు. అది నిత్యమై యేకరసమయినను సామీప్యముచేతనే సమస్త ప్రకృతిని ఆందోళితము చేయును. స్వయం నిష్క్రియమై, స్థిరమై, నిశ్చేష్టమై యుండియు, నయస్కాంతము సమీపవర్తి లోహ వస్తువులనువోలె ప్రకృతిని సంచలింప జేయును బ్రహ్మ సంబంధమువలననగు క్రియా స్వరూపమొక విధముగ నుండును. క్రియాఫల స్వరూపము మరియొక విధముగ నుండును. ఒకప్పుడా క్రియాఫలము ప్రపంచోదయ మగును. మరియొకప్పుడు ప్రపంచలయము.

ఇట్లీ సృష్టి ప్రవాహమునకు మూడే తత్వములు మూల కారణములగుచున్నవి. ప్రకృతి, జీవులు, ఈశ్వరుడుననునవియే యీ మూడు తత్వములు. కార్య కారణమయమగు నీ జగత్తునందు పరిణామ స్వభావమనుభవసిద్ధము, కావున ప్రపంచము వైదికుల దృష్టిలో శూన్యముకాదు శూన్యవాదము నంగీకరింపనంత మాత్రమున ప్రాపంచిక దుఃఖముల నుండి విముక్తులమగుటకు వీలు లేదని భయపడనవసరమును లేదు.

# దేవాలయాల అధికారులు గుర్తించవలసిన విశేషాలు

శ్రీ ఆర్. పార్థసారథి అయ్యంగారు

వైఖానసాగమము వైఖానస దేవాలయములలో ఆచరింప బడుచున్నది. వైఖానసాగమ గ్రంథములు విఖనస మహర్షి శిష్యులగు మరీచి, భృగు, అత్రి, కశ్యపుడు అను నలుగురు మహర్షులచే రచింపబడి ఆదియందు నాలుగులక్షల గ్రంథముగా ఉండియుండెడివి. విఖనసుడు అను మూలపురుషునిచే ఉపదేశించ బడిన శాస్త్రము గనుక దీనికి వైఖానసమని పేరు యేర్పడెను. విఖనసు అనగా సాక్షాత్తుగ శ్రీ మహా విష్ణువేనని మహాభారతము చెప్పుచున్నది. విష్ణుదేవునిచే సృష్టి కార్య నిర్వహణమునకై తన మనస్సు నుండి బ్రహ్మను సృజించినట్లు పురాణములు చెప్పుచున్నవి. ఆ బ్రహ్మయే తపస్సు చేసి వైఖానస ఆగమమును వరప్రసాదముగా పొంది విఖనసుడు అను పేరుతో వెలసెనని శాస్త్రములు చెప్పుటచే చతుర్ముఖబ్రహ్మ కూడా విఖనసుడే అనబడెను. అట్టి పరమోత్తమమైన శాస్త్రము వైఖానసము. నాలుగులక్షల గ్రంథము వారి శిష్యులు రచించి ఆలయపూజను విస్తరింపజేసినారని చెప్పినాను. గ్రంథము అనగా ముప్పదిరెండు అక్షరములు గల ఒక గద్యభాగమునకు గాని, పద్యభాగమునకు గాని గ్రంథమని వ్యవహారము. నాలుగులక్షల గ్రంథములో కొంత పద్యముగాను, కొంత గద్యముగాను ఉండి యున్నది ఇది సంస్కృత భాషయం దున్నది. ఈ ఆగమములకు వాడుకలో భగవచ్ఛాస్త్ర సంహితలని మాత్రమే వ్యవహారమున్నది. ఆగమము అనుమాట శాస్త్రసిద్ధముగా వైఖానస సంహితలందు శాస్త్రకారులచే వాడబడలేదు. ఈ నాలుగులక్షల గ్రంథములో యెక్కువ భాగము కాలదోషముచేతను, అశ్రద్ధ చేతను ప్రకృతి వశమునను లుప్తమైపోయినది చాలా తక్కువభాగమే మనకు లభించినది. దొరికినవానిలో కొన్ని గ్రంథములు అక్కడక్కడ ముద్రణమునకు తేబడినవి. కొన్ని ముద్రణమునకు సిద్ధము చేయ బడినవి. కొన్ని సేకరింపబడి సంరక్షింపబడు చున్నవి.

ముద్రింపబడిన గ్రంథములు సంహితలుమాత్రము ఈ క్రింద వివరములతో తెలియపరుపబడినవి.

| | ఋషి | గ్రంథం పేరు | లిపి | ముద్రణ చోటు |
|---|---|---|---|---|
| (1) | మరీచి | విమానార్చనాకల్పము సంహిత | దేవనాగరి | తిరుపతి |
| (2) | ,, | ,, | తెనుగు | ఈగావారిపాలెం |
| (3) | భృగు | ప్రకరణాధికారం | ,, | మద్రాసు |
| (4) | ,, | యజ్ఞాధికారం | ,, | ఈగావారపాలెం |
| (5) | ,, | క్రియాధికారం | దేవనాగరి | తిరుపతి |
| (6) | అత్రి | సమూర్తార్చనాధికరణం | ,, | ,, |
| (7) | కాశ్యపుడు | జ్ఞానకాండ | ,, | ,, |

పై గ్రంథములలో సాధారణముగా ఉపదేశింపబడిన విషయములు:

గ్రంథావతరణము, ఆరాధనమహిమ, ఆలయ నిర్మాణావశ్యకత, ద్రవ్యసేకరణ, వ్యయవ్యవస్థ, భూ పరీక్ష, గ్రామ నిర్మాణము ఆలయగోపుర మండపాది నిర్మాణము, విగ్రహములు వాని సంస్థానభేదము, వాట్లకు శిలాది ద్రవ్యభేదము, లోహ విగ్రహములు వాటి నిర్మాణము, పరివార దేవతలు, పరికరములు,

ప్రతిష్ఠావిధి, ప్రతిష్ఠా ప్రకారము, ప్రతిష్ఠాఫలము నిత్య పూజా ప్రకారము ఫలము, స్నపనభేదములు, ప్రకారము ఫలము ఉత్సవ ప్రకరణము ఉత్సవభేదములు ప్రకారము ఫలము. విశేషపూజా ప్రకారము. అవతార దేవతా ప్రకరణము, ఉత్పాతాదిశాంతులు జీర్ణోద్ధారము ప్రాయశ్చిత్త సామాన్యము, ఆహ్నిక ప్రయోగము జ్ఞానయోగము, అష్టాంగయోగము మోక్షప్రాప్తి మోక్ష స్వరూపము, గ్రంథోప సంహారము. ఇవి అన్నియు ముందుచెప్పిన చరితక్రియా జ్ఞానయోగములను నాలుగు భాగములుగా విభజింపబడిన నాలుగు ప్రకరణములందు విస్తరించి చెప్పబడినవి. ప్రాయికముగ వైఖానససంహితలందు చరితము విస్తరించుటలేదు. చరితభాగమును చెప్పుటకు సాక్షాత్తుగ విఖనస మహాఋషి ఉపదేశించిన వైఖానస సూత్రము అనే గ్రంథమునందు ఐదంపర్యముగ అదే విషయము చెప్పబడుటచే సంహితలందు ఆభాగము చెప్పబడుట కవసరము లేకపోయినది. కొన్ని సంహితలందు చరితమువలెనే జ్ఞానయోగ భాగములుకూడ రాన వచ్చుటలేదు. క్రియానిరూపణను ముఖ్యోద్దేశమగుటచే ఆ గ్రంథ కర్తలు తదితరభాగములను బుద్ధి పూర్వకముగా విడచియుండవచ్చును. లేదా ఉపదేశింపబడిన సంగ్రహము లోపించియు ఉండవచ్చును.

పాంచరాత్ర ఆగమ గ్రంథములను శైవాగమ గ్రంథములను కూడ సంహితలనుటలో యెట్టి విప్రతిపత్తియులేదు. ఐనను ఈ రెంటికిని ఆగమములు తంత్రములు అని వ్యవహరించుట యెక్కువ వాడుకలో నున్నది. ఆగమ తంత్ర శబ్దముల అర్థమును నిర్వచించిన నిఘంటుకారులు చెప్పిన లక్షణములు ఈ రెండు ఆగమములందును సమన్వయ పరచుటకు తగియును ఉన్నవి.

పాంచరాత్ర సంహితలు నూట యెనిమిది ఉన్నవని ప్రబలమగు వ్యవహారము. ఇంకను యెక్కువ సంఖ్యలలో అక్కడ పేర్కొనబడి యున్నవని విమర్శకు లభిప్రాయపడుచున్నారు. ఆ నిర్ణయ మెట్లున్నను మనకు లభించిన సామగ్రి మాత్రము అంత యెక్కువ సంఖ్యలో లేదనుట నిర్వివాదము. ఇప్పటికి ముద్రితములైన సంహితలివి:

| | | |
|---|---|---|
| అహిర్బుధ్న్యసంహిత | దేవనాగరి | అడయారు |
| జయాఖ్యసంహిత | ,, | బరోడా |
| పరమసంహిత | ,, | ,, |
| పారమేశ్వరసంహిత | ,, | శ్రీరంగం |
| సాత్త్వతసంహిత | ,, | కాంచీపురం |
| ఈశ్వరసంహిత | ,, | ,, |
| పాద్మసంహిత | తెలుగు | మేలుకోట |
| కపింజలసంహిత | ,, | భద్రాచలం |
| పురుషోత్తమ సంహిత | ,, | ,, |
| శ్రీప్రశ్నసంహిత | గ్రంథాక్షరం | కుంభకోణం |
| నారదపంచరాత్రం | నాగరి | కాశీ |
| అనిరుద్ధసంహిత | ,, | మైసూరు |
| లక్ష్మీతంత్రము | తెలుగు | మద్రాసు |
| వృద్ధహారీతసంహిత | నాగరి | పూనా |
| విష్ణుసంహిత | ,, | తిరువనంతపురం |

ఈ సంహితలన్నియు భగవానునిచే ఆయా మహర్షులకు ఉపదేశింపబడినవి. వైఖానసము పాంచరాత్రము ఈ రెంటికిని భగవచ్ఛాస్త్రము అని సమప్రాధాన్య వ్యవహారమును పూర్వాచార్యులు ప్రశంసించుచున్నారు. ఈ సంహితలలో యే సంహిత ననుసరించి ఆదియందు అనగా ప్రతిష్ఠాకాలమందో లేక భగవదవతారకాలమందో అచ్చటి ఆరాధనము జరుపబడుచున్నదో కడపటివరకు అదేసంహిత ననుసరించిగాక మరి యే ఇతర (పాంచరాత్ర) సంహిత ననుసరించిగాని పూజాదులు జరుపబడ గూడదని పాంచరాత్ర శాస్త్రనిర్ణయము. ప్రాచీనకాలములో వైఖానసారాధనమువలెనే ఒక ప్రత్యేక సూత్రానుసారులే పాంచరాత్రారాధనమునుకూడ చేయవలయునను శాస్త్రనిర్ణయము పాటింపబడుచు వచ్చినదిగాని ఇప్పు డానియమమంత సూక్ష్మముగా ఆచారమందున్నట్లు లేదు. వైఖానససంహితలలో మాత్రము పైన చెప్పబడిన నలుగురు ఋషుల సంహితలకు పరస్పరము ఎట్టి భేదములేక వైఖానసశాస్త్రము మొత్తముమీద యే ఆలయమందైనను యే సంప్ర

దాయమును అనుసరించినను ప్రకారభేదము కలుగదు. కావుననే దక్షిణభారతమందలి వైఖానసాలయములన్నియు వైఖానస అర్చకులకు సంప్రదాయైక్యముచే సులభములై యున్నవి. ఐనను వైఖానసపాంచరాత్రశాస్త్రములకు సర్వాత్మనా కలగలుపు (సాంకర్యము) పనికిరాదనుట ఉభయశాస్త్రసమ్మతమై యున్నది. ఈ నియమమును పాటించుట ఆలయాధికారుల ప్రప్రథమ కర్తవ్యము. ఏ సంప్రదాయముకు చేరిన అర్చకుడైనను దుర్లభమైనప్పుడుగాని తాత్కాలికపు అధికారుల యొక్కగాని ప్రజలయొక్కగాని అనిష్టతచేతగాని అర్చకులందలి అనర్హతచేతగాని యే ఇతర కారణములచేతగాని క్రొత్త అర్చకుని నొక ప్రాత ఆలయములో నియమించుట అవసరమైనప్పుడు అధికారులు తమ ధర్మనిర్వహణమునకై సంప్రదాయసాంకర్యము మాత్రము కాకుండ ఆరాధనమును సక్రమమార్గములో సాగింపచేయుట అవసరము.

శైవాగమముకూడ వెనుకచెప్పిన పాదచతుష్టయవృత్తి ననుసరించియే పరమశివునిచే అవతరింపచేయు పార్వతినుండి నందికేశ్వరుడాదిగల ప్రమథకోటి కుపదేశింపబడినది. ఆరాధన ప్రకరణమునకు సంబంధించినంతవరకు ఈ మూడు ఆగమములు ఒకేరీతిగా విషయమును నిరూపించినవి. ఏ కొంచెము కూడ మార్పుదల లేదు. వైష్ణవ సంహితలలో విష్ణువు పరదేవతయై తక్కిన దేవతలు పరివారమునందు చేర్చబడిరి. "అగ్నిర్వై దేవానామవమోవిష్ణుః పరమః తదన్యకే న సర్వా అన్యదేవతాః" అను బ్రాహ్మణ వాక్యమును విఖనసమహర్షిని తన వైష్ణవత్వమునకు పరమ ప్రమాణముగ దీసికొనిరి. శైవ సంహితలలో దీనిని త్రిప్పి "శివఏవ కేవలః" అను ఉపనిషద్వాక్యమునందలి శివశబ్దమునకు పార్వతీపతి యని యర్థముచెప్పి, శివుని పరదేవతముగను విష్ణువాదిగా గల దేవతల నందరను పరివారముగను చెప్పబడినది. సర్వత్ర పరబ్రహ్మమగు విష్ణువో రుద్రుడో చేతనోజ్జీవనమునకై పరమాకాశమునుండి తన సచ్చిదానంద స్వరూపమును, నిర్గుణ నిరంజనాకారమును. వాఙ్మనసా గోచరమగు దివ్యస్వరూపమును మాంసచక్షువులగు మనకు గోచరమగునట్లు దివ్యమంగళ విగ్రహరూపముతో అవతరించి ఆలయములందు నిత్యసాన్నిధ్యమును అవధరించి మనము చేయు ఆరాధనము ఉత్సవములు మొదలగు పరిచర్యలను స్వీకరించుచు సంరక్షించుచున్నాడను పరమతత్త్వమే శైవవైష్ణవ సంహితలయం దైకకంఠ్యముగ నిరూపింప బడినది.

ఒక విశేషముమాత్రము శైవపాంచరాత్ర సంహితలందు వైఖానస సంహితలలో లేనిది కలదు. ఈ కారణముచేతనే వ్యవహారమునందు వైఖానస సంహితలకు ఆగమమనితంత్రమని ప్రసిద్ధి కలుగలేదని తోచుచున్నది. ఆగమ తంత్ర శబ్దముల కర్థమును చెప్పునప్పుడు నిఘంటుకారులు చెప్పిన లక్షణములు పూర్తిగా శైవపాంచరాత్ర సంహితలలో కలవు. అందులో ముఖ్యమైనవి యంత్రభాగము ఉద్ధార మంత్రభాగము తదంగముద్రాది వివరణము షట్కర్మ సాధనము. తంత్రములని ప్రత్యేకముగా వ్యవహరింపబడెడి గ్రంథములందు కల ప్రత్యేక విషయములివియే. ఈ ప్రకరణము వైఖానస సంహితలందు కనుబడలేదు.

ఇంకొక విషయము. భగవదారాధనము 'మానసీ హోమపూజాచ బేరపూజాచ సా త్రిధా' అని మూడు విధములుగ నున్నదని భృగుసంహితయందు కలదు. అనగా భక్తులు తమ హృదయమందే భగవంతుని దివ్యాత్మస్వరూపమును సంకల్పించి దానినే మనసుతో ధ్యానము చేసికొనును. మానసికముగనే అర్ఘ్యపాద్యాది సమస్తఉపచారములను చేసి పూజచేయుట మానసపూజ యనబడును. ఇట్లు పరమపురుషుని మనసున నిలిపి ఆరాధించుట యోగనిష్ఠకు పరాకాష్ఠను పొందిన సిద్ధపురుషులకుమాత్రమే సాధ్యము. శాస్త్రోక్తములగు శ్రౌతస్మార్త కర్మలను పంచమహాయజ్ఞములను యథావిధి చేయుచు అగ్నిహోత్రసాధ్యములగు కర్మలను అగ్నియందు చేయుచు తత్పూర్వకముగ పరమపురుషుని నారాధించుట హోమపూజ యనబడును. 'అగ్నిముఖా వై దేవాః' అని ప్రమాణము చెప్పుటచే సమస్త దేవతల నుద్దే

శించి చేయవలసిన అన్ని విధములగు యజ్ఞములకు ద్వారము అగ్నిదేవుడే అగుచున్నాడు. ఈ అగ్నిహోత్ర హోమముకూడ సకలప్రాణి సాధారణము కాక ఉపనయనాధికారము వేదాధ్యయనాధికారము కలట్టి త్రైవర్ణికులకు మాత్రమే విహితమై శక్యమై యున్నది. దేవపూజ యనునది మూడవది. ఇదియే విగ్రహారాధనము. ఈ యారాధనము మిక్కిలి సులభము. ఈ యాచారము మన భారతావనియందే కాక ప్రపంచమున అన్నిమూలలందును విరివిగా వ్యాపించి యున్నది. పూజచేయుట కొక మంత్రమో తంత్రమో ప్రత్యేకించి ఒకేరీతిగ అన్నిచోటులందు లేకపోయినను విగ్రహములు వానిని గౌరవించుట యెచ్చటను కలదు. నిరూపియగు భగవంతుని తదితర దేవతా పరివారమునకే విగ్రహకల్పనము కాదు. ప్రత్యక్ష దృష్టములగు పదార్థములను (చేతనా చేతన విభాగము లేక) అన్నిటికి ప్రతిబింబములు కల్పించి వానిని పూజించుటయో ఆదరించుటయో అభిమానించుటయో జ్ఞాపకపరచుకొనుటయో సేసు అంపరును చేయుచున్నారు. నిరూపములగు పదార్థములకు ఒక స్వేచ్ఛాకల్పితమగు రూపమును సృష్టించుచున్నారు. నది కొక రూపము, వాయువున కొక రూపము. మేఘము విద్యుత్తు వీనికి రూపములు కొంచె మించుమించుగ నుండవచ్చును. ధర్మమున కొక రూపము, ధైర్యము, దయ ఇత్యాది గుణములకు విశిష్టరూపములు కల్పించబడినవి. శిలువ ఒక శక్తిని సూచించినది. పావుర మొక మతమును కామధేను వొక సమయమును చంద్రవంక ఒక సిద్ధాంతమును జ్ఞాపకపరచునట్లు సార్వత్రికముగ కొన్ని గుర్తులకు కొన్ని సంకేతములు అంగీకరింపబడినవి. నీలవర్ణము శ్వేతవర్ణము కృష్ణవర్ణము మొదలైన వర్ణ విశేషములు కూడ సాత్త్విక తామసాది తత్త్వములకు చిహ్నములుగ వాడబడుచున్నవి. Phoneix అనే ఒక లోకోత్తరమగు 'పక్షి' లోకోత్తర లక్షణములచే సృష్టింపబడినది. ఇట్టి సంకేతములలో ఒకటిగనైనను మన విగ్రహములు అంగీకరింప బడవచ్చును గదా!

సర్వవ్యాపియు సర్వస్వరూపియగు భగవంతుని యొక్క విగ్రహమునందు సంకుచితస్థానమున నిర్దేశించి అచ్చటనే చూచుట పూజించుట న్యాయము కాదని మతాంతరులు విగ్రహారాధనమునందు అనౌచిత్యమును సూచించి ద్వేషించి పరిహాసము చేయుచుండుట వాడుకయై పోయినది. సర్వవ్యాపియగు పరమపురుషుడు విగ్రహమునందు మాత్రము ఎందుకు ఉండరాదనే రహస్యము ప్రతిపక్షవాదులు పరామర్శించుకొనుట లేదు. అది తప్పుగదా! సర్వవ్యాపియగు నాతడు విగ్రహరూపములో ఉండుట రాక్షేపము లేదుగదా! ఏదో మనము అనుకున్న ఒకే ఒక విగ్రహమునందు తప్ప మిగతచోటుల ఆ భగవంతుడు ఉండడనిగాని లేడనిగాని విగ్రహారాధకులు యెన్నడు అనరు. మంత్రపూర్వకముగ ప్రతిష్ఠింపబడి ఆరాధనములో వుండిన ప్రతివిగ్రహమునందును భగవత్సాన్నిధ్యముకలిగి ఆ విగ్రహరూపమున అక్కడ భగవంతుడున్నాడని మన మతము. అదియే సర్వేశ్వరుని సర్వశక్తిమత్త్వము. స్వాతంత్ర్యము - విశిష్టత.

ఈ విధముగా నుండుటచే విగ్రహపూజను వర్ణ జాతి విపక్షగాని స్త్రీ పురుష విచక్షణముగాని లేక అందరు వారివారి నియమింపబడినతీరుగా పూజలో పాల్గొనవచ్చును. యోగులకు మాత్రము సాధ్యమైన మానసపూజవలెను ద్విజులకు మాత్రము శక్యమైన అగ్నిపూజవలెను దీని నాచరించుటకు నియమము లేదు. విగ్రహారాధనమునకు అనువుగ 'అర్చ' అను అవతారమును రామకృష్ణాద్యవతారములవలెనే భగవానుడు అవతరించి ఆ విభవావతారములచేతవలె ఈ అర్చావతారరూపముచేతను తాను సాధు పరిత్రాణము దుష్టశిక్షణము చేయుచున్న విషయము భగవద్గీతయందిట్లు చెప్పబడినది.

'యే యథా మాం ప్రపద్యన్తే
తాం స్తథైవ భజామ్యహమ్.'
(అధ్యాయము ४-౧౧)

అభియుక్తు దిట్లు వ్యాఖ్యానించుచున్నారు. దీని అర్థము 'న కేవలం దేవ మనుష్యాదిరూపేణావ

తీర్యమత్సమాశ్రయణాపేక్షాణాం పరిత్రాణం కరోమి. అపితు యే మత్సమాశ్రయణాపేక్షయా యథా యేన ప్రకారేణ స్వాపేక్షానురూపేణ మాం సంకల్ప్య ప్రపద్య న్తే సమాశ్రయన్తే తాన్ ప్రతి తథైవ తన్మనీషితప్రకారేణ భజామి మాం దర్శయామి. కి మత్ర బహునా సర్వే మనుష్యాః మదనువర్తనైకమనోరథాః మమవర్త్మ మత్స్వభావం సర్వయోగినాం వాఙ్మనస గోచరమపి స్వకీయైః చక్షురాదికరణైః స్వాపేక్షితైః సర్వప్రకారై రనుభూయ అనువర్తన్తే.

(శ్రీ రామానుజభాష్యము)

ఇచ్చటి భాష్యమునందలి 'అనుభూయ అనువర్తన్తే' అను విషయమును తాత్పర్యచంద్రికయందు వేదాంతదేశికులు వివరముగ నిట్లువ్యాఖ్యానించిరి.

'అనుభూయానువర్తన్తే' అనుభవమూర్త్యాను వర్తన్తే ఇత్యర్థః అయికరణయాత్రోత్సవసేవాదివాన్. అత్రప్రకారః అత్రయోగినాం వాఙ్మనసాగోచరమపి చక్షురాదికరణై రితి వచనాత్ అర్చావతారరూపేఽపి పరరూపత్వానుసంధానుదర్శితమ్. యథా స్మరన్తి తామేవ బ్రహ్మరూపిణీ' మితి.

ఐనను అధికారి భేదముచేత ఈ పూజావిధానము నందు అనుష్ఠాన ప్రకారమునందు భేదము తరతమ భేదము ఆదిగాగల విషయములు కలవు. అందుచే విగ్రహారాధనము గృహార్చ ఆలయార్చ యని రెండు విధములుగ విభజింపబడి యున్నది. గృహార్చ యను నది గృహస్థులు తమ యిండ్లలో చేసికొనునది. ప్రతి ఇంటను భగవద్విగ్రహమును ప్రతిష్ఠించి ఆరాధనము చేయవలసిన విధి కల్పసూత్రములందు ధర్మశాస్త్రము లందును కలదు. శిల్పశాస్త్రము, వాస్తుశాస్త్రములందు గృహనిర్మాణ క్రమము చెప్పు ప్రకరణమునందు ప్రతి ఇంటను దేవతాపూజకై దేవాయతనమను ప్రత్యేక ప్రదేశము కట్టవలసిన ప్రకారమును అవసరమును విస్తరించి చెప్పబడి ఆచరణమున వచ్చు చున్నది. రెండవది ఆలయ పూజనము. ఈ ఆలయ పూజను చేయుటకు బ్రాహ్మణులలో కొన్ని తెగల వారు మంత్రమే అర్హత కలిగి అట్లు చేయు చున్నారు. బ్రాహ్మణేతరులు కూడ కొన్ని తెగలవారు పూజచేయు ఆలయములు కొన్ని కొన్ని చోటులందు కలవు. వాటికై ప్రత్యేక సంప్రదాయము పూర్వాచార ముగ వచ్చుచున్నది. వీరికి ప్రత్యేకము ఆగమము లందు సంబంధము మాత్రము లేదు. అది కేవల సంప్రదాయము. ఐనను బ్రాహ్మణులు మాత్రము పూజచేయుచున్న ఆలయములలో సాధారణముగ జాతిమత వివక్ష లేక అందరును తీర్థప్రసాదములను పరిగ్రహించుచున్నారు. ఆ పూజ చేయుటకు అర్హత గల అధికారులు వైష్ణవాలయములలో వైఖానసులు పాంచరాత్రులు అని రెండు తెగలవారు శైవాలయ ములలో ఆదిశైవులు అనబడుచున్నారు. శివార్చకు లలో ఆదిశైవులే గాక ఆంధ్రదేశమున వెలనాడు అర్చకులు అను బ్రాహ్మణశాఖవారు కూడ కలరు. వీరలు యెట్లు ఆలయపూజకు యే కాలమున ప్రవేశించి రనునది చరిత్రకారులు విమర్శించ దగిన విష యమై యున్నది. అరవదేశమం దీ విధాన మున్నట్లు లేదు.

బ్రాహ్మణేతరులలో ఇట్లే వైష్ణవాలయములలో శాత్తాదులు (సాతాని) అను వైష్ణవులును శివాలయము లలో జంగమదేవరలును గ్రామదేవతల గుళ్ళలో పూజ చేయుటకు చాకలి, కుమ్మరి మొదలగు వారును కలరు. దక్షిణదేశమున పండారములు పూజారి అను జాత్యంతరముల వారున్నూ కలరు. గృహార్చన ఆలయార్చనము లందలి వైలక్షణ్యమును మహర్షు లిట్లు నిరూపించుచున్నారు.

'స్వార్థం గృహార్చనం ప్రోక్తం
పరార్థం త్వాలయార్చనమ్
పరార్థం స్యాజ్జగచ్ఛుభః
స్వార్థం స్యాద్గృహదీపికా.'

గృహస్థుడు తన కుటుంబ యోగక్షేమమునకై తన ఇంట చేయునట్టి భగవదర్చనము అతడు తన యింట వెలిగించుకొని రక్షించెడి దీపమువలె తన ఇంటి యందు ప్రకాశించును. తన యోగక్షేమములకు మాత్రము సహాయపడుననియు, ఆలయార్చనము అట్లుకాక సకల ప్రజలకును యోగక్షేమములను ప్రసా దించ గలవనియు చెప్పబడినది. సూర్య దొక్క

చేతమునకో ఒక ఇంటికో ఒక గ్రామమునకో రాష్ట్రమునకో కాక యావద్బ్రహ్మాండమునకు ప్రకాశమునిచ్చునట్టు ఆలయపూజ సహాయపడునని దృష్టాంతపూర్వముగ రెండు అర్చనల స్వరూపమును మహాత్ములు చెప్పిరి. ఇది సత్యమైన విషయము. తిరుపతి, శ్రీరంగము, శ్రీశైలము మొదలగు దివ్యక్షేత్రములు ఇందుకు ప్రత్యక్ష సాక్ష్యమనుటలో యెవరికిగాని సందేహములేదు.

ప్రతియొక్క మానవునకును తనకుగాను ఒక భగవద్రూపమును విగ్రహమునందు గాని పటమునందు గాని సంకల్పించి నిర్మించుకొని దానిని పూజించుటకు అధికారము లేకపోలేదు. ఐనను చిత్తవృత్తి భేదముచేత నేను ఉక్త నియమములను జరుపుకొనుటకు తగినంత అవకాశముగాని ధూపదీపనైవేద్యములను జరుపుకొనుటకు తగిన శక్తి లేకపోవుటచేతగాని కొందరు యెంత నిరాడంబరముగానైనను 'పత్రం పుష్పం ఫలం' అనునట్లు అతి సులభమగు పూజనైనను తమ యిండ్లలో జరుపుకొనలేకపోవుట ఆశ్చర్యము కాదు. అది సర్వదా సంభావితమే యనవచ్చును. అట్టివారలకు ప్రతినిధిగ ఒక అర్చకుడు దేవాలయములో ఉండి ఆ గుడిలో చేయవలసిన పూజా విధులను యథావిధిగ ఆయా కాలములయందు శ్రద్ధతో నెరవేర్చగలడు. అట్లు చేయుట అతని విధిగా భావించబడి అతని కుటుంబ నిర్వహణ భారము గ్రామస్థులుగాని ఆలయ నిర్మాతలుగాని వహించి తగు జీవనాధారము యేర్పడి సుఖజీవనము చేయు అర్చకుడు సక్రమముగా పూజలు చేయును. భగవత్సాన్నిధ్యము పూర్తిగా అచ్చట లభించునట్లు దేవాలయమును చేయగలడు. తక్కిన ప్రజలందరును నిర్విచారముగ తమకు అవకాశము కలిగిన సేవాసమయములందు ఆలయమునకు వెళ్ళి భగవద్దర్శనము చేసికొని తీర్థ ప్రసాదములు తీసుకొనవచ్చును. కథాకాలక్షేపములను విని ప్రొద్దుపుచ్చుకొనవచ్చును. ప్రజలకు పవిత్రమైన సేవ చేయుటకే అర్చకులను దేవాలయములు పారంపర్య కింకరులుగ చేసుకొన్నవి. ఒకే వృత్తి వంశానుక్రమముగ వచ్చునప్పుడు ఆ వృత్తి సర్వసమృద్ధిని దోషరాహిత్యమును పరిపూర్ణతను పొందగలుగుట స్వభావసిద్ధము. ఒక్కొక్క పరిపాలనా శాఖయందును ప్రతినిధి కల్పనము శాస్త్రసిద్ధము యుక్తిసిద్ధము వ్యవహారసిద్ధమును అగుచున్నది. ప్రజాసామాన్యమునకు తమతమ లౌకిక కార్యభారములలో ఒక విధమగు భారమును ప్రతినిధి యగువాడు తగ్గించి తమతోటి సహోదరులకు సేవచేయుటయును స్వయముగ భగవత్కృపకు పాత్రుడగుటయు అర్చకునకు రెండు ఫలములు కలుగుచున్నవి.

ఒక గృహస్థుడు తనకై తన ఇంటనుంచి ఆరాధించుకొనిన దైవతము తన కొకటి యుండినను విశేషఫలదాయక మగుటచే ఆలయమునకు కూడ వెళ్ళుట అవసరము. ఆ గృహస్థు అట్లు వెళ్ళుటయు కలదు. ఒకప్పుడు ఆ గృహస్థు కాలధర్మము నొందినప్పుడు అతని వారసులు పూర్వాచారమును అనువర్తించ చాలనప్పుడు ఆ పూజ ఆ దేవుడు అంతలో అంతమంద ఆ కుటుంబమునకు పూర్వపరిచితమగు ఉపయోగము లేక పోవుట తటస్థింపగలదు. ఆలయ పూజలో అట్టి లోటుపాటులు గాని, పూజ అంతరించెడి ప్రమాదము గాని ఉండుటకు న్యాయములేదు. ఆలయము గ్రామమునకు సంబంధించినది. దేశమునకు సంబంధించినది. ప్రజాసామాన్యము దానియందు పూజానువృత్తికై ఆశపడుదురు. దానిని లోపింపనిచ్చగించరు. అట్లు యే సహాయాంతరము గాని అపేక్షించకుండనే ఆలయ నిర్మాణమునాడే ఆ యాలయము ఆచంద్రార్కముగా పూజ జరుగుతూ దినదినాభివృద్ధి నందుటకు తగిన వసతిని ఒకరూపముగను మరియొక స్థిరరూపముగను కల్పించియే తరువాత ఆలయ నిర్మాణమును ప్రతిష్ఠను శాస్త్రములు విధించిన తీరున పెద్దల కాలమునుండి జరుగుచు వచ్చుచున్నవి. కనుక గృహార్చన విషయములో విచ్ఛిత్తి కలుగుటకు ఉండే ప్రమాదము ఆలయార్చనమునందు అంత సులభముగా కనుబడదు. ఐనను దానినే సిద్ధాన్తముగా శపథము చేయజాలము గనుకనే ప్రాచీనాలయములు అనంతములుగ కాలగర్భ

ములో పడి పూజలేక జీర్ణించియు జీవనములు లేక పేడస్థితియందు అల్ప ప్రాణముతో నున్నవియు మనకు కనబడుచున్నవి. ఒక ఆలయములో అవిచ్ఛిన్నముగ పూజ యనునది యెంత ప్రాతకాలము నుంచి జరుగుచు వచ్చుచున్నదో ఆ యాలయము ఆ ప్రదేశము అంత విశేషశక్తిని కలిగియుండుటకు కూడ ఒక న్యాయమును మనము తర్కరూపముగ స్థాపించవచ్చును. కాలము గడచినకొలది అప్పుడప్పుడు మహాసిద్ధపురుషులు యెంతోమంది ఆ స్థలమును తమ దర్శనముచే పవిత్రము చేసి అక్కడి దేవతామూర్తిని సేవించి తమ శుభాశంసలతో కీర్తించి తమ తపస్సును వారలకు కొంత అర్పించిపోవుట సంభవము. అది మహాభక్తుల కార్యక్రమము. నారదుడాదిగల దేవర్షులిట్లు దివ్యక్షేత్రములను సందర్శించి ఆ ప్రదేశములకు అనవద్య మహిమను చేకూర్చిన విషయములు పురాణము లందును శైవ, వైష్ణవ భక్తాగ్రేసరులు తమ తమ దివ్య సంకీర్తనములచే దేవాలయములను అకుంఠిత దివ్యసత్తాకములుగ జేసిన ప్రకారము చరిత్రయందును మనకు ప్రత్యక్షమగుచున్నది.

'యజమానా బాల్యేప్యవిచ్ఛిన్నం తిష్ఠతి' అనిమరీచి మహర్షి ఈయంశమును తమ సంహితయందు చెప్పిరి. ఇట్టి దేవాలయపూజ అగ్నిహోత్ర హోమమునకు తుల్యమైన పరమవైదిక కార్యమనియు దేవాలయము ఉండిన గ్రామములో ద్విజులు ఎవరైనను అగ్నిహోత్రము (శ్రౌతములగు యజ్ఞాది సాధనమగు త్రేతాగ్ని పరిచర్యను) ను చేయలేనివారు ఉండిన యెడల వారలకా అగ్నిహోత్రలోపము అనేదోషము తగులకుండా అక్కడి ఆలయపూజ అగ్నిహోత్ర హీనుల కగ్నిహోత్ర ఫలమును ప్రసాదించుచున్నదనియు అగ్నిహోత్రముచేయు ఆహితాగ్ని ద్విజులకు తమ అగ్ని పరిచర్యలో న్యూనాతిరేకములు కలిగిన యెడల ఆ న్యూనాతిరేకములవలని ప్రమాదము రాకుండ దోషప్రాయశ్చిత్తమై యొప్పుచున్నదనియు ఆలయపూజామహిమను మరీచిమహర్షి శాస్త్రారంభ ప్రకరణమున సెలవిచ్చియున్నారు.

కొంతకాలము పూజలోనుండి తరువాత దుర్విధి విలసితముచే శిథిలములై నామరూపములు లేకపోయిన దేవాలయములను మన మిక్కడ ప్రస్తావించుట అనవసరము. శాశ్వతముగ జరుపబడు దేవాలయములను దృష్టియందుంచుకొని వాట్ల ప్రయోజనమును శాస్త్రప్రమాణమునకు సమన్వయ పరచుటయే మన కర్తవ్యము.

సాధారణముగ తపోదానయజ్ఞాదులచే లోకోద్ధారము చేసిన పుణ్యపురుషులకు వారి యనంతరము వారి పుణ్యకార్యములు లోకమునందు జ్ఞాపకములో నున్నంతకాలము స్వర్గలోకమున సకలభోగములతో స్వచ్ఛందావాసము కలుగునని పురాణములు చెప్పు నప్పుడు అట్టి దన్యత ఆలయ నిర్మాతలకు ఆలయ పూజలు జరుగుచున్నంతకాలము కలుగుననుటలో ఏమి సంశయమున్నది.

'సర్వానేతాన్ భావినం పార్థివేంద్రాన్
భూయోభూయో యాచతే రామభద్రః
సామాన్యోఽయం ధర్మసేతుః నృపాణాం
కాలే కాలే పాలనీయో భవద్భిః.

అని యన్నట్లు ఈ దేవాలయ ధర్మములు రక్షణ భారము ఆదిలో ఆలయనిర్మాతయగు ఒక పురుషుని యందేగాక సంతతసంతన్యమానకాలప్రవాహమందు స్వయం ప్రాప్తముగ అందరకు సంబంధించినదిగా తలంపబడుటచే ఈర్ష్యాసూయలు లేక అందరును వహించుట ఉద్దేశింపబడుటచే ఈ సంస్థలకు విచ్ఛిత్తిఉండకపోవుట న్యాయము. స్వర్గవాసముకూడ అట్లే ఆదినిర్మాతకేగాక 'కర్తా కారయితా చైవ' అనునట్లు ఈ ధర్మముతో జోక్యముచేసికొనిన అందరకు స్థిరవాసమై యుండగలదు.

అంతేగాక,

'దానపాలనయోః మధ్యే దానాత్ శ్రేయోనుపాలనమ్
దానాత్ స్వర్గమవాప్నోతి పాలనా దచ్యుతం పదమ్.'

అనునట్లు ఆలయము కట్టించుటయో కైంకర్యములకు దానాదుల నిచ్చుటయో ఆరంభించిన వానికంటె శిథిలములగు ఆలయములను జీర్ణోద్ధారము చేయుట శిథిలములగు కైంకర్యములను ఉద్ధరించుట

చేయుట యొక్కుప అవసరమని చెప్పవలచి అట్టి జీర్ణోద్ధారకులకు ఫలమును అధికముగ శాస్త్రములు చెప్పినవి. కట్టినవానికో దానము ఆరంభమున చేసిన వారికో ఆ కైంకర్య ఫలము అస్థిరమును అల్పమునగు స్వర్గము మాత్రమే ఫలమనియు జీర్ణోద్ధారము చేసినవానికి అనల్పమును స్థిరమునగు శ్రీ వైకుంఠ వాసము ఫలమనియు సిద్ధాంతము చెప్పబడినది.

## స్థానపంచకము

దేవాలయములు స్వయంవ్యక్తము మొదలగు పేరులతో 'స్థానపంచకము' అయిదు విధములుగ నున్నట్లు ఒక ప్రమాణము కలదు.

స్వయంవ్యక్తము, దివ్యము, ఆర్షము (సైద్ధము), పౌరాణికము, మానుషికమునని ఈ అయిదు విధములకు గుణకృతమగు సంజ్ఞావ్యవహారము.

స్వయంవ్యక్తములు యెనిమిది.

శ్రీరంగము, శ్రీముష్ణము, శ్రీ వేంకటాద్రి, సాలగ్రామము, నైమిశారణ్యము, తోతాద్రి, పుష్కరము, నరనారాయణాశ్రమము. (బదరికాశ్రమము) అనునవి.

నైమిశారణ్యము, పుష్కరము నవి పుణ్యతీర్థములు మాత్రమేనని చెప్పుట కలదు. తక్కిన ఆరు ప్రదేశములలో భగవానుని దివ్యమంగళవిగ్రహములు ఆలయములు కలవు.

సృష్ట్యాదినుంచి భక్తులు తపస్సుచేసి భగవానుని సాక్షాత్కారమును ప్రార్థించినపుడు భగవానుడు వారలకై అవతరించుచుండుట పురాణప్రసిద్ధము. రామకృష్ణాద్యవతారములందును ఈ విషయమే తెలియుచున్నది. ఒకప్పుడు భక్తులు తమ ప్రార్థనలను వరప్రసాదముగా పొందుటతోపాటు భగవానుని ప్రార్థించుచు తమకు వారు ప్రత్యక్షమైన రూపముతో అట్లే అంతర్ధానము జెందకుండ అచోటున నిలచి యుండునట్లు భగవానుని కోరుటయు, భగవాను డట్లే అవతరించినట్లును పురాణములందు కలదు. అట్టి సమయములలో ఆభక్తుని నొక విగ్రహమును నిర్మించి యుంచునట్లు భగవాను డాదేశించి, అట్లు భక్తునిచే సిద్ధపరుపబడిన విగ్రహమందు ఇతరులచే ప్రతిష్ఠ అవసరములేకుండా తానే తన శక్తిని ఆ విగ్రహములో అవతరింపజేయునట్లును, దానిచే ఆవిగ్రహము స్వయంవ్యక్తమని యనబడునని అందురు. ఈ విషయము విస్తరించి శ్రీ వేంకటాచలమాహాత్మ్యమునందు శ్రీ శ్రీనివాసమూర్తి దివ్యమంగళ విగ్రహమును గురించి ఉన్నది. తరువాత కొందరు చెప్పుచు భగవానుడు తానే విగ్రహముగాకూడ తన శక్తితో కలిసి అవతరించుట స్వయంవ్యక్తమగునని చెప్పుట కలదు. సర్వశక్తుడగు భగవానుని కిది అశక్యము కాదు గనుక అందులో యెవరికిని విప్రతిపత్తి అక్కరలేదు. ఇట్టి స్థలములలోని ఆరాధనము సమస్త లోకములకు ఫలమునిచ్చునదగుటవలన ఇతరస్థలముల కంటె వీటియందు మహిమ విశేషము చెప్పబడుచున్నది.

మనకు లభించుచున్న అనేక స్థలముల యొక్క స్థలపురాణములను చదువునప్పుడు స్వయంవ్యక్త స్థలములుగా ఈ యెనిమిదికాక మరికొన్ని కూడా ఉన్నట్లు తెలియుచున్నది. అట్లు అయ్యవి కూడ స్వయంవ్యక్తములుగ ఉండరాదని మనము చెప్పజాలము. ప్రాచీనకాలమునుండి పెద్దలందరు ఐకకంఠ్యముగ అంగీకరించినవి పై యెనిమిది మాత్రమే అనుటను స్వయంవ్యక్త లక్షణ నిర్ణయమునందును మనకు తాత్పర్యము ముఖ్యము.

స్వర్లోకవాసులగు దేవతలు ప్రతిష్ఠించిన ఆలయములు దివ్యములనబడుచున్నవి.

తపస్సిద్ధులగు మహర్షులు తమ తపశ్శక్తిని ధారపోసి భగవత్సాన్నిధ్యమును ప్రతిష్ఠించిన ఆలయములు ఆర్షములు లేక సైద్ధములు.

పౌరాణికములు అజ్ఞాతచారిత్రములుగ పురాణకాలమునుండి ప్రసిద్ధముచెందినవి. ప్రత్యేక పురాణములచే ప్రసిద్ధిచెందినవి యగు ఆలయము లీకోటిలో చేరగలవు.

మానుషికములు: శ్రీమంతులును, ఉదారులును, ప్రపన్నులు నగు పుణ్యపురుషులచే స్వహస్త పరహస్తములచే ప్రతిష్ఠించిన ఆలయము లీకోటికిచేరును.

ఈ యైదింటికిని పూజాక్రమములందును ఇతర విశేషములందును (విభవభేదముచేత కలిగిన వైభవ భేదమే గాని) వేరువిధమగు భేదములేదు. పూజా ఫలము మాత్రము క్రమముగా మొదటిదాని కంటె తరువాతి దానియందలి అతిశయము క్రమముగా హ్రాసమునందునని చెప్పుటకలదు. ఈ పైన చెప్పిన ప్రకారమంతయు శాస్త్రప్రక్రాన్తము, అనుశిష్టము నగు మర్యాదమాత్రమే. ఈ సిద్ధాన్తము చారిత్రక విమర్శకుల దృష్టిలో రూపొందిన విధము కొంచెము భిన్నముగ నున్నది.

చరిత్రవిమర్శకులు ఉచ్చావచములగు నిదర్శనముల సమక్షమున ఈ సమస్యను తారుమారుగ వ్యాఖ్యానించుచు ఒక నిర్ణయమునకు రాలేకున్నారు.

ఆలయములు అనునవి పురాతనకాలమునుండి భారతదేశములో ఉండియున్నవా అనునది సమస్య. "ఇప్పుడు మనకు దృగ్గోచరమగుచున్న కట్టడము లన్నియు ఇదే రూపముతో యెంతకాలమునుంచి ఉండగలవు. అని విచారించినప్పుడు మన కుద్దేశమైన సమాధానము రాకపోవచ్చును. మన కంటి యెదుట నిర్మించిన ఆలయములు మన కంటియెదుటనే నశించిపోయినవి కూడ ఉన్నవి. ఆలయములే కాక ఆలయములవంటి మత సంస్థానములు కూడ ఇట్టి ప్రశ్నకు సమాధానము నీయదగియున్నవి. ఆలయములు ఇతర మత సంస్థానములు ప్రాచీనకాలము నుండి చారిత్రకదృష్ట్యా క్రీస్తుశకము పూర్వము నుంచి యెన్నో మనదేశమం దుండియున్నవి. అవి కాలక్రమమున శిథిలావస్థచెంది పునరుద్ధరింప జేయబడుచు వచ్చినవి. అట్లు ఒకేకట్టడము శాశ్వతముగా వేలాది సంవత్సరములు ఒకేరూపముతో ఉండుట శక్యముకాదు. అంతమాత్రముచేత అవి పూర్వములేవని అనుట న్యాయముకాదు.

విగ్రహములున్నవని, విగ్రహారాధనము సర్వదేశ సాధారణమని, ప్రాచీనమని సర్వసంప్రతిపన్నము. విగ్రహములు పూజోపకరణము లనుటయందు విప్రతిపత్తి యుండినను వాటికొక ఆశ్రయస్థాన ముండుట అనుమాన సిద్ధమగుటచే ఆలయములు సన్నియోగ శిష్టములుగ నుండితీరునని సనాతనుల అభిప్రాయము.

ఆగమములందు ప్రప్రథమమున ఆలయములు తృణాచ్ఛన్నములై దారువుతోను ఇష్టకలతోనునిర్మింపబడు చుండెడివని ఆగమములందు చెప్పబడినది. ప్రత్యేకము శిలతోనే నిర్మించబడిన ఆలయముల ఆరంభకాలము కొన్ని శాసనాధారములచేత అర్వాచీనమని కొందరనుచున్నారు. అది న్యాయమేకావచ్చును. ఆలయములే దరిమిలా కాలమునాటివని చెప్పుటకిది ఆధారముకాదు.

ఈ విమర్శమును ప్రసంగించుటకు ప్రత్యేకముగ ఆ విద్యయందు నిపుణులగువారలు నిర్ణయింపబడుటచే నాకు ప్రస్తుతము కాకుండుటచే ఇచ్చట విడచితిని.

## భక్త విగ్రహములు

రమారమి యెనిమిదవ క్రీస్తుశతాబ్దమునకు వెనుక శ్రీవైష్ణవులలోను శైవులలోను చాలమంది మహనీయులు పూర్వపుణ్య పరిపాకమువలన పరమేశ్వరుని యందు పరమ భక్తిసంపన్నులై దక్షిణభారతమందు అవతరించి యున్నారు. వారి యవతారస్థలములు పుణ్యమతములుగ భావింపదగి అట్లు భావింపబడుచున్నవి. పుణ్యభూమియగు భారతదేశమంతయు ఇట్టి మహనీయులను కని పెంచుచున్నను ఈ ప్రస్తావమందు ప్రకృతమైన మహనీయులకొక ప్రత్యేకతను భారతదేశమంతయు కొనియాడుచుండుట ప్రత్యక్షసిద్ధము.

'పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే'

అను గీతాచార్యుని ప్రతిజ్ఞ ననుసరించి లోకకల్యాణమునకై భగవానుడే స్వయముగ తన పరివారమును దివ్యాయుధములను ఆ పుణ్యపురుషుల రూపమున నవతరింపజేసి భక్తిమార్గమును ప్రవృత్తి మార్గమును ప్రచారము జేయించెననుట తథ్యము. ఈ వ్యవస్థ సర్వసమ్మతమును సర్వసాధారణమునై యలరారుచున్నది. ఐనను ప్రస్తుతవిషయమునకు సంబంధించనంతవరకు దేవాలయముల గొప్పతనమునకు నిదాలు

భూతులగు మహనీయుల కథయగుటచే ఈ సందర్భమున దక్షిణభారతము ప్రశంసింపబడినది. దక్షిణ భారతమునందును అందును ప్రత్యేకముగ అరవదేశమునందును ప్రసిద్ధులగు వీరలు, ఆళ్వారులు నాయన్మారులను సువ్యవహారము కలిగి తమ జన్మభూమికి ఒక అసాధారణమగు గొప్పదనమును సృష్టించిరి. అట్టి మహనీయులు ఎందరో ఆంధ్రదేశమునను, కర్ణాటదేశమునను అవతరించి, దేవాలయముల నుద్ధరించి యున్నను సంప్రదాయము ననుసరించి ద్రావిడుల వైశిష్ట్యము, భక్తిమార్గ ప్రచార పాటవము ఇతరులయందు సంక్రమింపక ద్రావిడులందును పరిమిత సంఖ్యాకులగు కొందరియందే కేంద్రీకరింపబడి యున్నది. ఈ నిర్ణయమునందు కొంత ఔచిత్యమున్నను ముఖాంతరమున ఆంధ్రులకు అతిశయము కలిగిన శాఖలయందైనను వారలకు ఉచితస్థానము లేకపోవుట పరామర్శనీయము.

ఈ భక్తశిఖామణులు తమ భక్తి పారవశ్యము చేత అచ్చటచ్చట పుణ్యక్షేత్రములలోని దేవాలయములందు అర్చారూపమున సాన్నిధ్యముచెంది ఆరాధింపబడుచుండెడి భగవానుని దివ్యమంగళవిగ్రహములను ప్రత్యక్షముగా చర్మచక్షువులతో సేవించియో, యోగసాక్షాత్కారము వలన తాము వసించుచోటనుండియే సాక్షాత్కరించుకొనియో, అనుభవించి భగవానుని దివ్యాత్మస్వరూపమును కల్యాణగుణములను యథావస్థితముగ అమృతమయములగు తమ దివ్యశ్రీసూక్తులలో పరమ భోగ్యముగను సులభముగను ద్రావిడభాషయందు పరిపూర్ణముగ కీర్తించి తాము తరించుటయేగాక తమ తరువాతి ప్రజలందరును ఉజ్జీవించుటకై తమ శిష్యసంతతి మూలముగా ఆ సంకీర్తనములు శాశ్వతస్థాయి నందున ట్లనుగ్రహించిరి. సత్యసంకల్పులును భగవదంశాసంభూతులు నగు వారల ఉద్దేశముననుసరించి తరువాతివారలా స్తోత్రములను అనుక్రుతికముగ భద్రముగా రక్షించి అవిచ్ఛిన్నముగ ననుసంధానము చేయుచు వాట్లకు అమూల్యములును అతి విస్తృతములు నగు వ్యాఖ్యానములు వివరణములు మొదలగు పరిష్కారములును నిర్మించి ప్రచారము చేయుచు వచ్చిరి. అట్లు వా జీవద్దశయందా మహానుభావులు యేదివ్యక్షేత్రవ లందలి భగవానుని దివ్యమంగళ విగ్రహ విభూ ననుసంధానము జేసిరో ఆ క్షేత్రములను 'దివ్యదే ములు' అను నన్వర్థసంకేతముచే వ్యవహరించి ఆ రించుచు ఇతరక్షేత్రము లన్నిటిలో వాట్లకు ప్రాము ఖ్యమునిచ్చి ఆదరించుట ద్రావిడుల సంప్రదాయమై వచ్చుచున్నది. ఈ భక్తుల ఆదరముచేతనే ప్రాయి ముగ ఆయా ఆలయములు నేటివరకును దేశముల యెట్టి అవాంతరములు యెన్ని కలుగుచువచ్చినన సజీవములై నిలచియుండుటయేగాక తమ సజాతీయ సంస్థలను వాట్ల నాదరించెడి భక్తకోటిని సన్మా మున నిలుపబెట్టుచున్నవనుట అతిశయోక్తికాదు.

ఈ భక్తులలో ప్రధానులగువారు వైష్ణవ భక్తులలో పండ్రెండుమందియు శైవ భక్తులలో అరువది నాల్గు మందియు పేర్కొనబడుచున్నారు. శైవ భక్తులు అరువదినల్వురలో అతి ముఖ్యులు నలుగురనియు ఒక మతము. పై జెప్పిన పండ్రెండుగురు వైష్ణవ భక్తులలో పదిమంది ఆళ్వారులనువారు మాత్రము రచియించిన స్తోత్రములు దివ్యప్రబంధమని పిలువబడుచున్నది. ఈ దివ్యప్రబంధమునందు వారలు కీర్తించిన దివ్యక్షేత్రములు నూట యెనిమిది కలవు ఈ నూట యెనిమిదింటిలో 'త్రిపాద్విభూతి' యను శ్రీవైకుంఠము, క్షీరసాగరమునను రెండు క్షేత్రములు మాత్రము మనకు కరణకళేబరములకు దృగ్గోచరములు కానట్టివి. తక్కినవి నూట ఆరును భారతభూమియందు కన్యాకుమారి యారంభించి హిమగిరివరకును గల విశాలభూభాగమున నమరియుండినవే. ఈ విశాల భూభాగమున ఆంధ్రభూమియొక్క వంతుకు వచ్చినవి రెండేరెండు క్షేత్రములు కలవు. ఒకటి 'కలౌ వేంకట నాయకః' అని ప్రసిద్ధికెక్కిన శ్రీ వేంకటాద్రి (యేడు కొండలవాని నిత్య నివాసము). రెండవది హిరణ్య కశిపును సంహరించిన నారసింహుని నివాసము అహోబలము. ఆంధ్రభూమి యందు దివ్యదేశ పరిగణనములో సంఖ్య స్వల్పముగ నున్నను ఒకేఒక తిరుమల ఇతర ప్రాంతముల నుండెడి తక్కిన

నూటనాలుగు క్షేత్రములకు అతిశయించిన ప్రత్యక్ష మహిమ విశేషమును ప్రత్యేకముగ కలిగియున్న దనుట ఆంధ్రుల మహాభాగ్యమే. సంప్రదాయరీతిని చూచినను పదిమంది ఆళ్వారులలో తొమ్మిదిమంది ఆళ్వారులు తిరుమల దివ్యక్షేత్రమును కీర్తించిన అతిశయము కూడ గమనించదగినది.

తిరుమల తిరుపతులందు భగవానుని ఆరాధనము శ్రీ వైఖానస శాస్త్రము ననుసరించియు అహోబిల మందు శ్రీపాంచరాత్రవిధి ననుసరించియు జరుగు చున్నది.

ఇట్లే శివభక్తులను నాయన్మారులని సామాన్యముగ వ్యవహరింతురు. ముందు వైష్ణవ భక్తులకు చెప్పిన విశేషణములన్నియు వీరలకును అక్షరశః చెల్లగలవు. వీరు ఆళ్వారుల వలెనే తమ దివ్యసంకీర్తనముచే అనేక క్షేత్రములను కీర్తించిరి. ఒక్క కాళహస్తీశ్వ రుని మహిమ మాత్రము ఆంధ్రదేశమున ఆ మహ నీయుల నాకర్షించినది. తక్కిన శైవక్షేత్రములన్నియు అట్టివి అరవదేశమందే వున్నవి.

ఈ మహాభక్తుల సంకీర్తనములు ఆ కీర్తనముల యొక్క పిండితార్థమగు శరణాగతియు వారి తరువాతి కాలమున సంతతముగను, సజీవముగను ప్రచారము నకు తెచ్చిన అనేకమంది పుణ్యపురుషులు 'ఆచార్యులు' అను పేరుతో వ్యవహరింపబడినవారు కూడా చాలా మంది శైవులలోను వైష్ణవులలోను కలరు. ఇట్లు ఆళ్వారులు నాయన్మారులు ఆచార్యులు మొదలగు వారల జ్ఞాపకమునకై వారల ఆకారములను విగ్రహము లుగ జేసి ఆలయములలో నియత ప్రదేశములందు ప్రతిష్ఠజేసి పూజించుట ఆచారమై వచ్చుచున్నది. ఆళ్వారులనందరను ప్రతిష్ఠించుటకు శక్తిలేని చోటు లందు పదిపండ్రెండుమందిలో ముఖ్యులుగా భావించ బడియెడి 'నమ్మాళ్వార్లు, ఉడయవర్లు, అండాళ్లు, తిరుమంగైమన్నన్' ఈ నాలుగు విగ్రహముల నైనను ప్రతిష్ఠించుటకలదు. అట్లే శివాలయములందు 'అప్పర్'సుందరర్, సంబంధర్, మాణిక్యవాచకర్' అను నలువురను ప్రతిష్ఠింతురు.

ఈ ప్రతిష్ఠలు పూజలతోపాటు వారల కీర్తనములు (పాటలు) కూడ ఆ యా సమయములలో అనుసంధా నము చేయవలయుననుట కూడ ఒక కట్టుబాటు చేయ బడినది. ఈ కీర్తనము 'సేవాకాల' మను పేరుతో ఆగమోక్తనిత్యపూజలతో పాటు ఆరాధనముతో నియతసంబంధముకలదిగా చేయబడినది. నృత్త గీత వాద్యాది విభవ సహచరితముగ నొకప్పుడు ప్రవేశార్హతకలిగియుండిన ఈ సేవ యనునది క్రమ ముగ శాస్త్ర సిద్ధ కార్య ప్రవృత్తికి అంతరాయమై ఫలించెడి వాతావరణము చాల ప్రదేశములందు యేర్పడినది. అంతేగాక పై దివ్య ప్రబంధ పారాయ ణము జరుగుచు పై భక్తవిగ్రహములు ఉండెడి దేవాల యములు మాత్రమే 'దివ్యస్థలములు - దివ్యదేశములు' అను వ్యవహారమునకు అర్హములనియు, అట్లుకానివి దివ్యశబ్దప్రతిబంధియగు ప్రాకృతశబ్దముచే జత చేయబడి 'ప్రాకృత' స్థలములనబడుననియు విపరీత వాద మారంభించబడినది. నిరాధారమగు నీ కల్పనము దేవాలయ సామాన్యమునందు తరతమభావమును కల్పించి, ఆస్తికులను కలవరపెట్టుచున్నది. దీని ఫలితముగ దివ్యస్థలములందు మాత్రమే వైష్ణవులు తీర్థ ప్రసాదములను స్వీకరించవలెననియు ప్రాకృత స్థలములు వైష్ణవుల కగమ్యములనియు ప్రచారమేర్పడి శాస్త్రమర్యాదకు అతిక్రమము కూడ కల్పింపబడినది. భక్తవిగ్రహముల ప్రతిష్ఠగాని, వారి ప్రబంధసంకీర్త నముగాని దేవాలయమునకు అదనపు కైంకర్యముగా ఆదరించినంతమాత్రమున నిరాధారమగు దివ్యస్థల ప్రాకృతస్థల వ్యవస్థాకల్పనము మాత్రము సాహస కృత్యము.

ఈ సంస్కరణ మాదియందు అరవదేశములో ఆరంభింపబడి, కాలక్రమమున అరవభాషను చెవులతో వినియెరుగని ఆంధ్రదేశమునకు దిగుమతికాబడి విశేషించి వైష్ణవప్రభువుల ఆదరము క్రింద నున్న దేవాలయములలో అమలుచేయబడుచువచ్చినది. ప్రాకృత స్థలములను దివ్యస్థలములుగా మార్చుట, అందుకు చేయవలసిన క్రియాకలాపము దివ్యస్థలము లుగా మారినతరువాత పూజాక్రమములో చేయదగిన

మార్పులు ఈకడ మనకిక్కడ ప్రస్తుతముకాదు. అది యొక విచిత్రము.

ఈ ప్రతిపత్తితోనే అరవదేశపు శివాలయములను ఆరంభింపబడినవి. ఆనాయన్మారుల కీర్తనము ఆలయ పూజతో సంకరముకాక ప్రత్యేక కైంకర్యముగ ఉంచి పోయినది. అట్లగుటచేత ఆంధ్రభూమి యందలి శివాలయములలో పై యాచారమునకు ప్రవేశము కలుగలేదు. తెనుగుదేశమున వైష్ణవప్రభువులవలె శైవప్రభువు లీ విషయములో పోటీపడక శాస్త్ర మర్యాదను అక్షరశః పాటించి, పూజాసౌకర్యమునందు జోక్యముకల్గించుకొనలేదు. తెనుగు దేశమున శ్రీ కాళహస్తి దివ్యక్షేత్రమున తప్ప యెక్కడగాని అరువది ముగ్గురయొక్క గాని, నాల్వార్ యొక్క గాని విగ్రహము లేఆలయములం దున్నట్లులేదు. రానురాను భక్తులు భక్త్యతిశయముచేత తమ ఋషులు, ఆచార్యులు, ఆలయ నిర్మాతలు, దేశభక్తులు, ధర్మకర్తలు మొదలగువాళ్ల విగ్రహములను స్వేచ్ఛగా ఆలయములందుంచుకొనుట పరిపాటియైపోయినది. కాని వారి ఉపదేశములతో పూజా క్రమమును సంపుటితము చేయకుండుట ఇప్పటికొక లాభమే అనవచ్చును.

## నిత్యపూజా ప్రకారము

నిత్యము ఆలయములందు పూజ చేయుట అవసరము. పూజశబ్దము మొత్తము పై ఆలయములో ఒకనాటి ఉదయము ఆరంభించి మరునాటి ఆదే ఉదయమువరకు జరుగవలసిన క్రియాకలాపము అంతకును అన్వయించెడి అర్థములో యిక్కడ వాడబడుచున్నది.

ఆ పూజ ఆరుకాలములు మూడు కాలములు రెండు కాలములు ఒకేకాలము ఇట్లు నాలుగువిధములుగ ఆ ఆలయమునకు గలట్టి ద్రవ్యము పత్రిని అనుసరించి జరుపబడవచ్చును.

ఆరు కాలములు : ప్రాతఃకాలము, మధ్యాహ్నకాలము, సాయంకాలము అనునవి ముందు ముఖ్యకాలములు. ప్రసిద్ధములు - ప్రాతఃకాలమునకుముందు ప్రత్యూషకాలము సాయంకాలమునకు ముందు ప్రదోషకాలమునను రెండు సంధ్యాకాలములు (మధ్యాహ్నమువలె) రాత్రి కొంచెము ప్రొద్దుఅయిన వెనుక అర్ధయామము ఒకటి ఇట్లు ఆరుకాలముల లక్షణమును చెప్పుదురు. ఈ కాల నిర్ణయమును చెప్పినప్పుడు ఒక్కొక్క కాలమునందు చేయవలసిన పూజాంగ ఉపచారసంఖ్యాక్రమము మొదలగునవి ఘడియల (ఘటికా ప్రమాణము) లెక్కలో కాలపరిణామము కూడ శాస్త్రములందు చెప్పబడినది. మొత్తముపైన ముఖ్యకాలములలోని ఉపచారముల సంఖ్య కాల పరిమాణముకొంచెము ఎక్కువగను. ఉపసంధ్యలలో చేయునవి కొంచెము తక్కువగను ఉన్నవి. ఒక్కొక్క కాలమునందు కూడ ఆ యా కైంకర్యస్వరూపము ననుసరించి ఒక్కొక్క విభాగమందు చేయదగిన అవాంతర ఉపచారములు కూడ కాలపరిమితిని నిష్కర్షింపబడి యున్నవి. అట్టి రహస్య మెరుంగుట అవసరము.

మన ఆంధ్రభూమియందుండెడి ఆలయములు అన్నియు ఈ షట్కాలపూజావిధానముగాని, త్రికాల పూజావిధానముగాని సర్వసాధారణముగ ఆచరించుచున్నట్లు లేదు. రెండుకాలముల పూజ అయినా జరిగితే చాలునని తృప్తిపడి గ్రామాంతరములలోని చిన్న దేవాలయము లన్నియు సాయం ప్రాతఃకాలములు రెండుకాలముల పూజలను మాత్రమే అనుభవించుచున్నట్లు తోచుచున్నది. రెండుకాలములు అనగా మధ్యాహ్నము రాత్రి పూజలు. మధ్యాహ్నం పూజ ఉదయం పదిగంటలకు చేయవచ్చును. ఐతే సూర్యోదయము అయిన వెనుక సాధ్యమైనంత త్వరలో అర్చకులు స్నానానుష్ఠానములను చేసికొని ఆలయమునకు వెళ్ళి తలుపులు తెరచి స్వామిని సుప్రభాతము చెప్పి మేల్కొలిపి దీపారాధనములను చక్క చేసికొని ఇంటికి రావచ్చును. మన చిన్న ఆలయములలో సాధారణముగా అర్చకులు తమ ఇండ్లలో అన్నమును వ్యంజనములను పరిశుద్ధముగా పాకముచేసి దేవునికి గుడిలోతెచ్చి నివేదనము చేసి ఆ ప్రసాదమును వారలే అనుభవించుట అనుచారముగా వచ్చుచున్నది.

నివేదనముచేయునట్టి సమయము, నివేదనచేయు ప్రతి పదార్థ పరిమాణము తమ ఇండ్లలో జరిగెడి వంట కాలములనుబట్టి పదిగంటల ప్రాంతమునందు సుమారమిలో ఉండవచ్చును. కాబట్టి తిరిగి అర్చకులు పదిగంటల సమయమునకు గుడికి వచ్చి క్రమముగా నిత్యారాధనమును నెరవేర్చికొని ప్రసాదమును నివేదనముచేసికొని ఇంటికి వెళ్ళవచ్చును. ఆయా సమయములందు గుడిలో సేవించుటకై వచ్చెడి భక్తుల నాదరించి వారలకు స్వామి తీర్థ ప్రసాదముల నీయవలెను.

తిరిగి సాయంకాలమువేళ సంధ్యాకాలమునకు నిత్యానుష్ఠానములను తీర్చుకొని అర్చకులు ఆలయమునకు వచ్చి దీపాలంకారములనుచేసికొని సాయంకాల ఆరాధనము సక్రమముగా పూర్తిచేసుకొని మామూలు ప్రకారం పండో, ఫలమో అవసరనివేదనము చేసికొని భక్తులెవరైనను ఉన్నయెడల వారలకు తీర్థ ప్రసాదములిచ్చి ఆదరించి పంపి ఇంటికి వెళ్ళవచ్చును. కొన్ని పెద్ద స్థలములలో షట్కాలారాధనముకూడ జరుగుతూవచ్చి ఇప్పుడు అంతరించిన ఉదాహరణములును ఇంకను నామమాత్రముగ జరుగుచున్న స్థలములును కలవు. క్రమముగా షట్కాలపూజ జరుపబడుచున్న స్థలములు లెక్కకు లోబడియున్నవనుట అతిశయముకాదు.

ముందు ముందుగా ప్రాతఃకాలమున గుడి వెలపలి భాగమును మనము మన నివాసగృహములను పరిశుభ్రపరచికొనునట్లు అచ్చటి వీలు ననుసరించి దేవస్థానం పరిపాలకులుగాని, కైంకర్యపరులేగాని సమ్మార్జనము, శుద్ధజలసేకమురంగవల్లులచే అలంకరణము చేసికొని అవకాశమున్నచోటులలో ద్వారములకు పచ్చని ఆకులమండలతో కళకళలాడేటట్లు తోరణములు కట్టవచ్చును. నిత్యము ఆలయములో పూజకు కావలసిన తుళసి, సుగంధమైన పూలు, మారేడుపత్రి తెచ్చియుంచుకొనవలయును. విభవముకల చోటులందు బజారులో పూలుకొననవసరముగాని, ఊరులో యింటి యింటికిపోయి యాచించి తేనవసరముగాని లేకుండా దేవాలయ ఆవరణమునందో, దేవునకు స్వంతమైన ఇతర తోటలయందో పూలతోటలను పెంచి సమృద్ధిగా అందు ఉత్పత్తియగు పత్ర పుష్ప ఫలాదులను దేవునికై వినియోగించవచ్చును. అది ఉత్తమము. అట్టి శక్తిలేని చోటులలో ఈ పూజా పరికరములు లభించెడి భక్తజనుల ఇండ్లు, తోటలు వీనినుండిగాని బజారునుంచి క్రయమునకుగాని తప్పక పత్ర పుష్పములను సంపాదించవలెను. పూజకు పుష్పములు, తులసి ముఖ్యమైనపరికరములు ధూపమునకు సాంబ్రాణి, దశాంగము, మంచిగంధపు పొట్టు, ఇంకా పరిమళద్రవ్యములు సంపాదించుకొనవలెను. అగరువత్తులు వైదికోపచారసమయములలో వినియోగించుట అంత యుక్తముకాదు. మంత్రముతో గాక అమంత్రముగ వానిని గర్భగృహమునకు వెలుపల వినియోగించవచ్చును. ఈ వత్తులుకూడా చక్కని పరిమళముగలవిగనే ఉండవలయును. నామకః పుల్లలుగా ఉండి వెలిగితే మాత్రము మంచిదికాదు. మంత్రవత్తుగ పూజాంగ ఉపచారములు సమర్పించునపుడు వీనిని ఉపయోగించుట అనేక ప్రత్యక్ష కారణములచే ఉచితముగా నుండదని పెద్దల ఆశయము. దీపమునకు మంచినువ్వులనూనెను ఉపయోగించుట మంచిది. తక్కిన నూనెలు రెండవపక్షమే. నెయ్యిని మాత్రమే ఉపయోగించగల ద్రవ్యసంపత్తి కలవారలు ఘృతదీపమునే పెట్టుట మంచిది. ఆముదముదీపము పెట్టవచ్చునా అని యొక ప్రశ్న తరుచు వచ్చుచున్నది. ఇప్పనూనెను తరుచు ఇప్పతోటలుగల ప్రాంతములలో నిశ్శంకముగ వాడబడుచున్నది. ఆమిదం వాడుక యెక్కువగాలేదు. అది యుక్తము కాదని కూడా పెద్దలు చెప్పుట కలదు. హారతులు చాల కలవు. దీప హారతులు ఏక హారతి అని ఒకే దీపముతో ఆరంభించి, రెండు, మూడు, పది యిరవైయేడు శతాష్టము వరకు చాలదీపములు యిమిడిన ఒకే దీపపాత్రతో హారతులు సమర్పించునప్పుడు ఆ హారతులను నూనెతోనో నేతితోనో వత్తులు తడిపి దీపము ముట్టించి ఉపయోగించుట కలదు కుంభహారతి అని ఒక రకం హారతి కలదు. కర్పూరహారతికి కర్పూరమే ఉపయోగించబడుచున్నది. రాను రాను నాగరికత హెచ్చినకొలదీ

ప్రాతకాలపుకర్పూరము గుణముతగ్గి, బలహీనములు గుణహీనములై ఉప్పుతో కలితీచేయబడిన కర్పూరపు బిళ్ళలు బజారులో దొరుకుతున్నవని వినవచ్చుచున్నది. సాధ్యమైనంతవరకు ఇట్టి కలితీ చౌక సరుకును దేవాలయములందు దేవుని యెదుట ఉపయోగపరుపరాదు. చందనముకూడా బజారులో విక్రయించేడబ్బాలలో పొడిని ఉపయోగించుట బాగుండదు. చక్కని చందనముచక్కను తెచ్చి సానరాతి మీద మెత్తగ అరగదీసి స్వామికి సమర్పించవలెను. దానిని నూరిన కేసరికుంకుమపూవుతో కలిపి సమర్పించుట ఇంకను శ్లాఘ్యము. పూలు దండలు గుచ్చేటప్పుడు కూడా నూలుదారముతో గుచ్చడం ఆచారముకాదు. పూలు గుచ్చడముకంటె అరటినార దారములతో దండలుగా కట్టటము ఆచారమేగాక సులభముగాను, అందముగాను ఉంది. పనికూడ అతి త్వరితముగ ముగియును. పూలుకట్టుచోటు పరిశుద్ధముగ నుండి కట్టెడి మనుష్యులుకూడ శుచిగా ఆపని చేయవలెను.

కొబ్బరి కాయలు, అరటిపండ్లు, పంచకజ్జాయము మొదలగు ప్రసాదములు రాత్రివేళ సాధారణముగా అవసరనివేదనమనే పేరుతో నివేదనము చేయబడుచున్నవి. శక్తిని అనుసరించి యీ ప్రసాదములను ఒక్కొక్కచోటునందు ఒక్కొక్క రీతిగా తయారు చేయుట కలదు. అన్నప్రసాదము నివేదనముచేసే యెడల అది ఇంకను ఉత్తమమే.

ఆలయములో ఉండవలసిన పూజాపరికరములు పంచపాత్రలు అను ఐదుపాత్రములు. మనము వాడుకలో అనుకునే పంచపాత్రలు అనే నమూనా పంచపాత్రలు కాదు. పంచపాత్రలనగా ఐదుపాత్రలు. వాటి ఆకారము తీర్థపాత్రల స్వరూపము. అందరకు వ్యక్తమైనది. ఈ అయిదుగాక పెద్దపాత్ర 'పతద్గ్రిహము' అని దానికి సంకేతపుపేరు. తీర్థపాత్రలు ఉంచే పెద్దపళ్లెము, తీర్థము తెచ్చుకొనుటకు తీర్థపు బిందెలు రెండు, ఉద్ధరిణెలు, ఇవి శక్తిననుసరించి రాగి, యిత్తడి, కంచు ఈ లోహములుగా ఉండవచ్చును. వెండితోఉంటే ఇంకామంచిది. బంగారు పాత్రములు ఉండే చోటులుకూడా కలవు. చేతిగంటలు ఒకటి రెండు కొంచము పెద్ద చిన్న పరిమాణములలో ఉంటే మంచిది. తీర్థము వినియోగము చేయుటకు ఒకటి రెండు ప్రత్యేకపాత్రలు, అందుకు ఉద్ధరిణెలు. ప్రసాదము నివేదించుటకు పళ్లెములు, ధూపహారతి, దీపహారతి, యెన్నిరకములుచేయగలిగితే దీపహారతులన్నిరకములతో చేయవచ్చును. కర్పూరహారతి, కుంభహారతి, చామరములు వ్యజనములు, అద్దములు, పూలు ఉంచుకునే పళ్ళెము పూలు తెచ్చుకునే బుట్ట దీపారాధనము వెలిగించుకొనుటకు ప్రమిదలు ప్రత్తి, ప్రత్తివత్తులు, అఖండ దీపారాధనము అలవాటు కల చోటులలో అఖండ దీపములకు యెలుకలు బొద్దింకలు మొదలైన వాట్లవల్ల యిబ్బందికలుగకుండా ఏర్పాట్లు, ఇవియన్నియు సమకూర్చుకొనవలయును. నిత్యము వినియోగపడే పాత్రలను సాయంకాలారాధనము అయినతోడనే గాని ఉదయము ఆరాధనమునకు ముందుగాని శుద్ధి చేసికొని ఉంచుకొనవలయును. స్వామివార్లకుకూడా ఉత్సవమూర్తులకు ఆ స్వామివార్ల జన్మనక్షత్రమునాడో శుక్ల ఏకాదశినాడో తిరుమంజనము చేయటం మంచిది. మూలమూర్తులకు నైమిత్తికములందును విశేషకాలములందును అభిషేకము చేయవలెను. తిరుమంజనము మొదలగు విశేష కైంకర్యములకు ఒక స్కేలును నిర్ణయించి అధికారులు తమ దిట్టములందు రికార్డు నమోదుచేయుట అవసరము.

స్వామివార్లకు చినిగిపోయిన వస్త్రములను కట్టరాదు. సంవత్సరమున కొకసారియైనను కల్యాణోత్సవము మొదలగు విశేషకాలములందు నూతనవస్త్రములను కొని సమర్పించుట అవసరము. ఈ నూతన వస్త్రములు నూలువస్త్రములకంటె యెక్కువ విలువగల వాటిని నిత్యములో సమర్పించుట చిన్నవరుమానములుగల ఆలయములకు శక్యముకాదు. అట్టివారలు పట్టువస్త్రములను ఇతర విలువగల వస్త్రములను నిలువలో ఉంచుకొని విశేష కాలములందు మాత్రము స్వామికి సమర్పించుచుండవచ్చును. సాధారణముగా వెలగల పట్టువస్త్రములను సమర్పించి

నిత్యములో నిర్వహించుట కష్టమైన పనికూడ అగుచున్నది. మన దేవాలయములలో యెలుకల బాధ, పిమ్మట బొద్దింకలు మొదలగు పురుగులచేత వస్త్రములు కొట్టివేయబడే ప్రమాదము తప్పించుకునేటట్లు లేదు. యేవిధముగానైనా కష్టించి స్వామికి మంచి వస్త్రములు అలంకరించెదమని ఆశపడినను అది అశక్యముగా గూడనున్నది.

ఆభరణములను సేకరించి, భగవానుని అలంకరించుట యెంతయు కాంక్షణీయము. ఆభరణములను విరివిగా సంపాదించి, భగవానునకు సమర్పించి, ఆనందించగల అవకాశము పుణ్య పరంపరా ప్రాప్తమైనది. అది అందరు సులభముగా చేయదగిన కైంకర్యముకాదు. సొంత విభవము యెక్కువగా కలట్టి ఆలయములను ఐశ్వర్య సంపన్నులగు భక్తులు ఆదరించునట్టి ఆలయములను మాత్ర మీ ఆనందము ననుభవించగలరు. భగవానునిమూర్తికి ఆభరణము లొక అందము, ఐశ్వర్యము కాగలవు. శక్తిగల ప్రభువులు, అధికారులు ఆభరణములను చేయదలచినప్పుడు బంగారు ఆభరణములను చేయుట ముఖ్యము. కవచములు (సర్వాంగము అని మనదేశంలో అంటారు) శ్రీ స్వామివార్ల బింబము మొత్తముకుగాని హస్తములు, పాదములు, వక్షస్థలముకు గాని, బంగారుతో చేయలేనప్పుడు వెండితో చేయించి, బంగారు మలాము చేయవచ్చును. వెండి కూడా చేయవచ్చును. ఒకప్పుడు రాగితో,యిత్తడితోకూడా చేయించినప్పుడు వాటిని మాసిపోయి మచ్చలుపడిపోకుండా తిరుమంజనముచేసి ప్రకాశంగా కాపాడవలెను. కిరీటములు చక్కగా పై లోహములలో దేనితోనైనను చక్కగా చేయవచ్చును. ఈ కవచములు చేయునప్పుడు కొన్ని చోటులలో కవచములు పోతపోయబడి తయారు చేయబడినవి. పూర్వపు రోజులలోనే ఈ పద్ధతి యెక్కువగా కనుపడుచున్నది. ఈ పోతసామానులు దీర్ఘ కాలం మన్నుటచేత మంచివే గాని వీటిని శిలా విగ్రహముల మూర్తిలో సమర్పించుటలో ప్రాణప్రదముగ, అతి జాగరూకతతో అర్చకులు మెలగవలయును. ఆ వస్తువులు బలిష్ఠములై గట్టిగా అదిమినప్పుడు స్వామి శరీరమునకు అవద్యము యేదైనను కలుగవచ్చును. మందపు రేకుతో కవచములను తయారుచేయుట స్వల్ప వ్యయసాధ్యమును నిరపాయముగను ఉండగలదు. కొన్ని ప్రదేశములలో చూచినప్పుడు ఈ కవచములకు స్వామి మూర్తికి యెట్టి సంబంధము అమరికలేకుండా వుండటం తటస్థించినది. కవచములు తయారుచేసే సమయములో నేర్పరులైన శిల్పులు లభించకయు, చేయించెడివారలకు కూలియిచ్చుటకు ప్రాలుమాలి మంచిశిల్పిని పెట్టుకొనజాలక చేతగాని పనివాండ్లచేత చేయించుట, తొందరలో పనిని చక్కగా చేయుటకు పనివాండ్లకు అవకాశము యివ్వకపోవుట ఇటువంటి సందర్భములలో ఆ పనిముట్లు అందవికారముగా ఉండుట సంభవించినది. ఈపనులలో పై విషయములను గమనించి అవసరమైనప్పుడు తగినంత జాగ్రత్తతో శాశ్వతమైన పనులను కార్యకర్తలు చేయవలెను. స్వామివారికి పరిపూర్ణ కవచములు చాలచోట్లలో కలవు. అక్కడి అర్చకులు ఈ కవచ సమర్పణముచేసినతరువాత ఆ కవచమును కవచము పాటుననే ఉంచి పైన వస్త్రాలంకారము యేదైనను చేసినయెడల కవచము దర్శనము కాదని చెప్పి వస్త్రమే సమర్పించకుండా ఉంచటము అంత అందముగా ఉండదని నా అభిప్రాయము. కవచము కవచమే. అలంకారము అలంకారమే. కవచము పైన కుచ్చెళ్లుపోసిన వస్త్రము సమర్పించిన యెడల కవచము మరగిపోకుండా దక్షిణాది సమర్పణమువలె అందుకు తగినట్లు సరసమగునట్లు వస్త్రమును కట్టి పైన ఉత్తరీయమును వేయవచ్చును.

ఇక ఉత్సవమూర్తుల అలంకారమును తలచినప్పుడు మనసుకు అందని వేషములు మనము ఆ మూర్తికి సమర్పించుచున్నాము. బంగారు, వెండి, ఆభరణములు దుర్లభమైనందుకు మనవారలు మనసుకు కొరతపడుట ధర్మమే. ఆ కొరతను తీర్చుకొనుటకు బజారునుంచి కొనితెచ్చే గిల్టుహారములు, పనికిమాలిన రాళ్లపతకములు వినియోగపరచటం అత్యంత విషాదకరమైన అపచారం. అవాప్త సమస్తకాముడగు సర్వేశ్వరునకు మనము చేయవలసినది భక్తితో మనకు శక్తి

గలట్టి ఉపచారము కొంచెమైనను దానిని సవ్యముగా చేయుట మాత్రమే న్యాయము. 'యదన్నః పురుషో భవతి తదన్నాస్తస్య దేవతాః' అని చెప్పినట్లు మనము ఉపయోగపరచెడి పదార్థములతో మన గురువులను దేవతలను మనము పూజించవలెను. మన ఇంటిలో బిడ్డలకు గాని, మన యింటి స్త్రీలకు గాని, మన మా విధమగు అలంకారమును ఇష్టపడుటలేదని నా అభిప్రాయము. కాల వైషమ్యము ననుసరించి ఒకప్పుడు కొందరు నాగరికులు ఈ యలంకారములను ఆదరించినను సర్వసమ్మతము కాదనుట నిర్వివాదము. దేవుడు ఒక వ్యక్తికి లోబడి వ్రాసినవాడు కాదుగనుక సర్వ సంప్రతిపన్నమగు సమయమునే పరమ పురుషుడగు సర్వేశ్వరుని అలంకారమును గురించి అనువర్తించుట మంచిది. చక్కని శుద్ధమగు ఆభరణములు తెచ్చుటకు శక్తి చాలని రిక్తులు నిర్భయముగా తమకు శక్తిగల పరికరములతో భగవంతుని అలంకరింపవచ్చును. ఆడంబరమునకై వ్యర్థపదార్థముల క్రింద డబ్బు ఖర్చుపెట్టుట ఉచితముకాదు. అలంకారములనిట్లు సరిపెట్టి తృప్తిపడవచ్చునుగాని ప్రసాదములనిట్లు యేమరుపజాలము.

ఈ అలంకారాభాసములకంటె ఆ యా కాలము లందు లభించెడి పుష్పములను, పత్రములను సేకరించి పూలమాలలతో భగవంతుని అలంకరించి సంతోషముగా సేవించవచ్చును. చక్కని ముఖమల్లు, పట్టు మొదలగు వస్త్రములపైన సరిగెతోను, ముత్యములతోను ముచ్చటగను, శాశ్వతముగను ఉండు కపాయీలు, కవచములను చేయించుట రెండవరకపు అలంకారముగా చేయించవచ్చును. చక్కని వస్త్రమొకటి కట్టి ఉత్తరీయము పైన సమర్పించి రెండు పూలమాలలు వేసేయెడల స్వామివిగ్రహము ఎంతో సుందరముగా సాన్నిధ్య మీయగలదు. అశక్తులగు వారి నిజమగు యోగ్యతను యెరిగిన సర్వజ్ఞునకు ఆగ్రహమో, అనాదరమో కలుగదు.

స్వామికి నిజరూపము కేశవుడో, నారాయణుడో, రాముడో, కృష్ణుడో ఏదో ఒకరూపముతో విగ్రహము అమరియుండగా ఆ విగ్రహమునకే 'అవతార సమర్పణము' అనే ఆశతో మరియొక రూపముగ మార్చుటకై హస్తపాదముల విన్యాసమును కృత్రిమ హస్తపాదములను కట్టి మార్పుచేసి నిలుచున్నవానిని కూర్చున్నట్లు కూర్చున్నవానిని నిలుచున్నట్లు నర్తనము చేయుచున్నట్లు భగవద్దివ్యలీలల అనన్యముగను మనసున నుంచికొని అనేకవిధ అవతారములను సమర్పించుట కూడ అలవాటు ఉత్తరాది, దక్షిణాది అనే తారతమ్యము లేక అన్ని ఆలయములందును అనుస్యూతముగా వచ్చుచున్నది. ఈ అనుచారముకూడ పెద్దలకు సమ్మతమైయున్నట్లు అనుమానప్రమాణముచే మనము తాటస్థ్యము నవలంబించి మామూలుగా ఆ విధానము జరిగెడి స్థలములందు జోక్యము తీసికొనకూడదేమోగాని నూతనముగా యీ యలవాటును ప్రోత్సహించరాదని నా నిర్ణయము.

సామాన్యముగ మన ప్రదేశములలోని ఆలయములలో ఉత్సవమునకు వేంచేపింపబడెడి విగ్రహములు చాల చిన్న ఆకారముననే కనబడుచున్నవి. ఉత్సవ విగ్రహములకు ఊరేగించునప్పుడు ఈ రూపము అంతగా తగియున్నదని చెప్పలేము. తరుచుగా ఉత్సవములను విభవముగా చేయగల స్థలములలో ఉన్నతమైన దివ్యమంగళవిగ్రహములు వేంచేపింపబడుట తగియుండును. చిన్నవిగ్రహములు పుష్పములు, ఆభరణములు, వస్త్రములు సమర్పించిన కొలది ఆ సామగ్రిలోనే మునిగిపోయి విగ్రహము యొక్క సేవయే కనబడకుండ పోయెడి విపరీతము యేర్పడుచున్నది. ఆదికాలమున అట్లు ఏల విగ్రహాలను పెద్దవిగా అప్పటి ఆలయనిర్మాతలు చేయలేదను ప్రశ్నకు మనము జవాబు చెప్పలేము. మనము చేయదగినదంతా ఇప్పుడు మనకు హితవు అయిన మార్గమును అవలంబించుటయే.

మనకు స్వామి ఊరేగింపులలో వేంచేపించే వాహనసాధనములుకూడ చాలా తక్కువసంఖ్యలో ఉన్నవి. చిన్న ఆలయములలో 'చలవచప్పరం' అనే ఒక నాలుగుస్తంభములుగల మందిరము మాత్రము కనబడుచున్నది. ఒకప్పుడీ చప్పరము పన్నెండు స్తంభములతో కూడా చేయబడుచున్నది. ఇది నచి

చదరమై యుండి సుమారు మూడు అడుగుల పొడవు, వెడల్పుకంటె యెక్కువపెద్దదిగా ఉండదు. నాలుగడుగుల యెత్తు ఉండవచ్చును. దీనిలో మధ్య భాగమున ఒక అరఅడుగుయెత్తు పీఠము, దానిపైన పీఠముపైన మూడు విగ్రహములు వేంచేపుచేయుట ఇరుకుగావుండి స్వామిని అలంకరించుటకు తగినంత విశ్రాంతి లేకయుండును. బాగా స్వామి దర్శనము కాదు. దీనికంటె పైని మూతలేకుండా దక్షిణాదిలో 'తిరుచ్చి' అని వుండే ఒక మాదిరి స్వామిదర్శనం అడ్డు లేకుండా చక్కగా అయ్యేటట్టు ఒక వాహనసాధనం చేయించుట మంచిది, కొన్ని చోటులలో పల్లకీలుకూడా ఉన్నవి. వానిలో ఉత్సవాలలో బలిహరణందేవుని మాత్రం వేంచేపించుతారు. ఇది ఒక మాదిరిగా సరి పెట్టుకోవచ్చును. ఈ దేవునకు ఇతరసేవకు అవసరం గాని హారతులు వగైరాలుగాని ఉండవుగనుక ఫరవా లేదు.ఇంకాగరుడవాహనము, హనుమంత వాహనము గజ వాహనము మొదలగు వాహనములు రథ యాత్రకు రథము ఇటువంటివి కలవు. వీటిని ఉన్న వాటివి సరే. క్రొత్తగా తయారుచేయించు వాటిని చక్కని పనివారలచేత అందముగాను సమపరిమాణముగాను చేయించటము అవసరము.

ఈ వాహనములను చప్పరములను గాలిలోను యెండవానలకు వదలక ప్రత్యేక వాహనశాల నిర్మించి భద్రపరచుట అవసరము. చిన్న ఆలయములలో ప్రత్యేకము వీటికై స్థలము లేనందున ఇరుకైన ఆలయములోనే భక్తులు నిలుచుటకు తావులేకుండ ఇమిడ్చిపెట్టుట కలదు. దీనికి పరిహారము మనము గమనించవలెను.

స్వామి ఊరేగింపుకు అవసరమైన అంతరంగ సామగ్రి భద్రతలు చామరము, సన్నిధి దివిటీలు (కోలలు) వాహనము మోతగాండ్రు, మేళతాళములు కైంకర్య పరులు అధికారులు (ధర్మకర్తలు, యెగ్జిక్యుటివు ఆఫీసర్లు, మేనేజర్లు) భక్తజనులు విశేష మేళములు, బాణా సంచాలు, భజనలు గుర్రములు ఏనుగులు నగారాలు ఇతర ఆకర్షక పరికరములు బహిరంగ సామగ్రి యనవచ్చును. ఇవన్నియు ప్రభు చిహ్నములు. సర్వేశ్వరునకు వీధిభ్రమణము చేయునప్పుడు రాజోపచారములు అవసరము. మనుష్యులు నిశ్శబ్దముగ నుండవలెను. ముందు వెనుకలో వేదపారాయణము జరుగవలెను. స్వాగత పఠనము హెచ్చరికలు చెప్పబడుటయును యాదృచ్ఛికముగ తమ ఇండ్లకుముందు వేంచేయునట్టి భగవానునకు ప్రతి గృహస్థుడును తన యింటిముందు పూర్ణకుంభములనుంచి స్వాగతముకోరుచు ఫలపుష్పాదులతో నీరాజనమిచ్చి ఆదరించవలెను. తమ వీధుల వెంబడి తమ ఇండ్లకు స్వామి వేంచేయుటకు అవకాశముకాని గృహస్థులు తమకు స్వామి దర్శనము ప్రాప్తించెడి తావున ఫలోపహారాదులు తెచ్చి సమర్పించి హారతి చేయవలెను. కొంత దూరమైనను స్వామితోను భక్త జనులతోను అనుగమనము చేయవలెను. వాహనములు, చప్పరములు బండ్లమీద కట్టి మనుష్యులచే లాగించడము, యెద్దులను గట్టి తోలటము అంత తృప్తికరమైన ఉపచారముకాదు. ఆ దృశ్యము బాగుండదు. ఎంతమాత్రము ఆదరణీయముకాదు. అనేక విధములచేత అట్టి యాచారము గర్హింపదగినది. ఆ వివరములను మనమిక్కడ స్మరించుటకే మనసు వెనుకాడుటచే వ్రాయదలచలేదు.

స్వామి వేంచేయునప్పుడు రాత్రులవేళలందు గృహస్థులు తమ వాకిండ్లలో మంచముల మీదగాని, క్రిందగాని నిద్రించుట, కూర్చొనుట కుర్చీలలో కూర్చుండుట మర్యాదకాదు. లేచి స్వామికి నమస్కరించి, తమ గడపదాటినవెనుక వారి పూర్వస్థానమున యెప్పటివలె ఉండవచ్చును. పగలు నిద్రించే అవసరము లేదుగనుక ఇక్కడ రాత్రి అని అనవలసి వచ్చినది. పగలు కూడా అందరు లేచి భగవంతునికి నమస్కరించవలసినదే. ఇంటిలోపల యే పనులలో ఉండినప్పటికి స్త్రీలు, శిశువులు, వృద్ధులు యెవరైనను స్వామి వేంచేసే మేళతాళాదులు వినినదే బైటకువచ్చి స్వామిని సేవించియే ఆవల కార్యమును చూచుకొనవలయును.

సాధ్యమైనంతవరకు స్వామి యెదుటికి వచ్చి హారతి చేసుకుని అర్చకులు యిచ్చే శఠగోపమును

ప్రసాదమును స్వీకరించుట మంచిది. స్వామిసన్నిధి విడచి తాము ఉన్నచోటుకుగాని ఇంటి గడపలోనికి గాని అర్చకుని రప్పించి శఠగోపము తులసి పూలు యివ్వవలయునని అర్చకులను కోరరాదు. అట్లా యిచ్చుటలో అర్చకులకు అభ్యంతరము లేకపో వచ్చునుగాని శఠగోపమునకు మర్యాద తక్కువ అని నా అభిప్రాయము.

స్వామికి గ్రామోత్సవములను సకాలములో ఊరేగింపు జరుపవలెను. స్వామివార్ల ఈ ఉత్సవయాత్ర ప్రభువు ప్రజాయోగక్షేమవిచారణకై ప్రజలలో సంచరించుట వంటిది. ప్రభువులు యెండలో సంచరించరు. వారు సుకుమార దేవరులు. యెండ లేకపోయినను ఛత్ర చామరములు వారిని పరివారించి ఉపచరించు చుండును. అట్లే మన లౌకిక ప్రభువులకును దేవతలకునుకూడ ప్రభువగు సర్వేశ్వరునకు యెండలో యాత్ర తగదు. పగలు యెండ ముదిరి తీవ్రముగ కాకముందు ఉదయకాల పూజలను మెలవకువగా ముందుగా పూర్తిచేసికొని బయలుదేరవలెను. రాజ చిహ్నములైన ఛత్ర చామరములు యెండకుకూడ వారకములుగ పరివారించవలెను. సాధ్యమైనంత త్వరలో వేంచేపు కావలెను. రాత్రులందు కూడ అపరాత్రి కాకుండా కొంచెము ముందుగా రాత్రి మామూలు కైంకర్యములు పూర్తిచేసుకొని స్వామి వాహనయాత్ర ఆరంభించవలెను. గ్రామమంతయు మారుమూలలలో కూడ స్వామి తిరుగుట న్యాయమేగాని అది చాలకష్టకార్యము. రాజవీధులలో ప్రభువు సంచరించుటకు అనుకూలమైన సదుపాయములు చేకూరగలవు. కాని చిన్నసందులు మారుమూలలు యెంత చక్కజేసినను అచ్చటి పరిశుభ్రత ఉచితముగానుండుట మిక్కిలి కష్టము, అశక్యమని కూడా చెప్పవచ్చును. మన గ్రామములలో రాత్రిగాని పగలుగాని ఉత్సవములు యెంత తొందరపడి ముందుగా ఆరంభము చేసినను ఊరు నాలుగు మూలలకు ఒక్క యిల్లు అయినను విడువకుండా ఎంత తొందరగా పరువెత్తి తిరిగివచ్చినను పగటివేళ అపరాహ్ణము, రాత్రివేళ అరుణోదయము అయ్యే సందర్భములు యెన్నో కలవు. ఈ ఊరేగింపులో చక్కని వాద్యములతో ప్రొద్దుపుచ్చటము సర్వదా సంభవించదు కావున స్వామి ఉత్సవములను సక్రమముగను అపచార విధురముగను, ఆకర్షముగను చేయుటకు గ్రామస్థులందరును ఐకమత్యము చెంది స్వామి తిరువీథులు వేంచేయుపద్ధతిని యాత్రనురాజవీథులతో సరిపడునట్లు ఒక యాత్రాసంస్కరణ పద్ధతి తమ తమ గ్రామములో ప్రవేశపెట్టుట యుక్తమని నా అభిప్రాయము.



# వార్తాలహరి

## దేవాదాయ ధర్మాదాయశాఖ కమీషనర్ శ్రీ లక్ష్మయ్యగారి పర్యటన విశేషాలు

### రాజమండ్రి

ది. 11-11-58 వ తేదీ శ్రీ కమీషనర్‌గారు హైదరాబాద్‌లో బయలుదేరి 12 వ తేదీ ఉదయమునకు రాజమండ్రి చేరారు. ఆనాడు శ్రీ గౌతమీజీవకారుణ్య సంఘంవారి ఆధ్వర్యాన కుష్ఠురోగుల విభాగానికి శంకుస్థాపనం జరిపి, సాయంత్రం శ్రీ రామకృష్ణ సేవాసమితిలో జిల్లా జడ్జిగారి అధ్యక్షతను సమావేశమైన మహాజన సభలో సుమారు 2 గంటలకాలం అనేక ప్రమాణాలతో, దేవాలయఅభివృద్ధులను గూర్చి, అనాథరక్షణవల్ల కలిగే పుణ్యవిశేషములను గురించి మహోపన్యాస మిచ్చారు. ఆంధ్ర ప్రభుత్వంవారు విశేషించి, గౌ॥ దేవాదాయ, ధర్మాదాయ శాఖామాత్యులు శ్రీ అనగాని భగవంతరావు గారు జిల్లా కొక్కటి చొప్పున అనాథ శరణాలయాలను స్థాపించి, సక్రమమైన యాజమాన్యంతో నడిపించడం, ఆలా నడిపించడానికి ఆ జిల్లాలో గల పెద్ద దేవస్థానములనుండి, విశేషమైన నిధిని సేకరించి పోషించడం చేయవలెనని యిచ్చిన ఆదేశాన్ని వివరించి, ప్రజలుకూడా యీ అనాథ సంరక్షణకు పూనుకోవలసినదని శ్రీ కమీషనర్‌గారు ప్రబోధించారు.

### పట్టిసం

ది.13-11-58 తేదీ కొవ్వూరుమీదుగా శ్రీ కమిషనర్ గారు పట్టిసం క్షేత్రానికి విచ్చేశారు. వారివెంట శ్రీ అల్లూరి బాపినీడు M. L. A. గారు పట్టిస క్షేత్రానికి వచ్చారు. ఈ మహాక్షేత్రం అనాదిసిద్ధమైనది. గోదావరిమధ్య చిన్న పర్వతం - దానిమీద ఉద్యానవనం - దేవాలయప్రాకారగోపురములు, సీతారామస్వామివారి ఆలయం - క్షేత్రపాలకుడైన శ్రీ వేణుగోపాలస్వామివారి ఆలయదృశ్యం సహజ ప్రకృతి శోభతో మహావైభవంగా వుంటుంది. శ్రీ వీరభద్రేశ్వరుని దివ్య సన్నిధానానికి నాల్గు దిక్కులందును నాల్గు ద్వారములుంటాయి. అనాదిగా మహాశివరాత్రి ఉత్సవాలకు లక్షలాది ప్రజలు వస్తారు. వేదస్వస్తి వాచక మంగళవాద్యాలు చెలరేగుతుండగా అక్కడికి సమీపంలోవున్న గూటాల, తాళ్ళపూడి, ప్రక్కిలంక వగైరా గ్రామములనుండి పండితులు, పుర ప్రముఖులు, జమీందార్లు అర్చకులు శ్రీ కమీషనర్ గారిని పుష్పమాలాలంకృతులనుచేసి స్వాగత మిచ్చారు.

శ్రీ కమీషనర్ డిప్యూటీ కమీషనర్‌గార్లు దృశ్యాలన్నీచూచి, ప్రాతవాటి మరమ్మత్తుకూ, క్రొత్త కట్టడాల నిర్మాణానికి కావలసిన సూచనలిచ్చి విస్తృతంగా యీ మహాక్షేత్రసముద్ధరణం చేయడానికి శ్రీ అల్లూరి బాపినీడు ప్రభృతులతో ఒక అభివృద్ధి సంఘాన్ని ఏర్పాటు చేయడానికి నిర్ణయించారు.

### తణుకు - పెనుగొండ

ది.14-11-58 న శ్రీ వేంకటేశ్వరస్వామి, శ్రీ కన్యకాపరమేశ్వరీ ఆలయాలను సందర్శించి అక్కడ జరుగుతున్న అభివృద్ధిపనులను సమీక్షించారు. పాలకొల్లు శ్రీ క్షీరరామేశ్వరస్వామివారి ఆలయం చూచి, అక్కడ నిరంతరం జరిగే స్వామి ఆరాధనలు,

పండితగోష్ఠులను ప్రశంసించి అక్కడిప్రజల భక్తి శ్రద్ధలనూ, ఆలయ పరిపాలనా విధానాలను గమనించి తమ సంతోషాన్ని వ్యక్తంచేశారు.

## నరసాపురం

ది.15-11-58 న శ్రీ కమీషనర్‌గారు నరసాపురంలో వున్న సుప్రసిద్ధ దేవాలయాలలో శ్రీ ఎంబెరుమన్నార్ స్వామి, శ్రీ ఆండాళ్ అమ్మవారూ, శ్రీ రామానుజ స్వామివార్లనూ సందర్శించి, దాక్షిణాత్య సంప్రదాయంలో శ్రీ పెరుంబూరుకు ప్రతిగా ఆంధ్రలో యీ మూర్తులలో అఖండ సౌందర్యం మూర్తీభవించి వున్నదని ఆనందించారు. అక్కడజరిగే నిత్యోత్సవం మొదలు అన్ని మహోత్సవాలు చక్కగా నిర్వహింపబడుతున్నవని, ఆలయ ధర్మకర్తలు విన్నవించారు,

సాయంత్రం దేవగ్రామ వాస్తవ్యులు వదాన్యులు, శ్రీ మన్నెం బుల్లితిరుపతిరాయుడుగారు, "శివానంద లహరి" శ్రీ ఆంధ్రకృతిస్వీకరణం ఏర్పాటుచేసి, శ్రీ కమీషనర్‌గారిని అధ్యక్షులుగా ఆహ్వానించగా శ్రీ లక్ష్మయ్యగారు ఆ మహాసభ నలంకరించారు. శ్రీ శివానందలహరి ఆంధ్రానువాద కర్త శ్రీ శిష్ట్లా వెంకటసుబ్బయ్యగారు సన్మానపత్రం సమర్పించి, అధ్యక్షులపై ప్రశంసా పద్యములను చదివారు. పుర ప్రముఖులు, పండితులు - కవులు వేలమంది ఆ మహాసభకు విచ్చేశారు. శ్రీ కమీషనర్‌గారు అధ్యక్ష పీఠంనుంచి ప్రారంభోపన్యాసమిస్తూ యిలా అన్నారు-

"నాకు చిన్ననాటినుంచి పారాయణగ్రంథమై, అమృతప్రాయమైన శ్రీ శంకరుల శివానందలహరికి, శ్రీ శిష్ట్లా వేంకటసుబ్బయ్యగారు ఆంధ్రానువాదం చేయడం, శివభక్తులు, పశ్చిమ గోదావరి ఎండోమెంటు బోర్డు ఏరియా కమిటీ సభ్యులు వదాన్యులు అయిన శ్రీ బుల్లితిరుపతిరాయుడుగారు కృతిస్వీకరణం చెయ్యటం నా కెంతో ఆనందాన్ని కలిగించాయి." కృతిలోని కొన్నిపద్యాలు చదివి వివరిస్తూ, శ్రీకృష్ణ దేవరాయల కవిపండితాస్థాన మర్యాదలనూ, ఆమహా కవుల ప్రతిభతో పోల్చి, నేడు ప్రజాదరణంతో యీ మహోత్సవం అత్యంతప్రాముఖ్యమైనదని, శ్రోతల కానందం కలిగేట్లు గంభీరోపన్యాసం చేశారు. ఆ మహాసభకు విచ్చేసిన పండితులు మరి కొందరు ప్రసంగించారు.

## అంతర్వేది

ది 16-11-58 ఉదయం అధికారవర్గంతో శ్రీ కమీషనర్‌గారు అంతర్వేది మహాక్షేత్రానికి వచ్చారు. అక్కడ క్రొత్తగా విశేష అలంకారాలతో నిర్మితములైన ఆలయ, గోపురప్రాకారాలను చూచి, సంతసించారు. ఇంకా జరుగవలసిన పనులకు ఉత్తరువుల నిచ్చారు. అక్కడ ఆలయ ధర్మకర్తలకునూ అర్చకులకునూ గల వివాదములను దయతో విని ఉభయత్రా న్యాయపరిష్కారం చేస్తామన్నారు. అక్కడి శిధిలావస్థలోనున్న శ్రీ నీలకంఠేశ్వర స్వామివారి ఆలయ పునరుద్ధరణకు ఆవశ్యకాలైన సలహాల నిచ్చారు. అంతర్వేది క్షేత్రం ప్రధాన ధర్మకర్తలు శ్రీ ముప్పర్తి వెంకటరత్నంగారు శ్రీ కమీషనర్ గారికి, వారి పరివారానికి చక్కని అతిథి మర్యాదలు కావించి యీ క్షేత్రముయొక్క అభివృద్ధి వైభవములే తమజీవిత ప్రధానలక్ష్యంగా భావించి, శ్రమించి అధికారుల ఆదరంతో పనులు సాగింతుమని విన్నవించారు.

ఆనాటి సాయంకాలమే రాజమండ్రి, కాకినాడలకు బయలుదేరి అన్నవరం, సింహాచలం, విశాఖపట్టణం వగైరాలు పర్యటించి, 22.11.58 తేదీకి హైదరాబాదు చేరినారు.

ఈవిధంగా స్వయంశ్రద్ధతో అధికారులు ఆయా క్షేత్రముల దర్శించి, అచటి కార్యక్రమాభివృద్ధికై దోహదమొసంగి, తమ అధికారమునుసార్థకమొనర్చుకొన్నచో, తమకు దేశమునకు భగవదనుగ్రహంవల్ల మాంగల్యం కల్గుననుటలో సందేహంలేదు.

## పొన్నూరు

శ్రీ భావనారాయణస్వామి సంస్కృతోన్నత పాఠశాలా నూతనభవనప్రవేశ మహోత్సవము ఆంధ్ర

ప్రదేశ్ దేవాదాయధర్మాదాయ పరిపాలనాశాఖ కమీషనరు శ్రీ పైడి లక్ష్మయ్య, బి. ఏ. బి. యల్. గారిచే ప్రారంభించుట.

17-12.58 తేదీ బుధవారం ఉదయం 8 గంటలకు శ్రీ కమీషనరువారు సపరివారముగ పాఠశాలకు విచ్చేసిరి. పాఠశాల ముఖద్వారమువద్ద దేవస్థానం వంశపారంపర్య ధర్మకర్తలు శ్రీ రాజా వాసిరెడ్డి శ్రీ రామభానుభూపాల్‌గారును, మేనేజర్ శ్రీ పద్మనాభచౌదరిగారును శ్రీ కమిషనరువారికి స్వాగతమొసంగిరి.

పాఠశాలా ప్రాంగణమున నిర్మింపబడి చక్కగ అలంకరింపబడిన పందిరియందు సభాసమావేశము జరుపబడెను. స్వస్తివాచనముతోడను విద్యార్థినుల దైవప్రార్థనతోడను సభ ప్రారంభమయ్యెను. సభకు శ్రీ ఆవుల గోపాల కృష్ణమూర్తి, యం. ఏ., యల్. యల్. బి. గారు అధ్యక్షత వహించిరి. దేవస్థానం ధర్మకర్తగారు శ్రీ కమీషనరు లక్ష్మయ్యవారికి స్వాగతపత్రమును సమర్పించిరి. పాఠశాల ఉపాధ్యాయుల తరఫున హెడ్మాష్టరు వై. గోపీచంద్ బి. ఏ. బి. ఇడి. గారును, శ్రీ ముళ్ళపూడి నారాయణశాస్త్రిగారును, విద్యార్థుల తరపున బొద్దులూరు నారాయణరావుగారును, శ్రీ లక్ష్మయ్యగార్కి స్వాగత పత్రములను సమర్పించిరి. సభ్యులకును, అధ్యక్షులకును, శ్రీ కొండవీటి వెంకటకవిగారు స్వాగత వచనములను వచించిరి.

పిమ్మట కమీషనర్ శ్రీ లక్ష్మయ్యగారిచే నూతన భవన ప్రవేశ ప్రారంభోత్సవము చేయబడినది. అధ్యక్షులు, శ్రీ కమిషనరువారు, శ్రీ దాసరి శ్రీమన్నారాయణచౌదిరి బి.ఏ., బి.ఎల్. గారు ఈ సందర్భమున బాలబాలికలకు శ్రీ భావనారాయణస్వామివారి ప్రసాదమును అల్పాహారముగా పంచిపెట్టిరి.

అనంతరము కమిషనరు శ్రీ పైడి లక్ష్మయ్యగారు దేవాలయములు - హిందూమత ప్రాశస్త్యము - భారతీయ కళోద్ధరణకు దేవాలయములద్వారా చేయవలసిన పనులు మున్నగు ననేక విషయములను గూర్చి జనరంజకముగ గంభీరోపన్యాసము నొసంగిరి.

ఈ సందర్భముననే జీర్ణదేవాలయోద్ధరణము గావించుటకు ప్రయత్నించిరిగాని భారతీయ సంస్కృతి పునరుద్ధరింపబడదనియు, భారతజాతి భారతదేశము దేశాంతరములందు గౌరవింపబడుటకు కారణము విశిష్టమగు భారతీయ సంస్కృతియే యనియు, అట్టి సంస్కృతిని పరిరక్షించుట ప్రతి భారతీయుని కర్తవ్యమనియు, భారతీయ సంస్కృతీ రక్షణమునకు భారతీయ దేవాలయములు పునాదులవంటివి గనుక వాటి నుద్ధరించినగాని భారతీయ సంస్కృతిని రక్షింప లేమని, అందుకనియే దేవాలయ ధర్మాదాయ పరిపాలనాశాఖ జీర్ణ దేవాలయోద్ధరణము నొనర్చుటకు ప్రయత్నించుచున్నదనియు, ఈ ప్రయత్నమున ప్రజల సహకారము విశేషముగ అవసరమనియు, జీర్ణ దేవాలయముల నుద్ధరించి యాత్రికులకు వలయు సౌకర్యముల నొనగూర్చిన దేవాలయములకు రాబడి కూడ హెచ్చుగుననియు ఇందుకు తార్కాణము శ్రీ తిరుమల తిరుపతి క్షేత్రమనియు, ఇట్లే శ్రీశైల క్షేత్రమునుకూడ పునరుద్ధరణముచేసి, యాత్రికులకు వలయు సౌకర్యములను సమకూర్చిన యావద్భారత దేశమునుండి యాత్రికులువచ్చి స్వామి దర్శన భాగ్యము నొందగలరనియు ఇట్టి మహత్కార్యములకు ప్రజా సహకార మెంతయు ఆవశ్యకమనియు వాక్రుచ్చిరి.

పిమ్మట దేవాలయములద్వారా పూర్వమునుండియు విద్యాలయ నిర్వహణము జరుగుచుండెడిదనియు, అట్టి సంప్రదాయమును నిలబెట్టు సంస్కృత కళాశాలను, ఉన్నత పాఠశాలను చక్కగ నిర్వహించుచున్న శ్రీ భావనారాయణస్వామి దేవస్థానం ధర్మకర్తలను, పాలకులను అభినందించిరి.

అనంతరము శ్రీ దాసరి శ్రీమన్నారాయణచౌదరి బి.ఏ. బి.ఎల్. గారు దేవాలయములు మతమునకు తోడ్పడు పద్ధతిని, దేవాలయముల ద్వారా హిందూ మతమును సర్వజనమునకును అందజేయగలుగుట

సులభమనియు, దేవాలయముల పరిరక్షణము పోషణము, హిందూ మతమును రక్షించుటకొనుటయే యనియు చక్కగ నుపన్యసించిరి.

తరువాతను కళాశాలాపండితులు శ్రీ ధర్మాల సుబ్బారాయ శాస్త్రిగారు, దేవాలయములకును విద్యాలయములకును గల అవినాభావ సంబంధమును వివరించుచు, విద్యాలయములను పోషించుట దేవాలయముల ప్రధాన కర్తవ్యమనియు నుపన్యసించిరి.

పిదప అధ్యక్షులు శ్రీ గోపాల కృష్ణమూర్తిగారు మాట్లాడుచు విజ్ఞానము వెదజల్లుటకును, సంఘములోని దురాచారములు రూపుమాపుటకును, దేవాలయములు సాధనములు కావలెననియు, సంఘములోని దురాచారములు రూపుమాసినగాని విజ్ఞానము సంస్కృతి యభివృద్ధి నొందజాలవనియు, అందుకు దేవాలయములు యెంతయు కృషిసలుపవలయు ననియు పలికిరి. పిమ్మట కళాశాలాధ్యక్షుల వందన సమర్పణముతో సభ సమాప్తమయ్యెను.



# श्रीमद्गांधी गीता

*रचयितारः*

**श्री केशिराजु वेंकट नृसिंह अप्पारायाः**

[भोः सहृदयाः ! अस्मिन् कलिकाले कराले पामराणा मल्पबुद्धीनां मुमुक्षावतां धर्मार्थकाममोक्षाख्य चतुर्विध पुरुषार्थप्राप्तये सत्स्वपि प्राचीन परमर्षभिः उपदिष्टेषु भक्तियोगज्ञान आगमोपासनादि रहस्य बोधेषु प्रकृतकालानुसारेण सुलभतरोपायः अन्यः कश्चन आवश्यकः इति प्रतिभाति। आधुनिककालानुगुण्येन बंधहेतवोपि राजकीय, सामाजिक, धार्मिक विषयानुगुण्येन अभिनवा एव। एतेषां निवृत्तिपूर्वक स्वातंत्र्यस्वाराज्यप्राप्तिपूर्वक महानंद प्राप्तये उपाया अपि नवीना एव आवश्यकत्वेन चिंतनीयाः। तदधुना प्रथमतः भौतिक राजकीय स्वातंत्र्य प्राप्तये साधूनां परित्राणाय दुष्कृतां विनाशाय सनातन स्वातंत्र्य धर्म संस्थापनाय भगवता परमकारुणिकेन गांधीमहात्म स्वरूपेण अवतीर्य परमयोग्यं श्वेतवाहनं अमूल्यरत्नं जवाहिरं सकलाम्नायादि सनातनसारस्वतसारं यदुपदिदेश तदभिनव भगवद्गीतारूपेण सर्वेषां भारतीयाना मज्ञानध्वांत निवृत्तये दिव्यज्ञानप्राप्तये च निवेद्यते "श्रीमद्गांधी गी" तेति नाम्ना। एतस्य श्रीकृष्णार्जुन संवादान्यून गांधी नेहू संवादस्य गांधी गीता रूपेण ग्रथनं अतीव मनोहरं प्रसादगुणभूयिष्ठं सर्वेषां उपदेशावहं च। तत्र भवंतः श्रीमंतः गीर्वाणांग्लांध्रहिंदीभाषासु निष्णाताः संस्कृत साहित्य व्याकरण वेदान्त शास्त्र गम्भीरपारावारपारंगता प्राचीन सिद्धांतान् आधुनिक उपयोगार्हत्वेन योजनाया मसदृश प्रावीण्य मुपगताः श्रीमंतः केशिराजु वेंकट नृसिंह अप्पाराय महाशयाः सुप्रसिद्ध कोव्वूरु आंध्र गीर्वाण विद्यापीठाध्यक्षाः। एते अभिनव वेदव्यासा एव। तैरनुगृहीतेयं गांधी गीता सहृदय हृदयानां मोदाय आराधना पत्रिकायां प्रकाशनमपि भगवतो आराधनैवेति मन्यामहे। **—संपादकाः**]

## विषादयोगः

**जार्जि भूपः उवाच :-**

धार्मिके भारते देशे परस्परजिगीषया।
सन्नद्धाः भारतीयाश्च मामकाः कि मकुर्वत॥ १

**क्रिप्स दूतः उवाच :-**

दृष्ट्वा भारत वीरां स्ता नहिंसासंगरोद्यतान्।
अमेरी सचिव स्तूर्णं वेवेल् प्रभु मुवाच ह॥ २

पश्यैतां भारतीयानां सत्याग्रह वरूथिनीं।
व्यूढां 'आजाद्' मुनाम्नाऽसद्धेदोपायविरोधिना॥ ३

अत्र वीरा महाधीराः पटेल्-नेहू समा युधि।
खान् भ्रातरौ टंगुट्टूरिः कृपलानिः सरोजिनी॥ ४

प्रफुल्लचन्द्रः पट्टाभिः रंगा गोविंदवल्लभौ।
हरिकृष्णः कामराजो मौलंकर दिवाकरौ॥ ५

बालगंगाधरः खेरः केलप्पन्नसफाल्यपि।
जयप्रकाशादयश्च सर्व एव महौजसः॥ ६

अस्माकंतु सहाया येता न्निबोध प्रभूत्तम।
स्तंभाः साम्राज्य सौधस्य संज्ञार्थं तान् ब्रवीमि ते॥ ७

भवान् प्रांताधिपाः सर्वे देशीयक्षितिपालकाः।
सांप्रदायिक संस्थाश्च सैन्यं राजप्रसेविनः॥ ८

अन्ये च बहवः संति राजभक्तिपरायणाः।
नानास्वार्थैः समायुक्ताः सर्वे दास्यंति नो बलम्॥ ९

अपर्याप्तं तदस्माकं बलं सैन्याभिरक्षितं ।
पर्याप्तं त्विदमेतेषां बलं धर्माभिरक्षितं ॥ १०

तस्मात् सैन्य बले नैतान् युपगत् सर्वतः स्थितान् ।
कारागार विनिक्षिप्तान् कृत्वा रक्षतु शासनम् ॥ ११

तस्य संजनयन् हर्ष मांग्लेयो वेवेल प्रभुः ।
ददौ भारत रक्षापदेशेनाज्ञां निरंकुशां ॥ १२

तच्छ्रुत्वा सैनिकाः सर्वे बभूवुः प्रोद्यतायुधाः ।
प्रभुभक्ताः सुसन्नद्धाः संभ्रमाविष्टमानसाः ॥ १३

ततः स्वतंत्रता शांति सत्याहिंसा सिताश्वके ।
स्यंदने संस्थितौ गांधी नेहू वर्यौ प्रदध्मतुः ॥ १४

सत्याग्रह सुशंखौ 'भोः भारतं त्यज्यता' मिति ।
पटेल दध्मौ महाशंखं 'भारतंत्यज्यता' मिति ॥ १५

श्रीराजेंद्रप्रसादश्च किद्वाय् जग्जीवनावपि ।
प्रदध्मुः स्वीयशंखान् 'भोःभारतं त्यज्यता मिति॥ १६

पट्टाभिश्च महाधीमान् आजादो धैर्यमन्दरः ।
खान् भ्रातरौ सदाचारौ प्रकाशश्चांध्रकेसरी ॥ १७

जयप्रकाशादयश्च सर्वशः पृथिवीपते ।
भारतं त्यज्यतां भो भो इति दध्मुः पृथक् पृथक्॥ १८

स घोष आंग्लपुत्राणां हृदयानि व्यदारयत् ।
नभश्च पृथिवीं चैव तुमुलो व्यनुनादयन् ॥ १९

अथ व्यवस्थितान् दृष्ट्वा सर्वान् सर्वोदयप्रियं ।
जिज्ञासया पंडितोऽपि शिष्यो गांधि मभाषत ॥ २०

(सशेषम्)

---

# मनुष्यः – महर्षिः

आंध्रमूल
*रचयितारः*
**वड्लमूडि गोपालकृष्णार्यः**

संस्कृतीकरण
*अनुवादकाः*
???

**मनुष्यः –**

हे महात्मन् !
हे महर्षे !
का तमिस्रा ?
किन्नु ज्योतिः ?
कोनु जीवः ?
कोनु मृत्युः ?
किन्नु पुण्यम् ?
किन्नु पापम् ?
कोनु नरकः ?
कोनु नाकः ?
हे महात्मन् !

किन्नु सत्यम् ?
किन्त्वसत्यम् ?
किन्नु नित्यम् ?
किन्त्वनित्यम् ?
किं तदेकम् ?
किं त्वनेकम् ?
कोनु हेतुः ?

किन्नु कार्यम् ?
हे महात्मन् !

किन्नु शुक्लम् ?
किन्नु कृष्णम् ?
किन्नु गानम् ?
किन्नु मौनम् ?
किं मदीयम् ?
किं त्वदीयम् ?
कानु नीतिः ?
किन्नु नेति ?
हे महात्मन् !

का ह्यहिंसा ?
कानु हिंसा ?
किन्नु कष्टम् ?
किन्नु सौख्यम् ?
कोनु लाभः ?
कोन्वलाभः ?
किन्नु श्रेयः ?
किन्नु दुरितम् ?
हे महात्मन् !

ह्यश्च स्वप्नः
अद्य सत्यम्
अद्य खेदः
श्वस्तु रागः
एक कांतिः
एक शांतिः
हे महर्षे !
हे महात्मन् !

[आन्ध्रमूल रचयितारः
**श्री श्रीरंगं श्रीनिवासरायाः**]

**महर्षिः –**

भो मनुष्य !
भो मनीषिन् !
तद्धि ज्योतिः
इदम् तु तमः
तद्धि जीवित
मिदम् मृत्युः
तद्धि पुण्यम्
इदम् पापम्
तद्धि नाकः
अयम् नरकः
भो मनुष्य !
भो मनीषिन् !

तद्धि सत्यम्
इद मसत्यम्
तद्धि नित्यम्
इद मनित्यम्
तदेवैकम्
इद मनेकम्
तद्धि कारण
मिदम् कार्यम्
भो मनुष्य !
भो मनीषिन् !

**मनुष्यः –**

तद्धि किं किं ?
इदम् किं किं ?
अपि हि वाच्यम् ?
तत्त्ववाच्यम् ?
अपि हि बोध्यम् ?

तत्त्वबोध्यम् ?
हे महर्षे !
हे महात्मन् !

**महर्षिः –**

ब्रह्म नामक
मेव ज्योतिः
ब्रह्म भिन्नम्
तम स्संज्ञम्
ब्रह्मणैक्यम्
प्राप्य वर्तन
मेव जीवित
मुच्यते भुवि
ब्रह्मणैक्यम्
यो न लभते
तस्य जीवित
मेव मरणम्
ब्रह्मणैक्य
प्राप्ति रुक्ता
पुण्य नाम्ना
भूतलेऽस्मिन्
ब्रह्मणैक्य
प्राप्ति हीनम्
जीवितं भोः
पाप संज्ञम्
ब्रह्मणैक्यम्
प्राप्य पूर्ण
ज्ञानि जीवित
मेव नाकः
ब्रह्मणैक्यम्
यो न लभते
तस्य जीवित
मेव नरकः
भो मनुष्य !
भो मनीषिन् !

ब्रह्म सत्यम्
तद्विभिन्नम्
खल्वसत्यम्
ब्रह्म नित्यम्
तद्विभिन्नम्
खल्वनित्यम्
ब्रह्मचैकम्
तद्विभिन्नम्
खल्वनेकम्
ब्रह्महेतुः
ब्रह्म भिन्नम्
यत्समस्तम्
तद्धि कार्यम्
भो मनुष्य !
भो मनीषिन् !

(सशेषम्)



# THE RAMALINGESVARA TEMPLE

## PALAKOLLU

*Dr. M. Rama Rao*

Palakollu, otherwise known as Kshirarama, is one of the celebrated *Pancharamas* and a famous centre of Saivite pilgrimage in Andhradesa. This town is situated in the West Godavary district of Andhra Pradesh and there is a railway station of that name on the Nidadavolu-Narsapuram branch line of the Southern Railway. Almost in the middle of the town and surrounded by houses on all sides there is a fine temple in this village dedicated to Siva, under the name of Ramalingesvara.

*History:* The origin and the date of the building of the temple are not known definitely. There are inscriptions in this temple ranging in dates from 1136-1624 A.D. The general plan of the temple, the style of the few sculptures still remaining unspoiled and the architectural style of the body and vimana of the temple are similar to those of the Bhimesvara temples of Draksharama and Chalukya-Bhimavaram. Its construction may therefore be ascribed to the ninth century A. D. It is very probable that the temples of the five aramas were built by the well known Vengi Chalukyan King, Chalukya-Bhima. The legendary origin of this temple is found in the Bhimesvarapuranamu of the famous Telugu poet, Srinatha. It seems that after defeating and destroying the Tripuras, Siva found a big linga worshipped by the demons. Siva broke it into five pieces which were set up later on at the five *aramas*. One of these pieces was set up at the village of Balakota *alias* Kshirarama by Rama and became famous as Ramalingesvara. Originally the temple must have had two enclosures as the temples of Draksharama and Bhimavaram but now the outer enclosure is covered by dwelling houses and shops. Only the inner enclosure remains. Inscriptions refer to a natyamantapa and Sanivaramantapa which must have existed in the outer enclosure. There is a reference also to an eastern entrance.

*Plan of the temple:* There is a tall gopura of comparatively recent construction surmounting an entrance in a wall running north-south. Beyond this is a rectangular courtyard with rooms and dwellings of modern construction at its northern and southern ends. There is a wall of recent construction to the west with an entrance. Beyond this entrance is a narrow inner enclosure with five shrines in its centre. There is a narrow pillared verandah all along the walls in the inner enclosure. Immediately beyond the entrance is a narrow pillared mantapa before the shrines. The southern and central parts of this mantapa have been coated over by coloured cement and all the fine sculptures on the pillars are lost. Only the northern part is left uncemented. Beyond this mantapa are five shrines, the central one being that of Ramalingesvara.

*Walls of the temples:* The walls of the temples are plain and devoid of sculpture. They are decorated with pilasters. Above these pilasters is a row of rafter ends and above is a plain moulded cornice. There are entrances in the northern and southern walls letting in plenty of light and air into the *sanctum*. One of the southern shrines contains niches in the northern, western and southern walls.

*The base:* The bases of the shrines are simple and cemented. They consist of a wide band at the bottom, a moulding of three faces above it, two narrow flat bands above, another broad band, a narrow recess and a broad band at the top.

*Vimanas:* The vimana of one of the northern shrines has a row of salas and karnakudus. The crowning member is surmounted by a kirtimukha. The top consists of a series concentric lotuses and a Kalasa in the centre.



Vimana of a northern shrine



Vimana of southern shrine

The vimana of one of the southern shrines has a series of salas and karnakudus in two rows and the flat band above them has nandis at the four corners. There is a figure of Umamahesvara in the centre.

The vimana of the main shrine is decorated with salas and karnakudus and contains plenty of figure sculpture covered by successive cuts of chunam.



Vimana of the main shrine

*Sculptures:* The northern part of the mukhamantapa contains twelve pillars on which are to be found many sculpures. Of these the following sculptures are important:

1. *Umamahesvara:* Siva in this combination is seated on a *bhadrapitha* with the left leg folded and the right hanging. He has four arms, the upper right holding parasu, the upper left holding mriga, the lower right in abhaya and the lower left going round the back of devi. The devi sits on the folded left leg of Siva with her own legs resting on the seat. She holds a

mirror in her left hand and passes the right round the back of Siva.



Umamahesvar

2. *Ardhanarisvara :* This deity is seated with the left leg folded and resting on the seat and the right hanging. There is



Ardhanarisvara

one full round breast on the left side of the chest. Of the four arms of this deity, the upper right holds parasu and the upper left holds nilotpala. The lower right hand is in abhaya and the lower left in varada.

3. *Gajasurasamharamurti :* This deity stands in tribhanga on the head of an elephant. The skin of the animal spreads behind like a *prabha* with the four legs



Gajasurasamharamurti

spreading to the sides. The tail spreads out at the top. Siva has four arms, the upper right holding damaru, the upper left holding a mriga, the lower right kept in abhaya and the lower left kept in varada.

4. *Brahma :* This deity has three heads and four arms. The upper right holds pasa and the upper left a kamandalu. The lower right holds another vessel and the lower left is kept in varada.



Brahma

5. *Vrishabharudhamurthi:* Siva and Parvati riding the bull.

6. *Nataraja:* Siva with four hands dancing, resting his legs on apasmarapurusha.



Nataraja

7. *A woman:* Standing in tribhanga carrying a bow in the left hand, this woman crosses her legs. A boy kneeling to her right picks up something in the left foot of the woman.



Woman with bow

8. *Dancer:* This woman is in a fine dance pose.



Woman in a fine dance pose

# THE SIX VEDANGAS

*Sri D. Viswanadha Sastry*

The Vedic Literature is followed by the Sutra Literature to preserve the correct recitation and understanding of the sacred text. The whole body of this literature is divided into six parts called Vedangas traditionally. They are Siksha (phonetics), Chandas (metre) Vyakarana (Grammar), Nirukta (etemology) Kalpa (religious practice) and Jyotisha (astronomy). They are called Vedangas because there is a very close similarity between the limbs of man and the angas of Veda.

छंद: पादौतु वेदस्य, हस्त: कल्पोथ कथ्यते ।
ज्योतिषामयनं चक्षु: निरुक्तं श्रोत्र मुच्यते ॥
शिक्षा घ्राणंतु वेदस्य मुखं व्याकरणं मतं ।
तस्मा त्सांग मधीतैव ब्रह्मलोके महीयते ॥

The above Sloka gives a detailed description of the Vedangas and their purpose. Metre is regarded as the feet of the Veda; the Kalpa is looked upon as the hand; Astronomy is just like the eye; Etimology is as the ear and phonetics is as the nose. Grammar is given an important place by being regarded as an essential part viz. the face. Siksha, Chandas, Vyakarana and Nirukta deal with the correct recitation of the Veda. The Kalpa and Jyotisha deal with the religious practices therein and their performance at such and such a time.

Let us take one by one and explain their purpose in the Vedic study.

Siksha (phonetics) helps to keep the sacred text as it is. It deals with the euphonic combination of words in the Vedas and their correct recitation. Though some books are mentioned bearing the name of Siksha only the Pratisakhya Sutras deal with the correct interpretation of Vedas. Each Veda must have been in the possession of a Pratisakhya Sutra of its own. The Rigveda has got Pratisakhya Sutras of its own. Athervaveda has got one and Yazurveda two. All these books are connected with the Samhita text. They deal with the accents, euphonic combinations of words and the correct recitations of the text.

The Nirukta of Yaska has survived the onslaught of time. Yaska explains the difficult words in the Veda and gives their derivation and explained their meanings. To the student of the Vedas, Nirukta is an essential thing to know the correct meaning of the Vedas.

The Chandas deals with the Metres of the Veda. But no book is availabe now. Pingala's Chandas Sastra gives some Vedic Metres but deals more with the classical metres. But we know only some such as Gayatri etc.

Astronomy helps to fix the time for the performance of such a Yaga on such a day and so on. But no book of ancient times is available now.

The Kalpa Sutra is composed of Srauta Sutras, Grhya Sutras and Dharma Sutras. The Srauta Sutras explain the ritual side of the Veda. They treat of the performance of sacrifices etc. The Grhya Sutras deal with the duties of a house-holder from birth to the grave. And the Dharma Sutras give the law of the day.

Thus without the knowledge of these auxiliaries one cannot understand and interpret the Vedas correctly. One must be thorough with all these angas before he takes up the study of Veda. Therefore the little Vedanga is appropriate for all these sutras.

---

# A WORD ABOUT BEAUTY

*Sri P. Venkateswarlu, M. A.*

Some people chat about Beauty; some gossip about it; some speak of it; some talk of it; and some others write on it. In fact, we all know of it; yet we do not know all about it.

It has a circle of charm about it; a ring of mysticism around it. Yes, it is a riddle; a puzzle; and an enigma.

Is that why the opinions differ and views vary? Some have defined Beauty as Truth; some as Love; some as Perfection; some as Culture; some as Good Character and some others as Attraction-Oh! endless and varied!

All these remind me of the story "The Elephant and the Blind-men." Beauty is all of them no doubt,-Truth, Love, Perfection, Culture, Good Character and Attraction-Yes, all of them I should say, but something more; Beauty is God-God Himself.

God is 'Ananda'-Anando Brahmeti Vyajanath'-say the Vedas. 'Ananda is absolute bliss-bliss, unconditioned by time, space and causation. 'Brahmananda', 'Kaivalya', 'Nirvana' and the like are synonymous terms.

So ordinarily when we talk of Beauty, it only means the physical beauty. Supposing we see milky moon, we at once exclaim 'how beautiful She is'! because it gives us an iota of 'Ananda'; when we hear melodious music, we cannot but enjoy the rapturous delight-only a tittle of 'Ananda'. Similarly we feel when we see a lovely flower, a pleasant scenery, a pretty woman, or eat a delicious dish or smell a sweet scent; this 'Ananda' that we get from a person, thing or an object relates to the physical features like 'Sabda', 'Sparsa', 'Rupa', 'Rasa', and 'Gandha'. Therefore it is called 'Bhautikananda' or what we call the 'Physical Beauty'.

Is there any other kind than this? Yes, there are, namely 'Devagandharvananda', 'Devatananda', and 'Prajapathi Brahma-

nanda' and the like. Supposing we see the flight of a flock of cranes with their snow-white wings shining against the background of the sky covered with dark, inky rain-clouds; we fall into the super-conscious state or 'Samadhi' like Sri Ramakrishna Paramahamsa. It is called 'Atmananda' or more commonly the spiritual Beauty. This is the highest of all other kinds that we can conceive of. It relates to the psychic plane. Yes we have to transcend the physical plane-then the mental, then the vital and at last we reach the psychic plane.

Now comparatively speaking, the former is transitory and temporary as it is 'conditioned'; the latter is eternal and everlasting as it is 'unconditioned' and is the result of ever-dwelling in God; that is experienced through senses and this, by the mind that is pure, steady and one-pointed entering into the 'Samadhik State'.

Now what is life after all? It is a quest for beauty- a beauty of the latter kind. Everyone wishes that he should lie on a bed of roses; everybody likes to roll in luxury; and every one wants to be in a paradise for ever. That is why we are moving heaven and earth, to possess a house, a car, a radio and the like; all the discoveries and the inventions that the Science has bestowed upon us are primarily meant for giving us happiness and making our lives flow as smoothly as the Ganges. All our efforts and attempts, struggles and strifes are mainly propelled by an ulterior motive, that is, 'Ananda'.

But are these, I ask, capable of making us find that Beauty? Of course, no. The reason is that they are finite; hence what they give us is also 'conditioned' which is to say ephemeral and momentary; it is futile, nay, peurile to expect an everlasting joy and bliss from this temporal and mundane things; it is living in a fool's paradise if we hope either to unlock the Elysian regions or to derive an eternal joy from them –this 'Samsara' that is a mixture of opposites like pain and pleasure, truth and untruth, goodness and badness and richness and poverty. Where there is one, the other immediately follows it. I mean if we seek after pleasure, pain to be sure is already present there wreathed in smiles welcoming you with open arms. Yes, a fact it is that they are inter-related like flower and fruit and seed and tree; we are the jig-saw and they are the players.

Now we know for certain that these do not give us what we want; but they can help in finding it out. Rather they will heckle and make hell of us if we get caught in their meshes. The alternative is the other method.

This is an arduous process no doubt, but worth striving for. It consists in purging the mind of all its impurities like the Vasanas through 'Yama' (Restraint) and 'Niyama' (observances); controlling its 'Vikshepa Sakti' through 'Pratyahara'; and focussing it through 'Dhyana' and entering into constant meditation called 'Dharana'. Thus the state of Samadhi is reached in which our individual consciousness dissolves itself in the Universal Divine Consciousness.

This is the only way of fulfilling our life- a quest for beauty. If I were Keats, I would certainly tell the World

> Beauty is God, God Beauty
> That is all ye should know in piety;

Yes, Beauty and Life are twin sisters–inseparable.

The sooner it is realised, the better. ★

# శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య కళాశాల

## శ్రీ వైఖానస పాంచరాత్ర ఆగమ పరీక్షలు - 1959

1958 వ సంవత్సరం మామూలు ప్రకారం పై ఆగమ ప్రవేశ, వర, ప్రవర, పరీక్షలను, శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ కాలేజివారు, తిరుపతి, విజయవాడ కేంద్రములలో జరుపుదురు.

పరీక్షలు ఏప్రెల్ మూడవవారములో జరుపబడును. తేదీలు దరఖాస్తుదారులకు తరువాత తెలియపరుపబడును. దరఖాస్తు ఫారములకును, పాఠ్య వివరములకును ఈ దిగువ చిరునామాకు వ్రాసి పొందవచ్చును.

దరఖాస్తులు మార్చి ఒకటవ తేదీ వరకు అంగీకరింపబడును.

**S. NAGAIAH,**
*Principal,*
S. V. O. College, Tirupati.

#  ĀRĀDHANA

( RELIGIOUS MONTHLY MAGAZINE )

VOL. V MARCH, 1959 NO. 3



PUBLICATION OFFICE:

**ĀRĀDHANA**

OFFICE OF THE COMMISSIONER
*Hindu Religious & Charitable Endowments*
*( Administration ) Department, ( Andhra Pradesh )*
**HIMAYATNAGAR, HYDERABAD.**

**ANNUAL SUBSCRIPTION Rs. 12/-**

**PER MONTHLY COPY Re. 1/-**

# విషయసూచిక

## తెలుగు



## संस्कृतम्



## ENGLISH



★

ముఖచిత్రం : హరిహరనాథ

చిత్రకారుడు : శ్రీ కందాళ సత్యనారాయణ

"ఆనందరూప మమృతం య ద్విభాతి"




సంపుటం 5 | మార్చి, 1959 | సంచిక 3

विश्वानि देव सवितर्दुरितानि परासुव
यद्भद्रं तन्न आ सुव ॥

ऋ० ५।८२।५॥

దురితాలను ఎపుడును మా
దరిని జేరనివ్వకుమా !
పరమభద్ర పుంజం మా
పరం కాగ నివ్వుమా !

विश्वतश्चक्षुरुत विश्वतोमुखो विश्वतोबाहुरुत विश्वतस्पात् ।
सं बाहुभ्यां धमति सं पतत्रै र्द्यावाभूमी जनयन् देव एकः ॥

ऋ० १०।८१।३॥

ఎవడు విశ్వచక్షుస్సో ! ఎవడు విశ్వతోముఖుడో !
ఎవడు విశ్వసద్బాహుడో ! ఎవడు విశ్వసత్పాదుడో !
అతను దివ్యగుణయుక్తుడు అతనే ప్రభు వేకైకుడు
భువి దివి లోకా లన్నిటి పుట్టించే ప్రభువు అతను
పెంచే ప్రభువూ మరి, గిట్టించే ప్రభువూ అతనే
ఎవరి కర్మఫలం వారి కిచ్చే పరమేశు డతను.

"కళా కృష్ణులు"



# పుట్టినరోజు పండుగ

దారుకావనంలో తపస్సుచేస్తున్న మహర్షులముందు ఈశ్వరుడు వికృతవేషంతో దిగంబరుడై నవ్వుతూ, ఏడుస్తూ, అరుస్తూ వికట కృత్యాలను చేశాడు. తత్ఫలితంగా జరిగిన తమ తపోభంగానికి కినిసిన మహర్షులు తమ యెదుట నున్న వెర్రివాడు ఈశ్వరుడని గుర్తించక అనేక శాపాలు పెట్టారు. వారి శాపాల్లో ఏ ఒక్కటైనా ఈశ్వరుడికి తగులలేదు. అతని వివస్త్రతను సహించనేరని మహర్షి బృందం "నీవు వస్త్రధారణ చెయ్యకపోతే నీ లింగం పతితం అవుతుంది" అని చివరిసారిగా శపించింది. అది మీరేకాదు, మహేశ్వరా- బ్రహ్మ సైతం చెయ్యలేనిపని అని ఈశ్వరుడు తన రూపాన్ని ఉపసంహరించి కేవల లింగాకృతిగా వారి యెదుట ప్రత్యక్షంకాగా సంతానోత్పత్తిశక్తిరహితమైన ప్రపంచం తల్లడిల్లింది. బ్రహ్మ మూలంగా— ఆ లింగస్వరూపుడు మహేశ్వరుడని మహర్షులు గ్రహించి, భక్తిశ్రద్ధలతో కొల్వగా శివుడనుగ్రహించాడు. ఆ లింగ స్వరూపావతరణ జరిగిన రోజే మహాశివరాత్రి- అనిగాని- బ్రహ్మ విష్ణువులు ఒకరి గొప్పతనాన్ని ఒకరు అంగీకరించక తగవులాడుకుంటున్నప్పుడు వారి ముందు దివ్య తేజోమయమైన ఒక మహాలింగం ఆవిర్భవించింది. ఆ లింగం ఆద్యంతాలను తెల్సుకోవాలనే పట్టుదలతో బ్రహ్మ విష్ణువులు తిరిగి తిరిగి తెల్సుకోలేక వేసారి, మా ఇంటే గొప్పవాడు లింగస్వరూపుడైన ఈశ్వరుడొకడున్నాడని గ్రహించారు. ఆ దివ్య తేజోమయమైన లింగం ఆవిర్భవించిన రోజే మహాశివరాత్రి- అనిగాని—బ్రహ్మ విష్ణు మహేశ్వరుల్లో ఎవరు గొప్పవారని ఋషులు కొందరు తర్జన భర్జనలు పడి, తుదకు భృగు మహర్షిని ఒక నిర్ణయంచేసి చెప్పవలసిందని అర్థించారు. అప్పుడు భృగువు మొదట బ్రహ్మవద్దకు వెళ్ళగా అతడు మర్యాదచెయ్యకపోయినా తనకుతానై ఉదాసీనుడయ్యాడు. అందుకు క్రుద్ధుడైన బ్రహ్మను "నీవు రజోగుణప్రధానుడవు. నీకు పూజార్హత లేదు" అని శపించి, భృగువు ఈశ్వరుని వద్దకు రాగా, ఆ సమయంలో శివపార్వతులు క్రీడిస్తున్నారు. ముందు తెలుపకుండానే లోపలికి వచ్చినందుకు ఆగ్రహించిన ఈశ్వరుణ్ణి "నీవు తమోగుణ ప్రధానుడవు, నీ లింగానికే గాని నీ రూపానికి పూజార్హత లే"దని శాపమిచ్చాడు భృగువు. ఆ లింగ పూజా ప్రారంభ దినమే- ఆ దినమే- మహాశివరాత్రి అనిగాని, వివిధాలైన కథలను, గాథలను బ్రహ్మాండపురాణ వేంకటాచల మాహాత్మ్యాది గ్రంథాలు వివరించవచ్చు. ఈషణత్రయంతోను, షడ్గుణచోరత్వంతోను నిండిన బాహ్యప్రపంచంలో ఉన్న మృత్ప్రాయమై అశాశ్వతమైన లింగానికి ప్రాధాన్యమివ్వక ఆత్మలింగానికే ప్రాధాన్యమిచ్చి, అంతర్దృష్టితో పరిశీలించగలిగినప్పుడు ఈ బ్రహ్మాండాది పురాణాలు చెప్పే కథలు, గాథలు- పిల్లకథలుగా, కాకమ్మ కథలుగా గోచరిస్తాయనడం నిస్సందేహమైన శాస్త్రీయ విషయం. ఆత్మలింగ సంజనన కాలం కాని, కారణం కాని నిర్ధరించి, కథలల్లగల మానవమాత్రుడీ ప్రపంచంలో పుట్టలేదు. పుట్టబోడు. ఈ ఆత్మలింగార్చన అనాదిది. ఈ ఉపాసన మహాత్ముల కెంత సులభమో అల్పాత్ముల కంత దుర్లభం. అస్థిరాశాల మీది పేరాశతో- దురాశతో బ్రతికే జీవుడు ఆ దురాశల నుంచి తప్పుకొనడానికి శివకృప అత్యవసరం. శివకృపా సంపాదనకై ఉపదిష్టాలయిన సర్వోపాసనల్లోనూ శర్వుని భక్తియోగమే సులభం, సుప్రసిద్ధం కూడా నని ప్రత్యేకించి చెప్పనక్కరలేదు. ఈ భక్తి యోగా న్నభ్యసించే జీవుడు పరశివత్వాన్ని పొందుతాడు. పరశివత్వం పొందడమంటే ఆత్మశక్తి వికాసంతో శివత్వాన్ని- అనగా విశ్వాత్మత్వాన్ని పొందడం. అంటే "శివశక్తి సదాశివ ఈశ్వర శుద్ధవిద్యా మాయా కలా విద్యా రాగ కాలనియతి పురుష ప్రకృతి బుద్ధి అహంకార మన శ్రోత్ర త్వక్ నేత్ర జిహ్వ ఘ్రాణ వాక్పాణి పాదపాయు ఉపస్థ శబ్ద స్పర్శ రూపరస గంధ ఆకాశ వాయు అగ్ని జల పృథ్వి" అనే ముప్పైఆరు తత్వాలుగా పరిణమించడమని శివాగమ ప్రమాణ వచనం. ఇటువంటి పరశివత్వాన్ని పొందడానికి మొదటిమెట్టు లింగార్చనం- తుదిమెట్టు ఆత్మలింగార్చనం— ఈ లింగార్చన యీనాటిదికాదు. లింగజనన కాలం నాటి నుంచీ ఉన్నదే. ఈ లింగానికి మూలపురుషుడై అనంత విశ్వాన్ని స్వేచ్ఛతో పుట్టించి, పెంచి, గిట్టించే పరమేశ్వరు డేనాటివాడో ఈ లింగార్చన ఆనాటిది. జన్మరహితుడు, మృత్యుంజయుడు అయిన ఆ పరమేశ్వరుని అంతులేని పుట్టినరోజు పండుగ, పెద్దలు పెట్టిన పుట్టినరోజు పండుగ, శివభక్తులకు పెద్ద పండుగ, మాఘ కృష్ణ చతుర్దశి. (మార్చి 7 తేదీ) ఇదే మహాశివరాత్రి. జన్మకొక శివరాత్రి అన్న నుడి మనకే గాని, ఇప్పటి కెన్నెన్ని కోట్ల-కోట్ల అంతులేని మానవజన్మల కెన్నెన్ని కోట్ల కోట్ల అంతులేని మహాశివరాత్రులు విశ్వాత్మమయంగా గడచాయో! అన్ని- అంతులేనన్ని ఆ పెద్దపండుగల్లో చేరుతున్న మహా పెద్దపండుగ—పుట్టినరోజు పండుగ—ఇదే మహాశివరాత్రి.

# శ్రీశైలమాహాత్మ్యము

రచన :
ప్రాచీన కవి
శ్రీ చేమర్తి నరసింహకవి

సేకరణ :
శ్రీ నేదునూరి గంగాధరం

[లలితపద సంభరితమై, మృదుభావ కలితమై, ఆంధ్రజాతి హార్దిక సంపదగా వెలుగొందుతున్న జానపద సారస్వతం మనజాతి సంస్కృతికి, చరిత్రకు సర్వప్రాణి శరీరాంతర్వర్తియై, ప్రాణాధారమైన కుండలిని శక్తి వంటిది. హార్ద వాహినియైన పవిత్ర సరస్వతీ లహరి వంటిది. ఈ జానపద సారస్వతం మహా సాగరంవలె అనంతమైనది. అమూల్యమై అనంతమైనదే అయినా తొలినుండికూడా తిన్నగా ప్రభువుల ఆదరణ లేనందువల్ల ఇది నివురుగప్పిన నిప్పువలె, ధూళి ధూసరితమైన మాణిక్యంవలె, మేఘచ్ఛన్నమైన చంద్ర బింబంవలె ఉన్నది. అటువంటి జానపద వాఙ్మయ సముద్ధరణకు తన జీవితాన్నే అంకితంచేసి తలమునకలుగా కృషిచేసి సుమారు అర్ధశత గ్రంథాలు రచించి ప్రచురించి సెలయేరు త్రవ్వి పెన్నేరు మిన్నేరు మున్నీరు లను నిర్మించడానికి తగిన సాధన సంపత్తిని చేకూర్చుకున్న జానపద వాఙ్మయోద్ధారక శ్రీ నేదునూరి గంగాధరంగారు ఈ శ్రీశైల మాహాత్మ్యమును సేకరించి పంపారు. దీని రచయిత శ్రీ చేమర్తి నరసింహ కవి. వెంకటమంత్రి కుమారుడు. నృసింహ అప్పలాచార్యుల మనుమడు. ఈ సంగతు లీ రచనవల్లనే తెలుస్తు న్నాయి. కాళిందీకన్యా పరిణయం, రామకథా సుధాలహరివంటి ఉద్గ్రంథాలు రచియించి, అహోబల పండితుని సమకాలికుడైన శ్రీ చేమర్తి సుందర శేషగిరిరాయకవి కితడు సన్నిహితుడుగా ఉన్నాడు. గ్రాంథికభాషా ప్రభావంతో జానపద వాతావరణంలో వెల్లువికిన యిటువంటి వెల్లువలలో తడబాట్లుండడం సహజం. నిత్య వ్యవహారంలో తాలుజ స్వరమైత్రి ననుసరించి, జెలగవంటి పదాలు జలగవంటివిగా మారినాయి. ఆ కోవకు చెందినదే ఈ రచనలో ఉన్న "చలగుచు మడివస్త్రంబులు గట్టుచు" అన్న దానిలోని (చె) "చలగుచు" ప్రయోగం. భావమే ప్రధానంగా వెల్లివిరిసే జానపద వాఙ్మయంలో తొక్కు పలుకల ఎక్కువ తక్కువలకు, తప్పొప్పులకు తావులేదు. కాగా, వేదాంత విషయ తేజో సంకలితమైన ఈ రుచిరరత్నాన్ని సంతోష పూర్వకంగా ఆరాధన పాఠకుల కందిస్తున్నాము——ఎడిటర్.]

శ్రీ రమ్యంబగు శ్రీగిరి యాత్రకు
కూరిమి సతితోకూడి నడచితి
పల్లెలు పురములు పట్టణంబులును
బిల్వపురంబులు పేటలు దాటితి
మందలు దాటితి మడుగులు దాటితి
అడవులు కొండలు అన్నియు దాటితి
కంటిని శ్రీగిరి కన్నులనిండా
ఆ మహిమలు నే నేమని దెల్పుదు
ఈ మహిలోపల నెన్నడు చూడము
ధారుణిలోపల ధౌతాచలమది
మేరువుకంటెను మిక్కుటమైనది

బ్రహ్మనిర్మిత బహు శృంగంబులు
నిర్మలమగు మాణిక్యకోటలు
హాటకరత్నమయంబగు వీథులు
తెరపిలేని బహు దేవాలయములు
పుణ్య వనంబులు పుణ్య తీర్థములు
పుణ్య స్థలములు వాటమైన*
పూదోటలు మిక్కిలి మాటలు*
నేర్చిన మంచి మృగంబులు*
అరుదుగ బిల్వ వనాంతరములును
స్పర్శవేది కూపము లందున్నవి
కామధేనువులు కల్పవృక్షములు

* ఈ పాదాలలో ఛందోభంగం జరిగింది. ఇటువంటి లోపాలు తర్వాతివారివికాని రచయితవిగా కనిపించవు.

క్షేమకరములగు చింతామణులును
పచ్చలుదాపిన బహు తోరణములు
అచట నున్నవి అమృత గుండములు
కటునైష్ఠికములు గల్గిన విప్రులు
విడువక శంభుని వేడే రాజులు
సంతత లింగార్చనగల వైశ్యులు
శాంతులైన వేదాంతశూద్రులు
ఘణఘణ మ్రోగే గంటనాదములు
ఝుణఝుణ మ్రోగెడి శంఖనాదములు
వీరకాహళులు వీరాంగంబులు
కారణభక్తులు కైవారంబులు
పటుతరభేరీ ఝూంకారంబులు
చటులవిమర్దన ఘోంకారంబులు
కమ్మని కృష్ణాగరు ధూపంబులు
కమ్ముకొన్న ఆకాశదీపములు
జపములుచేసెడి జంగమోత్తములు
తపములుచేసెడి తాపసోత్తములు
యెక్కడజూచిన యేకజంగములు
పట్టభద్రుల ప్రమధులగూడుక
తప్పిపోక పాతాళగంగలో
తెప్పున తేలుచు తీర్థంబాడుచు
* చలగుచు మడివస్త్రంబులు గట్టుచు
పొదుపుగ నుదుట విభూతి ధరించుచు
అరుదుగ మెడ రుద్రాక్షలు దాల్చుచు
గురుకటాక్షమున గోప్యము నిల్పుచు
సకల విషయములు సందడిబాయుచు
అకలంకుండై ఆశజనింపుచు
శివపంచాక్షరి శివరహస్యమును
శివతత్త్వము పరిశీలనచేయుచు
శివసత్కార విశేషజ్ఞుండై
భవనిధియని శత్రువులనుగూడితి
పంచేంద్రియములు పదిలముజేయుచు
పంచముద్ర లక్ష్యానము చేయుచో
నాదబ్రహ్మానందంబంటిని
నాదము తుమ్మెద నాదంబంటిని

వెలుగులకెల్లా వెలుగై యీలో
వల వెలిగెడి దీపముగంటిని
యీవల సూర్యుండావల చంద్రుడు
త్రోవలమధ్య నిదానము గంటిని
కొండగుహలలో కుండలి విప్పియు
పండువెన్నెలా బయలుంగంటిని
షట్చక్రంబులు షట్స్థలంబులు
షడ్విధలింగార్చన గావించితి
నిండుగలక్ష్యము నిలుపుచు యీ పిం
డాండములో బ్రహ్మాండము గంటిని
వేయిదళంబుల వెలిగెడి పద్మము
వేయివిధంబుల వెదకి చూచితి
పాలసముద్రము త్రోవల దరి చెంగల్వ
కొలనులో ఆడుచున్న యీ హంసనుగంటిని
జోడుకొండ లచ్చోట దాటితిని
చాల వేయి స్తంభాలమేడలో
బాలిక గూడురకేళి సల్పితిని
మల్లికార్జునుని మదిలో దలచితి
పుల్లమలర వేనోళ్ళను పొగడితి
వచ్చితి కోవెలవద్దకు వేగమె
చొచ్చితి గుమ్మము చొరువజేసుకొని
ముందుగ భృంగికి మ్రొక్కి వేసితిని
నందికేశ్వరుని నమ్మి భజించితి
చండీశ్వరునకు దండము పెట్టితి
మళ్ళీమళ్ళీ మదిలో పొగడితి
పిళ్లారయ్యకు ప్రియమున మ్రొక్కితి
ద్వారపాలకుల దర్శనమాయెను
ద్వారమందు రత్నాలగద్దెపై
చూచితి నెవ్వరు చూడని లింగము
చూచితి కేవల సుందర లింగము
నిరుపద్రవమగు నిశ్చల లింగము
పరిపూర్ణంబగు పావన లింగము
సత్యమైన యీ స్వయంభు లింగము
అత్యద్భుతమగు అనాది లింగము
వేదసారమున వెలసిన లింగము

---

* చెలగుకు మారుగా జరిగిన ప్రయోగవిశేషం.

పూజనీయమగు పురాణలింగము
ఆదితేజమున ఐక్యలింగము
లింగముగని పుప్పొంగి మ్రొక్కితిని
లింగమందు మది లీనముచేసితి
లింగదేహినై లింగాంగులతో
లింగ నిరీక్షణ సంగతి గంటిని
అంకమందు భ్రమరాంబికయుండగ
బొంకము తోడుత పూజచేసితిని
దీపం బెట్టియు దివ్యతేజునకు
ధూపము వేసితి ధూర్జటి కప్పుడు
తుమ్మి పువ్వుల పూజచేసితిని
కమ్మని నైవేద్యంబు లిచ్చితిని
నెమ్మది లోపల నిమ్మళమ్ముగను
సమ్మతి తోడుత సాగిమ్రొక్కితిని
జయ జయ జయ జయ చంద్రకలాపా
జయ జయ జయ జయ శైవపిధేయా
జయ జయ జయ జయ జంగమరాయా
ఆదిదేవుడవు ఆత్మశరణ్యా
పేదల పాలిటి పెన్నిధానమా
దయ తప్పకుమీ ధవళశరీరా
భయము బాపుమీ భక్తివిధానా
యెన్ని జన్మములొ యెత్తినవాడను
నిన్ను దలంచక నీచుడనైతిని
యెన్నడు యేవిధ మెరుగనివాడను
కన్నులు గానని కష్టజీవుడను
దుష్ట మానవుడ దుర్మార్గుండను
కష్టాత్ముడను గౌరీ రమణా
తామస గుణముల తగులాటమునను
నీమము దప్పిన నీచవర్తనుడ
నిత్యదరిద్రుడ నిరుపాదితుడను
అత్యభ్యాసుడ అజ్ఞానపశువును
చేయరాని బహుచేష్టలు చేసితి

పాయరాని సద్భక్తుల బాసితి
సంసారము సంకిళ్ళు చేయకు
హింసబెట్టక యేలుము తండ్రి
కాలకర్మముల కడకును జిమ్మి
కలకాల యోగములు గడపుము తండ్రి
ముల్లోకంబులు ముంచెడు గంగను
పల్ల జడలలోపల బంధిస్తివి
గొప్పజేసి నిను గొలిచిన బంటను
తప్పక చంద్రుని తలను ధరిస్తివి
వెన్నునిచేతను కన్ను పూజకొని
సన్నుతి కెక్కిన చక్రమిస్తివి
వారక శైలకుమారిక భ్రమపడ
కోరిన సగము శరీరమిస్తివి
మూడు జగములకు మూలము నీవే
మూడు మూర్తులకు ముఖ్యము నీవే
దాతవు నీవే దైవము నీవే
భ్రాతవు నీవే బ్రహ్మవు నీవే
యెల్ల లోకముల యేలిక నీవే
నీలముంచుమీ పాలముంచు నీ
పాలబడితి నో పాపవిమోచన
నమ్మితి నో గురునాథ మహేశ్వర
అని చామర్తి కులాంబుధి చంద్రుం
డనదగు నరసింహ అప్పలాచార్యుల
మనుమడు వేంకటమంత్రి కుమారుడు
ఘనుడగు నరసింహకవి రచించెను.

వ్రాసిన చదివిన వారలకెల్లను
భాసురముగ శివభక్తి పూరమగు
దురిత మరణ తాపత్రయ మణగును
సకల శుభంబులు సంతతి కలుగును
రోగమరణపునర్జన్మ మానును
దురితము లణగును దొరకును ముక్తి.



# చతుర్మత తత్త్వం - శాంకరాద్వైతం

శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులు

(గతసంచిక తరువాయి)

ఇంకొక సంగతికూడా మనం గమనించాలి. కారణసాజాత్యన్యాయాన్ని చార్వాకు లంగీకరిస్తేనే గదా ఈ శరీరం భూమి మొదలైన వాటివల్ల ఏర్పడ్డదనడానికి అవకాశం ఐంది. అపుడు కారణంశూన్యం అయితే కార్యంకూడా శూన్యం కావద్దా మరి? ఈ ప్రపంచం అంతా భావరూపంగానే వున్నదని మనకు ప్రత్యక్షం ఋజువు చేస్తూన్నది. ప్రత్యక్షం కంటే మరే ప్రమాణమూ ఎక్కువది కాదు కదా! ఇపుడే. ప్రపంచానికి - భావంగా సత్తుగా కన్పడేదానికి శూన్యం కారణం ఎట్లా అవుతుంది? కాజాలదు. కనక ఈ ప్రపంచాన్నిగూర్చి దాని మూలాన్నిగూర్చికూడా మనం మరొక విధంగా ఊహించక తప్పనిసరే అవుతుంది.

అదెట్లాగంటే—ఈ ప్రపంచంలో మనకు కన్పడే పదార్థాలన్నీ కూడా భూమి, నీరు, నిప్పు, గాలి అనే నాల్గు రకాలు కూడినవిగానే కన్పడుతున్నవి. కనుక ఆ నాల్గే యీ ప్రపంచానికి అంతటికీ మూలకారణం అని మనం అంగీకరించితీరాలి. ఇక జ్ఞానం సంగతొకటి మిగిలివుంది. ఈ పై జెప్పిన నాల్గు వస్తువులు కూడా వొక విలక్షణం ఐన మేళనంతో మేళవించబడ్డప్పుడే అనగా మనుష్యులు, పశువులు, పక్షులు మొదలగువాని శరీరాలల్లోనే ఈ జ్ఞానం కన్పడుతున్నది. అంతే కాని రాయి, రప్ప, మొద్దు మొదలైనవి కూడా శరీరాలైనా వాటిల్లో విజ్ఞానం కన్పడడం లేదు, అందువల్ల ఏం వూహించాలె? భూమి మొదలైన వాటిల్లో ప్రత్యేకం విడివిడిగా వున్నప్పుడు జ్ఞానం లేకపోయినా ఆ నాల్గుకూడా వొక విలక్షణమైన పద్ధతిలో మిశ్రితంఐతేనే అక్కడే జ్ఞానం పుడుతుంది అని ఊహించకతప్పదు. ఈ సమ్మేళనం కొంచెం శిథిలమైనప్పుడు గానీ, కొద్దిగా అపాయగ్రస్తం ఐనప్పుడు గానీ, పూర్తిగా చెదిరిపోయినప్పుడుగానీ ఆయా అవస్థలనుబట్టి శరీరంలో జ్ఞానం శిథిలం కావడం- ఏమీ తోచనిస్థితి, కొద్దిగా శిథిలంకావడం- చీకాకుగావుండడం. అసలే పూర్తిగాపోవడం మనకు తెలుస్తున్న విషయమే. మూర్ఛ మొదలైనవాటిచేత గానీ, పెద్ద పెద్ద దెబ్బలు తగిలినప్పుడుగానీ మన కేమీ తోచదు. కొద్దిగా జ్వరవికారం కల్గితే బుద్ధి చికాకుగా వుంటుంది. మరణించినప్పుడు- ఈ ఇంద్రియాదుల సమావేశం పూర్తిగా శిథిలం అవుతుంది కనుక అసలే తెలియకుండా పోతుంది. ఇవి అందరికీ తెలిసినవే. దీనివల్ల జ్ఞానం శరీరధర్మమే అని స్పష్టమవుతుంది. ఈ శరీరం అనే విలక్షణమేళనంలోనే అది వుంటుందని విస్పష్టమవుతుంది. ఆ సమ్మేళనం పై జెప్పిన భూమి మొదలైన నాల్గు పదార్థాలదేనని ఒకరు చెప్పక్కరలేదుగదా! అయితే ఇక్కడ ఒక సందేహం యేర్పడుతున్నది. ఏమంటే ఈ శరీరానికి మూలకారణాలు- ఉపాదానం అయిన భూమ్యాదులలోలేని యీ గుణం (జ్ఞానం) కార్యంలో (శరీరంలో) ఎట్లా ఏర్పడగల్గిందీ? అని. అంతేకాక అప్రకాశాలైన పైనాల్గింటినుండీ కూడా ఈ ప్రకాశాత్మకమైన జ్ఞానం ఎట్లా కలుగుతుంది? అనికూడా సందేహం తోచకమానదు. ఈ సందేహాలకు మనం ఇప్పుడు సమాధానం చెప్పితీరాలి. చెప్తాంమరి.

ఆకు, వక్క, సున్నం వీటిలో ప్రత్యేకించి దేంట్లోనూ గూడా ఎఱ్ఱదనం లేకపోయినా ఈ మూడింటిని కలిపినపుడు ఎఱ్ఱగా వుండడం అందరెరిగిందే కదా! తాంబూలం వేసుకొని నమలే ప్రతివాడికీ ఇది

అనుభవంలోదే. కనుక మూలకారణంలో - ఉపాదానంలో లేకపోయినప్పటికీ కార్యంలో క్రొత్తగా ఒక గుణం రావచ్చునని తేలింది. ఇక అప్రకాశాల నుండి ప్రకాశం యెట్లా వచ్చింది ? అనేదానికి సమాధానం చూద్దాం.

ఎత్తైనచోటునుంచి నీరు పడేచోట్ల- (water-falls) డైనమో ద్వారా ప్రకాశాత్మకమైన విద్యుత్తు (electricity) పుట్టటం అందరికీ ఇప్పుడు తెలుస్తూనే వుంది. అదివరలో మూలకారణంగావుండే నీరులో ప్రకాశం లేదుకదా ! అంతెందుకు ? నల్లగా చిమ్మచీకటివలె ఉండే చల్లని నీటిమబ్బులనుండి మెఱుపులు, పిడుగులు ఏర్పడటం కన్పడుతున్నదేకదా ! కనక ఉపాదాన కారణం అప్రకాశం (ప్రకాశంలేంది) అయినా కార్యంలో ప్రకాశం వుండడం అసహజం కాదని తేలిపోయింది. అయితే హేతుబలం లేకుండా దృష్టాంతంచేత విషయం సాధించడం సరియైన పనికాదు. అదే సరైతే ఋశ్యశృంగుడి దృష్టాంతంతో మన కందరికీ గూడా కొమ్ములు మొలువవలసి వస్తుంది. కనక ఇహ హేతుబలంతో ఈ విషయం సాధిద్దాం. ఎట్లాగంటే అదివరలో మనం కుండను ఎరుగమనుకొందాం. అట్లా తెలియకపోయినా - కుండ కన్పడ్డపుడు గానీ ఆ మాట విన్పడ్డపుడు గానీ కుండను గురించి తెలివి మనకు కల్గుతున్నది కదా ! ఇందువల్ల మనకేం తేలుతున్నది? ఈ తెలివి - జ్ఞానము అనేది నిత్యమై యెల్లప్పుడూ ఉండేదికాక ఈ భౌతిక పదార్థాల సంయోగంవల్ల ఏర్పడేదే అని తేలుతున్నది. కన్నులకు, కుండకు గానీ, మాటకు, చెవికిగానీ సంబంధము కల్గేటప్పటికి కుండయొక్క ప్రత్యక్షం, బాహ్యం గానీ, అభ్యంతరం గానీ కల్గితీరు తున్నది. ఇక మిగిలిన అనుమానాదులుకూడా ప్రత్యక్షంలేకుండా కల్గజాలవు. అంటే ప్రత్యక్షజ్ఞానం అంతఃకరణం ఐన మనస్సును బాగా తాకి, తన అవశిష్టాంతిమ భాగాన్ని (సంస్కారాన్ని) అక్కడ ఉంచుతుంది. దానికొక లౌకికమైన పదార్థంతో సంబంధం కల్గేటప్పటికి తిరిగి వెనుకటి జ్ఞానాన్ని లాక్కొనివస్తుంది. బ్యాటరీలైటులోని స్విచ్చి నొక్కినప్పుడే కదా అదివరలో అక్కడ దాగియున్న విద్యుత్ప్రకాశం బైటపడేది ? ఆ తోవలోనే మనస్సుకు ఉద్బోధకమైన బాహ్యపదార్థంతో సంబంధం కలిగితేనే యీ జ్ఞానం బైటపడుతుంది, అనగా స్ఫురిస్తుంది, కనక ఈ హేతుబలంవల్లనూ దృష్టాంతబలంవల్లనుగూడా జ్ఞానం భౌతికమే. అంటే ఈనేల, నీరు, నిప్పు, గాలి అనే వాటివల్ల పుట్టేదేనని సిద్ధాంతం అవుతున్నది. ఇపుడు జ్ఞానమే ఇట్లా భౌతికం అవడం స్పష్టంగా నిరభ్యంతరం అయితే. ఇహ యీజడప్రపంచం సంగతి - భౌతికమే అనేటి విషయం ఒకరు చెప్పక్కర్లేదు కదా !

ఇంకొక చిన్న విషయంగూడా ఇక్కడ గమనించాలె. ఈ జ్ఞానం కల్గే యీ శరీరంపై నాల్గు భూతాలమేళనమే అయినా వానినిట్లా - శరీరంగా కల్పించెవరు ? ఎవ్వరున్నూ ఇతరులగుపడం లేదు. కనక భూతాలస్వభావమే అట్లా మేళనం జరిగించిందని వొప్పుకోవాలి. కనక యీ ప్రపంచం-యీనాల్గు భూతాల సమ్మేళనంవల్ల కల్గుతున్నదనడంలో మనకేసందేహం లేదు. కనుక ఆ సమ్మేళనంగూడా పై నాల్గు భూతాల స్వభావంవల్లనే ఏర్పడుతూన్నదనడం తప్పనిసరి. కాగా ఈ ప్రపంచం భూతస్వభావబలంవల్లనే ఏర్పడుతున్నది, కనక దీన్ని నిర్మించడానికని వేరే వక కర్తను కల్పించవలసిన పనేమీలేదు. నెమలియీకలకు రంగెవరు పూశారు? ఈ వైదిక భేతాళాలు కల్పించే వారి డొచ్చి పూశాడా ? లేదుకద ! వాటి స్వభావపు బలిమే వాటినట్లా నిర్మించింది. అంతేకాని దేవుడని ఒహశశశృంగం అక్కరలేదు. ఎందుకతడు ? అతగాడి సర్వజ్ఞత్వాన్ని నిర్వహించు కోవడానికోసం చీమల నన్నింటిని లెక్కపెడతాడా ? వేప చేదుగా ఉండడానికి గానీ, చక్కెర తియ్యగా నుండడానికి గానీ అతడేం ఉపయోగం ? వాటి స్వభావమే అంత. అది ప్రత్యక్షమే. వాటి నట్లా ఎవ్వడైనా చేశా డనడాని కెవడూ కర్త కన్పడడే ! కనక ఈ ప్రపంచం అంతా కూడా ఈ నాల్గు భూతాల స్వభావమే ననడాని కేమైనా సంశయ ముంటుందా ? లేదు కదః కాగా ఈ ప్రపంచ నిర్మాణానికై కర్త నొహణ్ణి

మన కెవ్వరికీ ఎన్నడూ, ఎక్కడా, ఎట్లాగూకూడా కన్పడనివాణ్ణి కల్పించడం తగదు.

"అయితే-స్వభావం వల్లనే ఈ ప్రపంచం అంతా యేర్పడితే ఈ లోకంలో జరిగేదంతా స్వభావం వల్లనే యేర్పడుతూన్నదని అంగీకరించవలె. అపు డెవ్వడుగూడా ఏ పనినీ చేయక్కర్లేదు. ఈ పనివల్ల ఈ ఫలం యేర్పడుతుందని లోకంలో ఉండే నమ్మకం వమ్మైపోతున్నది. కనక లోకంలో యెవ్వడూగూడా యే పనిన్నీ చేయనక్కర్లేకపోతున్నది. కాగా ఈ మతం లోకాన్నంతా సోమరిపోతుగా జేస్తున్నది" అని కొంతమంది ఆక్షేపించబోతారు.

వారు చాలా అమాయకులు. వారికి లోతుగా ఆలోచన తట్టదు. ఏమంటే లోకంలో అందరూ ప్రతి పనివల్ల లాభంకల్గి తీరుతుందనే నిశ్చయంతో ప్రవర్తిస్తున్నారా ? లేదు. ఏదో సామాన్యపు టూహవల్లనే ప్రవర్తిస్తున్నారు. భూమి దున్నాడు రైతు. విత్తనాలు చల్లాడు, ఏమని ? తప్పక పండుతుందనా ? కాదు. అట్లాగే అయితే, వాన కురియకపోతే ఆనా దేమైంది ఈ తప్పక పండడం ? ఎందుకపుడు పండదు ? పంటపండే స్వభావం లేదుకనుక. అయితే రైతెందుకు దున్ని విత్తినాడు ? సామాన్యంగా ఇట్లా చేస్తే పంట పండవచ్చుననే సామాన్యపు టూహతో వ్యవసాయం చేశాడు. దాని స్వభావం పండడమైతే పండుతుంది. లేకపోతే పండదు. ఇది మన కందరికీ ప్రత్యక్షంగా అనుభవం అవుతున్న సంగతే కదా ; కనక ఇందువల్ల మనం తేల్చుకోవలసిన విషయం ఏమిటి ? కారణం కార్యం అనేదంతా ఒక సామాన్యమైన పరిభాషా మాత్రమే అంతేకాని "తప్పకుండా ఇది దీనికి కారణమే, దీనికిది కార్యమే. తప్పక దీనివల్ల యీ ఫలం కల్గితీరుతుంది" అనడం పొరపాటేనని తేలుతుంది. నిజాని కింతదూరమెందుకు ? వాటి పేరులే ఆ విషయాన్ని స్పష్టపరుస్తవి. గమనించండి. కార్యమంటే ఏమిటి ? చేయదగింది. అంటే అయితే కావచ్చు కాకపోతే కాకపోవచ్చు. అంతేకాని తప్పక అవుతుందనికాదు. మన ప్రాచీనులే యీ విషయాన్ని సరిగా గ్రహించారు. ఆ పేరు పెట్టారు. అయిలే వారికెట్లా ఆ విషయం తెలిసిందో విచారిద్దాం. ఇక్కడ అనుమానాదు లేమీ ఉపయోగింపవు. ఒక్క ప్రత్యక్షమే ఈ విషయాన్నంతా సులభంగా తెల్పుతుంది. రైతుదున్నడం, విత్తడం, వాన కురవక పోవడం, పంట పండకపోవడం ఇవన్నీ మనకు ప్రత్యక్షాలేకదా !

కనక ఇపుడొక విషయం మనకు స్పష్టపడుతున్నది. ఏమిటది ? అన్ని ప్రమాణాలకన్నగూడ ప్రత్యక్షమే పరమమైంది. (గొప్పది) అసలు నిజంగా విచారిస్తే ఈ ప్రత్యక్షం ఒక్కటే ప్రమాణం. కడమ వన్నీ దీని మూలాన్నే కొంచెం నిలవబడగల్గుతవి. దీనితో విరోధిస్తే అవి యెందుకూ కొరగావు. కనక అవి యేవీగూడా నిజానికి ప్రమాణాలేకావు. అట్లా అనడంకూడా పొరబాటే. అవన్నిగూడా ఈ ప్రత్యక్షం ద్వారానే అర్థాన్ని స్పష్టపర్చగల్గుతవి కాని, తమ కాళ్ళమీద తాము నిల్వగలవికావు. ఆ తెల్పడంలో గూడా ప్రత్యక్షం ఆ అర్థాన్ని అనుగ్రహించకపోతే అనుమానాదు లసలే ఏర్పడవు. ఒకవేళ ఎట్లాగైనా ఏర్పడ్డా వ్యాహతాలై ప్రమాణాలు కాకపోతవి. పొగ ప్రత్యక్షంగా కన్పడకపోతే నిప్పు డీహారు అందరు కదా ! ఐనపుడు మంచును పొగ అనుకొని నిప్పును ఊహించినా అక్కడ నిప్పు కన్పడకపోవడంవల్ల ఆ అనుమానం ప్రత్యక్షంచేత వ్యాహతమై అప్రమాణం అయితీరుతుంది, కనుక ప్రత్యక్షమొక్కటే ప్రమాణం కడమవన్నీ ప్రమాణాభాసాలు. అంటే ప్రమాణాలట్లే కన్పడతవి కానీ సరియైన ప్రమాణాలు కావు. "ప్రత్యక్షపరా హి ప్రమితిః" అనగా పెద్దలు అనడం ; కాగా ఈ నిరూపణ కంతటికీ లక్ష్యంఏమిటంటే, ఈ ప్రపంచాని కంతటికీగూడా ఉపాదానకారణంఒక్కటే కాని నిమిత్తకారణంలేదని ఏమి ? ప్రత్యక్షంగా నిమిత్త కారణం కన్పడడం లేదు కనక. ఈ బూనట్లు చెప్పే పెద్దల్లో ఏ పక్కనైనా, కణాదుడు గానీ, గోతముడు గానీ, కపిలుడుగానీ, హిరణ్యగర్భుడు గానీ, జైమిని గానీ, వ్యాసుడుగానీ, ఈ ప్రపంచానికి నిమిత్తకారణం అని వాదిస్తున్నారే ఆ దేవుణ్ణి ప్రత్యక్షంగా చూచారా ? లేదుకదా ! వారు చెప్పేవన్నీ అనుమానాలేగా మరి ;

ప్రత్యక్షం యెక్కడా, ఎన్నడూ, ఎవ్వరికీ లేదుకద! అట్టి దేదైనా వకటి ఉన్నదనడం అసంగతం అన్న భర్తృహరి వాక్యం యిదివరకే వ్రాశాం. కాబట్టి నిమిత్తకారణం అన్న దేవుడు అసలు లేడు. ఈ కర్తృ ప్రత్యాశ కేవలం వేడబం మాత్రమే. ప్రపంచంలో అన్ని కార్యాలుకూడా చిట్టచివరకు ప్రపంచం కూడా స్వభావం వల్లనే ఏర్పడుతుంది దానివల్లనే ప్రవర్తిస్తుంది. "స్వభావస్తు ప్రవర్తతే" అని గీతే చెప్తుంది కదా! కాగా ఈ నిమిత్తకారణం అని దేవుణ్ణి వహణ్ణి కల్పించి అతడికి పూజాపునస్కారాములనీ ఏర్పాటు చేయడం ఈ వైదిక భేతాళుల లోకవంచనా నాటకమే. అని బృహస్పతి,* చార్వాకుడూ తరువాత అజితకేశుడూ, కంబళాశ్వతరుడూ, పురందరాచార్యుడున్నూ నిరూపించారు.

ఈ చార్వాకవాదం సారాంశం అంతా యింతే—కార్యకారణభావం అనేది తార్కికుల వాద ప్రక్రియా మాత్రమే కాని వాస్తవంగా లేదు. స్వభావమే సర్వత్ర ఉత్పాదకము, ప్రవర్తకము, నాశకమున్నూ. జ్ఞానం అంతా గూడా భౌతికమే. కనక అభౌతికం ఏమీ లేదు. కార్యకారణ భావం అసలే లేనప్పుడు ఉపాదాన కారణం అనీ, నిమిత్తకారణం అనీ విచారం ఏది? పురమే లేనివాడికి అన్తఃపుర మేది? ఈ విచారం అంతా యౌక్తికులైన నైయాయికుల కోలాహలమే కనుక లోకమార్గంలో - వ్యవహారంలో ఉపాదానం అనీ, నిమిత్తం అనీ, మన్ను ఉపాదానం అనీ, కుమ్మరి నిమిత్తం అనీ అనుకొన్నా. వస్తుతః మాత్రము మంటియొక్క స్వభావంవల్లనే కుండ ఏర్పడుతుంది. కుమ్మరి, మన్నుగూడా అనావశ్యకాలే. అంటే కార్యకారణముల వ్యవస్థతో అక్కడ వాటిని వ్యవహరింపరా దన్నమాట. కాగా ఈ ప్రపంచం అంతా భూతచతుష్టయపు స్వభావమే. ఆ రకపుస్వభావ విశేషమే అయిన జ్ఞానంలో స్ఫురిస్తుంది కనుక ఈ ప్రపంచోత్పత్తికి నిమిత్తకారణం అక్కర లేదు. అనగా నిర్మాత వస్తుతః లేడు కనుక దేవుడు దీనిని నిర్మించాడనడం తప్పే. లోక వ్యవహారంలో ఉపాదానం అనీ నిమిత్తం అనీ వున్నవి కనుక ఈ ప్రపంచానికవేవి? అని ఆశంకించుకొని ఏదేదో కల్పించుకొంటారు. కాని అదేమీ తాత్త్వికంకాదు. అయితే శూన్యవాదంలోవలె ప్రపంచం ప్రతిభాస మాత్రంకాదు. వాస్తవికమే. దీనికి కారణం పృథివ్యాది భూతచతుష్టయపు స్వభావమే. ఆ స్వభావం వల్లనే ఈ ప్రపంచం అంతా మనకు భోగ్యంగాను మనము భోక్తలముగాను ఏర్పడ్డాము. ఆ కారణాన్ని గ్రహించి యీలోకపు భోగాలను సుఖంగా అనుభవించడమే పరమ పురుషార్థం. మోక్షాన్ని గూర్చి ప్రయత్నం అక్కరలేదు. ఏనాడా భూతముల స్వభావం వల్లనే వెనుకటి శరీరరూపం అయిన సమ్మేళనం శీర్ణమవుతుందో అప్పుడే మోక్షం—శరీరనాశం ఏర్పడుతుంది. కనుక దానిని గూర్చి అనావశ్యకాలైన ఆలోచనల బెట్టుకొని చెడిపోక-అంటే ఇహలోక భోగాలనన్నిటినీ వదలివేసి పరలోకంలో ఏవో భోగాలు వస్తవని పరుగెత్తడం తగదు. లోపలవున్న బియ్యాన్ని పారవేసి ఊకకోసం యెవడైనా ప్రయత్నం చేస్తాడామరి? ఈ మతం-ఈ వాదం అంతా మాకల్పన అనుకోవద్దు. అసలు

---

*చార్వాకుల మతమూ, లోకాయితుల మతమూ వక్కటేనని చాలామంది అనుకొంటారు. అది పొరపాటు. రెండూ వేరే వేరే మతాలు. అయితే కాలక్రమాన న్యాయ వైశేషికాలవలె, సమాన తత్త్వాలు, సమాన మార్గాలు, ఎక్కువగా ఈరెండు మతాలల్లోనూ ఉండడం సంభవించింది. అందువల్ల రెండు మతాలూ వకటేనని చాలమందికి భ్రాంతి కల్గింది.

మీరు ప్రమాణమని అభిమానించేవేదమే * 'సదేవసో మ్యేదమగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయం" ఇత్యాదిగా ఉపదేశిస్తున్నది, జాగ్రత్తగా గమనించుకోండి. ఇహ

లోక భోగాలను త్యజించుకోబోకండి అని చార్వాక లోకాయతికులు అంటారు.

(సశేషం)



*"సదేవ" అనడంవల్ల ప్రపంచం శూన్యం కాదనీ సత్తుభావమేననీ తెల్పుతున్నది. 'ఏకం' ఏవ, అద్వితీయం అనడం వల్ల ఈ నాల్గు భూతాలు ఏకంగానే ఐనవనీ అందులో ఇతర కారణాలేమీ లేవనీ (అద్వితీయం) నిమిత్తమనీ ఉపాదానం అనీ ఈ రకపు రెండవ విభాగము లేదనీ తేలింది. అది బ్రహ్మఅంటే సర్వత్ర వ్యాపకమైనదనీ అనగా ఈ నాల్గు భూతముల యైక్యమునకు మూలమగు స్వభావము సర్వత్ర వ్యాపకమని భావము. స్వభావమే ఇక్కడ ప్రవర్తించుచున్నదని గీతలో స్పష్టంగా వున్నది. "స్వభావస్తు ప్రవర్తతే" అని. పుణ్య పాపాలు అనేవి లేవనే విషయంకూడా ఆ శ్లోకంలోనే ఉన్నది. "నా దత్తేకస్య చిత్పాపం నచాపి సుకృతం విభుః" అని, అసలు కర్మలకు ఫలముతో సంబంధము లేదని కార్య కారణ భావము లేదనే విషయంకూడా "నకర్మ ఫల సంయోగం" అని అక్కడే చెప్పారు. ఇంకొకటి "నకర్తృత్వం నకర్మాణి లోకస్య సృజతి ప్రభుః, నకర్మ ఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే" అన్న గీతవల్ల పాపాలు పరలోకము వాటికి కార్య కారణ సంబంధము ఇదియంతా అయుక్తమనే తేల్తుందికదా! ఇక పుణ్య పాపాలు లేవని స్పష్టమే. ఇక మోక్ష విషయంలో గూడా శ్రుతి యేమంటున్నదో వినండి.

యేయం ప్రేతే విచికిత్సా మనుష్యే అస్తీత్యేకే నాయ మస్తీతిచైకే (కఠోపనిషత్తు) "నప్రేత్య సంజ్ఞాస్తి. విజ్ఞానఘన ఏవైతేభ్యో భూతేభ్యస్సముత్థాయ తాన్యేవాను వినశ్యతి (బృహదారణ్యకం) ఇక్కడ విజ్ఞానఘనుడంటే—విజ్ఞానమే, "ఘనం" అంటే గట్టిగా వుండేదాన్ని ఘనం అంటారు. గట్టిరూపంగా వున్న జ్ఞానం అని తేలింది. అంటే ఈ శరీరంలో దృఢంగావుండే తెలివి అని అర్థం. అది మరణావస్థలో "భూతేభ్యః" అనే బహువచనంవల్ల నాల్గు విడివిడిగా అయిపోయిన పైనాల్గు భూతాల నుండి తొలగి ఆ భూతాలతోపాటే "వినశ్యతి"—రూపం పోతుంది అని. లేదా మరణమే మోక్షమనే తాత్పర్యాన్ని శ్రుతి చెప్పుచున్నదికదా!

# దేవనర్తకి - నృత్యపూజ

శ్రీ నటరాజ్ రామకృష్ణ

[ వట్టివట్టి ఊహాపోహలతో అవునుకాబోలు ననుకొనడమేగాని గట్టిగా భరతు డేనాటివాడో అతడు ప్రవచించిన నృత్యశాస్త్రమేనాటిదో చెప్పగలవారు లేరు. మనదేశంలో ప్రాచీనకాలంలో సంగీతానికి గొప్పగా శాస్త్రగ్రంథాలు లేవుగాని నృత్యానికున్న శాస్త్రపరిధి విస్తృతమైనది. సంగీతశాస్త్రంలో ఒక్క తాళంతోను గొంతుతోను, తప్ప నృత్యశాస్త్రం ఆవశ్యకత లేదు. కాని నృత్యాభ్యాసంలో సంగీతశాస్త్రం తప్పనిసరికాగా మీదు మిక్కిలి అంగసౌష్ఠవం కంఠమాధుర్యం అవయవాల సొంపువంటి వనేకం తప్పనిసరిగా కావలసినవి. ఆలోకితాదుల, ఆకంపితాదుల వినియోగం తెలిసిన విజ్ఞుడై ఉండాలి. సప్తవింశతి భేదాలలో ఉన్న సంయుత హస్తాల, అష్టవింశతి భేదాలతో ఉన్న అసంయుత హస్తాల, లక్ష్యలక్షణజ్ఞుడై వుండాలి. ధాత్రాది నవదేవతల హస్తాలు, దిక్పతుల హస్తాలు తెలిసికోవాలి. సూర్యచంద్ర హస్తజ్ఞానవర్యుడై, దంపతీ భార్యాది బంధువర్గ హస్తాల, సప్తవార స్వరనవరస మణిలోహ షడృతు హస్తలక్షణ లక్ష్యచతురుడు కావాలి. సూళాది, సంకీర్ణ తాళాల తత్వాలనేకాక, అంగరేఖజ్ఞులు, మండలజ్ఞులునై సారజ్ఞత్వంతోపాటు కాల గాన తత్వజ్ఞత్వంకూడా వుండాలి. ఇంత లోతైన శాస్త్రజ్ఞానం వుండి దేశినృత్యాల పద్ధతుల జ్ఞానంగనుక లేకపోతే ప్రయోజనం శూన్యం. కూచిపూడి నృత్యంవంటిది పూర్తిగా అనుభవంలోకి రావాలి. శివతాండవంతో చిన్నలకు పెద్దలకు కూడా శివమెత్తించగలిగి వుండాలి, నారాయణుని దశావతారాలు చూపించి నరుని సృష్టి పరిణామ విజ్ఞానప్రబోధం చేసే సామర్థ్యం వుండాలి. ఇంతప్రజ్ఞా వుండి, సంగీతజ్ఞానం లేకపోతే సారస్యం శూన్యం అవుతుంది. శ్రుతినాద మూర్ఛనాగతి పద్ధతులేకాదు, ప్రస్తారగమక సర్వజ్ఞుడుకావాలి. స్వరలయ సంగత చిత్రావధానగాలైన గీతాల్లో ప్రావీణ్యం సంపాదించాలి. వాది - సంవాది - అనువాది - వివాది స్వరాలన్నీ తెలిసిన ప్రాజ్ఞుడు కావాలి. "అంద్రుచ్" అనే యెద్దురంకెకేగాని, ఫెళఫెళార్భటులతో ఉరిమే ఉరుములకేగాని, వేటికైనా స్వరలయలను కల్పించగల శక్తియుక్తుడు కావాలి. చౌకతానవర్ణ స్వరజతి, జతిస్వరాలు జావళులు తిల్లానలు మొదలైన వెన్నైనా అనుభవంలోకి తెచ్చుకోవాలి. ఇప్పటికైనా సరిపోతుందా అంటే చాలదు - త్యాగరాజు నారాధించాలి. దీక్షితుణ్ని పరీక్షించాలి - మువ్వగోపాలుణ్ని నవ్వించి కవ్వించిన క్షేత్రయ్య కీర్తనలను తవ్వి తలకెత్తుకోవాలి- అన్నమయ్యను అక్షరశః చూడాలి. శాస్త్రజ్ఞుడైన నర్తకుడుగా ప్రజారంజకుడైన నర్తకుడుగా రాణించాలంటే యిన్ని రూపాలుగా శాస్త్రజ్ఞానాన్ని ప్రయోగజ్ఞానాన్ని గడించడమేకాక లోకజ్ఞానాన్ని సైతం సంపాదించాలి ఇంతగా అగాధమైన యీ నృత్యకళలో శాస్త్రప్రయోగాది విషయాలన్నింటిలోను తలస్పర్శిగా కృషిచేసిన ఏకైక ఆంధ్రయువకులు శ్రీ నటరాజ్ రామకృష్ణగారు లోగడ వివిధదేశ నృత్యాలలో పరిశ్రమచేసి వ్యాసాల రూపంగా అనేకపత్రికలద్వారా ఆంధ్రావనిని ఆరాధించారు. అటువంటి రామకృష్ణగారు దేవాలయాలలో పూర్వం జరుగుతూవుండే నృత్యాలగురించి వ్రాసిన బృహత్సమీక్షారాజాన్ని "ఆరాధన" పాఠకుల కందిస్తున్నందుకు సంతోషిస్తున్నాము—ఎడిటర్. ]

ఆలయము హైందవ సంస్కృతికి నిలయము. లలితకళలకు పుట్టినిల్లు. నాగరకతకు చిహ్నము.

భారతీయ సంస్కృతి దేవాలయములో పుట్టి, దైవసాన్నిధ్యంలో పెరిగి, ఆలయ ప్రాంగణములో ఆటపాటల నేర్చి, సర్వాంగసుందరంగా రూపొంది, రాజబాటను తరలివెళ్ళి, ఆస్థానముల నలంకరించి, ఆరాధనల నందుకొని, తన సుమపరిమళముతో అన్యదేశీయుల సహితము సమ్మోహితుల జేసి, వారి

హృదయములలో చిరస్థావరము నేర్పఱచుకొని, నేటి కినీ పవిత్ర భావాలతో ఆరాధింపబడుచున్నది. ఇదే మన సంస్కృతి, లలితకళలయొక్క పవిత్ర చరిత్ర.

మన శిల్పులు తమయొక్క ప్రతిభనంతనూ చూపి, జీవకళ లుట్టిపడే శిల్పములతో దేవతలకు మందిరముల నిర్మించి తమ కళావిజ్ఞానానికి అమ రత్వం చేకూర్చుకున్నారు. లక్ష్మీప్రసన్నులైన ప్రభు వులు, నాగరిక ప్రజలు ఆ నిర్మాణముల కయ్యే వ్యయ ముల భరించి, ఆ కళలను పోషించిరి. చిత్రకారులు మన పురాణేతిహాసముల్లోని వివిధ నీతి ప్రబోధక గాథలను మందిరముల గోడలపై ప్రజోపయోగార్థము చిత్రించి, అలంకరించి తమ కళల సార్థకపరచిరి. కవులు గద్య, పద్య, గీత, ప్రబంధ రచనల ద్వారా స్వామిని కీర్తించగా, సంగీత విద్వాంసులు ఆ గీతము లకు రాగతాళములను గూర్చి ఆలపించగా, వాద్యకులు తమ వాద్యములపై ఆ సంగీతము ననుసరించగా—నాట్యము దెలిసిన దేవనర్తకీమణులు—తమ కాళ్ళ నలంకరించిన మంజీరములు "ఝణం - ఝణా" రవములు చేయగా, మేళవించిన మహితీ నాదములో తమ కోమల కంఠమును జేర్చి మధురముగా భక్తి గీతముల నాలాపించుచూ, వాని యర్థమును హస్త భంగిమాదులతో నెఱుకపరుస్తూ, రసభావములను నేత్ర విన్యాసములతో తెల్పుచూ, పాదములతో, తాళగతిని, లయ విన్యాసములను సూచించుచూ, అతి నిర్మలమైన మనస్సుతో పరమహంసవోలె, దేవదాసీలు ఆ దేవ దేవు నెదుట నర్తనము సల్పేవారు. అట్టి నృత్యము చూచిన వారందరూ విస్మయానందోద్వేగులై తన్మ యము నందెడివారు. తమ్ము దాము మఱచి, ఆ తన్మ యత్వంలో నున్నవారు, మాయావ్యామోహముతో బంధించబడినట్టి ఈ జగతిని మఱచి, నిరంతరానంద సంధాయియగు నా పరమేశ్వరు నెదుట నున్నట్లే భావించెడివారు. అట్టి దైవత్వము దెల్పే నృత్యాన్ని, జూచినవారే ధన్యులు. వారి జీవితములే సార్థకములు.

దైవసేవకు అంకితమైన "దేవదాసీలు" యితర చోట్ల నృత్యమాడరు. భూపతియైననూ, భూసురోత్త ముడైననూ దేవ ర్తకీమణుల నృత్యము చూడవలె నన్న, ఆరాధన సమయాల్లో ఆలయాని కిచ్చి తీర వలసినదే. సంఘాభివృద్ధికి గాను ప్రభువులే ఈ నియ మములు నేర్పరచిననూ, ఆత్మ సంస్కారమున్న వారగుటచే వారునూ ఈ నియమములను విధిగా పాటించేవారు. గౌరవించేవారు. పోషించు ప్రభువులు ధర్మబుద్ధి కలిగియుండుటచే నాటి దాసీలకు గూడ తమ విధ్యుక్తధర్మమును నెఱవేర్చుటకు యెట్టి యాటంకము లేకుండినది. గనుకనే కళలు ఆదర్శ వంతముగా నభివృద్ధిజెంది ప్రపంచానికి ఒక దివ్య సందేశము నివ్వగలిగినవి.

ఆరాధన నృత్యకళ అతి ప్రాచీనమైనట్టిది. మన పూజావిధానములో ఒక భాగమై, భారతీయ శిల్పులు ఆలయములు నిర్మించిననాటికే ఒక సంపూర్ణకళగా రూపొందినది. గనుకనే ఆరాధన నృత్యకళ, యెవరిచే ఏ రూపములో, యెప్పుడు ఆలయములలో ప్రవేశపెట్ట బడినదో తెల్పుట కష్టమైననూ, ఆలయము లందలి సుందర శిల్పభంగిమలకు ఆధారము. ఈ ఆరాధన నృత్యకళయేయని చిదంబరము, తంజావూరు, కంచి, పంచారామములు, నాగార్జున, రామప్పగుళ్లు, లేపాక్షి మొదలైన ఆలయాల్లోని నృత్యవిన్యాసములతో గూడిన అమరశిల్పము జూచినప్పుడు, మనము తెలిసికో గలము.

ఆరాధన నృత్యకళకు సంబంధించిన అష్ట దిక్పాలక ఆరాధన నృత్యములు— 'నవసంధి' లేక, 'బలిహరణ' నృత్యములను గూర్చి ఈ వ్యాస ములో వివరించుచున్నాను.

## దిక్పాలకారాధన – దేవనర్తకి

పర్వదినములందు ఆలయముచుట్టూ ప్రదక్షిణము చేయుచూ, అష్టదిక్పాలకులను ఆరాధించు సమయ మందు వారి ప్రీత్యర్థము నృత్యము చేయుదురు. ఈ నాట్యములనే 'నవసంధి' లేక 'బలిహరణ' నృత్యము లందురు. ఈ నృత్యములన్నియు ప్రత్యేకరాగములు, తాళములందు ప్రదర్శింపబడును.

ఆలయములో స్వామికి పుష్పసమర్పణ మైన పిదప ధ్వజస్తంభమువద్ద ఇంద్రుని ఆరాధనతో ఈ

నృత్యము ప్రారంభమగును. అష్టదిక్పాలకులకు యెనిమిది ప్రత్యేక రాగములలో, ఎనిమిది అపూర్వ తాళములలో నృత్తములు ప్రదర్శింపబడును.

ధ్వజస్థంభమువద్ద ఇంద్రారాధనతో యీ నృత్య మారంభమగునని తెల్పితిని. ఇంద్రారాధనకు ముందుగా వినాయకుని, కుమారస్వామిని—

తలపుష్పపుట, మదస్ఖలితకరణములతోగూడిన నృత్యముతో విఘ్నేశ్వరుని.

మండలస్వస్తిక, ప్రేంఖోలిత, నూపుర, వైశాఖ రేచితములయొక్క విన్యాసములతో గూడిన నృత్యముతో కుమారస్వామిని ఆరాధించిన పిమ్మట ధ్వజారోహణ, నృత్యపూజ ఆరంభమగును.

## పైన పేర్కొనిన నృత్యములగూర్చి వివరములు

*తలపుష్పపుట :*

భరతుని నాట్యశాస్త్రములో చెప్పబడిన 108 కరణములలో యిది మొదటిది. ఈ కరణము యెక్కువగా దేవతలకు 'పుష్పాంజలి' సమర్పణమందుపయోగించబడును. నాట్యారంభములో ప్రదర్శింపబడునట్టిది కరణము.

*కరణము పట్టెవిధము :*

రెండుచేతులను దొన్నెవలెజేర్చి పట్టవలెను. కుడికాలి మడిమను పైకెత్తి బొటనవ్రేలిపై పాదము అనించి నిలబడి శరీరమును అతి సున్నితమైన విధముగా వంచి నిలబడవలెను.

నిశ్చలమై, వికాసముగలిగిన దృష్టి.

### పుష్పాంజలి సమర్పణకు

*శబ్దములు :*

ఆదితాళములో (సమగతి). ఈక్రింది శబ్దములు నాట్యాచార్యుడు తాళము వేయుచూ, పాడుచుండగా, మృదంగముపైగాని శుద్ధ మర్దళముపైగాని పలికించగా పుష్పాంజలి వినాయకునికి సమర్పించబడును.

తాహం - తాహం - దిగిదిగి - తతెహిత - తెహియ
తెహియ - తెహియం దత్తా - తెహియ - తెహియ
తత్త - దిత్త - తాహత - జంతరి - జగనగ - జంతరి
తత్తళాంగ్ తోం - తళాంగ్ తదిగిణ తోం.

### మదస్ఖలిత

*పట్టెవిధము :*

రెండుచేతులను జారవిడువవలెను. తలను యిరుప్రక్కలకు ఆడించవలెను. కుడికాలును వంచి ప్రక్కలకు కదిలించవలెను. అటుపై కాళ్ళను స్వస్తికము చేసి మరల ప్రక్కలకు విడదీయవలెను. తరువాత యెడమకాలును వంచి ప్రక్కలకు కదిలించవలెను. ఈకరణము - తనుదామఱచి తన్మయత్వములో నర్తనమాడునప్పుడు, మద్యపానమువలన మత్తెక్కిన అంగవిన్యాస ప్రదర్శనకు వినియోగపడును.

*శబ్దములు :*

జగ జగ జగ జగ - దిత్తక దింతక -
జంతకి తాహం - తాహం దత్తా
దొద్దొ - దోహం - బోహం దోహం -
హం రిం హంరిం - దోహం దోహం
హం తరి తరి - హుంతరి తరి
కుం తరి తరి - రాంతరి తరి
దరి దరి దరి దరి - దరి దరి దరి దరి
దిత్తరి జగనగ - దత్త తాహం
హం దిగినగ - నగ నగ నగ జం
దిత్తగ దిగితలీ - దత్త తాహం
జంతరి తాం - తజంతరి తాం. ॥తజంతరి॥

ఈ కరణ ప్రదర్శనము తరువాత "గణపతి కవుతము" 72 అక్షరముల వినాయక తాళములో ప్రదర్శింపబడును.

*కవుతము :*

ధీత్ తెయ్ । ధీత్త తెయ్ । తత్తా దిద్దతోం నంత్తా ।
ధిక్కిట ధిక్కిట తక్క । ధిర్గుడు తాం తోంగ ।
ధీం దత్త ధీం దత్త ధీం । ధ్ధ ధీం ధ్ధత్తక్క
తదిమి దిమిత తక్క ।
ధిర్గుడు తాం తోంగ । తా తా ధిత్తా ధిక్కిట
తక ధిక్కిత్తాం ।

ఛత్త। ధిక్కిట కిటతక। ధిక్కిట కిటతక।
నంగిట కిటతక। నంగిట కిటతక।
కరి ముఖహర సుర। వర కమలజనుత।
వరపాశాంకుశయుత। శరణం తే చరణం
తక్కిట దిమికిట తోం। తకతోం।
తధిక్కిట కధిమి కిట్టతోం।
సతతం। సిద్ధయుక్త। బుద్ధియుక్త।
సింధుర వదనా। తక్కిట కిట తక్కితోంగ్గ
దేహివర గణపతి। ధిక్కిట కిటతక ధిక్కితోంగ్గ
గణపతి కవుతం। సత్వర వినయర
ధిగ్గుడు తధా। ధిగ్గుడు తై। తత్తక్కి।
ద్ధి ద్ధి తద్ధి తై। తోం తోంగ్గిట తకతోం
తద్ధి కిటతక। ధిక్కిత్తా॥

తీర్మానము :

తం ద్ధిక తక తక। తం ద్ధిక తక తక
తం ద్ధక తక తక। తళాంగ్ తోం॥
ధిం ధికి ధికి ధికి। ధిం ధికి ధికి ధికి
ధిం ధికి ధికి ధికి। ధీంగికా తోం॥
తం ద్ధక తక తక। తళాంగ్ తోం
ధిం ధికి ధికి ధికి। ధీంగికా తోం
ధళాంగ్ తోం। ధీంగికా తోం
తాం తక। తద్ధితక। తరికిట తక।
తక ధళాంగ్। తదింగిణా తోం॥

## కుమారస్వామికి పట్టవలసిన కరణములు

## మండల స్వస్తిక

పట్టే విధము :

రెండు కాళ్ళను నాల్గుజానల యెడముగ నుంచవలెను. చేతులను పైకెత్తి, జారవిడిచి, వలయముగా త్రిప్పి మరల యథాస్థానమునకు తేవలెను.

తరువాత వ్రేళ్ళను విప్పుచు, చేర్చుచు, చూపుడు వ్రేలుకు బొటనవ్రేలును ఆనించి, ప్రతి సుందరముగా రెండవ చేతిభుజమును, మోచేతులను, వక్షస్థలమును తాకునట్లు నటించవలెను.

పిమ్మట చేతులను స్వస్తికముగాజేసి, వక్షమునకు యెదురుగా, అరచేతులు ప్రేక్షకులకు కనబడునట్లూ, వ్రేళ్ళకొనలు పైకుండునట్లు పట్టవలెను.

దృష్టి - గర్వముతోకూడి వుండును.

ఈ కరణము యితరులను అగౌరవ పరచుట యందు, నిర్లక్ష్యభావ ప్రకటనయందును ఉపయోగపడును.

జతులు :

దం దం దం దం।
దాతి ర కిట తా దాతి ర కిట తా తైయ్యా
దాహం దాహం - తైయ్యా తైయ్యా తైయ్యాతర
తతైహిత తైయ్యాసరి
దాహం దాహం - దీం ధీం ధీం కిట్టరి తక
ఎత్త తైయ్యా ధాకిట తక
దాహం దాహం - దాం దాం దరి కిట తక
కిణ ణక కిట తక
దాహం దాహం - దఫ్ఫ దఫ్ఫ దఫ్ఫ దఫ్ఫ
దరి కిట త। దరి కిట త। దరి కిట త
దిగి దిగి దిగి దిగి। ఝం తకి తాం ఝం కిట తాం
ఝం తరి కిట తాం॥

## ప్రేంఖోలిత - (ఊయెల)

పట్టేవిధము :

ఒక కాలిని వంచి యిరుప్రక్కలకు ఊగించవలెను. తరువాత మడిమపై జారవిడువవలెను. అటుపై గాలిలోనికెగిరి, వలయము తిరిగి, మరల భూమిపైకి రావలెను. నడుమును త్వరితగతిని కదిలించవలెను.

## నూపుర - (అందె)

పట్టేవిధము :

కటిప్రదేశమును వలయములుగా త్రిప్పవలెను. ఎడమచేతిని లతవలెనుంచి, కుడిచేతిని వలయములు ప్రదర్శించవలెను.

బొటనవ్రేళ్ళు యెడముగావుంచి, పాదములను కదిలించవలెను.

## వైశాఖరేచిత

*వర్ణవిధము :*

సమముగా నిలబడి,కుడికాలునెత్తి,ఎడమ పాదము మధ్యభాగమున కుడి మడమ తగులునట్లు నటించుట. రెండుకాళ్ళ మధ్య యెడము మూడున్నర జాన లుండవలెను. పిమ్మట కండ్లు, చేతులు, వక్షము త్వరితగతిని చలింపజేయవలెను. ఇది నాట్యమందు వెనుకకు వెళ్ళునప్పుడు, ప్రేక్షకులకు వీపును జూప కుండా వెళ్ళుటకు ఉపయోగించును.

*శబ్దములు - ప్రేంఖోలిత :*

తాం తత్తై । తద్ధింతక । గిణత్తైయ్యా
ధీం తత్తై । తద్ధింతక । గిణత్తైయ్యా
తాం తత । ధీం తత । తకిట దికిట తక
ధీం తత్తై । తద్ధింతక । గిణత్తైయ్యా
జం తతోం । జంతక । గిణత్తైయ్యా
తకిట దకిట తక । తదికిట కిటతక త్తైయ్యా
త్తైయ్యా త్తైయ్యా త్తైయ్యా తక
తొంగిణ కొంగిణ తత । తాం తత్తై ధీం తత్తై॥

*నూపుర :*

దిరికిట దిరికిట దిరికిట దిరికిట
దిద్ధింతక దిద్ధింత్తైయ్యా
ధిర్గుడుత ధిర్గుడుత దిరికిట
దిద్ధిమి దిమికిట
దిగి దిగి దిగి దిగి జంకిట జంకిట
జం జం కిట కిట - కిట కిట కిట కిట తాం.

*వైశాఖ :*

తాదిత్ దిత్తై తాంగిట కిటతక
తకిట దికిట ధిర్గుడు తాం త్తైయ్యా తక
తజంత తజంత తణంత తరుంత
తక తక తక తక । తాహత జంతరి
తకిట దికిట తకిట దికిట
తకి తకి జంత కుకు । తాంగిణ తోం.

*తీర్మానము :*

జం జం జంకిట కిటతక
జగ దత్త జగ నగ నగ దత్తా
తకిట కిట తక । తరికిటత తరికిటత జణు
జేకిట కిటతక । జణు తకత జణు తకత దిమి
తాం గిట కిట తక । తాంగు తకత జణు తకత కిట
రాం కిట కిటతక । రాంగిటతా జణుతకత తోంగ
రాం రాం కిటతక । జం జం కిట తక
ధణేకు కిట తక । వదిగిణతోం.

వినాయక, కుమారస్వామి, ఆరాధన ముగించిన పిమ్మట అష్టదిక్పాలకారాధన ప్రారంభమగును.

## ఆరాధన క్రమము

*వివరములు :*

అష్టదిక్పాలురు : ఇంద్ర, అగ్ని, యమ, నైరుతి, వరుణ, వాయువు, కుబేర, ఈశాన్య.

*వీరికి పట్టవలసిన స్థానకములు :*

భరత శాస్త్రములో చెప్పబడిన 31 స్థానకములలో పురుష స్థానకములు, స్త్రీ స్థానకములు లేక అన్నియూ వుపయోగించబడును గాని కొన్ని ముఖ్యమైనట్టివి.

ఆయత, అవహిత, అశ్వక్రాంత, మోదిత, వినివృత్త, అయింద్ర, చండిక - స్థానకములను వుప యోగించెదరు.

*పుష్పాంజలికి వుపయోగించవలసిన పుష్పములు :*

శివపార్వతి : వృక్షములనుండి తెంపిన పుష్పములు.
లక్ష్మి, మహావిష్ణు : లతలనుండి తెచ్చిన పుష్పములు.
సరస్వతి, బ్రహ్మ : జలమునుండి సేకరించినవి వుపయోగించవలెను.

*దిక్పాలకులకు :*

ఇంద్ర : మందార, పారిజాత, బిల్వపత్రము, దూరవ పత్రము.
అగ్ని : బంధూక, చంపక, కదంబ పుష్పములు.
యమ : ఇందీవర, తాపించ, కుముద.
నైరుతి : కరవీర, జపాపుష్పము, శిలీంధ్ర.
వరుణ : కల్హార, కుముద.
వాయు : మల్లిక, జాతి, జవంతి.
కుబేర : సహస్రరేఖల తామర, బంగరువన్నె తామర, కుముద.

ఈశాన్య : నక్షత్రమాల, ద్రోణపుష్ప, దుతూర, మల్లిక, మరువక.

పై పుష్పములన్నీ దొరకనిచో :

మందార, పారిజాత, బిల్వదళము, దూరువదళము సమర్పించవచ్చును.

'పుష్పాంజలి' సమర్పించు క్రమము :

నర్తకి ఆయా దేవతననుసరించి స్థానకమునందు నిలువబడి పుష్పపుట హస్తమునందు పుష్పముల గ్రహించి 'చూర్ణిక' గాని 'గద్యము' గాని చదివి పుష్పమాల సమర్పించును.

ఇందు - ముగ్గురు మూర్తులు, వారి దేవేరులు; వారి అర్ధాంగులకు సమర్పించు నప్పుడు రెండు చేతులమధ్య నుండియు. దిక్పాలకులకు; భూసురులకు; భూపాలకులకు-చేతులయొక్క కొనలనుండియు మిగిలినవారికి బొటనవ్రేళ్ళ అడుగుభాగము నుండియు సమర్పించవలెను.

### అష్ట దిక్పాలకుల అభినయ విధానము

ఇంద్ర : ఎడమచేత అరాళము పట్టి నొసటిపై నుంచి, కుడిచేతితో త్రిపతాకము పట్టవలెను.
స్థానకము—సమ

అగ్ని : ఎడమచేత ముందుగా కర్తరీ పట్టి, పిమ్మట త్రిపతాకము తల పై భాగమున పట్టవలెను. కుడిచేతిని పంచి వక్షమునకు అడ్డముగా నుంచవలెను.
స్థానకము—సమ

యమ : సూచీముద్ర ఎడమచేత పట్టి భుజముపై నుంచి, కుడిచేత పితృదేవతలకు పిండ ప్రదానము చేయుచున్నట్లు అలపద్మముతో అభినయించవలెను.
స్థానకము—సమ

నైరుతి : అర్ధచంద్ర ఎడమచేతను, కుడిచేతితో పతాకము భుజములపై పట్టవలెను.
స్థానకము—సమ

వరుణ : కుడిచేత అరాళము పట్టి, పిమ్మట వ్రేళ్ళను విప్పి అభయముద్ర పట్టవలెను. ఎడమచేత అధోముఖముగా పతాకము పట్టవలెను.

వాయువు : కుడిచేత శిరస్సునకు పైగా పతాకము పట్టి త్రిప్పవలెను. ఎడమచేత అభయముద్ర పట్టి, తరువాత పతాకము పట్టి త్రిప్పవలెను, పిమ్మట కుడిచేత కటకాముఖముద్ర పట్టవలెను.
స్థానకము—సమ

కుబేర : కుడిచేత పతాకము, ఎడమచేత అర్ధచంద్ర సంతృప్తిని కనబరిచే దృక్కులు.
స్థానకము—సమ

ఈశాన్య : కుడిచేత త్రిపతాక, ఎడమచేత ముష్టి హస్తము శైవసానకము.



# మ న మా !

కీ. శే. శ్రీ సూరాబత్తుల సూర్యనారాయణ

జననిందాస్పదమై విపత్తియుతమై సౌజన్య విద్వేషమై
పెను సంతాపకరంబునై దురితమై పీడాకరంబైన వ
ర్తన చేటొందక యాత్మ నిత్యగతి చేరన్బూని వైరాగ్యమున్
మనమా! నిశ్చల పూర్ణభావమున బ్రహ్మానందమున్ బొందుమా!

కనరా రేవగ కీడునీకు సలుపంగాఁజాలు వారింతకున్
నిను నీవే చెఱుపంగఁ జూచుకొనుచున్ నీచాతి నీచంపు వ
ర్తనతోడ న్దురితంబునన్బడెదు మేరా! పూని వైరాగ్యమున్
మనమా! నిశ్చల పూర్ణభావమున బ్రహ్మానందమున్ బొందుమా!

అని చెల్లించుకొనంగఁజాలు బల మత్యంతంబుగాఁ గల్గి త
క్కిన నైదోడుల వాంఛల న్నెరవుచున్ గీడెంచకే చంచలం
బున వర్తించుచు చెందెదెందులకు ముప్పున్? బూని వైరాగ్యమున్
మనమా! నిశ్చల పూర్ణభావమున బ్రహ్మానందమున్ బొందుమా!

వినయంబున్క్షమమున్దమంబు దయయున్ బ్రేమంబు సద్వర్తనం
బును సత్యంబు వివేకమున్గరుణ సమ్మోదంబు దాతృత్వ మో
ర్పును శాంతం బొడగూర్పఁ జాలెదు పరంబున్బూని వైరాగ్యమున్
మనమా! నిశ్చల పూర్ణభావమున బ్రహ్మానందమున్ బొందుమా!

తను విందే క్రియనిల్చు శాశ్వతముగా తథ్యంబులే భోగముల్
మొనయం జాలునె యెల్లవేళల శుభంబుల్? జీవితాశాగతుల్
మునకల్పెట్టుడి మూఁడునాళ్ళ మురిపెంబుల్! పూని వైరాగ్యమున్
మనమా! నిశ్చల పూర్ణభావమున బ్రహ్మానందమున్ బొందుమా!

కనుమీ వెట్లు తరింపఁజాలుదువు-చీకాకుం జగంబందుచో
జన శయ్యాసన సౌఖ్యమే యరిది ; చాంచల్యంబు జీవంబు పొం
దున యంచేదియు లేదు పొందవికకుందున్ బూను వైరాగ్యమున్
మనమా ! నిశ్చల పూర్ణభావమున బ్రహ్మానందమున్ బొందుమా !

అన రేగున్ బవబంధమూడు శుభమౌ నవ్యక్త తత్త్వాప్తిచే
విను మేల్కాల్పెడి కుక్కుటంబుదిన మున్విజ్ఞానమున్ పూర్వ శాం
తినిదా "కొక్కొరొకో" యటంచు కనిఁజోతిన్ పూని వైరాగ్యమున్
మనమా ! నిశ్చల పూర్ణభావమున బ్రహ్మానందమున్ బొందుమా :

ఒనరన్ కార్యములేవి చేసియు ఫలంబొక్కింత యాసింపకే
తనివిన్పొందుచు నేది యెప్పటికి ప్రాప్తంబైన నద్దాన ని
మ్మనమేల్కొళ్ళకు నోర్చి చెందుచు ముదంబుస్వాని వైరాగ్యమున్
మనమా ! నిశ్చల పూర్ణభావమున బ్రహ్మానందమున్ బొందుమా !

తనువా నిత్యముకాదు-సౌఖ్య మినుమంతన్లేదు-భోగంబులెం
చిన రోగావృతబంధముల్-గుణగతుల్ చేడ్పాటునన్మ్రించు ; నే
మన నేమున్నది చూడుమాగతి తరింపన్బూని వైరాగ్యమున్
మనమా ! నిశ్చల పూర్ణభావమున బ్రహ్మానందమున్ బొందుమా :

అనుకూలంబుగఁ దోచు కార్యముల నీవాప్యాయతంజేసి బం
ధనపాశై వెతహూలి చింతిలెదవెంతన్ జన్మ సాఫల్యమె
ట్లని యోజించి పరంబుఁదెందఁ గనవేలా ? పూని వైరాగ్యమున్
మనసా ! నిశ్చల పూర్ణభావమున బ్రహ్మానందమున్ బొందుమా !



# శ్రీగిరి పర్వతము - నాగార్జునుఁడు

శ్రీ కోన వేంకటరాయ శర్మ

తెలుఁగునాఁటఁ గల పర్వతదుర్గములలో శ్రీగిరి పర్వత మొకటి. ఇప్పర్వతము నందికొట్కూరు తాలూకాయందుఁ గృష్ణానది చెంగటఁ గలదు. దక్షిణ కైలాసమని యిప్పర్వతమును బిలిచెదరు. కృష్ణా నదియు దాని యుపనదులును 'పాతాళగంగ' యను పేరితోఁ బ్రసిద్ధినంది యున్నవి. నంద్యాలకు డెబ్బది మూడు మైళ్ళ దూరములో శ్రీశైలపర్వతము కలదు. నంద్యాలనుండి యాత్మకూరునకు ముప్పది యెన్మిది మైళ్ళు. అచ్చటినుండి "నాగలూటి" యను చోటికిఁ బదిమైళ్ళు. "నాగలూటి" నుండి శ్రీశైలమునకు నిఱువదియైదు మైళ్ళు. ఈ మార్గము అరణ్యము గుండఁ గొండల మీఁద నున్నది. "నాగలూటి — శ్రీశైలపర్వతముల" మధ్య నెన్మిది మైళ్ళకుఁ బైగా ఱాలు పఱచఁబడి యుండును.

ఈ శ్రీశైల పర్వతము మీఁదఁ బ్రసిద్ధమైన శివాలయ మొకండు గలదు. ఆ యాలయమునే మల్లికార్జునాలయ మని యందురు. ద్వాదశజ్యోతిర్లింగములలో నిది యొకటి. ఈ ప్రదేశమంతయు స్వాభావిక ప్రకృతి వైచిత్ర్యములతోఁ బ్రకృతి రమణీయతఁ బ్రసరింపఁజేయుచు మైమఱచునట్లుండును. శ్రీశైల-నాగలూటి మధ్యఁ "బెద్ద చెఱువు" అనుచోట నొక యారణ్యక శాఖ వారి విశ్రాంతి గృహము (Forest Department Rest House) కలదు.

ఫిబ్రవరి మాసము నుండి మే నెల వఱకు, ననఁగా మాఘ మాసము నుండి వైశాఖ మాసము వఱకును దేశము నాలుగు చెఱఁగుల నుండియు వేలకొలఁది యాత్రికులు శ్రీశైలపర్వతమున కరుదెంచుచుందురు. ఇక్కాలమునఁ దప్పఁ దక్కిన కాలములలో ఈ ప్రాంతము నిర్మానుష్యమై యుండును. ఈ ప్రదేశమం దంతను చెంచువాండ్రు గాఁపురము జేయుచుందురు.

శ్రీశైల శిఖరమున సుప్రసిద్ధమైన మల్లికార్జునాలయము పాతాళగంగను విలోకించుచుఁ, జూపఱుల నాకర్షించుచు నుండును. పాతాళగంగకును- ఈ దేవాలయమునకును రెండు మైళ్ల కధికముగా దూరము కలదు. ఈ ప్రదేశమంతయు నిమ్నోన్నతములయిన మెట్లతోఁ దనరారుచుండును. నాగలూటి - శ్రీశైలముల మధ్య శిథిలములయిన కట్టడములును, దేవాలయములును విశేషముగఁ గలవు. ఈ నిమ్నోన్నతములయిన మెట్ల మీఁద యాత్రికులు పలువిధములయిన చిత్తరువులను, అందులకు సంబంధించిన వ్రాఁతలను దిలకించుచుందురు.

శ్రీశైల ప్రాంతమంతయు విజయనగర సమ్రాట్టు శ్రీ కృష్ణదేవరాయల కాలమున మహోచ్ఛస్థితి నందినట్లు శాసనములు గొన్ని యెఱుంగఁ జేయుచున్నవి. ఈ ప్రాంతము యవనాక్రాంత మౌటతోడనే నిర్మానుష్యమైనదని స్థానిక జనశ్రుతి కలదు.

కృష్ణానదీ తీరమునఁ జంద్రగుప్తపురము గలదనియు, దానిఁ బరిపాలించు నేతకుఁ గొమార్తె యొకర్తుక కలదనియు, నామెను "చంద్రావతి" యని పిలిచెదరనియుఁ, జంద్రపురాధినాథుఁడు బహుదినంబులాడనాడఁ దిరిగి తిరిగి రాజధానికి వచ్చి విరహవేదనకులోనయి తన కొమార్తెనే కామించి ప్రేమించెననియు, నవ్విషయ మెటులనో గ్రహించి చంద్రావతి తన తండ్రి కోర్కెని సహించఁజాలక తండ్రిని దూషించి, తిరస్కరించి, బుద్ధిఁగఱపి, యిల్లు విడచి, శ్రీశైలపర్వత ప్రాంతమునకు వచ్చెననియు, నవలఁ జంద్రగుప్త పురాధినాథుండు పాతాళగంగలో దూఁకి ప్రాణముల విడచెననియు, జంద్రావతి మాత్రము శ్రీశైలము నందె యుండుచుండెననియు, నామె గోబృందమునం దొక గోవు క్షీరములులేక వట్టిపోయి

యుండుటను జూచి విచారించఁగా, నయ్యావు తన యంతట నది శివలింగముపయిం బాలు గురియించు చుండెనని తెలిసికొనియెననియు, నొకనాఁటి రేయి స్వప్నమున శివుఁడు శివలింగ రూపమ్మున నటఁగలఁ డని యెఱింగి యా లింగముమీఁద నొక యాలయ మును రాకుమారియగు చంద్రావతి నిర్మించి ప్రతి నిత్యము మల్లికా పుష్పములతో నా లింగమును బూజించుచుండుటవలన నప్పటినుండియు నాదేవుఁడు మల్లికార్జునుఁ డని పిలువఁబడు చుండెననియు, నయ్యాలయ కుడ్యముల పయిఁ జెక్కఁబడిన వాక్య పంక్తులవలనఁ దెలియనగుచున్నది.

శివుఁడు మృగయా వినోదార్థమై వచ్చి చెంచు పిల్లను వివాహముఁ జేసికొనెనని, యింకొకచోట దేవాలయ కుడ్యమునఁ జిత్రింపఁబడి యున్నది. ఆ కారణముచే నీ యాలయ సంరక్షణ విధి మాది యని చెంచువాండ్రనుచుందురు. ఈ సంబంధ బాంధవ్యముల వలన మల్లికార్జున స్వామినిఁ జెంచు మల్లయ్య యని యందురు. ఆలయమునకుఁ బ్రాగ్భాగమునకు దక్షిణోత్తర భాగములందును సింహద్వారములు గలవు. పశ్చిమ దిశను భ్రమరాంబికాలయమున్నది. ఇప్పుడున్న శిల్పకళాసంపద యంతయు విజయనగర సమ్రాట్టుల నాఁటిది. ఈ భ్రమరాంబను మాధవియనియు నందురు. ఇది చిన్న యాలయము. ఈమె దుర్గరూపమున జంతుబలినిఁ గోరుచుండును. మిపులఁ బ్రాచీనమైన, ప్రసిద్ధమైన శక్తి పీఠములలో నిదియొకటి. ఆర్యావర్తమునఁగల పదునెన్మిది ముఖ్య దైవతములలో భ్రమరాంబ యొకర్తుక యని జనశ్రుతి. మల్లికార్జునుని జ్యోతిర్భాగము లింగాయత జంగమ గురువులచే "లింగ చక్రవర్తి"గా నభివర్ణితమైనది. శివుని యుత్సవమును శక్త్యుత్సవమును నొకటి తర్వాత మఱియొకటి ప్రత్యేక ప్రత్యేకముగా జరుగుచుండును. శివుని యుత్సవము శివరాత్రినాఁడు జరుగును. ఆ పిమ్మట శక్త్యుత్సవము జరుగును. ఈ యుత్సవములు రెండును ఫిబ్రవరి నుండి మే నెల లోపల జరుగును. ఈ ప్రాంతముల ని య్యుత్సవము లుత్సాహపూరితముగ నున్నతస్థాయినిఁ జాఁగును. అమ్మవారి యుత్సవముకంటె అయ్యవారి యుత్సవము తక్కువ స్థాయిలో జరుగుచుండును.

పురాతన మల్లికార్జునాలయమునకు వాయవ్యదిశను జక్కని శిల్పమై చిత్ర్యముతోఁ దనరారు సహస్రలింగ దేవాలయము కలదు. ఇ య్యాలయము చిన్నది. దీని చుట్టును మూఁడు తలల నాగసర్పము కలదు. ఈ నాగసర్పము చక్కని యోనిమండలము పయినిఁ బ్రతిష్ఠింపఁబడి యున్నది.

మల్లికార్జునాలయము శివ నటరాజ లోహ విగ్రహముగల్గి యున్నది. ఇది పురాతనమైనది. ఒకప్పుడీ యాలయ కుడ్యములు బంగారు ములాము చేసిన ఇత్తడి పత్త్రములతోఁ దనరారుచుండినవి. ఇందుఁ జాలభాగ మిప్పుడు దీసివేయఁబడి యున్నవి. మిగిలి యున్నవానిలో నొకటి చెన్నపురి చిత్ర ప్రదర్శనాలయము (Madras Museum) లో నుంచఁబడినది. ఈ పలకలలోఁ గొన్ని శివుని దక్షిణామూర్తిని, చంద్రశేఖరుని,——దలఁపించుచున్నవి. మహాభారత వనపర్వమున శివుఁడును పార్వతియు శ్రీ పర్వతమున నధివసించియున్న యట్లు అభివర్ణింపఁబడి యున్నది గదా!

లింగపురాణమున జ్యోతిర్లింగము శ్రీ పర్వతమునఁ గలదని వ్రాయఁబడి యున్నది. శివుని ఎన్మిది స్థానములలో నీ ప్రదేశ మొకటి యనియు, భ్రమరాంబిక ఈ గొప్పశక్తి పీఠములలో నొకటి యనియుఁ, బెక్కండ్రు యోగులు నిచ్చోట యోగాభ్యాసముఁ జేయుచుందు రనియు నను సత్యాంశములచేతను ఈ ప్రదేశము చరిత్రప్రసిద్ధమై పవిత్రమై బౌద్ధ మతమునకుఁ జెందిన మహాయాన శాఖకుఁ బూర్వము నుండియుఁ గల చరిత్రను నిరూపించుచున్నదనియుఁ దెలియ నగుచున్నది.

క్రీ. శ. ప్రథమ శతాబ్దమునకుఁ జెందిన నాగార్జునుఁడు మహాయాన శాఖను సృష్టియించెనని విదితమౌచున్నది. బుద్ధుని తర్వాత నాల్గువందల యేండ్ల వఱకును నాగార్జునుఁడు విలసిల్లెనని టిబెట్టు వాఙ్మయ (Tibet Literature) మవగత మొనర్చుచున్నది. కుమారజీవుఁడు క్రీ.శ. 401 లో నాగార్జునుని చరిత్రను

చీనా భాషలోనికిఁ బరివర్తన మొనర్చుటవలన నాగార్జునుని కాలము క్రీ. పూ. 33 కిని, క్రీ. త. 300 కును, మధ్యకాలమనిచెప్పవచ్చును. ఈనాగార్జునాచార్యుఁడు బుద్ధుని యాధ్యాత్మిక సిద్ధాంతమునకు సంబంధించిన మాధ్యమిక విధానమును సృజియించినవాఁడనియు, గొప్ప తార్కిక రత్నమనియు, సాతవాహనాంధ్ర నృపశేఖరుల నాఁట నున్నవాఁడనియు, శ్రీపర్వత (Sree Parvata Caves) గుహలలో బహుకాలము ధ్యానసమాధి నిష్ఠాగరిష్ఠుండై యుండిన యోగి యనియు, "మాధ్యమిక కారిక— విగ్రహ వ్యావర్తిని కారిక— ప్రమాణ విధ్వంసన"—లోనగు గ్రంథముల రచించిన వాఁడనియు, రసాయనిక-ఆయుర్వేద - మన్త్రశాస్త్ర - జ్యోతిశ్శాస్త్రాదులలో నిష్ణాతుండనియు, సారోహని శిష్యుండనియు, భోజదేవుండనువానిని బౌద్ధమతమునఁ జేర్పించిన ప్రజ్ఞానిధి యనియు, నలంద విశ్వ విద్యాలయమును మూఁడు పూవుల నాఱు కాయలఁ గాయించి విశ్వవిఖ్యాతి నార్జించిన మనీషి యనియు, బౌద్ధమతమునకు సంబంధించిన యెనుబది నల్గుర సిద్ధులలో నొకరుం డనియుఁ,— దెలియనగుచున్నది.

జగత్పితలగు పార్వతీ పరమేశ్వరు లారాధింపఁబడు శ్రీశైలమున బ్రాహ్మణ శైవమతము (Brahmin Saivism) తొట్టఁ దొల్తఁ బొటమరించినది. కాని నాగార్జునునితో సంబంధ మేర్పడిన తర్వాత శైవమతము బౌద్ధమత వ్యాప్తికి దోహద మొనంగినది. క్రీ. త. ఏఁడవ శతాబ్దమున బౌద్ధమతము క్షీణించిన తర్వాత నసఁగా బౌద్ధమతము నామరూపక్రియలు లేకుండఁ బోయిన పిమ్మట నింకొక సారి బ్రాహ్మణ మత విశ్వాసము యొక్క పవిత్రసిద్ధక్షేత్ర మయ్యెను.

క్రీ. త. ఆఱవ శతాబ్దమునఁ గదంబ నృపతి యగు మయూర వర్మ ఈ ప్రాంతమును స్వాధీనముఁ జేసికొనుటతో శ్రీశైల పర్వతము దాఁక నాతని స్వాధీన మయ్యెనని చెప్పవచ్చును. ఆ కాలమున శివలింగమునకు వలయు ఱాలు బాతాళగంగ నుండి తెప్పింపఁబడియెను. ఇప్పటికిని లింగాయతులు శివలింగమును భరిణలో నుంచి తమ కంఠముల ధరియింతురు. ఈ లింగముల నన్నింటినిఁ బాతాళగంగ నుండియే గైకొనుచుండిరి. క్రీ. శ. పదునాలవ శతాబ్దమున వేమారెడ్డి శ్రీశైల పర్వతమునకు సోపానముల నమర్చెను. ఇతని కొమారుఁడు అనవేమారెడ్డి "వీరమండపము" నొకదానిఁ గట్టించెను. ఎచ్చోటఁ గాంగవీరులు మతానల జ్వాలా దందహ్యమానులై ప్రగ్గి తమ శిరమ్ముల—నాల్కలఁ—బరమేశ్వరునకు సమర్పించిరో యచ్చోట "వీరమండపము" లేర్పడుచుండు నని తెలియం దగియున్నది. వీరశైవ మతగురువులను జంగములని యందురు. ఈ జంగములకు నయిదు మఠములు ఈ శ్రీపర్వతమునఁ గలవు. అందొకటి వీరశైవ సిద్ధ భిక్షావృత్తి మఠము.

దక్షిణదేశమునఁ గల శివాలయములలో మల్లికార్జునాలయము పవిత్రమైనట్టిదియు, నతి పురాతనమైనట్టిదియు నౌటచే నర్చకుఁడు లేకుండఁగనే యెవ్వఁడైన నీ లింగమును అర్చింపవచ్చును. అర్చించుటకు జాతి, మత, కుల, లింగ వివక్ష లేదు. "నచ లింగం నచ వయః" అన్నట్లు భక్తియే ప్రధానము.

నాగార్జునుని తర్వాత నిట నత్యంత ప్రధానమైన ప్రముఖమైన బౌద్ధమతప్రాబల్యమునకు లింగాయత మత సామరస్య మెంతగనో దోహద మొనర్చినది. బౌద్ధమత యాత్రికులగు పాహియాన్ - హుయాను త్సాంగ్ అను వారలు శ్రీపర్వతమును గుఱించియు, నిప్పర్వతమునకు సంబంధించిన నాగార్జునుని గూర్చియు బహు ప్రకారంబుల నుట్టంకించియున్నారు. మల్లికార్జున స్వామిని అర్చించువారు లింగాయతులే యయ్యును ఆలయ సంరక్షణాది భారమంతయు శ్రీ పుష్పగిరి పీఠస్వాముల వయినిఁ గలదు. క్రీ. శ. పదునాల్గవ శతాబ్దివఱకును నియ్యాలయ సంరక్షణాది భారమంతయు జంగమ లింగాయతుల యధీనమందె యుండుచుండెడిది. ఆర్యావర్తమున వీరశైవులు పీఠముల నయిదింటినిఁ గల్గియుండిరి. హిమవన్నగము మీఁదఁ గల కేదారమున 'ఏకోరామ' మఠమును, శ్రీశైలమున "పండితారాధ్య" మఠమును, మహీశూర రాష్ట్రము (Mysore State) న 'మెహతి'

(Mehit) అనుచోట "రేవణాచార్య" పీఠమును, "బళారి" (Bellary) యందు "ఉజ్జని" యందు "మారులా" (Marula) మఠమును, కాశీక్షేత్రమున "విశ్వారాధ్య" మఠమును— అనునవి వీరశైవ మఠములు.

క్రీ. శ. 1167 వ సంవత్సర ప్రాంతముల బిజ్జలుని బ్రాహ్మణ మంత్రి యగు బసవన్నచేఁ బ్రతిష్ఠింపఁ బడినది 'వీరశైవ'మని యందురు. పయినిఁ బేర్కొన్న మఠాధిపతుల యభిప్రాయములనే బసవన్న మంత్రి విశ్వవ్యాప్త మొనర్చెను. అంతియ కాని వేఱొండు గాదని వీరశైవుల యభిప్రాయము. 'వీర' అను పదము శైవమత వ్యాపనమునకయి యెట్టి ప్రాణ త్యాగమునకేని నొడిఁగట్టుట యనియే యర్థము. అందుల కయియే శివలింగమును వారు కంఠమున ధరించుచుందురు. ఈ లింగమునే వారు ప్రాణలింగ మని యందురు. వారి దేహమునఁ బ్రాణవాయువు లుండుదాఁక దాని న్విడువరు. ఈ వీరశైవు లెల్లరును నిఱువదియెన్మిది యాగమసూత్రముల ననుసరింతురు. వీరి యాచార్యులైదుగురును బ్రాచీనులే యని చెప్పఁ బడుచున్నారు. "సుప్రభేదాగమము"న నియ్యాచార్యుల పారంపర స్థితి యనఁగా నైతిహ్యము (Tradition) చెప్పఁబడినది. ఇయ్యాచార్యులలో నాల్గవవాఁడే పండితారాధ్యుఁడు. ఇతఁడే శ్రీపతి పండితుఁడని ప్రొఫెసరు పాండే (Prof. Ponday) యను నతఁడు చెప్పుచున్నాఁడు. బాదరాయణుని బ్రహ్మసూత్రముల పయిని శ్రీకర భాష్యమును వ్రాసినవాఁడే శ్రీపతి పండితుఁడు. ఇది వీరశైవ సిద్ధాంతములకు, ఆదర్శ ములకు దర్పణమువంటిది. వీరశైవమతము హిందూ మతము అనఁగా ఆర్షమతమందలి యితర మతముల కంటె విభిన్నమైనది. జాతి, మత, కుల వివక్ష ఈ శైవమతమునఁ గలికమునకేని నగుపడదు. జిన ధర్మ మునకు వ్యతిరేకమని చెప్పఁబనిలేదు. వీరశైవులు విశేషాద్వైతమునందు నమ్మకముగలవారు. శ్రీపత్యా చార్యులు శంకరుని కేవల అద్వైతమును, రామాను జుని విశిష్టాద్వైతమును గూడ విమర్శించినాఁడు. కాశ్మీర శైవుల ముప్పదియెన్మిది తత్త్వములం బలె శ్రీపత్యాచార్యుల శ్రీకర భాష్య సిద్ధాంతముల నవలం బించి యనుసరించుచు విశ్వసించుచుందురు. వీర శైవులు ఆనవ - కార్మ - మాయీయ - షడ్వవ - యను సూత్రములే ముక్తికి హేతువులని నమ్ముదురు. ఈ వీరశైవులు శివుని "స్థల" యని పిలచెదరు. తత్త్వ ములలో నగ్రగణ్యమైన తత్త్వము "స్థల" యని చెప్పఁ బడినది. శక్తి యొనర్చు ప్రేరేపణమువలన శివుఁడు ఇఱు తెఱంగుల విభాగింపఁబడియెను. లింగస్థల - అంగస్థల - అని యీ విభాగములు లింగమే పరమేశ్వ రుఁడు. అంగమే జీవము - భక్తి. భక్తితో జీవుఁడు శివ - జీవములకుఁగల సామరస్యము నెఱింగి ముక్తి నందుకున్నాఁడు.

కన్నడ వాఙ్మయమున ఈ వీరశైవ వాఙ్మయ మధికముగాఁ గనఁబడుచున్నది. బసవఁడు రచించిన వ్రాఁతలును, ఆతని తరువాతివా రవలంబించిన మత విషయిక సారస్వతమును, ఈ విషయము నెఱుక పఱుచుచున్నవి.

లింగి బ్రాహ్మణులు ఆచార్యులు కావచ్చును. లేక పంచములు గావచ్చును. ఆచార్యులలో నధిక సంఖ్యా కులు జంగములు. వీరిలోఁ గొందఱు సన్న్యసించిన వారు. ఈ యైదు మఠములలో జంగమాచార్యులు ఏదే నొక మఠమునకుఁ, దత్సంప్రదాయమునకుఁ, దదాచారమునకుఁ, జెందినవారే; ఈ మత మవలం బించు సందర్భమున దీక్షఁ బొందుట యత్యంతావశ్య కము. ఆ దీక్షనే శివపంచాక్షరీ మంత్రోపదేశ మని యందురు. అమ్మంత్రోపదేశమైన తర్వాత వారు శివలింగమును గంఠమున ధరింతురు. ఆ లింగమునే యాత్మతత్త్వమనియందురు. కావుననే పురుషులతోఁ బాటు స్త్రీలును లింగధారణ మొనర్చి ప్రత్యహము నర్చించుచుందురు.

వీర శైవులు భేదాభేద వాదము నవలంబించెదరు. శంకర భగవత్పూజ్యపాదుల యధ్యాస మాయావాద ములను వీరశైవులు విమర్శించెదరు. రామానుజుని Monism ను స్వవిమర్శమని వీరశైవు లనియెదరు. బ్రహ్మమే పరశివుఁ డనియు, ముప్పది యాఱు తత్త్వముల కవ్వలఁ బరశివుఁడు గలఁడనియు,

నతఁడు మాల, కర్మ, మాయ— అను మూఁడు మలినవస్తువులకు బంధితుఁడై యున్నాడనియు, నీ దాస్య శృంఖముల నుండి తొలఁగుటయే మోక్షమనియు, వర్ణ, పద, మంత్ర, కాల, భువనతత్త్వము లాఱు మార్గములనియు, శక్తిపాతము యొక్క షడ్విధ మార్గములే యని యని వీరశైవులు విశ్వసింతురనియుఁ,— దెలియనగుచున్నది.

శ్రీశైలము శైవమతమునకుఁ బ్రధానస్థానము. భ్రమరాంబిక శక్తిపీఠములలో నొకటి. "భ్రమరాంబికా అష్టకము"ను శ్రీ శంకర భగవత్పూజ్యపాదులు రచించినారని చెప్పుదురు.

లోకము నందలి యౌచిత్యానౌచిత్యములకు ధర్మాధర్మములే మూల బంధములు. వేద స్వరూపుఁడయిన భగవంతుఁడు సృష్ట్యారంభమందే యైహికాముష్మికములను, ప్రవృత్తి నివృత్తులను, గల్పించెనని భృగు మహర్షి

"ప్రవృత్తిం చ నివృత్తిం చ
వివిధం కర్మ వైదికమ్
నరాదౌ సృజతా సృష్టం
బ్రహ్మణా వేద రూపిణా"

అను వాక్యరూపమ్మునఁ దెలిపి యున్నాఁడు. లోకమంతయు వేదస్వరూప మ్మని మనువు "సర్వవేదాత్ప్రసిద్ధ్యతి" అను వాక్యమున నుద్ఘాటించి యున్నాఁడు. దీనింబట్టి ధర్మాధర్మవినిశ్చయమునకుఁ, దత్తద్గ్రహణమునకు,— సంయమమును, నుత్తేజనమును అగత్యములని విదిత మౌచున్నది. ఉత్తేజన సంయమములు రెండును భోగ యోగముల కవసరములు. జన్మమునకు వృత్తి ప్రాధాన్యతయు సారూప్యమును లక్షణములై యున్నవి. వీనినే 'వాసన' యని జ్ఞానులు చెప్పిరి. 'వాసన' యనఁగా అనుభూత ప్రజ్ఞ. దీనిని విస్మరించుటయే ముక్తి. ఇవ్వాసన భోగానుభవమునఁ గాని, వైరాగ్యజ్ఞాన సంపత్తులచేఁ గాని, నశించునని యోగు లనిరి. "అసంగో హ్యాయం పురుషః" అను నట్టు లిట్టి జ్ఞానము 'వాసన' నశించి నప్పుడే కలుఁగ గలదు. ఉపాసనఁ గావించుటయే దీని కనుభూతి. ఉపాసన సగుణ - నిర్గుణములని ద్వివిధము. భక్తి యియ్యుపాసనకుఁ బ్రాణము. యోగమే దేహము. "సర్వమేవేశ్వరః" అను నట్టు లీశ్వరునకుఁ గర్మల నన్నింటిని సమర్పించినయెడల యోగము లభించును. సగుణ రూపమ్మగు పూజయు నర్చనయుఁ జేసిన యెడల నిర్వికల్ప సమాధి రూపమ్మగు నిర్గుణోపాసనకు అవకాశ మేర్పడును. అప్పుడు మోక్షముఁ జేకూరును. ఇట్లు స్థితికి వచ్చుటకు "శ్యామతి పరమానందరూపత్వా న్నిర్వికారో భవతీతి శివః"— అను వ్యుత్పత్త్యర్థముం బట్టి బ్రహ్మానంద స్వరూపుడును, నిర్వికారుండును నగు పరమాత్మయె శివుఁడని విదిత మౌచున్నది.

'నాస్తిరుద్రా న్మహాదేవా దధికం దైవతం పరమ్;'
'సూర్యకోటి ప్రతీకాశః సహస్రాక్ష స్సహస్రపాత్,
సహస్ర శీర్షా పురుషః సూర్య సోమాగ్నిలోచనః'
'స్థూలాత్ స్థూలతరః స్థూలః సూక్ష్మాత్ సూక్ష్మతరః'
'భగవా నేకో విశ్వవ్యాపీ మహేశ్వరః'
'నాన్యోవేద్యః స్వయం జ్యోతీ రుద్ర ఏకో నిరంజన'

మ్మను పంక్తులు ఈశ్వరరూప మాహాత్మ్యముల నభివర్ణించుచున్నవి. ఇంతియ కాక దేవానాం ప్రియులకు "జగన్మిధ్య" యను విషయమును దెలుపుటకో యన నీశ్వరుఁడు లింగాకార రూపమ్మున నుద్భవించిన విషయము "విశ్వేశ్వర మాహాత్మ్యము" నందు—

"దర్శనాత్తస్య లింగస్య ఫలం వక్తుం నశక్యతే.
యస్య వామాంగజో విష్ణుఃదక్షిణాంగా ద్భవామ్యహం,
యస్యాజ్ఞయాఖిలం విశ్వం సూర్యోభ్రమతి సర్వదా,
చంద్రశ్చ తారకాశ్చైవ గ్రహాశ్చ భువనానిచ,
ధర్మాధర్మ వ్యవస్థాచ వర్ణాశ్చైవాశ్రమాణిచ,
తిష్ఠంతి శాసనాత్తస్య దేవదేవస్య శూలినః"—
"దృష్ట్వా విశ్వేశ్వరం దేవం ముక్తిభా గ్జాయతే నరః"

—అని యుల్లేఖింపఁబడి యున్నది. కావున నిట్టి మూర్తిని ఉపాసించుటవలన ముక్తి లభించుటయం దెట్టి విప్రతిపత్తియు లేదు.

"శాంతో మహాంతో నివసంతి సంతో
వసంతవ ల్లోకహితం చరంతః
తీర్ణా స్స్వయం భీమభవార్ణవం జనా
నహేతు నాన్యానపి తారయంతః"—

అను "వివేక చూడామణి" వాక్యానుసారము లోక మునకు జ్ఞానమును ప్రబోధించి, తద్జ్ఞాన బలమ్మున విషప్రాయమైన విషయ జాలమెల్ల భ్రాంతి యని యుద్బోధించి యకర్తృత్వ బుద్ధిని "సర్వం శివ మయం జగ"త్తని భావించున ట్లొనర్చి బ్రహ్మ సత్యత్వ బుద్ధిని జీవకోటి యంతయుఁ బర శివ స్వరూప మని యనుగ్రహించెను పరమేశ్వరుఁడు. ఇదియ లింగోద్భవ రహస్యము. ఇదియ జీవులకు మహా పర్వదినము. "మాఘే కృష్ణ చతుర్దశ్యాం పూజయే దిందుశేఖర" మ్మను వాక్యమును బట్టి శివరాత్రి ముఖ్య దినమ్మనియు, శివరాత్రివ్రతము ననుష్ఠించినవారే జీవన్ముక్తు లనియు, తెలియనగు చున్నది. కాళికా పురాణమును బట్టి అనాఁటిపవలు శివ స్వరూపమ్మనియు, తేయి శక్తి స్వరూపమ్మనియు, నందునను బ్రతి కృష్ణచతుర్దశి తేయుంబవలు శివ స్వరూపంబె యనియు,—విదితముకాఁగలదు. 'శివ' శబ్దమునకు "శివాచ శివశ్చ—శివౌ" అను ఏకశేష సమాసమును బట్టి ప్రకృతి పురుషాత్మకులగు పార్వతీ పరమేశ్వరు లని యర్థము. రాత్రియన వ్యాపా రోపరమ మని యర్థము. కావున శివరాత్రి యనఁ బ్రకృతిపురుష విలసిత సర్వజగద్వ్యాపారశూన్య మైన నిర్వికల్ప సమాధియని యర్థము. అనఁగా నంతరింద్రియ బహిరింద్రియ నిగ్రహ స్వరూపమైన నిర్వికల్పసమాధియని తెలియందగును. అదియునుం గాక 'శి' కారము పంచభూతమయమైన జగద్రూపిణి యగు ప్రకృతియనియు 'వ' కారము అమృత బీజ మ్మగుటంజేసి—

"శివ మద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మా సవిజ్ఞేయః"అను శ్రుత్యనుసారము తురీయాత్మయనఁ జెల్లు ప్రణవస్వరూపుఁడైన పరమ శివుఁడని యర్థము. కావున శివసమాధి కాలమంతయు సర్వజగద్వ్యాపార శూన్యమౌటవలన ఆ దినము జీవుల కుపవాస పర్వదిన మైనది.

"ఉపసమీపే యో వాసో జీవాత్మ పరమాత్మనోః
ఉపవాస స్సవిజ్ఞేయో నతు కాయస్యశోషణమ్॥"

అను నుపనిషద్వచనము ననుసరించి జీవాత్మ పర మాత్మల సామీప్యమునకు చేయునిక్కి యెద్దో అదియె యుపవాసమనియు, నాహారమును విసర్జించి కేవల శరీరమును శుష్కింపఁజేయుట గాదనియుఁ దెలియ నగుచున్నది. ఉపాసకుఁడగు ముముక్షువు ధ్యాన యోగమునఁ దన చిత్తమును

"వృత్తిహీనం మనః కృత్వా క్షేత్రజ్ఞే పరమాత్మని
ఏకీకృత్య విముచ్యేత యోగోఽయం ముఖ్య ఉచ్యతే"

అను వాక్యమును బట్టి సర్వజగద్వ్యాపియగు పరమాత్మ యందు లీన మొనర్చి వృత్తిశూన్యమున దేహేంద్రి యాదుల నెల్ల మఱచి కేవల బ్రహ్మానందమున నోలలాడు చుండఁగా నాహారమును వర్జించుట యెందులకో! కావుననే శాస్త్రము "నతు కాయస్య శోషణమ్"అని చెప్పినది. ఇట్టి జ్ఞానాత్మకమైన మహా శివరాత్రిని బురస్కరించుకొని శ్రీశైలమునకు వేలాది జనము విచ్చేసి య మ్మూర్తిని సేవించి, ధ్యానించి, యభిషేకించి తరించుచుందురు.

అందువలననే భారతము వనపర్వమున— "శ్రీ పర్వతము (శ్రీశైలము)న శివుఁడు పార్వతితోఁ గూడ నివసించుచున్నాఁడు. ఇతర దేవతలతోఁ గూడ బ్రహ్మయైతు మచ్చటనే నివసించు చుండునని జనశ్రుతి. ఎవఁడిచ్చోటం గల పాతాళగంగయందు స్నాన మొనర్చునో యతఁడు పవిత్రుఁడై యశ్వమేధ యాగము చేసిన ఫలమునుబొంది, యతని కుటుంబము నంతను సంసారబంధ విముక్తి మొనర్చి మోక్షము జూఱఁగొను"నని వాకొనుచున్నది. "జ్ఞానం మహే శ్వరాదిచ్ఛేత్" అని కలదుగదా!



# అమరాపురము

శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

అమరాపురము అనంతపుర మండలము పశ్చిమ సరిహద్దులో దక్షిణపు కొసను వున్న గ్రామము. ఇది అమరకోశమును చెప్పిన అమరసింహుని ఊరని స్థానికులు చెప్పుదురు గాని నమ్మడానికి పేరులోఉన్న ముందుభాగము తప్ప పెద్ద సాక్ష్యమేదీ లేదు. ఇప్పటి గ్రామానికి ఉత్తరంగా 'తైలంగిరి' అన్న దుర్గముండే దట. ఇప్పుడక్కడ చెల్లాచెదరుగా వున్న రాళ్లూ, ఒక శిథిల జైనాలయమూ, వీరభద్రాలయమూ, ఆంజనేయ మండపమూ మాత్ర మున్నాయి. 'తైలంగిరి' అన్న పేరు అమరాపురపు (1916-17 నాటి శాసన నివేదికలో 34 మొదలు 47 వరకూ గల) శాసనాలలో కనబడుతున్నది. 'కల్లుదుర్గ'మన్న పేరు విజయనగరపు అచ్యుతదేవరాయల కాలంలో వచ్చిందనీ, ఇప్పటి గ్రామానికి తూర్పువైపున బురుజులతో ఉన్న దుర్గమదేననీ స్థానికులంటున్నారు; కావచ్చును. అటు తైలగిరీ, ఇటు కల్లుదుర్గమూ ఉండి నడుమన ఉన్న ఈ వూరు 'నడ్లిల్లి' అయిందన్న వాడుకా వుంది. అయితే తైలంగిరి అన్నదే ఈ వూరి అసలుపేరు.

తైలపుడు అన్న పేరు గల పశ్చిమ చాళుక్య చక్రవర్తులు ముగ్గురుండేవారు. మొదటి తైలపుడూ, మూడో తైలపుడూ ప్రసిద్ధులూకారు, వీరులూ కారు. రెండో తైలపుడు మాత్రము మాన్యఖేటము నేలిన రాష్ట్రకూటులనూ, వారి అధికారము నుద్ధరించ యత్నించిన మారసింహుడనే గాంగరాజునూ జయించి 88 కోటలను పట్టినాడని పేరు. అతడు కొగళిలోని జైనబస్తీ కడ వేయించిన శిలాశాసనాన్ని బట్టి అతడు దక్షిణ దండయాత్రలో చోళ రాజరాజు నుంచి 150 ఏనుగులను జయించిపట్టినట్లున్నూ, రొద్దము గ్రామములో విడిసినట్లున్నూ తెలుస్తున్నది. ఇది క్రీ. శ. 992 లో. అప్పుడే గాంగపదమూ, నోలంబ పదమూ జయించిన చోళ రాజరాజుతో తైలపుడు చేసిన యుద్ధమిది. ఈ యుద్ధము జరిగిన కాలములోనే తైలపుడు ఈనాటి అమరాపురము వరకూ జయించి అక్కడ తన పేర తైలంగిరి దుర్గాన్ని కట్టిఉండునని ఊహిస్తున్నాను.

ఈ వూరికి దక్షిణముగా యెనిమిది మైళ్ళలో హేమావతి అని ఈనాడు పిలవబడే 'హెంజేరు' గ్రామము కలదు. అది నోలంబవాడికి రాజధాని. ఆ గ్రామములో నల్ల శిలలతో తీర్చిన పెద్ద (శైవ) శిల్పాలెన్నో ఉన్నవి. అలాటివి అమరాపురములో లేవు. కనుక నోలంబవాడి ఉచ్చదశలో తైలగిరి గాని, అమరాపురము గాని పుట్టలేదన్నమాట. పశ్చిమ చాళుక్యుల రాజ్యము దక్షిణానికి వ్యాపించినప్పుడు దక్షిణపు సరిహద్దులో నిర్మించబడిన దుర్గాలలో తైలంగిరి ఒకటి.

చోళరాజరాజు తైలపుని కొడుకు, సత్యాశ్రయుణ్ణి జయించుటకు తన కుమారుడు రాజేంద్రచోళుణ్ణి పెద్ద సన్నాహముతో పంపినాడు. అతని సేనాధిపతి విక్రమ చోళ చోళవరియం వేయించిన శాసన మొకటి తైలంగిరికి నాలుగు మైళ్ళున్న శివర గ్రామములోని ఆంజనేయాలయ స్తంభముమీద ఉన్నది. ఈ దండయాత్ర మాన్యఖేటము వరకూ సాగిందట. అంటే తైలగిరి క్రీ. శ. 1000 ప్రాంతంలో చోళుల చేతబడిన దన్నమాట. ఈ నాటి అమరాపురములోనూ, ఈ వూరికి ఉత్తరాన ఉన్న తైలగిరి దిబ్బలమీదా చోళుల శిల్పాలేవీ లేవు. కనుక తైలగిరి చుట్టూ ఆ నాటికి పెద్దవూరేదీ పెరగలేదనే అనుకోవాలి.

క్రీ. శ. 1183 లో నాలుగవ సోమేశ్వరుడు కాలచుర్యులను పూర్తిగా నిర్మూలించి దక్షిణానికి దండయాత్ర చేసి నోలంబవాడినికూడా జయించుకున్నాడు. 1185 నాటికి అతని సామంతుడు త్రిభువన మల్లభోగదేవచోళ మహారాజు హెంజేరు (హేమావతి) లో పరిపాలిస్తూండినాడు. ఈ పశ్చిమ చాళుక్య ప్రాబల్యముతో శివర గ్రామములో జైనాచార్యులు వీరసంధి

సిద్ధాంత చక్రవర్తి దేవుడూ, అతని కొడుకు పద్మ ప్రభ మాలధరిదేవుడూ వంటివారు స్థిరవాసము కల్పించుకున్నారు. వీరు సన్యాసులు కారు; పండిత గృహస్థులు, జైన సిద్ధాంతాన్ని పూర్తిగా అవగాహన చేసుకొని వ్యాపింపజేసినవారు. ఈ గురు పరంపరకు మూలస్థానము బిజాపూరు జిల్లాలోని బాగెవాడి తాలూకాకు చెందిన ఇంగళేశ్వరము. వర్ధమాన తీర్థంకరుడు స్థాపించిన మూల జైన సంఘములో గణములూ గచ్ఛలూ ఏర్పడినవి. వాటిలోని కాణూరు గణ, పుస్తక గచ్ఛలకు చెందినవారు శివరగ్రామపు జైనాచార్యులు. అమరాపురములో బ్రహ్మజినాలయమును నిర్మించిన శ్రావకుడు దేశీయ గణమునకు చెందినవాడు. మూల సంఘపు గురు పరంపరలో ఏలాచార్యులను పేరుగల కుందకుందాచార్యులు ప్రామాణిక జైన గ్రంథాలు రచించిన గురుశ్రేష్ఠుడు. ఈయన సంప్రదాయము నవలంబించినవారు కుందకుందాన్వయమునకు చెందిన వారమని చెప్పుకొనుట ఆచారము. శివర, అమరాపురముల జైనాచార్యులు కుందకుందాన్వయులే. ఈ అన్వయాలు ప్రబలమైనకొద్దీ పరమత ఖండనమూ స్వమత స్థాపనావేశమూ వృద్ధి అయాయి. అమరాపురపు సేనగణమునకు చెందిన భావసేనత్రైవిద్య చక్రవర్తి ప్రతివాదిభయంకరుడట. ఈయన అమరాపురంలోనే దేహము చాలించినాడు. ఇక్కడికి క్రోసెడు దూరమునున్న తమ్మడిహళ్ళిలోని ఆంజనేయస్వామి ఆలయములో చారుకీర్తి భట్టారకుని శిష్యుడు చంద్రాంక భట్టారకుని సమాధిరాయి ఉన్నది. ఆ రోజులలో నిడుగల్లు, తమ్మడిహళ్ళి, హైలంగిరి, శివరాద్రపట్టణము, హెంజేరూ, గొప్పజైనస్థావరాలు.

పశ్చిమ చాళుక్య రాజులు మత సహనమును మాత్రమేకాక మతాభిమానము కలిగినవారు కూడాను. వారి పరిపాలనలో జైనుల శిల్పము బాగా వ్యాపించింది. రాష్ట్రకూటులు ఎర్ర ఇసుక రాతిలో జైన శిల్పాన్ని కోకొల్లలుగా చేయించారు. రాతిమలకను ముందుగా నునుపుచేసి, తరువాత శాణముతో రూపురేఖ రచించి, ఈ రేఖచుట్టూ గల మేరను లోతుగా చెక్కి తీర్థంకరుని రూపాన్ని అర్ధశిల్పముగా నిర్మించడము రాష్ట్రకూట శిల్పాలలో కనబడుతుంది. రాష్ట్రకూటులు కొండ రాళ్ళను అక్కడే దొలిపించి తీర్థంకర విగ్రహాలు నిర్మించడమును కూడ ప్రోత్సహించినారు. వేములవాడ, కొలను పాకలలోని నిండు జైనశిల్పాన్ని పశ్చిమ చాళుక్యులు మలిపించినారు. అమరాపురములో నిండుజైన విగ్రహము పురాతనకాలానిదిలేదు. కనుక ఆనాటి జైనతీర్థంకరుల విగ్రహాలన్నీ శిథిలము చేయబడి కోటరాళ్ళతో కలిసిపోయినవనే అనాలి. జైనుల సమాధిరాళ్లు మాత్రము అమరాపురములో చాలా ఉన్నాయి. ఇవి ఆరంగుళాలు దళసరి, ఒక అడుగు వెడల్పూ, ఐదడుగులు పొడవుగల నల్లరాతి పలకలు. వీటి పొడవువెంబడి మూడు భాగాలుచేసి, అడుగు భాగములో ఆ సమాధిరాయి వైనమూ, మధ్యన మృతుడైనవాని ధ్యానపద్మాసనమూ, పైన తీర్థంకరుని రూపమూ చెక్కించినారు. తీర్థంకరులు కొన్ని రాళ్ళ మీద కాయోత్సర్గసాధనతో నిలబడీ, కొన్నిటిమీద ధ్యానముద్రతో కూర్చునీ, కనబడుతున్నారు. మధ్య భాగములో ఉన్న శ్రావకులు - అనగా జైనసాధకులు తలకు పక్కగా తీర్చిన జుట్టుముళ్ళతో పద్మాసనస్థులై కనబడుతున్నారు. ఇలాటి రాళ్ళకు అడుగు అంచున నలువలకల కుశి కనబడుతున్నది. అమరాపురపు ప్రాచీన జైనాలయములో పానవట్టము ఒకటి కలదు. దాని అంచుమీద, శ్రీ మూలసంఘ దేశీయగణ కొండ కుందాన్వయ పుస్తక గచ్ఛ ఇంగళేశ్వర త్రిభువన కీర్తిరావుల శిష్యుడు బాలేందు మాలధరి దేవుని శిష్యుడు బసదిని నిర్మింపించినట్లు శాసన మున్నది. ఇది తప్పక జైన తీర్థంకరుని భద్రాసనమే. సమాధి రాళ్ళ దిగువనున్న రాతిచీలలు ఈ భద్రాసనపు రంధ్రములో సరిగ్గా పట్టుతూన్నప్పటికీ, ఈ పానవట్టాలు వాటికోసము అమర్చియుండినవి కావని ఈ శాసనము వల్ల స్పష్టముగా తెలుస్తుంది. పాడువడిన జైనాలయాలలోనిగర్భగుడిలో ఇలాటి పానవట్టాలు కనబడతాయి. విగ్రహాన్ని భగ్నముచేసి వీటిని వదిలిపెట్టారు వీరశైవులు.

జైనబసదులు రాజధానీ నగరాలలోనూ, కొండ గుహలలోనూ కనబడతాయి సామాన్యంగా. అమరాపురానికి అటు నిడుగల్లూ, ఇటు హెంజేరూ కలవు. త్రిభువన మల్లసోమేశ్వరుని కాలములో (1185) హెంజేరు ఒక మండలేశ్వరుని రాజధాని. ఇరుంగోళ దేవుని కాలము (1226) లో నిడుగల్లు పట్టణము రాజధాని. ఇతని పట్టమహిషి బాచలదేవి. వీరు తమ కుమార్తె నంగవ్వ వివాహ కాలములో భూదానము చేసిన శాసన మొకటి అమరాపురము మునసబు చావడిలో నున్నదట. ఈ మహారాజుభార్య ఇంకొకతె అలుపాదేవి కొత్తశివరంలోని జైనబసదిని నవకర్మ చేయించి కాచినదట. ఆ బసది కొండకుందాన్వయ కానూరు గణములకు చెందిన దేవనంది ఆచార్యుని శిష్యుడు పుష్పనంది మాలధరిదేవుడు నిర్మింపించినది. మహారాజుల ప్రాపు లేకపోయినా, జైనాచార్యులు వసతులను నిర్మించుకొని ఈ ప్రాంతంలో మతవ్యాప్తి చేస్తూండేవారన్నమాట. తైలంగిరిలో ఇంగళేశ్వరపు త్రిభువనకీర్తిరావుల శిష్యుడైన బాలేందు మాలధరి దేవుని శిష్యుడు నిర్మింపించిన ప్రసన్న పార్శ్వదేవుని వసది ఉండేదని నేటి పాత జైనాలయపు పానవట్టము అంచుమీద శాసనము తెలుపుతున్నది. అక్కడనే ప్రతివాది భయంకరుడు భావసేన త్రైవిద్య చక్రవర్తి సమాధిరాయి ఉన్నది. ప్రభాచంద్రదేవుని శిష్యుల సమాధులూ, బాలేందు మాలధరిదేవుని శిష్యుల సమాధీ అక్కడే ఉన్నాయి. కనుక తైలంగిరిలోని ప్రసన్న పార్శ్వదేవుని వసతి గొప్ప విద్యాస్థానమునకు బీజ ప్రాయమైనవసతి.

ఈ సంగతిని గుర్తించి క్రీ. శ. 1278 లో బాలేందు మాలధరిదేవుని శిష్యుడు సంగాయన మల్లిసెట్టి తమ్మడి హళ్ళిలోని 2000 పోకచెట్లను ప్రసన్న పార్శ్వదేవ వసతికి నవకర్మకొరకు దానముచేసినాడు. ఈ వసతికి అర్చకుడు పాండ్యదేశపు దక్షిణ మధురకు ఉత్తర మునగల పొన్నమరావతి సీమలోని భువలోకనాథ నల్లూరి జైన బ్రాహ్మణుడు చెల్లపిళ్ళ పై పోకతోట వల్ల వచ్చే రాబడితో ఈ దేవాలయానికి రాతితో ఉపానమూ (పునాదీ, తొలి అంతస్థూ), స్థూపీ (ఆలయ శిఖరము), మహామండపమూ, భద్ర (పీఠముతో కూడిన మూలవిరాట్టు విగ్రహము), లక్ష్మీమండపమూ (మూలవిరాట్టు చుట్టూవుండే వర్తులాకార మండపము) గోపురమూ, పరిసూత్రమూ (ప్రాకారము), వందన మాలా (ద్వారబంధ లతావేష్టనము), మానస్తంభమూ (రాతిధ్వజస్తంభము) సంపూర్ణవాహనమూ (చుట్టలూ ఏడుపడగలూ కల పాము), మకరతోరణమూ, నిర్మించుట కాదేశింపబడినాడు. ఇతనికి వృత్తి (జీవనానికి సరిపడే భూవసతి) కల్పించి ఈ పనికిగాను తైలంగిరిలో నిలిపినారు. నేటి పాత జినాలయము—తైలంగిరి దిబ్బమీదిది— పరిశీలిస్తే, ఉపానమూ, పరిసూత్రమూ, మహామండపము పునాదీ, గోపురమూ పూర్తి అయినట్టుగా కనపడుతుంది. తక్కినవి పూర్తి కాకుండా వీరశైవుల దండయాత్ర వచ్చిపడి వుంటుంది.

క్రీ. శ. 1278 ప్రాంతములో ఈ సీమకు రెండవ ఇరుంగొళచోళుడు మహామండలేశ్వరుడు. రొట్టెల వాడికంటె ముక్కలవాడి పని బాగుండేటట్లు, హొయసాలులూ, కాకతీయులూ, యాదవులూ కంటే ఈ మండలేశ్వరుల పనేబాగుండినది. హొయసాలమూడో నరసింహుడు యాదవసేనాపతి సాళువ తిక్కమడిచే దెబ్బతిని కోలుకొంటున్నాడు. జయించాడేకాని, సాళువ తిక్కముడు రాజ్యము నాక్రమించలేదు. కాకతి రుద్రాంబ ఆధిపత్యానికి పురిటిగండాలు తీరిపోలేదు. కనుక నోలంబవాడిలో నిడుగల్లు నేలే 'మహామండలేశ్వర త్రిభువనమల్ల నిశ్శంక ప్రతాపచక్రవర్తి వీరదానవమురారి ఇరుంగొణదేవచోళ మహారాజు' దే సర్వాధికారము :

మండలేశ్వరుల కాలములోనే సమ్రాట్టుల దండయాత్రల ఆసరాతో శైవులు జైనస్థావర ధ్వంసము చేశారు. ఏకాంతరామయ్య, బసవేశ్వరుడూ వీరశైవాన్ని వ్యాపింపజేస్తూ జైనులను నరికించ ప్రారంభించారు. కళ్యాణ్, వేములవాడ, కొల్లిపాక, హనుమకొండ నగరాలలో జైనుల హత్యలూ, జైనాలయ, తీర్థంకర విగ్రహధ్వంసమూ విరివిగా సాగాయి. తాడిపత్రి, కొనకండ్ల, కంబదూరు, జైనాలయాలు

నాశనమైనాయి. తైలంగిరిలోని ప్రసన్న పార్శ్వదేవ వసతికి పక్కన ఉన్న జైనాలయము—ఇది వర్ధమానుని ఆలయము అయియుండవచ్చును— వీరభద్రాలయముగా మారిపోయినది. ఈ ఆలయపు గర్భాలయ ద్వారబంధము దిగువ కొనలలో జైనుల ఆచారాన్ని అనుసరించి చెక్కియుండిన పూర్ణకుంభాలు నేటికీ అలాగే వున్నాయి. గర్భాలయము ముందున్న అంతరాళములో కుడి గోడకు చేరా లింగమూ నందీ ప్రతిష్ఠింపబడగా, గణేశుడు అటువైపు చోటులేక ఎడమ వైపు ద్వారబంధపు పూర్ణకుంభానికి చేర బడ్డాడు. వీరభద్ర విగ్రహము విజయనగరకాలపు విగ్రహమే నన్నట్లున్నది. నాటి వీరభద్రుడు శివ దూషణ చేసిన దక్షుని శిక్షిస్తే ఈ వీరభద్రుడు శైవము నవలంబించని జైనులను శిక్షించినాడు. వీరభద్ర విగ్రహానికి పీఠముగా ఉపయోగించిన పానవట్టము పాతజైనాలయములోని శాసనపు పానవట్టము మాదిరి గానే ఉన్నది. దాని అంచుమీద ఉన్నట్లుగానే శాసనముకూడా ఈ పానవట్టపుటంచుమీద కలదు. అయితే అందరూ ఈసంగతిని గుర్తించకుండా, శాసనమున్న అంచును వెనుకవైపుకు త్రిప్పివేసి, దాపు అనే మిషతో అంచు మునిగిపోయేటట్లు సున్నముతోను, ఇటుక ముక్కలతోనూ కప్పివేసినారు. పానపట్టపు నాసికమీద అక్షరాలు కనబడుతున్నాయి. బ్రహ్మ జినాలయమని బ్రాహ్మణులు అంగీకరించినా ప్రసన్న పార్శ్వదేవుని వసతి ఆరోజులలోనే ధ్వంసము చేయబడి ఉంటుంది. అయితే జైనులు పారిపోలేదు. యుద్ధముచేసి, చంపి, చచ్చారు. ఈ యుద్ధములో మరణించిన శైవవీరులకు విజయానంతరము వీర గళ్ళు పడినవి. అమరాపురము చెరువుకట్టమీదివి కొన్ని ఇవే. ఇవి ఐదడుగులు ఎత్తూ, రెండడుగులు వెడల్పూ గల రాతి పలకలు. ఒకదాన్ని మూడు భాగాలుగా చేసుకొని, క్రింది పలకములో యుద్ధచిత్రమూ, నడుమన యుద్ధములో మరణించిన శైవవీరుడు విమానములో శివలోకమునకు పోవుటా, పై ఫలకములో అతనికి శివలోకప్రాప్తి రచించారు.

హెంజేరూ, నిడుగల్లు రాజ్యమూ విజయనగర రాజులు ఆక్రమించిన కాలంలో ఒకప్పుడు సోవయ్యరుసు నోలంబవాడికి మండలేశ్వరుడుగా ఉండినాడు. అప్పుడు బట్టి రేచయ్య అనే కొత్వాలు చెరువుకట్టించి దానికి రాతితూర కట్టించినట్లున్న శాసన మొకటి అమరాపురపు చెరువుకట్టమీద ఉన్నది. 'అచ్యుత దేవరాయలకట్ట' ఉన్న నేటి చిన్న చెరువే నాడు 'దొడ్డ చెరువు'. నేటి అమరాపురపు తోటలు విజయనగర రాజ్యకాలమునాటి వన్నెమాట. తరువాతనే నేటి అమరాపురము నెమ్మదిగా తలయెత్తినది. ఆనాడు అమరాపురములో వున్న వెంకటరమణాలయము, శిథిలమైన జైనాలయ ద్వారబంధాన్ని అమర్చుకొని ఈ వూరిలో మొదటి వైష్ణవాలయముగా ఏర్పడినది. బుక్కరాయలు క్రీ. శ. 1368 లో వైష్ణవులకూ, జైనులకూ సఖ్యము చేసినాడట. ఈ సఖ్యము తరువాతనే ఇక్కడి గోమతేశ్వరాలయము నిర్మింపబడి ఉంటుంది.

అచ్యుత దేవరాయల కాలములో క్రీ. శ. 1541 ప్రాంతాన్న అతివృష్టి కలిగి, తమ్మిడిహళ్ళి చెరువు కట్ట మూడుచోట్ల తెగినది. అప్పుడు అమరాపురపు చెరువుకట్టా తెగివుండును. అచ్యుతరాయలు చెరువు కట్టను రాతితో కట్టింపించి, అమరాపురానికి పడమటన్న ఉన్న కలుదుర్గము నిర్మించివుంటాడు. ఈ దుర్గానికీ తైలంగిరికీ నడుమ లేచిన పల్లె 'పట్లెల్లి' అని వాడుక అయినది.

నీటి ఉప్పెనవచ్చిన కాలంలో ఎప్పుడో శివాలయ మొకటి కూలిపోయింది. అందులోని సప్తమాతృకలూ, వీరాధర వీరభద్రుడూ చెరువుకట్టను చేరినారు. విశ్వేశ్వరు డేమైనాడో?

అమరాపురము అన్నపేరు మైసూరు హిందూ రాజుల కాలంలో వచ్చి ఉండవచ్చును. 'హేమావతి' పేరువలెనే అమరాపురము పేరు శాసనాలలో లేదు. రెండూ ఇటీవలి పేరులే.



# మారుతి


మూలం :
శ్రీ బి. ఎస్. నరసింహ అయ్యంగార్

అనువాదం :
శ్రీ మధిర భానుమూర్తి


సమగ్రంగాను, సరసంగాను పాత్ర పోషణ చెయ్యటం కవుల సొత్తు. ఇందులో ఆదికవి యైన వాల్మీకి అందరినీ మించిపోయాడు. ఆయన మహా కావ్యం రామాయణంలో మనని ఆకర్షించే పాత్రల్లో కల్లా ముఖ్యమైనది మారుతి పాత్ర. అతడి ధైర్య సాహసాలను, గుణగణాలను అభివర్ణించేందుకు పూర్తిగా ఒక కాండను (సుందరకాండను) వినియోగించాడంటే అదే ఆ పాత్ర ప్రాముఖ్యానికి నిదర్శనం. ఒకే వ్యక్తిలో మూర్తీభవించిన అనేక విశేషాల కలయికను జాగ్రత్తగా పరిశీలించవలసినదే!

వీరోచిత సాహసము, అత్యంత ప్రభుభక్తి, వినయము, అపారమైన విజ్ఞానము, మితభాషణము, ఆత్మ విశ్వాసము, ఇతరులలో ఆత్మ విశ్వాసమును కలిగింపగల శక్తి...ఇవన్నీ సమ్మిళితమై హనుమంతునిలో గలవు. అతని చేత లన్నింటిలోనూ సుశిక్షితమైన మితభాషణ, కార్యనిర్వహణ, అచంచలమైన కార్యదీక్ష, తలపెట్టిన పని సమగ్రంగా పూర్తి చేసే లక్షణము—ఇవన్నీ స్పష్టంగా కనిపిస్తాయి. దీనికంతకూ అతడి నిష్కళంక బ్రహ్మచర్య దీక్షయే కారణము. అందుచేత నేటి కాలపు ప్రజ లందరకు అతడు ఆదర్శప్రాయుడు కాగలడు.

అతని పాత్ర మూడు విధములుగ విభజింపవచ్చును. చక్కని దౌత్యము, అసాధారణమైన యుద్ధ నైపుణి, ఆదర్శప్రాయమగు భక్తి పారవశ్యము—ఈ మూడు లక్షణములు మూర్తీభవించి మారుతిలో నున్న వనవచ్చును. తన సోదరుడగు వాలితో తగవు పడిన తరువాత ఉత్పన్నమైన పరిస్థితులలో సుగ్రీవునకు మారుతికంటె గొప్ప దూతగాని, మంత్రిగాని లభించుట దుర్లభము. రామలక్ష్మణులు ధనుర్ధారులై అల్లంత దూరాన కనిపించేసరికే సుగ్రీవుని మనస్సు నిండా చాలా అనుమానాలు, భయాలు బయలుదేరాయి. వెంటనే హనుమంతు డతనికి భయాలను పోగొట్టేందుకు ఒక చక్కటి సంభాషణ చేశాడు. అప్పు డతను ఆ యిరువురు వీరులను సవినయంగా సమీపించి, నేర్పుగల తన వాక్చాతురిచే శ్రీరాముని అభిమానాన్ని సంపాదించ గలిగాడు. శ్రీరాముడు హనుమంతుని ఈ విశేషాన్ని గురించి చెప్పిన నాలుగు శ్లోకాలలో ఆయనకు హనుమంతుని ఎడల గల అభిప్రాయం తెలుస్తుంది. ఆ శ్లోకాల్లో (కిష్కింధాకాండ - 3 వ సర్గ, శ్లోకాలు 28 నుంచి 31 వరకు) హనుమంతుని మాటలనిండా పరిణతి చెందిన మేధ, అపారమైన శక్తి, దుర్భాషలులేని ఆకర్షణీయమైనతీరు ఉంటుందని, వేదాలన్నీ చదివి అవగాహన చేసుకున్నట్లుగా నిర్దుష్టంగా ఉంటాయని రాముడు లక్ష్మణునికి చెప్పాడు.

"నానృగ్వేదవినీతస్య
నాయజుర్వేదధారిణః
నాసామవేదవిదుషః
శక్య మేవం ప్రభాషితుం."

అటువంటి నిర్దుష్టమైన వాక్పటిమయే తన ప్రభువగు సుగ్రీవునకు శ్రీరాముని చెలిమిని సంపాదించి పెట్టినది. అది రామాయణగాథలోని ముఖ్యఘట్టములలో నొకటి. అతని ధీవిశేషము, మానవ ప్రవృత్తిని సరిగా అర్థంచేసుకోగలశక్తి, పరాకవిషమ ఘట్టంలో కూడా మారుతికి రాముని అభిమానాన్ని సంపాదించి పెట్టాయి. లంక కెదురుగా సముద్రతీరాన యుద్ధాన్ని గురించి చర్చించేందుకు వారంతా సమావేశమై ఉండగా సహాయార్థియై విభీషణుడు రాముని సమీపించిన సమయంలో, అందరికంటె, ఆఖరికి వానర ప్రభువు అయిన సుగ్రీవుని మాటలకంటె కూడా, వినయంతోను, విజ్ఞానంతోను నిండిన మారుతి మాటలకు, అభిప్రాయాలకే శ్రీరాముడు ఎక్కువ

విలువ ఇచ్చాడు. మారుతి అభిప్రాయమే తన అభిప్రాయమన్నాడు శ్రీరాముడు.

శ్రీరామునికి అతనియందు చాలావిశ్వాసముండుటచేతనే సీతను వెదకుటకై అతనిని దక్షిణ దిక్కుగా పంపినప్పుడు అమూల్యమగు తన ఉంగరమును సహితము అతని కిచ్చెను. అప్పజెప్పిన పనిని సంపూర్ణముగా చేసుకొనిరాగలవాడు మారుతి ఒక్కడేనని సుగ్రీవునకు కూడ తెలియును. దానికి తగినట్లుగానే ఆ కార్యభారము నాతడు వహించి పూర్తిచేశాడు. మహాశక్తి సంపన్నుడైన ఒక రాక్షసరాజు చే సముద్రాలు దాటి, సుదూర ప్రదేశానికి గొనిపోబడి, పలువురచే పరివేష్టితయైయున్న సీతాదేవిని వెదకుటకు బయలుదేరటమంటే మాటలు కాదు. ఆమె నాతడు అంతకుముందు చూడలేదు. రాముడు చెప్పిన ఆనవాళ్ళనుబట్టి గుర్తుపట్టాలి. మొట్టమొదటి పర్యాయం లంకనంతను గాలించినా గాని, ఆమె కనిపించక పోయేసరికి క్షణ మాత్రంగా నిరాశ కలిగింది హనుమంతుడికి. కాని పట్టుదలతోను, ఆత్మవిశ్వాసంతోను వెదకి వెదకి చిట్టచివరకు శోకమూర్తి యైన ఆమెను ఒక చెట్టుక్రింద చూసి, ధైర్యం తెచ్చుకుని ఆ చెట్టు నెక్కాడు.

రాముని క్షేమ సమాచారాలను సీతకు తెలియజేసే టప్పుడు ఆంజనేయులు ఎంతో ఆలోచించి, పొందిక అయిన పదాలను పొదిగి ఆ ఇరువురు ప్రేమికుల హృదయాలను ఆకళింపు చేసుకున్నట్లు రుజువు చేసుకున్నాడు. నిరాశతో నిండిన సీత హృదయంలో రామ కథామృతమనే తీయ తేనియలను తన మధురమైన కంఠధ్వనితో పోశాడు.

"సంశ్రవే మధురం వాక్యం...."
(సుందరకాండ - 31 వ సర్గ)

రావణు డామెను అపహరించిన నాటినుండి ఆ నాటి వరకు జరిగినవాటి నన్నింటినీ పూసగ్రుచ్చినట్టు వర్ణించటంవల్ల, రామునిఉంగరం-సీతాదేవికి అత్యంత ప్రియమైనది కావటంచేత - దానిని ఆమెకు ఇవ్వటం వల్లను తనను రాముడు రావణుని బారినుండి రక్షించగలడనే విశ్వాసమును కలిగించి, ఆమె చింతలను బాపాడు.

సర్వసాధారణంగా సీతాదేవి రామునికి అందజేయమన్న సందేశము వినగానే, దూతగా అతనిపని పూర్తయినట్లే. కాని హనుమంతునకు అట్లనిపించ లేదు. తన ప్రభువులగు రాముడు, సుగ్రీవుడు చెప్పిన మాటలు రావణునకు తెలియజేయుట కూడ తన కర్తవ్యమనే భావించాడు. రావణునకు వాని శత్రువు యొక్క సద్గుణసంపద, శౌర్యసంపద కూడ తెలియ జెప్పా లనుకున్నాడు. ప్రయత్న పూర్వకంగా తనంతట తానే రావణుని సమక్షానికి కొనితేబడి - (ఇంద్రజిత్తునకు చిక్కిన కారణంగా)-నప్పుడుకూడా అతడు గంభీరమైన వాక్కుతో ఒక్క బాణముతో మహాశక్తిమంతుడగు వాలిని సంహరించిన శ్రీరామునితో రావణుడు యుద్ధము చేయవలెనని చెప్పినాడు. వాలిని రావణు డిదివరకే ఎరుగును.

"త్వయా విజ్ఞాతపూర్వశ్చ
వాలీ వానర పుంగవః...."

ఇదివరకు అవలంబించిన అధర్మమార్గాన్నే ఇంకా అంటిపెట్టుకుని ఉండవలచేటట్లయితే ముల్లోకాలలోనూ రావణునికి రక్షణ లభించదని హెచ్చరించాడు. ఆవిధంగా తాను కేవలం దూత, వానరుడు మాత్రమే కాదని రావణునికి రుజువు చేసి, రామ సుగ్రీవులకు సుఖ సంతోషములను కల్గించు వార్తలను తీసుకొని సముద్రము దాటి, తన ప్రభువులను జేరి వారి మన్ననలకు పాత్రుడయ్యాడు. వారిరువురి ఆనందానికి మితిలేకపోయింది. దానిని వారు మాటలతో వెలువరించలేక పోయారు. శ్రీరాముడు మారుతిని ఆప్యాయంగా ఆలింగనం చేశాడు. అంతకంటె మారుతి మాత్రం కోరదగినదేమిటి ?

సమర్థుడైన సేనానిగా మారుతి నిర్వహించిన పాత్ర అతని దౌత్యముకంటె గొప్పది. నూరు యోజనాలు గల సముద్రమును దాటి ఏమాత్రము అలసట లేకుండ ఉండుట, లంకకుగల ముఖ్యద్వార పరిరక్షకునితోటి కయ్యము, గొప్పదైన అశోకవన

విధ్వంసము, రావణుని సైన్యాధినాథులతో జయప్రదంగా పోరాటం, తన విధిని చక్కగా నిర్వర్తించి తిరిగివచ్చుట - ఇవి సామాన్యుడగు మానవమాత్రునికి సాధ్యమయ్యే పనులు గావు. ఈ ప్రయత్నాలను ప్రోత్సాహపరచిన మనోదార్ఢ్యము, అతనికి సర్వదా కార్య నిర్వహణకు ప్రేరణ అయిన కార్యదీక్ష, కార్య నిర్వహణ సమయంలో అతనిని విడనాడకుండా తోడ్పడిన వినయసంపద అతనిలోని ప్రత్యేక లక్షణాలు. ఇంతా సాధించిన తరువాత అవతలి ఒడ్డున వేచి ఉన్న వానరుల నుద్దేశించి తాను సాధించిన ఘన విజయానికి మూడు కారణాలున్నాయని చెప్పాడు. (1) శ్రీరాముని ప్రభావము (2) వానరుల సమష్టి సహకారము (3) ప్రభువగు సుగ్రీవుని ఆజ్ఞాపన.

"రాఘవస్య ప్రభావేన
భవతాం చైవ తేజసా
సుగ్రీవస్య చ కార్యార్థం
మయా సర్వమనుష్ఠితం :"

—(సుందరకాండ)

అంతటి శక్తిసంపద, వినయసంపదల మేలి కలయిక అనన్య సామాన్యము.

తన ధైర్య సాహసాలను ప్రదర్శించేటందుకు ఇంకా మంచి అవకాశాలు అతనికి లంకలో యుద్ధంలో లభించాయి. రాముని పక్షానికి విజయం తప్పదనే దృఢ విశ్వాసంతో తన ధైర్య స్థైర్యాలను సర్వదా ప్రదర్శించాడు. ఆ యుద్ధంలో సర్వసైన్యమూ స్పృహ తప్పి పడిపోయిన క్షణంలో మారుతి తప్ప మరెవ్వరూ వారిని రక్షించలేకపోయేవారు. సంజీవిని తెచ్చేపనిఅతనికి అప్పజెప్పబడింది. ఆకార్యనిర్వహణలోని సాధకబాధకాలను, భారాన్ని పరిశీలించినట్లయితే, మారుతి ఆ కార్యాన్ని సాధించటంలో ప్రదర్శించిన నేర్పు, వేగము ఆశ్చర్యాన్ని కలిగించి తీరుతాయి. అంతే కాదు! అది అతడికి శాశ్వతమైన కీర్తిని సంపాదించిపెట్టింది కూడా.

ఆదర్శప్రాయుడగు భక్తుడుగా కూడా అతడు అత్యున్నత స్థానాన్ని అందుకో గలిగాడు. యజమాని నియోగించిన కార్య నిర్వహణకై హృదయపూర్వకంగా ఆత్మార్పణం చెయ్యటమే నిజమైన భక్తి. ఎంతటి అడ్డంకులనైనా ఏకాగ్రచిత్తంతోను, ధైర్య సాహసాలతోను ఎదుర్కొని సాధించటమే భక్తునికి ప్రధాన లక్షణం. సముద్రాన్ని దాటేటప్పుడు అతడు మూడు అవరోధాల నధిగమించవలసి వచ్చింది. వాటిలో మొదటిది అంతగా అవరోధం కాదు. శ్రమతో కూడిన పెద్ద ప్రయాణం చేస్తున్నాడు గనక క్షణకాలం విశ్రాంతి తీసుకోమనీ ఆహ్వానమే! అయినప్పటికే అతని దృష్టి అంతా లక్ష్యసాధన మీదనే కేంద్రీకరింపబడి ఉండటంవల్ల విశ్రాంతి తీసుకో దలుచుకోలే దతడు. అటువంటి స్థిరచిత్తంతోనే మిగిలిన రెండు అవరోధాలను అధిగమించి సముద్రాన్ని దాటాడు. లంక ముఖద్వారం చేరాక ముహూర్త మాత్రం తన లక్ష్య సాధనకు అవలంబించవలసిన విధానాలను గురించి ఆలోచించాడు, తద్వారా తనకు అత్యధిక లాభాన్ని సంపాదించాలని, రాముని కీర్తి ప్రతిష్ఠల నినుమడింప జెయ్యాలని, అనుకున్నాడు. రాముని కీర్తిప్రతిష్ఠలను గురించిన ఆలోచనలే సదా అతని మనస్సులో ఉంటాయి.

"రామస్యాభ్యుదయే రతః!..."

—(సుందరకాండ)

రాముని ప్రప్రథమంగా చూసిన క్షణంలో ఆయన ఎడల అతనికి కలిగిన భక్తిభావము హృదయగతమయిపోయింది. రాముడు సీతావియోగానికై పరితపించిన తీరును లక్ష్మణుడు చెప్పగా విని అతని హృదయం ద్రవించింది. అతడు తన ధీ విశేషంవల్ల సీతారాముల పరస్పర ప్రేమానురాగాలను అవగాహన చేసుకో గలిగాడు. సీతారాముల ప్రేమానురాగాలను, వారి పరస్పర వియోగానికి మారుతి ఎంతగా చింతించినది వర్ణిస్తూ మారుతి ముఖతః నాలుగు శ్లోకాలు వ్రాశాడు వాల్మీకి. అశోక వృక్షంమీద కూచుని చెట్టు క్రింద నున్న సీతనుచూసి అటువంటి దంపతులు మరెవ్వరూ ఉండరని, అట్టివారికి పరస్పర వియోగం సంభవించటంకంటె విషాదభరితమైనది ప్రపంచంలో మరేదీ ఉండదని అంటాడు. (సుందరకాండ)

సీతాదేవితో మాట్లాడేటప్పుడు అతడు ప్రదర్శించిన అద్భుతమైన తెలివితేటలు, హృదయగతానురాగము సీతాదేవి మెప్పును పొందాయి.

"విక్రాంత స్త్వం సమర్థ స్త్వం
ప్రాజ్ఞ స్త్వం వానరోత్తమ!"

మొట్టమొదట మారుతి తెలివితేటలను, ధైర్యాన్ని చూసి, ఆమె చాలా ఆశ్చర్యపోయింది. రాముని మన స్థితిని ఆతడు వర్ణించిన రీతి ఆమెకు నచ్చింది. తనకు లంకనుంచి విముక్తి అతనివల్లనే సాధ్యమవుతుందనే అభిప్రాయానికి వచ్చిందామె. అందువల్లనే రామునికి సందేశము పంపుతూ చివరిమాటలుగా ఒక్క నెలలోగా తనకి అక్కడినుంచి విముక్తి కలిగించేందుకు కావలసినటువంటి ప్రయత్నమంతా చేసితీరాలని మారుతిని హెచ్చరించేటంత నమ్మకం కుదిరిందామెకు అతనిలో. రాముడు కూడా అతనిని అంతగానూ నమ్మి, రావణునిపై తాను విజయాన్ని సాధించినవైనం కూడా మారుతి ద్వారానే సీతాదేవికి పంపాడు. సీతారాము లిరువురి ఎడల అతనికిగల భక్తి గౌరవాలవల్లనే అతడు అనన్య సాధ్యమగు 'చిరంజీవిత్వా'న్ని సాధించగలిగాడు. ఈ వరంవల్ల సీతారాముల నామ సంకీర్తనం ఎక్కడ జరిగితే అక్కడల్లా అతడుంటాడు. ఈ మహాభక్తుడు మన అందరి హృదయాల్లోను స్థిరనివాస మేర్పరచుకొని వానిలోని కల్మషాలను నాశన చేయుగాక! అతడు మనలో కార్యదీక్ష, ధైర్య సాహసాలు, భక్తి విశ్వాసాలు పెంపొందించుగాక!

"మనోజవం మారుతతుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం
వాతాత్మజం వానరయూథముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి!"

(Bhavan's Journal పత్రిక అనుమతితో.)



# మహాశివరాత్రి

శ్రీమదాచార్య రఘునాథచక్రవర్తి

మహాభారతంలో ఆనుశాసనిక పర్వం చతుర్దశాధ్యాయంలో భీష్ముని ప్రశ్నకు శ్రీకృష్ణు డిచ్చిన సమాధానంలోని శ్లో. తస్యాహమసురఘ్నస్య - కాంశ్చి ద్భగవతో గుణాన్ । భవతాం కీర్తయిష్యామి వ్రతేశాయ యథాతథం ॥ అనే శ్లోకంలో ప్రయోగించిన వ్రతేశాయ అనే పదం శివపరంగాను వ్రతములకు ఈశ్వరుడైన శివుని పరంగాను అనగా శివప్రీతి పరంగాను పర్యవసిస్తుంది. ఉపమన్యువు తనకు తెల్పిన విధంగా శివమాహాత్మ్యమును కృష్ణుడు వివరించాడు. ఇవి ఉపమన్యువు వాక్యములు. శ్లో..... నశ్రుమయదన్యస్య - లింగమభ్యర్చ్యతే సురైః ॥ కస్యాన్యస్య సురైస్సర్వై - ర్లింగం ముక్త్వా మహేశ్వరమ్ । అర్చ్యతేర్చితపూర్వం వా - బ్రూహియద్యస్తితేశ్రుతిః ॥ దేవతలు అన్యుని లింగమును అర్చించుచున్నారని యెన్నడూ వినలేదు. మాహేశ్వరమైన లింగం తప్ప ఏ ఇతరుని లింగమును సర్వదేవతలు అర్చించుతున్నారో (పూర్వమొకప్పుడైనా) అర్చించినారేమో వినికిడి ఉంటే చెప్పు అని ఉపమన్యువు కృష్ణుని అడిగినాడు. ఈ సృష్టిలో ఉన్న ప్రజలు ("నపద్మాంకా, నచక్రాంకా, నవజ్రాంకా యతః ప్రజాః । లింగాంకాచ, భగాంకాచ - తస్మాన్మాహేశ్వరీ ప్రజా" ॥) మాహేశ్వర ప్రజలు అంతేగాని బ్రహ్మచిహ్నమైన పద్మం, విష్ణుచిహ్నమైన చక్రం, ఇంద్ర చిహ్నమైన వజ్రం వీళ్ళకు లక్షణములుగా లేవు. పార్వతీ పరమేశ్వరులు అనుగ్రహించినవారు తృతీయాప్రకృతు లవుతున్నారు.

ఈ విధంగా సర్వ సృష్టిమీదను ముద్రవైచిన పార్వతీ పరమేశ్వరులకు సంబంధించి దీ పర్వదినం. ఈ శివరాత్రిలోను లింగోద్భవకాలం పుణ్యకాలం. అర్చన ప్రధానంగా తత్సంబంధిఅయి ఉండడంచేత, మొదటి వాక్యంలో చెప్పబడిన "వ్రతేశాయ" అనే పదము సర్వవ్రతములకు శివుడే ఈశ్వరుడు అనే అర్థం ఇస్తుంది. మహాశివుడు, మహాశివరాత్రి, మహాశివ వ్రతము అనే మూటియొక్క మహత్వములను గతార్థము లైనవి.

చాంద్రమానమున మాసములు అమావాస్యతో ముగియుట పూర్ణిమతో ముగియుట అని రెండు విధములుగా విభజితాలై ఉన్నాయి. అమావాస్యతో మాసం ముగిసే పక్షాన్ని ఆశ్రయించినట్లయితే మాఘ కృష్ణచతుర్దశి మహాశివరాత్రి, పూర్ణిమతో మాసం ముగిసేపక్షంలో ఫాల్గున కృష్ణచతుర్దశి మహాశివరాత్రి అవుతున్నది.

మాఘ కృష్ణచతుర్దశ్యాం - ఆదిదేవో మహానిశి
శివలింగ మభూ త్తత్ర - కోటిసూర్యసమప్రభం.

—(ఈశాన సంహిత)

మహానిశి అనగా అర్ధరాత్రివేళ. దీన్నే నిశీథం అంటారు —

మహానిశాద్వేఘటికే - రాత్రౌ మధ్యమయామయోః

అని దేవలుని నిర్వచనం. రాత్రి రెండవజాము చివర గడియ, మూడవజాము మొదటిగడియ చేరితే ఏర్పడే ఘటికాద్వయమునకే మహానిశాసంజ్ఞ వర్తిస్తున్నది.

ఉపవాస ప్రభావేణ - బలాదపిచ జాగరాత్
శివరాత్రే స్తథా తస్యాం - లింగస్యాపి ప్రపూజయా
అక్షయాన్ లభతే కామాన్ -
శివసాయుజ్యమాప్నుయాత్

అని నాగరఖండంలో చెప్పబడి వుంది--

సూత ఉవాచ : (స్కాంద పురాణం)

మతాంతర బలాద్ దృప్తో - దేవతాంతర పూజనః
శివరాత్రేతుయోభుంక్తే - విషయానపి మూఢధీః
అంధంతమః ప్రయాత్యేవ - ముచ్యతేదైవతాంతరైః.

ఇతరమత స్వీకారంవల్ల గర్వించినవాడు గాని, ఇతర దేవతలను పూజించేవాడు గాని శివరాత్రి నాడు భోగములను అనుభవించే యెడల అంధతామిస్రనరకంలో పడగలడు అని దీని అర్థం. ఈ

వాక్యంచేత మనుష్యజాతి మొత్తానికి ఇది అవశ్యా నుష్ఠేయమని తెలుతున్నది. "హరో బీజం హరి ర్యోని - రపత్యం జగదేతయోః." లింగస్థానీయుడు హరుడు, పానవట్ట స్థానీయుడు హరి. ఈ యిద్దరి సంతానమే ఉన్న జనాభా అంతా. ఈ మహాలింగము 'శివనారాయణాహ్వాయ' మనికూడా చెప్పబడుతున్నది.

"ఏకాదశీ కోటి కృతౌతు యత్ఫలం -
వారాణసీవాస సహస్ర వర్షైః ।
జన్మాష్టమీ లక్షభంచ సిద్ధే -
దేకేన సత్యం శివరాత్రి కేన॥

కాశిలో వర్ష సహస్రం నివసించినా, (కృష్ణ) జన్మాష్టమీ వ్రతములు లక్షచేసినా, ఏకాదశీవ్రతములు కోటిచేసినా ఒక శివరాత్రికంతో సాటిరావు. శివరాత్రిక మనగా మహాశివరాత్రి వ్రతం. ఇది అర్థవాదం కాదు యథార్థ వాదమేనని స్కాందపురాణ వచనం.

"కామినః పంచధా సిద్ధ్యేత్ - ఫలమేతత్ ప్రభావతః ।
ధనం, సుఖం, తథారోగ్యం-సంతానం జ్ఞానమేవచ॥

కామ్యంగా ఈ వ్రతాన్ని ఆచరిస్తే ఐదు ఫలములు సిద్ధించుతాయని వివరించాడు.

"కించ మాఘే కలౌ కృష్ణే - నిశీథే పరమేశ్వరః ।
జగత్సంరక్షణార్థాయ - మహాలింగ మభూత్పురా."

కలా అనగా చతుర్దశీ తిథియందు అని అర్థం. మాఘ కృష్ణచతుర్దశినాడు అర్ధరాత్రివేళ పరమేశ్వరుడు జగత్సంరక్షణార్థం మహాలింగంగా అవతరించెను. అదే లింగోద్భవకాల మనబడుతుంది.

ఇంతవరకు ఉదాహరించిన పంక్తులను బట్టి మహా శివరాత్రి మాహాత్మ్యం, మహా శివరాత్రివ్రత మాహాత్మ్యం రెండూ కూడా సుస్పష్టమవుతున్నవి. "వ్రతం పరాత్పరం నాస్తి - శివరాత్రిః పరాత్పరా." శివరాత్రి వ్రతాన్ని మించగల వ్రతం మరొకటి ఏదీ లేదు. శివ రాత్రి వ్రతం మాత్రం ఏ ఇతర వ్రతాన్నైనా మించి తీరుతుంది.



# జీర్ణదేవాలయోద్ధరణ

శ్రీ పైడి లక్ష్మయ్య

యల్లయ్య : అయ్యా కమీషనరుగారూ! దండాలు.

కమీ : మంచిది! విశేషాలేమిటి?

యల్ల : విశేషాలు చెప్పడానికి మా కేమి తెలుస్తాయి. తామే సెలవిస్తే వినాలని వచ్చాను. ఈమధ్య శ్రీశైల దేవస్థానములో ఏవేవో పనులు చాలా చురుకుగా జరుగుతున్నాయట. పత్రికలన్నీ దడ బడగా వ్రాస్తూ ఉన్నాయి. మన గవర్నరుగారు మొన్న వెళ్ళి చూచివచ్చారంట. వివరాలు చెప్పు తారా బాబూ! వింటాను.

కమీ : తప్పకుండా చెప్పుతాను. ఈ సంవత్సరము ముఖ్యంగా యీ మూడునెలలనుండి, అక్కడ మంచిపని జరిగింది. యింకా బహు చురుకుగా పనులు జరుగుతున్నవి. శివరాత్రి సమీపించు తున్నదిగదా. రేయింబవళ్ళు బహు శ్రద్ధగా మరమ్మత్తు పనులు జరిగించుచున్నారు. నాలుగైదు సంవత్సరాలలోనే యీ శ్రీశైలక్షేత్రము తిరుపతి మాదిరిగా చాలా అభివృద్ధి నందగలదు. ఆదా యము ఎక్కువగా రాగలదు. ఇపుడీ శ్రీశైలానికి వెన్నెలరాత్రులు వచ్చినవి. క్రమంగా పున్నమ తప్పక రావలయును. జీర్ణదేవాలయోద్ధరణ, మా డిపార్టుమెంటువారు చేస్తున్న పనులలో మొదటి దిగా భావించుచున్నాము.

యల్ల : చాలా మంచిపని బాబూ! కూలిపోతున్న గౌరవకుటుంబములను ఉద్ధరించి, నిలువబెట్టే వారు, కూలిపోతున్న దేవస్థానములు కట్టించి విగ్రహాలు మరల ప్రతిష్ఠ చేయించి చక్కగా పూజా పునస్కారములు ఏర్పాటు చేసేవాళ్ళు చాలా పుణ్యాత్ములంటారు బాబూ.

కమీ : నిజం. అమితమైన డబ్బు వెచ్చించి దేవా లయాలు నిర్మించి విగ్రహాలు ప్రతిష్ఠించుటకన్న, ఉన్న దేవాలయాలు జీర్ణావస్థలో శిథిలస్థితిలో నున్నవాటిని పునరుద్ధరించి, సక్రమ పూజా నిధుల నేర్పరచుట బహు పుణ్యకార్యము. క్రొత్తగా విత్తనము నాటి మొక్కలను పెంచుటకన్నా, నీరులేక, పోషణలేక ఎండిపోతూ కూలిపోతున్న చెట్టును పోషించుట పుణ్యసాధకము గదా.

యల్ల : బాబూ! శ్రీశైలక్షేత్రము మన దేశములో చాలా ముఖ్యమైన దంటారు. అక్కడ ఉన్న మల్లికార్జున లింగము, పన్నెండు లింగాలలో ఒకటి అంటారు. భ్రమరాంబాదేవి అమ్మవారు పద్దెనిమిది శక్తులలో ఒకశక్తి అంటారు. ఎన్నో యేండ్లక్రిందటనే ఈ స్వామి ఉండినా డంటని మా శాస్త్రులవారు బహు ప్రశంసచేసి చెప్పుతూ వుంటారు. నిజమేనా? అట్లాంటి దేవా లయానికి ఈ దుస్థితి ఎట్లా వచ్చింది బాబూ!

కమీ : నిజము. ఈ క్షేత్రము చాలా పురాతనమైనది. ఈ దేవాలయము నల్లమల కొండలలో నిర్జనా రణ్య సమీపములో నున్నది. జనులు దేవాలయము చేరుకొనవలెనన్న చాలాదూరము పులులు, చిరు తలు, ఎలుగులు మొదలగు దుష్టమృగము లున్న అడవులలో పాదచారులై నడువవలెను. కొండ లెక్కవలెను, దిగవలెను. కొండ లోయలలో నడువవలెను. మధ్య దొంగల భయము, ఒంటిగా పోవుటదుర్లభము. కాబట్టి సంవత్సరానికిఒకమారు మహాశివరాత్రికి భక్తాదులు గుంపులు గుంపులుగా వెళ్ళుచుందురు. ఉగాదికి ధార్వాడా మున్నగు

మైసూరు ప్రాంత్యముల నుండి కన్నడిగులు, మహారాష్ట్రులు చాలమంది యాత్రికు లరుదెంతురు. అరణ్యములో నున్న అడవి చెంచుల సహాయముతో మెల్లగా పదయాత్ర చేయుచుందురు. 14వ శతాబ్దములో శ్రీశైలము పెద్దపట్టణముగా నుండినప్పుడు యాత్రికు లెట్లు పయనము సాగించుచుండినది, పాల్కురికి సోమనాథకవి పండితారాధ్య చరిత్రలో చక్కగా వర్ణించినాడు. నక్షత్ర పర్వతము దీనికే చుక్కలపర్వత మంటారు. దీని నధిరోహించునప్పుడు "త్రొక్కుచు, నెక్కుచు, దొర్లిల్లు కొనుచు, జిక్కుచు, మోకాళ్ళ చేతు లూనుచును - వంగుచు, వ్రాలుచు, దొంగుచు, జనుచు, జెంగుచు, నొండొరు జెయ్యూదికొనుచు, 'చేదుకో చేదుకో - శ్రీగిరినాథ - చేదుకో మల్లయ్య - చేదుకొమ్మనుచు, చేదుకో చేదుకో శ్రీశైల నిలయ - చేదుకో మల్లయ్య చేదుకొమ్మనుచు" — "పర్వతయ్యా మమ్ము పాలింపు మనుచు, మ్రొక్కుచు నీడల జక్కుచుం బండ్లు, మ్రొక్కుచు లీలల నుక్కుచు, దిన్నె లెక్కుచు, జాలకు స్రుక్కుచు -" నడచుచుండిరట. ఇక, నానాదేశ ప్రజలు భక్తిపరవశులై దారి నడచుచున్నప్పుడు, ఆంధ్రులైన మనవారు "నల్లమోనల్లమో నగరాజరాజ: మల్లయా. మల్లయా మహనీయ తేజ, పరమ పాతక కోట్లు భస్మమై తూలు - సిరిగిరిమల్లన్న శరణన్న జాలు" అనికీర్తించుచుండిరట. ఇక కన్నడిగులు, తమ భాషలో "నజగమదేవయ్య బిజమాడిరయ్య - నిజభావ దేవయ్య నీవిత్తబన్ని - యల్లమ దేవయ్య ఎత్తలో హూది, బల్లదదేవయ్య బన్నిరి నీవు - విరూపాక్ష దేవయ్య కరుణిను బేడేడ, సహసుఖదేవయ్య - నరసరబన్ని - బవడిగె దేవయ్య బన్ని మల్లయ్యా, సిరిగిరి మల్లయ్య శరనెన్నిరయ్యా, పరమపాతక గణ - పరిహరిసువను" అని పాడుచుండిరి. ఇక మహారాష్ట్ర దేశీయులు "మాగర హూనకో - మరుబాపహ్మణత - భాగవతే వచే భక్తతేహ్మ ణత - చరలింగ గురులింగ శంభునొహ్మణత, అరెరావహేభక్త ఆపలేలింగ - సుఖకాళజతి మానలా ఫలనాచె - మఖరచే సిరిగిరి మల్లయ్యా రారా!" యని బంధులుపెట్టి యాడుచు పాడుచుండిరి. తమిళదేశీయులైన అరవవారు "అరులు గిరితిమెన్నె యరనేపి రావే - చిరిగిరి నిలయనె చివనె యాస్తవనె - అంగమూలందానె యాయిరుందదనె - మంగయల్ పొంగనే మల్లికార్జుననె - అరవత్తు మూవరుక్కుత్త నాయకనె - మలనాలు మరియావ - మల్లికార్జుననె —" అని తమ భాషలో స్తుతించుచు, నుతించుచు, గానము చేయుచుండిరట. యావద్భారతావనినుండి, మాళవ, కాశ్మీర, మాగధ, సింధు, గౌళ, తురుష్క, కొంకణ, హూరసేన, బంగాళ, కాంభోజ, పాండ్య, గూర్జర, కళింగ, బర్బర, సింహళిక, కరహాట, సౌరాష్ట్రాది షట్పన్చాశద్దేశములనుండి, యాత్రికులు శ్రీశైలమునకు మహాశివరాత్రికి వచ్చి చేరుచుండినటుల వ్యక్తమగుచున్నది. కాశ్మీరము మొదలు కన్యాకుమారివరకు కున్న భారతదేశము నుండియేకాక సింహళమునుండి కూడా జనులిందు వచ్చుచుండిరనుట గమనింపవలసిన విషయము. కాబట్టి ఆ కాలమున నీ క్షేత్రముయొక్క ప్రాముఖ్యత, ప్రాధాన్యత, ఘనత దీనింబట్టి యూహింపవచ్చును. ఈ పట్టణము "మల్లికార్జున" మను పేరుతో పిలువబడుచుండెడిది. "గిరిదర్శనమ్ము ముక్తికి హేతువనిన - పురిదర్శనఫల మేపోల్కి వర్ణింప — అరుదగు శ్రీ మల్లికార్జునపురము — శ్రీకరంబై జగత్సేవ్యమై యలరు" అన్నారు ఆనాటి పండితులు. కవిసార్వభౌముడు శ్రీనాథుడు కాశీఖండాది కావ్యములలో ఈ శ్రీపర్వతమునుగూర్చి ప్రశంసించి మనోహరముగా రచించినాడు. ఇంతేకాదు. ఆదిశంకరులుగూడ యీ దివ్యక్షేత్రమున కొన్ని వత్సరములు నిలచి, తా రచించిన శివానందలహరిలో "సేవే శ్రీగిరి మల్లికార్జున మహాలింగమ్ శివాలింగితమ్" అని స్తుతించినాడు.

యల్ల: ఇంతటి వైభవము గాంచినపట్టణ మేల పాడువడినది? అట్టి దేవాలయాని కేల యీ దుర్గతి పట్టిన దంటారు?

కమీ: అదియే చెప్పుచున్నాను. వినుము. బౌద్ధయుగమున సిద్ధనాగార్జునకాలంలో కాకతీయసమ్రాట్టుల కాలంలో, రెడ్డిరాజుల పరిపాలనలో, విజయనగర రాజులకాలంలో-ముఖ్యంగా శ్రీకృష్ణదేవరాయపాలనలో, ఛత్రపతి శివాజీకాలములో అన్నివిధముల నాదరింపబడి, పోషింపబడిన ఈ దేవాలయము రంగరంగ వైభవముతో విరాజిల్లి, మహా ప్రాభవము నందిన యీ శ్రీశైలపురము 17-18 శతాబ్దములలో అనేకమైన దండయాత్రలకు గురియై, దేవాలయపు టాస్తు లెల్లను బంగారుతో సహా దోచుకొనిపోబడెను. దివిజ వంద్యుఁడగు మల్లికార్జునుఁడు దిగంబరుఁ డాయెను. దేవాలయ శాసనములు చూడ ఈ దేవునికి డెబ్బది గ్రామములు జాగీరులుగా నిచ్చినట్లు వ్యక్తమగుచున్నది. కాని నేఁడు చూతమన్న ఒక్కగ్రామము కూడా ఎందును గాన్పించదు. అన్నియు రూపుమాసినవి. కాలగర్భములో లీనమైనవి. గోష్పాదమంత భూమికూడా స్వామికి ఈనాముగా యిచ్చినది లేదు. కాబట్టి అష్టైశ్వర్యములతో నలరారిన మల్లికార్జున స్వామి "ఆది భిక్షువుగా మాఱి" దిన పూజలకు కూడా వచ్చిన భక్తులు దర్శనార్థమై యిచ్చుచున్న ఒక్కరూపాయపై నాధారపడవలసి వచ్చెను. కాలగతి యెటు మాఱునో యెవ్వరెఱుంగుదురు. కలిమిలేములు కావడికుండలు గదా. ఈ పట్టణములోని ప్రజలు, పలుమాఱు దండెత్తి వచ్చిన దుష్టమూకల దౌర్జన్యమునకు గుఱియై, వారు పెట్టెడిబాధలకు తాళలేక, ఆహింసలకు సహించలేక ఆత్మహత్యచేసుకొని అసువులు పాసిరి. కొందఱు వారి నిశితాయుధముల కాహుతియై, మఱికొందఱు హుటాహుటి పోరాడి ప్రాణములు గోల్పోయిరి. తుదకు కొంతమంది పలాయనులైరి. మొండికిపడి, దేవునినమ్ముకొని అందేయున్న ఏ కొద్దిమందియో భక్తులు, పూజారులు, యీ దుష్ట మూకల దాడికి వెఱచి, విసుగుజెంది, చెవిటిమల్లన్న మమ్ము చెనటులబారినుండితప్పించ లేవైతివేఅని పట్టణమువిడిచి, సమీపములోనున్న పెద్ద పట్టణములు, పల్లెలు జేరుకొని "ఉసురున్న ఉప్పుఅమ్ముకొని జీవించవచ్చు" నని యూహించి తమప్రాణములు మిగుల్చుకొనిరి. "కర్ణాటకావనీ - కటికలపాలయి - పోయితే సెలవిమ్ము - పోయి వత్తు," అని తల్లికోట యుద్ధానంతరము విజయనగర సామ్రాజ్య పతనముతో లక్ష్మీ సరస్వతులు విద్యానగరము వీడి వెడలినటులు, "శ్రీశైలపురి క్రూర చెనటి మూకలచేత, జిక్కిసుక్కితిమిక - సెలవుమాకు." అని పండితులు, ఐశ్వర్యవంతులైన వర్తకులు, వేయేల అందున్న ప్రజలెల్లరు కాలికి బుద్ధిచెప్పిరి. జన్మమెత్తిన ప్రతి ప్రాణికి, స్థాపింపబడిన ప్రతి సామ్రాజ్యమునకు, సంఘమునకు, నిర్మింపబడిన ప్రతి పట్టణమునకు వృద్ధిక్షయములు నైజములు. విధి యలంఘనీయమని పెద్దలందుకేకదా వాక్రుచ్చిరి!

శ్రీశైలానికి దాపురించిన యీ అమావాశ్య రాత్రి - ఈ చిమ్మచీకటి, సుమారు రెండు శతాబ్దములు గట్టిగా నిలిచె. కాని అదియే, కలకాలము కాపురము చేయదుకదా! ఆంధ్రదేశావతరణముతో, ఆంధ్ర ప్రభుత్వ పాలనలో, గాఢాంధకారములో నున్న ఈ దేవాలయమునకు చీకటి గతించి శుక్లపక్ష మారంభమయ్యెను. ముఖ్యమంత్రిగారి చల్లని హృదయములో శ్రీశైల దేవుఁడు బాట నిర్మించవలెనను సంకల్పము గల్గించుటతో, వెన్నెల రాత్రులలో మొదటిదిన మారంభమయ్యెను. దోరణాల నుండి 32 మైళ్ళ బాట దేవాలయముదనుక నిర్మింపబడెను. దాదాపు 22 లక్షలు దానికయిన ఖర్చు. గత శివరాత్రినుండి అక్కడ అనేక కట్టడములు కట్టబడెను. కేంద్ర ప్రభుత్వమువారి ధనముచే, 42 వేల రూపాయలతో గొప్ప విశ్రాంతి భవనము, స్థానిక అభివృద్ధి ప్రణాళికక్రింద యొసఁగిన విరాళములతో దేవాలయాధికారులు 22 వేల రూపాయల కొక విశ్రాంతి గృహము అనంతపుర పట్టణములోని భక్తుల విరాళములతో ఎనిమిది చక్కని కుటీరములు, వీరశైవ విజ్ఞానసంఘమువారిచే రెండు లక్షల

రూపాయల సత్రము నిర్మింపదలచి, యిప్పుడే ఎనిమిది గదులును, ఆర్య వైశ్య సంఘమువారిచే నొక సత్రము నిర్మింపబడెను. దేవాలయము చుట్టు నున్న చెట్లు, గుట్టలు తీసివేసి, పురనిర్మాణ యోగ్యమగు రోడ్డు నిర్మింపబడినది. దేవాలయాధికారులు క్రొత్తగా నూరుగదులుగల ఒక ధర్మసత్రము నిర్మింప సంకల్పించి, కొన్ని గదులకు పునాదులు వేసిరి. దేవాలయము బస్సులు, రెండు. ఒకటి మార్కాపురము రైల్వేస్టేషను నుండి, రెండవది కర్నూలు రైల్వేస్టేషను నుండి నడుపబడుచున్నవి.

ఫలహార భోజనములకు రెండు హోటళ్లు ఏర్పాటు చేయబడినవి. అన్ని వస్తువులు లభించు దుకాణాలు ఏర్పాటు చేయబడినవి. సంవత్సరము కొలది యాత్రికు లిప్పుడిప్పుడే వచ్చుటకు ప్రారంభించినారు. త్రాగునీరు ఎద్దడి గ్రహించి ప్రభుత్వమువారు, నీటిసరఫరా ప్రణాళికక్రింద నొసంగిన ధనముతో పాతాళగంగనుండి, కృష్ణా తుంగభద్రలోని నిర్మలోదకము దేవాలయముదనుక గొనితెచ్చి యిచ్చుచున్నారు. ఇటీవలనే గవర్నరుగారు శ్రీశైల దర్శనార్థమై వచ్చినప్పుడు విద్యుచ్ఛక్తి దీపము లమర్చినారు.

యల్ల: సరియే బాగున్నది. ఇదియొక భారతకథలాగుంది. దేవాలయములో ఏమైన పనులు జరిగినవా?

కమీ : ఇన్నిపనులు బయటచేసి, మూలవిరాట్టున్న దేవాలయమునకు మరమ్మత్తులు చేయకుండిన నవివేకమనిపించును. కాబట్టి దేవాలయములో కూడ సుమారు లక్షరూపాయల పని జరిపించినాము. ముఖమండపములో ఏనాడో విరిగి, మరమ్మతు లేకయున్న రాతిదూలము తీసివేసి, క్రొత్తగా దూలము వేసినాము. అంతరాలయము, ముఖమండపమంతట, rosaic రాళ్ళు అమర్చబడినవి. భ్రమరాంబాదేవి దేవాలయము చిన్నది. కాబట్టి అయ్యది పూర్తిమరమ్మత్తుగావింపబడినది. మల్లికార్జున గుడికి, భ్రమరాంబా దేవాలయమునకు మధ్య ఆబాలవృద్ధు లనాయాసముగా నడచుట కనుకూలముగా చక్కని సోపానములు నిర్మింపబడినవి. దేవాలయ ప్రాంగణముముందు చెట్లుతో, కంపలతో, చెత్తచెదారములతో, దేవాలయ ప్రదక్షిణము చేయు యాత్రికులకు కష్టముగా నుండెడిది. ఇప్పు డా చెట్లుపెరికి రాళ్లు నమర్చి, సిమెంటు కాంక్రీటు వేసి బహురమ్యముగా చేయబడినది. స్వామికి ఆరువేల రూపాయలు వెచ్చించి రుద్రాక్ష మండపము నిర్మింపబడినది. తలుపులకు వాకిండ్లకు శైవాగమ పద్ధతిలో, ఇత్తడిరేకులతో, బొమ్మలు నమర్చబడినవి. ఇట్టి వెన్నియో చేయబడినవి. స్వయముగా నీవు రేపు శివరాత్రికి వెళ్లి చూడుము. చాల సంతోషింతువు. ఈ దేవాలయము సంవత్సరము క్రితముండిన స్థితి గాంచి, వెతలొందిన వ్యక్తులు నేడు ఈ కొలది కాలములో జరిగిన, అభివృద్ధి గాంచిన యెడల వారి యానందమునకు మితియుండదు.

యల్ల : తాము సెలవిచ్చినట్లు, ఇంత కొద్దికాలములో నింతపని జరిగినది అంటే నిజముగా మెచ్చుకొనదగిన విషయమే. దీని కింతడబ్బు ఎట్లు వచ్చినది ?

కమీ : కొంత (common good fund) పొదుపునిధి నుండి యివ్వబడినది. కానీ యెక్కువ మొత్తము భక్తులు ఔదార్యముతో విరాళములుగా నిచ్చియున్నారు. ఇచ్చుచున్నారు. దేవాలయములో ఒక చిన్న తపాలా ఆఫీసుకూడ స్థాపింపబడినది. ప్రతిదినము భక్తులు నానాదేశములనుండి మనియార్డర్లద్వారా తమ శక్తికొలది ధనము పంపించుచున్నారు.

యల్ల : ఇలాంటి పనులు యితర దేవాలయములలో కూడా జరుగుచున్నవా ?

కమీ : ఔను. చాలా దేవాలయములలో జరుగుచున్నవి. తూర్పుగోదావరి జిల్లాలో అంతర్వేది నృసింహస్వామి దేవాలయములో సుమారు 80 వేల రూపాయల పని జరిగినది. అన్నవరము వీర వేంకట సత్యనారాయణస్వామి దేవాలయములో సుమారు ఒక లక్షరూపాయల పని జరిగినది.

ఇంతలోనే అచట రెండు లక్షల రూపాయలు పని ప్రారంభమగును. ఈ దేవాలయమున్న కొండకు మొన్ననే రోడ్డుకూడా వేయబడినది. గుంటూరు జిల్లాలో పెద కాకానిదేవాలయమునకు 80 వేలు రూపాయలపని జరిగినది. యాత్రికులకు వసతిగృహములు కట్టబడినవి. ర్యాలిలోని దేవాలయముకడ ఒక గొప్ప వసతిగృహమునకు శంకుస్థాపన చేయబడినది. సింహాచలదేవాలయమునకు నాలుగు లక్షల రూపాయలతో ఒక వాట నిర్మింప దలచినాము.

యల్లు : భద్రాచల దేవాలయము తమ ఆధీనములోనికి వచ్చినట్లు విన్నాము. అచటేమైన చేయుచున్నారా?

కమీ : ఔను గత మాసములో చార్జీ తీసుకొన్నాము. స్వామివారికి వచ్చే ఆదాయము సక్రమముగా చేరునట్లు కొన్ని కట్టుదిట్టములు చేయుట జరిగినది. లక్షరూపాయలకు పైగా విరాళము లిచ్చుటకు భక్తాదులు వాగ్దానము చేసినారు. కొన్ని వసతి గృహములు నిర్మించుటకు దేవాలయ మరమ్మత్తులు జరిపించుటకు ప్రారంభించినాము. ఈ దేవాలయానికి అనాయాసముగా విరాళములు వచ్చుచున్నవి. రెండు మూడు సంవత్సరములలోనే ఇది రెండవ తిరుపతి అగుననుకొన్నాము.

అనంతపురము జిల్లాలో కల్యాణ దుర్గమునకు చేరువ నున్న 'బౌణ తిమ్మరాయ' స్వామి దేవాలయమునకు మైసూరు దేశములోని చిత్రకల్లు దుర్గము ప్రాంతములోని భక్తులు చాలా విరాళము లిచ్చునట్లు వాగ్దానము చేసినారు.

యల్లు : బహు సంతోషం బాబూ! ఈ దినము చాలా మంచిరోజు. చాలా పుణ్యసార్థకమైన విషయాలు విన్నాను. ఈ విధంగా పనులు జరిగితే అన్ని దేవాలయాలు బహు బాగుపడుతాయి.

కమీ : ఔను. అన్నిదేవాలయాలలో క్రమేణ ఇట్టి అభివృద్ధి పనులు జరుప నిశ్చయించినాము. అన్నియు ఒక్కనాడే జరుపలేముగదా! ఓరిస్తే ఓరుగల్లు పట్టణ మౌతుందన్నారు. ఏనాఁడు ప్రతిపట్టణములోను, ప్రతిపల్లెలోనునున్న దేవాలయాలు చక్కబడి సక్రమముగా పూజలు పొందగల్గునో ఆనాఁడు మనదేశము పూర్వపు టౌన్నత్యముగాంచి నిత్యకల్యాణము, పచ్చతోరణములతో అష్టైశ్వరములతో నలరారునని నా పూర్ణ విశ్వాసము.

యల్లు : నిజము బాబూ నిజము. నమస్కారము. వెళ్ళి వస్తాను.

కమీ : మంచిది మల్లయ్యా!

(ఆలిండియా రేడియో హైదరాబాద్ కేంద్రంవారి సౌజన్యంతో)



# కాలడిదేవాలయములోని రెండు శాసనములు

శ్రీ [illegible]

పరమేశ్వరుని యవతారమని విశ్వసింపఁబడుచున్న శ్రీ శంకర భగవత్పాదులవారి జన్మస్థలము కేరళదేశమునందలి తిరుచూరు జిల్లాకుఁ జెందిన కాలడిక్షేత్రము. ఇది పెరియారు, అల్వాయినది అను నామాంతరములు గల పూర్ణానదీతీరమున నున్నది. శ్రీ శంకర భగవత్పాదులచేఁ బ్రతిష్ఠింపఁబడిన శ్రీకృష్ణుని దేవాలయమొకటి పురాతన మిచటఁగలదు.

అత్యల్పమగు వయస్సునందే అప్రతిమాన ప్రతిభావంతులై, సమస్తవిద్యలను కరతలామలకము లొనర్చుకొని, ఆసేతుహిమాచలము పర్యటించి, మతాంతరములను ఖండించి యద్వైతమతమును స్థాపించి, పెక్కు ఉద్గ్రంథములను రచించి, తమ యశస్సు నాచంద్రార్కము వెలయించిన యా అవతార పురుషులకు జన్మస్థలమున దేవాలయము లేకుండుట కడు శోచనీయమని యెంచి క్రీ. శ. 1909 లో — అప్పటి శృంగేరీ మఠాధిపతులు శ్రీ శ్రీ శ్రీ అభినవ సచ్చిదానంద నృసింహ భారతీస్వామివారు శ్రీ శంకర భగవత్పాదులకును, భగవత్పాదుల యుపాస్యదేవత యగు శారదాదేవికిని దేవాలయములను నిర్మింపఁజేసియున్నారు. అందు శ్రీ శారదాదేవి మందిరమున నొక కుడ్యమున అమర్పఁబడిన శిలాఫలకముపై నీక్రింది శాసనము దేవనాగరి లిపిలో సంస్కృత భాషలో నున్నది.

శాసనము - ౧

"ప్రాయశో వర్ష సాహస్ర
ద్వితయా త్ప్రాక్ సదాశివః
దృష్ట్వా ఽధర్మేణ ధర్మస్య
గ్లానిం సర్వత్ర భూతలే.
కాలట్యాం కేరళే శ్రీమ
చ్ఛంకరాచార్య సంజ్ఞయా
ప్రాప్య జన్మ స్వప్రతిజ్ఞా
పాలనార్థ మివాదరాత్.
విజిత్య సర్వాన్ వాదేన
దుర్మతా విష్ట చేతసః
ఆవిష్కృత్యాస్యమస్త్రైవ
వైదికం ధర్మ ముత్తమమ్.
విశుద్ధాద్వైతవిజ్ఞాన
మాసేతు హిమశైలకమ్
స్వయం సంబోధ్య బహుశః
కృత్వా చాత్మసహాయవాన్.
జుగోప ధర్మం తే నాస్మా
నితివృత్తం పురాతనమ్
జ్ఞాత్వా ప్యాచార్య చారిత్ర
బోధక గ్రంథరాశిభిః.
అకృతజ్ఞా వయం మోహా
న్న స్మరామో జగద్గురుమ్
తేన పాపేన చాస్మాకం
వివిధాపత్తి సంభవః.
ఇత్యాలోచ్య మహాయోగీ
హితైషీ జగతాం సదా
శ్రీగురుః సచ్చిదానన్ద
శివాభినవపూర్వకః,
నృసింహభారతీస్వామీ
దక్షిణామ్నాయమఠాధిపః
కృతఘ్నతానిరాసాయ
జనతాభ్యుదయాయ చ.
కాలట్యాం జన్మపూతాయాం
భూమౌ లోక గురోస్త్రితమ్
నిర్మాప్యాగారయుగళం
మాత్రాసాకం సుతస్య చ.
సంప్రతిష్ఠాప్యయా దేకద్వైపే
త్ర్యాతలయ్య హ్యాదమ్పృతే
మూర్తిం గురోర్జని మతాం
మూర్త్యాట వాణ్యాః సహైవహి.

శాలివాహన భూపస్య
చన్ద్రాగ్నివసు భూమితే
ఽకే గతే తతః సౌమ్య
వర్షమాఘస్య చార్జునే.
పక్షేదినే ద్వాదశకే
సోమవారాన్వితే శుభే
సంప్రతిష్ఠాప్య వేదోక్త
విధానే నాతి భక్తితః.
కుమ్భాభిషేకం చ తతః
కారయామాస యోగిరాట్
అకరోచ్ఛాత్రలోకం చ
కరుణాభాజనం గురోః.
ఆసన్ కరణవచ్ఛిష్యాః
కార్యే ఽస్మి న్నిమ్మ దర్శితాః
ప్రధానో మూలరాజః స్యాత్
వఞ్చివంశాబ్ధిచంద్రమాః.
ద్వితీయో మాధవామాత్యో
విశ్వనాథతనూభవః
తృతీయో రామచన్ద్రార్యో
విశ్రాన్తన్యాయప స్తథా.
తురీయః సుబ్బరాయాఖ్యః
శిల్పజ్ఞో గురుభక్తిమాన్
యో ఽప్యన్యః కార్యవాహీస్యా
దాచార్యాఙ్ఘ్రిరజఃకణః.
నితరాం కరుణాపాత్రం
గురోః పూర్వకృతైః శుభైః
శ్రీకణ్ఠః సాధక స్తత్ర
దేశికాజ్ఞావశంవదః.
శిలేయం స్వగతం వృత్తం
వాచకానా మహర్నిశమ్
బోధయన్తీ చిరంజీయా
ద్యావచ్చంద్రదివాకరౌ."

దీని యభిప్రాయ మిది—

"భూమండలమునం దంతటను అధర్మమువలన ధర్మమునకు క్షతి కలుగఁగా, రమారమి రెండువేల యేండ్లకుఁ బూర్వము పరాత్పరుఁడగుశంకరుడే కేరళ దేశమునందలి *'కాలటి' యను గ్రామమందు— ధర్మోద్ధరణమునకయి శ్రీమచ్ఛంకరాచార్యుఁడుగా అవతరించెను. దుర్మతమునం దభినివేశము గల మతాంతరుల నందఱి నాతఁడు వాదమున నోడించి యుత్తమమగు వైదిక ధర్మమును తిరిగి నెలకొల్పెను; విశుద్ధ మగు నద్వైత సిద్ధాంతము నాసేతు హిమాలయము సర్వజనులకును బోధించి. అందఱి నాత్మపక్షంవదులనుగా నొనర్చుకొనెను; ధర్మమును పరిరక్షించెను. ఈ విషయము లన్నియును మనకు శ్రీ శంకరభగవత్పాదుల చరిత్రమును దెల్పు గ్రంథరాశివలనఁ దెలియుచున్నది.

"ఇట్లు శంకర భగవత్పాదులు చేసిన మహోత్కృష్ట కార్యముల నెఱిఁగియున్నను, మనము వారియెడలఁ గృతజ్ఞతను జూపక- యజ్ఞాన కారణమున ఆ జగద్గురువును స్మరింపకున్నాము. జగద్గురు విస్మృతి వలన మనకు వివిధములగు నాపదలు సంభవించుచున్నవి" అని మహాయోగియు, సదా లోకహితైషియు, దక్షిణదిక్కునందలి (శ్రీశంకర) మతమునకధిపతియు నగు శ్రీ జగద్గురు- అభినవ సచ్చిదానంద నృసింహ భారతీస్వామివారు పరిపరి విధముల నాలోచించిరి. ఆదిశంకరులయెడఁ జూపిన కృతఘ్నతను రూపుమాపుటకును, జనసామాన్యముయొక్క యభ్యుదయమునకును శ్రీ స్వామివారు శంకరభగవత్పాదుల జన్మవలన పునీతమైన 'కాలటి' యందు—పుత్రునితోపాటు తల్లికిని మందిరములను నిర్మింప సంకల్పించెను. అట్లు చేసిననే—ఒక్కసారిగా తల్లితోఁగూడ పుత్రుని స్మృతి కలుగునని హృదయమున నిశ్చయించి, ఆయన శాలివాహనశకము 1831 (క్రీ. శ. 1909) సం. సౌమ్యనామ సం: ర మాఘ శుద్ధ ద్వాదశీ సోమవారమున- మందిర ద్వయము

*శంకర భగత్పాదుల జన్మస్థలము 'కాలడి' యని ప్రసిద్ధము. కాని పశ్చిమతీర ప్రాంతమున నియ్యది 'కాలటి' అనియే వ్యవహరింపఁ బడుచున్నది.

నందును శ్రీశంకర భగవత్పాదుల యొక్కయు, శ్రీ శారదాదేవియొక్కయు విగ్రహములను-అత్యంత భక్తితో, వేదోక్త విధానమున ప్రతిష్ఠచేసి, కుంభాభిషేకమును జరిపి, శిష్యసమూహ మంతయును గురుకరుణకుఁ బాత్రమగునట్లు చేసెను. ఏ తత్కార్య నిర్వహణమున శిష్యు లందఱును సాధనములుగఁ బనిచేసిరి. ఏతన్నిర్మాణాదికమునకు ముఖ్యుఁడు వంచి వంశమునఁ బుట్టిన మూలరాజు; రెండవ యాతఁడు విశ్వనాథుని పుత్రుఁడగుమాధవామాత్యుడు, న్యాయమూర్తిగాఁ బనిచేసి, ప్రస్తుతము విశ్రాంతి తీసికొనుచున్న రామచంద్రార్యుఁడు తృతీయుఁడు. గురుభక్తి కలవాఁడును, వాస్తుశాస్త్ర నిపుణుఁడు నగు సుబ్బరాయఁడు నాల్గవవాఁడు. ఇంకను మఱికొందఱు కలరు. ఏ తన్మహాకార్యమున సాయపడినవా రందఱును గురుకరుణకుఁ బాత్రులగుదురు. పూర్వజన్మకృత సుకృతమువల్లనే వారికిట్టి యవకాశము లభించినది. గుర్వాజ్ఞను నిర్వర్తించు శ్రీకంఠుఁడు దీనికి ముఖ్యసాధకుఁడు. ఈ లేఖనము గల యీ శిల యేతద్వృత్తాంతమును రాత్రింబగళ్ళు జనులకుఁ దెలియఁజేయుచు సూర్యచంద్రు లున్నంతకాలము స్థిరమై యుండునుగాక!"

శంకర భగవత్పాదుల జననియగు ఆర్యాంబ సమాధిపైఁ గట్టఁబడిన తులసికోటపై క్రిందిశాసనము కలదు.

శాసనము - ౨

"శ్రీమచ్ఛంకర గురురాట్
భక్తైరపి వాంఛ్యమాణ దివా వగవే
ప్రాపయ్య స్వాం జననీం
పరికల్ప్య చితిం చకార చాప్త్యేష్టిమ్.

యత్రేయం సా విమలా
భూమిర్భాతి సకల దురితహరా
యా చ స్వనమన పూతన
రతజనతా సౌఖ్యదాయినీ సతతమ్.

నిర్మథ్య బాహూ మచిరా
దక్షిణ మగ్నిం తతః సమాధృత్య
కర్మ యథావిధ్యస్యాం
చక్రే మాతుః జగద్గురుః స్వస్య.

శంకర గురువర చరితం
యా భూః కాలాద్బహోః ప్రవృత్తమపి
బోధయితుం జనతాయాః
ఆస్తే పూర్ణానదీతటే ద్యాపి.

రాద్బృ క్షమహిమవత్యాం
ఘామౌ సప్తర్షిద్భ్క-పాంచభ్ద్యాయామ్
కల్యాణ జాల వివరణ
దక్షాయాం పుణ్య భావరేణ్యాయామ్.

ఇష్టు రుచిగజధరోత్తర
సౌమ్యాఖ్యే శాలివాహ శరవర్షే
మాఘ సితపక్షవాసర
నాథతిథౌ సోమవాసరే మోదాత్.

శ్రీమచ్ఛంకర దేశిక
రచిత వ్యాఖ్యాన భద్రపీఠవరమ్.
అధినిష్ఠద్భి రిదానీం
సచ్చిచ్ఛుఖపూర్వ నవ నృసింహాఖ్యైః.

శ్రీ శంకరార్యమాతుః
స్మృతిజననాయ ప్రతిష్ఠితోగ్రావా.
జీయాచ్చిరం దినత్రయ
మహ వసతాం సౌఖ్య ముద్భుతం స్యాదామ్.

దీని యభిప్రాయ మిది—

"తల్లి యవసాన సమయమునఁ దన్ను స్మరింపఁగా, శ్రీమచ్ఛంకర భగవత్పాదులు వచ్చి, యామెను దర్శించి, మృతయగు నామెకు సాయంసమయమున నిచట చితిని కల్పించి, దహనమొనర్చి, యుత్తరక్రియలను నిర్వర్తించిరి. అట్టి కర్మచేఁ బవిత్రమగు నీ భూమి సమస్త పాపములను హరించునదై, ఇచట నతులైనజన సమూహమునకు సౌఖ్యముల నొసఁగుచుండును. జగద్గురులగు శంకరులు స్వహస్తమున మథించి, దక్షిణాగ్నిని కల్పించి, తల్లి యంత్యకర్మను నిర్వర్తించెను. శంకరు లొనర్చిన యీకృత్యము చాల కాలము క్రిందటనే జరిగినను, పూర్ణానదీ తీరమునఁ

గల యీ స్థలమే దానిని జనసముదాయమునకుఁ దెలియఁజేయుచున్నది. చూచువారి పాపముల నన్నింటిని నశింపఁజేయుచు, శాంతికి హిమవన్నగమువంటిదైన యీ స్థలము పెక్కు శుభములను గలిగించుచుండును. అట్టి పవిత్రస్థలమున—శాలివాహనశకము 1831 సం.న సౌమ్యనామ సం.ర మాఘశుద్ధ ద్వాదశీ సోమవాసరమున — శ్రీ భగవచ్ఛంకరులు స్థాపించిన మఠమున కధిపతులగు శ్రీమదభినవ సచ్చిదానంద నృసింహ భారతీస్వామివారు శ్రీ శంకరుల మాతృస్మృతి చిహ్నముగ నీ శిలను స్థాపించిరి. ఇయ్యెడ దినత్రయము వసించు జనులందఱికిని సౌఖ్యము లభించును."

పై విషయములను బట్టి యీ శాసనద్వయము నొక్కసారియే నిర్మింపఁబడినట్లును, దీనికిఁ గారకులు శృంగేరీ మఠమున కప్పటి యధిపతులగు శ్రీ అభినవ సచ్చిదానంద నృసింహ భారతీస్వామివారైనట్లును తెలియుచున్నది. శ్రీ స్వామివారు పూనుకొననిచో శ్రీ శంకరుల దేవాలయము, శ్రీ శారదాదేవీ మందిరము, శ్రీ శంకరుల మాతృస్మృతి చిహ్నమును నెలకొనియుండుట అసాధ్యము.



# సాంఖ్యయోగము

శ్రీ కొల్లూరి సోమశేఖరశాస్త్రి

సాంఖ్యదర్శనమునకు కర్త కపిలమహర్షి. కాపిల సూత్రములకు, ఆసురి, పంచశిఖాచార్యులు, ఈశ్వర కృష్ణుడు మున్నగువారు వ్యాఖ్యానములను కారికలను రచించిరి. దీనికే షష్టితంత్రమని పేరు. కాని ఇప్పు డాగ్రంథములలో నీశ్వరకృష్ణ ప్రణీతములగు కారికలు తప్ప తక్కిన గ్రంథములు మనకు లభించుట లేదు. సాంఖ్యసూత్రములనుపేర గొన్ని సూత్రములు, వానికి అనిరుద్ధవృత్తి యను వ్యాఖ్యానముతో నొక పుస్తకము మనకు లభించుచున్నది. కాని ఇది కపిల ప్రణీతమనుట కవకాశము కనిపించుట లేదు. మన కిపుడు లభించెడి సాంఖ్యగ్రంథములలో నీశ్వర కృష్ణుని కారికలే ప్రాచీనములు, ప్రామాణికములు నగుచున్నవి. కావుననే శంకర భగవత్పాదులు సూత్ర భాష్యమున సాంఖ్యమత నిరాకరణ సందర్భమున నీశ్వరకృష్ణుని కారికలలోని యంశములనే యుదాహరించుచు వచ్చెను. కాన నీ కారికలే మనకు సాంఖ్య మతమును దెలిసికొనుట కాధారము లగుచున్నవి. ఈ కారికలకు గల వ్యాఖ్యానములలో వాచస్పతి మిశ్రుల "సాంఖ్యతత్వకౌముది" యనునది ముఖ్యమయినది. ఇక నీ మతమును విచారింతము. సాంఖ్య మతమం దిరువది అయిదు తత్త్వము లంగీకరింపబడినవి.

"మూలప్రకృతి రవికృతిః మహదాద్యాః ప్రకృతి వికృతయ స్సప్త షోడశకస్తు వికారః న ప్రకృతి ర్నవికృతిః పురుషః" అను కారికనుబట్టి మూల ప్రకృతి, మహత్తత్వము, అహంకారము, అయిదు తన్మాత్రలు, పదునారు వికారములు, పురుషుడు నని ఇరువది అయిదు తత్వములు. వీనిలో జగత్తునకు కారణము, జడము, పురుషుని భోగాపవర్గములకు సాధనము నగునది ప్రకృతి. ఇది కారణమేకాని కార్యము కానేరదు. వీరి మతమున ప్రకృతికి కర్తృత్వము, పురుషునికి భోక్తృత్వము నంగీకరింపబడినది. కర్తృత్వ మనగా పురుషునికి భోగసాధనము లగు పదార్థములను కల్పించుట. వీరి మతమున పురుషు డసంగుడు, చిద్రూపుడు నగుచున్నాడు కాన నాతనికి కర్తృత్వములేదు. ప్రకృతి జడముగాన నద్దానికి భోక్తృత్వమును లేదు. ఈ విషయము "ప్రకృతిః కర్తృపురుషః పుష్కరపలాశవ న్నిర్లేపః" అని చెప్పబడినది. జడమగు ప్రకృతి కర్తృత్వ మెట్లు పొసగుననిన సూదంటురాయియొక్క సన్నిధానమువలన నిను మెట్లుచలించునో, అట్లే పురుషుని సన్నిధానమువలన ప్రకృతియు ప్రవర్తించు చున్నది. జడమగు ప్రకృతికిని, చేతనుడగు పురుషునకును వాస్తవికమగు భేదమున్నను, ఆ భేదమును గుర్తింపనినాడు ప్రకృతి పురుషుని, తనచే గల్పింపబడిన పదార్థములచే నాతనికి భోగములు గల్పించి బంధించును. ఎపుడు తనకును ప్రకృతికినిగల భేదము స్పష్టముగ గోచరించునో నాడది విడిచిపెట్టును. కాగా ప్రకృతి పురుషునకు సంసారమును యపవర్గమును అవస్థాభేదముచే గల్పించుచుండును.

ప్రకృతి యన సత్వ, రజ, స్తమో గుణముల యొక్క సామ్యావస్థ. సత్వ రజ స్తమోగుణములు మూడు నొకప్పుడు సమముగను నొకప్పుడు విషమము గను నుండును. సామ్యావస్థయందు ప్రకృతి నిద్రించువానివలె కార్యముల కల్పింపక యూరకుండును. అపుడు పురుష సన్నిధియు మిన్నకుండును. ఒకప్పుడు గుణములందు వైషమ్యము కలుగును. అపుడు ప్రకృతి స్వభావమునకు భంగములేని తెరగున కార్యముల గల్పించును. వీరిది పరిణామ వాదము. అనగా పాలు పెరుగుగ మారినట్లు, మన్ను ఘటాది రూపముగ మారినట్లును, ప్రకృతి మహదాది రూపమున మారును. మహత్తత్వము బోధాబోధాత్మక

మగు వస్తువు. ఇది ప్రకృతియొక్క మొదటికార్యము. ఇందు ప్రకృతియొక్క జాడ్యాంశయు, పురుషుని యొక్క ప్రకాశాంశయును గలవు. కావుననే ఇది బోధాబోధాత్మక మగుచున్నది. దీనివలన నహంకార ముదయించుచున్నది. అహంకారమన దేహాదులయం దాత్మభ్రాంతి. ఇది సంసారనృత్యశాలకు మూల స్తంభమువంటిది. దీనివలననే పురుషునకు సంసార బంధ మేర్పడుచున్నది. దీనివలన పంచతన్మాత్ర లేర్పడుచున్నవి. తన్మాత్రలన, సూక్ష్మ భూతములు. ఈ ఏడును ప్రకృతులు, వికృతులును నగుచున్నవి. అనగా కారణములు, కార్యములు గూడ నగుచున్న వని భావము. చూడుడు. మహత్తత్వము మూల ప్రకృతికి కార్యము. అహంకారమునకు కారణము. అహంకారము మహత్తత్వమునకు కార్యము. తన్మాత్రలకు కారణము. ఇట్లే తన్మాత్రములు అహంకారమునకు కార్యములు, స్థూలభూతములకు కారణములు నగుచున్నవి. ఈ తన్మాత్రలవలన అయిదు మహాభూతములు, పదునొకండు నింద్రియములును బయలుదేరుచున్నవి. పృథివీ జల తేజోవాయు గగనములు పంచ మహాభూతములు. వాక్పాణి పాద పాయూపస్థలను కర్మేంద్రియము లయిదును, త్వక్చక్షు శ్రోత్ర ఘ్రాణ రసములను - జ్ఞానేంద్రియము లయిదును, అంతరింద్రియ మగు మనస్సుతో గలిసి పదునొకండును నింద్రియములు. ఈ పదునాఱును వికారములే కాని ప్రకృతులు కాజాలవు. పృథివ్యాదుల వలన బుట్టుచున్న ఘటాదులు పృథివ్యాదులకన్న వేఱు కానందున పృథివ్యాదులకు బ్రకృతిభావము లేదు. అసంగుడు, చిద్రూపుడు, నిత్యుడు నగువాడు పురుషుడు. ఇట్లిరువది అయిదు తత్త్వములు సాంఖ్యులచే నంగీకరింప బడినవి. వీరి మతమున, ప్రత్యక్షము, అనుమానము, ఆగమము నని మూడు ప్రమాణము లంగీకరింప బడినవి. వీనిచే తత్వమును పరిశీలింప వలయును. వీరిది సత్కార్యవాదము. అనగా కారణమునందు సూక్ష్మరూపమున నున్న కార్యమే సాధనసామగ్రి వలన నభివ్యక్త మగుచున్నది. తిలల యందు సూక్ష్మరూపమున నున్న తైలమే మన ప్రయత్నమువలన బైటకు వచ్చుచున్నది. కాన కారణము నందు సూక్ష్మరూపమున లేనికార్య మెన్నడును పుట్ట జాలదు. ఇక వీరి మతమునందొక శంక పొడము చున్నది. లోకమునందు చేతనుని సంబంధములేని యచేతనముకార్యకారి యగుటలేదు.కాన నచేతనమగు ప్రకృతి ఎట్లు స్వతంత్రముగ కార్యకారి యగుచున్నది. అను నీ శంకకిది సమాధానము. చేతన సంబంధము గల యచేతనమెట్లు కార్యకారి యగుచున్నదో, అట్లే చేతన సంబంధము లేని యచేతనమును కార్యకారి యగుచున్నది. చేతన సంబంధములేని మేఘములు వర్షించుచున్నవి. ఆవు దూడను జూచినంతనే దాని ప్రయత్నము లేకుండగనే పాలు తమంతట తాము స్రవించుచున్నవి. కాన నచేతనమునకు స్వతంత్ర ప్రవృత్తి పొసగనేరదనుట సరికాదు.

ప్రకృతి పురుష సంబంధము పంగ్వంధ సంబంధము - వలె పరస్పర సాపేక్షము. ఒక కుంటివాడు, ఒక గ్రుడ్డివాడును గలిసి పరస్పరాపేక్షచే గ్రామాంతరమును చేరుదురు. అట్లే ప్రకృతి పురుషులు పరస్పర సాపేక్షములై ప్రపంచమును భోగమును, నిర్వహించు చుండును. వీరి మతమునందవివేకము సంసారము నకును, వివేకము మోక్షమునకును సాధనములు. వీరి మతము నందీశ్వరు నంగీకరింపరు. ఈ మతము వేదాంతి మతమునకు చాల సన్నిహితము.

యోగదర్శనమును పతంజలిమహర్షి ప్రారంభించెను. దీనికే సాంఖ్య ప్రవచనమనియు, సేశ్వర సాంఖ్యమనియు వాడుక గలదు. ఇందు నాలుగు పాదములు గలవు. అందును మొదటిపాదమున యోగ ప్రారంభమును, యోగలక్షణమును, సమాధిని, సాధనములను నిరూపించెను. రెండవ పాదమందలి సమాధినుండి చలించిన చిత్తము కలవానికి, యమము, నియమము, మున్నగు సాధనములను, తపస్సు, ఈశ్వరారాధనము జెప్పబడినవి. మూడవ పాదమునందు, ధారణాధ్యాన సమాధులను,నంతరంగ సాధనములను, వానివలన గలుగు ఫలములను నిరూపించెను. నాల్గవపాదమునందు, అయిదు సిద్ధులను, పరమ ప్రయోజనమగు కైవల్య (మోక్ష)

మును నిరూపించెను. యోగులును సాంఖ్యులవలె నిరువదిఅయిదు తత్త్వముల నంగీకరింతురు. కాగా నీశ్వరునిగూడ వీరంగీకరింతురు. కాన నిరువదియారు తత్వములు యోగులచే నంగీకరింపబడినవి.

"యోగః చిత్తవృత్తి నిరోధః" అను సూత్రమును బట్టి చిత్తవృత్తులను నిరోధించుటయే యోగమని తేలుచున్నది. కాగా సుషుప్తియందు, చిత్తవిక్షేపమునందు, మూర్ఛాదులందును చిత్తము నిరుద్ధమగుచున్నది. కాన నివియు యోగములు కావచ్చునా, అని శంక కలుగవచ్చును. కాని సుషుప్త్యాదులందు చిత్తనిరోధము కలిగినను చిత్తమున కేకాగ్రత సంభవింపనేరదు. యోగమునందు చిత్తైకాగ్రత, సమాధియు నుండును కాన మీ శంకకు తావులేదు. "బ్రహ్మణ్యేవ స్థితి ర్యా సా సమాధిః ప్రత్యగాత్మనః" అను నార్యోక్తిని బట్టి, సమాధియన జీవాత్మను పరమాత్మయం దుంచుటయని చెప్పవచ్చును. లేదా భావనయే సమాధి. ఈ సమాధి సంప్రజ్ఞాతమనియు నసంప్రజ్ఞాతమనియు రెండురకములు. ప్రకృతికిని చిత్తమునకును గల భేదమును తెలిసికొని, చిత్తముచే జడాజడ ప్రకృతులను వేఱువేఱుగ నిరూపించుట సంప్రజ్ఞాత మనబడును.

ధ్యానము, ధ్యేయము, ధ్యానించువాడు నను త్రిపుటి సంప్రజ్ఞాత సమాధియందు భాసించునని కొందఱనుచున్నారు. సర్వ వృత్తులయొక్క నిరోధమే యసంప్రజ్ఞాతసమాధి. అనగా దీనియందు త్రిపుటీభావము ఉండదు. మఱియు యోగికి క్లేశకర్మాదు లుండనేరవు. పురుషుని బాధించునవి క్లేశములు. వీనిలో నవిద్య మొదటిది. అవిద్య యన భ్రాంతి. ఈ భ్రాంతి పలు తెరగులుగ నుండును. అనాత్మయగు దేహమునం దాత్మభ్రాంతి. అనిత్యమగు కాయమునందు నిత్యత్వ భ్రాంతి. అశుచియగు శరీరమునందు శుచిత్వభ్రాంతి. ఇదియే సకలదుఃఖములకును మూలము. కర్మలు విహితములనియు, నిషిద్ధములనియు ద్వివిధములు. జ్యోతిష్టోమాదులు విహితములు, బ్రహ్మహత్యాదులు నిషిద్ధములు. ఇవి పుణ్యపాపములకు హేతువులు.

యోగమునందు ప్రవేశించువానికి తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరానుచింతనము అను కర్మలు ముఖ్యములు. ఈ విషయము "ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మకారణ ముచ్యతే" అని గీతయందు చెప్పబడినది. కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతములచే శరీరమును శోషింపజేయుట తపస్సు. వైదికమంత్రములను అభ్యసించుట స్వాధ్యాయము. ఈ మంత్రములు స్త్రీపున్నపుంసకములని మూడు రకములు. స్వాహాయను పదము చివరగల మంత్రములు స్త్రీ మంత్రములు. నమః యను పదము చివరగలవి నపుంసకములు. మిగిలినవి పురుషమంత్రములు. ఇట్లే తంత్రములందు చెప్పబడిన దేవీమంత్రములకు శ్రీవిద్యలనియు, శైవవైష్ణవాది మంత్రములకు పురుష విద్యలనియు పేరు. కాగా సాధకుడు యోగశాస్త్రమునందు చెప్పబడినతీరున శుచియగు ప్రదేశమునందు పద్మాసనము మున్నగు నాసనములలో నొకదానిని గ్రహించి, ప్రాణాయామాదుల యభ్యాసమున ప్రాణమును వశపఱచుకొనవలయును. అనగా ప్రాణవాయువును తా నే నాడియందు ప్రవేశపెట్టదలచిన నానాడియందు ప్రవేశపెట్టుట, ఆ నాడియందు ప్రాణము నెంతకాలము నిలుపదలచిన నంతకాలము నిలుపుటయే ప్రాణవశీకరణము. ఇట్లు ప్రాణము వశమయిన పిమ్మట నా ప్రాణమును సుషుమ్నయను నాడియందు ప్రవేశపెట్టి దానిగుండా బ్రహ్మరంధ్రమునం దాప్రాణమును నిలిపి, యీశ్వరుని ధ్యానింపవలయును. అట్టివాని కానందానుభవమేకాని దుఃఖానుభవ ముండదు. సాంఖ్యులకును యోగులకును ఈశ్వరు నంగీకరించుటవలన భేదము. ఇతర విషయములందు భేదములేదు. కావుననే సాంఖ్యులకు పంచవింశతి (25) తత్త్వవాదులనియు, యోగులకు (26) షడ్వింశతి తత్త్వవాదులనియు వ్యవహారము.



### శ్రీ పైడి లక్ష్మయ్యగారి అధ్వర్యాన శ్రీశైలంలో జరుగుతున్న

# అభివృద్ధికార్యక్రమాల సమీక్ష

శ్రీశైల మహాక్షేత్రం యుగయుగాలుగా భారతీయులందరకూ, ప్రధానంగా ఆంధ్రప్రజలకు ఆధ్యాత్మిక జ్యోతిని ప్రసారిస్తోంది. భారతదేశాన్ని పాలించిన అవతార పురుషులు శ్రీరాముడు, (పాండవులు) భ్రమరాంబా సహిత మల్లికార్జునుని అర్చించి తరించి సర్వులకు మార్గదర్శకు లయ్యారు. ప్రతాపరుద్రుడు, హరిహరరాయలు, శ్రీకృష్ణదేవరాయలు, శివాజీ మహరాజ్ స్వామికి మండపప్రకారాదులు కట్టించి ఆ మహాదేవుని కటాక్ష వీక్షణాలను పొందిన భక్త శిఖామణులు. అట్టి మహాక్షేత్ర చరిత్రలో గూడా పూర్ణిమ, అమావాశ్య ఉంటూ వచ్చినయి. రోహిల్లాల దండయాత్రతో పూర్వవైభవం పోయి సమస్త భోగాలతో తులతూగుతు ఉండిన అర్చనాదులకు, అనేక అగ్రహారాలు ఉండిన మల్లికార్జునస్వామికి ఈనాడు ఒక్క సెంటు భూమిగూడా లేదు. శివాజీ గోపురం, హరిహరరాయ గోపురం శిధిలావస్థలో ఉన్నాయి. నిత్యార్చనలే జరగడం కష్టమయినది. శ్రీశైలక్షేత్ర చరిత్రలో రోజులు మారినయి. శ్రీశైలం మహానగరంగా విరాజిల్లే సూచనలు పుష్కలంగా కనిపిస్తున్నాయి. అనుదినము, వచ్చిపోయే భక్తులతో, నిర్మాణ కార్యక్రమంలో నిమగ్నమైన కార్మికుల సందడితో, మంగళ తూర్యనాదాలతో, నందివాహనాది సేవలతో శ్రీశైలం చూడ ముచ్చటైన మహాక్షేత్రంగా విరాజిల్లుతోంది.

దోర్నాలనుంచి పదిహేను మాసాలక్రింద శ్రీశైలానికి రస్తా ప్రారంభం కావడంతో ఈ క్షేత్రానికి సిరి ఎత్తుకుంది. కృష్ణపక్షం పోయి శుక్లపక్షం ప్రారంభమైంది. ఉప ముఖ్యమంత్రిగా రస్తానిర్మాణ కార్యక్రమాన్ని తీర్చిన సంజీవరెడ్డి ముఖ్యమంత్రి అయి శ్రీశైలమహానగర నిర్మాణాన్ని పర్యవేక్షించే భాగ్యం ఆయనకు కలిగింది. వారు నియమించిన దేవాదాయశాఖ కమీషనరు శ్రీ పైడి లక్ష్మయ్యగారు ఆహరహము శ్రీశైల క్షేత్రంయొక్క వైభవాన్ని పునః ఏ విధంగా నెలకొల్పాలి అని యోచిస్తూ కృషి చేస్తున్నారు. ఉద్యోగంనుంచి విరమించిన ఇంజనీరు శ్రీ ముక్కవిల్లి సన్యాసయ్య అధ్వర్యాన ఆలయ ప్రాంగణంలో పునర్నిర్మాణ కార్యక్రమం జరుగుతోంది. ఆలయ కార్యనిర్వాహక అధికారిగా ఉన్న శ్రీ రాజగోపాలరాజు, ప్రత్యేకాధికారిగా ఉన్న శ్రీ మాధవరావు నాయుడు ఆలయంలో యధాశక్తి కృషి చేస్తున్నారు.

## మంచినీటి సౌకర్యం

శివరాత్రికి శ్రీశైలానికి కృష్ణనుంచి, శ్రీరామ నవమికి భద్రాద్రికి గోదావరినుంచి, మంచినీటి సరఫరా యాత్రికులకు అందజేసితీరాలని ఆ శాఖ మంత్రి సంజీవయ్యగారు ఉత్తర్వుచేశారు. పాతాళగంగనుంచి దేవాలయానికి మంచినీరు సరఫరా చేసే గొట్టాలు చాలాభాగం వేశారు. ఏడు లక్షల రూపాయలు వ్యయంతో ఈ కార్యక్రమం జరుగుతోంది. ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు శ్రీ బి. వెంకటాచలం అధ్వర్యాన పని జరుగుతోంది. శివరాత్రికి మంచినీరు అందజేయడం వీరి విధికృత్యమైంది. శ్రీశైలం జల విద్యుత్ ప్రణాళిక నిర్మాణ స్థలాన్ని చూడవచ్చిన శ్రీ సంజీవరెడ్డిగారు నీటి సరఫరా కార్యక్రమాన్ని తనిఖీచేశారు. గొట్టాల నిర్మాణంలోఉండే మిట్టపల్లాల చిక్కులు ముఖ్యమంత్రికి వివరిస్తూ, శివరాత్రికి ముందే నీరు శివాలయంలో అందజేస్తామని సహాయ ఇంజనీర్లు

విన్నవించుకున్నారు. శివరాత్రికి ఎన్ని కష్టాలు పడ యినాసరే మంచినీరు యాత్రికులకు అందజెయ్యాలనీ, లేకపోతే భక్తులు అంతులేని కష్టాలు పడతారనీ ముఖ్యమంత్రిగారు సిబ్బందిని హెచ్చరించారు.

## విద్యుత్తు సరఫరా

ఏనుగుల చెర్వులో నీరు సరిగ్గాలేదు. పాతాళ గంగనుంచి అయిదు అంచెలలో డీసెల్ సెట్లు పెట్టి దేవాలయం ఉండే చోటుకు నీటిని సరఫరాచెయ్యాలి. ఇందులో ఏ ఒక్క సెట్టు చెడిపోయినా నీటి సర ఫరా దెబ్బతింటుది. అందువల్ల విద్యుత్తు యంత్రాల ద్వారా నీటిని పైకి పంపితే ఈ కార్యక్రమం నిరా టంకంగా సాగగలదు. అందువల్ల శ్రీశైలంలో ఇప్పుడున్న విద్యుత్ యంత్రాల శక్తిని వృద్ధి చెయ్యాలి. గత మాసం గవర్నరు వచ్చినప్పుడు విద్యుత్ శాఖవారు శ్రీశైలానికి విద్యుత్తును అందజేసి జ్యోతినిచ్చారు. శివరాత్రికి ఉన్న యంత్రాల శక్తిని పెంచితే నీటి సరఫరా కార్యక్రమం గూడా నిరవధి కంగా కొనసాగుతుంది. విద్యుచ్ఛక్తి మంత్రి శ్రీ నరసింగరావుగారికి సంగతి నివేదింపబడింది. వారు ఈ విషమై వెంటనే చర్య తీసుకుంటారు.

## రాకపోకల సౌకర్యాలు

మార్కాపురం రైల్వే స్టేషన్‌నుంచి ఒక బస్సు, కర్నూలునుంచి మరొక బస్సు యాత్రికుల నిమిత్తం శ్రీశైలం దేవస్థానం వారు నడుపుచున్నారు. పుష్య బహుళ ద్వాదశినాడు దేవస్థానంవారు కొన్న మూడో బస్సు మొదటిసారి కర్నూలునుంచి శ్రీశైలం కొండకు ప్రయాణంచేసింది. దాదాపు 45 వేల రూ.లు దాని ఖరీదు. ఈ బస్సును ముఖ్యమంత్రి త్రయోదశి నాడు చూసి గుంటూరునుంచి ఈబస్సును శ్రీశైలానికి సరాసరి నడిపించేట్టు, విజయవాడనుంచి గుంటూ రుకు ఈ బస్సును యాత్రికులకు అనుసంధానంచేసే ఏర్పాట్ల విషయం ఆలోచిస్తామని దేవస్థానం అధి కారులకు హామీయిచ్చారు. ఈకొత్తబస్సు గుంటూరు నుంచి నడపడంలో కోస్తా జిల్లాలనుంచి యాత్రికు లకు కొత్త సౌకర్యం ఏర్పడుతుంది. శివరాత్రికి అదనపు బస్సులు నడుపుతారు. పూర్వం ప్రభువులు అగ్రహారాలు స్వామివారి అర్చనాదుల కిచ్చేవారు. ఇప్పుడు ప్రభుత్వంవారు ఒక బస్సురూటు దేవుడికి కేటాయిస్తే స్వామివారి అర్చనాదులకు వెతుక్కో వలసిన అవసరం వుండదు. మహాన్యాసపూర్వక మైన అభిషేకాదులకు, నిత్య నైవేద్యాదులకు భక్తులు ముడుపులు చెల్లిస్తూన్నా, శాశ్వతమైన ఆస్తిని దేవుడికి ఏర్పరచాలి.

## శివరాత్రికి సౌకర్యాలు

శివరాత్రికి వచ్చే లక్షలాది యాత్రికులకు ఏ విధంగా సౌకర్యం చేసి, నిర్విఘ్నంగా మహాశివరాత్రి కల్యాణోత్సవాన్ని ముగిస్తామా అని దేవాదాయశాఖ వారు యోచిస్తున్నారు. శివరాత్రినాడు ఇదివరకు ముప్పైవేలమంది ఉంటూఉండిన భక్తులసంఖ్య ఈ ఏడు కనీసం రెండులక్షలు ఉంటుందని అంచెనా వేస్తున్నారు. దేవాలయాలు తెరచిఉంచిన సమయంలో అర్చనాదులు జరిగే సమయాలను మినహాయిస్తే భక్తునికి ఒకక్షణం చొప్పున అయినా యాభైవేల మందికి తప్ప శివరాత్రినాడు లభ్యంగాపడం సాధ్యం గాదు. మార్చి ఏడవతేదీన మహాశివరాత్రి పర్వదినం. ఆరోజుల్లో భక్తులు ఆలయంలో వెళ్ళటానికి ఒకరి వెనక ఒకరు వెళ్ళాలి. ఆరేడుతేదీల్లో రూపాయి చెల్లించి స్వామిదర్శనం చెయ్యాలట. 8 వ తేదీన ధర్మదర్శనం ఏర్పాటు చేస్తారు. శివరాత్రినాడు పాతాళగంగనుంచి తెచ్చిన ఉదకాన్ని భక్తులు అంతరాలయం ఇవతల ఏర్పాటు చేసే గొట్టంలోపోస్తే మల్లికార్జున లింగం నెత్తిన పడుతుంది. సమ్మర్దం ఎక్కువగావున్న 2, 3 రోజుల్లో మల్లికార్జున లింగానికి అభిషేకాలు జరుప దలచినవారు వృద్ధ మల్లికార్జునస్వామికి, శ్రీరాముడు, సీతాదేవి ప్రతిష్ఠలూ సహస్రలింగేశ్వరునికి అభి షేకాలు అర్చనలు చేసుకోవచ్చు. స్వామికి వచ్చే ఆదాయం ఈ సమయంలోనే గమన కరుసుం ఏర్పాటు చేశారు.

## సూత్నశోభ

శ్రీశైలక్షేత్రము, ఆలయములో జరగవలసినపని అపగింజలో అరవయ్యోవతైనా కాలేదు. అయితే జరిగినంతవరకు పని మెచ్చుకోతగింది. ముఖ్య మంత్రి, ఇతరులు మెచ్చుకున్నారుగూడా. గర్భాల యంలో కొత్తరాళ్లు పరిపించారు. ద్వారంవద్ద తలుపులకు కొత్త ఇత్తడిరేకులు అమర్చారు. దాదాపు పదివేలరూపాయలతో మల్లికార్జునునికి చేయించిన వెండి రుద్రాక్షమండపం కలకలలాడుతూ భక్తులకు కన్నులపండువుగా ఉంది. అంతరాలయంలోగూడా చలువరాళ్లు పరిచారు. ముఖమండపంలో బీటలు ఇచ్చిన రాతిస్తంభాన్ని తీసి, వేరే స్తంభాన్ని అమర్చారు. రత్నగర్భగణపతి నొకప్రక్క, కుమార స్వామిని మరొకప్రక్క, ఎదురుగా నందికేశ్వరుని ప్రతిష్ఠించారు. ముఖమంటప మంతా రంగులు వేశారు. నటరాజస్వామి, శృంగి, భృంగి ఇత్యాది విగ్రహాలను చక్కగా తీర్చిదిద్దారు. స్వామివారి అలంకరణాదులు భద్రపరచడానికి రెండుఅలమారలు అంతరాలయంలో అమర్చారు. హరిహరరాయ, ప్రతాపరుద్ర మండపాలను బాగుచేస్తున్నారు.

## ధ్వజస్తంభం

ఇప్పుడున్న ధ్వజస్తంభం పది పదిహేనేళ్ళక్రితం ఒక భక్తుడు పునరుద్ధరించారట. ధ్వజస్తంభం వంకర టింకరగా కనిపిస్తోంది. ధ్వజస్తంభాన్నిగూడా సరిగ్గా ఎత్తించాలి. ధ్వజస్తంభం ఉన్న దిమ్మమట్టుకు మరమ్మతు జరిగించి. ధ్వజస్తంభ పునఃప్రతిష్ఠకు మరొక భక్తుడు ముందుకురావాలి.

## పుణ్యకాలక్షేపాలు

ఆలయప్రాకారంలో కొన్ని కట్టడాలకు అడ్డువచ్చే నిర్మాణాలను తొలగించారు. ఆలయం చుట్టుపట్ల విశాలమైన స్థలం కనిపిస్తూ ఈ ఆలయం శ్రీశైలము దేవా లేక కొత్తదా అన్నట్లు కనిపిస్తోంది. వాహనాలు పెట్టే మండపంలోనే కాలక్షేపాలు జరిపిస్తున్నారు. పుష్యశుద్ధద్వాదశినాడు శ్రీ కాళిదాసు రామచంద్రశర్మ రామకథను, త్రయోదశినాడు శ్రీ కుప్పా వీరరాఘవ శాస్త్రి శ్రీశైలమాహాత్మ్య హరికథను కాలక్షేపం చేశారు. ఈకథను రచించిన గుంటూరుజిల్లావాసి శ్రీ సాంబయ్యను శివరాత్రి స్వామికళ్యాణంనాడు సన్మానిస్తారు. ఆలయంలో హరికథలు, పురాణ కాలక్షేపాలు శివరాత్రికి ఏర్పాటు చేస్తున్నారు. దీక్షిత దాసు, వీరరాఘవశాస్త్రి కాలక్షేపాలు జరుగుతాయి.

## భ్రమరాంబ గుడి

భ్రమరాంబ గుడికి వెళ్లేదారిన మెట్లు చక్కగా తీర్చిదిద్దారు. అ మెట్లమీద ఒకవైపున ఆర్థికమంత్రి ఇచ్చిన విరాళంతో సీతమ్మవారు ప్రతిష్ఠించిన సహస్ర లింగేశ్వరుని మందిరాన్ని పునర్నిర్మాణం చేశారు. మరొకవైపు ద్రౌపది ప్రతిష్ఠించిన పంచలింగేశ్వరుని మందిర పునర్నిర్మాణానికి గవర్నరుగారి విరాళంతో అంకురార్పణ జరిగింది. మెట్లమధ్యన మృగేంద్ర వాహనం అమర్చారు.

భ్రమరాంబ ఆలయంలో ముఖమండపం, గర్భాలయంలో రాళ్ళు పరిపించారు. గుడి ఆవరణలో నాపరాళ్ళు పరిపిస్తున్నారు. భ్రమరాంబ మండపంపైన కామేశ్వర, ఉమ విగ్రహాలు అమరుస్తున్నారు. శ్రీకృష్ణదేవరాయలు నిర్మించిన ప్రాకారం శిథిలంకాగా దాన్ని పునర్నిర్మాణం చేశారు. వసారాలు సరిగా బాగుచేసి భక్తులు కూర్చొనేందుకు ఏర్పాట్లుచేశారు. అమ్మవారి ఆలయంలో చేసిన అలంకారాలతో భ్రమరాంబకు కాల్యాణం దగ్గిరపడడంలో కొత్తపెళ్ళి కూతురు కళ వచ్చింది. నిజంగా అట్టి జగన్మాత, జగత్పితల కల్యాణోత్సవాలను తిలకించే భాగ్యం పొందే భక్తులు శతథా ధన్యులు.

## యాత్రికులకు సౌకర్యాలు

కేంద్రప్రభుత్వ విరాళంతో ఏడాదిలో అయిదారు గదుల యాత్రికమందిరం, రాష్ట్రప్రభుత్వం సహాయంతో మరో యాత్రికమందిరం సిద్ధమైనాయి. అయిదారుగురు భక్తుల విరాళాలతో ఆరు వసతిగృహాలేర్పడినయి. ఆర్యవైశ్య సమాజం, వీరశైవ సంఘం

వారి విరాళాలతో పన్నెండేసి గదుల నిర్మాణం జరిగింది. ఇంకా ఈ సత్రాల నిర్మాణం జరుగుతోంది. గుంటూరువారి విరాళంతో క్రొత్తభవనాలు వెలుస్తున్నాయి. దేవస్థానంవారు మరొక సత్రాన్ని కడుతున్నారు. యాత్రికులకు సౌకర్యాలు దినదిన ప్రవర్థమానంగా జరుగుతున్నాయి. శ్రీశైలానికి క్రొత్తకళ వచ్చింది.

## భ్రమరాంబ సాగరం

శ్రీశైలంలో పాతాళ గంగవద్ద జల విద్యుత్తు ప్రణాళిక అమలుచేయడానికి పరిశోధన జరుగుతోంది. ఇక్కడ కట్టబోయే నిర్మాణంలో ఏర్పడే జలాశయానికి భ్రమరాంబ సాగరమని నామకరణం చెయ్యాలని కొందరు భక్తులు సూచించారు. శ్రీశైలం ప్రాజెక్టు నిర్మాణంతో ఆంధ్ర దేశంలోని సిరిసంపదలు వృద్ధిపొంది ఆంధ్రదేశం నిత్యకళ్యాణం, పచ్చతోరణంగా విలసిల్లగలదు. శ్రీశైలం వద్ద ఒక మహానగరం ఆవిర్భవించబోతున్నది. ప్రపంచపు నలుమూలల నుంచీవచ్చే ప్రకృతిసౌందర్యోపాసకులు, భారతదేశం నలుమూలలనుంచివచ్చే ఈశ్వరభక్తులు, ఈ ఆలయ దర్శనంతో కృతార్థులు కాగలరు. శ్రీశైలం అపర శిఖరకైలాసంలాగ, భక్తులపాలిట కల్పవృక్షంగాను, హాటకేశ్వరం మున్నగు శిఖరాలతో మేరు పర్వతంగానూ సాక్షాత్కరిస్తోంది.



# श्रीमद्गांधी गीता

*रचयितार:*

**श्री केशिराजु वेंकट नृसिंह अप्पारायाः**

## विषाद्योगः

*शिष्य उवाच :--*

महात्मन् सर्वं मायत्तम् सत्याग्रहरणायनः ।
सम्राटपक्षेऽपि सर्वत्र समारंभोऽनुर्मीयते ॥ २१

असद्देशे स्थितिरेषा लोकस्थिति रवेक्ष्यतां ।
प्रजातंत्र नियंतृत्व मध्ये युद्धः प्रवर्तते ॥ २२

आंग्ल शासक मूर्खत्व फलितस्य रणस्य नः ।
कीदशः परिणामोऽद्य भवतीति र्विचिंत्यताम् ॥ २३

एव मुक्तो महात्मा तम् शिष्यशेखर मब्रवीत् ।
"परिणाम स्त्वैक एव नंक्ष्यत्यत्रांग्लशासनम् ॥ २४

सर्वाऽपि भारती जातिः स्वतंत्रेव प्रवर्तताम् ।
यथा नास्त्येव देशेऽस्मिन् आंग्लेयम् राज-
शासनम् ॥" २५

तच्छ्रुत्वा चिंतयामास शिष्यो लोकपरिस्थितिम् ।
हिट्लर् मुस्सोलिनी टोजो दुराक्रमण दूषिताम् ॥ २६

विनाशाय नियंतॄणाम् दुराक्रमणकारिणाम् ।
आंग्लेय ऋष्य चीनाद्या यतते मित्रमण्डली ॥ २७

अद्य भारतदेशात्ते ह्यांग्लानिष्कासिता यदि ।
चीनादीना मपजयो जपानादि जयो ध्रुवः ॥ २८

इत्थम् विचिंत्य विश्वैकक्षेमकांक्षी महामनाः ।
स शिष्यः पंडितो गांधिम् विषीद न्निद
मब्रवीत् ॥ २९

परिणामं विचिंत्याद्य सत्याग्रह रणस्य नः ।
सीदंति मम गात्राणि भ्रमतीवच मे मनः ॥ ३०

निमित्तानिच पश्यामि विपरीतानि "बापुजी !"
न च श्रेयोऽनुपश्यामि मित्रपक्ष विरोधितः ॥ ३१

न कांक्षामि जयं "बापु !" न स्वराज्यम् सुखानिच ।
किम् स्वराज्येन गांधीजी, किम् भोगै
र्जीवितेनवा ? ३२

यत्प्रजातंत्र रक्षार्थम् कांक्षिता नः स्वतंत्रता ।
तदेव मरणासन्नम् लोक युद्धे प्रदृश्यते ॥ ३३

चैनीया ऋष्यका इण्डो-नीषियाश्च समायिकाः ।
बर्मीयाः फ्रांसुदेशीया आंग्लाश्चामेरिका स्तथा ॥ ३४

एतान् प्रजातंत्रपरान् प्रतारयितु मक्षमः ।
अपि त्रैलोक्यराज्यार्थम् किन्नु स्वातंत्र्यकांक्षया? ३५

निष्कास्या ह्यांग्लदेशीयान् का प्रीतिः
स्याद्विशिष्य नः ।
पापमेवाश्रये दस्मान् मित्रपक्ष विघाततः ॥ ३६

निष्कासितेषु चांग्लेषु जापानीय चमूततिः ।
चीना माक्रम्य बर्मांच भारते धास्यते पदम् ॥ ३७

इत्थम् भूमण्डलम् सर्वम् नियंतॄणाम् वशंगतम् ।
दुस्सहम् शाश्वतम् नीचम पारतंत्र्य मवाप्स्यति ॥ ३८

तस्मान्नार्हा वयं योद्धु मांग्लेयान् मित्रपक्षकान् ।
कथम् मित्रापकारेण सुखिनःस्याम बापुजी ! ३९

यद्यप्येते न पश्यंति लोभोपहत चेतसः ।
पारतंत्र्यकृतम् दोषम् मित्रद्रोहेच पातकम् ॥ ४०

कथम् नज्ञेय मस्माभिः पापा दस्मा न्निवर्तितुम् ।
पारतंत्र्यकृतम् दोषम् प्रपश्यद्भिर्महात्मक ! ॥ ४१

पारतंत्र्ये प्रणश्यंति मानवीया महागुणाः ।
मानवत्वे विनष्टेहि धर्मनाशो भवेद्ध्रुवम् ॥ ४२

अधर्माभिभवात् बापु ! प्रदुष्यन्त्यखिला जनाः ।
बलीयसांहि दौर्जन्यात् दास्यं यास्यंति दुर्बलाः॥४३

दास्ये नोत्साद्यते क्षिप्रम् सत्यजातीयभावना ।
भावदास्यं विना नैच्यम् मानवेभ्यो न विद्यते ॥४४

अहो बत ! महत्पापम् कर्तुं व्यवसिता वयम् ।
स्वराज्यसुखलोभेन मित्रपक्षप्रतारकाः ॥ ४५

यद्यस्मा नप्रतीकारान् पीडयेयु स्सदांऽऽग्लकाः ।
विजयेन बलीयांसः तच्च क्षेमतरं भवेत् ॥ ४६

एव मुक्त्वा सुशिष्योऽसौ गांधेः प्राग्र
उपाविशत् ।
विसृज्य पत्रम् देशीय सभायाम् प्रस्तुतम् तदा॥४७

इति श्रीमद्गांधीगीतायाम् सर्वोदयशास्त्रे विषादयोगो नाम प्रथमोऽध्यायः ।

---

# मनुष्यः – महर्षिः

आंध्रमूल
*रचयितारः*
**वड्डलमूडि गोपालकृष्णार्याः**

संस्कृतीकरण
*अनुवादकाः*
???

7

**मनुष्य :–**

अंडपिंडान्
नजानेहम्
कथम् जाने
ब्रह्म किन्विति
ब्रह्म भिन्नम्
किम् भवेदिति
हे महर्षे !
हे महात्मन् !

8

**महर्षि :–**

अंडपिंड ब्रह्माण्डानि
(बाह्यदृष्टेः)
समतल निभम्
दृश्यते यत्
वक्ररहितम्
चक्र मुक्तम्
अवनि चक्रम्

अंड मूचुः
भो मनुष्य !
भो मनीषिन् ।

9

नदीनदतरु
गिरि समुदयाः
देव मन्दिर
पाठशालाः
उटज सौधाः
प्राणि जातम्
सर्व मेतत्
पिंड मूचुः
भो मनुष्य !
भो मनीषिन् !

10

नयन गोचर
मस्तितायुत
मंतरहितम्
यदाकाशम्
शून्यकल्पम्
ब्रह्म खलु तत्
भो मनुष्य !
भो मनीषिन् !

11

अंड पिंडब्रह्माण्डानि
( अंतर्दृष्टेः )
त्वं च त्व मिति तु
अहं त्वह मिति
बोधयति यत्
नयन गोळम्
पूर्णरूपम्

अंड मूचुः
भो मनुष्य !
भो मनीषिन् !

12

नयन गोळे
कांति पूर्णम्
बिंदुरूपम्
सुंदरतरम्
तारकाख्यम्
पिंड मूचुः
भो मनुष्य !
भो मनीषिन् !

13

तारकांतर
गता, कांत्या
दीपकांतिम्
पोषयंती
वर्तते या
कळासैव
ब्रह्म, सोऽहम्
संज्ञितम् यत्
भो मनुष्य !
भो मनीषिन् !

14

( अंतर्दृष्टेः पंच भूतानि )
लोचनांतः
क्षितिरमणता
नयनजलमे
वादिशौक्ल्यम्
चक्षुरग्निः
सांद्रकार्ष्ण्यम्

तारकागत
नीलिमा खलु
वायुरूपम्
यत्र चंचत्
कांतियुक्ता
कळा विलसति
नभ स्संज्ञा
तत्कळागत
निष्कळा खलु
परब्रह्मे
त्युच्यते नः
भो मनुष्य !
भो मनीषिन् !

## 15

( अंतर्दृष्टेः त्रिवेणी )

नयन शौक्ल्यम्
जाह्नवी खलु
कृष्णवर्णा
द्रूतकांतिः
तारका खलु
पुण्य यमुना
तारकांतः
स्थितं ज्योतिः
सरस्वत्या
मूर्तिरिव
गांग यामुन
संगमाहृत
सरस्वत्या
वेणिका इव
वेद्मि तास्ताः
एक गात्राः
प्रभासंते
भो मनुष्य !
भो मनीषिन् !

## 16

तारकांतः
स्थितं ज्योतिः
जल सरस्वति
मूर्ति रेव
निश्चलम् यद्
भासमानम्
वर्तते तद्
ज्योतिः कळा
तत्कळागत
निष्कळा खलु
परब्रह्मा---
त्मकं भवति
परब्रह्मे
त्युच्यते तद्
विराड्रूपम्
भवत्येव
स्वराड्रूपम्
भवत्येव
मुक्तिकांता
तदे वास्ते
भो मनुष्य !
भो मनीषिन् !

# THE GLORY OF SIVA'S NIGHT

*By*
KAVIKONDALA VENKATA RAO

*Translated by*
R. APPALA SWAMY

The cobra round the neck
Of pitch-black-throated Siva,
Cast his slough and spread his hood
And drew forward his double tongue,
As an angry soldier would stroke back his fierce moustache;
And pricked full forward his two ears.
Hark ! the music of the beaded gourd—
From the depths of the mystic night, O what enchantment spills!
And the night is pitch-dark as black-throated Siva's night.
The mystic eye deep in the forehead set
Shoots forward tongues of fire like a red forge,
Makes revolutions like a red-rimmed wheel ;
A blacksmith night well in it heat his iron white
And all the world might gather round for warmth from the cold wind.
But who dare face the glory?
and live to tell the story—
And night is pitch-dark as black-throated Siva's night.
The female half Mahankali
O does she take the situation in?
Or is she lulled to sleep by the grim clatter
Of skulls which shake like the end of the world—
She does not disapprove of her Lord come awake,
She does not plead for the world horror-struck,
Hark! what a clatter mounts from an infinity of skulls!
One arm tilts menace with the trident,
One hurls forth flakes of fire,
Another grips the begging bowl of Brahma's skull,
The fourth manipulates the mystic rattle,
The four arms live and breathe each in its right with supplest conscious motion.
Ah! whoso hears or sees let him shout loud approval, 'Ashsharabha! Sharabha!'
Ah! who can join competition in the waxing glory of the all-annihilating dance,
And O what scintillating gold!
And the night is pitch-dark as black-throated Siva's night!
The crown surmounted by the full moon is surpassing white,
The mass of matted locks soars high,
The skies crowd and the waters swarm with foam,
In the hollow of the belly,
How tightly yet how loosely fits the tawny tiger skin with coal-black spots.
But who can contemplate the all-consuming hunger?

And who can face the glory with wide open eyes?
The skill with which the paces and the gestures
Are neatly executed,
How it compels attention!
Now the horizontal posture
The effortless stance that succeeds immediately—
The two feet shoot apart
With a whole world's distance in between
And then they meet.
What wondrous curves the torso registers—
Who dares find fault with gesture or with range of motions,
And who dares join the dance in sheer perversity—
And the night is pitch-dark as black-throated Siva's night.
The utter absence of all self-conceit,
The dance does not bring out the visage which expresses by its vagueness
And when all terrified you cry out 'Mahadeva' for protection,
You find there's not even the shadow of a hand—
And yet what clatter,
Before, behind,
And who dares match the glory with his own?
And the night is pitch-dark as black-throated Siva's night.

# THE IMPORTANCE OF SANSKRIT

*By*

JATAVALLABHULA PURUSHOTTAM, M.A.

The first book to appear in the world was in Sanskrit. "The Rig Veda is the first book in the library of man," says Max Muller. So, for all times, the historical importance of Sanskrit is assured.

As the features of the mother are distributed among the daughters, so are the characteristics of Sanskrit found scattered in the languages of Europe, India and Persia. It is on looking at the mother that we can understand the sisterhood of her daughters, which, mere sight of the daughters cannot bring home to us. Centuries of multi-lingual scholarship could not enable the European scholars to realise the sisterhood of their languages. It was the entrance of the mother, Sanskrit, into the linguistic field of Europe in the eighteenth century that enabled them to propound the theory of the sisterhood of those languages. Thus the discovery of Sanskrit by European scholars was responsible for the birth of a new science in the world, namely Philology or comparative study of languages.

Early Philologists admitted unhesitatingly the motherhood of Sanskrit. The later Philologists, for some reasons, dethroned Sanskrit from motherhood and assigned to her the position of the eldest sister. Even according to them Sanskrit is the nearest representative of the mother language. It is to be remembered that these Philologist

are unable to point out the mother and we are asked to believe that the hypothetical Indo-European Language is the mother. So, practically the motherhood of Sanskrit remains unshaken.

In this connection we may remember the words of two pioneers of Indo-European Philology.

Mr. Curzon in his Essay on the Original Extension of the Sanskrit Language, in the journal of the Royal Asiatic Society of Great Britain and Ireland (Vol. XVI Part I P. 177) says, "I venture to affirm that they (that is, other languages such as Zandic, Greek, Latin, Gothic etc.) have all sprung at diffrent chronological periods, from the Sanskrit, that is the Vedic Sanskrit, of the Aryan race, or ancient Hindus of India proper."

Mr. W. C. Taylor says: "It was an astounding discovery, that Hindustan possessed in spite of the changes of realms and changes of time a language of unrivalled richness and variety; a language the parent of all those dialects that Europe has fondly called classical—the source alike of Greek flexibility and Roman strength. (paper on Sanskrit Literature, in the Journal of the Royal Asiatic Society. Vol. II)

A knowledge of Sanskrit is considered essential for a genuine scholarship of any European language. This view is not merely of the orientalisits in Europe but also of other men of letters. A non-orientalist like John Ruskin recommends to his countrymen the study of Max Muller's Biography of words, which mainly deals with the Sanskritic origin of words of Europen languages.

Prof. Max Muller held that Sanskrit was the Key to all the other languages. In his memorable words, "What Mathematics is to the Sciences the same is Sanskrit to the languages of the world."

It should not be supposed that the importance of Sanskrit is confined to the circle of Indo-Germanic languages. The Philologists that propounded the theory of a separate Indo-Aryan family of languages did not deny the possibility of the relationship of Sanskrit with the Semitic and other families, in the dim past. In fact, recent researches have strengthened the possibility. Caldwell who enuniciated the theory of a separate Dravidian family of languages clearly admitted that the Scythian group was closely connected with the I.E. family; earlier to the separation of the several members of the latter. Apart from that there is a theory gaining ground that the Dravidian languages are of Sanskritic origin. Even the Chinese language which was once least suspected to have anything to do with Sanskrit is now known to possess a fairly large number of Sanskrit words.

Due to the growing realisation of the affinity of Sanskrit with all the languages of the world, there is an increased need felt all over the world for the resuscitation of that ancient language. In fact, the highest common factor of all the languages of the world is the vocabulary of Sanskritic origin. This is not denied anywhere. Mr. Hugo Valvane, the Ambassador of Finland in India declared in the Banaras Session of Sanskrit Vishwa Parishat (1952) that Sanskrit was best fitted to be the language of the United Nations organisation.

Just at present in many of the Asiatic countries, national ideas are surging forth and there is a growing urges to use the languages of the respective countries for administrative and educational purposes. Some of the eastern countries including Ceylone, in their efforts to coin fresh words are largely banking upon Sanskrit. Mr. V. J. Sekareswiya, a noted educationist of Ceylone, in his address at the Sanskrit Conference of Jaffna on 22-6-54 clearly stated, "We have to coin fresh words on the basis of originai Sanskrit roots".

Historians and Professors of Political Science agree that India has been a nation from time inmemorial. We know that

geographical unity, racial unity and Linguistic unity are the major factors that contribute to the nationhood of a people. This triple unity is rarely denied in the case of India. But some times much is made of the multi-lingual nature of the country. Indegenous and foreign scholars are unanimous on the point that running through the diversity, there is a sort of unity among the Indian languages due to the high percentage of Sanskrit vocabulary common to all of them. The common quantum of Sanskrit vocabulary can be felt by us not only in the literary dialects of the various languages but also in the speeches of the common folk, so much so that at an All-India Kavisammelan, an Andhra, if slightly aided, can understand a Bengali Poem read out and a North Indian can understand a Malayali Poem. Like-wise a South Indian travelling in the north can carry on conversation with a North Indian with their common Sanskrit words of daily usage like bhojan, nivas, nidra, ratri, etc.

Sanskrit is a rich language, rich in roots, rich in inflections, and rich in the potentiality for coming words with different cannotations and devotations and different shades of meaning. This fact coupled with its common hold on all the regions of India has led the framers of our Constitution to lay down a rule that the Hindi that is to be the official language of the Union shall develop 'by drawing, wherever necessary or desirable, for its vocabulary, primarily on Sanskrit and secondarily on other languages' (Part XVII, chapter IV, 351). Thus it happened that the national importance of Sanskrit language has been recognised by the Constitution of India.

As a vehicle of modern ideas, the role of Sanskrit in all the provinces of India is admirable. The Non-co-operation movement, the Library movement, the Literary movements and various other movements of the modern age have been made popular through lectures and articles in papers, and the language used in all these was loaded with Sanskrit words. This clearly shows that common people in all the regions of India more easily understand Sanskrit words than the artificial Desya words. Even in literature those books which freely use Sanskrit words are more easily understood than those that are written with an idea of avoiding Sanskrit words. One main feature of modern literature and journalism in a the regional languages of India is that they are gaining the ever needed energy and vitality from Sanskrit and in their turn are making more and more of Sanskrit words populur, so much so that an Indian of the present day knows far more Sanskrit words than a person of the previous generation. Thus the dynamic power of Sanskrit is most successfully harnessed to a the modern Indian movements.

The cultural value of Sanskrit is of no less importance than its linguistic value, but it is not even touched upon here, as it requires a separate treatment.



# The Secret of Karma Yoga as Revealed in the Gita

*By*
SRI GUNDE RAO HARKARE

Bhagvat Gita has carved for itself a conspicuous niche in the temple of world's literature. Apart from its unparalleled eminence as the perfection of literary art, it is the only piece of philosophical literature, which within its comparatively small compass contains a comprehensive exposition of the profound philosophy of Action, Devotion and Knowledge. The splendid synthesis of apparently paradoxical maxims has been the eternal quarry of an unending procession of great thinkers from different countries and climes. Far from adding to its teachings these torch-bearers of ultimate knowledge have failed to exhaust the untold treasures contained in this little alcove of divine lore. In fact every intellectual colossus in his venturesome enterprise to elucidate has only succeeded in giving a new interpretation of the Gita. To-day in the garden of knowledge the tree of Gita spreads its fragrance with its innumerable blossoms of the various schools of philosophy, each vying with the other to show the full beauty of the Gita—in each case what noble ambition, has gloriously frustrated !

Strangest of contradictions that this revelation of devine knowledge should have its origin in the great battle field of Kurukshetra—the scene of the first monstrous war known to world's history—where the armies on both sides were equipped fully with engines of destruction. Arjuna, whose arrow never misses the mark kindled with zeal for deeds of valour, comes in a stately chariot with Lord at the reins. But when he sees revered masters and beloved kith and kin arrayed opposite only ready to be sacrificed to his invincible bow his filial love gets the better of his warrior's zeal. "What shall it profit me—kingdom and royal pleasures—if it be at the cost of the lives of these whom I hold dear" he said, "Nay, what avail is dominion to me, and even my own life". In a fit of dejection Arjuna discards his bow and arrow and decides to give no battle. Observing Arjuna overpowered by sentiment at such nick of time, Lord Krishna reveals the Gita to remove the pall of ignorance from Arjuna and to urge him play his part in the war, and in the mysterious drama of human existence. This revelation of the Gita by the Lord is by no means mere persuation of Arjuna to the sordid acts of cruelty and blood-thirstiness but a profound awakening of one to the call of duty, pure and selfless.

Bhagvat Gita contains eighteen cantos. As partitioned by almost all the great commentators, the first six cantos deal with the Philosophy of Action, the next six with the Philosophy of Devotion and the last group with that of Knowledge. Lokamanya Tilak is the only exception who objects to this conventional classification. According to Tilak, the Gita obviously reveals mainly the philosophy of Action, the other two, that is, Knowledge and Devotion are subservient to Karma or Action.

Arjuna's denial from taking part in the war was chiefly based on the view that to kill others, nay his own men, simply for the sake of his own selfish motives is sinful. He thought better to renounce every thing and become an ascetic and wear ochre robes than to kill his own relatives for selfish enjoyments. But this view of Arjuna based on ignorance was detrimental to further

evolution of his soul. Lord Krishna had to remove this ignorance, the seed root of multifarious bondages and to arouse in him consciousness towards duty. The conception of Egoism is futile. The notion of relations and the right of possession and ownership and enjoyment derive from Egoism. But the real Ego is beyond the bondage of birth and death. The body will perish and disintigrate into its elements even though preserved with great care and the soul cannot die in spite of incessant attacks with weapons and complete destruction of body. Thus there is no "I" and "MINE". Then where comes the idea of "SIN" by killing "MY MEN" from? This is knowledge, the removal of the curtain of illusion. To drive well home this principle one must first have recourse to the practical methods of Devotion. Devotion consists in recognition of higher merits in the great one and complete surrendering of self to Him. This knowledge and Devotion are essentially the highest development of different aspects of Soul. To put it in other words, Knowledge and Devotion are the manifestations of the latent powers of Intellect and Intuition respectively. Thus an advanced soul having clear and profound knowledge of right and wrong and fully developed in emotional faculties is entitled to perform the duties simply for duties' sake, without the least motives of self-aggrandisement.

But as the text goes on, an insolvable ambiguity arises. Lord Krishna preaches that Action is far inferior to knowledge and he wants Arjuna to seek refuge in wisdom. For one endowed with wisdom only can cast off both good and evil. The finest skill in action is Yoga. Therefore only the wise freed from the fetters of recurrence of Birth and Death, attain Immortal Bliss. Almost at the same breath He urges Arjuna to fight. Thus Arjuna being thrown in great ocean of perplexity, puts question to the Lord.

The question of Arjuna is of vital importance to trace the secret of Karma Yoga. The verbatum translation of the verse is as follows:

"Arjuna said:

> Oh Janardan! If you think that knowledge is superior to action, why then, Oh Keshav! impose upon me this terrible war? It seems you are confusing my power of understanding by your speech which is apparently perplexing. Therefore I request you to tell me plainly which way am I to follow, so that I may attain Bliss."

This question is interpreted in different ways and even the context of the question is read in many ways. Thus the question gives ample scope for the different schools of philosophy.

There is a great conflict in the teachings of Veda itself. The last portion of Veda (Vedanta) strictly forbids Karma and plainly orders a disciple seeking ardently for salvation to take recourse to wisdom. While the preceding portion of Vedas strictly lays down rules for the performance of religious ceremonies full of sacrifices throughout the life. This is a conflict between two schools of philosophies Vedanta and Mimamsa. Hence the Theory of Samuchchaya Vada comes forth. Bhasker and others vindicate this theory and prove that for the salvation of the soul both the knowledge and action are necessary.

Samuchchaya Vada or Conjoint Theory consists in taking equally both knowledge and action as direct means for Salvation. Kaivalya or Salvation cannot be obtained by having recourse to the pure knowledge of self only which is essentially renunciation of all the duties but it is most necessary to take practical course of performing regularly Vaidic Karmas also. Gita too is interpreted to be in favour of this theory. अथ चेत् त्व मिमं धर्म्यं संग्रामं। If you will not take part in the war which is righteous duty to you as

Kshatriya, the warrior, you will certainly incur sin, having lost fame for the fault of abandoning the duty. कर्मण्येवाधिकारस्ते Thy right is to work. कुरु कर्मैव तस्मात् त्वम्। Therefore do thy work. An objection may be advanced on this that the Vaidic rites are full of cruelty. They consist in sacrifice of innocent animals. So they are sinful. But this is groundless. Karma is nothing but performance of duty and of a righteous duty. Otherwise a Kshatriya's taking part in the war also would be sinful simply because war is a brutal act ending in utter destruction of even a teacher, father and brother. Therefore the performance of ceremonial sacrifices which are to be practised throughout the life allowed by Vaidic verdicts is as necessary as the knowledge of self. Hence both are equally essential to Salvation.

Shanker refutes this and says that the Gita does not favour this Conjoint Theory. For it is distinctly stated that there are two different paths for the disciple according to his capacity. There are some stages in the comprehensiveness of the mind of man. In accordance with this gradation सांख्यबुद्धि, the wisdom of eternity and indestructibility of soul and योगबुद्धि, the wisdom of Action for emancipation of soul who is essentially different from the body are preached. The Lord says ज्ञानयोग or knowledge is meant for *Sankhya and कर्मयोग or Action for Yogi. ज्ञानयोगेन सांख्यानां। This gradation is based on holy Upanishads एत मेव प्रव्रजिनो लोका:, किं प्रजया करिष्याम: This is the degree of advancment of soul. Had Lord Krishna intended to preach Conjoint Theory then this obvious statement of two-fold wisdom would be meaningless. Further Shanker says that the question of Arjun itself would be out-of-place. If Lord Krishna be in favour of combination knowledge and action, why should Arjuna ask Krishna if knowledge is thought superior to action? Why he forced to perform cruel and dengerous action, i.e. war. Moreover if combination is meant it must be the advice to all. Then Arjun also must act according to it. Then why should he ask यच्छ्रेय एतयो: Tell me decisively which one is good for me.? Shanker says that Conjoint Theory is applicable to others and not for the seeker of salvation. He concludes that knowledge and action combined are not meant to be prartised by one and the same person as they are essentialy different and prescribed for the disciples according to their different capacities. In this light Shanker interprets the question of Arjun and observes that Lord Krishna has already preached two-fold wisdom. The wisdom of Sankhya from the text प्रजहाति यदा कामान् to the end of Canto II explaining that Sankhyas can obtain Bliss by this method only without taking recourse to any other way. एषा ब्राह्मी स्थिति:. But for Arjuna the Lord gives a special advice कर्मण्येवाधिकारस्ते. Thy right is to act. माते संगोस्त्वकर्मणि Do not incline towards evil action preferring Yoga wisdom to Sankhya for Arjun. But Lord does not say that a disciple of Yoga system can obtain Bliss by this Yoga method only as he stated in the case of Sankhya. In this context Arjun is rightly thrown into confusion. Krishna is the Lord of mercy and Arjuna's benefactor. Then why should he, after revealing Sankhya wisdom as the direct way to salvation, put Arjun under the responsibility of the obligation of performing Karma resulting in danger? Arjuna's perplexity is indispensable and the question also is concordant to his embarrasment. Arjun asks—

> "O Janardan! If you think that knowledge is superior to action then why O Keshav! you engage me in this terrible action. i.e. War."

**(To be continued)**

* Sankhya = Vedanta and not Sankhya philosophy of Kapil.

శ్రీరాముగనతల్లి పొట్టంపినాది
సీతనూగనతల్లి పొట్టందుమమ్మ
రగురాముగనతల్లి పొట్టంపినాది
రంబనూ గనతల్లి పొట్టందుమమ్మ
కాముణీ గనతల్లి పొట్టంపినాది
కన్యనూ గనతల్లి పొట్టందుమమ్మ
యేణిగై[38] కంసల్ని పొట్టంపినాది
యెలకపై[39] బూదేవి పొట్టందుమమ్మ."

ఇది 'అయిరేని' పాట.[40] బచ్చెన పనిచేసిన పెండ్లి కుండలు 'అయిరేని'. ఎవరి 'వర్తనకుమ్మరి' వారికి 'అయిరేని' కుండలను తయారుసేసి యిచ్చును. తలంబ్రాలకు ముందుదినమే 'అయిరేని' కుండలను కుమ్మరింటినుండి తెచ్చెదరు. ఉల్లెడలక్రింద ఉడుగరల పళ్లెరములు చేతఁబట్టి పేరంటాండ్రు నడచిరా పెండ్లివారు మంగళవాద్యములు చెలఁగ కుమ్మరింటికి పోయి, కుమ్మరివారికి దక్షిణ తాంబూలములతోపాటు ఉప్పుతో తొమ్మిది స్వయంపాకమునకిచ్చి, 'అయిరేని' గొనితెచ్చి పెండ్లింటిలో దేవునిమూలనుంచి పూజింతురు. ఈ 'అయిరేని' యందలి అయిదు ముంతలను తీసి వివాహవేదికయం దుంచియు పూజింతురు. ఇది యొకరకముగా కలశపూజ. పెండ్లి పనులలో లోహపాత్రలకంటె మృణ్మయపాత్రలు పవిత్రములని 'కులపెద్దల' నమ్మకము. ప్రాచీన నాగరకత కివి పరిశిష్టములు కదా! ఇట్లే కలశపూజకును, కంకణబంధములకును, బాసింగములకును, మంగళసూత్రమునకును పోఁగునూలు - వడికిన నూలు - తప్ప మరనూలు వాడరు.

"పచ్చన్ని పందిటా ముత్యాలముగ్గా
రత్నగంబపి మింద[41] లక్కపీటల్లు
లక్కపీటల సరస లవపత్రి బరిసి
సీత శ్రీరాములూ చేరి కూర్చుండ
నవదాన్యరాసులూ నవరత్న రవిశి
రాసిదాన్యం మింద రంగులవిరేణి
మాణిక్య దియ్యాలూ[42] మల్లి[43] సూసకమూ
గరిగి బుడ్డిలోన గంగతీర్తాలూ
పమిడి గిన్నెల్లోన పచ్చిటచ్చింతలు
బచ్చెన్న బరణిలో పసపు గుంకాలూ
వెండితట్ట[44]ల్లోన పండు పలముల్లూ
ఓరానె పువ్వల్లు యిడగనే రామా
బాసింగమిడువనే[45] పొద్దాయె రామా
కాకరాపువ్వల్లు యిడగ యాళాయె[46]
కంకణాలిడువనే పొద్దాయెనమ్మా
పచ్చన్ని పువ్వల్లు పగిలె పొద్దాయె
బ్రమ్మముళ్ళు[47] యిప్ప[48] పొద్దాయెనమ్మా
ఆరతిని ఇవ్వరే అవిరేణి తల్లికీ
పేరెత్తి మొక్కరే పెద్దావిరేణి
తలపుంచి మొక్కరే తల్లావిరేణి.[49]

పెండ్లి పేరంటపు పనులలో ముత్తైదవలు పాడు[50] అల్లొ నేరేళ్ళు, దవళము, సువ్వాల, సోబానము మొదలగు పాటలవలె గౌరీకల్యాణపు పాటలు[51] నొకరకము. నలుగు పాటలలో ఈ గౌరీకల్యాణము అంతర్భాగములు. ఈ క్రిందిది గౌరీకల్యాణపు పాట. ఈడేరినపుడు కన్యకు చుట్టములు సూడిదలుతెచ్చిచేయు వేడుకలలోపాడు పాట ఇది. ప్రతిదినము మలిసందె

38. ఏనుగై; 39. ఎలుకపై; 40. 'ఐరేని గొఁనివచ్చి రైదువల్ పాటలు పాడుచు శుభవేళ వేడుకలర....' విజయవిలా. 3-95; 41. మీఁద; 42. దివ్వెలు; 43. మల్లె; 44. పళ్ళెరము; 45. బాసింగము విడువ; 46. వేళాయె; 47. తలంబ్రాల తరువాత భార్య పైఁటకొంగునకు, భర్త ఉత్తరీయపు టంచునకు ముడివైచుట "బ్రహ్మముడి"; 48. విప్ప; 49. తల్లి అయిరేని; 50. "పేరఁటాండ్రాగిఁబాడు పెండ్లిపాటలకు శారికా కీరముల్ సందడి సేయ...." రంగనాథరామా. బాల, 83 పు. ఆం. వి. వారిప్రతి; 51. ....అరుంధతియు, ననసూయయు నాదియైన పుణ్యాంగనలు గౌరీకల్యాణంబులు వాడుచు ముత్యాల సేసలిడ...." (రుక్మాం. 5-190), 'గౌరీకల్యాణంబటు నారీమణులెల్లబాడ....' (తపతీ. 5-52), 'గౌరి కల్యాణమునకేమి కంతుగన్న తల్లి ధవళంబు పాడరాదా లతాంగి....' (పాంచాలీ. 4-22), 'పీకే వచ్చు సువాలయున్ ధవళ మింతీ యల్లొనే రేళ్ళు గౌరీకల్యాణము లంచు నింటికడ నే రేతిం విజృంభింతువే వాకీ విచ్చట నంచు....' (పాంచాలీ.4-24) :

పూట ఏడువారాల సొమ్ములతో అమెను 'మస్తాను' సేసి, పీటమీఁద కూర్చుండఁబెట్టి, నలుఁగుబిండి రాచి, పారాణి పూసి, గంధము నలఁది, పన్నీరు చిలికి, కుంకుమబొట్టు పెట్టి, కాటుక లిడి, పూలు తుఱిమి, సూసకము పైచి, అక్షతలు ముక్కాలు చల్లి, తాంబూలాదులతో ఒడి నించి ఆరతి యెత్తుదురు. ఉత్తత్తి - ఎండుకజ్జూరపు - పండ్లు, ఎండుకొబ్బెర గిన్నెలు, కండ చక్కెర పలుకులు, పసపు గొమ్ములు, వక్కలాకులు, వెల్లుల్లి గడ్డలు, తక్కిన కానుకలతో ఒడి నింతురు. ఇది పదునాఱునాళ్ళ వేడుక. బంధు బలగమునకు దినదినమును విందు. పదునాఱవనాఁడు ఊరందఱికిని విందు. కన్నడ సీమలోని 'ఒసగె' యిట్టిది. సీతమ్మ పుట్టింటనే ఈడేరినట్లీపాట తెలివి౽. ఈ అచ్చటముచ్చటలు అయోధ్యయందు జరిగినట్లు కొన్ని రామాయణపుపాటలు తెలుపుచున్నవి.[52] రెండు రెండు చరణముల కొకతూరి 'గౌరి కల్యాణమే వైభోగమే గౌరి కల్యాణమే వైభోగమే' అని వంత పాడుదురు.

"అలికిన్న పూసిన్న అరుగుల్ల మింద
ఆదిలక్షిమి సీత సమర్తలాడింది
గౌరి కల్యాణమే వైభోగమే
గౌరి కల్యాణమే వైభోగమే.

సమర్తలాడినసుద్ది తల్లితోజెప్పె
తల్లిబోయి తనవొక్క బలగముతొ జెప్పె    గౌ.

నూటొక్క బలగమూ నూనిలంపీరీ
కోటొక్క బలగమూ కొబిరి[52-a] బంపీరీ    గౌ.

పట్నాన బంచిరీ పసపు నూనెల్లూ
దేశాన బంచిరీ దినుసు సరుకుల్లూ    గౌ.

పిన్నమ్మ దెచ్చెనే పిరెముతో[53] నలుగూ
పెద్దమ్మ దెచ్చెనే ప్రేమతో నలుగూ    గౌ.
కంసల్లి కన్నత్త ఘనమైన నలుగూ
కైకమ్మ సిన్నత్త కడలేని నలుగూ    గౌ.
వసిష్ఠుల బియ్యాము పంపి వార్పింగా
పదివేల విస్తరే పంపిర్లొ వెయ్యా    గౌ.
బందుజనాలనికి విందు జేయంగా
బంతులేసాగెనే పటార్కారి వంతా."[54]    గౌ.

ఈ పాట సపినాటు - ఊడ్పుల - సహాయముతో పాడునది. మహిమల తోడ నీలుగల సువిద్యాలతో వారలుతీరి సపిని నాటుచు స్త్రీ లీపాటను పాడుదురు. శివధనుర్భంగము నాటికి సీతమ్మ కాఱేండ్లదియన్న[55]. అయోధ్యకు క్రొత్తగా కాపురమునకు వచ్చిన సీత శిశుప్రాయయని భవభూతి చాలచోట్ల స్పష్టపఱిచినాఁడు.[56] పెండ్లియయినవెంటనే మిథిలాపతి జనకుఁడు కూఁతుండ్ర నంపలేక అత్తింటికి పంపినట్లు వాల్మీకీయము పేర్కొనుచున్నది. సీతకే ఆఱేండ్లను చుండఁగా ఊర్మిళాదు లంతకంటె పసిపిల్లలయి యుండవలెనుగదా! ముక్కుపచ్చలారని పసిపిల్లలకు అంపకాలవేళ నయబోధ సేయుట హాస్యాస్పదము కాదా? ఈ ప్రసక్తి వాల్మీకీయమునఁ గానరాదు. "అథరాజా విదేహానాం దదౌ కన్యాధనం బహు.... దత్వా బహుధనం రాజా సమనుజ్ఞాప్య పార్థివం. ప్రవివేశ స్వనిలయం మిథిలాం మిథిలేశ్వరః" అని వాల్మీకి ఊరకొనినాఁడు. "జనకుఁడు కూఁతులం బిలిచి సమ్మతి బుద్ధులుసెప్పి[57] ...." అను భాస్కర రామాయణకర్త సూచనను, "అప్పుడు మిథిలేశుఁ డానందకేళి - నుప్పొంగి నిజవైభవోన్నతి మెఱసి కరమర్థి బుద్ధులఁగఱపి కూఁతులకు[58] ...." అను రంగ

52. సీతసమర్త. స్త్రీల రామాయణపు పాటలు. పుటలు. 92-98; 52-a. కొబ్బెర; 53. ప్రియము; 54. పొరుగూరిదాఁక; 55. చూ. 'మమ భర్తా మహాతేజా వయసా పంచవింశకః అష్టాదశహి వర్షాణి మమ జన్మని గణ్యతే' అరణ్య. 47 సర్గ. గోవిందరాజీయ వ్యాఖ్య: 56. 'పతనవిరళప్రాంతోన్మీల న్మనోహర కుట్మలై ర్దశన కుసుమైః ముగ్ధాలోకం శిశుర్దధతీముఖం' — ఉత్తర రామచరితమ్, ప్రథమోఽఙ్కః, 20; ఇంకను అందే చూ. 1-37, 1-45, 4-4, 4-11; 57. భాస్కర, రామా, బాల. 743; 58. రంగనాథరామా, బాల, 86 పుట, ఆంధ్ర విశ్వకళా పరిషత్తు వారి ప్రతి.

నాథ రామాయణకర్తసూచనను గ్రహించి 'అంపకపు హితవు' లను పెంచి పెద్దపెద్దపాటలుగా వ్రాసినారు.

"యేలనమ్మా సీతమ్మ యేలనమ్మ సీతమ్మ
యేరాకేమీ స్థిరమమ్మా
యెల్లపొద్దూ యింటివేల్పుల పూజలేయమ్మా
పొద్దుపొద్దున్న లేచి ॥పొద్దు॥
అత్తామామల సేవలేయమ్మా
బంగారుబలగం బారాపెద్దల బాగాజూడమ్మా
కురుల చక్కదనమూననూ ॥కురుల॥
కురులు విప్పి తిరగొద్దమ్మా
కొప్పునున్నా వజ్రాలక్కాయ కొనరిచూసేరూ
వీపు చక్కదనమూననూ ॥వీపు॥
పైటజార్చి తిరగొద్దమ్మా
వీపునున్నా పిరాజాజులు పొరలు చూసేరూ
చెయ్యి చక్కదనమూననూ ॥చెయ్యి॥
చెయ్యిపసరి నడవొద్దమ్మా
చెయ్యినున్నా నల్లాగాజులు గల్లుమనినీ
కాలు చక్కదనమూననూ ॥కాలు॥
కాలుయెత్తి నడవొద్దమ్మా
కాలినున్నా కడియాలేమొ గల్లుమనినీ."

ఈ దిగువఁ జూపినది 'కపిలె' పాట. కపిలె పాటలు[59] జానపదసాహిత్యమున అమృతకలశములని రసపిపాసువుల యామోదమునుబడసినవి. అయోధ్యా కాండ గాథ యంతయు నీ 'యభినవగాథ' లో నిమిడిపోయినది. కైకమ్మయనిన జానపదులలోఁగల భావమున కిది ప్రతిబింబము. కైక కాకితో, సీత కోకిలతో ఉపమింపబడుట గమనింపఁదగినది. ఈ పాటతో రామాయణ కథ అడవిలోఁబడినది.

"కైకబుట్టీ వరముగోరా - సీతకాపర ముడివిపాలూ
కాకిబుట్టీ తరిమికూయా - కోకిలమ్మా గుట్లపాలూ."

ఇది విసరురాతిపాట. ముక్కుసెవులు గోసి రామ లక్ష్మణులు తన్నవమానించిరని శూర్పణఖ రావణా నితో మొఱయిడుట యిందలి యితివృత్తము.

"ముక్కుముక్కందము సక్కదనమ్మ
ముక్కెవరుకోసిరే ఓ సుప్పనాతీ ?
రామయ్య వనమూలొ పండ్లేరబోతే
పట్టిముక్కులుగోసె పరుశురామయ్య[60]
దిక్కువచ్చినతోన[61] చెప్పుకొమ్మన్నె[62]
పగవాణి రాజ్యాన పండ్లేరనేల
లంకాకి రావణుడు రాజుగానేల
వనమూలొ పచ్చులు వలసబోనేల"

ఇది కలుపుపాట. సీతారామలక్ష్మణులు పంచవటి లో నుండఁగా జరిగిన కథ యిందు వర్ణితము.

శ్రీరామ రామ వినవే రామ వినవే
,, ఆరెంటి[63] అడివిలో అది పర్ణశాలా ,,
,, పర్ణశాలకు రెండు పంచటరగుల్లు ,,
,, పంచటరగుల సరస చీమల్లపుట్ట ,,
,, పంచటరగూ మింద సిరిసాప బరిసే ,,
,, సిరిసాప మిందను జోడు గంబాడీ ,,
,, జోడుగంబటి మింద సలువ పచ్చరము[64] ,,
,, సలువ పచ్రం మింద సన్న మల్లెల్లూ ,,
,, సన్నమల్లెల మింద జాజిమల్లెల్లూ ,,
,, సలువ పచ్రం మింద సిరిగద్ది పీటా ,,
,, సిరిగద్ది పీటపై సీత శ్రీరాములూ ,,
,, సీత శ్రీరాములూ జూదమాడంగా ,,"

మారీచుఁడు 'మాయలేడి' రూపున కన్పించును.

శ్రీరామ రామ వినవే రామ వినవే
",, మాయలాడీ మెకము మేడపై వాలె ,,
,, సీత దాన్ని జూసి సీరడ్డగించె ,,
,, కాంత[65] దాన్ని జూసి కాలడ్డగించె ,,
,, యేడి జూస్తా దాన్ని యేలడ్డగించె ,,
,, ఆరడీ సీతమ్మ అటు మళ్ళి చూసే ,,
,, మాయలాడి మెకము మనమేడ మింద ,,
,, దాని చర్మం నాకు రైక గావలెనూ ,,
,, దాని చర్మం నాకు కోక గావలెనూ ,,
,, నీచేత గాకుంటె నీ చేతి అంబూ ,,

59. వివరములకు చూ. కపిలెపాటలు, స్రవంతి, ఆగస్టు, 1958, పుటలు. 7-17 ; 60. లక్ష్మణుఁడు ; 61. దిక్కు వచ్చినచోట ; 62. చెప్పికొమ్మనెనె ; 63. అరణ్య ; 64. పచ్చడము ; 65. కాంత.

,, నీచేతి అంబులూ నా కిచ్చి చూడూ ,,
,, అట్లంటె రాములకు అతికోప మొచ్చె ,,
,, ఇల్లు ఇల్లూ యెతికి యిల్లంబులందె ,,
,, జల్లెడంబుల పొదను[66] వీపునను వేసె ,,"

రాముఁడు మృగము వెంటఁ బడినాఁడు. చిక్కినట్లె అనిపించి పారిపోయెడిది. అపుడు రాముఁడు,

శ్రీరామ రామ వినవే రామ వినవే
,, అతికోపమే వచ్చి అగ్నిబాణం దొడిగె ,,
,, అగ్నిబాణం దొడిగి అటుజూసి యేసే ,,
,, సీతసీతా యని క్షితి మింది కొరిగె ,,
,, సీతయన్నా సుద్ది సీతమ్మ వినెనూ ,,
,, మరిది నా లచుమన్న మము గన్నతండ్రి ,,
,, ఆరెండి అడివి మీ యన్న రాములకు ,,
,, ఆరెండి అడివిలో అతికష్టమొచ్చే.... ,,"

అటుపోయి చూచిరమ్మని సీత లక్ష్మణుని బ్రతిమాలును. ప్రపంచము తలక్రిందు లయినను తన అన్నకు ఆపద రాదను లక్ష్మణుని మాటను సీత వినదు. లక్ష్మణుఁడు పోఁడు. భర్త కేమి ఆపద వచ్చినదో యను త్రొక్కులాటలో ఆమెలో కిఱుదురకపు టూహాలు పొటమరించినవి. ఇట్టి యదనున ఆవేశ మెక్కువ ఆలోచన తక్కువ. ఆవేశ మాలోచనకు చుక్కెదురు అపుడు సీతమ్మ అన్నది గదా,

శ్రీరామ రామ వినవే రామ వినవే
,, చేని పంచన బీడు యెవ్వరిది మరిదీ ,,
,, చేని పంచన బీడు చేనోడిదె[67] వొదినా ,,
,, అన్న జస్తే తేజి యెవ్వరిది మరిదీ ,,
,, అన్న జస్తే తేజి తమ్ములదె వొదినా ,,
,, అన్న జస్తే భార్య యెవ్వరిది మరిదీ ,,
,, యేమి మాటాడితివి యెర్రి మాతల్లి ,,
,, అనరాని మాటలే అంటివే తల్లి ,,
,, వినరాని మాటలే వింటినే తల్లి ,,
,, యిల్లు యిల్లూ యెతికి యిల్లంబులందే ,,
,, జల్లెడంబుల పొదను వీపునను యేసే... ,,
,, ...లంకిణీ తమ్ముడూ రావణాసురుడూ ,,
,, జంగమేసకమేసి[68] అంగణము కొచ్చి[69] ,,
,, గజశూల మేసెనే గడ్డపెకలించే[70] ,,
,, అంటిముట్టాకుండ అరదానముంచే ,,
,, తనదైన లంకకూ తరలె రావణుడూ ,,

ఇది వినసరురాతి పాట. ఇది సీతాత్రిజటల సంభాషణముగాఁ దోచుచున్నది. రావణుఁడు సీత నపహరించి తెచ్చి లంకలో తొలుత నప్పగించినది త్రిజటకే.[71] సీతను అశోకవనియందుంచినపుడును కావలియుండిన రాక్షస స్త్రీలలో త్రిజట యొకతె.

"రామ రామనియెదు రాజ్యములోనా
సీతమ్మ నిన్నెవరు సెరదెచ్చినారూ
లంకిణి తమ్ముడు రావణాసురుడూ
మాయారూపులతోడ మమ్మ సెరదెచ్చె
సుత్తూర[72] నిమ్మల్లె సూదిపొన్నల్లె

66. పొదిని ; 67. చేనివాడిదె ; 68. జంగముపేషము వేసి ; 69. అంగణమునకు వచ్చి ; 70. 'వామేన సీతాం పద్మాక్షీం మూర్ధజేషు కరేణసః - ఊర్వోస్తు దక్షిణేనైవ పరిజగ్రాహ పాణినా' శ్రీమద్రామా. ఆరణ్య. 49 సర్గ. 'మూర్ధజేషు నిజగ్రాహ ఊర్ధ్వ మా చక్రమే తతః' మహాభారత. అరణ్య. రామోపాఖ్యానపర్వ. 277 అధ్యా. 43 శ్లో. '....తనదు భయంకరాకారమునకు మూర్ఛం బొంది పుడమిపయిం బడియున్న జనకతనయం బొదివిపట్టి రథంబుపయిం బెట్టి లంకాభిముఖుండై....చన....' భాస్కరరా. అర. 2-106. 'అచ్చెరులోచన నదయతనెత్తి - తెచ్చి రథంబుపైఁ దెఱఁగొప్పఁబెట్టి' రంగ. రా. ఆరణ్య. 204. పుట. 'భూమిపై నున్నట్టి భూపుత్రి జూచి గడ్డ పెల్లాగించి రథముపై బెట్టి' సంక్షేపరామా. స్త్రీల రామా. పుట. 11. 'అదయశూలము దెచ్చి గెడ్డ పెల్లగించి రథముపయి బెట్టుకొనెనూ' లంకాయాగము. స్త్రీలరామా. పుట. 147 ; 71.....రావణుండును....సీత తోడ రా సముద్రంబు గడచి లంకాపురంబు సొచ్చి వివశురాలయిన సీతను డించి త్రిజట రప్పించి యా రక్కసితోడ నిట్లనియె' భాస్కర. రా. ఆరణ్య. 2-181. 'అని పలుక నాత్రిజటయు సీత నంతఃపురంబులోనికిం గొనిపోయె' పైది ఆరణ్య. 2-184. 'తెఱఁగొప్పనప్పుడు త్రిజటాదులైన - తెఱవలఁబిలిచి ధాత్రీపుత్రిఁజూపి.' రంగ. అర. 210 పు ; 72. చుట్టువార.

సూత్తివే సీతమ్మ రావణుదే లంకో
అన్నెకారి వాణి[73] లంక అగ్గయ్యి మండూ
దురదాడీ వాణిలంక దూళిగానానీ
పాపిష్టి వాణిలంక పాడుగానానీ
రామ రామనియేవు రాజ్యములోనా
రాముడేమి గావలెనొ రాగవుల సీతా
రాములు పురుసులు లచుమన్న మరిదీ
వూర్మిళాదేవమ్మ ముద్దుసెల్లెల్లూ
బరతసెత్రీకులు[74] బావమరదండ్లు
జనులెల్ల మెచ్చంగ జనకుడే తండ్రి
బూమెల్ల మెచ్చంగ బూదేవె తల్లి
దరణెల్ల మెచ్చంగ దశరథుడె మామ."

ఈ క్రిందిపాట 'జట్టిజాము'[75] వేయునపుడు పాడునది. సీత పోబడిని జటాయువు వలన నెఱిఁగి రామలక్ష్మణులు ఋశ్యమూకమున హనుమంతుని కనుగొనుట ఇందు వివృతము.

"వెండిదీ చిక్కంటి ॥వెం॥ వెలపటా బడినాది
వెలదిలేదుర తమ్ముడా
పైడిదీ దువ్వెనా ॥పై॥ పంచనా బడినాది
పణతిలేదుర తమ్ముడా
చిలుకలూ కోగిరలు[76] ॥చి॥ బవుసిన్న బోయినవి
సీత లేదురతమ్ముడా
అంసలు[77] గోరికలు[78] ॥అం॥ అతిసిన్న బోయినవి
అతివలేదుర తమ్ముడా
పదవన్న రాములూ ॥పద॥ పట్టాబి సేకరుడ
పణతి వెదుక బోదామూ
మనబొయ్యే దావనా[79] ॥మ॥ మనుబోతులుండాయి
యెనలేనికారడవి యెట్ల బోదము తమ్ముడా
మనబొయ్యే దావనా ॥మన॥ ఆవులా జాడుంది
ఆవులా జాడుంటె అనుమానమెందుకన్నా
ఆకొండ వాకిటా ॥ఆ॥ బోరు కొండావాల[80]
కూలింది గరుటాలమంతూ వాలింది గరుటపచ్చీ
లేవసత్తువ నిత్తు ॥లేవ॥ బతక పాణములిత్తు
లేచేవ గరుటాలమంతా లేచేవ గరుటపచ్చీ
లేవ సత్తువలేదు ॥లేవ॥ బతక పాణములేదు
యీవయ్య వైకుంటము యింగేల[81] యీలంపటా
లంకిణీ తమ్ముడూ ॥లంకి॥ రావణాసురుడూ
సీత సెరగొనిపోయెస్వామీ
సిచ్చు సెరగొనిపోయెనూ...."

రావణుఁడు, చిచ్చువంటి సీతమ్మను చెఱగొని పోయెనని తెలిపి 'గరుడపచ్చి' కన్నుమూసినది. రామలక్ష్మణులు జటాయువున కగ్నిసంస్కారాదు లొనర్చి నడవఁగా నడవఁగా ఎట్టయెదుట ఋశ్య మూకము పొడగట్టినది.

"....యేడేడు యోజనాల్ ॥యే॥ సూదిగుంటీ మింద
యేడుగురు మనుషులూ యేగుజూసే మనుషులూ
అలసొచ్చి[82] రగురాములు ॥అల॥ మావిమానీకింద
మోమునిద్దర[83] బోవగా మగతనిద్దరజేయగా
కోతిపురుగేదియో ॥కోతి॥ నేత[84] పురుగేదియో
కొమ్మకొమ్మెగబారెనూ రెమ్మరెమ్మెగబారెనూ
రాముల మిందనూ ॥రాము॥ నీడబారినకొమ్మ
విరిచి కిందికివేసెనూ వెరిచి కిందికిజూసెనూ
దిగులుపడుతూలేచి ॥దిగు॥ దిగ్గున్నలేచి
మాని మొదటికి జూసెనూ మాని మిందికి జూసెనూ
చూడచక్కనివాడు ॥చూడ॥ సరదారుడనుమన్న
చుక్కలకి యెలుగాయెనూ చూపులకి యెలుగాయెనూ
అతిగచక్కనివాడు ॥అతి॥ అతికాయుడనుమన్న
రాజ్యానికెలుగాయెనూ రాములకు ఎలుగాయెనూ"

ఇది కపిలెపాట. వాలివధతో సుగ్రీవుఁడు కపి రాజ్యమున కేలిక యయినాఁడు. అది వర్షర్తువు. శరత్తు వచ్చిన గాని సమరసన్నాహములు సాగవు. శ్రీరాముని సమాశ్వాసించుచు సుగ్రీవుఁడిట్లనినాఁడు.

"సీతమ్మ సెరబోయెనంటా
చింతలూసెయ్యొద్దు రామా

---

73. వాని; 74. భరతశత్రుఘ్నులు; 75. 'జట్టిజాము' పాటలు, 'స్రవంతి' డిసెంబరు, 1958, పుటలు, 39-54; 76. కోకిలలు; 77. హంసలు; 78. గోరింకలు; 79 దోవన; 80. కొండవలె; 81. ఇంకేల; 82. అలసివచ్చి; 83. మోహపునిద్ర; 84. లేఁత.

సీతపాలిటి అనూమంతూ
సీతి దెచ్చి చింతాలు దెలుపూ[85]"

ఇది 'జట్టిజాము' పాట. రామునిపంపున అనుమన్న లంకకరిగి, సీతను చూచి, ఆనవాలుగా ముద్దుటుంగరమునిచ్చి అశోకవనిని పాడొనర్చుట ఇందలి కథ.

"వోరోరి యనుమన్న వోరోరి యనుమన్న
నా చిన్ని యనుమన్న
సీత చెరలోబొయ్యి యేడునెల్ల దినమాయె
రామా రామానుజ రాగవుల రామా రామానుజా
సీత చెరలోబొయ్యి యేడునెల్ల దినమాయె
సీతసంగతులుమాకు తెలిపించు రనుమన్న ॥రామా॥
వుగ్రంపు అనుమన్న వుత్రగోవ్ర మెగజారి
పండెండు అమడలు పాఱిజూసె అనుమన్న ॥రామా॥
రాములచేతిది సిరిముద్దుటుంగరము
సిరిముద్దుటుంగరము చేతికి దీసె ॥రామా॥
యేడేడు సమ్రుద్రాలు యేకమై పారంగ
లంగించి వంగించి లంకలో పడదుంకె[86] ॥రామా॥
లంకలో పడదుంకి లంకిణిని పడగొట్టి
ఆ దెతికె[87] యీ దెతికె[88] అమ్మవారే లేదు ॥రామా॥
ఆ దెతికి యీ దెతికి ఆపల్ల మరుగూన
అమ్మవారిని వొడగనెనే అనుమన్న ॥రామా॥
రాములాచేతిదీ సిరిముద్దుటుంగరము
సిరిముద్దుటుంగరము సీతమ్మ కిచ్చె" ॥రామా॥

* * *

"ఆకలీ అవుతుంది కడమాని పండమ్మ
కడమానిపండుకూ సెలవిమ్మ కనతల్లి ॥రామా॥
యేనిగెత్తు యెరజీమ గాద్దెత్తు గండ్రజీమ
కొమ్మకొమ్మకు కోటివేల రాక్షసులు ॥రామా॥
నిన్నైన్న జూస్తేను నిలువునా ఒలిసేరు
సద్దిపండుండాది అరగిం చనుమన్న ॥రామా॥
నడిపండు దింపేను సమ్రుద్రాలు బోతాను
సమ్రుద్రాలు బోతేను సనిసుంచుతావమ్మ ॥రామా॥
కడమానిపండుకూ సెలవిచ్చె కనతల్లి
కొమనున్న రాక్ససుల కొట్టి గుట్టాలేసె ॥రామా॥
వనమంత పడగొట్టి వనపాలకుల తొన్నె[89]
ఆ లంకిణీబోయి పట్నాన జెప్పెనూ ॥రామా॥
పట్టుదట్టి మొనగాళ్ళు పట్టుమంటొస్తారు[90]
నీలివట్ట మొనగాళ్ళు నిలుమంట నొస్తారు ॥రామా॥
సుకలాన పరతాన[91] పెరిగెనే అనుమన్న
మునుమిచ్చి రాక్ససుల మొత్తిచంపి నే" ॥రామా॥

ఇదియును జట్టిజాముపాట. సీత శ్రీరామదూతల సంభాషణము.

"సుట్టేడు సమ్రుద్రాలు ॥సుట్టేడు॥ నట్టనడుమాలంకా
యట్ల[92] వస్తివయ్యా శ్రీ అంజనేలూ[93] ॥యట్ల॥
సుట్టేడు సమ్రుద్రాలు ॥సు॥ నట్టనడుమాలంకా
వొద్దేసివస్తినమ్మ సీతమ్మ ॥వొద్దేసి॥
పాపిట్టి భూమిలో ॥పా॥ పగవాణిలంకలో
సెంనేను జిక్కితయ్యా శ్రీ అంజనేలూ
సెంనేను జిక్కితయ్యా
రాజవంశముమొలక ॥రాజ॥ రా. వంశము చిలుక
రమణీమాటాడు తల్లీ సీతమ్మ దేవీ మాటాడు తల్లీ
శ్రీరాము లచ్చుములు ॥శ్రీ॥ వాలస్నదమ్ముల్లూ
సేమముగ వున్నారయ్యా శ్రీ అంజనేలూ ॥సేమ॥
శ్రీరామలచ్చుములు ॥శ్రీ॥ వాలస్నదమ్ముల్లు
సేమముగ వున్నారమ్మ సీతమ్మ ॥సేమ॥
బత్రసెత్రుకులూ[94] ॥బత్ర॥ నా బావమరదండ్లు
సేమముగ వున్నారయ్యా శ్రీ అంజనేలూ" ॥సేమ॥

ఈక్రిందిది కోలాటముపాట.[94a] హనుమద్రావణ సంభాషణ మిందు విస్పృతము.

"యేదేశ పరుడవో ॥యేదేశ॥ యేరాజు బంటువో
యెందుంటి వస్తివిర వోరీ వనచరీ ॥యెందుంటి॥

85. తీర్పు; 86. దుమికె; 87. అడ వెతికె; 88. ఈడవెతికె; 89. తన్నె; 90. పట్టుమంటు వస్తారు; 91. చుక్కలాను పర్వతమువలె; 92. ఎట్లు; 93. ఆంజనేయులు; 94. భరతశత్రుఘ్నులు; 94.A. వివరములకు చూ. జానపద సాహిత్యము, ఆంధ్రవిశ్వకళాపరిషత్కళాశాలల పత్రిక - రజతోత్సవ సంపుటము పుటలు 6-21.

స్రుంగారివనములో[95] సీతమ్మ వుందనీ
సూడబోనాస్తిరా వోరీ
యేడేడు సమ్రెద్రాలు ॥యేడేడు॥ యేకమైపారంగ
సువ్వెట్ల[96] వస్తివిర వోరీ వనచరీ ॥సువ్వెట్ల॥
సీకేడు సమ్ద్రాల నాకేడు కాలవలు
యెనిక[97] లగువుతో వస్తినిర వోరీ
యేటిగట్టునవుండె ॥యేటి॥ యేటి కుంబాకర్ణు
డ్వాడెట్ల[98] రానిచ్చెరా వోరీ వనచరీ ॥వాడెట్ల॥
యేటిగట్టునవుండె యేటికుందాకర్ణు
యెదడెల్ల దొక్కొస్తిరా వోరీ
గవిని[99] గాసేవోళ్ళు ॥గవిని॥ సినలంకి పెదలంకి
వాళ్ళెట్ల రానిచ్చిరా వోరీ వనచరీ ॥వాళ్ళెట్ల॥
లంకిణీ చెయిబట్టి కంకణముల్యమ బలిమి
యమలోక మంపిస్తిరా వోరీ
నీయంటి[100] బలశాళ్ళు ॥నీయం॥ నీయంటి మొనగాళ్ళు
యింగెంద[101] రుందురోరీ వనచరీ ॥యింగెంద॥
నాయంటి[102] బలశాళ్ళు నీయంటి దాసర్లు
కోటానకోట్లురా వోరీ."

ఇదియును కోలాటముపాట. మీఁదిపాటకు తర వాయి.

"మాటిమాటికి నన్ను మాటిమాటికి నన్ను
వోరోరి అంటావు యేరాజుబంటువుర వోరీ
శ్రీరామబంటుణ్ణీ మారాజు సుగ్రీవులు
అంజనాతనయుడ అనుమన్న నాపేరు వోరీ
మీ పట్నమూలోన మీ పట్నమూలోన
యిట్లాంటిరచ్చలూ యెన్నెన్నిగలవుర వోరీ
మా పట్నమూలోన మాపట్నమూలోన
యిట్లాంటి రచ్చలు జాలారిబండలేర వోరీ
మీ పట్నమూలోన మీ పట్నమూలోన
యిట్లాంటి మేడలూ యెన్నెన్నిగలవుర వోరీ
మాపట్నమూలోన మాపట్నమూలోన
యిట్లాంటి మేడలూ బొమ్మరిండ్లేనేర వోరీ
మీపట్నమూలోన మీపట్నమూలోన
యిట్లాంటి వనములూ యెన్నెన్ని గలవుర వోరీ
మాపట్నమూలోన మాపట్నమూలోన
యిట్లాంటి వనములూ కూరాకుపాదులేర వోరీ"

ఇది కపిలెపాట. సేతుబంధన మిందు వర్ణితము.

"వాలినేమో చంపినాడూ వారధీ గట్టించినాడూ
వారధీ ముగిసేటితలికే[103] లంకికీ[104] రవదూళి గప్పే"

ఇది నసినాటు పాట. అంగదు రాయబార మిందలి కథ. రావణుఁ డంగదుని నయబోధను లక్ష్యపెట్టక, దాన భేదములఁ బ్రయోగించి అంగదుని వశపఱిచి కొనఁ జూచును.[105] రావణుఁడు హనుమపై నీ యుపాయములఁ బ్రయోగించినట్లు 'లంకా యాగము' న వివరింపఁబడినది.[106] అసలు వంపరామాయణము నందలి పద్ధతియే వేఱు. హనుమంతుఁ డిందు రావణు

95. శృంగారవనములో; 96. సీవెట్లు; 97. వెనుక; 98. కుంభకర్ణుడు వాడెట్లు; 99. గవను; 100. నీవంటి; 101. ఇంకెందరు; 102. నావంటి; 103. ముగిసెడు సరికి; 104. లంకకు; 105. సుగ్రీవు నుద్దేశించి రావణుఁడు శుకునితోఁ బంపిన సందేశ మిట్టి భావమునే వ్యక్తము సేయుచున్నది.

"త్వం వై మహారాజకులప్రసూతో మహాబల శ్చర్క్షరజస్సుతశ్చ
నకశ్చి దర్థ స్తవ నా స్త్యనర్థ స్తథాహి మే భ్రాతృసమో హరీశ."

—శ్రీమద్రామాయణే, యుద్ధకాణ్డే, వింశస్సర్గః, 104 శ్లో.

"కపినాథుండవు నీవు రాఘవుఁడనంగాఁ దాపసుం డా సురా
ధివు మువ్వెట్టియుఁ గొన్న రాక్షసకులాధీశుండ నే నిన్ను ని
క్కపుఁ దోఁబుట్టువుగా మదిం దలఁతు సఖ్యంబైన నాతోన పొం
దుపడుం గావున నేఁగు మీవెడఁగుమర్త్యుం బాసి కిష్కిందకున్."

—భా. రా. యుద్ధ. 200.

అని భాస్కరరామాయణము నీ యభిప్రాయమును పూరించినది.

106. "రాజ్యమ్ములో సగము రాజ్యమిస్తా నీకు నమ్మి నావద్దనుండూ...."

—లంకాయాగము. స్త్రీలపాటలు, మొదటిభాగము, పుట. 201.

నకు దగ్గఱి చుట్టము. మన శూర్పణఖ పంపరామాయణమున 'చంద్రనఖి'. జనస్థానాధిపతియగు ఖరుఁడీమె భర్త. వీరి పుత్త్రికయగు అనంగపుష్ప హనుమంతుని భార్య. మేనగోడలి మగఁడను ప్రీతితో హనుమకు రావణుఁడు కర్ణకుండల పురాధిపత్యము నొసఁగి గౌరవించినాఁడు. సీతాపహరణము కారణముగా హనుమద్రావణుల సఖ్యము చెడినది. హనుమ శ్రీరామ పక్షమును జేరినాఁడు. అది జైనుల కథ.[107]

"సిరిదేవి సీతనూ సెరదెచ్చినావురా
చెడిపోకు మోరోరి చెవిబెట్టు నామాట నోరీ
రావణా చెవిబెట్టు నామాట నోరీ
నా కొల్వు లోపలా నాకు బుద్ధులు జెప్ప
యేపాటివాడవుర యేరాజు బంటువుర వోరీ
వనచరీ యేరాజు బంటువుర వోరీ
శ్రీరామ బంటుణ్ణి మారాజు సుగ్రీవులూ
అంగదుడు నాపేరు మాతండ్రి వాలిరా వోరీ
రావణా మా తండ్రి వాలిరా వోరీ
బలశాలి వాలినీ సెడ బుట్టినావురా
పగవాణి కొలువులో బానిసల బతుకేల నోరీ
వనచరీ బానిసల బతుకేల నోరీ
జగము పాలించేటి జగదీశ్వరుడు తాను
మాపాలి పరమాత్మ పగవాడు గాదురా వోరీ
రావణా పగవాడు గాదురా వోరీ
యెక్క గుర్రా లిస్తు యేనుగుల నిస్తురా
యేల బూమూలిస్తు యెలనాగ లిస్తురా వోరీ
వనచరీ యెలనాగలిస్తురా వోరీ
* * *
కోటానకోట్లుగా కోటి దండూ దళము
కోదండరాములూ కదిలివొస్తారు వోరీ"
రావణా కదిలివొస్తారోరీ
* * *
నల్లజీమల్లట్ల[108] నరుల నలిపేపిస్తు
కోతిమూకల జంపి గోరీలు కట్టిస్తురా వోరీ
వనచరీ గోరీలు కట్టిస్తురా వోరీ...."

ఇది కలుపు పాట. లక్ష్మణమూర్ఛ యిందలి కథావస్తువు. పరమక్రుద్ధుఁ డగు రావణుఁడు ప్రయోగించిన శక్త్యాయుధహతిచే నిర్భిన్నహృదయుఁడయి లక్ష్మణుఁడు నేలకొరిగినట్లు వాల్మీకీయము.[109] తెనుఁగు రామాయణములన్నియు నిట్లే అనువదించినవి. స్త్రీల పాటలు పెక్కింటిలో ఈపట్ల మూర్ఛలేదు. ఒక పాటలో మాత్రము ఇంద్రజిత్తు శక్తిచే లక్ష్మణుఁడు మూర్ఛనందఁగా హనుమ సంజీవని కొనితెచ్చినట్లున్నది[110]. దిగువపాటలో సైత మిట్లేకలదు. ఈ తాఱుమాఱునకు కారణములెన్నో ఉన్నవి. రామాయణ కథలో లక్ష్మణుఁడు మూర్ఛిల్లుట రెండుసారులు; హనుమ సంజీవని గొనితెచ్చుట రెండు తూరులు. ఇంద్రజిత్ప్రయుక్తబ్రహ్మాస్త్రమువలన రామలక్ష్మణులతోపాటు సర్వకపిసైన్యమును, '.... కన్దెఱవని మూర్ఛగాఁగ....' బడినపుడు విభీషణ ప్రబోధితుఁడు హనుమంతుఁడు కపిసేనల మూర్ఛఁ దేర్చుటకు జాంబవదుపదిష్ట క్రమమున సంజీవని దెచ్చుట మొదటితూరి.[111] రావణుశక్తిచే మూర్ఛితుఁడగు లక్ష్మణునికోసము సంజీవని దెచ్చినది రెండవతూరి.[112] రావణు శక్త్యాయుధ హతిచే లక్ష్మణుఁడు రెండుసారులు మూర్ఛ మునిఁగినట్లు రంగనాథ రామాయణము. మొదటిసారి మూర్ఛిలినను, రాము తేజశ్శక్తివలన సౌమిత్రి భుజమధ్యమున నాఁటిన శక్త్యాయుధము ఊడిపోయి, తనంత మూర్ఛ దెలియును.[113] రెండవసారి సంజీవని మూలమున మూర్ఛ దెలియును.[114]. ఇదికాక ఇంద్రజిత్ప్రయుక్తమగు నాగపాశమున బంధితుఁడయి లక్ష్మణుఁడు మూర్ఛితుఁ

107. పంపరామాయణం, నాగచంద్రకవికృతం, పూర్వోదాహృతము ; 108. నల్లజీమలయట్ల ; 109. శ్రీమద్రామాయణ. యుద్ధ. 101 సర్గ ; 110. లంకాసారథి, స్త్రీలరామాయణపు పాటలు ; 111. శ్రీమద్రామాయణ. యుద్ధ. 73, 74. సర్గలు : భాస్కరరామా. యుద్ధ. 1100-1126 పద్యములు ; 112. శ్రీమద్రామాయణ, యుద్ధ. 102 సర్గ. భాస్కర, యుద్ధ. 1614-1789 పద్యములు : 113. రంగనాథరామాయణము, యుద్ధ. 444 పుట, ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారి ప్రతి ; 114. పైది. యుద్ధ. 563, 564 పుటలు.

దగుట మఱియొకసారి.[115] వెరసి రంగనాథ రామాయణములో లక్ష్మణమూర్ఛ మూఁడుమాఱులు. తమ్ముని మూర్ఛకు శ్రీరాముఁడు విలపించినది రెండు సారులు. లక్ష్మణుఁడు నాగపాశబద్ధుడయినపు డొకసారి.[116] రావణుశక్తి వక్షస్ స్థలముననాఁటి లక్ష్మణుఁడు మూర్ఛనందినపు డొకసారి.[117] ఇన్ని సన్నివేశములు జనులలోఁబడి కలగా పులగమయి 'లక్ష్మణ మూర్ఛ'కు క్రింది పాటలో క్రొత్తరూపు వచ్చినది.

"హేబళా శ్రీబళా హేబళా శ్రీబళా
యేసెనే యింద్రజితుఫా
యేసెనే యింద్రజితుఫా లక్ష్మణా
అగ్గిబాణము లక్ష్మణా

* * *

మూర్ఛిలిన తమ్మునీ మూర్ఛిలిన తమ్మునీ
ముందరేసుకుని మునిగె దుఃఖములో లక్ష్మణా
రాములు మునిగె మోవము[118]లో లక్ష్మణా
పుట్టింది నలుగురూ పుట్టింది నలుగురూ
పెరిగింది నలుగురూ పేరు కిద్దరుంటిమి తమ్ముడా
వొంటిగాణ్ణిజేస్తివా లక్ష్మణా
దినదినము నీనాము[119] దినదినము నీనాము
దిద్దినట్లేవుండె దివ్యరత్నము తమ్ముడా
లక్ష్మణా దివ్యరత్నము లక్ష్మణా

* * *

యెడము యెడమేగాని యెడము యెడమేగాని
యెదటికెన్నడురావు తొడలపైకొస్తివప్పా లక్ష్మణా
ఒడిలోని కొస్తివప్పా లక్ష్మణా[120]
యెద్దుకొమ్ములవాల[121] యెద్దుకొమ్ములవాల
యిద్దరుంటిమి మనము వొంటిగాణ్ణయితినప్పా
లక్ష్మణా నొంటి తిప్పలొచ్చెనప్పా
కూర్చినా ముత్యాల కూర్చినా ముత్యాల
కుచ్చులాలా[122] మనము కూడివుంటిమి తమ్ముడా
లక్ష్మణా తోడవుంటిమి లక్ష్మణా
దాచిన్న పగడాల దాచిన్న పగడాల
దండలాలా[123] మనము దాగివుంటిమి తమ్ముడా
లక్ష్మణా దాగుకుంటివె లక్ష్మణా
యాడరా[124]లచుమన్న యాడరా లచుమన్న
యాడరా సీతంబె యేమిజెప్పుదు తమ్ముడా
లక్ష్మణా యేమిజేతుర లక్ష్మణా
కొండ గరగరదిప్పి కొండ గరగరదిప్పి
కోనలే దాటేసె కొండతల్లటిస్తాది లక్ష్మణా
తమ్ముడా గుండి[125] తల్లటిస్తాది లక్ష్మణా
పగవాని బాణాలు పగవాని బాణాలు
పైపైన వస్తాయి పక్కవేమిర తమ్ముడా
లక్ష్మణా పారజూడర లక్ష్మణా
పగవాడు గాదన్న పగవాడు గాదన్న
మనవాడె అనుమన్న తెస్తుండె సంజీవినీ
లక్ష్మణా తెచ్చెనే ద్రోణాద్రినీ లక్ష్మణా

* * *

ఈ క్రిందిది కోలాటము పాట. రావణవధానంతరము పుష్పకారూఢులై అయోధ్య కేతెంచిన సీతారాములఁజూడ నేగెడి పురజనుల సంభ్రమ మిందు చిత్రితము.

"సూతాము రారోయమ్మ జనులార
సూదబోదము రారోయమ్మ
సీతకు ప్రతివైన శ్రీరామచంద్రుండు
దశరథుల రగురాము తరలివచ్చేనంట ॥సూ॥
ఉక్కుగంభము రెండు ఉరమునా పిడుగులా
సుట్టుజుట్టినట్టె సుంగారవౌనములా[126]
పువ్వులను బంతులను పుప్పటిల్లంగా
అంగురంగులతోన అయ్యలొస్తారంట ॥సూ॥

115. పైది, యుద్ధ. 411, 412 పుటలు ; 116. పైది. యుద్ధ. 411, 412 పుటలు ; 117. పైది. యుద్ధ, 563, 564 పుటలు ; 118. మోహము ; 119. నామము ; 120. 'వెనుకనుండుపెగాని యెదటి కెన్నడురావు తొడలమీదికి వస్తివి' —లంకాయాగము, స్త్రీలపాటలు, మొదటిభాగము, 208 పుట ; 121. కొమ్ములవలె ; 122. కుచ్చులవలె ; 123. దండలవలె ; 124. ఏడరా (ఎక్కడరా) ; 125. గుండె ; 126. శృంగారపు వనములో.

యెక్కువాగు నీరుజల్లి స్నానముచేసి
వీదివీదినిదాటి వాదిదేవుడు[127] రాగ
నేటించి కుంకుమూ నిర్దళై సల్లగా
గ్రక్కునా నగరికే కదిలివొస్తారంట ॥సూ॥
ఆకాశబాణాలు అమరంగ దిక్కులు
నిగనిగా మనియేటి నీలాల గొలుసులూ
స్వామిముంద్రా రెండు సంద్రజోతూలంట
పూలతేరూ మింద పురుషోత్తములురాగ ॥సూ॥"

ఈ దిగువది కపిలె పాట. రామరాజ్యమననేమో. ఈ రెండు నుడుగులలోఁ గూర్పఁబడినది.

"రాముడుండై పద్దిలోనా[128] రత్నాలా రవ్వలెగిసే
రాముడేలే సీమలోనా రాజనాలా పంటబండే"

ఈ చివరి పాట కలుపుఁపాట. ఉత్తరరామాయణ గాథ యిందు సంగ్రథితము.

"అయివొద్దిపట్నాన అదవరిసావడీ
లవకుమారా వినుమన్న కుశలకుమారా
సావిడీ వెనకలే సాకలోరింట్లమ్మ ॥లవ॥

* * *

పగవాణి పంచనా పడివున్న అలిసీ ॥లవ॥
యెఱ్ఱిరాములుగాంగ యేలుతుండాడు ॥లవ॥
నాటోటిగాడైతె నరికి తుంప్లేయేతు ॥లవ॥

* * *

పుట్టెడూ బువ్వొండి పట్టెడూ సద్ది ॥లవ॥
అసద్దిలేకింగ[129] యేమేమిరూరలు ॥లవ॥
అటికలతొ మాగినవి అలరేణిపండ్లు ॥లవ॥
దుత్తలతొ మాగినవి దూదినిమ్మల్లు ॥లవ॥
ముంతలతొ మాగినవి ముంతమామిళ్ళు ॥లవ॥
కొండముక్కిడికాయ గొడిసింతకాయ ॥లవ॥

* * *

సద్దైన గట్టెనే సకియ సీతమ్మ ॥లవ॥
ఆరెండి అడవులకు ఆతల్లిబోతాదె ॥లవ॥

* * *

అట్నుంచి[130] ఆ తల్లి అత్తనగరొచ్చె ॥లవ॥
ఆరెండి అడివికీ పయనాలు అత్త ॥లవ॥
యెప్పుడూ తిప్పలూ తప్పలేదమ్మ ॥లవ॥
పాపిట్టి రాములుకు పదినెల్లు గర్బిణీ ॥లవ॥
వెర్రి రాములకును వెరతుము చెప్ప ॥లవ॥
సేమాన పోవమ్మ లాబాన రావమ్మ ॥లవ॥
యేమమ్మ సీతమ్మ యిట్ల వస్తివి ॥లవ॥
వొంటిగా వొచ్చినా వొద్దార మేమి ॥లవ॥
కాలినడకొచ్చిన[131] కారణమేమి ॥లవ॥
వాటింటి[132] గుఱ్ఱాలు కూలిపోయిన్న[133] ॥లవ॥
వాణింటి యేనుగులు యేనిపోయిన్న ॥లవ॥
వాణింటి వొంటెలూ వెట్టిబోయిన్న ॥లవ॥
వాణింటి పాలకీలు[134] పాడుబోయిన్న ॥లవ॥
వాణింటి దాసీలు దాటిపోయిన్న ॥లవ॥
రాసవంశామనీ[135] మోసపోతిని తల్లి ॥లవ॥
కాసిగోత్రంబనీ మోసపోతిని తల్లి ॥లవ॥

వాల్మీకికి బదులుగా మిథిలేశ్వరుఁడు జనకుఁ డిట ప్రవేశపెట్టఁబడినాఁడు. ఆయన "కామినీ కొండల"లో తపము సేసికొనవచ్చినాఁడఁట. చుక్క తెగి పడినట్లు వచ్చిన సీతను జూచి నిట్టనిలువున నీఱయినాఁడు జనకుఁడు. సీత వెనుక నొదిగిన లక్ష్మణుఁడు చుట్టి తిలకము చెడకుండ, చుక్కబొట్టు చెడకుండ సమాధానము సెప్పి అయోధ్యకు మరలి చనినాఁడు. తండ్రి ఆశ్రమమునందే సీత ప్రసవించినది. పిమ్మట రామాశ్వమేధము జరిగినది. రాముఁడు భార్యా సుతులను గుర్తించి అయోధ్యకుఁ గొంపోవుటతో కథ సుఖాంతమయినది.



127. ఆదిదేవుడు ; 128. రాముడుండెడి అయోధ్యలో ; 129. ఆసద్దిలోనిక ఇంక ; 130. అడనుండి ; 131. కాలి నడకనవచ్చిన ; 132. వానియింటి ; 133. కూలిపోయి యుండెన ; 134. పల్లకులు ; 135. రాచవంశమని.

# ఆంధ్రమహాభారతము

శ్రీ బుద్ధవరపు కామరాజు

### మంగళం

ఎవరు అనాది కాలముసుండిన్నీ, లక్ష్మి సరస్వతి పార్వతులను వక్షస్థలంమీదను, నోటను, దేహమందును ధరిస్తూ, స్త్రీ పురుషుల కలయిక వలన కలిగే పుట్టుకద్వారా లోకాలకు ఉనికిని ప్రసాదిస్తున్నారో అట్టి వేదత్రయ స్వరూపులునూ, దేవతా పూజ్యులునూ అయిన విష్ణు, బ్రహ్మ, మహేశ్వరులు ముచ్వురు పురుషులు శ్రేయస్సు ప్రసాదింతురు గాక!

## ఆదిపర్వం

### ఒకటవ ఆశ్వాసం

### భారతకథాప్రస్తావన

వసుమతీ వనితకు విభూషణంవంటి వేగీ దేశానికి నాయకరత్నంలాంటి రాజమహేంద్రపురంలో, చాళుక్య వంశీయుడునూ, విమలాదిత్యుని కుమారుడునూ అయిన రాజరాజ నరేంద్రుడు పరిపాలిస్తున్నాడు. రాజరాజ నరేంద్రుడు స్ఫురద్రూపి, పండితుడు, దాత, వర్ణాశ్రమ ధర్మరక్షణ పరుడు. శౌర్యవంతుడు. ఒకనాడాతడు తన రమ్యహర్మ్యతలంలో మంత్రి, పురోహితుడు, సేనాపతి, దండనాయకుడు, సామంతులు, భృత్యులు మున్నగువారిచే పరివృతుడై వైయాకరణులు, పౌరాణికులు, మహాకవులు, తార్కికులు ఆదిగాగల విద్వజ్జనులు పరివేష్టించి ఉండగా కొలువుతీర్చినాడు. ఆనాటి కొలువులో, ఆపస్తంబ సూత్రుడు, ముద్గలగోత్రుడు అయిన నన్నయ్య ఉన్నాడు. రాజరాజ నరేంద్రుడు నన్నయ్యను చూచి నాడు. "ఆదికవీ! పురాణాలు విన్నాను; అర్థ, ధర్మ శాస్త్రాలు తెలుగు తెలుసుకున్నాను; కావ్య నాటకాలు క్రమాలు చూచాను. అయినా, శ్రీ మహాభారతం వినాలనే అభిలాష చిరకాలమునుండి తీరకుండా ఉన్నది. ఈశ్వర ధ్యానం, దానం, సాధుసాంగత్యం, బ్రాహ్మణ భక్తి, భారత శ్రవణాసక్తి, నాకెప్పుడూ ప్రీతికరమైనవి. కాగా, మా వంశంలో ప్రసిద్ధికెక్కి, మావంశకర్తలైన పాండవుల చరిత్ర వినాలని నాకెంతో కుతూహలము. భారతకథ వింటే, ఉత్తమ విప్రుడికి వెయ్యిగోవులు దానం చేసినంత పుణ్యం కలుగుతుందని చెపుతారు. కాబట్టి, కృష్ణ ద్వైపాయనముని రచించిన మహాభారతమును తెలుగులో రచించవలసినది" అని కోరినాడు. నన్నయభట్టు అంగీకరించినాడు.

పుణ్యతీర్థాన స్నానంచేసి, శుచిఅయి, దైవపూజలు చేసి, వ్యాస మహామునిని స్మరించి, వాఙ్మయధురంధరుడునూ, తన సహాధ్యాయియు అయిన నారాయణ భట్టు, భారత యుద్ధంలో కృష్ణుడు అర్జునుడికి తోడు అయినట్లు, తనకు తోడుకాగా ఒకానొక సుముహూర్తాన ఆంధ్రమహాభారత రచనకు పూనుకున్నాడు వాగనుశాసనుడైన నన్నయ భట్టారకుడు.

నైమిశారణ్యంలో శౌనకుడు అనే మహాముని, అనేకమంది మునులతో కలసి పన్నెండేళ్ళ సత్ర యాగం చేస్తూ ఉండగా, అక్కడకు ఒకనాడు ఒక పౌరాణికుడు వచ్చినాడు. "నేను వ్యాసులవారి శిష్యుడైన రోమహర్షణుడి కొడుకును. నాపేరు ఉగ్రశ్రవసుడు. ఏకథ అయినా బాగా చెప్పగలను. మీకు ఏకథ వినాలని ఉన్నదో చెప్పండి." అన్నాడు.

"ఏది హృద్యమో, ఏది అపూర్వమో, ఏదివింటే జ్ఞానం కలిగి, పాపాలు నశిస్తాయో, ఆకథ చెప్పండి." అని శౌనకాది మునులు కోరినారు.

"అయితే వినండి" అని ఉగ్రశ్రవసుడు చెప్ప సాగాడు:

ఆదియుగంలో వేదాలన్నీ ఏకమైపోయి, ఏది ఏమిటో తెలియకుండా పోగా, పరాశరుడి కుమారుడు కృష్ణద్వైపాయనుడు అనే బ్రహర్షి వేదాలను ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణ వేదము అని నాలుగ్గా విభాగించినాడు. ఆ చతుర్వేద సూత్రాలను తన శిష్యులైన పైలుడు, వైశంపాయనుడు, సుమంతుడు, జైమిని అనేవారి ద్వారా ప్రబోధం చేసినాడు. అందుచేత అతనికి వేదవ్యాసుడు అనే పేరు కలిగింది. అట్టి వేదవ్యాసుడు అష్టాదశ పురాణాలు, ధర్మశాస్త్రార్థతత్వములు, చతుర్వేద వేదాంతాభిప్రాయములు, కథలు, ఇతిహాసములు, చతుర్యుగ మహర్షి రాజవంశ చరిత్రలు, చతుర్వర్ణాశ్రమ ధర్మములు, శ్రీకృష్ణుని మాహాత్మ్యము, పాండవాది మహావీరుల గుణగణాలు, అద్దంలో వలె ప్రతిబింబించునట్లుగా మహాభారత గ్రంథాన్ని రచించాడు. కనుకనే భారతమును గురించి ధర్మశాస్త్రజ్ఞులు ధర్మశాస్త్రమని, అధ్యాత్మ విదులు వేదాంతమని, నీతి విచక్షణులు నీతిశాస్త్రమని, కవులు మహాకావ్యమని, లాక్షణికులు సర్వ లక్ష్య సంగ్రహమని, ఇతిహాసకులు ఇతిహాసమని, పౌరాణికులు పురాణమని అనుకుంటున్నారు.

వేదవ్యాసుడు రచించిన సంస్కృతభారతం నూరు పర్వాలుగా విభాగింపబడినది. మొదటి పౌష్యపర్వం మొదలుకొని పద్దెనిమిది పర్వాలలో తొమ్మిదివేల తొమ్మిదివందల ఎనభైనాలుగు శ్లోకములు ఉన్నవి. ఇవే తెలుగు భారతంలో ఆదిపర్వం అనే మొదటి పర్వం. తరువాత, సభాపర్వం మొదలుకొని తొమ్మిది పర్వాలలోని నాలుగువేల మూడువందల పదకొండు శ్లోకాలు ఆంధ్ర భారతంలోని సభాపర్వం అనే రెండవ పర్వం. పిమ్మట అరణ్యపర్వం మొదలుగాగల పదహారు పర్వాలలోగల పదమూడువేల ఆరువందల అరవైనాలుగు శ్లోకాలు ఆంధ్రభారతంలో అరణ్యపర్వం అనే మూడవపర్వం. తదుపరి వైరాటపర్వం మొదలుకొని నాలుగు పర్వాలలోగల మూడువేల అయిదువందల శ్లోకములు తెలుగు భారతంలో విరాటపర్వమనే నాలుగవ పర్వం. ఆ తదుపరి ఉద్యోగపర్వం మొదలుకొని పదకొండు పర్వాల్లోనుగల ఆరువేల తొమ్మిది వందల తొంభై ఎనిమిది శ్లోకాలు తెలుగు భారతంలో ఉద్యోగపర్వమనే అయిదవ పర్వం. మరిన్నీ, జంబూషండవినిర్మాణపర్వం మొదలుకొని గల అయిదు పర్వాలలోని అయిదువేల ఎనిమిదివందల ఎనభైనాలుగు శ్లోకాలు భీష్మపర్వమనే ఆరవపర్వంగాను, ద్రోణాభిషేకపర్వం మొదలు గల ఎనిమిది పర్వాలలోని పదివేలతొమ్మిదివందల పందొమ్మిది శ్లోకాలు ద్రోణపర్వమనే ఏడవపర్వంగాను, నాలుగువేల తొమ్మిదివందల శ్లోకాలుగల కర్ణపర్వం కర్ణపర్వమనే ఎనిమిదవ పర్వంగాను, మూడువేల అయిదువందల ఇరవై శ్లోకాలుగల శల్యపర్వం అదేపేరుతో తొమ్మిదవ పర్వంగాను, సౌప్తికపర్వం మొదలుకొని గల మూడు పర్వాలలోని రెండువేల ఎనిమిదివందల డెబ్భైనాలుగు శ్లోకాలు సౌప్తికపర్వమనే పదవపర్వంగాను, స్త్రీపర్వం మొదలుకొని గల అయిదు పర్వాలలోని వెయ్యి ఏడువందల డెబ్భై అయిదువందల శ్లోకములు స్త్రీపర్వ మనే పదకొండవ పర్వంగానూ, శాంతిపర్వం మొదలుగాగల నాలుగు పర్వాలలోగల పదునాలుగువేల అయిదువందల ఇరవై అయిదు శ్లోకాలు శాంతిపర్వమనే పన్నెండవ పర్వంగానూ, అనుశాసనికపర్వం దాని తరువాత పర్వంలోగల మొత్తం పన్నెండువేల శ్లోకాలు అనుశాసనికపర్వమనే పదమూడవపర్వంగాను, అశ్వమేధికపర్వం దాని తరువాత పర్వంలోగల మొత్తం నాలుగువేల అయిదువందల ఇరవై శ్లోకాలు అశ్వమేధపర్వమనే పధ్నాలుగవ పర్వంగాను, ఆశ్రమవాసపర్వము మొదలుగాగల మూడు పర్వములలోని వేయి నూట ఆరుశ్లోకాలు ఆశ్రమవాస పర్వమనే పదిహేనవ పర్వంగానూ, మూడువందల శ్లోకాలుగల మౌసలపర్వం మౌసలపర్వమనే పదహారవ పర్వంగానూ, నూట ఇరవై శ్లోకాలుగల మహాప్రస్థానికపర్వం అదేపేరుతో పదిహేనవపర్వంగాను, అయిదువందల శ్లోకాలుగల స్వర్గారోహణపర్వం అదేపేరుతో పద్దెనిమిదవ పర్వంగాను రచింపబడినవి. (సశేషం)

# చతుర్మత తత్త్వం - శాంకరాద్వైతం

శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులు

(గతసంచిక తరువాయి)

ఇక సాంఖ్యుల యాశయమిది :

వెనుకటి వాదములో కార్య కారణభావము సకల లోకులకును అనుభవములోనిది. దానిని కాదనుట గాని లేదనుటగాని సరిగాదు ఏమంటే ? నూనె కావలసినపుడు నూవులు మొదలగు వానినుండి తీయుటకు ప్రయత్నము లోకములో జరుగుచున్నది. అంతేకాని ఇసుక, రాళ్ళు మొదలైన వానినుండి ప్రయత్నింపముకదా ! అటనుండి నూనెయు లభింపదు. చార్వాకులన్నట్లుగా అది స్వభావము మాత్రమే యగుచో నట లోకులందరును అసలు ప్రయత్నమేల చేయుదురు? పోనీ చార్వాకుడు మాత్రము తన యింట్లో దీపము వెలిగించుకొనునా ? మానునా ? అపుడాతనికి నూనె ఇసుకనుండి రాళ్ళనుండియు వచ్చినదా ? అతడు వానినుండి నూనె దెచ్చుకొనడేమి ? మన యందరివలెనే నూవులు మొదలైన చోటనే ప్రయత్నించునేమి ? ఇందువలన కడమ మనయందర మొప్పుకొన్నట్లుగానే అతడుకూడ కార్య కారణ భావమును అంగీకరింపక తప్పనివాడే యగును. ఎపుడొక కార్యమును గురించి నియతముగా నొక చోటనే ప్రయత్నము జరుపునో, అది నియతమగు కార్యకారణభావపు పద్ధతియేకదా. మరియు నిప్పు తగిలినపుడు కాలుటయు, నీరు తగిలినపుడు చల్లబడుటయు, సూర్యోదయమున జీకటులు విరియుటయు, చన్ద్రోదయమున మనసున కానన్ద మొదవుటయు, ననుభవ గోచరములేకదా ! ఇది యంతయు కేవల స్వభావమేనని తోసివేయుటకు వీలులేదు. అది స్వభావము మాత్రమే యగుచో, నది యందరి కెట్లుండును ? ఒకటిగానే యెట్లుండును ? ఏమనగా—స్వభావము వైయక్తికముగానే యుండునుగాని సామూహికముగాదుకదా ! సామూహికమే యగుచో చమురునిచ్చు స్వభావము ఇనుము రాళ్ళు మొదలగు వానికిగూడ నేలలేదు ? కనుక దీనియందే యిది కల్గునను నియమము సకలలోకులకును ప్రత్యక్షముగా ననుభవమగుచున్నది. కారణ కార్యభావమును తప్పక అంగీకరింపజేయును. కాదుకూడదని అందరి యనుభవములోని యీ కార్యకారణభావమును నిరాకరింతురేని చార్వాకులు తమరెక్కిన కొమ్మను తామే నరకికొన్నట్లగును. ఏమనగా—ప్రత్యక్ష సిద్ధమగు దాని నంగీకరింపక తప్పదనియు, ప్రత్యక్షానుభవమే గొప్ప ప్రమాణమనియుగదా వారు సిద్ధాన్తీకరింతురు ? ఇపుడు సకల లోకులకును ప్రత్యక్షానుభవ సిద్ధమైన యీ కార్యకారణ భావమును నిరాకరించినచో తమ ప్రమాణమును తామే ఖండించుకొన్నవారగుదురు. వారిచట ప్రత్యక్షమునే నిరాకరించుచో మనముకూడ ప్రత్యక్షమును కాదని నిమిత్త కారణము నంగీకరించుచో వారేమి సమాధానమిత్తురు ? వారిక మన నాక్షేపింప నవకాశమేది ? కనుక వారు తమ ప్రత్యక్ష ప్రమాణము చెడకుండుటకై కార్యకారణ భావము నంగీకరించి తీరవలెను. వారైనను నెమలి యీకలకు రంగును తాంబూలపు టెరుపును—లోకములోవానినే ఉదాహరణములుగా గైకొనియేగదా వస్తునిరూపణ మొనర్చిరి ! అంతేగాక స్వభావమువల్లనే యిది యంతయు నేర్పడుననుటలో వారే స్వభావమును కారణముగా నంగీకరించినట్లైనది. అయితే సృష్టికి నిమిత్త కారణమును మాత్రము వారంగీకరింపరు. అంగీకరించుచో కర్మల నంగీకరింపవలసి వచ్చునేమోయని వారి భయము. అందువలన ధర్మాధర్మములు తమ నెత్తినబడి తమ విశృంఖల విహా

రమునకు అడ్డమేర్పడునని వారి జంపు అయితే, కర్త కనుపడుట లేదుకదా ! అడవిలో చెట్ల కెవరు నీరుపోసి పెంచిరి ? కొబ్బరికాయలో నీ రెవరు పోసిరి? ఇట్టికార్యము లన్నియు నిర్నిమిత్తములుగానే యున్నవి కదా! మన ప్రత్యక్షానుభవమునకు విరుద్ధముగా నీ స్థలములం దన్నింటను నిమిత్తము నొప్పుకొనుట "పనిలేని మంగలి పిల్లితల గొరిగిన" ట్లుండదా ?

వినుడు. లోకములో వంట కావలసినవాడు బియ్యము కట్టెలు మొదలగు సాధనసామగ్రిని సమకూర్చుకొనుట ప్రత్యక్షమే కదా ! వానివలన వంట యను కార్యము నెరవేరుటయు ప్రత్యక్షానుభవము లోనిదే కదా ! కనుక దీనినిబట్టి కార్యమున కుపాదానముతోబాటు నిమిత్తముకూడ నంగీకరింపక తప్పనిదే. అయితే ఈ నిమిత్తములు రెండు రకములు. కొన్ని కార్యములలో జేయజేసుకొనునవి, మరికొన్ని తటస్థముగా నూరకొనునవి. అవి కార్యమునకు సంబంధించి యుండుటవలననే కార్యము లేర్పడుచు నుండును. అవి యుదాసీనములు. ఇనుము సన్నిధి నున్నంత మాత్రముననే గదా అయస్కాంతము యొక్క ఆకర్షణశక్తి కార్యోన్ముఖ మగును. ఇందులో నినుము చేయిజేసికొనునదేమైన నున్నదా ? ఏమియు లేదుకదా ! అయితే ఇనుము లేనిచో మాత్రము అయస్కాంతము ఆకర్షింపగలదా ? లేదు కనుక నిమిత్తకారణము రెండురకములని మన మొప్పుకొనవలెను.

అయితే ప్రకృతములో నీ ప్రపంచమంతయు భూతచతుష్టయపు కార్యమనుటలో కారణముల గుణ, రూప, ధర్మానువృత్తి ప్రత్యక్ష మొకప్రమాణమైనట్లే, నిమిత్తమొక టుండవలయుటకూడ ప్రత్యక్షమువలననే సిద్ధించును. లోకములో ఘటపటాది కార్యములన్నియు కులాలకువిందాది నిమిత్తములు లేక సంభవింపక పోవుటయు వారున్నప్పుడే ఆకార్యములు సంభవించుచుండుటయు ప్రత్యక్షమేకదా ! కనుక ఈ ప్రపంచ ముదయించుటకుగూడ నొక నిమిత్త మొప్పకతప్పదు. అయితే ఈ నిమిత్త మేదో ప్రయోజనమే అభిలషించి, యేపనియైనను జేయుచో ప్రపంచ మింత విషమముగా ననగా, నొకడు ధనికుడు, మరొకడు బీద, ఒకడు దుర్బలుడు, మరొకడు బలవంతుడు ఇత్యాది నానా విధముల పరస్పర విరుద్ధముగా నుండుట కుదురదు. అపుడు కర్తకు పక్షపాతమో, అశక్తియో, ద్వేషమో, ఇవి యన్నియునో ఒప్పుకొనవలసివచ్చును. కనుక నందఱియెడలను సమదృష్టితో నీ ప్రపంచమును నిర్మించు నొక శక్తిని నిమిత్తముగా నంగీకరించుచో నేదోషమును రాబోదు. దానికీ సృష్టివైషమ్యముతో నేమాత్రమును సంబంధం లేకుండ నుండవలెను. అయితే ఈసృష్టి హేతువగు స్వభావమును భూతచతుష్టయమునుగూడ ఈ నిమిత్తము (కర్త) అధీనములో నుండవలెను. అవి భూతచతుష్టయమున కతీతమై వాని స్వభావము కలిగి యుండవలెను. అట్లుండకపోవుచో నీసృష్టి నిట్లు వివిధముగా నిర్మించుట కవకాశము కలుగదు, స్వభావ మదుపులో నుండవలెనన్నచో నా స్వభావమే తనదై యుండవలెను. అసలు భూతము లనగానే పుట్టినవని యర్థము. గూడ మూలమైనవానికిగూడ నతీతమై యొక విచిత్ర శక్తి స్వభావమగు నొక సద్వస్తువున్నదని యంగీకరింపవలెను. ఆ వస్తువునకు ఈ ప్రపంచముగా మారవలెనను ఇచ్ఛయు, శక్తియు, వానికి మూలమగు జ్ఞానమునుగూడ నున్నవని యొప్పుకొనవలెను. కనుక ప్రపంచ పరిణతిశక్తి, ఇచ్ఛ, జ్ఞానముకల్గి ఈ పరిణామము స్వభావముగానున్న యొక మూల ప్రకృతి ఈ ప్రపంచముగా నేర్పడెనని తెలియు. అయితే అది యిట్లు మారుటలో తానొక ప్రయోజనమునభిలషించుచో ప్రపంచములో నిట్లు వైషమ్యముండు నవకాశము లేదని యిదివరలో దెల్పియుంటిమి. ప్రపంచమునందీ వైషమ్య మగపడుచునే యున్నదికనుక ఈ పరిణామస్వభావమగు శక్తికొక సంకల్పము అనగా- దనకొక ప్రయోజన మీ పరిణామము వలన సమకూడవలెనను కోరిక యుండుట కవకాశము లేదు. ఇకనేమి ? ఊరక ఇట్లు ఎపుడును మారు

చుండుటయే దానికి స్వభావమా ? అట్లగుచో ఘటము నిముష నిముషమునకును మారుచుండుట లేదేమి ? సౌగతతార్కికులు నిముషనిముషమునకును ప్రతి వస్తువును మారుచుండునని క్షణభంగవాదము నొక దాని నెంత గొంతుతో నరచినను, అది సర్వత్ర సంభవింపక పోవుటయు ప్రత్యక్ష సిద్ధమే కావున నేవో కొన్ని వస్తువులు - "దీపజ్వాలాదులు మాత్రమే అట్లు క్షణక్షణమునకును వినాశ మొందునుగాని, స్థిరములుగా ప్రత్యక్షములగు నీ ఘటాదులన్నియు క్షణభంగము నొందవు" అట్లనుట ప్రత్యక్షోపహతము. కనుక శూన్యవాది చెప్పునట్లుగా నీ ప్రపంచమంతయు ప్రాతిభాసికము మాత్రముకాదు. చార్వాకాదులన్నట్లుగా నిర్నిమిత్తకమునుకాదు. ఇకనేమనిన సత్పదార్థమే జగత్తు. సనిమిత్తికమే ఈ ప్రపంచము. అయితే ఈ నిమిత్తము ఉపాదానముకూడ నైన యొక సత్పదార్థమునకు ఆత్మ ప్రయోజనాకాంక్ష లేదంటిరే, ఇది యెందుకై యిట్లు పరిణమించుచున్నది ? అందురా ? చెప్పెదము వినుడు. ఇంతకు పూర్వ మొక కార్య మేర్పడుటకు రెండు రకముల నిమిత్త కారణములున్నవంటిమి. కుండయను కార్య మేర్పడు నపుడు కార్యసామగ్రీప్రవిష్టుడగు కులాలుడొక నిమిత్తము. ఈ సామగ్రిలో నేలేశమును జేరక ఇంకను తటస్థముగానుండు ఘటక్రేత యొక నిమిత్త మును. ఈ క్రేత యుండుటవలననే కుమ్మరి ఘటము లను నిర్మించుచున్నాడు. నిజమున కుపాదాన నిమిత్త రూపమగు నీ సామగ్రి యంతటికన్నగూడ నీతటస్థ వస్తువులే మిక్కిలి ప్రధానము. ఈ క్రేతలులేనిచో నెవడును ఘటమును నిర్మింపబోవడుకదా ! కనుక నీవిధముననే ఈమూల ప్రకృతికూడ తన పరిణామ మును ప్రయోజనముగా నభిలషించు నొకనికై యీ పనిని జేయుననుట ప్రత్యక్షానుభవముచే నూహింప వలసియున్నది. (ఇట్లొక ప్రత్యక్షమే కాక నిర్బాధక ప్రత్యక్షమూల మగు ననుమానము కూడ ప్రమాణ ముగా నంగీకరింపక తప్పదు. కనుక రెండు ప్రమా ణము లంగీకరింపవలెను) ఈ పరిణామమును తన ప్రయోజనముగా నభిలషించువారెవ్వరో కనుగొందము బాహ్య విషయములు, ఘటాదుల గూర్చినది జ్ఞానము. అదియే కాక "నేను" అని ప్రత్యగ్విషయకమగు తెలివి యొకటున్నది. అది బాహ్యవిషయకమగు తెలివికన్న జాల విలక్షణముగా నున్నది. ఆ వైలక్షణ్య మేమనగా, జ్ఞానమనునది బాహ్యవస్తువుల సంబంధ మిదివరలో నిరూపించినట్లుగా నేదోయొక విధమున నున్నపుడే యుదయించును. కనుక నది ప్రాకృతిక మనదగును. "నేను" అనునట్టి తెలివికి బాహ్యముతో నెట్టి సంబంధములేదు. స్వాపమద మూర్ఛాదు లందు గూడ ఈ ప్రత్యయమున్నది. దీనికి ప్రాకృతిక వస్తు సంసర్గము ఆవశ్యకముగాదు. కనుక నిది ప్రాకృతిక పదార్థజన్యము కాజాలదు. కనుక నిది అప్రాకృతికము. అజడము, ప్రాకృతికము జడము. ఇట్టి అజడమగు చైతన్య మెవ్వని కుండునో, వాడొకడు జడమునకన్న వేరుగా నున్నాడని మనము గ్రహింపవలెను. "నేను" అనుకొనువాడే కదా తనకీ ప్రాకృతిక విషయములతో భోగముకావలెనని యనుభవించుచున్నాడు ! అనుభవ మెట్లున్నను చివరకు భోగముకావలెననియైనా అను కొనుచున్నాడు. భోగ మనుభవించుచుంటినని భావిం చుచున్నాడు. కనుక నత డొక చేతనుడున్నాడనియు, నతని భోగమునకై యీ ప్రకృతి యీ పరిణామము నంతను నుపక్రమించుననియును ఘటప్రత్యక్షానుభవ సిద్ధి వలన నూహింపనైయున్నది. కాగా చేతను డొకడును, అచేతనమగు ప్రకృతియు రెండే యీ ప్రపంచమున నగుపడు సర్వపదార్థములును. అచేతన మేదియు "నే నీ బంధము నుండి విడివడెదను" అను కొనుటలేదు. బంధములో నుంటిమను చింతయు దానికి గన్పట్టదు. ఇక నెవరికీచింతయున్నదో కను గొందము. "నేను" అను నహంప్రత్యయ మెవని కున్నదో వానికే, చేతనునకే, ఈ బంధ మోక్ష చింత కన్పడుచున్నది. (ఇంతవరకు సాంఖ్యము. ఇక మాయాద్వైతము) అయితే నిజముగా బంధమున్నదా? అది యెట్టిది ? అని విచారింతము. సంసారములోని సుఖదుఃఖానుభవము, కామక్రోధాద్యరిషడ్వర్గస్ఫూర్తి,

దారా పుత్ర ధనాది విషయములగు చిక్కులు. ఇవి యన్నింటిని దలచికొని తనకే యివియన్నియు ప్రసక్తించినవనుకొని, ఆ భావనతో దానీ సంసారములో బద్ధుడనైతిననుకొనుచున్నాడు చేతనుడు. అవి తనకు సంబంధింపవనుకొనుచో, దాని నుండి తాను విడివడితినని భావించుచున్నాడు. నిజముగా నవి తనకు సంబంధించియే యుండుచో, నవి తనవి కావనుకొనునంత మాత్రమున నెట్లని తననుండి వీడిపోగలవు? కాలికి నిజముగా బాము చుట్టుకొనియున్నచో "చుట్టుకొనలేదు" అనుకొన్నంత మాత్రమున బాము తొలగిపోవునా? కనుక చేతనుడు "నాకిది లేదు, నాదిది కాదు, నేను నేనే" అను భావనతో సున్నపు డీ సంసారము నుండి-అనగా "నావి యీ దుఃఖములు" అను భావన నుండి విముక్తుడగుచున్నాడు. కాగా ఏమి తేలినది.[1] ఈ బంధము కాని, మోక్షము కాని, రెండును నిజముకావని తేలినది. ఎట్లనగా కంటిజబ్బు వానికి తన యెదుట పెంద్రుకల చుట్ట (కేశోంద్రకము) యున్నట్లగుపడును. ఆ జబ్బు తొలగిపోగానే ఆ చుట్ట తొలగిపోయినట్లుండును. నిజమున కచట పెంద్రుకల చుట్ట (కేశోంద్రకము) పూర్వమున్నదా? ఇపుడు పోయినదా? కనుక అట్లుచేతనునకు ఇదివరలో సుఖదుఃఖాదులున్నవా? ఇపుడు పోయినవా? రెండునూ లేదు. అయితే, లోకములో సుఖదుఃఖాదులు, కామ క్రోధాదులు, వానియనుభవము లేవా? ఉన్నవి. కాని అవి చేతనునివి కావు, ప్రకృతివి. మూలప్రకృతియందు గల పరిణామ భేదముల వలన కామక్రోధాదు లేర్పడును. ఇవియన్నియు ప్రకృతి ధర్మములు. అనగా ప్రకృతి వికారములగు అన్తఃకరణములో నీ చేతనుడు ప్రతిఫలించును. ఆ ప్రతిఫలనమును గ్రహింపజాలక, తానే[2] యది యని చేతనుడు భావించి, ఆ కామ క్రోధాదులను, వాని యనుభవమును గూడ తనవేయని భావించును. కాగా అన్తఃకరణోపరాగము వలన "నేనే ఈ పని నొనర్చితిని. ఆ ఫలము ననుభవింతును" అని కర్తృత్వ భోక్తృత్వాదులను తనయం దారోపించుకొనును. నిజముగా నివియన్నియు నెవరివి? ప్రకృతివి. ఎట్లు? ఏ పనియైనను ప్రకృతియే కదా చేయును; వంట యున్నదనుకొనుడు. ఆకలి శరీరమునందలి జఠరాగ్ని దీప్తి వలన నేర్పడును. అనగా దాని దీప్తిని నాకలనమొనర్చుట వలననే "ఆకలి" యేర్పడును. దానిని గూర్చి బాహ్య విషయములు కావలసివచ్చి వానిని గుర్తించిన తెలివి యేర్పడును. బాహ్య గోచరమగు తెలివియంతయు ప్రకృతిగుణమే కదా! ఆ తెలివివలన వంట యందు శరీరము ప్రవర్తించి దానిని నెరవేర్చును. ప్రవర్తించినది శరీరము. "కాని నిర్జీవముగా నున్న శరీరము వంటలో ప్రవర్తించునా? లేదు కనుక చేతనుడే ప్రవర్తించెననరాదా?" అనుచో చేతనునకు తనను దాను భావించుకొనుట తప్ప మరొకదానిని గూర్చి తెలిసికొనుట కాని, ప్రవర్తించుట కాని[3] లేదు కదా! అట్టివానికి, అనగా స్వేతర సమస్త విషయములందును నుదాసీనుడైనవానికి ఈ ప్రాకృతిక విషయములందు జ్ఞానము కాని, ప్రవృత్తి గాని కలుగగల్గునా? ఇక నేమనగా బాహ్యవిషయకమగు నీ తెలివి కాని, ప్రవృత్తి కాని, కార్యములలో నన్తర్లగ్నత కాని యివియన్నియు బాహ్య విషయములే కాని ప్రత్యగ్విషయములు కావు కదా! కనుక ఇదియంతయు బాహ్యమగు ప్రకృతియే. అనగా ప్రకృతి పరిణామమగు నన్తఃకరణపు ధర్మములే యివి. ఆ ప్రకృతి చేతనుడు తన సన్నిధినుండు నప్పుడే పని చేయును. సూర్యుడు ప్రతిఫలించునపుడే సూర్యకాన్తమునకు

1. తస్మాన్న బధ్యతే నాపి ముచ్యతే సంసరతి కశ్చిత్. సాం - కారి.
2. "మమేదం కర్తవ్యం" ఇత్యత్ర "మమేతి" అన్తఃకరణోపరాగః, "ఇద"మితి విషయోపరాగః, "కర్తవ్య"మితి వ్యాపారాంశః.
3. త్వామామనన్తి ప్రకృతిం పురుషార్థ ప్రదాయినీం, తద్దర్శిన ముదాసీనం త్వామేవ పురుషం విదుః.

(కాళిదాసు - కుమా. సం. 2 సం.)

ప్రకాశకత్వమును, దాహకత్వమును ఏర్పడునుగాని లేనపు డుండవుకదా! అట్లే అద్దమువలె నత్యంత పరిశుభ్రమును సత్త్వపరిణామమునునగు నన్తఃకరణమునం దుదాసీనుడయిన చేతనుడు ప్రతిఫలించునపుడు అది పై జెప్పిన యిన్ని రకముల పోకడలను పోవును. చేతనుడుకూడ తానన్తఃకరణములో ప్రతిఫలించితినని యెఱుగక, తనకు దానితో సంబంధము లేదని గుర్తింపక, వివేకములేక అది తానే యనుభ్రాన్తి (అధ్యాస) తో దాని యనుభవములన్నియు, దాని గుణము లన్నియుగూడ దనవేనని భావించి అనావశ్యకములను, అనృతములనగు బంధమోక్షములను అనుభవించుచుండును. కనుకనే 'భార్యా పుత్రాదులు మృతులగునపుడు తానే నాశనమైతినని దుఃఖము నొందుచున్నాడు. వారు సుఖముగా నుండుచో దానే సుఖిననుకొనుచున్నాడు. ఇట్లు పరగతములగు విషయములను దనవిగా భావించి, సుఖదుఃఖాదుల ననుభవించుట మనకందరికిని తెలిసిన విషయమే కదా! ఆపద్ధతినే [5]చేతనుడు అన్తఃకరణ ధర్మములగు కర్తృత్వ భోక్తృత్వాదుల నన్నింటికి దనయం దారోపించుకొని బంధమును భావించి దుఃఖితు డగుచున్నాడు. ఎపుడయితే యీ ప్రకృతి గుణములను దనవికావనియు, దనకు వానితోకాని, దానితో (అన్తఃకరణముతో) గాని సంబంధము లేదనియు భావించునో, అనగా ప్రకృతి పురుష వివేక ముదయించునో అపుడు - ప్రకృతి (అన్తఃకరణము) తన ధర్మముల నన్నింటికి ఉపసంహరించుకొనును. అనగా నన్తఃకరణ ధర్మము లన్నియు దొలగిపోవును. కాగా ఈ ప్రపంచమంతయు సత్తుగానే అనగా ఎట్టి వికారములు లేకుండగానే నిలచిపోవును. మన కీ ప్రపంచమంతయు సత్తుగానే అనుభవమగుచున్నది కనుక దీని మూలకారణముకూడ సత్తుగానే యుండు ప్రకృతియే. ఇది సత్త్వరజస్తమోమయము. దీని కార్యములగు సకల ప్రాపంచిక వస్తువులందును ఈ గుణము (సత్త్వ) ఇంతో యంతో, వైషమ్యముతో గన్పడుచుండునుగదా! కనుక త్రిగుణాత్మికయగు ప్రకృతియే జగత్తున కుపాదానకారణము అన్తర్గత నిమిత్తకారణము. చేతను డుదాసీన నిమిత్తకారణము. ఇతని యవివేక మున్నంతవరకు ప్రకృతికార్యవర్గమును సృజించుటయు, ఇతనికి వివేక ముదయింపగనే అది మానివేయుటయు జరుగును. కుండల గొనువా రుండునంతవరకును మన్నుకు కుమ్మరికి పని (కుండల నిర్మించుట) యుండును. కొనువాని "కివి సులభవినాశములును, కనుక మనకు వీనితో నవసరము లేదు. వీనితో సంబంధము మనకు వలదు" అను వివేక ముదయింపగానే అత డీ కుండలను స్వీకరింప మానును. కుమ్మరి కుండలను జేయడు. తనపని నుపయోగించుకొనువా డుండినగదా అతడు పనిజేయును! ఇక మన్నుముద్దకు కుండగా మారుపని యేమున్నది? అట్లే ప్రకృతమును నూహించునది. ఇట్లు ప్రపంచసృష్టి నెరవేరును గావున నిక నింకొక నిమిత్తము దేవుడవసరములేదు. ఈ విషయములో వేదముకూడ తోడుపల్కు చున్నది. "అజామేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీం ప్రజాం జనయన్తీం సరూపాం అజోహ్యేకో జుషమాణోనుశేతే జహాత్యేనాం భుక్తభోగా మజోన్యః" అని. అయితే వేదములు ప్రమాణములా అని యాశంకింపరాదు. మన యనుభవమునకును, మన యూహకును విరోధము లేనపుడు వానిని నిరాకరింప నేలపలయును? అవి మనకు పూర్వులు, పూర్వతరులు, పూర్వతములు నగు మహావిచారకుల యూహలు. "సంఖ్య"యన విచారణ ("చర్చా సంఖ్యా విచారణా" యని కదా అమరకోశము. ఆ విచార శాస్త్రమే సాంఖ్యశాస్త్రము. దాని నొనర్చువారు సాంఖ్యులు. మన ప్రత్యక్ష ప్రమాణమునకును, అనుమానప్రమాణమునకును,

4. తద్యథా- పుత్ర భార్యాదిషు వికలేషు సకలేషువా అహమేవ వికలః సకలోవేతి బాహ్యధర్మా నాత్మ న్యధ్యస్యతి. (శాం. సూ. అధ్యాస భాష్యం.)

5. తథాన్తఃకరణ ధర్మాన్ - కామసంకల్ప విచికిత్సాధ్యవసాయాదీన్. (శాం. సూ. భాష్య.)

నిరోధము లేనిచో, మనకు దెలియకున్నను వేదము తెల్పునవి ప్రమాణమేనని యంగీకరింపనగును. మన మెవ్వరమును సర్వజ్ఞులము కాముకదా! మనకు కనుపడనివియు, మన యూహకందనివియునగు ననేక విషయములను వారెరిగియుండ వచ్చును. కనుక వారి యూహలను స్పష్టముగా బ్రదర్శించు వేదములన్నియు బ్రమాణములే. మన ప్రత్యక్షానుభవములకును మన యూహలకును విరుద్ధముగా నుండునవి మాత్రము ప్రమాణములుగా విశ్వసింప దగదు. అవి వైభవ వాదములనికాని, ప్రశంసాపరములు అనికాని[6] సరిపెట్టుకొననగును. ఇట్లు ఈజగత్తంతయు ప్రకృత్యుపాదానమైనను చేతననిమిత్తకము అని సాంఖ్యులందురు. ఇట్లున్న ఈ మూడు మతములలోని లోపములను తీర్చి దిద్దగా వాని పరిణామావిష్కృతియే మాయావాదముగా నేర్పడినది.[7]

## మాయావాదము

ఎట్లనగా - సాంఖ్యుల వాదములో బ్రపంచము వాస్తవికముగా నున్నది. అది యుక్తముకాదు. ఏమనగా స్వప్నదృష్టపదార్థము లెట్లసత్యములో, జాగ్రద్దశయందలి వస్తువులుకూడ నట్లే యసత్యములు. స్వప్నదృష్టములు జాగ్రద్దశతో లేవుకనుక నసత్యములందురు. అట్లే జాగ్రద్దశలో నివి స్వప్నదశలో లేవు కనుక అసత్యము లనుకొనుడు. ఎట్లనగా స్వప్నమునందు మనమొక గదిలో బరుండియున్నను, లోకాన్తరములందును, దేశాన్తరములందును మనము ఏనుగులను, గుఱ్ఱములను ఎక్కి సవారి చేయుచున్నట్లుగా కలగందుము. మనశరీర మిటనేయున్నదికదా! అందులో నేనుగులు పట్టవు యుండజాలవుకదా! కావున స్వాప్నికపదార్థములన్నియు నాస్వాప్నిక వృత్తాన్తముతోబాటు జాగ్రద్దశయందేమియు లేకపోవుటయు, అస్వప్నపు కొంచెము కాలమునందు మాత్రమే యుండుటయు కారణముగా నసత్యములు. అట్లే జాగ్రద్దశలోనివియు, స్వప్నమునందుండక జాగ్రద్దశయందు కొంతకాలమే యుండును గనుక నవియు[8]మిథ్యాభూతములే. నిజమునకు స్వప్నములో బదార్థములు లేనేలేవని[9]శ్రుతియే బోధించుచున్నది. కాగా ప్రపంచమంతయు మిథ్యయే. ఇట్టి దీనికి నిమిత్త

6. సృష్టి ప్రకరణములందు చేతనునకు సృష్టికర్తృత్వమును జెప్పు వాక్యములు "స ఈక్షతలోకాన్నుసృజా" ఇత్యాదు లుదాసీననిమిత్తకారణనిరూపణపరములు. చేతనునకు పరిణామమును తెల్పు "తదైక్షత బహూనాం ప్రజాయేయ" ఇత్యాదులు మన యనుమానము ప్రకారము విరుద్ధములు కనుక నవి అప్రమాణములని కాని, లేదా ప్రకృతిపరములుగా గాని, సమన్వయింపవలెను. కొన్నింటిని అర్థవాదములుగా భావింపవలెను. ఇట్లు మన మనుమానించు ప్రకృతికి కారణత్వమే సమంజసము కనుక వేదవాక్యములను దానికి తగినట్లుగా సమన్వయించి, మన యనుమానమును (ప్రకృతిని) జగత్పరిణామోపాదాన నిమిత్తమునవలెను.

7. సాంఖ్య సౌగత చార్వాకసంకరాచ్ఛంకరోదయః- వేదాంత దేశికః.

8. వైతథ్యే హేతుమాహ- వైతథ్యం సర్వభావానాం స్వప్న ఆహుర్మనీషిణః, అన్తస్థానాత్తు భావానాం సంవృతత్వేన హేతునా. "భావశ్చ రథాదీనాం శ్రూయతే న్యాయపూర్వకం, వైతథ్యం తేనవై ప్రాప్తం స్వప్న ఆహుర్మనీషిణః" అంతస్థానాత్తు భేదానాం తస్మాజ్జాగరితే స్మృతం, యథాతత్రు తథా స్వప్నే సంవృతత్వేన భిద్యతే.

9. అన్తస్థానాత్- అన్తః-శరీరస్య మధ్యే స్థానం యేషాం తత్రహిభావా ఉపలభ్యంతే పర్వత హస్త్యాదయః నబహిశ్శరీరాత్ తస్మాత్తే వితథాభవితు మర్హన్తి. నహ్యన్త స్సంవృతే దేహాన్తర్నాడీషు పర్వత హస్త్యాదీనాం సంభవోస్తి. నహిదేహే పర్వతోఽస్తి. స్వప్నదృశ్యానాం మిథ్యాత్వే హేత్వంతరమాహ. "న తత్ర రథా రథయోగా నపన్థానో భవన్తీత్యాదీ శ్రుత్యా స్వప్నే దృశ్యానాం రథాదీనాం అభావో యోగ్యదేశాద్యభావా దుక్త న్యాయపురస్సరం శ్రూయతే అతస్తేన న్యాయేన ప్రాప్తమేవ స్వప్నదృశ్యానాం మిథ్యాత్వం అన్యపరయా శ్రుత్యా ప్రకాశిత మితి బ్రహ్మవిదోవదన్తి తథా చ స్వప్నే భావానాం మిథ్యాత్వం శ్రుతి యుక్తి.

మేమి? ఉపాదానమేమి? వంధ్యాపుత్రునకుపౌత్రుదేమి? దౌహిత్రుడేమి? ఈ విచారము పారమార్థికదశ ననుస రించినది కాదు. అచట గారణముకాని, కార్యముగాని, రెండునులేవుకదా ! అసలు సృష్టియే పారమార్థికముగా లేదు. ఈసృష్టివాదులలో గొందరు ఈశ్వర విభూతియే సృష్టియందురు. ఇంక కొందరు స్వప్నస్వరూప మందురు. అనగా వారిభావమిది. జాగ్రద్దశలోనుండు పదార్థములే స్వప్నములో నగుపడును. కావున నా స్వప్నము సత్యమని మరికొందరు. మరికొందరు మాయాస్వరూప మనెదరీ సృష్టిని. అనగా మణ్యాది రూపమగు మాయయే సృష్టిరూపమయ్యెనని. ఇంక కొందరు సృష్టినిశ్చయము కలవారు పరమాత్మ యొక్క ఇచ్ఛామాత్రముననే సృష్టి యుదయించు ననెదరు. కాలచింతకుల దింకొక త్రోవ. కాలము వలననే సకలభూతము లుదయించునని, భగవంతుడు తన భోగమునకై సృష్టిని నిర్మించెనని కొందరనగా, "కాదు ఆతనికి క్రీడార్థమునుమీ ఈ సృష్టి" యని మరి కొందరందురు ఇట్టి [10]విచారము లన్నియు కేవల మయుక్తములు. ఏమనగా ఈ సృష్టికి గర్తయను చున్న పరమాత్మ ఆప్తకాముడా ? అనాప్తకాముడా ? రెండవ పక్షమున మనవలె నపరిపూర్ణుడగుటవలన నతనికి సర్వశక్తి మొదలగునవి సంభవింపవు. మొదటి పక్షమున నతనికి క్రీడకాని భోగముకాని ఏర్పడజాలదు. కడుపునిండినవాని కన్న మక్కరలే దన్నట్లుగా ఆప్తకామునకు భోగముకాని క్రీడకాని అక్కరలేదుకదా ! కనుకనే ఇచ్ఛామాత్రమున సమర్థు డగు పరమాత్మ సృష్టించెననుటయు అయుక్తమే. ఆప్తకామున కా యిచ్ఛమాత్ర మెట్లుదయించును? కడుపునిండినవానికి బుభుక్షయైన కల్గునా ? కలుగదు కదా ! 'స్వప్న మాయాసరూప'మనువారు చేయు వాద మును నసంగతమే. స్వప్నమాయలతో సారూప్య మీ సృష్టియందేది ? లేదుకనుక వానితో సరూపమీ సృష్టియనుట అనుపపన్నముకదా ! అవస్తువనందే కదా స్వప్నమనియు మాయయనియు వాడుదురు ! సర్పభ్రమకు నెలవగు రజ్జువుస్వభావము వలననే అనగా అజ్ఞానమువలననే సర్పముగా ప్రతిభాసించును గాని కారణాంతరమున గాదుకదా ! అట్లే పరబ్రహ్మ తన స్వభావమగు మాయాశక్తివలననే ఆకాశాదులుగా భాసించును గాని కారణాంతర మవసరములేదు. ఆకాశమూలమున క్రమమున నీ ప్రపంచమంతయు నుదయించినట్లు, "ఆత్మన ఆకాశస్సంభూతః" అను శ్రుతి నుడువుచున్నది. కావున పరమానందరూపమగు పరబ్రహ్మము స్వభావమగు మాయవలననే ఈ ప్రపంచమంతయు ప్రతిభాసించుచున్నది కాని ఇట సృష్టిలేదు. వినాశములేదు. కనుక సాంఖ్యవాదము లోని ప్రపంచవాస్తవికత తప్పక తోసివేయవలసినదే. అయితే, అందుగల అంతఃకరణసామర్థ్యమును ముఖ్యముగా స్వీకరింపవలెను. ఏమనగా—"అసంగో హ్యయం పురుషః" అనుదానినిబట్టిబాహ్యాభ్యంతరముల నెచ్చటను ఎవ్విధమునను సంబంధములేని యీ అత్యంతోదాసీనుడగు నీ పురుషునకు ఈ ప్రపంచ ప్రతిభాసముమాత్ర మెట్లేర్పడును ? అంతఃకరణ సామర్థ్యమువలననే. అంతఃకరణములో నతడు ప్రతి ఫలించును. శుద్ధసత్త్వమయ మీ యంతఃకరణము. ఇందులో బ్రహ్మము ప్రతిబింబించునట్లుండును. ఆ ప్రతిబింబమునకు ఈ ప్రపంచము నంతను గ్రహించుటకును, నిర్మించుటకును గావలసిన శక్తి, సమాలోచనాత్మకమగు తపస్సు వలన నేర్పడును. ఈతని కీశ్వరుడని పేరు. "యస్సర్వజ్ఞః సర్వవిత్ యస్యజ్ఞాన మయంతపః, తస్మాదేతద్బ్రహ్మ నామ రూప మన్నంచ జాయతే, "యథోర్ణనాభిస్సృజతే గృహ్ణతేచ, యథాపృథివ్యా మోషధయస్సంభవన్తి.

10. "విభూతిం ప్రసవంత్యన్యే మన్యంతే సృష్టి చింతకాః, స్వప్నమాయా సరూపేతి సృష్టి రన్యై ర్వికల్పితా ।
ఇచ్ఛామాత్రం ప్రభో స్సృష్టి రితిసృష్టౌ వినిశ్చితా, కాలాత్ప్రసూతిం భూతానాం మన్యంతే కాలచింతకాః ।
భోగార్థం సృష్టి రిత్యన్యే క్రీడార్థ మితి చాపరే, దేవస్యైష స్వభావోయ మాప్త కామస్య కాస్పృహా.
(గౌ. పా. కా. వైత)

యథా సతః పురుషాత్కేశలోమాని, తథాక్షరాత్సమ్భవతీహ విశ్వం" అను శ్రుతులు ఈ యర్థమునే వ్యక్తపరచుచున్నవి. అక్షరమనగా ప్రకృతియే, అయినను ఇచట సర్వతఃఉదాసీనమును, నిర్గుణమును, నిష్క్రియమునునగు పరబ్రహ్మమునకు ఈ ప్రపంచనిర్మాణ సామర్థ్యముగాని ప్రపంచప్రతిభాసగ్రహణ సామర్థ్యముగాని తద్గ్రహణ ప్రయత్నముగాని, ప్రవృత్తిగాని యేర్పడగలదా ? శుద్ధబ్రహ్మమున కేర్పడుటకు వీలు లేదు. కనుక అక్షరావచ్ఛిన్నుడగు బ్రహ్మము అనగా అక్షరశబ్దవాచ్యమగు ప్రకృతిలో ప్రతిబింబించుబ్రహ్మమునకు ఇవియన్నియు ప్రకృతిసాహాయ్యముననేర్పడును ఏర్పడవచ్చును. సర్వక్రియానిర్వహణ సామర్థ్యము ప్రకృతి కున్నదిగదా । ఆ ప్రకృతినే ఈ మతములో మాయయందురు. "మాయాంతు ప్రకృతిం విద్యాత్ మాయినంతు మహేశ్వరం" అని తైత్తిరీయశ్రుతి బోధించుచున్నదిగదా । [11](సాంఖ్యమతములో ఉదాసీనుడగు పురుషుడే వీరి శుద్ధనిర్గుణబ్రహ్మము. ఆ పురుషుడు ప్రకృతితో సంబంధించు నవస్థయే ఈశ్వరుడు. "మమేదంకర్తవ్యం"అని అసంగుడగు పురుషుడు భావించుటయే ఈశ్వరునకు జగన్నిర్మాణ సమాలోచనాదికము ఇందులో పురుషుడు జ్ఞాతయని సాంఖ్యులు. కాదు విజ్ఞానమే కాని విజ్ఞాత కాదు. అట్లగుచో నిర్గుణమగు ద్రవ్యముండదు కావున పురుషునకు గుణసంబంధము కల్పింపవలసి వచ్చును. అందువలన "అసంగోహ్యయంపురుషః; నిష్కలం నిష్క్రియం శాన్తం నిరవద్యం నిరంజనం, అమృతస్య పరం సేతుం దగ్ధేన్ధనమివానలం" అని సర్వతో నిర్విశేషమనియు సర్వతో నిస్సంబంధమనియు బ్రహ్మము నుపపాదించు శ్రుతులతో విరోధము తొలగునని వీరి తలంపు) కనుక అక్షర ప్రతిబింబమే అక్షర (బ్రహ్మ) మని యిచట వాడబడినది. మన ప్రతిబింబమును మనమనియే వాడుచుందురుకదా । (బొమ్మలందును ఫోటోల యందును ఈ వ్యవహారమును గమనించునది.) ఇపుడు సాంఖ్యుల ఇష్టప్రకారముగా అచేతన జగత్తంతయు అచేతనమువలననే ఏర్పడుట సంభవించును. జగత్కారణము జడమగు మాయయేకదా । మాయాఽవిద్యాదులు లేకుండ నిర్గుణమును నుదాసీనమును నగు బ్రహ్మమునకు ప్రపంచభ్రమకాని మరేకార్యపు కర్తృత్వముకాని యేర్పడదు. (సాంఖ్య మతములోవలె యిటగూడ మాయా (సాంఖ్య మతములో ప్రకృతి పేరు భేదముకాని అంతయు నొకేతీరు) గతమగు కర్తృత్వాదికము నిర్గుణోదాసీన బ్రహ్మయందు (పురుషునందు సాంఖ్య మతములో) ఆరోపితమగును.) మాయ యనగా స్వభావమే. (ఇట చార్వాకమత ముపాత్తము.) బ్రహ్మమునకు జ్ఞానము, బలము, క్రియయు, స్వాభావికములు. అనగా - మాయికములు, "స్వాభావికీ జ్ఞానబలక్రియాచ" అను శ్వేతాశ్వతర శ్రుతి కర్థమిదే. కనుకనే బాహ్యవిషయకమగు జ్ఞానమంతయు జడమును, ప్రాకృతికమగు నన్తఃకరణపు ధర్మమును అగును. శంకరులు "జ్ఞానం మానసీక్రియా" అనిరి. మనసు భౌతికమేకదా । దాని క్రియయేకదా ఈ జ్ఞానము. మనోధర్మములే కామ సంకల్పాదులు. "కామః, సంకల్పః, విచికిత్సా, శ్రద్ధా, అశ్రద్ధా, ధృతిః, అధృతిః, హ్రీః, ధీః, భీః" ఇత్యేతత్సర్వం మనఏవ- అని బృహదారణ్యకము. ఇట్లు మానసికమగు నీ బాహ్యప్రపంచ ప్రతిభాసమంతయు మాయామయమే. బాధితముకనుక "అసత్తు" అనవలెను. "ప్రతిభాసించును" గనుక "సత్తు" అనవలెను. అనగా రజ్జువునందుభాసించు సర్పము తత్కాలమున సత్తుగా స్ఫురించినను, తరువాత రజ్జువని తెలిసినతోడనే నివృత్తమగును గనుక అది బాధితమై "అసత్తు" అనబడును. రజ్జువు బాధింపబడదు గనుకను ప్రతిభాసించును గనుకను "సత్తు" అనబడును.

(సశేషం)

11. సాంఖ్య యోగస్మృత్యోః సావకాశత్వం తద్యథా— "అసంగోహ్యయం పురుషః" ఇత్యాది శ్రుతి ప్రసిద్ధమేవ సాంఖ్యై రభ్యుపగమ్యతే.

# జయదేవకృతి

"కవిరాజరాజు"

ప్రథమ తరంగము

దివి మేఘావళి నిండెఁ గారుకొనె న
ల్దిక్కుల్ తమాలావృతా
టవి నీరేయి భయంబుఁజెందు హరి నిం
టన్ జేర్చు మీవన్న నం
దవచస్సంగతి రాధ పో, జమున పొం
తన్ బుష్పకుంజంబులన్
స్తవనీయంబయి పొల్చుఁగావుతను రా
ధావృత్తికేళీగతుల్.

భావము భారతీరుచిర
భాగ్యవికాసపు తావొనర్చి ప
ద్మావతిచేత నృత్యము స
మర్థతతో వెలయింపఁజేసి యా
కరమరుదై ప్రమోదమును
గల్గఁగఁజేసి మిమున్ గరంచెడున్.

సజ్జన గణంబ ! హరిభక్తి సలుపఁ దలఁపు
గలిగిన విలాసకళ కుతూహలమయేని
మధుర కోమల కాంత సంపత్ప్రదములఁ
దనరు జయదేవ కవివాణి వినుఁడు సతము.

సరస పదప్రయోగము
విశాల మనోగత భావరాగ వి
స్తరణము లోక మోహన
విధాన సమంచిత కల్పన ప్రభా
సురత విశేషభాసురము
చోద్యమునై యలరారు కావ్య మ

సమర్పణ :
దేవాదాయ ధర్మాదాయశాఖాధ్యక్షులు
**పండిత శ్రీ పైడి లక్ష్మయ్యగారి దివ్యహృదయమునకు**

ధీవిభవుండు, వేత్త, జయ
దేవ కవీంద్రుఁడు వాసుదేవ మో
దావహ కామకేళి లల
రారఁ బ్రబంధముఁగూర్చె నింపుగన్.

హరి చరితంపుఁ గీర్తనము
హర్షముగూర్పఁగఁ జాలునేని సుం
దరరతికేళి భావములు
నవ్యవిలాసముతోడఁగూడి ప్రీ
తి రుచి యొసంగునేని జయ
దేవకవీంద్రుని వర్ణనాంశముల్
ద్దిర ! వెలయించినట్టి
జయదేవున కేరును సాటిరా రిలన్.

ప్రళయపు వేళ నిండు జల
రాశిని నోడగనున్న వేద వా
క్కులకును సర్వబీజముల
కున్ జెడుగంటఁగనీక సాకుచున్
చలువఁ గృపాప్రసారిత వి
శాలపు దృష్టిని మీనమూర్తివై
చెలఁగిన కేశవా ! కరుణఁ
జేసి శుభంబిడు మాకు శ్రీహరీ !

సురలును శుక్రశిష్యులును
జుట్టుటకై యమృతంబు మేటి మం
దరగిరి నూని కవ్వముగఁ,
ద్రాడుగ వాసుకిఁజుట్టి సంభ్రమున్
దరచఁగ నద్రి మున్గ సుమ
నస్సులు వేడిన కూర్మమూర్తివై
గిరిని వహించి తేల్చితి సు
కీర్తి! జయంబిడు మాకు శ్రీహరీ!

ధరఁ గల వారిఁబ్రోవఁగ ను
దారమనస్కుఁడవౌచు తాన సూ
కరతనుధారివై భువి
నగాధ జలంబునఁ గ్రుంకకుండ ని
బ్బరముగఁ గోరకొట్టుకొని
పై వెస నిల్పిన శక్తిచే ధురం
ధరతను జాటితీవు
శుభధామ! శుభంబిడు మాకు శ్రీహరీ!

నినుఁ గొనియాడు బాలకు న
నింద్యమతిన్ సుకుమారుఁ గ్రూరదం
డనములపాలుచేయుచుఁ గ
డంకను నిన్ దెగటార్ప జూచు దు
ర్జను దితిపుత్రు మూర్ఖత క
సహ్యముమై నరసింహమూర్తివై
దునిమిన లోకభక్తవర
దుండ! జయంబిడు మాకు శ్రీహరీ!

లలితపద ప్రభూత సలి
లంబులచే భువి పావనంబుగా
సలిపిన పూజితాంఘ్రి జల
జద్వయ! వామనరూపధారివై
బలి నడఁగించి తద్గరిమఁ
బాపఁగ సక్రమ విక్రమాఢ్యతన్
జెలఁగి జగంబు నిండిన వి
శిష్ట! శుభంబిడు మాకు శ్రీహరీ!

ఇరువది యొక్కమాఱు ధర
ణీశ్వరు లేమియునున్న నేర్చి సం
బరమునఁ ద్రుంచి ధారలయి
పారిన రక్తపుపేటి నీటిచే
తరహినౌనర్చితౌర! పితృ
తర్పణమున్ భృగురామమూర్తివై
పరశువుఁదాల్చి విక్రమ వి
భాసి! జయంబిడు మాకు శ్రీహరీ!

బలమద దుష్టదానవులు
బాధలు పెట్టఁగ నోర్వలేక చం
చలుఁడగు పాకశాసనుని
శాంతునిఁ జేయుటకై రణావనిన్
దలపడి రావణున్ గెడపి
నావుగదా రఘురామమూర్తివై
వెలసినవాఁ డమేయబల
వీర! శుభంబిడు మాకు శ్రీహరీ!

తెల్లనివాఁడవౌచు గడి
తేఱియు నాఁగలితోడ మొత్త భీ
తిల్లి చలించుచున్ యమున
తేలగిలన్ బడి మానె నట్టిదౌ
నల్లనిబట్ట కట్టుకొని
నాడ వహో! బలరామమూర్తివై
తొల్లి బలప్రభావ చరి
తుండ! జయంబిడు మాకు శ్రీహరీ!

శ్రుతిహిత యాగ కర్మముల
రూపితమౌ పశుమారణంబు చూ
షిత మకటా! యటంచు నిర
సించిన బుద్ధిబలంబుచే దయా
మతివయి బోధచే బలుల
మాన్పు దలంపున బుద్ధరూప మం
చితగతిఁదాల్చి పొందవె ప్ర
సిద్ధి! శుభంబిడు మాకు శ్రీహరీ!

యవనసమూహ మెల్లెడల
నాగడముల్ సలుపంగఁ బూని తా
మవమతితోడఁ జేడియల
నాస్తుల నారసి యంకఁబట్టి ప్రా
భవమును మాపఁ బావక కృ
పాణముఁ దాల్చిన కల్కిమూర్తివై
జవమున వాంఛ్రఁ జీల్చిన ప్ర
శస్త! జయంబిడు మాకు శ్రీహరీ!

వేదంబుల్ భరియించి లోకతతి శే
విం దాల్చి భూరక్షకున్
భూదారంబయి రాక్షసున్గెడపి లో
బ్రుంగన్ భువిన్ద్రొక్కి పెం
పేదన్ రావణుఁగూల్చి చీల్చి నృపులక్షీ
శీరంబుఁ గొంచున్ దయా
వాదంబూనియు మ్లేచ్ఛులన్ జెఱచు దే
వా! మాధవా! మ్రొక్కెదన్.

కలికితురాయి నెన్నొసటఁ
గాంతులుచింది చెలంగఁ గర్ణ కుం
డలముల దీప్తి చెక్కిళుల
డాలు నెసంగఁగఁజేయు నేర్పు సొం
పలరఁగఁ గూర్చినట్టి సుమ
హారము తూఁగఁగ వక్షమందు శ్రీ
లలనను గౌఁగిలించు జయ
లాలస! మంగళమయ్య కేశవా!

జనన పరంపర న్గెడపఁ
జాలిన సత్త్వముఁగల్గి లోక రం
జన మొనరించు పూన్కెను ప్ర
శస్త శుభాంచిత భవ్యతేజమున్
దినమణి కిచ్చి యోగిజన
దివ్య హృదంబుజ రాజహంసవై
తనరి జగంబుఁ బ్రోచు గుణ
ధన్యుఁడ! మంగళమోయి కేశవా!

మురుని హరియించి నరకుని బొలియఁజేసి
కాళియాహిపడగలపైఁ గేళిసలిపి
మానవాళిని సురలను మనుచు నీకు
మంగళముఁబాడుచుంటిని మాధవుండ!

నీలమేఘముడాలు డీలుసేయఁగఁజాలు
శుభకరంబగుమేని సొబగువాఁడ!
వీనులవిందుఁ గావించి సొక్కెడు రక్తి
వేణుగానంబు కావించువాఁడ!
భక్తు లాపదలలోఁ బడి వేడుకొనునెడ
కరుణాంతరంగివై కాచువాఁడ!
గోపాలకులు గోవు లాపదన్ బడువేళ
మహిధరంబును దాల్చి మనుచువాఁడ!
అల కుచేలున కొసఁగితి వమితభాగ్య
మార్తి రక్షించినాఁడ వహో గజేంద్రు
మంగళముపాడి వేడితి మాధవుండ!
నన్ను దయఁజూడుమా కరుణాలవాల!

విమలంబైన యనంగ సంగరవిధిన్
స్వేదంబు జాలొంద నా
ప్రమదంబందు రమాపయోధర పరీ
రంభోరు కాశ్మీర పం
కము వ్యక్తంబొనరించె నద్దుకొని రా
గంబట్టి గోవిందు వ
క్షము శ్రేయంబులు సంపదల్ వెలయ న
శ్రాంతంబుఁ జేకూర్చెడున్.

సులలిత మాధవీ కుసుమ
సుందరగాత్ర చయంబుతోడఁ గో
మల హృదయాంబుజాతయగు
మానిని రాధ వసంతవేళఁ గా
నల మదనజ్వరార్తిని బ
నార్దమునిన్ వెదకంగసాగ స
చ్చెలి చెలికత్తె కన్గొని వ
చించె మనోవ్యథ తీర నీగతిన్.

కలికీ! తెమ్మెరచే లవంగలత లూ
గన్‌సాగె నింపొప్పఁ గో
యిలలుం దుమ్మెద లెచ్చఁజేయురొద లెం
తేనిన్ బొదల్ కాముకా
వలి తూలన్ మధుమాససౌరభలతా
వాసంబులన్ గృష్ణుఁ డిం
పలరంగా జవరాండ్రఁ గూడెడుఁగదా!
యచ్చోటికిన్ బోదమా!

పరపుగఁ బూయు పూవుల సు
వాసనకున్ జెలరేగి భృంగముల్
సరసరవ్రాళి నిండి వకు
ళంబుల సల్పఁగ ఝుంకృతుల్ మనో
హరమగు నీవసంతమున
నంగనలన్ బ్రియు లత్తియుండమిన్
విరహముఁజెంద మాధవుఁడు
వేడుక నింతుల గూడి రంజిలున్.

క్రాసుగమ్రాఁకు లెల్లెడల
రక్తిమమౌ మృదుపల్లవాళితోఁ
గానఁగవచ్చి కస్తురి సు
గంధము గుప్పఁగ యౌవనోదయం
బూనిన కాంతలంచెనక
నొప్పిసమాయని గోళ్ళపోట్కొ న
క్కాసను బూయ మోదుగలు
కాంతలతో హరి కేళి సల్పెడున్.

స్మరుఁడనురాజు హస్తమున
మూసుగఁబూనిన దండమట్లు కే
సర సుమముల్ విరాజిలెడు
సౌరభపుల్ల లతాంత పాళిసం
చరదళిబాణ సంభృత ర
సాలము లా మరుతూరమోయసన్
వరలెడు నీవసంత విభ
వంబు గనన్ సఖి! హోళిఁగూర్చెడున్.

తమిఁ జెలరేఁగ సిగ్గిలక
తద్దయు గాసిలు కాముకావళిన్
సమయమెఱింగి నవ్వినటు
చక్కఁగఁబూసెను బొన్నగున్న లె
ల్లి. మొగలిపూవులందు మొన
లన్‌గనఁ గాముక వక్షముల్ విద
ల్చు మరు కటార్లుగా నెగడు
చుండె వసంతము చూడ వేడుకై.

మాలతి జాజి ప్రేంకణము
మాధవి మల్లెయు మొల్ల పెల్లుగాఁ
బూలనుబూసి వాసనలు
మూలల కంటఁగఁ జిమ్మ మౌనులై
కాలముఁ బుచ్చువారలకె
కామమెడఁదను రేఁపఁ బ్రేమతోఁ
దేలఁగనుండు జంటలకుఁ
దీయని జున్నె వసంతమెంతయున్.

చెలి వాసంతిక కౌఁగిటన్ దనరి సం
సిద్ధంబుగాఁదాల్ప మొ
గ్గల నెన్నింటినొ తీయమావి పులకల్
గైకొన్నయట్లొప్పి రం
జిలఁ జెంతన్ యమునాజలంబునను వా
సింగాంచు బృందావనీ
తలమందున్ విహరించుఁ గ్రుమ్మరు వసం
తంబందుఁ గన్గొంటివే.

పరిమళ కేతకీ కుసుమ
బాంధవ మాప్తిని గూర్చి దిద్దఁగా
నరవిరి మల్లె పుప్పొడుల
నంటి సుగంధము కాననంబునన్
వరలఁగఁజేసి మారునకుఁ
బ్రాణ సమానముగాఁ జెలంగు తె
మ్మెరలు వసంతవేళల భ్ర
మింపఁగఁజేసి మనంబు పేర్చెడున్.

తరితీపౌ మధువాను కోర్కె నళిబృం
దం బూపఁగాఁ జాతమం
జరులన్ గోకిల పల్లవంబులఁ గటు
స్వానంబు సల్పన్ శ్రమో
జ్జ్వరముం గూర్చి వసంత వాసరములన్
బాంఛల్ ప్రియా సంగమా
తుర చిత్తంబుల నెట్టులో గడపి పోఁ
ద్రోలంగనై రిత్తరిన్.

కనఁదగు నిండు సోయగపుఁ
గాంతల వేవుర సంభ్రమంబునన్
మొనయఁగఁజేసి కౌఁగిటకు
మోవి సుధారస మాని మేటి విం
దౌనరి విలాస లాలసత
నుండె నదే మనచెంతఁ జెచ్చెరన్
గనుమని పల్కి మెల్లన జ
నార్దను నెచ్చెలి చూపె రాధకున్.

(సశేషం)



# శ్రీరామనవమి

శ్రీమదాచార్య రఘునాథ చక్రవర్తి

చాంద్రమాన చైత్రశుద్ధ నవమి శ్రీరామనవమి. శ్రీరాముని జన్మనక్షత్రము పునర్వసు. అయితే పునర్వసు నక్షత్రము నవమినాడున్నా లేకున్నా నవమి ప్రధానంగా పరిగణించబడుతున్నది. వైష్ణవులు నక్షత్రమునకే ప్రాధాన్యమిచ్చి శ్రీరామనవమి జరుపుకుంటారు. చక్రవర్తి తిరుమఘనార్ తిరునక్షత్రం అని ఇది పేర్కొనబడుతున్నది. "చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళం" అని మంగళాశాసనములో పఠించబడుతున్నది.

జయంతి శబ్దము జన్మదినోత్సవ సందర్భమునను వర్ధంతి నిర్యాణతిథి సందర్భమునను వ్యవహరించబడుతున్నవి. నిర్యాణవిషయమున తిథి ప్రధానము. జననవిషయమున నక్షత్రము ప్రధానము. భీష్మైకాదశి మాఘశుద్ధ ఏకాదశి. ఇది తిథి ప్రధానముగా జరుపుకొనబడే వర్ధంతి. నృసింహజయంతి. కృష్ణజయంతి అని మనము జయంతులను కూడా జరుపుకొంటున్నాము.

రామశబ్దవాచ్యులు ముగ్గురున్నారు. అందు పరశురాముడు ప్రథముడు. పరశురామజయంతి పంచాంగకర్తలచే పరిగణింపబడుచున్నది. రెండవవాడు శ్రీరాముడు. శ్రీరామనవమి అనియే వ్యవహరింపబడుచున్నది. కాని శ్రీరామజయంతి అనబడుట లేదు. మూడవవాడు బలరాముడు. బలరాముని ఉత్సవము ఆచరణలో లేదు.

వాస్తవమునకు శ్రీరాముని పుట్టినరోజు పండుగ చైత్రశుద్ధనవమినాడు జరుపుకొనవలసియుండగా కల్యాణోత్సవము ఆనాడే జరుపబడుచున్నది. పుట్టినరోజుననే వివాహ మహోత్సవము సమంజసమేనా అని ఇప్పట్టున ఒక శంక బయలుదేరినది. శ్రీరామజయంతి అని పేర్కొనక శ్రీరామనవమి అని ఈ పర్వమును వ్యవహరించుటచే కల్యాణమునకు ఆస్కారము కలిగినది.

నృసింహ జయంతినాడు నృసింహస్వామి కల్యాణోత్సవము జరుగుటలేదు. దీనికి యాదగిరి నృసింహస్వామి కల్యాణమే తార్కాణము.

అవతారక్రమానుసారము రామకృష్ణాది నామములతో వ్యవహరింపబడుచున్న శ్రీమన్నారాయణుడు అందరికిని ఉపాస్యుడే. కాని శ్రీరాముడు తెలుగు ప్రజలకు విశేషించి ఆరాధ్యదైవతముగా వెలసియున్నాడు. తెలుగునాట ఉన్నన్ని రామాలయములు, రామమందిరములు, రామభజనమండలులు అన్యత్ర లేవు. రామకోటి లేఖకులుకూడా తెలుగునాటనే ఎక్కువమంది ఉన్నారు.

శ్రీరామనవమి ఉత్సవము మన వీరపూజకు చిహ్నము. శ్రీరాముడు పట్టాభిషిక్తుడైన పరిపాలకుడు. రామరాజ్యము అనే ప్రశస్తికి అస్పదమైనవాడు. కృష్ణుడు పరిపాలకుడుగా వ్యవహరించలేదు. ఆదర్శపురుషుడుగా ఎన్నిక గన్నవాడు శ్రీరాముడు.

మత సామరస్య విషయమునకుకూడ శ్రీరామనవమి ఒక విశిష్టతను కలిగి యున్నది. పరమశివుడు పార్వతికి తారకమంత్రోపదేశము చేసినట్లు పురాణములయందు చూచుచున్నాము. మహాశివుడు రామమంత్రమును మహామంత్రముగా పునశ్చరణచేసినట్లు విదితమగుచున్నది. వీరశైవులకుకూడ ఈ విషయమున విప్రతిపత్తి యుండదు.

శ్రీరాముడు రావణాసుర సంహారముచేసి తిరిగి వచ్చునపుడు శివలింగప్రతిష్ఠాపనచేసినట్లు ఐతిహ్యము కలదు. ఆ పుణ్యక్షేత్రమునకు రామేశ్వరము అని

పేరు. ఆచటిస్వామి రామలింగేశ్వరస్వామి. ఇది వీరవైష్ణవులు ఆమోదించజాలరు. ఆమోదించక పోయినను ఇది కప్పిపుచ్చరాని సత్యము.

శివరాత్రి ఎట్టి పర్వదినమో శ్రీరామనవమియు అట్టి పర్వదినమే. శ్రీరామనవమినాడుకూడా ఉపవాసాదికములు కల్పగ్రంథములందు చెప్పబడినవి. శ్రీరామనవమినాడు ఉపవసించి మరుదినము స్వర్ణమయ శ్రీరామప్రతిమను దానముచేసి, పారణము జరుపుకొనవలెనని చెప్పబడుచున్నది.

శ్రీరామనవమి ఉత్సవము ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమున ఎన్నిచోట్ల, ఎంతమందిచే ఎన్ని విధముల చేయబడుచున్నదో అట్లు మరే ఉత్సవమును తెలుగునాట ఆచరించబడుట లేదు. ఇది అనుభవపునరుక్తమే కాగలదు. నేడు మన భారతప్రభుత్వము రామరాజ్యస్థాపనకై యే పరిపరివిధముల పర్యాలోచనచేయుచున్నది.

ఇది జాతీయమైన పర్వదినము. ఆసేతు శీతాచలము విస్తరించినది శ్రీరామచరిత్ర. సరస్వతి భూలోకమున ప్రప్రథమముగా పాదముమోపినది ఈ శ్రీరామచరిత్రనుబట్టియే. ఆదికవియైన వాల్మీకికి అజరామరమైన కీర్తిని తెచ్చినది కథానాయకుడైన శ్రీరాముని గుణపౌష్కల్యమే. నేటికిని వాఙ్మయమున అధికసంఖ్యలోనున్న గ్రంథములు శ్రీరామునికి సంబంధించినవే. పండితపామరసాధారణ్యేన కీర్తింపబడునది శ్రీరామప్రసంగమే. గేయప్రబంధమునకూడ శ్రీరామకీర్తనమే అగ్రస్థానము వహించి యున్నది. త్యాగరాజు ఏతత్ కీర్తనచే శాశ్వతకీర్తిని బడసి యున్నాడు. ఇట్టి మహాపురుషుని ఉత్సవము మనకు సర్వాత్మనా ఆచరణీయమైనది.



# భరతుడు

మూలం :
శ్రీ పి. సీతారామయ్య

అనువాదం :
శ్రీ మధిర భానుమూర్తి

భారతదేశపు పురాణ గ్రంథములలో ముఖ్యమైనదగు రామాయణమునగల పాత్ర లన్నింటిలోను నిర్మలముగను, నిర్దుష్టముగను నుండి ప్రకాశించుచున్న పాత్ర భరతునిదేనని నా నమ్మిక. భరతుడు రామాయణమునందలి వారిలోకెల్ల ఆదర్శప్రాయుడు.

మహా భారతములోవలెనే రామాయణములో కూడ శ్రీరాముడు అక్కడక్కడ మనము ధర్మపథ మనుకొనుదానినుండి మారినట్లు కనుపించును. ఆదికవి కావలెననే అట్లు చేసినాడని అనిపించును. కానిచో రాముని కేవలము అవతారపురుషునిగనే చిత్రించినచో, సామాన్య మానవుడు ఆయననుచూచి, 'ఆయన అవతార పురుషుడుగనుక అట్లు చేయగలిగినాడు. మానవ మాత్రులమగు మనకు అట్టి ఘనకార్యములను సాధించుట సాధ్యపడదు. కనుక ఆయనను ఆదర్శపురుషుడుగ పెట్టుకొనివ్యవహరించుట మనకు కానిపని' అని అనుకొను అవకాశము గలదని ఆదికవి గ్రహించగలిగెను.

కనుకనే భగవానుడగు వాల్మీకి "చెట్టుచాటునుండి వాలిని వధించుట, మండోదరినుండి బ్రహ్మ మంత్రమును సంపాదించి రావణుని సంహరించుట" మొదలగునవి కల్పించినాడు. అట్టి శ్రీ మహావిష్ణువు అవతారముగనున్న శ్రీరాముని మానవ మాత్రునిగ చేయును.

కాని భరతుని విషయము దీనికి సరిగా వ్యతిరేకముగ నున్నది. వాల్మీకి తన శిల్పనైపుణిచే కేవల సోదరమాత్రుడుగనున్న భరతుని మానవాతీతుడుగ భాసించునంతటి ఉన్నతస్థానమునకు తెచ్చెను.

కనుక సామాన్య మానవునకు భరతుడు ఆదర్శప్రాయుడుగ కనుపించును. భరతునిపట్ల సానుభూతి కూడ హెచ్చుగనే ఉండును. భరతుడు రామునకు తమ్ముడు. శ్రీరామునివలె ఆతడు రాక్షస సంహారము చేసియుండలేదు. అతడు పరాక్రమ విశేషాదులకు కూడ పేరు వడసినవాడు కాదు. కాని అతడు సద్గుణములరాశి.

అతనికిగల అవకాశములలో అవి పరిమితమే అయినప్పటికీ అతడు రాముని ఎడల మిక్కుటమగు సోదరప్రేమను ప్రదర్శించెను. ధర్మ పరిపాలనా దక్షుడని ఋజువు చేసుకొనెను. అతడు నిజమైన కర్మయోగి అయి యోగిపుంగవులలో అగ్రగామి అనిపించుకొనెను.

లక్ష్మణుడు పదునాలుగు సంవత్సరములు నిద్రాహారములను కూడ లెక్కచెయ్యకుండ ఎన్ని కష్టములు వచ్చినను ధైర్యముగ నెదుర్కొనుచు శ్రీరామునితో అడవులకు వెళ్ళి, ఇంద్రజిత్తును సంహరించినాడు. కాని అతని కప్పుడప్పుడు కల్గు క్షణికోద్రేకములను చూసిన కొంచెము వెగటుగనే ఉండును. శ్రీరాముని వనవాసమునకు పొమ్మని శాసించినప్పుడు దశరథుని తూలనాడిన విధమును, చిత్రకూటమువద్ద భరతుని గాంచినప్పుడు అతనికి నీచమగు ఉద్దేశముల నాపాదించుటయును ఇట్టివే. కాని వానిని సరిదిద్దుట కెల్లప్పుడును శ్రీరాముడే కలడు.

మరి భరతుని విషయమో ? శ్రీరాముని వనవాసమునకు పంపునపుడు భరతు డచ్చట ఉన్నచో

శ్రీరామునితో అరణ్యములకు కాదు, యుగాంతము వరకైనను అనుసరించిపోవుట కతడు వెనుకాడెడి వాడు కాదు. తరువాత అతడు ప్రదర్శించిన త్యాగ శీలము, తనకై నిక్షేపించబడిన భోగ భాగ్యముల నిరసించుట దీనికి తార్కాణములు. నిజమునకు రామాయణగాథయే మారిపోయెడిది. తన కొసగ బడిన రాజ్యాధికారమును, సింహాసనమును కాలదన్ని, రామునకు బదులుగ తానే అరణ్యమున కేగుటకు సిద్ధపడి దశరథుని ప్రాణములను గూడ కాపాడి యుండెడి వాడు. అప్పుడు మనకు రామాయణము గాక మరొక మహాభారతమే సాక్షాత్కరించెడిది. కాని విధి వశమువల్ల అయోధ్యలో జరిగిన దుర్మంత్ర మును గాని, తత్ఫలితమగు విషాద సంఘటనలను గాని భరతుడు ఎరుగడాయె.

భరతుడు అయోధ్యను ప్రవేశించుసరికి ఆ నగరము తన ప్రియునిచే పరిత్యజింపబడిన స్త్రీవలె నున్నది. నగరమందెచ్చటను సంతోష చిహ్నము లేమాత్ర మును లేకపోయె. రాచబాట లన్నియు నిర్మానుష్య ముగ నుండి విషాదచ్ఛాయలు నగరమందంతటను దట్టముగా అలముకొనినట్లు అగుపించెను. వెంటనే తన తండ్రి మందిరమును ప్రవేశించి, అందెవరును లేకుండుటను గాంచి క్షుభిత మనస్కుడాయెను.

తెలియని ఆవేదనతో నిండిన హృదయముతో అతడు తన తల్లివద్దకు పరుగెత్తగా, ఆమె తనపుట్టిన ఇంటివారి క్షేమసమాచారములను అడిగెను. కాని భరతునకు ఆవేదన హెచ్చుటచే దశరథ మహారాజు గారి క్షేమ సమాచారము లడుగును. దశరథుని మరణ వార్త కైకేయి నోటవిన్న భరతునకు పిడుగు పడి నట్లయినది. తండ్రి తరువాత తండ్రి యంతటివాడగు శ్రీరాముని గురించి తరువాత ప్రశ్నించెను. ఈరెండు విషాద సంఘటనలను గురించి విని, తన తల్లి దుర్మంత్రమును గుర్తెరిగిన భరతునకు గుండె బ్రద్ద లయినంతపని అయినది. వెంటనే మూర్ఛపోయినాడు.

స్పృహ వచ్చుసరికి అతడి శరీరమంతయు మితి మీరిన కోపముతో కంపింపసాగినది. కోపము, అస హ్యము, విచారము, జాలి, ఇవన్నియు అతని మానసమున సంఘర్షణకు లోనయినవి. ఇంతటి దుష్పరిణామములకు తానే కారకుడన్న విషయము అతనిని సిగ్గుతో క్రుంగదీస్తున్నది. ఎడతెగని ధైర్య సాహసాలతో తన క్రోధమును అణచుకొనుటకు ప్రయత్నించెను. కాని అతని భాషణములు అతని చెప్పుచేతలలో లేకపోయినవి. "నీ దుర్మంత్రము నా తండ్రిని బలిగొన్నది. నా అనుంగు సోదరుడగు శ్రీరామచంద్రుని వనవాసమున కంపినది. ఇంతచేసి నది చాలక ఇదొక ఘనవిజయముగ సగర్వముగ చెప్పుకొనుచున్న నీ పాపిష్ఠి నాల్కను ఇంకను నేను కోయలేక పోవుచున్నానే! నన్నుకూడ ఈ దుర్మంత్ర మున భాగస్వామినయి నా సోదరునిదగు రాజ్యాధి కారమును చేజిక్కించుకొనమనుచున్నావా? పాపిష్ఠి దానా!...." అనినాడు. "ధర్మమింకా నశించలేదు. దుర్మార్గములకు భరతవాక్యము ధర్మస్థాపనమే కాగలదు." అంటూ అరిచినాడు.

ఆకస్మికముగ అందిన ఆ అధికారమును, భోగ భాగ్యములను మరెవరైనను అయినచో కిమ్మనకుండా అపరిమితమగు ఆనందముతో పుచ్చుకొని ఉండెడి వారే! ఆ పరిస్థితులలో సింహాసనాధిపత్యము వహిం చుట భరతునిపట్ల శాస్త్రసమ్మతమైనదే. అతని తల్లి రెండు వరములలో నొకటైన 'భరతుని అయోధ్యకు పట్టాభిషిక్తుని జేయుట' అను దానివలన అది అతని తల్లినుండి సంక్రమించినట్లే! అందువల్ల అతడు నిస్సంకోచంగాను, ధర్మబద్ధంగాను రాజయే అవ కాశం ఉంది.

కాని దానిని సాధించుట కుపయోగించిన మార్గము ధర్మబద్ధమైనది కాకపోవుటచే అతడు దానిని చేపట్టుట కంగీకరించలేదు.

ఏ కార్యమునైనను సాధించుటకంటె సాధించుట కనుసరించినట్టి మార్గములకే ఎక్కువ ప్రాధాన్యము నీయవలెనని ప్రప్రథమముగ ప్రపంచమునకు చాటి చెప్పినవాడు భరతుడే. భారత సాంప్రదాయపు

ప్రత్యేకత అయిన ఈ ఆత్మార్పణ మానవచరిత్రలో సాటిలేని దనవచ్చును.

సుమారు మూడు వేల సంవత్సరముల తరువాత తిరిగి ఈ నాటికి మన దేశమున గాంధీమహాత్మ డుద్భవించి అదే సత్యమును చాటిచెప్పెను. భరతుని వలెనే ఆయన గూడ చెడుమార్గముల ద్వారా సాధించిన విజయములకు శాశ్వతత్వ ముండదని చెప్పెను. తనకై సంపాదించబడిన అదికారము, భాగ్యము దుష్పథముల నవలంబించి సాధించినవే నని భరతు డెరుగును. అందువల్లనే ఆ ప్రసక్తి వచ్చిన వెంటనే ఆ తుచ్ఛభోగములను నిరసించెను.

భరతుని ఆత్మనింద కూడ గణనీయమైనదే. తన తల్లిని వదలి, వెంటనే కౌసల్యవద్దకు వెళ్ళెను. విషాదపూరితమగు ఆమె ముఖమును చూచినంతనే అతనికి ఎక్కువగు విచారము కలిగినది. వెక్కి వెక్కి ఏడ్చుచు ఆమె పాదములపై పడి, "ఓ! తల్లీ! నీచుడగు ఈ కొడుకు నీ ఆశీర్వచనముల నపేక్షించుచున్నాడు....ఇంతటి దుర్మార్గమున కొడి గట్టిన ఆ మహాపాపి, ఆమె పాపఫలితముగ ఈ పాటికి మరణించవలసినదే! కాని ఆ పాపిష్టిదాని కడుపున పుట్టిన నే నింకను నీచుడనయ్యెను ఇంత వరకును మరణించక బ్రతికియుండి ఆమె మరణము నెట్లు కోరగలను?...." తీరని వ్యథతో కుమిలిపోవు చున్న భరతుని గుండెలు పగిలి ముక్కలయి నెత్తురు కారుచున్న ట్లుండెను. "జగమునందలి చీకట్లను బాపి వెలుగునిచ్చు సూర్యభగవానుని వంశమున నేటికి భరతు డను విషబీజ ముద్భవించెను. భరతుడు - అబ్బ! - ఆ పేరు తలచుకొనుట కూడ సిగ్గేకదా! మాతా! నేను అసలు ఎందుకు పుట్టినట్లు?...." అని ఆవేశముతో పలికినాడు భరతుడు.

అంతకంటె ఉత్తముడగు పుత్రుడు గాని, ఘను డగు యువరాజు గాని, ప్రేమానురాగములు గల సోదరుడు గాని ఉండునా? ఆ క్షణమునం దాతనికి మానసిక సంఘర్షణ హెచ్చుగా నున్నది. తన క్షేమాత్రము తెలియకుండగనే, అయోధ్యలో జరిగిన ఘోర విషాదసంఘటనల కన్నింటికిని తానే కారకుడు కావలసివచ్చెనన్న తలంపే అతనిని దహించివేయు చున్నది.

అతని విచారము, జాలి ఎంతటి కఠినహృదయము నైనను కదలింపగలవు. ఇక మృదువగు హృదయము గల కౌసల్య మాట చెప్పవలెనా? భరతుని నిజాయి తీని గురించి తొలుత నామెకు కొన్ని సందేహము లున్నప్పటికిని, త్వరితముగనే అవన్నియు మాయ మైనవి. వెంటనే ఆమె అతనిని అక్కున జేర్చికొని ఆలింగనము చేసినది. అప్పు డతనిని ఘనముగ శ్లాఘించినది. "కుమారా! నీవు యువరాజలోకము నకు మణిపూసవు. నీ వంశమున ఇంతవరకు నీవంటి ఉత్తముడు జన్మించియుండలేదు." అనినది. ఈ ప్రస్తుతి శ్రీరాముని తల్లియగు కౌసల్య చేసిన దనునది గమనార్హము.

నిద్రాహారములు, ఒరులతో మాటలాడుటయు మానుకుని వెర్రివానివలె తిరుగాడు భరతుని జూచి రాణులు, మంత్రులు, వశిష్ఠమహర్షి మొదలగు వారందరు ఖంగారుపడిరి. వారందరు తక్షణమే సమావేశమైరి. తండ్రి మరణించుటచేతను, అగ్రజుడు వనవాసమున కేగియుండుటచేతను భరతుడు రాజ్య భారము వహించవలసి యున్నదని ధర్మములును, శాస్త్రములును చెప్పుచున్నవని వశిష్ఠుడు పెక్కురీతుల చెప్పిచూచెను. కాని భరతు డా మాటల నంగీకరింప డాయె! అతనికి ఆ రాజ్యాధికారమిచ్చి పరిపాలించు మనుట పాత్రనిండా విషము నిచ్చి, దానిని త్రాగి మరణించమనినట్లున్నదట.

వెంటనే తాను అడవులకుపోయి శ్రీరాముని తీసుకువచ్చి అతనికి పట్టాభిషేకము చేసెదనని చెప్పినాడు. అది జరుగనిచో తానుకూడ అరణ్యము లకు పోవుటగాని, ప్రాణత్యాగము చేయుటగాని చేయుదుననెను. భరతుని ఉదాత్తమగు గుణములు, ధైర్యసాహసములు, కార్యదీక్ష సాటిలేనివి. వాటిని గాంచి అచటివారందరు సంతోషించిరి. "ఓ! యువ రాజా! నీవు ఉత్తముడవు. నీకు కిరీటముగాని, ఘన

కృతఘ్నుడనుగాని అవసరములేదు. ఈ పదునాలుగు లోకములు అంతరించిపోయినను నీకీర్తిచంద్రికలు శాశ్వతముగ ప్రకాశింపగలిగినదే!" అని కొని యాడిరి.

అప్పుడు భరతుడు సపరివారముగ చిత్రకూటము నకుపోయి రాముని అయోధ్యకు కొనితెచ్చుటకై బయలుదేరెను. అతని పరివారమందంతయును అశ్వములు, గజములు మొదలగు వాహనములపై ఎక్కి యుండగా అతడు కాలినడకనే బయలుదేరెను. సోదరునిపట్ల భక్తి గౌరవములు, వినయ విధేయత యను అట్టివి. శ్రీరాముడు వనవాసమునకు నడచి వెళ్ళగా తానెట్లు వాహనారూఢుడై పోగలడు?

శృంగవరము గంగాతీరమును జేరి సుమంత్రుడు గుహుని గురించి భరతునకుచెప్పి, రామునకు గుహుడు సహాయముచేసిన విధాన మెరిగించెను. వెంటనే తనసైన్యము నక్కడనే నిలిపి గుహుని కలుసుకొనుటకై భరతుడేగెను. దూరమునుండి భరతునిచూసి అతడు రాముని తమ్ముడు వచ్చినాడని భ్రమించిన గుహుడు భరతుని ముఖమంతయు విషాదరేఖాచ్ఛాదితమై యుండుటజూచి, అతడు ధరించిన కాషాయ వస్త్రములను, చిక్కులుపడి జడలుకట్టిన శిరోజములను చూచిన వెంటనే తన చేతనున్న ధనుర్బాణములను వదలివేసెను.

గుహుడింకా భరతుని అభినందించకముందే భరతుడతనికి సాష్టాంగపడి నమస్కరించెను. తన తల్లి శ్రీరామునకు అన్యాయము చెయ్యగా, గుహు డాయనకు అవసర సమయమున సహాయము చేసె నని భరతునకు గుహుడనిన గౌరవ భావము. భరతుడు రాముని వెదకుచు వచ్చుటకుగల కారణము విని, అతని ఔదార్యమున కచ్చెరువంది కృతజ్ఞతా పూర్వకముగ భరతునకు గుహుడు నమస్కరించెను. "మహా సామ్రాజ్యాధికారము నిన్ను వెదుకుకొనుచు వచ్చినది. అదొక అంటరాని మహాపాప మన్నట్లు నీవు దానిని విసర్జించితివి. నీ వదనమందు విషాద రేఖలు సుస్పష్టముగ కనుపించుచున్నవి. ఓ యువ రాజా! నీ ఘనత వెయ్యిమంది శ్రీరాములకన్నను మిన్నయైనది! నామాట నమ్ముము!" అనెను.

గుహునివద్ద సెలవుతీసుకుని భరతుడు భరద్వాజుని ఆశ్రమమును చేరెను. శోకమూర్తివలెనున్న భరతుని రూపమునుచూసి ఆ మహర్షి చలించెను. భరతుని అభిప్రాయము తెలిసిన తరువాత ఆ మహర్షి సంతో షమునకు మితిలేదు: "ఋషులనేకములగు కష్టతర ములగు పద్ధతుల నవలంబించియు సాధించలేని కర్మ యోగిత్వమును, ఆత్మనిగ్రహమును నీవు ప్రేమవలన సాధించగలిగినావు. నీ జన్మధన్యము!" అని మెచ్చి నాడు.

ఇది భగవంతునికే ఒక విషమ పరీక్ష అయినది. వారికొక క్రొత్త సమస్య ఎదురైనది. భరతునికి శ్రీరాముని ఎడల భక్తి విశేషము ఎక్కువగా నుండు టచే అతడు రాముని అయోధ్య తిరిగి తెచ్చుటను సాధించగలుగునేమో!...అప్పుడు విష్ణువు అవతార మెత్తినందుకు వలయు ఫలితము లభించదేమో! రావణుని ఈ ముల్లోకములలో జయించగలవ్యక్తి శ్రీరాముడేగాని ఇంకెవరును లేరు. అందువలన, ఆ మహర్షిపరంగా దేవత లొక గొప్ప విందు నేర్పాటు చేసిరి. కడురమ్యమైనవి, ఆకర్షవంతమైనవి అగు అనేక వస్తు విశేషములు, ఆభరణములు, దుస్తులు, భవనములు అసంఖ్యాకముగ ఏర్పాటు చేయ బడినవి. వీటన్నిటి సహాయమున భరతునిదృష్టి రామునికై చేయుచున్న అన్వేషణనుండి మరల్చవలె నని వారి యభిప్రాయము.

కాని, అదంతయు ముగిసిన తర్వాత ఆమహర్షికి అభివందనములు తెల్పి, తన లక్ష్యమగు రామాన్వేష ణకై చిత్రకూటము దిశగా భరతుడేగుటను గాంచిన దేవతలు నిరాశపడక తప్పలేదు.

అనుక్షణము జాగ్రదవస్థలోనుండు లక్ష్మణుడు భరతుడు నాయకుడుగా వచ్చుచున్న సైన్యమును చూచినాడు. వెంటనే ఆ విషయము శ్రీరామునకు తెల్పినాడు. భరతుడు తలపెట్టిన దుర్మార్గము, వాని అహంభావముచూచి కోపోద్రిక్తుడయినాడు. భరతు

నితో యుద్ధముచేయుట కనుమతించమని రాముని వేడుకొనినాడు. భరతుని, అతనిసైన్యమును తుత్తుని యలుచేసి,రాముని సింహాసనమునధిష్ఠింపజేతుననెను. లక్ష్మణుడు రాముని ఎడలగల ప్రేమాతిశయము చేతనే అట్లనుచున్నాడని రామునకు తెలియును. కొంచెము ఓరిమి వహించమని చెప్పను. ఘనమైన దగు రఘువంశమున జన్మించిన భరతునకట్టి నీచ మగు అభిప్రాయముల నాపాదించుట తగదని నచ్చ చెప్పెను.

శ్రీరాముడు, భరతుడు ఒండొరులను కలుసు కొను సమయము చాల ముఖ్యమైనది. భరతుని వేషము, శిరోజములు, తన దేహమునందైనను శ్రద్ధలేని ధోరణిని చూసి, మూర్తీభవించిన శోకమో అను నట్లున్న భరతుని రూపమును చూసి శ్రీరాముడు చాల బాధపడెను. లక్ష్మణుడు ఎక్కువగ సిగ్గుపడెను. తల వంచుకొనెను. విచారము, సంతోషము, ఆత్మ నిరసన-అను మూడు భావములు ముప్పిరిగొని భరతు నిలో ప్రస్ఫుటముగా కనుపించినవి. "ఓ! రామా! నన్ను మన్నింపుము! నీవు సింహాసనము నేల వదలితివి?" అని అడిగెను. అంతవరకు వచ్చుసరికి ఉద్రేక మెక్కువయి రామునిపాదసన్నిధిని వ్రాలినాడు భరతుడు.

రాముడు కూడ ఇంచుమించు అట్టి స్థితిలోనే ఉన్నాడు. తన తమ్ముని లేవనెత్తి గాఢాలింగ నమున బంధించినాడు. "అమాయకమూర్తి, దయా సముద్రుడు."

దశరథుని మరణవార్త వా రందరిని దుఃఖమున ముంచును. సోదరు లందరు కర్మకాండ పూర్తిచేసిన తరువాత రాముని అయోధ్యకు రమ్మని భరతుడు కోరును, చాలా వాదించిన తరువాత తాను రామునకు ప్రతినిధిగా నుండి, అయోధ్యలో పరిపాలన చేయుదు నని, పదునాల్గేండ్లయిన తరువాత రాముడు అయో ధ్యకు తిరిగి రానిచో తాను అగ్నిప్రవేశము చేసి ప్రాణత్యాగము చేయుదుననియు భరతుడు ప్రమా ణము చేసెను. భరతుని చిత్తస్థైర్యము నెరిగిన రాముడు దానికి అంగీకరించెను.

అప్పుడు భరతుడు రాముని పాదుకలను కోరగా ఆతడు వెంటనే యిచ్చెను. భరతుడా పాదుకలను శిరమునధరించి 'ఇదే నా కిరీటము!' అని శ్రీరాముని పాదములకు మ్రొక్కెను.

అందరివద్ద సెలవు తీసుకొని, శ్రీరామ పాదుక లను శిరమున నిడుకొని, పాదచారియై బయలు దేరెను. వానిని సింహాసనముపై నుంచి మణిమయ రత్నఖచిత చీనిచీనాంబర పరివేష్టితను గావించెను. దానికి బంగారపు చత్రమును గూడ చేయించెను.

తను మాత్రము చెట్లబెరడులనే వస్త్రములుగ ధరించి, నేలపై పరుండెను. ఆ విధముగ అచంచల మగు భక్తితోను, అసామాన్యమగు కీర్తి ప్రతిష్ఠల తోను దైవాంశ సంభూతుడగు భరతుడు పదునాలు గేండ్లు పరిపాలించెను.

(" *Bhavan's Journal* " పత్రిక సౌజన్యంతో)



# కర్మసిద్ధాంతము

# 2

శ్రీ జటావల్లభుల పురుషోత్తము, ఎం. ఏ.

జీవు డీదేహమును విడిచి వెళ్ళునపుడు తానిదివఱకు చేసికొన్న సమస్త కర్మలను సూక్ష్మ రూపములో తనతో తీసికొనిపోవును. ఏకర్మ యెపుడే రీతిగా ఫలింపవలయునో అది యపుడట్లు ఫలించును. మనోవాక్కాయములలో దేనితో చేయబడిన కర్మనైనను మనస్సనుభవింపవలసి యుండును. కేవలము మనస్సుచేతనే యనుభవించవలసి యుండును. వాక్కుచేత చేయబడిన దుష్టకర్మయొక్క ఫలము ఇతరులు మనలనుగురించి కఠినోక్తులాడుట మున్నగు వానిచే కల్గును. అట్లే వాక్కృతమైన సత్కర్మయు వాక్కు మూలముననే అనుభవమునకు వచ్చును. శరీరముతోచేసిన కర్మ శరీరముచేతను మనస్సుచేతను అనుభవింపవలసి యుండును. కేవల మానసిక కర్మలు మనోరంగముననే యనుభూతికి వచ్చును. ఇది సామాన్యనియమము. స్వల్పములైన మార్పులతో నీ నియమ మెల్లప్పుడును వర్తించును. స్థూల శరీరములతో చేసిన పుణ్య పాపములు మనకుండుటచే జన్మాంతరము తప్పనిసరి యగుచున్నది. సూక్ష్మ శరీరముచేతను, యాతనాశరీరముచేతను అనుభవింపవలసిన పుణ్యపాపఫలములు కొన్ని పరలోకములలో ననుభవమునకు వచ్చును.

కర్మసిద్ధాంతములో మనస్సునకుగల ప్రభావమును మరొక విధముగాకూడ మనము గ్రహించుకొనవలసి యున్నది. అన్నదాన మను పుణ్యకార్యమును ఒక ధనికుడును. ఒక పేదవాడును చేయవచ్చును. ధనికుడిడినంత రుచ్యాన్నమును పేదవాడిడజాలక పోవచ్చును. ఫలము అన్నముయొక్క రుచ్యత్వమునుబట్టియే యుండదు. మరొకడు తాను తినుటకు చాలినంత లేకపోయినను అందు కొంత క్షుద్బాధితుని కిడును. వీనికి పైయిద్దరికంటె గొప్ప ఫలము వచ్చును. కర్మ యంతయు పాంచభౌతిక దృశ్య ప్రపంచమునకు సంబంధించినదేయని పైకి కన్పట్టినను దాని సంపర్కము మనోమయ కోశమునకే హెచ్చుగా కలదని బహు విధముల నిరూపితమగుచునేయున్నది.

మనోవాక్కాయముల సమన్వయము సహజము; వీని అన్వయము కృత్రిమము. మనసులోని భావమునకనుగుణముగా వాక్కు ఆవిష్కారమగును ;మానసిక స్పందనమున కనుగుణమైన స్పందనము శరీరముపై కన్పట్టును. ఒకప్పుడు మనస్సులో నొకటి తలచి పైకి మరొకటి చెప్పుటయు, మఱొకటి చేయుటయు సంభవింపవచ్చును, కాని యిట్టి మాటయు చేతయు కూడమానసికస్పందనమునకు అనుకూలములైనవే. ఆ మానసికస్పందనము మొదటిది కాదు; తర్వాత నేర్పడినది. ఒకనికి నీ వపకారము చేయదలతువు, వానితో నీ కుపకారము చేయుదునని చెప్పుదువు. ఈ అనన్వయమునకు కారణము ; అపకారము చేయదలచిన భావమునకు తర్వాత మరొక భావము నీ మనస్సులో కల్గినది. ఉపకారము చేయదలచుచున్నానని వీనితో చెప్పవలయుననునది యీ భావముయొక్క స్వరూపము. కావున ఉపకారము చేయుదునని నీవు చెప్పిన మాట మొదటి భావమున కనుగుణముగ లేకపోయినను రెండవసారి బయలుదేరిన మానసిక భావమునకు అనుగుణముగనే యున్నది.

అట్లే వాగ్విషయము. మనస్స్వభావమును సంకల్పించునో తదనుగుణముగా ధ్వని వైకివచ్చు యంత్ర నిర్మాణమున శరీరములో ఉన్నది. కావున నిచట దోషమంతయు మనస్సుదే.

మానసికభావమే శరీర చేష్టారూపమును పొందును. మనస్సులో నొకటి పెట్టుకొని పైకి మరొక రీతిగా వర్తించువారెల్లరు మనస్సునకు వ్యతిరేకముగా సంచరించుచున్నారని యర్థముకాదని చూచియున్నాము. ఆ మనస్సే తన స్వరూపమొకటై యుండగా మరొక రీతిగా పైకి కన్పట్టవలయునని తలంచినది. దాని కనుకూలముగా చేష్ట పైకి వచ్చుచున్నది. ఈ చేష్ట పూర్తిగా మనోభావము యొక్క ప్రతిబింబమే.

ఈ రీతిగా వాక్కులో కాని, శారీరచేష్టలలో కాని దోషములుగా కన్పట్టున వన్నియు మనస్సులోని దోషములే యగుచున్నవి.

ఎంత అప్రయత్నోద్భూతముగా పైకి కన్పట్టు శారీరక చలనమునకైనను కారణము మనస్సులో ఆ చలనము గలుగవలయునను సంకల్పమే యనునది ముఖ్యవిషయము. ఎవరైనను మన ముఖముమీదకు చేయిని ఎత్తుచో రెప్పలు మూతపడును. నేత్రములు సున్నితము లగుటచే వానికి దెబ్బ తగులకుండ చూచుకొనవలయునను సంకల్పము మన మనస్సులో బయలుదేరుటచే తత్ఫలితముగా కన్నులు మూతపడుట క్షణములో సంభవించును. అంతట నా మానసిక సంకల్పము బయలుదేరినదని కూడ మనము గుర్తింపజాలము. వానంతనవియే కన్నులు మూతపడుచున్నవని తలంతుము. మానసిక కర్మలే కాక వాచిక శారీరకకర్మలుకూడ మనస్సులోనే ఉత్పన్నమై పైకి ఆవిష్కరింప బడుచున్నవి. ఈ కారణముచేతనే మనోవాక్కాయ కర్మలన్నియు తమ ముద్రను మనస్సుమీద విడుచుటయే కాక పరిణామమును లేదా లయమును కూడ మనస్సులోనే పొందుచున్నవని చెప్పవలయును. ఉత్పత్తియెచ్చటనో లయమచ్చట నమనది తర్కశాస్త్ర సమ్మతమైన సిద్ధాంతము. మట్టితో కుండ చేయబడినది. కుండ పగులుచో మట్టియే యగును. అట్లే సమస్త కర్మలు ఏ మనస్సునుండి వచ్చినవో ఆ మనస్సులోనే యవి యన్నియు తమ పరిణామమును గల్గియున్నవి. అనగా సమస్త కర్మల ఫలితము మానసికరంగము మీద కన్పట్టును.

ఈ రీతిగా సమస్తమునకు కర్తయైన మనస్సే కర్మఫలానుభవమును కూడ గల్గియున్నది.

కర్మఫలమవశ్య మనుభవింపవలసి యున్నందున సుఖప్రాప్తికికాని దుఃఖనివారణమునకుకాని ప్రయత్నించుట వ్యర్థమని తలంపరాదు. ఎందువల్లననగా: ఏజన్మలోనో చేసికొన్న కర్మకే ఫలము అనివార్యముగా నుండునపుడు ఈజన్మలో చేయుచున్న కర్మకు ఫలముండదనుట అర్థములేనిమాట. ఒక వస్తువు తినుటవలన కడుపులో నొప్పివచ్చుట సంభవించుచో మరొక వస్తువు తినుటవలన నా నొప్పి పోవుట సంభవింపదనుటకు వీలులేదు. ఒకడు దారిద్ర్యముతో బాధపడుతున్నచో అది వాని కర్మమని తలచి తన్నివారణమునకు యత్నింపరాదనుట శాస్త్రమునకు యుక్తికిని కూడ విరుద్ధము. అదివఱకు [illegible]సుపడిన బాధ ప్రారబ్ధమే యైనను, పురుషకారము[illegible]న నది తగ్గుచో ప్రారబ్ధమంతతో నంతమైనదని యర్థము. పురుషకారమేజరిగి యుండనిచో క్షయానంతరముకూడ దారిద్ర్యానుభవముండునని యూహించుటలో తప్పు లేదు. అట్లు కాదేని విధినిషేధాత్మకమైన శాస్త్రమునకు వైరుధ్యమేర్పడును.

ఈ సందర్భమున ఆగామి సంచితప్రారబ్ధములను మూడువిధములయిన కర్మలనుగురించి కొంచెము చెప్పవలసి యున్నది.

అనాదిగా జన్మపరంపరలో చేసికొని కొంత యనుభవింపబడిపోగా నిక మిగిలిన కర్మ యంతయు నొకరాశిగా నున్నదనుకొందము. అందుండి యొక గుప్పెడు కర్మ తీసికొని మన మీ జన్మ మెత్తినాము. ఈ దేహమును విడచులోపుగా ఆ కర్మ ననుభవించి తీరవలయును. దానికే ప్రారబ్ధకర్మమని పేరు. దానిని

తప్పించుకొనుట కెవ్వనికిని సాధ్యము కాదు. బ్రహ్మజ్ఞానముకల్గిన వానికికూడ నది యవశ్యానుభోక్తవ్యమే యని శాస్త్రము చెప్పుచున్నది. ఏది ప్రారబ్ధమో ముందుగా నెవ్వరికిని తెలియదు. కావున సుఖప్రాప్తికి, దుఃఖనివారణమునకు ప్రయత్నమును చేయుచునే యుండవలయును.

ఈ ప్రారబ్ధకర్మను తీసికొనిరాగా నిక మిగిలి యున్న కర్మరాశికి సంచితకర్మమని పేరు. అది యీ జన్మలో ననుభవింపవలసినదికాదు. రాబోవు జన్మల కది నిలవయున్నది. కాని దాని ప్రభావము మనపై నొక విధముగా కన్పట్టవచ్చును. ఆ కర్మ యొక్క గాలి మనపైకి వీచుచుండును. దానివలన మనము చలింపవచ్చును. చలింపకపోవచ్చును. మంచి కైనను, చెడ్డకైనను మనము దానికి సాధారణముగా లొంగుదుము. వ్యతిరేకప్రయత్నము చేయుచో లొంగము. ప్రారబ్ధమునకు లొంగినట్లు దీనికి లొంగుదుమను నియమములేదు.

ఒకని సంచితకర్మరాశియొక్క గాలి వాని మనస్సుపైకి వీచినపుడు వాడు లొంగుటయో లేదో యనునది వాడీ జన్మలో చేయుచున్న అభ్యాసమును బట్టి యుండును. సంచితకర్మలోని యొక పాపాంశముయొక్క గాలి సోకుటచే నొకనికి సురాపానమో హింసయో చేయవలెనను బుద్ధి పుట్టవచ్చును. ఈ జన్మలో వాడు సదుపదేశములను వినుటవలననో, సదభ్యాసములను చేసికొనుటవలననో వాడా దుష్టప్రేరణను త్రోసివేసికొన వచ్చును. వేదాంత శాస్త్రములో పురుషకారమునకుగల ప్రయోజనములలో నిదియొకటి. సంచిత కర్మయొక్క ప్రభావమువలన కొన్ని సత్ప్రేరణలీ జన్మలో కల్గుచున్నను, ఇప్పటి ప్రవర్తనము, అభ్యాసములు చెడ్డవిగా నున్నచో ఆ సత్ప్రేరణలు సముద్రములో పుట్టిన యలలవలె నచ్చటనే యణగిపోవును.

ప్రారబ్ధమువలెకాక యీ సంచిత కర్మ బ్రహ్మజ్ఞానమువలన నశించును. పెద్ద దూదిపర్వతము నిప్పురవ్వ పడుటచే భస్మమగునట్లు పర్వతమువలె నున్న యీ సంచితకర్మ జ్ఞానముచే దగ్ధమైపోవును. కావున సంచితకర్మను పురస్కరించుకొని జన్మమెత్త వలసిన యావశ్యకత బ్రహ్మజ్ఞాని కుండదు.

ఇంక ఆగామికర్మ కలదు. ఈ జన్మలో చేసికొనుచు, ఈ జన్మలోనే కాని, భవిష్యజ్జన్మలోనే కాని యనుభవింపవలసియున్న కర్మకు ఆగామికర్మ యని పేరు. రాబోవు జన్మలోనది కొంత ప్రారబ్ధము గాను కొంత సంచితము గాను మారిపోవును. బ్రహ్మజ్ఞాని విషయములో నీ కర్మ కూడ ఫలమునకు రాదు. దగ్ధబీజన్యాయముగా నిది యంకురానర్హమైపోవును. సామాన్యముగా గింజలకు మొలకలెత్తు గుణము కలదు. కాని మంగలములో నిప్పుమీద వేయించ బడిన గింజలు మొలక లెత్తజాలవు. అట్లే జ్ఞానమనెడు అగ్నిచే దగ్ధములైన కర్మబీజములు మొలకలెత్తవు. బ్రహ్మజ్ఞానరహితుల ఆగామికర్మ లన్నియు ఫలించియే తీరును. నిష్కామముగా నీశ్వరార్పణబుద్ధితో నాచరింపబడు కర్మలు మాత్రము ఈశ్వరానుగ్రహము, లేదా చిత్తశుద్ధియను ఫలమును జనింపచేయును.

ప్రతి కర్మకును ఒక ఫలమును గల్గించు గుణముండుటయే కాక, మరొక విచిత్రమైన లక్షణము కూడ కలదు. అది యేదన: ఏ చిత్త సంస్కారముచే నా కర్మ చేయబడినదో ఆ చిత్త సంస్కారము నా కర్మ బలపరచును. ఎట్లన: ఒకడు హింస చేసినాడు. దీనివలన వాడనుభవింపవలసిన ఫల ముండనేయుండును. అదికాక క్రొత్తగా చేయబడిన యీ పాపముచే వాని చిత్తములో నదివఱకుండిన దుర్గంధము పెరుగును. వాని హింసాప్రకృతి మరింత యెక్కువగును. అట్లే ఒకని కొకనాడు గంటసేపు భగవద్ధ్యానము చేయవలయునను బుద్ధి పుట్టినది. వాడు భగవద్ధ్యానము చేసినాడు. దానివలన కలుగవలసిన ఫలము కలుగును. అంతియే కాదు. ఏ చిత్త సంస్కారముచేత వానికి ధ్యానము చేయవలయునను సద్బుద్ధి పుట్టినదో ఆ చిత్తసంస్కారము మరింత పెరుగును.

ఈ రీతిగా ఇదివరకుంచిన సంస్కారమునకును, ఇప్పుడు చేయబడుచున్న కార్యమునకును ద్వివిధ సంబంధము కలదు. ఇట్టి విషయమున సాదృశ్యము నిమిత్తమై మరొక దాని నిటపేర్కొనవచ్చును. కట్వామ్లలవణాది పదార్థములు రజోగుణ సంపన్నుల కిష్టము లగును. మరల ఈ పదార్థములను తినుట వలన రజోగుణము పెరుగును. అట్లే తమోగుణము హెచ్చుగా నుండుటచే పర్యుషితాది వస్తు భక్షణమం దభిలాష కలుగును. వానిని భక్షించుచో ఆ గుణమే తిరిగి పెరుగును. అట్లే సాత్వికాహారమును గురించి తెలిసికొన దగును. ఏ వాసనచేత నొకపని చేయ వలయునను నభిలాష కల్గునో యాపని నాచరించుటచే నా వాసన పెరుగును. కావున సర్వకర్మలకును సాధారణముగా నుండవలసిన ఫలము కాక మరొక వాసనాభివర్ధకమైన ఫలముకూడ నుండును. కావున దుష్టప్రేరణలకు లొంగి, దుష్టవాసనలను పెంచుకొనరాదనియు, సత్ప్రేరణలకు లొంగి సద్వాసనలను పెంచుకొనవలయుననియు కర్మశాస్త్రము చెప్పుచున్నది.

* * *



# వేదాంతదర్శనము

[ బాదరాయణ సూత్రములు ]

పండిత శ్రీ గోపదేవ్

ప్రథమాధ్యాయము - ప్రథమపాదము

సాంఖ్యయోగ, న్యాయ, వైశేషిక దర్శనములలో ప్రకృతియు, తత్కార్యజాతమైన మహత్తత్త్వాదులును వర్ణింపబడినవి. మఱియును జీవులు, జీవులకు (ప్రాకృతికములయిన) మహత్తత్త్వాది పదార్థములకు గల భేదములును వివరింపబడినవి. ఇంతేకాక ప్రకృతిపురుష వివేకమువలన గలుగు ఫలము, దానికి వలయు సాధనములు నా శాస్త్రములందు వర్ణింపబడియుండుట జూడనగును. ఈ శాస్త్రమున మోక్షమునకు ముఖ్యసాధనమయిన బ్రహ్మజ్ఞానమును విపులముగ వివరింప నెంచి వ్యాసమహర్షి ప్రథమ సూత్రము నిట్లు రచియించుచున్నాడు.

"అథాతో బ్రహ్మజిజ్ఞాసా" ౧. ౧. ౧.

అథ - (వివేకము, వైరాగ్యము, శమ దమాది షట్కసంపత్తి, ముముక్ష యను సాధన చతుష్టయమును సంపాదించిన) తదుపరి, అతః - బ్రహ్మజ్ఞానము మోక్షమునకు ముఖ్యసాధనమైనందున, బ్రహ్మజిజ్ఞాసా - బ్రహ్మను సాక్షాత్కరింపజేసికొనవలయుననెడి కోరిక కలుగును.

అథ శబ్దమునకు తదుపరి (తరువాత), అధికారము (విషయము), మంగళము, ప్రశ్న, వికల్పము నను ననేకార్థములు గలవు. కాని, యీ సూత్రమునం దాశబ్దమునకు తదుపరియనియేయర్థము. అధికారాద్యర్థములు కానేరవు. కారణ మేమన :

బ్రహ్మజిజ్ఞాస యన బ్రహ్మను సాక్షాత్కారము చేసికొనవలయునను కోరిక. అట్టి కోరిక యీ శాస్త్రమున కధికారము (విషయము) కాజాలదు. అధికార మన శాస్త్ర ప్రతిపాద్య విషయము - శాస్త్రము ద్వారమున గ్రంథకర్తబోధింపదలచిన విషయము. శాస్త్రమునకు ప్రతిపాద్యవిషయము బ్రహ్మము కాని, బ్రహ్మజిజ్ఞాస కాదు. అందువలననే ముందు రానున్న సూత్రము లందు బ్రహ్మపద మన్వయించును ; కాని, జిజ్ఞాసాపద మన్వయింపదు. కావున బ్రహ్మజిజ్ఞాస యను పదముతో గూడియున్నందున నథ శబ్దమున కధికారమని యర్థము చెప్పదలచినను వీలుకాదు. 'జిజ్ఞాస' ముందు సూత్రములందన్వయింపదు కాబట్టి యది యధికారము కాదు. అందువలననే జిజ్ఞాసాపదముతో సంబంధమైయున్నను నథశబ్దమునకు నధికారము - విషయము - అర్థమన నొప్పదు. ముందు రానున్న సూత్రములందన్వయింపబడు బ్రహ్మ పదముతో నథ శబ్దమును సంబద్ధముచేసి యధికార మర్థము గావించుటకును వీలులేదు. ఈ సూత్రమునందలి బ్రహ్మ శబ్దముతో నథ శబ్దమునకు సంబంధము కల్పింప వలనుపడదు. కారణమేమన : ఇట బ్రహ్మపదము వేరుగా నుండక జిజ్ఞాసా పదముతో సమాసము చేయబడియున్నది. అందువలన నది విశేషణమయి జిజ్ఞాసా పదము విశేష్యమగుచున్నది. సమాసమున విశేష్యము ముఖ్యమై విశేషణము గౌణము (అప్రధానము) అగును. అముఖ్యమగు బ్రహ్మపదముతో నథశబ్దమునకు సంబంధము కల్పింప వలనుపడదు, కాబట్టి బ్రహ్మపదముతోజేర్చి యథ శబ్దమునకు అధికారమని యర్థము చెప్పుటకు వీలుకాదని భావము.

అథ శబ్దమునకిట మంగళమని యర్థము జెప్పుట కును వలనుపడదు. అథ శబ్దమునకు మంగళము వాచ్యార్థముగ నెందునను ప్రసిద్ధిలేదు. అథ శబ్ద శ్రవణము మంగళకరము కావచ్చును. కాని యథ శబ్దము మంగళార్థకముకాదు. శబ్దార్థముకాని మంగళము వాక్యార్థమున నన్వయింప జనదు. యత్నించుమేని 'బ్రహ్మ జిజ్ఞాస మంగళమని' కదా! వాక్యార్థమగును. అట్లయిన నీ సూత్రము ప్రశంసా బోధకమై కేవల యర్థవాదమగును. కాబట్టి యదియును బొసగదు.

అథ శబ్ద ప్రశ్నార్థకమనుటయు దగదు. ప్రశ్నార్థకమగునెడల సమాధాన వచన ముండవలయును. 'బ్రహ్మ జిజ్ఞాస కర్తవ్యమా?' యని ప్రశ్నించిన 'అవును. కర్తవ్యమే' యనియో లేక 'కాదు' అనియో సమాధానముండవలెను. అట్టి సమాధాన మీ శాస్త్రమున కానరాదు. కావున నథ శబ్దము ప్రశ్నార్థ మనరాదు.

వికల్ప మన ముందొక పక్షమును చెప్పి యనంతరము మరియొక పక్షమును జెప్పుట. (కిమయ మథ శబ్ద అనంతర్యవచనో ఽథాధికార వచనః?) 'ఈ యథ శబ్ద మానంతర్య వచనమా లేక యధికార వచనమా?' అని యిట్లు ముందొక విషయమును జెప్పి తరువాత మరియొక విషయము నారంభించుటయు నిట గానము. కావున, వికల్పార్థమునను నథ శబ్ద మిట ప్రయోగింపబడలేదు.

అందువలన ననంతరమే (తదుపరియే) యథ శబ్దమున కీ సూత్రమున నర్థమని తెలుచున్నది. అనంతరము బ్రహ్మజిజ్ఞాస కలుగునందుమేని దేని యనంతరమని ప్రశ్న ముదయించును. వేదాధ్యయనమున కనంతరమని సమాధానము జెప్పుదుమేని యది సరికాదు. వేదాధ్యయనము బ్రహ్మజిజ్ఞాసకు సాధారణ కారణమే కాని యసాధారణ (ముఖ్య) కారణము కాదు. వేదాధ్యయనానంతరమున వేద విహిత ధర్మము లేవో తెలిసికొనవలయునను కోరిక నియమముగ కలుగునే కాని, బ్రహ్మ నెరుగవలయునను కోరిక నియతముగా గలుగదు. కావున నథ శబ్దమునకు వేదాధ్యయనానంతరమని చెప్ప వలను పడదు.

కర్మావబోధానంతర మందుమేని యదియును సరి కాదు. కర్మావబోధము (అగ్ని హోత్రాది విహిత కర్మల జ్ఞానము) కర్మల ననుష్ఠించుటకు బురికొల్పును. కాని బ్రహ్మజిజ్ఞాసకు బురికొల్పదు. కర్మ జ్ఞానము కర్మాచరణకు బ్రోత్సహించును కాని బ్రహ్మజిజ్ఞాసకు గాదని భావము.

కాబట్టి యథ శబ్దమున కిట వైరాగ్యాది సాధన చతుష్టయ సంపత్త్యనంతర మనియే యర్థము జెప్పుట యుక్తము. వైరాగ్యాది సాధనసంపత్తి బ్రహ్మ జిజ్ఞాసకు-బ్రహ్మ సాక్షాత్కారేచ్ఛకు సాధనమగుటయే యిందులకు కారణము.

"శాంతో దాన్త ఉపరత స్తితిక్షుః సమాహితో భూత్వాఽఽత్మన్యేవాత్మానం పశ్యతి" బృ. ౪. ౪. ౨౩.

"శాంతుడు, దాంతుడు, నుపరతుడు, తితిక్షుడు నైనవాడే తనయందు పరమాత్మను సాక్షాత్కరింప జేసికొనును" అను నీ యుపనిషద్వాక్యము వలనను వివేక వైరాగ్యాది సాధనసంపత్త్యనంతరమే బ్రహ్మ జిజ్ఞాస కలుగునని బోధింపబడుచున్నది.

వివేకము, వైరాగ్యము, శమదమాది సంపద, ముముక్ష యను నీ నాలుగును సాధన చతుష్టయ మన బడును.

౧. వివేకము: శరీరము మొదలుకొని మూల ప్రకృతివరకు గల ప్రాకృతిక పదార్థములనుండి జీవాత్మను వేరుగా తెలియుట.

౨. వైరాగ్యము: వివేకము గలిగిన మీదట నైహికాముష్మిక విషయములందు తృష్ణను విడనాడుట-శరీరము మొదలు ప్రకృతివరకు గల సూక్ష్మ పదార్థములందు కూడ నాసక్తి లేకుండుట.

౩. శమదమాదిషట్క సంపద: (1) మైత్రి, కరుణ, ముదిత యను భావనల ద్వారమున రాగ ద్వేషాది చిత్త దోషములను బోగొట్టుట శమము.

(2) చక్షురాది బాహ్యేంద్రియములను నిందిత వ్యాపారములనుండి మరల్చి తన వశమున నుంచు కొనుట దమము.

(3) వేదశాస్త్రముచే నిషేధింపబడినట్టియు, విధింపబడనివియు, ఫలాపేక్షతో చేయు కామ్యములు-నైన కర్మలను చేయకుండుట యుపరతి.

(4) తితిక్ష: శీతోష్ణాది ద్వంద్వములను సహించుట.

(5) సమాధానము: నిర్విచార సంప్రజ్ఞాత సమాధి.

(6) శ్రద్ధ: గురువుచే జెప్పబడు వాక్యములను, వేద వాక్యములను యథార్థములే యను బుద్ధి.

(మైత్రి మున్నగు భావనలు, నిర్విచార సంప్రజ్ఞాత సమాధి యన నేమో నాచే రచియింపబడిన పాతంజల యోగదర్శనమున-సంజ్ఞా వ్యాఖ్యానమున జూడ నగును.)

౪. ముముక్షు: మోక్షము కావలయు ననెడి కోరిక.

సూత్రమునందలి 'అతః' అను శబ్దమునకు 'బ్రహ్మజ్ఞానము మోక్షమునకు ముఖ్యసాధనమైనందు వలన' నని యర్థము వ్రాయబడినది. కావున మోక్షమునకు బ్రహ్మజ్ఞానము ముఖ్యకారణమని తెలియుచున్నది. ఇందులకు వేదవాక్యములు, నుపనిషద్వాక్యములు ననేకములు ప్రమాణములుగా లభించును.

(1) "య ఇత్తద్విదు స్తే ఒమృతత్వమానశుః"
ఋ. ౨. ౩. ౧౭. ౨౩.

'బ్రహ్మము నెరిగినవారు మోక్షము (అమృతత్వము) ననుభవింతురు.'

(2) "అనాద్యనంతం మహతః పరం ధ్రువం నిచాయ్య తం మృత్యుముఖాత్ ప్రముచ్యతే." కఠ. ౩. ౧౫.

'ఆద్యంతములు లేక, జగత్కారణమైన ప్రకృతి కంటె సూక్ష్మము, ధ్రువమునైన బ్రహ్మము నెరిగి-సాక్షాత్కరింపజేసికొని - మృత్యుముఖమునుండి తప్పించుకొనును.'

పై వాక్యప్రమాణములవలనను బ్రహ్మజ్ఞానమే మోక్షమునకు ముఖ్యసాధనమని స్పష్టమగుచున్నది.

కాని, వేదమునందే మరియొక యెడ:

"కుర్వన్నేవేహ కర్మాణి
జిజీ విషే చ్ఛతగ్ం సమాః
ఏవం త్వయి నాన్యథేతో ఒస్తి
నకర్మ లిప్యతే నరే." యజు. ౪౦. ౨.

'విహితములైన కర్మల నాచరించుచునే జీవితమంతయు గడపవలయును. వేద విహిత కర్మల నాచరించుచు జీవితము గడపినందువలననే నీకు కర్మలిప్తము కాదు. కర్మబంధమునుండి తప్పుకొనుటకు వేరొక యుపాయము లేదు.' అని యుపదేశింపబడి యున్నందున బ్రహ్మజ్ఞానమువలెనే కర్మానుష్ఠానముకూడ మోక్షమునకు సాధనమని తెలియుచున్నది.

మరియును:

"విద్యాంచా విద్యాంచ
యస్తద్వేదోభయగ్ం సహ
అవిద్యయా మృత్యుం తీర్త్వా
విద్యయా ఒమృత మశ్నుతే."
యజు. ౪౦. ౧౪.

విద్యా = జ్ఞానము; అమృతత్వం = మోక్షము; అవిద్యా = కర్మ.

'జ్ఞాన కర్మలు తోడ్తో నెరిగినవాడు కర్మద్వారమున మృత్యువును దాటి, జ్ఞానము ద్వారమున మోక్షమును బొందును'. అని మోక్షము నపేక్షించు వారికి జ్ఞాన కర్మలు రెండును నావశ్యకములని యీ మంత్రమున స్పష్టముగా జెప్పబడియున్నది. కావున మోక్షమునకు బ్రహ్మజ్ఞానమే ముఖ్య సాధన మనుట యెట్లు సంగత మగునని శంకింపరాదు. మంత్రవర్ణములందు కానీ, యుపనిషద్వాక్యములందు కానీ యెక్కడను బ్రహ్మజ్ఞానము మోక్షమునకు ముఖ్య సాధనమని నుడివినట్లు కర్మము ముఖ్యసాధన మని వర్ణింపబడలేదు.

"కుర్వన్నేవేహ" యను మంత్రమునందు జీవించినంత కాలము కర్మలను ఫలాపేక్షలేక యనుష్ఠించినందువలన జీవుడు సంసారముచే లిప్తుడు కాడని

మాత్రమే చెప్పబడినది. అట్లే "విద్యాంచా" యను మంత్రమునందును. కర్మఫలము మృత్యువును తరించుట యనియు, జ్ఞానఫలము మోక్ష మనియు వేరువేరుగ వర్ణించుటవలన జ్ఞానమే మోక్షమునకు ముఖ్య సాధనమనుట యుక్తమే యగుచున్నది. అందువలన కేవల కర్మము మోక్షసాధనము కాజాలదు. కర్మలు ఫలాపేక్షలేక యాచరించినందున చిత్తమునందలి రాజసతామసమాలిన్యములు తొలగి పోవును. ఇదియే మృత్యుతరణమని మంత్రమున చెప్పబడినది. ఇట్లు కర్మలు చిత్తమాలిన్యమును దొలగించి యాత్మజ్ఞానమునకు కారణమగును. ఆ యాత్మజ్ఞానము మోక్షమునకు ముఖ్యకారణమగును. అందువలన జ్ఞానము మోక్షమునకు ముఖ్య సాధన మనుట దోషయుక్తము కాదని యెరుంగవలెను.

బ్రహ్మ జిజ్ఞాస - బ్రహ్మను దెలిసికొనవలయు ననెడి కోరిక. మహర్షి యుపనిషద్వాక్యములలోని యర్థములను విశదీకరించుటకు సూత్రములను రచి యించి యున్నాడు. ఆ వాక్యములందును బ్రహ్మమే జిజ్ఞాసకు కర్మగా నుపదేశింపబడినది.

('తద్వి జిజ్ఞాసస్వ తత్ బ్రహ్మ' తై ౩-౧ 'దానిని దెలిసికొనగోరుము - అదియే బ్రహ్మము జిజ్ఞాస - జ్ఞానేచ్ఛ - తెలిసికొనవలెనను కోరిక. ఇందలి జ్ఞానము మనోవృత్తికాదు. మనోవృత్తిరూపమగు' జ్ఞానమునకు బ్రహ్మము విషయముకాదు. అందు వలననే 'యం మనో నవేద' బృ. ౩-౭-౨౦.) 'ఎవని మనస్సు తెలిసికొనలేదో' యని యుపనిషత్తు లందు వర్ణింపబడినది. బ్రహ్మము చిత్తవృత్తికి విషయము కాదని భావము.

"మనసైవేదమాప్తవ్యమ్" కఠ. ४. ౧౧.
"మనసైవానుద్రష్టవ్యమ్" బృ. ४. ४ ౧౯.
"మనస్సుతోనే బ్రహ్మము పొందదగినది"
"మనస్సు ద్వారముననే చూడదగినది" యని యుపని షత్తులందు జెప్పబడినది కదా! యందురేని యట్లు కాదు. ఈ వాక్యములలో మనస్సు బ్రహ్మ సాక్షాత్కా రమునకు సాధనముగ వర్ణింపబడినదే కాని, మనస్సు నకు బ్రహ్మము విషయమని చెప్పబడలేదు. కారణ మేమన :

"ఇంద్రియేభ్యః పరంమనో
మనసః సత్త్వముత్తమం
సత్త్వాదధి మహానాత్మా
మహతోఽవ్యక్తముత్తమమ్"

కఠ. ౩. ౭.

"అవ్యక్తాత్తు పరః పురుషో
వ్యాపకో అలింగ ఏవచ.
యద్ జ్ఞాత్వా ముచ్యతే జంతు
రమృతత్వంచ గచ్ఛతి"

కఠ. ౩. ౮.

"ఇంద్రియములకంటె మనస్సు సూక్ష్మము. దాని కంటె బుద్ధి. యద్దానికంటెను ఆత్మ సూక్ష్మము"అని యుపనిషద్ వాక్యములందు మనసు, బుద్ధి మున్నగు ప్రాకృతిక పదార్థములకంటెను నాత్మ (బ్రహ్మము) యెంతో సూక్ష్మమని వర్ణింపబడినది. అందువలన బ్రహ్మము మనోవృత్తికి విషయము కాజాలదనుట ఎక్కువము. ఇంద్రియములు తమతో సన్నికృష్టము (సంబద్ధము) లయిన పదార్థములనే తెలుపును. అంతరింద్రియమైన మనస్సుకూడ తనతో సంబద్ధ మగు జీవాత్మ నెఱుగ గలుగును; బ్రహ్మము నెరుగ జాలదు. అటులయిన,

"దృశ్యతే త్వగ్ర్యా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మ దర్శిభిః" కఠ. ౩. ౧౨.

"సూక్ష్మదర్శులు సూక్ష్మమైన యగ్రిమబుద్ధితో చూతురు" అని యీ యుపనిషత్తునందే యెట్లు చెప్పబడినదందురేని బ్రహ్మసాక్షాత్కారము మనో నిబంధన మని తత్వజ్ఞులు నుడువుదురు. శాస్త్ర మున జెప్పబడిన శుభకర్మలు నిష్కామ బుద్ధితో జేయనంతవరకు నిఃశ్రేయసము (మోక్షము) ప్రాపింపనట్లు, మనస్సును బాగుగ శుద్ధముచేసి- రాజసతామసమాలిన్యములుదూరమొనర్చి, 'జీవాత్మను దర్శింప యోగ్యమగునట్లు జేయనంతవరకు బ్రహ్మ సాక్షాత్కార మసంభవము. (సశేషము)

# భక్తుడై, భగవంతుడైన హనుమంతుడు

శ్రీ గొట్టిపాటి సుబ్బరాయులు

ఆంధ్రదేశములో దాదాపు ప్రతి గ్రామములోనూ ఆంజనేయ దేవాలయము తప్పకుండా ఉంటుంది. ప్రత్యేకించి రాయల సీమలో హనుమదాలయము లేని గ్రామము లేదనే చెప్పవచ్చును. ఇంతటి ప్రజాభిమానాన్ని చూరగొన్న హనుమంతుని విశిష్టతను తెలుసుకోవలసిన అవసరమున్నది. కలియుగములో హనుమంతుడు ప్రత్యక్షదైవమని ప్రతీతి. ఆయన చిరంజీవి అనే నమ్మకముకూడ బహుళ సంఖ్యాకుల్లో బలీయంగా వున్నది. ఈ మహనీయుని జీవిత విశేషములను గురించి క్లుప్తంగా పరిశీలించడం ప్రస్తుతాంశం.

అంజనీసుతుడు కనుక ఆంజనేయుడనీ, వాయుదేవు డతని తండ్రిగనుక వాతాత్మజుడనీ, పిలువబడే హనుమంతుడు దక్షిణదేశములో శ్రీరామచంద్రుని భక్తుడుగా - పరమాప్తుడుగా చేరినవారిలో ప్రప్రథముడు. ఆ కాలములో దాక్షిణాత్య తెగలలో సంఖ్యాప్రాబల్యముగల వానరజాతికి చెందినవాడు. వానరులు తెలుగు - కన్నడ తెగలకు చెందినవారు. అప్పటికింతగా నాగరికులు కాలేదని చెప్పవచ్చును. అయినా పూర్తిగా అనాగరికులు మట్టుకు కాదు. అందుకు నిదర్శనము హనుమంతుడే. ఇతడు అందాన్ని మినహాయిస్తే తక్కిన నాగరిక లక్షణాలన్నీ కలిగి వుండడమే కాదు. పరిణతి చెందినవాడు, వ్యాకరణ పారంగతుడు. ప్రతిభావంతుడూ, వ్యుత్పన్నుడూ అయిన గొప్ప పండితుడు. చతుర్వేదాలూ సాంగోపాంగము చదువుకున్న విజ్ఞాని.

చిన్నప్పుడే గురుదేవుడైన సూర్యభగవానునితో పాటు దేశ దేశాలూ తిరిగి శ్రద్ధగా శాస్త్ర విషయాలూ చదువుకున్నవాడు. అణిమాది అష్టసిద్ధులను సాధించిన యోగవిద్యాపారంగతుడు. భక్తి తత్వానికి బలమైన ప్రాతిపదికలువేసి ప్రత్యేకతను నిలువబెట్టుకున్న పారమార్థికుడు. ఎంచి తూంచి మాట్లాడి ఎదుటివారిని మెప్పించగల వక్త. పరిమితమైన హితభాషణలో ప్రశస్తినందినవాడు. ఎంతటి ధీశాలియో అంతకు మించిన బలశాలి. బలానికి లొంగని కార్యాలను తెలివితో సాధించగల దిట్ట. కొండలెక్కుటలో సముద్రాల నీదుటలో అసాధ్యమూ, కష్టసాధ్యమూ ఐన కార్యాలను సాధించుటలో అతని కతడే సాటి. అందరి కతడే మేటి.

సీతాన్వేషణకు బయలుదేరి, సిలుగులలో తగుల్కొని వెలుగుకొరకు తహతహ పడుతున్న శ్రీరామచంద్రునకు తలవని తలంపుగా, ధీశాలి, బలశాలి ఐన హనుమంతుడు తటస్థపడి, సమస్థాయిలో - సమస్యా సమన్వయముతో సతమతమౌతున్న సుగ్రీవునితో పరిచయముచేసి-స్నేహము కలపడమనేది మహత్తరమైన అవకాశాలలో బృహత్తరమైనదిగా పేర్కొనవచ్చును. రాముడు సాధించిన కార్యాలన్నిటిలోనూ హనుమంతుని హృదయాన్ని చూరగొనడము అత్యుత్తమమైనదిగా, అసమానమైనదిగా లెక్కించవచ్చును. అప్పటి కతడు సుగ్రీవుని కష్టసుఖాలలో, మంచి చెడ్డలలో భాగస్వామిగ - పరమాప్తునిగ ఎన్నికగన్న మంత్రివరేణ్యుడు. రాజభక్తిలో రక్తి సక్తి కుదిరిన రమ్యవర్తన అతనిది. రాముని పరిచయముతో అతని మీద అవ్యాజమూ, అపారమూ అయిన భక్తి కుదిరినది. ఇది రాజభక్తికాదు. స్వార్థానికి సంబంధము లవలేశమైన కారణమేదీ దీనికి మూలముగాలేదు. అయినా తిరుగులేని భక్తి అది. అందుకే అది రామ

శక్తి అయినది. రాజభక్తి, రామభక్తి మినహాయించితే ఇతర వ్యాసక్తులేమీ లేనివాడు కావడమువల్ల హనుమంతుని సంపూర్ణశక్తిసామర్థ్యాలూ, పూర్తికాలమూ రామకార్యార్థమై వినియోగింపబడినవి. ఇతడు యావజ్జీవబ్రహ్మచారి కావడము ఈ పరిస్థితి కంతటికీ మరింత దోహదకారిగా పరిణమించి - రామాయణమే రక్తికట్టింది.

సుగ్రీవుని పనుపున మారువేషములో మొదటిసారిగా శ్రీరామలక్ష్మణులను కలుసుకొన్నప్పుడే హనుమంతుడు పూర్తిగా శ్రీరామునకు వశవర్తియైనాడు. మహాపురుషుడుగా, మాన్యచరితుడుగా, మానవోత్తముడుగా, దైవసమానముగా భావించి తన తను మనధనముల నతనికి అంకితము కావించి రామకార్యార్థి కావడానికి, అందులో కృతకృత్యుడు కావడానికి నిశ్చయించుకున్నాడు హనుమంతుని నాకర్షించినది రాముని ఆకారమా, గుణశీలాదులా అన్న సంశయానికి సుస్పష్టమైన సమాధానము చెప్పడము సులభమైనపని కాదు. ఈ రెండిటినీ- భౌతికంగా కనబడే అన్నింటినీ మించిన అనిర్వాచ్యమైన మహాశక్తి అతని శక్తిని రేపి, రక్తిని కలిగించి వుంటుంది. అదే ఇతని భక్తితత్వాన్ని ప్రదీప్తంచేసి వుంటుంది. నా అన్నవాళ్ళెవరూ లేని, స్వార్థమన్నదేదీ లేని హనుమంతుడు అభిప్రాయాలకు, నిర్ణయాలకు, ధర్మసూత్రాలకు కట్టుబడి నిలువబడడములో తృప్తిపొంది వుంటాడు. అతని సంస్కారమూ, శక్తిసామర్థ్యాలూ రాణించి శోభించడానికి రామభక్తి పూర్తిగా తోడ్పడినది. నగరప్రాంతాలనుండి నాగరకత వాతావరణములోనుండి వచ్చిన రామునికి, అటవిక జాతులలో-అనాగరికు లనుకున్నవారిలో ఇంతటి విద్యావంతుడు, వినయసంపన్నుడు శ్రావ్యంగా దివ్యంగా మాట్లాడగల నేర్పరి, సంస్కారసౌశీల్యుడు తారసిల్లడము ఆశ్చర్యాన్ని సంబరాన్ని కల్గించింది. కార్యసాధనకు చక్కని తోడ్పాటు లభ్యమయ్యిం దనుకొన్నాడు. విజయసిద్ధికి వీలేర్పడిం దన్న విశ్వాసము కుదిరింది.

రామునికి హనుమంతుని మూలమున సుగ్రీవునితో పరిచయ మేర్పడినది—రామ - సుగ్రీవులు ఇంచుమించుగా ఒకే స్థితిలో నున్నవారు. పరస్పర సహాయాలతో సమస్యా పరిష్కారానికి తోడ్పాటును వాంఛిస్తున్నవారు. ఇద్దరికీ ఒద్దిక కుదిరింది. కుదిరించిన హనుమంతు రామునికి ప్రీతిపాత్రు డయ్యాడు. సుగ్రీవుని కార్యము రాముని మూలమున జయప్రదము కావడముతో హనుమంతుని కడుపడికే మొలకెత్తిన రామభక్తి భూరుహసందోహంగా పెరిగి, చిగిర్చి, పూసి, కాచినది. రామకార్యనిర్వహణాభారము సుగ్రీవుని మూపుపై బడిన వెంటనే ఆ బాధ్యతను అన్ని విధములా సమర్థుడూ, ఆప్తుడూ అయిన హనుమంతునిపై నుంచెను. ఈ కార్యక్రమానికి ప్రథమ ఘట్టము సీతాన్వేషణ. ఆమె ఎక్కడున్నదో, యెట్లున్నదో తెలుసుకోవాలన్నా, వినరాని, చూడరాని ప్రదేశాలకు వెళ్ళాలన్నా, చతురతా, స్తోమతూ, ఓర్పూ, నేర్పూ - మార్పులకు వలయు కూర్పూ కలిగి-అక్కడ వలయు విధముగా మసలుకొని తిరిగిరాగల కౌశల్యశీలుడైనవాడు హనుమంతు డొక్కడేనని సుగ్రీవు డెరుగును. వీటన్నింటిని రామచంద్రునిపై అతనికిగల అసామాన్యమైన భక్తిభావము అతని శక్తిని ద్విగుణీకృతము చేస్తుందని కూడ అత డెరుగకపోలేదు. అందువల్ల హనుమంతుని నీ కార్యార్థము ప్రయాణము కట్టించినాడు. హనుమంతుడు తన శక్తిసామర్థ్యాల నెప్పుడూ అంచనా వేసుకొన్నవాడు కాదు. ఎక్కువగా గాని - తక్కువగా గాని, ఉన్నదున్నట్టు గాని వాటికి విలువను కట్టినవాడు కాదు. అందువల్లనే రామునిపై ఎంతటి భక్తి విశ్వాసాలున్నప్పటికీ, కార్యసాధనపై ఎంతటి బలీయమైన కాంక్ష ఉన్నప్పటికీ తానై ముందుకు రాలేదు. సుగ్రీవుడూ తోడి వానరులూ ప్రేరేపింగా సంపూర్ణోత్సాహముతో సంతృప్తితో బయలుదేరినాడు. జంకుగొంకులు, వెనుకముందులు అతని కలవాటులేని గుణాలు.

ఏకధాటిగా సముద్రాన్ని దాటి అభ్యంతరాలను లక్ష్యపెట్టక, అవాంతరాలకు లొంగిపోక అవస్థలకు

క్రుంగక, అవస్థలకు జంకక, లంకాపురి చేరు కున్నాడు. ద్వారపాలకులను, పరిశీలకులను, పర్య వేక్షకులను, కనుగ్రామినాడు. లంకాపట్టణముయొక్క వైభవానికి, ఆ పురివాసుల నాగరకతకు విస్మయాశ్చ ర్యాలతో వివశుడైనాడు. అనుకున్న మేరకు అంతః పురాన్ని ప్రవేశించి, అంతు కనుక్కోవడానికి ఆరం భించినాడు. అక్కడి అందాలరాసులను, ఆనందమయ జీవితాలను కన్నులారా గాంచి కలత చెందినాడు. కాంక్షలకు లోనైగాదు. వైభవోపేతమూ - సౌభాగ్య వంతమూ - ఈ జాతికి ధర్మచింతన-న్యాయవర్తన- ఋజుశీలమూ అలవడివుంటే పసిడికి తావి అబ్బి నట్లుగా పసగట్టివుండేదికదా అనుకున్నాడు.

సీతజాడలుగాని, ఆమె అంతఃపురములోవున్న చిహ్నములుగాని కనబడలేదు. ఆత్మహత్య చేసుకున్న దేమో ? హత్య కావింపబడినదేమో ? అని వగచి వాపోయినాడు. ఇట్లా జరగడానికి ఎంతమాత్రమూ వీలులేదని సంబాళించుకున్నాడు. దిక్కుదోచక దిక్కు లన్నిటా కాలికి బలపము కట్టుకొని గాలించినాడు. అశోకవనములో శోకతప్తయైన సీతాదేవిని చూచి, ఆమెహైన్యస్థితికి విచారమూ, కనుగోగలిగినందుకు ఆనందమూ ప్రకోపంగా-బాధనూ తృప్తినీ సమానంగా అనుభవించినాడు. వెనుకటి అనుభవముతో ఇతనిని కూడా రావణానుచరునిగా భావించి విశ్వసించలేక పోయిన సీతాదేవికి విధవిధాల నచ్చజెప్పి, విధిలేక రామాంగుళీయకము చూపించి నమ్మించవలసిన అవ స్థకు గురియైనాడు. ఆమె నోదార్చడానికి తన వాగ్విభవ మంతా ప్రదర్శింపవలసి వచ్చినా వెనుకాడలేదు. రాముని క్షేమసమాచారాలూ, రావణుని జయించ డానికి అతనికిగల అవకాశాలూ, వానరసైన్యము యొక్క యుద్ధనైపుణ్యమూ విపులీకరించి, చారునిగా తన విధి ముగిసినదనీ, దూతగా తన కార్యక్రమాన్ని కుపక్రమింపవలసిన తరుణ మాసన్నమైదనీ గుర్తించి ప్రచ్ఛన్న వాతావరణమునుండి బయలుపడవలసిన అవసరాని కనుగుణ్యంగా అశోకవనమును పాడు చేయడానికి ఆరంభించినాడు. అప్పటివరకు లంకా పురివాసు లితని రాకను గమనింపలేదు. శత్రు వొకడు లంకలో జొరబడినాడనీ, అతడు అనాకారి అయి నప్పటికీ అసామాన్యుడూ, అద్భుత శక్తిసంపన్నుడూ నని రావణుడు విన్నాడు. పట్టి తెమ్మని పంపబడిన వారిలో హతశేషులనుండి అందిన వార్తలనుబట్టి, అనుకున్నంత సులభంగా లొంగేవాడు కాక, అజే యుడుగా కనబడుచున్నందున ఇంద్రజిత్తునే పంప వలసివచ్చినది. ప్రతిఘటన కొంతకాలము సాగించి యెట్టకేలకు పట్టుబడెను. పట్టుబడవలసిన అవసర మతని కున్నది.

రావణుని ఆస్థానములో సమర్థుడైన దూతగా- సంస్కారవంతుడైన రాజునకు ప్రతినిధిగా-విజ్ఞాన విశారదుడుగా వ్యవహరించెను. తా నెవ్వాడైనదీ, ఎందుకొరకు కక్కడికి వచ్చినదీ, ఏ పరిస్థితులలో ప్రతిక్రియ కుపక్రమించినదీ వివరించి - పరిస్థితులు విషమించకుండా - ఉభయతారకంగా శ్రేయోదాయ కంగా ఉండడానికి అనువైన మార్గాలను సూచించి సీతిని బోధించెను. తన సూచనలను అంగీకరింప వలసిన అవసరాన్ని నచ్చజెప్పుటకు శతవిధాలా ప్రయత్నించెను. హనుమంతుని వాగ్వైభవానికి, వాదనాపటిమకు లొంగి విభీషణు డితనిని సమర్థిం చెను. రావణు డిందు కొప్పుకోలేదు. దౌత్యము విఫల మైనది. దూత అవమానింపబడెను. ప్రతిఫలము లంకాదహనము. ఆగ్రహోద్రగహమానసుడైన హనుమంతుని ఎవ్వరూ యేమీ చేయలేకపోయిరి. సీతను కనుగొన్న ఉత్సాహమూ లంకాదహనము లోని ఉద్వేగములతో, ఇనుమడించిన శక్తిసంప న్నుడై తిరిగివచ్చి వానరసేనముందు కుప్పళించి దుమికెను. రామలక్ష్మణులతోసహా వానరులతనికిచ్చిన స్వాగత మఖండమైనది. ఆనంద ముప్పొంగెను. అతనిని బుజాలమీద కెక్కించుకొని గంతులువైచిరి. సీతాదేవి క్షేమవార్తతో ప్రారంభించి తన యాత్రా విశేషాలన్నిటినీ వివరించెను.

యుద్ధసన్నాహాలు కావింపబడెను. ఎట్టకేలకు లంకకు చేరుకొనిరి. విభీషణుడు ముందుగనేవచ్చి

# కొండిపర్తి దేవాలయాలు

శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

కొండిపర్తి హనుమకొండకు దక్షిణాన సుమారు ఎనిమిది మైళ్ళలో వున్న గ్రామము. ఎఱుకు దేవరాజు కొడుకులు అనుమడూ, కొండడూ, అనేవారు పాలించిన గ్రామాలుకనక వీటికి అనుమకొండా, కొండపర్తీ అని పేర్లు వచ్చాయంటారు. ఈ గ్రామానికి చేరువగా రెండు రాళ్ళగుట్టల నడుమ కట్టకట్టించి "చౌండసముద్రము" అనే పెద్ద చెరువును గణపతి దేవ చక్రవర్తి సేనాని 'చౌండ' అనే అతడు క్రీ.శ. 1203 లో నిర్మించాడు. చెఱువుకట్టమీదా, ఊరిలోనూ ఆలయాలు నిర్మించాడు. నాటినుండే ఈ వూరు పెరిగి ప్రసిద్ధికి వచ్చింది.

ఈ గ్రామంలో దేవాలయాలు చాలా వున్నాయి. మొట్టమొదటిది చెఱువుకట్టమీది శివాలయం అయి వుంటుందని నా ఊహ. పెద్దపెద్ద చెఱువుల కట్టల మీద రక్షకుగాను శివాలయాలు నిర్మించడము కాకతీయుల కాలంలో పరిపాటి. ఈ చిన్న ఆలయమూ అలాంటిదే అవాలి. ఇది చెఱువుకట్ట మట్టిలో క్రమంగా దిగిపోయి, పద్మాక్షిదేవళశిఖరంలాంటి - ఇటుకా సున్నముతో కట్టిన - శిఖరం మాత్రము ఈ నాటికి పైకి కనబడుతోంది. ఈ ఆలయానికి గర్భాలయమూ, అంతరాళమూ ఈనాటికీ నిలిచి వున్నాయి. అంతరాళద్వారబంధానికి పైన 'నీడపలక' కలదు. (ఈ నీడపలక ఆధునిక ఆలయాలలో కానరాదు.) గర్భాలయ ద్వారముమీద గజలక్ష్మి ఉన్నది. ఏనుగులు ఆమె శిరముపైన గల కలశములో నీరు పోస్తున్నాయి.

రెండో దేవాలయము చౌండసేనాని నిర్మించిన చౌండేశ్వరాలయము. ఇది నేడు చాలా శిథిలమైపోయింది. కప్పు అన్నదే లేదు ఎక్కడా. గోడల భాగాలు కొన్నీ, గర్భాలయద్వారబంధపు దిగువ భాగమూ మాత్రము మిగిలి వున్నాయి. గోడల భాగాల్ని బట్టి ఈ ఆలయము హనుమకొండ రుద్రేశ్వరాలయము వలెనే "వెయ్యిస్తంభాలగుడి" అని తెలుస్తుంది. స్తంభాల రూపాలు చెక్కిన నిలువురాతి పలకలు పేర్చి కట్టారు ఆలయాన్ని. ఈ 'స్తంభాల' వెలిపైపు దిగువ చతురస్రముమీద దేవాలయశిఖరాల వలచని అర్ధశిల్పాలు మలిచారు. (హనుమకొండ గుడి కివి లేవు) గర్భాలయ ద్వారబంధము - నల్లశిలది - నిలువుకంబముల దిగువన ఇటు ముగ్గురూ, అటు ముగ్గురూ ద్వారపాలు రున్నారు. చివ్వరివారు చామరధారిణులూ, నడుమ చతుర్భుజ ద్వారపాలురూ, లోపైపు కలశధారిణులూ కలరు. ఆ ఆలయ గర్భగృహము దగ్గర విరగగొట్టిన సరస్వతీ విగ్రహము పడివున్నది. హంసమీద సరస్వతి - చతుర్భుజ త్రిభంగిగా నిలబడి ఉన్నది. వీణకాయను ఎడమ భుజానికి చేర్చి ఈమె వాయిస్తున్నది. ఈ ఆలయము నిర్మించిన చౌండసేనాని శాసనమును చేరువనే వున్న వేణుగోపాలస్వామి ఆలయానికి చేర్చినారు.



శివకేశవ ప్రోలేశ్వరాలయము - కొండిపర్తి

మూడో ఆలయము క్రీ. శ. 1240 లో మల్యాల వంశానికి చెందిన కాటచమూపతి కట్టించిన త్రికూటాలయము-శివ కేశవ ప్రోలేశ్వరాలయము. దీనికి చుట్టూ ప్రాకారము ఉండినట్లు శాసనము చెపుతోంది. త్రికూట మంటే, ఒక చతురస్ర మండపానికి మూడువైపులా కట్టిన మూడు ఆలయాల కూటము. ప్రవేశ మండపము నాలుగోవైపు ఉంటుంది. ప్రధాన ఆలయమంటూ నాటి రోజులలో వాడుక వుండలేదుగాని నడిమి ఆలయము ఇక్కడ తూర్పుముఖము. ఈ ఆలయాని కెదురుగా ప్రాకారములో ద్వారమండప మున్నది (హనుమకొండ, పాలంపేటా ఆలయాలకూ ఉన్నవి ఇలాటి మండపాలు). ఈ మండప ద్వారానికి దిగువన పూర్ణ కుంభాలూ, నిలువుకంచాల నడుమ సన్నని (అలంకార) అర్ధస్తంభమూ, పై కమ్మికి ముందువైపు పొడుచుకువచ్చే నీడపలకా, దానికి పైన మూడు దేవళ శిఖరముల అలంకారమూ కలవు.

ఆలయ మధ్యమండపము 12 గజాల చతురస్రము. దీనికి నడుమ నాలుగు స్తంభాల రంగమండపమూ దానిలో నాట్యరంగముగా నిర్దేశింపబడిన పెద్దవర్తులమూ ఉన్నాయి. ఈ స్తంభాలమీద కొన్నిటిమీద మాత్రము చంచువులు కలిపిన హంసలు చెక్కి ఉన్నాయి. గర్భాలయములలో విగ్రహాలేవీ మిగిలి లేవు. గర్భాలయాలలో కప్పుమీద మధ్య పద్మము చెక్కినారు. గర్భాలయపు గోడలూ, కప్పూ కలిసే చోట వికస్వర చతుర్దళపు పుష్పాలంకారము (ప్రశ్చిమ చాళుక్యులు వాడిన అలంకారపు పట్టీ) కలదు. గర్భాలయపు గోడలలో కుడివైపు దానికీ ఎదుటి దానికీ సుమారు అయిదడుగుల ఎత్తున, అరంగుళాలు ముందుకు వచ్చే రాతి అరుగులు బిగించారు. "పూజాసామగ్రిని ఉంచడానికి" అన్నది అందరూ ఊహించగల వీటి ప్రయోజనము. (అసలెందుకు ఉపయోగించారో?) గర్భాలయాల నాలుగు మూలలా నిలువుగా రాతిస్తంభాల అంచులు రెండు అంగుళాలు గర్భాలయం లోనికి పొడుచుకు వచ్చి ఉన్నవి. (ఆలయం నిర్మించేటప్పుడు ముందుగా స్తంభాలు నిలిపి, తరువాత వాటినడుమ రాతిపలకలు పేర్చి 'గోడలు' కట్టివుంటారు). గర్భాలయ ద్వారముపైన అలంకారముగా అయిదు దేవళ శిఖరాలు వరుసగా చెక్కినారు. నీడపలక ముందు అంచు మూడుమెట్లలో ముందుకు వస్తున్నది. ఈ ద్వారబంధపు నిలువు కంబాలకు రెండుకాళ్ళమీద లేచిన సింహాలు చెక్కిన పట్టీయున్నూ, అర్ధస్తంభమున్నూ కలవు. ద్వారబంధంపైన గజలక్ష్మి, దిగువన ఇటూ అటూ ముగ్గురేసి పరివారమూ కలరు. సొరకాయవంటి దింపును కాటోలు రెండుకొసలనూ రెండు చేతులతో ఎత్తిపట్టేస్త్రీ, నాగమూ డమరుకమూ గద ధరించి నాలుగోచేతితో అభయమునిచ్చే చక్ర కుండలాలంకృతుడూ కిరీటధారీ ద్వారపాలుడూ, చామరధారిణీన్నీ వీరు. అంతరాళములో కప్పు నడుమ చిన్న పద్మమున్నది. దీనికిన్నీ ఇది వున్న చతురస్రముయొక్క కోణములకునూ నడుమగల 'త్రిభుజాల'లో మూడు పుష్పదళాలు చెక్కారు. అంతరాళద్వారానికి అర్ధస్తంభమూ, కన్నములుగల రాతిపలక, దానిపక్కన గోడకు చెందిన అర్ధస్తంభమూ, పైపైపు అయిదు దేవళ శిఖరాలూ, ముందుకు వచ్చే నీడపలకకు ముకుళాలంకారమూ కలవు. మధ్యమండపము నాలుగుమూలలూ (హనుమకొండ రుద్రేశ్వరమువలెనే) తెరిచేఉండేవి కాని ఈనాడు కచ్చాగోడలు కట్టి మూసివేశారు దక్షిణముఖంగా వున్న ఆలయంలో నడిమికన్నములో విగ్రహపీఠము మాత్రమే ఉంది, విగ్రహము లేదు.

ఈ దేవాలయము శివకేశవ ప్రోలేశ్వరాలయమట. ఆలయాలకు వెలిప్రక్కన శిల్పాలేవీ లేకపోవడము వల్ల ఏ ఆలయము ఏ దేవునిదో నిశ్చయముగా చెప్ప వీలుకాకున్నది. దక్షిణ ముఖాలయంలోని విగ్రహం కేశవునిది కావచ్చు. తూర్పుముఖంగావున్న ప్రధానాలయం ప్రోలేశ్వరాలయమూ, ఉత్తరముఖానిది శివాలయమూ కావచ్చును. మూడు శిఖరాలలోనూ నడిమిది పడిపోయిందీ, రెండే నిలిచివున్నాయి. ఇవి పద్మాక్షి ఆలయ శిఖరంలాగే నాలుగు పలకలవీ,

మెట్లుమెట్లుగా పైకి లేస్తాయి. అయితే పొడవు ఎక్కువై వికృతంగానే కనబడతాయి ఇవి. హనుమకొండలో ప్రాచీన ఆలయాలు ఈ శిఖరాలతో రెండూ, ఓరుగంటికోటలో మూడూ, మట్టెవాడలో ఒకటీ, మడికొండదగ్గర ఒకటీ కనబడుతూండడమువల్ల ఈ రకపు శిఖరము కాకతీయుల కాలంలో కట్టినదే ననిపిస్తున్నది. శాసనకవిగారు ఈ శిఖరాల్ని "కైలాస మేరు మందర సమాన"ములుగానూ, ప్రాకారాన్ని "లోకాలోక పర్వత సన్నిభం" గానూ, వర్ణించి పెట్టారు.

నాలుగో దేవళము గర్భాలయమూ, అంతరాళమూ. (స్తంభాల) ముఖమండపమూతో భూమిలోనికి కొంత దిగిపోయివుంది. దీని శిఖరముకూడా పద్మాక్షి ఆలయ శిఖరంవంటిదే. ముఖమండపము అంచుచుట్టూ పిట్టగోడా, దానిమీద గజము వెడల్పున్న రాతిపలకలు పఱిచిన అరుగూ కాకతీయుల ఏక ఆలయాలన్నింటికీ వుంటాయి సామాన్యంగా. దీనికి లేవు. ఆలయం శిథిలమైనదికదా అని ఈ అరుగును భక్తకోటి ఇతరత్రా ఉపయోగించుకున్నా రనిపిస్తోంది. ప్రస్తుత ముపందులు పిల్లల్ని కంటున్నాయి ఈ ఆలయములో.

వేణుగోపాలస్వామి ఆలయమని ఈ వూరిలో ఈనాడున్నూ పూజలోవున్న ఆలయము కలదు. ఇది ఇతర శిథిల దేవాలయ శకలాలతో నిర్మించినట్టిది. రంగమండప స్తంభాలలో రెండు హనుమకొండ వేయిస్తంభాలగుడి మండప స్తంభాలవంటివే; మండప ప్రవేశముకడ శంఖలత మొలచిన అర్ధచంద్రశిల కలదు. ఈ శిల జైనాలయాలలో వుంటుంది సామాన్యముగా. హనుమకొండ ఆలయముముందు మండపము ద్వారాలకు ముందూ వున్నది. కనుక ఆ ఆలయాన్ని అనుకరించిన చౌండేశ్వరాలయము లోనిదేమో ఈ శిల గర్భాలయములోని వేణుగోపాల స్వామికి పైన. కోణముతేలిన పరికరము (విగ్రహము వెనుక దాపుగావుండే పలక) వున్నది. ఈ పరికరములో కాళీలున్నవి. ఈ విగ్రహము ప్రతాపరుద్రుని కాలమునాటిది కావచ్చును. పరికరముఅంచున పశ్చిమ చాళుక్యుల విగ్రహాలకుపైన కనబడే "మామిడిపిందెల పూలమాల" కలదు స్వామిమట్టుకు కాకతీయ విగ్రహాలవలె సన్నగా పొడుగ్గానే వున్నాడు. చేతిలోని వేణువు-రాతిది కనక-లావే అయిపోయినది. ఈ ఆలయ ఆవరణలో అనంతశయనుని విగ్రహమూ, నరసింహస్వామి విగ్రహమూ పడివున్నవి. ఆభరణాలూ, ఆయుధాలూ, మామిడిపిందెల పూలమాలలూ పరిశీలిస్తే ఇవి కాకతీయ శిల్పాలనే అనిపిస్తున్నవి.



అనంతశయనుడు - కొండిపర్తి



లక్ష్మీనరసింహస్వామి - కొండిపర్తి

హనుమకొండ రుద్రేశ్వరాలయ అంతరాళ ద్వారాల మీది శిల్పము - నృత్యనరసింహ, ఇంద్ర, నటరాజ శిల్పాలు కాకతీయులవే కదా? ఆ శిల్పమే కొంచెము పెద్ద సైజులో ఇక్కడ కానవస్తుంది. మట్టెవాడ రామలింగేశ్వరాలయ ద్వారము మీదిదీ, హైదరాబాదు మ్యూజియ మండపము లోకప్పుమీదివీ శిల్పములను నిర్మించిన శిల్పులకు ఈ రెండూ నిర్మించడము కష్టమే కాదు. కాగా కాకతీయ విగ్రహశిల్పానికి ఈ రెండూ చక్కని అలంకారాలు. నరసింహస్వామి చక్రము అయిహోళి తొమ్మిదో నంబరు దేవాలయ అనంతుని చక్రమువలెనే వర్తులములో ప్లస్ చిహ్నము కలది. అక్కడ నందకమువలెనే ఇక్కడి ముకుళము పడి వుంది. అమ్మవారి తలకట్టూ, ఇటూ అటూ చామర ధారిణులూ కాకతిశిల్పంలో తరచు కానవచ్చేటివే. ఈ రెండు శిల్పాలూ హైదరాబాదు మ్యూజియములో ఉండవలసినవి; ఎండలో వానలో శిథిలమౌతూ మట్టిలో అడవిమొక్కల నడుమ వేణుగోపాలాలయ ఆవరణలో కాదు.

సురాభాండేశ్వరాలయ మన్న దేవళము కొండి పర్తి చిత్రాలలో ఆఖరిది. సురాభాండేశ్వర గాథ-వీర శైవ విజృంభణ కాలమునాటిది-స్త్రీలపాటా, జంగము కథా, యక్షగానమూ గా వచ్చినది. ఈ పేరింటి ఆల యము ఇంకొకచోట లేదంటున్నారు స్థానికులు. ఈ ఆలయంలోని లింగము పైన బల్లపఱుపుగా, అరగ దీసిన అంచుతో వున్నది. ఈ రకము లింగాలు కాక తీయుల చివరి రోజులలో నిర్మించబడ్డవని నే నను కుంటున్నాను. కాకతీయులు తొలిరోజులలో పశ్చిమ చాళుక్యులనే అనుకరించి, పై భాగము వంపురేఖగానే వుండే లింగాలు ప్రతిష్ఠించారు. కాని ప్రతాపరుద్రుని కాలానివిఓరుగంటి కోటలోవే అయితేనేమి, బయటివే అయితేనేమి, పైభాగాన్న బల్లపరుపుగానే వున్నాయి. సురాభాండేశ్వరాలయ గర్భాలయము లోకప్పులో, చతురస్రము మూలలలో పరివారాలతో అష్టదిక్పాలు రున్నారు. ఈ లోకప్పు రాతిపలకలు పేర్చి మూసి నట్టిది. ఈ పలకలు సుమారు పదిపంద్రెండంగుళాల దళసరి గలవి. వీటి "దళసరిముఖాల" మీద పైన నర్తకీ, ఇటూ అటూ మార్దంగికులూ చొప్పున వున్నారూ, దిగువన నటరాజూ నగ్ననటీవర్గమూ వున్నారు. ఒక స్త్రీ "కచ్చడము" పట్టి నిలిచినది. కచ్చ డాలు పాలంపేట శిల్పాలలో కలవు.

సురాభాండేశ్వరాలయము చేపవన చెట్టుక్రింద శిథిలము చేసిన సూర్యుని విగ్రహపు పానపట్ట మున్నది. విగ్రహము పాదాల దిగువన ఏడుగుర్రాలు సూర్యుణ్ణి పట్టి ఇస్తున్నాయి. పాలంపేట ముఖమండ పము మూలలోని సూర్యుడూ ఇలాటి విగ్రహమే.

చెఱువుకట్ట దిగువన శిథిలదేవాలయ స్తంభాలు పడి వున్నాయి. రెండు చేతుల గణపతి ఒక్కడు మాత్రము ఒక బండమీద కూర్చున్నాడు. ఈయన శిఖ ఓరుగంటి శంభునిగుడి ఆవరణలోని గణపతి శిఖవలె శాస్త్రోక్తము - ఒకదానికంటె ఇంకొకటి ముందుకు పొడుచుకువచ్చే మూడు వర్తులాలది. అయితే రెండుచేతులేవుండడముజైనసంప్రదాయం*. కొండిపర్తి ఈనాడు రైలుకీ రోడ్డుకీ దూరంగా వున్న కుగ్రామము. కాని ఆనాడు కలకలలాడే పట్నమే ఎన్ని దేవళాలూ!



* మధుర కంకాళిశిలస్థూపముకిడనున్న గణపతి రెండు చేతులవాడు. గోకర్ణక్షేత్రములోనూ వున్నాడు రెండుచేతుల గణపతి. మరి ఆయన మొదటలో జైనుడేనేమో!

# ఆలయశిల్పం

శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు

ఆలయశబ్దానికి గృహమనీ, నివాసమనీ అర్థాలున్నవి. ఎవరు నివసించే నివాసాలైనాసరే ఆలయాలు కావచ్చు. దేవతల నివాసమైన స్వర్గానికి "త్రిదశాలయ" మని పేరున్నట్లు అమరకోశం చెబుతున్నది. అలాగే మనుష్యులమైన మనం నివసించే స్థానాలకుగూడ ఆలయశబ్దం మొదట వుపయోగింపబడివుంటుంది. కనుకనే మన గృహాలకు మనుష్యాలయ పదంగూడ ప్రయుక్తమైవున్నది. వాస్తు గ్రంథ సమూహంలో "మనుష్యాలయ లక్షణం" "మనుష్యాలయ చంద్రిక" అనే పుస్తకాలు గృహనిర్మాణ ప్రకారాలను బోధించేవిగా వున్నవి. కాబట్టి మనుష్యాలయాలంటే మానవ నివాసయోగ్యాలయిన ఇండ్లు, మిద్దెలు, మేడలు, ప్రాసాదాలు మొదలైనవని సుగమం చేసుకోవచ్చు. మానవుల నివాసాలను మానవాలయాలు, మనుష్యాలయాలు అన్నట్లే దేవతల నివాసగృహాలను దేవాలయాలనడం పరిపాటి అయినది. కాలక్రమేణ మనుష్యాలయం గృహ, భవన, సౌధ, ప్రాసాదాది వివిధ పదాలచేత చెప్పబడుతూ దేవాలయపదం మాత్రమే శేషించివుంటుంది. ఇంకా భాష పరిణమించిన కొలదీ - అందులోనూ మన తెలుగులో - ఆలయమంటే దేవాలయమనే అర్థమే ఎక్కువగా కనబడుతున్నది. దేవాలయ పదానికి పర్యాయంగా సంస్కృతభాషలో దేవమందిర, దేవప్రాసాద, దేవాయతనాది పదాలుగూడ వాడబడినట్లు మనం గమనించుతున్నాం. హిందీ మొదలైన కొన్ని ఔత్తరాహభాషలలో "మందిర" శబ్దాన్ని నేడు దేవాలయమనే అర్థంలోనే వాడుతున్నారు. అలాగే తెలుగులో ఆలయమంటే దేవాలయమనే* అర్థమే వ్యావహారికంగా కనబడుతున్నది. ఈ వ్యాసోద్దేశం కూడ ఆలయ శిల్పమంటే దేవాలయ శిల్పమనే.

ఆలయాలకూ మతాలకూ ఘనిష్ఠమైన సంబంధం వున్నది. ఆయా మతాలతోపాటే ఆ మత సంస్కృతులకు ఆటపట్టులైన ఆలయాల చరిత్రగూడ అనుసంధింపబడి వుంటుంది. కనుక ఆలయ శిల్ప ప్రస్తావనలో మతప్రశంసగూడ అనివార్యం. హిందూదేశంలో ప్రముఖములైనవి జైన బౌద్ధ వైదిక మతాలు. వీటిలో అతి ప్రాచీనమైనది వైదికమతం. దానితరువాత జైనమూ, పిమ్మట బౌద్ధమూ పుట్టినవి. ఈ మూడు మతాలవారికీ ఏదో ఒక రూపంలో దేవాలయాలున్నవి. అయినా ముందుగా పేర్కొనదగినవి వైదికములైన దేవమందిరాలే. వేదకాలంలోనే ఇంద్ర-మిత్ర-వరుణ-రుద్ర-అగ్న్యాదులకు మూర్తి కల్పనంచేసి ఆరాధిస్తున్నట్లు వేదమంత్రాలలోనే ఆధారాలున్నవి. తాంత్రికవిధానం పెరిగిన పౌరాణికయుగంలో త్రిమూర్తులపూజ, శక్త్యారాధన బాగా పెంపు చెందినది. వివిధ దేవతలకు రూపకల్పన చేయబడి మూర్తిపూజ జరుగుతున్న కాలంలోనే వారికి ఏదో ఒక రూపంలో ఆలయాలు నిర్మితాలయి వుండవచ్చు. అయితే ఆ వేదకాలంనాటి దేవాలయాల స్వరూపం ఎలావుండేదో తెలుసుకొనడానికి మనకు ఆధారాలంతగా లేవు. మొహంజోధరో హరప్పాలనాటి చిహ్నాలనుబట్టిగూడ నాటి దేవాలయ స్వరూపం నిర్ణయించడానికి తగిన ఆధారాలు చిక్కలేదు. ఇంకా ఎక్కడైనా త్రవ్వకాలుజరిగితే ఏమైనా చిహ్నాలు లభిస్తాయేమో అని మనం ఆశించడం అత్యాశకాదనిగూడ తోస్తున్నది.

---

*"మందిరశబ్దానికి దేవాలయార్థంతో తెలుగులోను వ్యవహారంలో ఉన్నది. ఉదా: రామమందిరం."

చాణక్యుని అర్థశాస్త్రంలో - నగరంలో నియమిత ప్రదేశాలలో కొందరు దేవతల మందిరాలు నిర్మింప బడాలని విధి వున్నది. నగరమధ్యంలో లక్ష్మీ దేవ్యాలయం వుండాలని చాణక్యుని అభిప్రాయం. దీన్ని బట్టి చూస్తే, అంతకు పూర్వకాలంనుండికూడ దేవాలయ నిర్మాణం ఆచరణలో వుండేనేగాని అతని కాలానికది ఒక శాస్త్ర విధానంగా రూపొంది వుండదని వూహించవచ్చు. తరువాత శుంగరాజులకాలంలో వైదికమతం అభివృద్ధి పొందడంవల్ల దేవమూర్తులు నిర్మితాలై తత్పూజ బాగా ప్రచలితమైనది. వీరి కాలానికి చెందిన పంచముఖ శివలింగం ఒకటి లభించినది. మద్రాసు రాష్ట్రంలో "గుడిమల్లం" అనే ప్రదేశానగూడ ఒక శివలింగం లభించింది. అయిదడుగుల యెత్తుగల ఈ శివలింగంమీద శివమూర్తి చెక్కబడి వున్నది. ఈచిహ్నాలనుబట్టి యీ కాలంలో శివార్చన బాగా ప్రబలి వున్నదని గ్రహించవచ్చు.

శుంగరాజుల తరువాత అధికారానికి వచ్చిన కుషాణులు బౌద్ధమత ప్రియులయినందువల్ల హిందూమతమూ, దేవాలయాదులూ దెబ్బతిన్నవని జాయస్వాల్ పండితుడు తన "అంధకారయుగీన భారత్" అనే పుస్తకంలో వివరించినాడు. దాని కాధారాలనతడు మహాభారతం వనపర్వంలోనుండి చూపినాడు. "కుషాణులు వైదికదేవతల పూజలకు నీళ్లు వదలి ఎముకలను పూజిస్తారని భారతము చెపుతున్నదట. అంటే ఎముకలుపెట్టి కట్టిన బౌద్ధస్తూపాదులను పెంపుచేసి ఆరాధిస్తారనే కదా అర్థం? దానికి తగినట్లు కుషాణుల నాటి శిల్పం అంతా బౌద్ధమయంగానే వున్నది. ఈ కుషాణులు నాశనం చేసినందువల్లనే అంతకుపూర్వం వున్న హిందూదేవాలయ దేవమూర్త్యాదులు నష్టమై వుంటవని ఈ పండితుని అభిప్రాయం.

శుంగవంశం తరువాత నాగవంశపు రాజులు పరిపాలకు లయినారు. వీరు యాదవక్షత్రియులు. శకుల నుండి దేశాన్ని విముక్తం చేసి వీరు ఆర్యావర్తాన్ని పాలించినారు. వీరు పరమశైవులు. లింగధారణం కూడ చేసికొని శివతత్వాన్ని ఆరాధించిన పరమ మాహేశ్వరులు నాగవంశీయులు. అందుకనే వీరికి "భారశివు" లనికూడ పేరు వచ్చినది. శిల్ప-వాస్తు శాస్త్రాలలో ఒక శైలిగా స్థానం సంపాదించుకొన్న "నాగరశైలి" కి వీరే ప్రవర్తకులని కొందరు పండితుల అభిప్రాయం. నాగరాజుల కాలంలో-వారి పోషణ వల్ల ప్రచారమైనది కాబట్టి దానిని "నాగరశైలి" అన్నారట. మొత్తంమీద భారతదేశపు శిల్పవాస్తు సంప్రదాయంలో "నాగర" పదం ఒక ప్రత్యేకార్థం కలదిగానే కనబడుతున్నది. స్కాంద పురాణంలోని ఒక ఖండానికే "నాగరఖండ" మనేపేరు వున్నది. కనుక ఈ నాగరపదాన్ని గూర్చి ఇంకా పరిశీలన జరగాలని నా అభిప్రాయం. ఈ నాగరాజుల కాలంలో దేవాలయ శిల్పం బాగానే వెలసినది. నాగరాజు తర్వాత వాకాటకుల పాలన ప్రారంభమయినది. వీరు యావద్భారత దేశాన్ని ఒక్క పతాకం క్రిందికి తీసుకురావడానికి ప్రయత్నం చేసిన ప్రతాపశాలులు. భారశివులవలెనే వీరుగూడ శైవులే. వీరి కాలంలోనూ అనేక శివ మందిరాలు వెలసినవి. ఏకముఖ - చతుర్ముఖ శివ మూర్తులు ఎంతో అందచందాలతో తీర్పబడ్డవి వీరి కాలంలో ప్రబలినవి. ఈ కాలపు దేవాలయాలమీద అలంకారశిల్పం గూడ కొంచెంగా పెరిగినది. శివాలయంమీద కైలాసచిహ్నమూ, పార్వత్యాలయం మీద హిమాలయచిహ్నమూ శిఖరాలుగా వీరి కాలంలో తీర్చేవారు. భారశివులతో ప్రారంభమయిన శైవమందిరాలు వాకాటకులతో అభివృద్ధి చెంది గుప్తరాజుల కాలానికి ఒక పూర్ణ స్వరూపాన్ని సంపాదించుకొన్నవి. తరువాత పై వారి శిల్పశైలి గుప్తరాజులవల్ల సమున్నత స్థానాన్ని పొంది ప్రకాశించింది. ఈ కాలపు శిల్పంలో ఎంతో వికాసం గోచరిస్తున్నది. స్వర్ణయుగమని చెప్పబడే గుప్తుల కాలం కళాసాహిత్యాది సర్వవిషయాలకు పూలకారు అనడంలో సందేహం లేదు. ఎందుకనోగాని గుప్త రాజులనాటి దేవాలయాలు ఎక్కువగా లేవు. ఐహోలు వద్ద మాత్రం (బొంబాయిప్రాంతం) కొన్ని దేవళా

ఉన్నవి. అక్కడి దుర్గాలయమూ, హుచ్చిమల్లిగుడి, ప్రాచీన లక్షణాలు గలవై శిల్పవాస్తు విషయకాభిక్రమం అంతగా వేనప్పటిగా పొడకట్టుతున్నవి. సముద్రగుప్తుని పట్టమహిషి కట్టించిన విష్ణుదేవాలయమొకటి సాగరజిల్లాలో వున్నదట. గుప్తరాజులు హిందూ బౌద్ధాది విభేదం పాటించకుండా కళాసేవ చేశారని చెప్పవచ్చు. కుమారగుప్తుడు నలందాలో ఒక మహా బౌద్ధ విహారాన్ని స్థాపించినాడు. అదే తరువాత మహావిశ్వవిద్యాలయంగా రూపొందినది. అజంతాలోని కొన్ని గుహలుగూడ గుప్తశిల్ప ప్రభావం పొందినట్టివని తెలుస్తున్నది. గుప్తుల కాలంలో కుమారస్వామి పూజ విస్తారంగా వుండేది. కుమారగుప్త, స్కందగుప్తాది నామధేయాలు తద్దేవతాభక్తి సూచకాలే. కనుకనే ఆ కాలపు శిల్పంలో కార్తికేయ శిలాప్రతిమలు అటనట గోచరిస్తున్నవి. ఏది ఎలా వున్నా, దేవాలయానికి ఒక పరినిష్ఠిత పరిపూర్ణ స్వరూపలాభం కలిగింది దక్షిణదేశంలోనే అనాలి. అదిగూడ చాళుక్య-పల్లవరాజుల కాలంలోనే అని చెప్పడం సాహసం కాదు. దక్షిణోత్తర దేశాలలో ఏవైనా శిథిల దేవాలయాలు గోచరించినా, అవి ఆరో శతాబ్దినుండే ఎక్కువగా కనబడుతున్నవి.

## ఆలయస్వరూపం

దేవాలయంలో ముఖ్యమైన భాగం గర్భగృహం. ఇదే దేవస్థానం (దేవునికి నివాసస్థానం) దీన్ని హృదయంతో పోల్చవచ్చు. ఈ గర్భగుడిలోనే మూలవిరాట్టు వుంటాడు. తరువాతి భాగం అంతరాళం. ఇది గర్భాలయానికి ముందటి భాగం అన్నమాట. ఇక్కడ ఉత్సవార్థమైన మూర్తులవీ వుంటవి. దైవదర్శనార్థులు ఇక్కడ నిలబడే దేవుణ్ణి సందర్శిస్తారు. తరువాతిది ముఖమండపం. ఈ ముఖమండపంలో పరివారదేవతలు— అప్రధానాలైన యితర దైవతాలు గూడ వుండవచ్చు ఇది దర్శనార్థులకు దర్శనసమయపు విశ్రాంతిశాలగా గూడ వుపయోగపడుతుంది. ఈ మూడు విభాగాలు కారహస్తి ఉన్నాయి దక్షిణదేశపు దేవాలయాలలో విస్తీర్ణమైన వుంటవి. తరువాత ప్రదక్షిణవీథి, ప్రాకారాలు, ద్వారగోపురాదులు వుంటవి. దేవాలయానికెదుట నిర్ణీత స్థానంలో ధ్వజస్తంభం వుంటుంది. ముఖమండపంలో ప్రధానదేవత కభిముఖంగా ఆ దేవత ఎక్కే వాహనం వుంటుంది. శివాలయాలలో నందిని, శక్త్యాలయాలలో సింహాన్ని, విష్ణ్వాలయాలలో గరుత్మంతుని మనం చూస్తానే వుంటాము. ఆలయ ప్రాకారానికి లోపల కల్యాణ మండపాలు, ఆస్థానమండపాలు, పూర్ణమండపాలు మొదలైనవి అనేకం వుండవచ్చు. ఇంకా పరివార దేవతలకు, సప్తమాతృకలకు, నవగ్రహాలకు ప్రత్యేక ప్రత్యేక మందిరాలున్నూ ఏర్పాటుచేసుకోవచ్చు.

ఇక ఆలయంమీద శిల్పం జగన్మోహనంగా తీర్చుకోవచ్చు ఆలయకుడ్యాలమీద దశావతార చిత్రాలు, శివ విష్ణ్వాదుల లీలాచిత్రాలు, రామాయణ భారత భాగవతాది పౌరాణిక-చారిత్రక గాథాశిల్పాలు ఎన్నో చెక్కుకోవచ్చు. ఇలాంటివి ఒక్కటేమిటి- శిల్పికి ఇష్టమయిన చరిత్రలన్నీ లావణ్య సౌందర్యాలు చిందులుతొక్కేటట్లు ఆలయంమీద ప్రదర్శించవచ్చు. కుడ్యాలమీదే కాక ఆలయ స్తంభాలమీద, ద్వార శాఖలమీద, పై ఆచ్ఛాదనలలో ఎంతటి శిల్ప కౌశలాన్నైనా చూపవచ్చు. ఇలాంటి ఉత్తమ శిల్పకళకు నివాసాలైన ఆలయాలు దక్షిణదేశంలోను, మైసూరురాష్ట్రంలోనూ పెక్కులున్నవి. హొయసాల రాజులకాలంలో వెలసిన ద్వారసముద్రం (హలేబీడు) లోని వైశాలేశ్వరాలయం, సోమనాథపురంలోని కేశవాలయం, బేలూరిలోని చెన్నకేశవస్వామిగుడి లోకోత్తర శిల్పాలకు ఆటపట్టులైనట్టివి. ఈ దేవళాలలోని స్తంభాలమీది శిల్పం ఒక ప్రత్యేకగ్రంథంగా వర్ణింపదగిన చరిత్ర కలది. అసలు హిందూదేశపు స్తంభ శిల్పమే అలాంటిది.

దేవాలయ స్వరూపం మొదట గర్భగృహరూపంగాను, అంతరాళరూపంగా మాత్రమే వుండేదని వూహించవచ్చు. ముఖమండపాదులు, ధ్వజాలు,

ప్రాకార గోపురాదులు కళావికాసం జరిగినకొద్దీ ఏర్పడి వుంటవి. గర్భగృహం మీద వెలసిన కిరీటాకృతిగల శిఖరం ప్రత్యేకాభిప్రాయంతో ఏర్పడి వుంటుందని కొందరు పండితులంటున్నారు. మేరు-మందర-హిమాలయాది పర్వతశిఖరాలు దేవనివాస భూములని మనకు వర్ణనలున్నవి. ఆ పర్వత శిఖరాకృతియే గర్భాలయం మీద కిరీటాకృతిగా తీర్చబడి వుంటుంది. పర్వతాలమీద యక్ష గంధర్వ కిన్నరాప్సరసలు విహరిస్తూ వుంటారు కనుక, వారి స్వరూపాలే మన ఆలయద్వారపాలకుల రూపంగానూ, యక్షదంపతుల రూపంగాను, అప్సరోనృత్యరూపంగాను నానావిధాల అవతరించినవనికూడ ఊహించడం అసమంజసం కాదు. బౌద్ధశిల్పంలోగూడ యక్ష యక్షిణీ స్వరూపాలు, అప్సరోనృత్యాలు అగపడుతున్నవిగదా.

ఈ సందర్భంలో దేవాలయానికి సంపూర్ణసుందర స్వరూపం కల్పించిన మన దక్షిణాపథ ఆలయశిల్ప చరిత్రను దిఙ్మాత్రంగా సింహావలోకనం చేద్దాము.

హిందూదేశంలో దక్షిణోత్తర ప్రాంతాల ఆలయ శిల్పాలు ప్రత్యేక ప్రత్యేక సంప్రదాయాలు గలవిగా వున్నవి. వాటిలో దక్షిణదేశపుటాలయ శిల్పం మయమతానికి చెందినదనీ, ఉత్తరదేశపుది కాశ్యప శిల్పానికి చెందినదనీ అంటారు. ఈ విభేదం ఆధునిక దేవాలయాలకు సంబంధించినదే అని చెప్పవలె. అతి ప్రాచీనాలైన ఆలయాలు ఈ మయకాశ్యపాది మతాలకు లోబడివుండేవికావు. అవి విశ్వకర్మ వాస్తుకు సంబంధించినవైగాని, అసలు ఆధునికాలైన శాస్త్రాలకు రూపం ఇచ్చే ప్రత్యేక ప్రధానలక్షణాలు గలవైగానీ అయివుంటవి. అసలీ శిల్పశాస్త్రాలు ఏనాటివో తేలితేకాని, ఆ విషయం విస్పష్టంగా నిర్ణయించడానికి వీలు లేదు. సరే, అది అలా వుంచుదాం. మయమతానికి చెందిన శిల్పాన్ని ద్రావిడ శిల్పం అనికూడ అనవచ్చు. అయినా, కొన్నికొన్ని ఆలయాలలో కొన్ని ప్రత్యేక ప్రత్యేక లక్షణాలు లేకపోలేదు. అవిఅన్నీ ఆ యా శిల్పాచార్యుల ప్రతిభా సముత్థితాలని మనం వ్యాఖ్యానించుకోవాలి.

పల్లవరాజులకు పూర్వం బాదామి ప్రాంతాన్ని పాలించిన చాళుక్యులే దేవాలయ శిల్పం ఆరంభించిన ఘనతకు పాత్రులయినారు. వీరికాలానికి చెందిన ఆరవ శతాబ్దపు ఆలయం ఒకటి బాదామికొండమీద వున్నది దీన్ని "మాలెగిత్తి శివాలయం" అని ఈనాడంటున్నారు. ఇది గర్భగృహం, అంతరాళం కలిగి తరువాతి దేవాలయాలకు మాతృక కాదగిన ప్రాచీన శిల్ప వాస్తులక్షణాలతో ఒప్పుతున్నది. అంతరాళానికి ముందు ఒక చిన్న స్తంభమండపంగూడ దీనికి వున్నది. ఈ చాళుక్యుల ఆలయశిల్పంలో దక్షిణోత్తర శిల్పరీతుల సమ్మేళనంగూడ సూక్ష్మంగా గోచరిస్తుంటుంది.

తరువాత క్రీస్తుశకం ఏడో శతాబ్దినుండి తొమ్మిదో శతాబ్ది మధ్యదాకా పల్లవశిల్పం వెలసినది. ఇది హైందవ శిల్పానికి పూలకారు అని చెప్పదగ్గ కాలం. పల్లవరాజులు మహాబలిపురంలో వెలయించిన పంచపాండవుల జాతిరథాలు, అనేకములైన గుహాలయాలు ప్రత్యేక ప్రాధాన్యం కలిగినట్టివి. వీరికాలంలోనే జాతి దేవాలయాలు నిర్మితాలైనవని కూడ ఒక వాదం వున్నది. మహామల్లపురంలో సాగరతీరాన నిర్మించిన ఏడు రాతి దేవాలయాలలోనూ ఒక్కటి మాత్రమే నేడు దర్శనమిస్తున్నది. రాజసింహవర్మ కాలంలో కంచిలో వెలసిన కైలాసనాథ దేవాలయం వాస్తుశిల్ప లక్షణాలలోను, శిల్ప సౌందర్యంలోను మకుటాయమానమైనట్టిది. ఇలాంటిదే కంచిలోని వైకుంఠపెరుమాళ్ కోవెలకూడా. పల్లవ రాజులు హిందూ శిల్పాలనే కాకుండ ఆనాడు కంచిలో ప్రచారంలో వున్న జైనమతానికిన్నీ ఆశ్రయమిచ్చి జైన దేవాలయాలను గూడ నిర్మింపజేసినట్లు తెలుస్తున్నది. జైనకంచిలో వున్న జైనదేవాలయాలు వీరి సొమ్మొతిననివి కావు.

పల్లవుల తర్వాత పరిపాలనకు వచ్చిన చోళ పాండ్య రాజులుగూడ పల్లవుల మార్గాన్నే అనుస

రించి ఆలయశిల్పాన్ని వృద్ధిచేసివున్నారు. వీరి కాలంలో ఆలయం అర్ధమండప, మహామండప, గోపుర ప్రాకారాది వివిధ విశేష శిల్ప వైభవాలను సంపాదించుకొన్నది తంజావూరులోని రాజరాజేశ్వ రాలయం, మధుర, శ్రీరంగం, అనంతశయనం, అరుణాచలం మొదలైన తావులలోని ఆలయాలు చక్కని రూపురేఖలతో ప్రకాశించినవి వీరి కాలానే. పదినుంచి పదమూడో శతాబ్ది దాకా మైసూరు రాష్ట్రంలో హొయసాల రాజుల పాలనలో అత్యద్భుత శిల్ప చిత్రితాలైన ఆలయాలు-సోమనాథపురం, హళేబీడు, బేలూరు మున్నగు తావులలో వెలసినవి. ఈ సందర్భంలో శ్రామణ బెళగొళంలోని జైనదేవాలయాలు, జైనశిల్పం గూడ స్మరణార్హములే. ఓఢ్రదేశంలోని కోణార్క సూర్యదేవాలయం, పూరీలోని జగన్నాథాలయం, భువనేశ్వరంలోని లింగ రాజాలయ - పరశురామేశ్వర - ముక్తీశ్వరాలయాలు శిల్పకళకు పుట్టినిండ్లు. ఇంకా అక్కడి 'రాజారాణి' ఆలయంకూడ అనర్ఘమైన శిల్పకళాప్రాభవం కలదే. ఈ ఆలయాలు కాశ్యపశిల్ప సంప్రదాయ విశిష్టాలు. ఇవి అన్నీ గంగవంశపురాజులు కట్టించినవే.

ఆంధ్రదేశపు ఆలయ శిల్పచరిత్రలో కాకతీయుల దొక యుగం అని చెప్పవచ్చు. వీరి శిల్పానికి కొన్ని ప్రత్యేకలక్షణాలున్నవి. ఈ కాలంలో రామప్ప శిల్పాచార్యుడు నిర్మించిన "రామప్పదేవాలయం" దక్షిణ దేశపు శిల్పకళావైభవానికి కీర్తి స్తంభంలాంటిది. ఇంకా హనుమకొండలోని సహస్ర స్తంభమంటపం, వరంగల్లులోని నందీశ్వరుడు చెప్పతగ్గవి. దక్షిణ దేశాన చాళుక్య పల్లవరాజులతో ప్రారంభమయిన ద్రావిడ సంప్రదాయ విశిష్టమైన ఆలయశిల్పం విజయనగరరాజులద్వారా పరిపూర్ణ వికాసాన్ని సంపాదించు కొని విజృంభించినది. హంపీలోని హజారరామాలయం, విఠలస్వామిగుడి, విరూపాక్షాలయాదులు సుప్రసిద్ధాలు. కృష్ణదేవరాయలు దక్షిణదేశపుటాలయాల కెన్నిటికో వన్నెలు చిన్నెలు కూర్చి వాటికి సమగ్రస్వరూపశోభను సంపాదించినారు. ఈవిధంగా ఆలయశిల్పం తంజావూరు పాలకుడైన రఘునాథ రాయలవరకు విజృంభించి ఆయన ఆశ్రితులద్వారా గూడ కొనలు సాగుతూ వచ్చింది.

## గుహాలయాలు

శాతవాహనుల కాలంలోను, ఇక్ష్వాకుల కాలంలోను కార్లీ, కన్హెరీ, నాసికలలో గుహాలయాలు నిర్మితాలయినవి. కార్లీ గుహలో తన్నిర్మాతలైన ఆంధ్రరాజులయు, రాణులయు మూర్తులు గూడ చెక్కబడివున్నవి. అజంతా గుహాలయాల చరిత్ర క్రీస్తుకు పూర్వంనుండే ప్రారంభమయినది. అక్కడి 9,10,12 సంఖ్యలుగల గుహలు క్రీస్తుకు పూర్వం ఒకటి రెండు శతాబ్దులనాటివని విస్పష్టం. బౌద్ధ గుహాలయ నిర్మాణోద్దేశ్యానికి మూలం ఇలా కావచ్చునని విద్వాంసులు అభిప్రాయపడుతున్నారు.

పూర్వకాలంలో సన్న్యాసులు కుటీరాలలో నివసిస్తూ వుండేవారు. బుద్ధునికి ఒక "గంధకుటి" వుండేదని బౌద్ధ సారస్వతం చెబుతున్నది. ఈనాడు "సారనాథ్"లో మూలగంధకుటీవిహారం వున్నదనీ, మన నాగార్జునకొండ త్రవ్వకాలలో దొరికిన బుద్ధ ధాతువును అక్కడ నిక్షేపించినారనీ మన మెఱుగుదుము. విరక్తులైన యీ బౌద్ధ సన్న్యాసులకు విహారభూములైన కుటీరాలే కాలక్రమాన పెద్ద పెద్ద బౌద్ధవిహారాలుగా పరిణమించివుంటవి. భర్‌హూత్ స్తూపశిల్పం మీద "సుధర్మా" అనే దేవసభాచిత్రం వొకటీ, దానికెదురుగానే కుటీరం వొకటీ చెక్కబడ్డ శిల్పం వున్నది. ఆనాటి యీ కుటీరాలే బౌద్ధ గుహావిహారాలుగా చైత్యాలుగా కుటుల ఆకారంలో వాటికి ప్రతిబింబాలుగా — అనుకరణలుగా వెలసినవి. అజంతా — ఎల్లోరా మొదలైన తావులలోవున్న జైన-బౌద్ధ గుహాలయాలు బౌద్ధ సన్న్యాసులకు, భిక్షువులకు, ఉపాసకులకు, విహార మందిరాలుగానూ, అనుష్ఠాన స్థానాలుగానూ, ఉపన్యాసశాలలుగానూ ఆదిలో వుపయోగపడి వుంటవి. కాలక్రమేణ వాటిని బౌద్ధ శిల్పాలతోనూ మూర్తులతోనూ

అలంకరించుకొని, చిత్ర కళాశోభితం చేసుకొని బుద్ధమూర్తులనూ, స్తూపాలను గూడ అందులో నిర్మించుకొని వారు వాటికి సమగ్ర గుహాలయ స్వరూపం సంపాదించుకొనివుంటారని వూహించవచ్చు. పిమ్మట వెలసిన హిందూ గుహాలయాలకు గూడ ఇవి మార్గదర్శకాలైనా అయివుండవచ్చు. చాళుక్యుల కాలంలోనూ, రాష్ట్రకూటుల సమయంలోనూ వెలసిన బాదామి గుహాలయాలూ, కొన్ని ఎల్లోరా గుహాలయాలూ ఇందుకు దృష్టాంతం. బాదామి గుహలలోని శైవవైష్ణవ శిల్పమూర్తులు అత్యద్భుత శిల్పకళానిధానాలు.

బౌద్ధస్తూపాలకూ హిందువుల దేవాలయాలకూ ఒక విభేదం గోచరిస్తున్నది. హిందూ దేవాలయాలు సృష్టిస్థిత్యాద్యనేక క్రియలకు ప్రవర్తకమైన ఒక అచింత్యశక్తికి చిహ్నాలైన దైవమూర్తులకు నివాసభూతాలైనట్టివి. అందుకే ఆదిమకాలంలో దైవానికి గుర్తుగా లింగశబ్దాన్ని వాడినారు. లింగమంటే చిహ్నమనిగదా అర్థం ? కాలక్రమేణ నానావిధ నామరూపాలతో దైవతత్వం విలసిల్లినది. "ఏకంసద్విప్రా బహుధా వదన్తి." అనే ఆదిమతత్వాన్నే "ఏకం రూపం బహుధా యః కరోతి ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే." అన్న శ్రుతిప్రకారం నానావిధాలుగా ఆరాధించడం వైదికమహర్షుల హృదయం. అది పౌరాణికాగమ సంప్రదాయాలతో నానాప్రకారాల విలసిల్లి ఆస్తికులూ - విగ్రహారాధనప్రియులూ అయిన హిందువులకు ఆరాధ్యం అయినది. బౌద్ధ స్తూపాలు ఇలాంటి దైవతత్వానికి నివాసాలుకావు. అవి మృతులైనవారి శారీరకధాతువులు గలవై వారికి చిహ్నాలైనవి. వాటికి చితాసంబంధం వున్నది. అందుకనే అవి చైత్యాలుగా గూడ ప్రసిద్ధి పొందినవి. అనేక స్తూపాలు బుద్ధుని యొక్కయు, తన్మతాచార్యుల యొక్కయు శారీరక చిహ్నాలు వుంచి కట్టబడినట్టివే కదా ? ఇంకా స్తూపం అనేది మహాపరినిర్వాణానికి చిహ్నంగూడ గనుక ఇలాంటి విభేదం స్పష్టం. అయితే మహాయానం ప్రబలినప్పటినుండి బౌద్ధుల దృష్టిలో బుద్ధుడు ముప్పదిమూడుకోట్ల దేవతలకంటే, త్రిమూర్తులకంటే గూడ గొప్పవాడు కాబట్టి బౌద్ధస్తూపానికిగూడ దేవాలయ లక్షణం ఆభాసించి అది బౌద్ధదేవాలయం అయివుంటుంది. బుద్ధవిగ్రహం గల దేవాలయాలు భారతదేశంలోను చీనా, జపాను, టిబెట్టు, బర్మా, సింహళాలలోనూ గూడ వున్నవి. అవి యీ హిందూ దేవాలయాలకు అనుకరణలే అనినీన్నీ అనడానికి అవకాశం లేకపోలేదు అనుకరణాలన్న విషయం అందరూ అంగీకరించకపోయినా, రెంటికీ అనేక విషయాలల్లో పోలిక వున్నదని ఒప్పుకోక తప్పదు.

దేవాలయానికి గర్భగృహం, అంతరాళం, మండపం, ప్రదక్షిణవీథి, ప్రాకారం, ప్రాకారద్వార గోపురాలూ వున్నవి. ఈ సంప్రదాయమే బౌద్ధ స్తూపాల విషయంలోగూడ మనం చూస్తున్నాము. స్తూపంలోపల వుండే ఎముక దేవునివంటిది. స్తూపమే ఆలయం. స్తూపంచుట్టూ ఒక వేదిక, తరువాత ప్రదక్షిణ వీథి, ప్రాకారం, ఆ ప్రాకారానికి నాలుగు వైపులా నాలుగుద్వారాలూ, వానిమీద తోరణాలు మనకు గోచరిస్తవి. ఈ లక్షణాలు అమరావతి, నాగార్జునకొండ, సాంచీ, సారనాథ్, బార్హూత్ మొదలైన స్తూపాల విషయంలో అగపడుతూనే వున్నవి. సాంచీ స్తూపద్వార తోరణాలు భారతీయ బౌద్ధ వాస్తు శిల్పంలో ప్రత్యేకంగా పరిగణనార్హాలు. అమరావతీ స్తూపానికిన్నీ ప్రాకారమూ, చతుర్ద్వారాలూ లేకపోలేదు. ఈ చతుర్ద్వారాలకూ ఎదుట తోరణాలుకాక, ఆర్యక స్తంభాలు అయిదేసి చొప్పున వెలసినవి. ఈ ఆర్యక స్తంభాల రహస్యమూ, ప్రత్యేకత నా అమరావతిలో వివరించి వున్నాను. హిందూ దేవాలయ ప్రాకారగోపురాలకూ, స్తూపప్రాకారద్వార తోరణాలకూ ఇలాంటి చుట్టరికం వున్నట్లు స్పష్టమవుతూనే వున్నది. గోపురశిల్పానికి దక్షిణదేశమూ, తోరణ శిల్పానికి ఉత్తరదేశమూ విజయధ్వజాలెత్తినవి.

హిందువులవలెనే జైనులుగూడ మొదటినుండీ విగ్రహారాధకులే. వారి తీర్థంకరులకు ఆలయాలు

నిర్మించి పూజించే ఆచారం వారిలో వున్నది. జైన మతానికీ, జైనాలయాలకూ గుజరాతుదేశమే ఆట పట్టు. అయినా రాజపుత్రస్థానంలోని - "మౌంటు అబూ" పేర్కొనదగినది. ప్రాచీనతలో జైనకంచి లోని జైనాలయాలూ, శ్రవణ బెళగుళంలోని కొన్ని ఆలయాలూ మొదట చెప్పదగ్గవైనా, శిల్ప సౌందర్య విషయంలో మౌంటు అబూదే అగ్రస్థానం. ఇవి 11 నుండి 13 శతాబ్దివరకు నిర్మితాలైనవి. "అబూ కొండ" అంటే అర్బుదపర్వతమని అర్థం. ఇవి దిల్వారుగ్రామానికి సమీపస్థం. దిల్వారంటే "దేవాలయ రాజధాని" అని భావము. మొత్తంమీద అలాంటి సౌగ్రతర శిల్పానికే ఈ జైనాలయం అందమై ప్రపంచకళాయాత్రికులను ఆకర్షిస్తున్నది.

ఈ వ్యాసంలో మిక్కిలి సంగ్రహంగా ఆలయ శిల్పానికి సంబంధించిన రేఖాచిత్రం చూపినాను. చరిత్రకాద అంతే ఏ విషయాన్ని విస్తరంగా చెప్పడానికి అవకాశం లేకపోయింది. ఒక ఉద్గ్రంథం వ్రాయదగ్గ విషయాన్ని వ్యాసంలో ఏం చూపగలుగుతాం!



# ప్రభూ !

పండిత శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరి

గౌనములె పూజ్యభావమునకుం గుదురై కులగోత్రభేదముల్
మనమునఁ జేరనీక పదిమందిని 'మంచిగఁ' జేసికొంచు, వ
ర్తనమున దోసమం చెఱుఁగు దానిని ద్రోసియు సంచరించునా
తనికిఁక జాతియేల ? మతధర్మమిఁకెందులకయ్య ! యీశ్వరా !

చాతుర్వర్ణ్యపుఁ గట్టుబాటులు సదా సారస్యముంగూర్చి, యే
జాతిన్ గ్రిందును మీఁదు సేయక జగచ్ఛాంతిన్ బ్రసాదించుచో
నాతంకం బది యేరికుండును బ్రభూ ! అయ్యాయి ఘట్టంబులన్
స్వాతంత్ర్యం బిఁక వేఱె కావలయునా ? స్వారాజ్యమేదక్కెఁడిన్.

తక్కుఁ మతంబులన్నియుఁ బ్రధానముగాఁ దమ ముఖ్యసూత్రముల్
చక్కఁగ బోధచేసి సరసత్వము చూపి ప్రచారబుద్ధితో
నెక్కుడు మేలుకూర్చెడిసుమీ ! యను తత్త్వ మొకింతలేకయే
నిక్కుచు నీల్గుచున్ నడచు నీచుల దవ్వగ నుంచుమో ప్రభూ !

అతఁడు సమస్త విద్యలు సమగ్రముగా గడియింపనోఁచినాఁ
డితనికి దాస్యమొక్కటియె యెన్నిక చెందిన తెన్నటంచు, ని
క్కతలు విచిత్రరీతిఁ గలకాలమునుండియు నేర్పుసూపి క
ల్పితములుగా నొనర్చినఁ జలింపదె లోకము నేఁడు సర్వమున్ ?

యుగధర్మమ్ములు నేఁడు రక్షణము లేకుఱ్ఱూత లూఁగంగఁ జూ
చ్చెఁగటా ! వర్ణముమాట యెత్తరుసుమీ ! ఛీ ! సర్వమేకంబె ! కా
వఁగ నెవ్వారలు లేరె ? చూచుచును నీ పాట్లెట్లు సైరింతువో !
వగపెవ్వారలు తీర్తురో ? యనెడి దౌర్భాగ్యంబు పోనాడుమీ ! !



# వేదాంత దర్శనం

పండిత శ్రీ గోపదేవ్

(గతసంచిక తరువాయి)

పూర్వసూత్రమున జగజ్జన్మాదులకు కారణముగ బ్రహ్మమును వర్ణించుచు నది సర్వజ్ఞము సర్వశక్తి యని చెప్పబడినది. ఈ సూత్రమున నయ్యదియే దృఢపరచుచు నందులకు హేతువును జూపుచున్నాడు.

"శాస్త్ర యోనిత్వాత్." ౧.౧-౩.

(బ్రహ్మపద మీ సూత్రము నందు ననువర్తించును.)

శాస్త్ర యోనిత్వాత్ - వేదమునకు కారణమగుటవలన, బ్రహ్మము సర్వశక్తి, సర్వజ్ఞమునని సూత్రార్థము.

శాస్త్రమన నిట వేదమని యర్థము. అయ్యది భువనమునందలి మానవుల కందఱకును హితమును సంపాదించుటకును, నహితమును వదలుటకును వలయు సాధనములను దెలుపును. వేదమునందు పక్షపాతమొందును లేదు. అయ్యది భారతీయుల యెడ బ్రేమజూపి యన్యులయెడ ద్వేషమును వెలిబుచ్చదు. దానికి హిందూ మహమ్మదీయాది మత భేదముకానీ, కృష్ణ గౌరాది వర్ణభేదముకానీ లేదు. సర్వజ్ఞునివలె నెల్లరికి నెల్లయు నాదేశించును. ప్రదీపము బోలి సర్వజనులకు సర్వమును బ్రకాశింపజేయును. సర్వవిద్యలకును, సర్వోపాయములకును నది నిలయము. కాబట్టి వేదము మహచ్ఛాస్త్రమనక తప్పదు. 'యోని'పద మీ సూత్రమున కారణవాచకము. అందువలన మహచ్ఛాస్త్రమునకుకారణమగు బ్రహ్మము సర్వజ్ఞము, సర్వశక్తియు కాకుండుట పొసగదు. ఏయే శాస్త్రములు మానవకృతులో వానిలోనుండు జ్ఞానముకంటె తత్కర్తలలో నధిక జ్ఞానముండుట లోకవిదితము. యాజ్ఞవల్క్యుడు శతపథమును, కణాదుడు కాణాదమును (వైశేషికము) పాణిని పాణినీయమును (అష్టాధ్యాయి) రచియించి యున్నారు. వారా యా శాస్త్రములందు బ్రతిపాదించిన జ్ఞానముకంటె నధిక జ్ఞాను లనుటలో నేరికిని సంశయముండదు. అల్పవిజ్ఞాని యధిక విజ్ఞానమును బ్రదర్శించు గ్రంథమును రచియింపజాలడుకదా! ఋగ్వేదాది లక్షణములుగల శాస్త్రము సర్వజ్ఞగుణాన్వితమై యుండుటవలన దానికి కారణమయిన బ్రహ్మము కూడ సర్వజ్ఞము, సర్వశక్తియు ననుట యుక్తమే. (౩)

శాస్త్రమునకు కారణమైన బ్రహ్మము సర్వజ్ఞము, సర్వశక్తి యని యెట్లు తెలియునన:

"తత్తు సమన్వయాత్" ౧. ౧. ౪. (ఈ సూత్రమున బ్రహ్మ పదము షష్ఠీవిభక్తితో గూడి యన్వయించును.)

తత్ + తు = అకారణత్వము, బ్రహ్మణః = బ్రహ్మమునకే యని. సమన్వయాత్ = సంబంధము వలన దెలియునని సూత్రార్థము. యుక్తులమూలముననను, ఉపనిషద్వాక్యములవలనను, బ్రహ్మమే వేదమునకు నిమిత్తమని తెలియనగును.

మానవులలో ననుదినము బ్రవర్ధమానమగు జ్ఞానము స్వాభావిక మన జెల్లదు. స్వాభావికమగు నెడల నది యభివృద్ధి నొందుటకు బరుల సాహాయ్యమపేక్షింపకుండెడిది. పరసహకారము నపేక్షించి వర్ధిల్లునది స్వాభావికము కానేరదు. కావున మానవులలో గలుగు జ్ఞానాభివృద్ధి స్వాభావికము కాక నైమిత్తికమని చెప్పవలసి వచ్చుచున్నది. అందు వలననే మనుజులు తమ బిడ్డల జ్ఞానమును బెంచు

టకు విద్యాసంస్థల నేర్పరుచుకొందురు. సంస్థలలో యోగ్యులయిన విద్వాంసులను నియమింతురు. వారి సహకారముతో బాల బాలికలు తమ జ్ఞానమును బెంపుజేసికొందురు. ఇంకను నితర సాధన సంపత్తినిగూడ సంస్థలలో సమకూర్తురు. దీనింబట్టి జ్ఞానము నైమిత్తికము. నిమిత్తము ద్వార మున వర్ధిల్లునది. అనుట సిద్ధము. ఇట్లు నేటి మాన వుల జ్ఞానప్రాప్తి నిమిత్తసాధ్య మైనపుడు సర్గారంభ మున మానవులకు లభించిన జ్ఞానముకూడ నిమిత్త మొండు లేక లభింప దనుట నిశ్చిత మగుచున్నది. సృష్టికి నారంభమున నుద్భవించిన మానవులందఱు చదువరులు కామి యర్థపరిభాషల నెరుగనివారై యొండొరుల జ్ఞానాభివృద్ధికి నిమిత్తము కాజాలరు. కాబట్టి సర్వజ్ఞము సర్వశక్తిమంతము నగు బ్రహ్మమే వారికి వేద మనెడి శాస్త్రము ద్వారమున జ్ఞానైశ్వ ర్యము నొసంగియుండునని తెలియనగును. పరమర్షి పతంజలియు దన యోగశాస్త్రమున నిట్లే వర్ణించి యున్నాడు.

"పూర్వేషా మపి గురుః కాలే నానవచ్ఛేదాత్"

యో. ౧-౨౬

వేదాధ్యయన సంపన్నులైన గురువులు నేడు మనకు జ్ఞానము నొసంగుచున్నారు. ఇట్లే సర్గాదియం దుద్భవించిన పూర్వులకును వేదము ద్వారమున పరమగురువు పరమేశ్వరుడు జ్ఞానము నొసంగి యున్నాడు. మానవులు శరీరధారు లయినందున కాలమునకు బద్ధులగుదురు. బ్రహ్మమునకు శరీరము లేదు. కావున నది కాలబద్ధము కాదు. అందువలననే బ్రహ్మము పూర్వులకు పూర్వులైన గురువులకు గురువనుట సంగతమే యగును.

అట్టి బ్రహ్మమే వేదములకు నిమిత్తము. బ్రహ్మ మునకు మించినది మరియొకటి లేదు. దానికి సమాన మును గానము. సామ్యముకానీ, యాధిక్యముకానీ లేని పదార్థమే బ్రహ్మము.

"న తత్సమ శ్చాభ్యధికశ్చ దృశ్యతే" శ్వే. ౬.౮.

బ్రహ్మకు సమమైనదికానీ, యంతకంటె నధిక మైనదికానీ లేదని యుపనిషత్తు చెప్పుచున్నది.

మరియు బ్రహ్మము పితృకల్ప మగుటచే నదియే శాస్త్రమునకు నిమిత్త మగుచున్నది. తండ్రి తన సంతానమును విద్యావంతులనుగా జూడనెంచును. విద్య నభ్యసింపకున్న శబ్దార్థముల నెరుగనివారై లోకవ్యవహారమున కనర్హు లగుదురు. సంసార యాత్రను సరిగ నిర్వర్తింపనేరరని యెంచి, కరు ణార్ద్రచిత్తుడై, హితాహిత ప్రాప్తి పరిహార యోగ్య మగు జ్ఞానము నుదయింపజేయు శబ్దసముదాయము వారికి దెలియునట్లు తగిన వ్యవస్థ జేయును. అట్లే పరమకారుణిక మగు బ్రహ్మము సైతము మానవుల నుద్భవింపజేసి సంసారయాత్రా నిర్వహణార్థము వారికి కొండొక శబ్దరాశిమూలమున జ్ఞానము నుపదే సింప జేయవలసి యుండెను. బ్రహ్మము మానవులకు పితృకల్ప మనుట వేదసిద్ధము.

"స నః పితేవ సూనవేఽగ్నే సూపాయనో భవ"

ఋ. ౧. ౧. ౨. ౯.

"త్వం హి నః పితా వసో" ఋ. ౬.౪.౨.౧౧.

ఈ మంత్రములందు బ్రహ్మము మానవులకు పితృ కల్పమని స్పష్టముగా వర్ణింపబడియున్నది. కాబట్టి బ్రహ్మమే శాస్త్రమునకు నిమిత్తము.

బ్రహ్మము సర్వప్రాణులకు నధిపతి యగుటచేతను శాస్త్రమునకు నిమిత్తము కావలసియున్నది. జను లను పాలింపనెంచు జనాధిపతి 'ఇది మీకు హితము జేకూర్చును. ఇది యహితము సేయును. కావున హితసాధనము నీ కనుష్ఠింపదగినది. అహితము పరిహరింపదగినది' యని స్వజనులకు బోధించును. అట్టియెడ సర్వాధిపుల కధిపము, సర్వజ్ఞమునగు బ్రహ్మము మానవుల నుదయింపజేసి వారికి హితాహిత ప్రాప్తి పరిహారసాధన జ్ఞానము నొదవజేయకుండు టెట్లు పొసగును? అట్టి జ్ఞానోదయము గలిగించు శబ్దరాశియే ఋగ్వేదాది లక్షణమైన శాస్త్రము. కావున బ్రహ్మము శాస్త్రనిమిత్తమనుట సర్వవిధముల

సంగతమే యగుచున్నది. వేదమున నిట్లే ప్రతిపాదింపబడి యున్నది.

"తస్మాద్ యజ్ఞాత్ సర్వహూత ఋచః
సామాని జజ్ఞిరే, ఛందాంసి జజ్ఞిరే
తస్మాద్ యజు స్తస్మా దజాయత."

ఋ. అ.౪ ౧౫.౫.

వర్ణాశ్రమవాసులచే తర్పణమాణమును, యజనీయమును నగు బ్రహ్మమువలన ఋక్కులు సామములు, ఛందస్సులు (అథర్వము), యజుస్సు నుద్భవించినవి.

పాద (చరణ) వ్యవస్థగల మంత్రములు ఋక్కులనబడును. యజ్ఞమునందు గాయత్రము, రథంతరము నను సామములతో గానము సేయబడు ఋక్కులు సామము లనబడును. ఋక్కులు, సామములుకాని గద్యరూపమున నుండు మంత్రములు యజస్సు లనబడును. ఛందాంసియన నథర్వవేదమని యర్థము. వాస్తవమున మంత్రములన్నియు గద్యాత్మకములు, పద్యాత్మకములు నని రెండువిధములుగానే యున్నవి. పద్యాత్మకములలో యజ్ఞమునందు గానము చేయబడు మంత్రములు సామములనబడును. మిగిలినవి ఋక్కులనబడును. గద్యాత్మికములన్నియు యజుస్సు లనబడును. వర్ణాశ్రమవాసులచే యజ్ఞములందు వినియోగింపబడని మంత్రములు అథర్వములని పిలువబడును. ఇట్లు మంత్రములన్నియు రెండు విధములే యైనను నవాంతర భేదముచే నొకప్పుడు ముత్త్రివిధములుగను, మరియొకప్పుడు చతుర్విధములుగను జెప్పబడుచున్నవని భావము. మంత్రము లన్నియు కలిసి వేదమనబడును.

("వాగ్ వివృతాశ్చ వేదాః" ముం. ఉ. ౧౪.)

మంత్రములు పైన జెప్పినట్లు నాలుగు విధములైనందున వేదములును నాలుగుగ వ్యవహరింపబడుచున్నవి. (౧) ఋగ్వేదము. (౨) యజుర్వేదము. (౩) సామవేదము. (౪) అథర్వవేదము. వేద నామాంకితమగు నీ శాస్త్రములకు బ్రహ్మమే నిమిత్తమని వేదములుకూడ జెప్పుచున్నవి. వేదములు పరమప్రమాణము. అంతకుమించిన శబ్దప్రమాణ మొండు లేదు వేదోక్తము యుక్తి సిద్ధమునైనపుడు సందేహమునకు తావే యుండదు. కావున బ్రహ్మము శాస్త్రనిమిత్తమనుట సుసంగతమేయని సుస్థిరమగుచున్నది. (౪)

శాస్త్రనిమిత్తమగు బ్రహ్మము సర్వజ్ఞము, సర్వశక్తియునై జగజ్జన్మాదులకు నిమిత్తమైన నగుగాక! అంతమాత్రమున బ్రహ్మము జగత్తునకు నిమిత్త కారణమని యంగీకరింప వలనుపడదు. 'జన్మాద్యస్య యతః' అను సూత్రమునందలి 'యతః' పదమున నున్న పంచమీవిభక్తి హేతుమాత్రమును బోధించుచు నిమిత్తోపాదాన కారణములను రెండింటిని సూచించు నవకాశముంతుటవలనను, శబ్దముచే జెప్పబడక పోవుటచేతను బ్రహ్మ జగన్నిమిత్తకారణ మెట్లగునన

"ఈక్షతే ర్నాశబ్దమ్" ౧. ౧. ౫.

ఈక్షతేః = ఈక్షణశ్రుతివలన, 'అశబ్దం = జగజ్జన్మాదులకు బ్రహ్మము నిమిత్తకారణ'మని శబ్దముచే జెప్పబడలే దనుట, న = తగదు.

ఋగ్వేదాది లక్షణము గల శాస్త్రమిట శబ్ద మనబడును. ముందు రానున్న సూత్రములం దుపనిషద్ వాక్య విచారణ లభించుటవలన నుపనిషత్తులును నీ శబ్దముచే లక్షితము లగును. ఉపనిషత్తు లొక విధముగ వేద వ్యాఖ్యానము లనదగి యున్నవి. వేదములు వ్యాఖ్యేయములు. వేదములు, ఉపనిషత్తులును నీ రెండిటియందు గల వ్యాఖ్యాన వ్యాఖ్యేయ భావము శక్య సంబంధ మనదగి యున్నది.

సూత్రము నందలి యశబ్దమునకు బ్రహ్మము జగజ్జన్మాదులకు నిమిత్తకారణ మని ప్రతిపాదించు శబ్దమొండును లేదని యర్థము. ఈక్షతేః యను పదము హేతువాచకము. ఈక్షతి ధాతువునకు ఈక్షణమనగా సంకల్ప గర్భితమగు పర్యాలోచనాత్మకమగు జ్ఞానము దీనినే యుపనిషత్కర్తలు తపస్సందురు. కావున 'ఈక్షతేః' యను పదమునకు 'తపఃశ్రవణము వలన' నని యర్థము. కాబట్టి,

ఈక్షతేః=తపశ్శబ్ద శ్రవణమువలన, అశబ్దం న=బ్రహ్మము జగజ్జన్మాదులకు నిమిత్తమని శబ్దము ద్వారమున జెప్ప లేదనుట యుక్తము కాదని సూత్రార్థము.

ఛాందోగ్యప్రపాఠకము నందు,

"స దేవ సోమ్యేదమగ్ర ఆసీ దేక మేవాద్వితీయమ్"

ఛాం. ౬. ౨. ౧.

అని ప్రారంభించి,

"తదైక్షత బహుస్యాం ప్రజాయే యేతి,

తత్తేజోఽసృజత" ఛాం ౬. ౨. ౩.

అని చెప్పబడినది. ఇందు పూర్వవాక్యమున సృష్టికి పూర్వము చేతనాచేతనాత్మకమగు (ఇదం పదవాచ్యం) నిఖిలజగత్తును ప్రకృతితోబాటు బ్రహ్మమునం దవిభాజ్యమై యున్నట్లు చెప్పి, రెండవ వాక్యమునందా సచ్ఛబ్దవాచ్యమగు బ్రహ్మమే యీక్షణపూర్వకముగ నగ్ని (తేజః), మున్నగు జగత్తును సృష్టించినట్లు వర్ణింపబడినది. (ఇట 'తేజస్సునకు పూర్వమాకాశ వాయువులను సృష్టించిన తదుపరి' యని కలుపుకొనవలయును.) జగజ్జన్మాదులకు బ్రహ్మమును నిమిత్తకారణముగా శాస్త్రమంగీకరింపదేని పై వాక్యములందు బ్రహ్మ మీక్షణపూర్వకముగ తేజఃప్రభృతి సృష్టి నొనరించిన ట్లెల వర్ణింపబడును? కుండకు నుపాదానమైన మృత్తికయం దీక్షణపూర్వకమైన స్రష్టృత్వమెటనైన జూడగలమా? చూడలేము; కాని నిమిత్తకారణమైన కుమ్మరియం దీక్షణాదులు ప్రత్యక్షసిద్ధములు. అట్లే జగజ్జన్మాదులకు నిమిత్తమైన (కర్తయైన) బ్రహ్మమునం దీక్షణపూర్వకమగు స్రష్టృత్వము శ్రుతి వర్ణించినది. కాబట్టి బ్రహ్మము జగత్తునకు నిమిత్తకారణమనుట శాస్త్రప్రతిపాదితమే-శబ్ద ప్రతిపాదితమే యగునుకాని యశబ్దము కాదని భావము.

కొంద ఱీ సూత్రము నిట్లు వ్యాఖ్యానింతురు. ఈక్షతేః=ఈక్షితృత్వ శ్రవణమువలన, న=సాంఖ్య పరికల్పితమగు నచేతన ప్రకృతి (ప్రధానము) జగత్తునకు కారణమని వేదాంతమునందు జెప్పుటకు శక్యముకాదు. కారణమేమన, అశబ్దం=అది శబ్ద ప్రతిపాదితముకాదు.

కారణమునకు నీక్షితృత్వము శాస్త్రమునందు జెప్పబడుటవలన జగత్కారణ మచేతన ప్రకృతి యని యంగీకరింప వలనుపడదు. శాస్త్రమున నచేతన ప్రధానము (ప్రకృతి) జగత్కారణమని యెక్కడను నుడివి యుండకుండుటయే యిందులకు కారణము.

ఈ వ్యాఖ్యానము సరియైనది కాదు. ఇట్టి యర్థ మంగీకరించిన ప్రకృతహాని, యప్రకృత ప్రక్రియాపసక్తియు గలుగును. ప్రకృతమును విడిచి, యప్రకృతమును గ్రహింపవలసివచ్చునని భావము. ఈ ప్రకరణమునందలి పూర్వసూత్రములలో విచారింపబడు విషయము ప్రకృతమనబడును. ఇతర మప్రకృతమనబడును. కాబట్టి పూర్వ సూత్రములందు వర్ణింపబడుచున్న బ్రహ్మము ప్రకృత మగుచున్నది; అచేతనప్రకృతి యిట యప్రకృతమగుచున్నది. అది పూర్వసూత్రములందు కానీ, యీ సూత్రమునగానీ యెక్కడను నింతవరకు వర్ణింపబడలేదు. అచేతన ప్రకృతిని దెలుపు పదముకూడ నీ సూత్రములందు కనబడదు. అధ్యాహారము సేయుదమన్నను బ్రకరణము ననుసరించి చేయవలయునుగాని స్వతంత్రించి చేయజనదు. సూత్రముల శైలియు నందుల కంగీకరింపదు. ఈక్షణ హేతువు (ఈక్షతేః) ప్రకృత విషయమునకు ప్రాప్తించిన యశబ్దతను దొలగించుచున్నదికాని, ప్రధానమునకుగల కారణతను నిషేధించుటలేదని స్పష్టమగుచున్నది. కాబట్టి యకస్మాత్తుగ నిట జడమగు ప్రధానమును గ్రహించుట ప్రకృతమును విడిచి యప్రకృతమును గ్రహించుటయే యగును. వ్యాఖ్యానముకూడ దూషితమగును. కారణమున కీక్షితృత్వ శ్రవణమువలన కారణము శబ్ద ప్రతిపాదితమగునుకాని, ప్రధాన మశబ్దమని యెట్లు సిద్ధింపగలదు? ఈక్షణశబ్దశ్రవణమువలన బ్రహ్మము జగత్తునకు నిమిత్తకారణమని పూర్వము సెప్పిన యర్థమే సంగతమగును. మరియు ప్రధాన మశబ్దమనుటయు యుక్తము కాదు.

"మహతః పరమవ్యక్తమ్" కఠ. ౩. ౧౧.
"సత్వా దధి మహానాత్మా మహతోఽ
వ్యక్త ముత్తమమ్" కఠ. ౬. ౭.
"తపసా చీయతే బ్రహ్మ" ముం. ౧ ౧.౮.
ఈ వాక్యములలోని అవ్యక్తమ్, బ్రహ్మ అను పదములు ప్రధాన (ప్రకృతి) వాచకములే. ఇట్లనేక స్థలములలో నుపనిషద్వాక్యముల ద్వారమున ప్రధానము ప్రతిపాదింపబడుచుండ నయ్యది 'యశబ్దము' (శబ్ద ప్రతిపాదితము కానిది) అని యెట్లు చెప్పగలము ? కాబట్టి యుపర్యుక్త వ్యాఖ్యాన మాదరణీయము కాజాలదని భావము. (౫)

జగజ్జన్మాదులకు నిమిత్తమగు బ్రహ్మము శబ్ద ప్రతిపాదితమే కాని, యశబ్దము కాదని పూర్వ సూత్రమున జెప్పబడినది. ఆ విషయమునే యీ సూత్రమునందును మహర్షి దృఢపరుచుచున్నాడు.

"గౌణశ్చే న్నాత్మ శబ్దాత్" ౧. ౧. ౬.

గౌణః చేత్ = పూర్వసూత్రమున జెప్పిన ఈక్షణము గౌణము - గుణసంబద్ధము - ప్రాకృతికమని యందురేని, న=కాదు. కారణ మేమన, ఆత్మ శబ్దాత్=ఆత్మ శబ్దముచే చెప్పబడుటవలన.

ఈ శాస్త్రమునందు గుణశబ్దము ప్రకృతివాచక మనియు, ప్రధానశబ్దము బ్రహ్మబోధక మనియు గ్రహింపనగును. కారణ మేమన :

"అనందాదయః ప్రధానస్య" వే. ౩. ౩. ౧౧
అను నీ సూత్రమునందు ప్రధానశబ్దము బ్రహ్మమను నర్థమునందే ప్రయోగింపబడినది.

"స దేవ సోమ్యేద మగ్ర ఆసీ దేకమేవాద్వితీయమ్"
ఛాం. ౬. ౨. ౧.

'ఓ సౌమ్య ! పూర్వమున నియ్యది సత్తే, ఒక్కటే, యద్వితీయమై యుండెను' అను నీ వాక్యమునందలి 'సత్'పదము సర్వజ్ఞమైన బ్రహ్మమును బోధించు నవకాశము లేదు. కారణ మేమన : ఈ వాక్యములోని (ఇదమ్) 'ఇయ్యది' యను పదము జడచేతనాత్మకమగు జగత్తును బోధించుచున్నది ; కదా ? అవును. అట్లే బోధించుచున్నదని యందురేని, (సత్) బ్రహ్మము, (ఇదమ్) ఇయ్యది - ప్రకృతీ - అను నీ రెండు పదములు ప్రథమావిభక్త్యంతములు. కావున నియ్యవి సమానాధికరణకములు - వీనిలో సామానాధికరణ్యమున్నది. ఈ సామానాధికరణ్యము బ్రహ్మము, ప్రకృతియను నీ రెంటియందుగల యాధారాధేయ భావమునే తెలుపునని మీ మతము. అది యెట్లు పొసగును ? లోకమున చేతనము జడమునకాధారమై యుండుటఁ జూడజాలము. ఉదాహరణము లభించిన పక్షమున చేతనబ్రహ్మము జడప్రకృతి కాధారమని యంగీకరింపవచ్చును. ఉదాహరణము లభింపనపుడు కల్పించుట యుక్తముకాదు. కల్పన యుపలబ్ధ పూర్వకముగ నుండవలెను. కావున బ్రహ్మము, జగత్తు నను నీ రెంటిలోగల యాధారాధేయ భావమును 'సత్', 'ఇదమ్', అను నీ రెండు పదములలో సామానాధికరణ్యము నిర్దేశించుచున్నదని చెప్పవలను పడదు. చేతనములకు, నచేతనములకు నీ భూమి యాధారముగ నుండుట మనము ప్రత్యక్షముగ జూచుచున్నాము. భూమి యచేతనము. ఈ సామ్యము ననుసరించి చేతనాచేతనాత్మకములగు సర్వభూతములకు నాధారముగ 'సత్' పదముచే జెప్పబడునది యచేతనమే యైయుండవలెను. ఆ యచేతనము జగత్తునకు మూలకారణమైన ప్రకృతికంటె వే రేమి యున్నది ? దానినే యుపనిషత్కర్తలు ప్రధానము - అవ్యక్తము - అవ్యాకృతము - అని యందురు.

ప్రకృతి సత్పదవాచ్యమైన నది జడము కాబట్టి దానికి (తదైక్షత బహుస్యాం ప్రజాయే యేతి తత్తేజో ఒసృజత') అను నీ వాక్యమునందు జెప్పబడిన యీక్షణ మెట్లు సిద్ధించును ? అని శంకింపరాదు (తత్తేజ ఐక్షత, తా ఆప ఐక్షంత) అను నీవాక్యములందు జెప్పబడిన అగ్నిజలముల కీక్షణము సిద్ధించినట్లు సిద్ధము కాగలదు. అగ్నికి, జలమునకు నీక్షణము సిద్ధించిన పక్షమున ప్రకృతికేల సిద్ధింపదని భావము. అగ్నిజలముల యీక్షణము గౌణము - ఔపచారికము - అముఖ్యము - అందురేని ప్రకృతికి చెందిన యీక్షణముకూడ నట్లే యముఖ్యమగును.

కాగా జగజ్జన్మాదులకు నిమిత్తకారణమగు బ్రహ్మము అశబ్దముకాదు. శబ్దమే - శబ్దప్రతిపాదితమే-యనుట యుక్తము కాదని పూర్వపక్షము. ఆత్మశబ్దముచే బ్రహ్మము చెప్పబడుటవలన నీ పూర్వపక్షము - ఆక్షేపము - యుక్తముకాదని సమాధానము.

సత్ పదముచే జెప్పబడిన బ్రహ్మము (సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్) అని యారంభింపబడి (తదైక్షత బహుస్యామ్) అని దానియందు ఈక్షణ మును వర్ణించి, తుదకు (తత్ సత్యం స ఆత్మా... ఒ౬. ౭.) అని చేతనవాచకమగు నాత్మపదముచే జెప్పబడినది. ఇట్టియెడ 'సత్' పదముచే జెప్పబడిన మూలకారణము నచేతనమగు ప్రధానము (పకృతి)గ నెంచెదమేని యదియే ప్రకృతమగును. కావున నా ప్రధానమే తుదకు చేతనవాచకమగు నాత్మపదముచే జెప్పఁబడిన ట్లెంచవలసి యుండును. కాని, జడమగు ప్రధానమెక్కడ నెన్నడు నాత్మపదముచే వర్ణింప బడుట జూడము. ఆత్మశబ్దమునకు ప్రధానము (ప్రకృతి) అర్థ మందుమేని శబ్దశక్తి కది విరుద్ధ మగును. గోశబ్దమునకు గుఱ్ఱమర్థము సెప్పినట్లగును. సచ్ఛబ్దమును బ్రహ్మమర్థ మనిన నట్టి దోషముండదు. ఆత్మశబ్దము బ్రహ్మమునందు వర్తించు ననుటలో శబ్దశక్తి యనుకూలించునని భావము.

"తమేవ విద్వాన్ నబిభాయ మృత్యోరాత్మానం
ధీరమజరం యువానమ్" అథ ౧౦.౪౮.౪౪.
"నాయ మాత్మా ప్రవచనేన లభ్యః" కఠ.౨ ౨౩.

'బ్రహ్మము నెఱిగియే మృత్యువునకు భయపడుడు' 'ప్రవచనముచే బ్రహ్మము లభింపదు.' అను నీ వాక్యములం దాత్మపదముచే బ్రహ్మమే తెలుపబడి నట్లు స్పష్టమగుచున్నది. కావున సర్వజ్ఞమైన బ్రహ్మమే సచ్ఛబ్దవాచ్య మగును కాని, యచేతన మగు ప్రకృతి కాదు.

ఈక్షణము గౌణము (అముఖ్యము) అనుటయు గౌరవమే యగును. 'సత్' పదము ప్రకృతివాచక మనుటలో శబ్దశక్తి విరోధము వాటిల్లినట్లు, ఈక్షణము ప్రకృతియం దౌపచారిక (అముఖ్య) మనుటలో గౌరవదోషము సంభవించును. ఈక్షణము చేతనధర్మమగును కాని జడవస్తుధర్మము కాదు. చేతనధర్మమగు నీక్షణమును జడమగు ప్రకృతి యందు కల్పించుటకై ముందుగా చేతన సంబంధము ప్రకృతికి కల్పింపవలయును. తదనంతరము ప్రకృ తియం దీక్షణ మున్నట్లు చెప్పవలసివచ్చును. ఇట్లు ప్రకృతియందు చేతనసామ్యము కల్పించి, యటుపై నీక్షణసామ్యమును సంపాదించుటయే గౌరవదోష మనబడును.

('తత్తేజ ఐక్షత' 'తా ఆప ఐక్షంత') 'తేజస్సు, జలము నీక్షించెను' అను నిట్టి తావులందు గత్యం తరము లేనందున నీక్షణము గౌణమనక తప్పదు. ఒకయెడ నుపాయాంతరము లేమి యౌపచారికమైన యర్థము కల్పింపబడినది ; కావున, నెల్లయెడల నట్లే కల్పింపవలయు ననుట సముచితముకాదు. కావున నీ దృష్టాంత మయుక్తము.

అచేతనమగు భూమిని దృష్టాంతముగా చెప్పి యచేతనమగు ప్రకృతియే జడచేతనాత్మకమైన జగత్తున కాధారమని చెప్పుటయు సంగతముకాదు. బ్రహ్మమధిష్ఠానకారణము. కావున, నది చేతన మయ్యు జడచేతనాత్మకమగు జగత్తున కాధార మగుటలో దోషములేదని పూర్వమే వ్రాసియుంటిమి. కాబట్టి యీక్షణము గౌణము—ప్రకృతి సంబం ధించినది-కాదనుట సుసంగతమేయని భావము. (౬)

జ్యోతిఃశబ్దము జ్వలనము (అగ్ని), బ్రహ్మము నను రెండర్థములందు బ్రయోగింపబడును. అట్లే యాత్మశబ్దము కూడ ననేకార్థములు గలదగుటచేత ప్రకృత్యర్థమునందును, బ్రహ్మమనెడి యర్థము నందును బ్రయోగింప వీలగును. ఇంద్రియాత్మ, భూతాత్మయని ఆత్మశబ్ద మచేతనములయినట్టి యింద్రి యాదులందును బ్రయోగించుట లోకమున జూచు చున్నాము. కాబట్టి ('తత్సత్యం, స ఆత్మా') అను వాక్యమున బ్రయోగింపబడిన 'ఆత్మ' శబ్దము జడమగు ప్రకృతివాచక మెందులకు కాగూడదన సమాధానము.

"తన్నిష్ఠస్య మోక్షోపదేశాత్" ౧. ౧. ౭. తన్నిష్ఠస్య=తద్వాచ్యమునందు నిష్ఠగలవానికి, మోక్షోపదేశాత్=మోక్షము గలుగునని యుపదేశించి నందున, ఆత్మశబ్దము, ప్రకృతివాచకముకాక బ్రహ్మ వాచకమే యగునని సూత్రార్థము.

(సదేవసోమ్యేద మగ్ర ఆసీ దేకమేవాద్వితీయమ్) అని సత్ పదముచే బ్రహ్మము నుపదేశింప ప్రారంభించి, (తత్సత్యం స ఆత్మా) అని యాత్మశబ్దముచే నా బ్రహ్మమును గ్రహించి ('తత్త్వమసి శ్వేతకేతో' ఛాం. ఉ. ౬. ౭)' ఓ శ్వేతకేతూ ! నీవా బ్రహ్మము నందు నిష్ఠగలవాడ వగుము' అని ముక్తునిజేయ నుద్దేశింపబడిన శ్వేతకేతునకు బ్రహ్మనిష్ఠ నుపదేశించి యనంతరమున ('తస్య తావ దేవ చిరం యావ న్నవిమోక్ష్యే అథ సంపత్స్యే' ఛాం. ఉ. ౧౪. ౨) బ్రహ్మనిష్ఠ గలవాడు శరీరపాతముకాగానే బ్రహ్మము నంద గలడు- ముక్తుడగును- అని వర్ణింపబడినది. కాబట్టి ('తత్సత్యం స ఆత్మా' ఛాం. ఉ. ౬ ౭.) అను నీ వాక్యము నందలి యాత్మశబ్దము ప్రకృతిని దెలుపు నెడల మోక్షోపదేశ మెట్లు సంగతమగును? ప్రకృతి నిష్ఠగలవానికి మోక్షము సిద్ధింపదుగదా ! ప్రకృతినిష్ఠ మోక్షహేతువు కాదు. నిష్ఠయన ప్రతిష్ఠ సర్వ వ్యాపారములను విడచి యనన్యచిత్తముతో నుండుట— అనిష్ఠకేది విషయమో యదియే ప్రత్యక్షమగును. ప్రకృతియందు నిష్ఠగలవానికి ప్రకృతియే ప్రత్యక్షమగును కాని, బ్రహ్మసాక్షాత్కారము గలుగదు. కావున మోక్షసాధనముకాని ప్రకృతినిష్ఠ నేల శాస్త్ర ముపదేశించును ? అట్లుపదేశించినచో శాస్త్రము వంచక మగును. తండ్రియైన ఉద్దాలక మహర్షి తన పుత్రుని శ్వేతకేతువు నేల వంచింప దలపెట్టును ?

("శ్వేతకేతో ! వస బ్రహ్మచర్యం, నవై సోమ్యాస్మత్కులీనోఽననూచ్య బ్రహ్మబంధురివ భవతి" ఛాం .ఉ. ౧. ౧.)

"సౌమ్యుడ వగు నో శ్వేతకేతూ! బ్రహ్మచర్యము ననుష్ఠింపుము. వేదాధ్యయనము సేయనివాడు మూర్ఖుడగును. అట్టివాడు మన కులమున నింతవరకు నెవ్వడు జనింపలేదు" అని వేదధర్మము నుపదేశించు ఋషి. వంచకు డెట్లు కాగలడు ? పుత్రవత్సలుడగు నుద్దాలక మహర్షి మోక్షకాముడైన శ్వేతకేతువునకు (తత్సత్యం స ఆత్మా) అని సదాత్మక మగు బ్రహ్మము నుపదేశించి, (తత్వమసి శ్వేతకేతో !) "శ్వేతకేతూ ! నీవు తత్వమసి=తన్నిష్ఠుడవు-బ్రహ్మనిష్ఠుడవుకమ్ము" అని మోక్షసాధనమైన బ్రహ్మనిష్ఠ నుపదేశించినా డనియే తలంపవలయును. ఆత్మశబ్దము ప్రకృతివాచకమగు నెడల నియ్యది సంభవింపదు. అందువలన (తత్సత్యం స ఆత్మా) యను నీ వాక్యమునందలి యాత్మశబ్దము ప్రకృతి వాచకము కాదు ; ఆత్మవాచకమే.

జ్యోతిః శబ్దమువలె నాత్మశబ్దము నానార్థకమగుటచే నాత్మశబ్దమిట ప్రకృతిపరమే యని నుడువుటయు సంగతము కాదు. ప్రకృతిశబ్దమున కనేకార్థము లంగీకరించుటయు నన్యాయమే. శబ్దశాస్త్రవిదులు శబ్దమున కనేకార్థముల నంగీకరించిన వృత్త్యంతరములు లోపింపగలవను భయముచేత నొక యర్థమునే యంగీకరించుట న్యాయ్యమందురు. ముఖ్యవృత్తితో శబ్దమొకయర్థమునందే ప్రయోగింపబడును. ముఖ్యవృత్తితో నే యర్థమున శబ్దము ప్రయోగింపబడునో యదియే దానికర్థము. ఇతరార్థము లన్నియు గౌణములో, పారిభాషికములో యగును. ఏ యర్థము ముఖ్యమో, యేది గౌణమో శబ్దవ్యుత్పత్తి వలనను, ప్రయోగముల వలనను దెలియనగును. ఆత్మశబ్దము చేతనార్థమున వ్యుత్పన్నమగుటవలన నయ్యది ప్రకృతివాచకము కాదు. ఉపపదములేని యాత్మపదము బ్రహ్మపదముగానే ప్రయోగింపబడుట వలనను నయ్యది ప్రకృతి వాచకమనుట సంగతము కాదు. ఉపపదముతో గూడిన ఆత్మపదము గౌణవృత్తితో నన్యార్థములందు బ్రయోగింపబడుట గలదు; కావున 'భూతాత్మ' 'ఇంద్రియాత్మ' యను ప్రయోగము లున్నను దోషము వాటిల్లదు. 'తత్సత్యం స ఆత్మా' అను వాక్యమునందలి యాత్మపదము నిరుప

పదము కాబట్టి యది బ్రహ్మవాచకమే కాని ప్రకృతి వాచకము కాదు.

మఱియు జ్యోతిఃశబ్దమున కనేకార్థము లున్న వనుటయు సరికాదు.

("తచ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతి
స్తద్యదాత్మవిదో విదుః" ముం. ౨.౨.౯.)

'జ్యోతిస్సులకు జ్యోతిస్సు, శుభ్రమునగు బ్రహ్మము నాత్మవిదులెఱుగుదురు' అను నిట్టి యుపనిషద్వాక్యములందు జ్యోతిఃశబ్దము ముఖ్యవృత్తితో బ్రహ్మము నందే ప్రయోగింపబడినది. కావున 'తత్సత్యం స ఆత్మా' అను వాక్యగతమగు నాత్మశబ్దము ప్రకృతి వాచక మెన్నటికిని కానేరదు.

ఈ సూత్రము నందలి 'తన్నిష్ఠస్య' అను పదము ద్వారమున 'తత్త్వమసి' యను వాక్యమునందలి యర్థమే సూత్రింపబడినందున 'తత్త్వమసి' అను వాక్యముకూడ నిట వ్యాఖ్యానింపబడినట్లే యెంచ వలెను.

(తత్+త్వమ్+అసి) అని మూడు పదము లీ వాక్యమున నున్నవి. అందు 'త్వమ్' పదము తక్క మిగిలిన రెండు పదములు (తత్+అసి) సందిగ్ధార్థకములే. ఈ 'తత్' పదము ప్రకరణమున జెప్ప బడిన సద్రూపము, నీక్షణధర్మమునుగల బ్రహ్మ పరమా? లేక బ్రహ్మనిష్ఠపరమా? యని సందేహము వొడమును. ఇట్లే 'అసి' పదముకూడ వర్తమాన 'సత్తా' బోధకమా? లేక విధివచనమా? అనగా 'లట్' లకారముయొక్క రూపమా? లేక 'లేట్' లకారముయొక్క రూపమా? యని సందేహము గలుగును. ఇట్లు రెండు విధములగు నర్థములందును నీ శబ్దములు ప్రయోగింప వీలున్నందున నిట్టి సందేహము గలుగును. ఈ సందేహమును ఉపనిషద్ వాక్యార్థమును నిర్ణయింప నుపక్రమించిన పదవాక్య ప్రమాణజ్ఞుడగు నాచార్యుడే తొలగింప వలయును. అందువలననే యాచార్యుడు (వ్యాసుడు) 'తన్నిష్ఠస్య' అని సూత్రించి తత్‌పదార్థమును సూచించియున్నాడు. కాబట్టి తత్‌పదము తన్నిష్ఠ పరముగా జెప్పుట యాచార్యున కభిప్రేతమని స్పష్టమగుచున్నది. లేకున్న 'తన్నిష్ఠస్య' యని సూత్రింపదని భావము. నిష్ఠయన సర్వవ్యాపారములను వర్జించి యనన్య చిత్తముతో ప్రణిధాన మొనర్చుట యని యింతకుమునుపే చెప్పియుంటిమి. కావున, నిష్ఠ క్రియాత్మకము. అదియును భావిక్రియయే కాని, భూత వస్తువు కాదు. "సుఖ (స్వర్గ) మభిలషింతువేని యాగముసేయుము" (స్వర్గకామో యజేత) అను తావులందు విధి యపేక్షిత మయినట్లు నిష్ఠ యను భావిక్రియయును విధి నపేక్షించును. కాబట్టి, 'అసి' క్రియాపదము విధ్యర్థకమనియే యెంచవలయును. 'త్వమ్' పదమిట శ్వేతకేతువుః ను నిస్సందిగ్ధముగా తెలుపును. కాగా (తన్నిష్ఠ స్త్వం భవ శ్వేతకేతో!) "ఓ శ్వేతకేతూ! నీవు తన్నిష్ఠుడవగుము" అని 'తత్త్వమసి'వాక్యమున కర్థమగుచున్నది. ఇట్టియర్థమే యాచార్యున కభిమతమనియు, నదియేసంగతమనియు దెలియుచున్నది.

(సశేషము)



# "యతిపదల"

# శ్రీ రంగనాయకస్వామి యాలయము

శ్రీ కోన వేంకటరాయశర్మ

ఈ పుణ్యక్షేత్రము పలనాఁటి సీమలోనిది. 'తాళ్ళ పల్లె' కు ననతిదూరంబునఁ జంద్రభాగానదీతీరమ్మునఁ బండరీక్షేత్రమ్మునకుఁ బ్రతిబింబమో యన "యతిపదల" (ఇప్పుడు దీని నెత్తిపోతలయని యందురు.) పుణ్యక్షేత్రమున వైకుంఠధాముఁడు లోకమాతయగు లక్ష్మీదేవితోఁ గూడి రంగనాయక స్వామి యను పేరుతోఁ జంద్రవంకనదీతీరాన శేషపర్యంకశాయియై యొప్పుచుండును.

ఈశ్వర పరికల్పితంబులగు ఖండములలో నుత్తమోత్తమ మైనది భరతఖండము. ఈ భరతఖండము కర్మభూమి. అనాద్యవిద్యావాసనలచే జనన మరణ ప్రవాహ రూపంబైన సంసారమునఁ బరిభ్రమించు చున్న జీవులకు బహుజన్మకృత మహత్తర సుకృత పరిపాకంబు వలననే ఈ పుణ్యభూమియందుఁ బుట్టుటఁ దటస్థించుచున్నది.

అవతారమూర్తుల కుక్కిపట్టయి, యసాధారణ ప్రజ్ఞాధురీణుల కాకరమై, పావన నదీనదములకు నిలయమై, యొప్పు ఈ భరతఖండంబున విభిన్న భాషామతల్లులచే విలసిల్లు నవాంతర దేశరాజము లనేకములున్నవి. అందుఁ దలమానిక మనంజెల్లు నాత్మీయ నిర్మల పవిత్ర తేజఃపూరములతోఁ బ్రకాశించునది యాంధ్రదేశము. ఈ పవిత్రదేశంబున జన్మించుటకు సామాన్యమైన తపంబు చాలదని "ఆన్ధ్రత్వ మాన్ధ్ర భాషాచ నాల్పస్య తపసః ఫల" మ్మను నార్షవాక్య మవగత మొనర్చుచున్నది. అట్టి యీ దేశమ్మునఁ గృష్ణా, గోదావరి, తుంగభద్రాది పుణ్యనదులు ; శ్రీశైలము, తిరుపతి, కాళహస్తి, ఉండవల్లి, పొన్నూరు, భావపురి, మంగళగిరి, కోటప్పకొండ, సింహాచలము, శ్రీశైలాది పావన క్షేత్రములు లెక్కకు మిక్కిలిగ నున్నవి.

కాల ప్రభావమునఁ బ్రకృత మంతర్హిత తేజః పుంజ వికసనములతోఁ బరిసర ప్రాంతములవారికి మాత్రమే తెలియందగు ప్రభావము గలిగియున్న పుణ్యస్థలములు, తీర్థములు — అనేకము లీ దేశమ్మునఁ గలవు.

భౌతిక సంపదయందుఁ బండరీక్షేత్రమునకు సహ స్రాంశమునందైనఁ దులఁదూఁగుట లేదనుదైన్యభావ మగపఱచుచున్నదా ? యనినట్లు యతిపదల (ఎత్తిపోతల - పలనాఁటిసీమ) శ్రీరంగనాయకస్వామి యాలయ శైథిల్య గోపుర ధ్వజ మంటపాదు లగపడు చున్నవి. ఈ క్షేత్ర మొక బ్రహ్మాండమైన లోయలోఁ గలదు. ఇచటఁ జంద్రవంక రమారమి నూఱడుగుల యెత్తునుండి లోయలోనికి దూఁకుచుండును. ఈ జలపాతము (Water-fall) చిత్రవిచిత్రముగ నుండును.

పూర్వము ఇంద్రుని వజ్రాహతములయి కూలిన కొండల ఱెక్కలా యనునట్లు దాదాపు నూఱడుగుల యెత్తుతో రాజప్రాకారపుఁ గుడ్యముల రీతి నిడుపాటిగాఁ బరస్పరాభిముఖములయి విలసిల్లు రెండు కొండదరు లున్నవి. ఇందుఁ బశ్చిమదరి నాశ్రయించి కొని రంగని ముఖమండపము గలదు. ఈ ముఖమండపమునకుఁ బురోభాగమున రెండు కొండదరుల మధ్యప్రదేశమునుండి చంద్రవంక ప్రవహించుచు నాలుగుమైళ్ల దూరమున నున్న కృష్ణానదిలోఁ గలియును.

రంగని యాలయమునకు వామపార్శ్వమున సమతలమ్మున దరియొక్క బిలప్రదేశంబులలో శైథిల్య చెన్నకేశవ విగ్రహమును, దరియొక్క పైభాగమందలి గుహలో దత్తాత్రేయస్వామి ప్రాసాదమును, అందు రెండు అపారములగు గుహలును, శిథిలమైన యీశ్వరలింగమును - మొదలగునవి యగుపించును.

ఈ గుహద్వారమ్మున సంయమీంద్రులు ప్రతిదినమునను వచ్చి దత్తాత్రేయస్వామిని - శ్రీ రంగనాయక స్వామిని - సేవించి వెడలుచుండు రను నుడి యిప్పటికిని గలదు భవత. కావుటంజేసియే కాఁబోలు "యతిపదల" యను సార్థకనామ మేర్పడినది.

జలపాతమునకు సరిహద్దుగా నుండు పశ్చిమ కోణమునను, రంగనాయకస్వామి యాలయమునకు దక్షిణ పార్శ్వమునందును, గోపురద్వారమునుండి శ్రీరంగని సాన్నిధ్యమునకుఁ జేర్చు సోపానమార్గమునకు దిగువ నల్లిబిల్లిగ నల్లుకొనిన బ్రహ్మాండమైన నికుంజపుంజముల చాటున నీశ్వరునితోఁ గలహించి, వివదించి, ప్రణయకోపమ్మున వచ్చి డాగినదా? యనునట్లు చౌడేశ్వరీశక్తి ప్రకాశించుచున్నది.

చంచల చిత్తమును బాహ్యవ్యాపారములనుండి తొలఁగించి భగవదాయత్తమైనదానినిఁగాఁ జేయు నభ్యాసకులను, యమ నియమాద్యష్టాంగ యోగముల సాధించు సాధకులను —— ఆకర్షించఁగల యోగ్య వస్తు సన్నివేశము ఈ "యతిపదల" క్షేత్ర వాతావరణమ్మున నుండుటంజేసి యోగిజనుల కియ్యది యత్యావశ్యకస్థానం బనఁ జెల్లును.

నైసర్గిక శ్యామల కాంతిపుంజముల కాకరములై వికసితానూన ప్రసూన పవిత్ర సౌరభ పరంపరల నీనుచు నాకసంబున కెగసిన పవనాంకుర సంచలిత కోమల పల్లవకరంబుల రసికజనము నాహ్వానించుచు నదీకూలంబుల దైవనిర్మితమ్ములగు మనోహర జాతీలతా మండపములు నిండువేసవినేని మండుటెండలో జండకరునకు నీషణ్మాత్ర మేనిఁ జొరవఁ గల్పింపని సాంద్రములగు గుర్వింద తీవ చప్పరములు సౌరభ సంపత్తి యందు స్పర్ధించి పుష్పలతతోఁ బొందు నొల్లక నన్యత్ర నివసించు వడువున ససంబాధముగ నేర్పడిన కేతకీ కదంబములును, దివాభాగంబుల లతా నికుంజముల నలసి సొలసిన విషాద దంపతులకు రాత్రి యందు శయనార్థమయి ప్రకృతి దాసిచే నమర్పఁబడిన తూలికా పర్యంకముల చాడ్పున నన్యూనాధికాయాను వైశాల్యములతో నంతటంతట వెలుఁగొందు పులిన ప్రదేశంబులును, నానావిధ గైరికాది ధాతు విలసితంబులగు సుందర దరీ భాగంబులును, పలురకంబులగు పుష్ప మకరందంబులను గ్రోలి తన్మయత్వంబున నాదబ్రహ్మోపాసకుల కైవడి ఝుంకారంబుల నొనర్చుచు మింటి కెగయు ద్విరేఫ తండంబులును, మధుర రసాల సాలాది తరు ప్రకాండంబులఁ గోమలపల్లవ నికరమ్ములఁ గుత్తుగ బంటిగ మెసవి 'కోకో' యని కూయు గండుకోయిల పిండులును, హంస, సారస, బక, చక్రవాక ప్రముఖ నానావిధ జల విహంగమకుల సంకులింతంబులగు నదీ హ్రదంబులు లోనగు వియుక్తజన హృదయ విదారకంబులును, సంయుక్తజన మనఃప్రేయ చణంబులగు రమ్యవస్తు సంతానములతోఁ గఱుంగడు భోగరతుల కాశ్రయమయి యొప్పు ఈ పుణ్యక్షేత్రము లోయలో డాఁగి యున్నది.

పూర్వము కృష్ణానదీమతల్లి ఈ ప్రక్కఁగాఁ బ్రవహించుచుండఁగా అస్పృశ్యు డొకండు ప్రాగ్భాగంబున గోవును వధించుచుండెనఁట! అద్దానిఁ బరికించి కృష్ణానదీమతల్లి యాత్మీయ ప్రవాహమును వెనుకకు మఱల్చికొని వేఱొకదెసకుఁ బ్రవహించెననియుఁ, గృష్ణానది ముందునకు వచ్చి రభసముని వెనుకకు మరలుటతో నింతటి యగాధమగులోయ యేర్పడుటకుఁ గారణం బయ్యె ననియుఁ జెప్పఁబడుచున్నది.

తీర్థయాత్రలు చాలకాలము నుండియు భరత ఖండమున సుప్రసిద్ధి నందియున్నవి. ఆయా క్షేత్రమ్ములం గల నద్యాదులఁ గ్రుంకి యట స్వయం వ్యక్తములు సిద్ధ ప్రతిష్ఠితములు నగు దేవతామూర్తుల

సందర్శించి తత్ప్రసాదాదుల స్వీకరించుట యను ఫలమే గాక ఫలాంతరములు గూడఁ గలవను నాపస్తంబుని వచనము గమనింపఁ దగును. "న కంచన వసతౌ ప్రత్యా చక్షీత"—"ఏతద్వై ముఖతోన్నగ్ం రాద్ధం ముఖతోస్మా అన్నగ్ం రాధ్యతే"— అను శ్రుతిచోదితధర్మము ననుష్ఠించుట యొక ఫలము. "నిజ గృహాత్తూర్ణం వినిర్గమ్యతాం" అను సూక్తి ననుసరించి తాత్కాలికముగనైన నీషణత్రయములఁ బరిత్యజించినఁ గాని భగవత్సేవకు నవకాశము లభించదు గాన తీర్థయాత్రలఁ జలుపువారు ఏషణాత్రయాంతర్గతంబులగు పుత్త్రాదులఁ గొంతవఱకునేనిఁ ద్యజింపక తప్పదుగాన నవ్విధముగఁ బరిత్యజించి దానియందలి విశ్రాంతి, సుఖము ననుభవించుటకు వీలగుట మఱియొక ఫలము. పుణ్యక్షేత్రములఁ దీర్థయాత్రలఁ గల్గు సత్సమాగమము ముక్తినిఁ గల్గించుట యను ఫల మొకటి. అట్లని బృహదారణ్యకాద్యుపనిషత్తులు వాకొనుచున్నవి. అట్టి సాధుసత్తముల సందర్శించి వారి యాచార భాషణోపదేశంబుల ననేక ధర్మవిశేషంబుల గ్రహియించి "యేతత్ర బ్రాహ్మణా స్సమదర్శినః" ఇత్యాది శ్రుతి ప్రతిపాదిత ధర్మము ననుష్ఠించుచు నహంకృతి విడనాడుట యింకొక ఫలము. తత్రాపి తితీక్ష నభ్యసించుట వేఱొక ఫలము. ఇట్టి వనేకములు. ఇట్టి ఫలముల నార్జించుటకయిమే తీర్థయాత్రల, పుణ్యక్షేత్రముల సందర్శించుటను బూర్వులు విధించిరి. యాత్రకు వెడలి పాత్రను సంపాదించవలయునను నుడికలదుగదా! అనఁగా మోక్షార్హత యని యర్థము. అట్టి యర్హతను సముపార్జింపఁ బాటుపడుదురు గావుతమని కోరుచున్నాఁడను.



శ్రీశ్రీశ్రీ ఆంధ్రప్రదేశ దేవాదాయ మతాదాయ, ధర్మాదాయ శాఖాధ్యక్షులు
శ్రీ పైడి లక్ష్మయార్య వర్యులు తమ యిరువదవయేఁట రచించిన

# మార్కండేయ చరిత్ర

## దృశ్యకావ్య ప్రశంస

శ్రీ కొప్పరపు సీతారామప్రసాదరావు

పాటించినది పల్కుఁబళ్ళను లోక విశ్వాసంబు నెఱుకలసాని గద్దె
ప్రాపించినది మానవత్వంబు మౌనీంద్రు పడతియైనను తల్లి కడుపుతీపి
లక్షించినది యనుల్లంఘనీయంబని సమవర్తికేని యీశ్వరుని యాన
చాటించినది జనుస్సాఫల్య మార్గంబుఁ బెంపించు గేస్తుని పెద్దఱికము
ద్వత్ మృకండనందన చరిత్ర ప్రసిద్ధ
దృశ్య కావ్యంబు, పాత్రౌచితీ ప్రభావ
భావ భవ్యంబు, విబుధ భావ్యంబు సత్క
ళా ప్రసాద సౌముఖ్య ! శ్రీలక్ష్మయాఖ్య !

అరవిందాసను రాణివాసమిటు జిహ్వాగ్రంబునన్ నిల్పి క్రొ
న్నుఱుఁగుల్ దేరు సుధారసంబు గురియఁగా దొల్పుట్టునందే తపో
వరివస్యాచణివై తి విర్వదియునౌ ప్రాయాన నక్కాఁబికా
పరిపూతాత్మ సువర్ధితాత్మ గుణభావా ! పైడి వంశోద్భవా !



# గణాధిపతి సస్యదేవత

శ్రీ బులుసు వెంకటరమణయ్య

భారతదేశంలో శైవ, వైష్ణవాది సంప్రదాయాలకు చెందిన దేవతల ఆరాధన ఆసేతు హిమాచల పర్యంతం ఉన్నది. కొన్ని ప్రాంతాలలో కొందరు దేవతలకే ప్రాధాన్యం వున్నది. అంటే ఉత్తర ప్రాంతంలో కొందరు దేవతలకూ, దక్షిణప్రాంతంలో కొందరు దేవతలకూ ప్రాధాన్యం కానవస్తున్నది. కాని, గణాధిపతి యావద్భారతంలోనూ ప్రధాన దేవతగా పరిగణింపబడుతున్నాడు. అంతేకాదు. మనం ఏ దేవతను పూజింపదలచినా, ఏ శుభకార్యాన్ని నెరవేర్పదలచినా మొట్టమొదట గణాధిపతిపూజ చేస్తేనేగాని, దాన్ని ఉపక్రమించడానికి వీలుకాదు. భాద్రపదశుద్ధ చతుర్థినాడు చేసే గణేశ్వరుని పూజకు కూడా ముందుగా పసుపు విఘ్నేశ్వరుని పూజచేసి తీరుతాము.

ఏ దేవతను పూజించినా, ఎవరిని ఆశ్రయించినా ఏదో ఒక కోరిక మనస్సులో వుంటుంది. అది నెరవేరడానికే ఈ ప్రయత్నాలు జరుగుతాయి. "ఆరోగ్యం భాస్కరా దిచ్ఛేత్, ధన మిచ్ఛే ద్ధుతాశనాత్, ఐశ్వర్య మీశ్వరా దిచ్ఛేత్." ఇత్యాది సూక్తులవల్ల ఒక్కొక్క ఫలం ఇవ్వడానికి ఒక్కొక్క దేవతకు ప్రత్యేకాధికారం కూడా వున్నట్లు స్పష్టంగా కానవస్తున్నది. అయితే—'గణాధిపతివల్ల ఏ కోరిక సఫలమవుతుంది?' అనే ప్రశ్న కలుగవచ్చు. విద్యాప్రదానంలోనూ, స్థిర సంకల్పంలోనూ అతడే ముఖ్యదేవత. అంతకంటే ముఖ్యమైనది ఏమంటే—అతడు విఘ్నరాజు. విఘ్నాలన్నీ అతనిచేతిలో ఉన్నాయి. మనం ఏ కార్యం తలపెట్టినా - అది జరగకుండా ఆటంకపెట్టడానికి తగిన సాధనకలాపం ఆయనదగ్గర ఉన్నది. అలా ఎట్టి ఆటంకాలూ కలిగించకుండా వుండడంకోసం అతనిని మనం పూజించాలి. ఇతని పూజాసంకల్పంలో "నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం ఆదౌ గణాధిపతి పూజాం కరిష్యే" అనే చెప్తున్నాము. ఈ గణాధిపతిని గురించే సుప్రసిద్ధ ప్రాచ్య పండితులు శ్రీ సర్వమంగళేశ్వరశాస్త్రిగారు చమత్కారంగా ఇలా చెప్పారు—

శ్లో. భూనాయకం వా ధననాయకం వా
భజన్ భువం వా ధన మేతి లోకే
త ద్విఘ్ననాథం నభజామి కింతు
సహస్రశ స్తం ప్రణమామి నిత్యమ్.

భూనాయకుని సేవిస్తే భూమి లభిస్తుంది; ధనాధిపతిని సేవిస్తే ధనం లభిస్తుంది; విఘ్ననాయకుని సేవిస్తే-ఆ విధంగా విఘ్నాలే లభించవలసి వున్నవి. అవి కోరదగినవి కావు. అందువల్ల అతనిని నేను సేవించను. (మా జోలికి రావద్దంటూ) అతనిని వేలకొద్దీ నమస్కారాలు చేసి ప్రార్థిస్తున్నాను.' అని పైశ్లోకం అభిప్రాయం.

గణాధిపతిని గురించిన కథలు కొన్ని వున్నవి. అందులో ఈ క్రిందికథ బహుళప్రచారంలో వుండి, ఆబాలగోపాలమూ ప్రసిద్ధమయినది.

"పార్వతీదేవి ఒకప్పుడు కైలాస పర్వతంపైని అభ్యంగస్నానం చేయబోతూ, శరీరం నలుచుకున్న పిండితో ఒక బొమ్మచేసి, దానికి ప్రాణంపోసి, ద్వారంలో కాపుదల ఉంచి తాను లోపలికిపోయి తలంటి నీళ్ళు పోసుకొన సాగినది. ఆ సమయంలో శివుడు ఎక్కడికో వెళ్ళియున్నాడు. ఇంట్లో లేడు. కొంతసేపటికి శివుడురాగా, ఈ బాలుడు — వినాయకుడు అతనిని 'లోపలికి పోరా'దని ఆటంకపెట్టాడు. శివునికి కోపంవచ్చి, త్రిశూలంతో ఆ బాలుని తలను

ఎగరగొట్టి చంపివేశాడు. ఈసంతి తెలిసి, పార్వతి తన కుమారుడు విగతజీవుడైనందుకు ఎంతో దుఃఖించి, మళ్ళీ అతనితలను తెచ్చి అతికి, బ్రతికించాలని పట్టుదల పట్టింది. శివునికి ఆ పిండి బొమ్మను బ్రతికించక తప్పినది కాదు. త్రిశూలంతో ఎగరగొట్టబడిన ఆ వినాయకుని తల ఎంత వెతికినా లభించడంలేదు. చివరకు శివుడు ఒక ఏనుగు తలనుతెచ్చి, అతికించి ప్రాణం పోశాడు. తర్వాత ఆ బాలుడు శివుని దగ్గర ఉండే ప్రమథ గణానికి అధిపతి అయి 'గణాధిపతి' అనే సార్థక నామాన్ని సంపాదించుకున్నాడు. గణేశుడు, గణాధ్యక్షుడు, గణపతి అనే పేర్లూ యీ అభిప్రాయాన్నే వ్యక్తంచేస్తూ ఉన్నవి."

ఈ గణాధిపతికి 'గౌరీపుత్రుడు, గజాననుడు, వక్రతుండుడు, ఏకదంతుడు, లంబోదరుడు, శూర్పకర్ణుడు, ధూమ్రవర్ణుడు, మూషికవాహనుడు' మొదలైన నామాంతరాలున్నవి. అవికూడా అర్థవంతాలైనట్లే కానవస్తూ ఉన్నవి. వీటిలో చాలా పదాలు అతని స్వరూపాన్ని తెలుసుకోవడానికి ఉపయోగిస్తున్నవి. వీటినిబట్టి ఊహిస్తే ఒక వికారమైన స్వరూపం మన యెదుట ప్రత్యక్షమవుతూ వుంటుంది. ఆ విగ్రహం పసుపుపచ్చని పొట్టి శరీరం, ఏనుగుతలా, ఒంటిదంతమూ, చేటచెవులూ, వంకర తొండమూ కలిగి, ఎంతో విచిత్రంగా కానవస్తుంది. ఇట్టి గణాధిపతికి వాహనం ఎలుక!

అందరికీ ఉపాస్యుడూ, అత్యంత ముఖ్యుడూ అయిన గణాధిపతి స్వరూపం యీ విధంగా ఎందుకు ఉండాలీ? అతని వాహనం ఎలుక ఎందుకు కావాలీ? అని ఎలాంటివారికిన్నీ కొంత ఆలోచన కలుగక మానదు.

బాగా ఆలోచించగా, గణేశుడు సస్యాధిదేవత అయి వుండవచ్చునని తోస్తూ వున్నది. ఏమంటే- అతని వికారస్వరూపమూ, అదీ అలా ఊహించడానికి ఎంతో అనుకూలంగా ఉన్నది. గణపతి స్వరూపం ఒక వరి మొక్కకు సరిపోతూవుంటుంది.

పరమేశ్వరునికి ఎనిమిది దేహాలున్నవనీ-అంటే-అతడు అష్టమూర్తి అనీ, ఆ తనువుల్లో సూర్యరూపం దేహం ఒకటి అనీ అందరికీ తెలుసును. అప్పుడు పార్వతీదేవిని భూమిగా గ్రహించవలసివుంటుంది. పార్వతీదేవి స్నానంచేసే సమయంలో శివుడు స్వభవనంలోంచి బయటికి పోతాడని కథగదా! వర్షాకాలంలో భూమి జలమయంగా వుండేటప్పుడు- ఆకాశం మేఘావృతమై, సూర్యుడు కానరాకుండా వుంటాడు! భూమియొక్క మట్టిలోనుండి అంకురించిన వరిమొలక-పార్వతి నలుచుకున్న పిండినుండి తయారైన బాలుడని ఊహించవచ్చును. అందువల్లనే అతడు గౌరీపుత్రు డయ్యేను.*

వర్షాకాలం అయిపోయాక - శరదృతువులో సూర్యుడు తిరిగీ భూమిపై తన కిరణాలను ప్రసరింపజేయడానికి వస్తాడు. అదే శివుడు తిరిగీ తన గృహాన్ని ప్రవేశించడానికి వస్తాడన్న కథకు సరిపడుతుంది.

సూర్యుడేమో వస్తాడు; కాని అతని కిరణాలు తిన్నగా భూమిమీద ప్రసరించడానికి అవకాశం వుండదు. బాగుగా పెరిగిన వరిచేను అడ్డుపడుతుంది. ఆ విషయమే "శివుడు పార్వతిని కలుసుకోవడానికి వీలులేకుండా గణేశ్వరుడు అడ్డుపడ్డాడు" అనేదానివల్ల స్పష్టమౌతూ ఉన్నది.

వెంటనే జరిగిన దేమిటీ? కోపించిన శివుడు గణేశ్వరుని తలను తెగవేసి, పార్వతీదేవికి తీరని దుఃఖాన్ని కలిగించడమే కదూ! పంట కోతకు వచ్చాక చెయ్యవలసిన పనికూడా కొయ్యడమే కదూ! అలా సస్యాన్ని కోసివేస్తే — అంతకు పూర్వం కలకలలాడుతూ వుండే పొలం కళాకాంతులు లేక దుఃఖిస్తూ వున్నట్లు కానరాదూ! ఇలాగున పొలం కళావిహీనంగా కొంచెంకాలం కానవచ్చినా కోసిన

* వరిచేను బాగుగా ఈనిన తర్వాత పొలాలు కలకలలాడుతూ, కర్షకులకు ఎంతో ఆనందాన్ని కలిగిస్తూ ఉంటాయి. ఆ సమయం కార్తీకమాసం. అప్పుడు కర్షకులు గౌరమ్మపండుగ చేసుకుంటారు. ఈ ఊహకు అది ఎంతోఅనుకూలం!

వరిచేలు కళ్లాల్లో కుప్పలుగా వెయ్యగా చూడడానికి ఎంతో ముచ్చటగా వుంటుండి. అందువల్లనే ఘూరూపంగావున్న పార్వతీదేవికి విచారం కొంత తగ్గుతుంది—తల తెగిన తన కుమారునికి తిరిగి ఏనుగుతలను పెట్టించి ఆమె ఆనందిస్తుంది. అందు వల్లనే ఆమె విచారం తగ్గడం!

ఇదివరకు చెప్పిన విషయం సరిపోతే సరిపో వచ్చు. కాని గణాధిపతిని గజాననునిగా వర్ణించడం ఎలా కుదురుతుంది? అనే సందేహం కలుగవచ్చును. ఆ విషయంకూడా సమర్థించడానికి అనుకూలమైనదే! ఏనుగుముఖంలో ప్రధానమైనవి తొండమూ, చెవులూ, దంతమున్నూ. [వినాయకుడు ఏకదంతుడుగానే చెప్పబడి వున్నందున - ఒకే దంతాన్ని గ్రహించ వలసి వున్నది.] ఊగులాడుతూవున్న వరివెన్ను తొండమనీ, వరివెన్నులు కోసే కొడవలి దంతమనీ, గింజలను పొల్లుపోయేటట్లు తూర్పారబట్టే చేటలు చెవులనీ ఊహించడం ఎంతో సబబుగా కానవస్తుంది. అందువల్లనే అతడు శూర్పకర్ణుడైనాడు. వరివెన్ను ధూమ్రవర్ణంగా వుంటుంది కాబట్టి వినాయకుడున్నూ ధూమ్రవర్ణుడైనాడు.

ఇక—గజాననుడికి ఎలుకవాహనమేమిటి? అనే సందేహం కలుగవచ్చును. ఒకటి ఏదైనా—ఒకరికి వాహనం అయినదంటే దానిని అతడు లొంగదీసు కున్నాడని అభిప్రాయం. ఎలుక సస్యానికి ప్రబల విరోధి. ఈతిబాధల్లో ఎలుక చేరిఉన్నది.

"అతివృష్టి రనావృష్టిః
మూషికాః శలభాః శుకాః,
ప్రత్యాసన్నాశ్చ రాజానః
షడైతే ఈతయః స్మృతాః."

అని యీతిబాధలు ఆరు చెప్పబడి వున్నవి. ఎలుక పొలంలో బొరియలు పెట్టి సస్యనాశానికి దారి కలుగజేస్తుంది. అందువల్ల ఎలుకల ఉపద్రవం లేకుండా వుండడానికి — ఆ యెలుకను సస్యమే స్వాధీనం చేసుకున్నట్లు — 'గజాననకు ఎలుక వాహనం' అనే సంగతి వ్యక్తం అవుతున్నది.

ఇక్కడ మరొక విషయాన్ని గమనించవలసి వున్నది.

హిందూదేశానికి తూర్పున వున్న బాలిద్వీపంలో పంటపొలాలను నశింపజేస్తూ వున్న ఎలుకలను అక్కడివారు విశ్వప్రయత్నంచేసి పట్టుకుని, కాల్చి వేసి నశింపజేస్తారు. చివరకు - ఆ పట్టుబడినవాటిలో రెండిటిని మాత్రం చంపకుండా విడిచి - వాటిని మాత్రం దైవసమానంగా భావించి, వాటియెదుట సాష్టాంగంగా మోకరిస్తారు తర్వాత వాటిని విడిచి పెడతారు. ఈ విషయం Frazer అనే అతడు వ్రాసిన Golden Bough అనే గ్రంథాన్నిబట్టి తెలుస్తున్నది.

అతి ప్రాచీనకాలంలో ప్రజలు తమకు కావలసిన వాటినే వుంచుకుని, తక్కిన ప్రాణులను నశింపజేశే వారనీ, ఒకటి, రెండింటిని మాత్రం మిగిల్చి, వాటిని ఎంతో గౌరవంతో చూచేవారనీ దీనివల్ల తెలుస్తున్న దని ఫ్రేజరు విశ్వయించాడు. ఈ విధంగానే ప్రాచీన కాలంలో భారతభూమిలో మూషికసంహారం జరిగాక మిగిలిన ఒకటి రెండు ఎలుకలు ఆరాధ్యాలుగా అయి వుంటాయనీ, అట్టి గౌరవాన్ని బట్టే ఎలుకకు వినాయక వాహనత్వగౌరవం అబ్బి వుండవచ్చుననీ అనుకో డానికి అవకాశం ఉన్నది.

కఠ, కాపిష్ఠల, మైత్రాయణ సంహితలలో మూషిక మును గూర్చిన విషయం మరొక విధంగా ఉన్నది. అందు "రుద్రాఖుం తే పశుం కరోమి; ఏష తే రుద్ర భాగ స్సహ స్వస్రామ్బికయా తం జుషస్వ స్వాహా" అని వున్నది. దీనినిబట్టి ఎలుక మొదట్లో రుద్రునికి సమర్పించబడే యాగపశువనీ, అతడు తన సోదరి యైన అంబికతోకూడా దీన్ని స్వీకరిస్తాడని చెప్పబడి నట్లు తెలుస్తున్నది. అంబిక శరదృతురూప అనీ ఆమె రుద్రునికి సోదరి అనీ తైత్తిరీయ బ్రాహ్మణంలో "శరద్వాయస్య (రుద్రస్య) అమ్బికా స్వసా" అని చెప్పబడి వున్నది. పంటకాలపు భూమియే అంబిక గాను, అంబికయే క్రమంగా పార్వతిగాను మారి, రుద్రుడు శివుడయినాడు. క్రమంగా వీరికి భార్యా భర్తల సంబంధం ఏర్పడి, వీరిపుత్రుడైన గణేశ్వరు

నికి ఎలుక వాహనంగా మారిపోయినది. ఇవన్నీ క్రమక్రమంగా జరుగుతూవచ్చిన మార్పులేగాని ఒక్కసారిగా ఏర్పడినవికావు. చివరకు గణాధిపతికి ఎలుక వాహనం స్థిరపడిపోయింది.

గణాధిపతి బ్రహ్మచారి అని కొందరు అనుకుంటారు. ఇతడు వివాహితుడనీ, సిద్ధి, బుద్ధి ఇతని భార్యలనీ చెప్తూ 'సిద్ధి బుద్ధి ప్రియ' అనే యితనిని గూర్చిన విశేషణాన్ని ఉదాహరిస్తారు. ఇతడు సిద్ధి బుద్ధులను వివాహం చేసుకున్నాడంటే- సిద్ధీ, బుద్ధీ యితని స్వాధీనంలో వున్నవనీ, ఇతన్ని ఆరాధిస్తే కార్యసిద్ధి తప్పక కలుగుతుందనీ, గొప్ప ధీశక్తి అబ్బుతుందనీ అభిప్రాయం. ధీశక్తిని యిచ్చేవాడు కాబట్టే గణాధిపతి విద్యార్థులకు ప్రధాన దైవం అయినాడు. ఏకార్యసిద్ధికయినా ముఖ్యుడయి ప్రథమ పూజ్యుడయినాడు.

జనులందరూ జీవించడానికి ప్రధానమైనది అన్నం. ఆ అన్నం వుంటేనే- తర్వాతి సిద్ధీ, బుద్ధీ మొదలైనవి లభిస్తాయి. అన్నానికి మూలకారణమైన సస్యానికి గణాధిపతియే దేవతకావడం వల్ల అన్నం వల్ల పరంపరగా కలిగేవన్నీ గణేశ్వరునివల్లనే కలుగుతున్నాయని నిశ్చయించవలసి వున్నది. అందువల్లనే విద్యకుకూడా ఇతడే ఉపాస్యదైవము అగుచున్నాడు.

భారతదేశం అతిప్రాచీనకాలంనుంచీ వ్యవసాయం ప్రధానంగాగల దేశం। అతిథిపూజచేస్తూ ఇతరులకు ఆహారం యిస్తూ-తాను పస్తయినా వుండడానికీ, తాను బాధలు పడుతూవున్నా సరే, ఇతరులకు మేలు చెయ్యడానికీ ప్రతి భారతీయుడూ అలవాటు పడి వుండేవాడు. అట్టి స్థితిలో భారతీయుడు వ్యవసాయానికి ఆధారమైన గణాధిపతిని తప్ప మరొక దేవుని ఎందుకు ముఖ్యునిగా గ్రహిస్తాడు?

పయి విషయాన్ని మనం అవగాహన చేసుకున్నట్లయితే వినాయకుని రూపం వికారమైనదిగా మనకు తోచదు. ఇది ఒక్కటే కాదు. పురాణాదుల్లో మన ప్రాచీనులు చెప్పిన గాథలన్నీ స్థూలదృష్టికి కొంతవరకూ అనుచితాలుగా తోచినా, సూక్ష్మదృష్టితో- వానికి వెనుక వుండే ఉదారాశయాలనూ, తత్త్వాలనూ గ్రహించినట్లయితే - 'అనుచితాలు' అని అనుకోవడానికి ఏమాత్రమూ అవకాశం వుండదు.

విఘ్ననాయకుని స్వరూపం యీ విధంగా వుండడానికి కారణాలేమిటో యింతవరకూ పరిశోధకులు వివరించివుండలేదు. అతడు సస్యానికి ప్రధాన దేవత అనీ, అతని రూపం ప[ై]మొక్కను స్ఫురింపజేస్తుందనీ గ్రహించాక-అతని రూపం వికారమైనదనే అభిప్రాయం తొలగిపోతుంది. అతడు భారతీయులకు అత్యంత ప్రధానమైన వ్యవసాయమునకు సంబంధించినవాడు కాబట్టే తదితర దేవతలు అందరికంటెనూ ఎక్కువ ప్రాధాన్యం వహించాడు.

[మహామహోపాధ్యాయ-పండిత లక్ష్మీధరశాస్త్రి, (ఎం.ఏ., ఎం. ఓ. ఎల్.) గారు వ్రాసిన వ్యాసం ఆధారంగా.]



# గీతా గానము

శ్రీ మోటూరి వేంకటరావు

## ద్వితీయాధ్యాయము

(గతసంచిక తరువాయి)

### సాంఖ్యయోగము

కురుక్షేత్ర క్షోణిఁ గల నర
హరుల సంవాదార్థమును కురు
నరపతికి సంజయుఁడు తెలుపుచు
మఱియు నిట్లనియెన్.

"అటులు కృప హృదయమున నిండఁగ
అశ్రు జల నయనాకులుండై
అర్జునుఁడు దుఃఖాబ్ధిఁ బడ హరి
యతనిఁ గని పలికెన్.

"అనార్యం బయి నట్టిదియు, దివిఁ
గనం జేయని ఘనత నీయని
జన వ్యాప్త స్ఖలిత మోహము
నిసుం బూనె నిటుల్.

పిఱికితనమును విడువు మర్జున!
పరుల సేనలఁ బైకొనుమ — ఇ
క్కరణి వగచుచు వెఱపు నొందక
దురమునకు లెమ్మా"

అనవు డిట్టుల అనియెఁ బార్థుఁడు
"మొనల మును భీష్ముఁడును ద్రోణుఁడుఁ
గన, శరమ్ములఁ గడఁగి యెమ్మెయిఁ
బనిచెదను ? కృష్ణా !

మహాగురులను మట్టుపెట్టక
మధుకరముతో మనుట మేలగు —
మాన్యులను బొలివుచ్చి రక్తపు
మాంస మెటు తినెదన్ ?

కౌరవులొ - మేమొ - రణమ్మున
మీఱఁగల ; మెమ్మెయిని సరె, ఎ
వ్వారి దోరిచి బ్రతుక నేరమొ
వారె దళనాసీరముల ను
న్నారు కద కృష్ణా !

మచ్చరపుఁ గల్మషము కతమున
మంచి తెలియని మతిని నే బ్రతి
మాలెదను — ధర్మమును వాకొని
మనుపు మీ శిష్యున్.

పగ నెఱుంగని భవ్య రాజ్యపుఁ
బదవియును సురపాలనమ్మును
బ్రబల శోకవ్యథల నడఁపఁగఁ
బనికిరావు కదా."

వీరుఁ డగు ఆ విజయుఁ డట్లు వి
చారమును వెలిఁ బాఱఁ గ్రక్కుచుఁ
బోరు సల్పఁగఁ బో నటంచును
ఊరకుండె నటన్.

అటులు సేనాపటల మధ్యమ
మందు అధికవ్యథల నొందిన
అర్జునుని గని హరి నుడివె దర
హాస వదనుండై —

"వనట చెల్లని వారి కొఱకై
వనరు చుంటివి - ప్రజ్ఞ గలిగిన
వాని చందము పలుకుచుంటివి—
వనట చెందరు పండితులు ; భువి
వఱలు చుండెడు ప్రాణి తతికై
వదలి పోయెడు ప్రాణములకై
వగపు దిగులును బెగడు నొందరు
వార లెయ్యెడ నేఁ.

*'ఏ' నొకప్పుడు లేననియు మఱి
'ఈ' వొకప్పుడు లే వటంచును
'ఈరు' 'మేము' ను 'వారు' లేరని
ఎంచరాదు సుమీ.

పసితనమ్మును మిసిమి వయసును
ముపలితనమును మూడు నెటులో
వసుధ దేహప్రాప్తి వరుసగఁ
బొసఁగు దేహి కటుల్.

ఒడలి యెడ శీతోష్ణములు వలెఁ
దొడరు సుఖమును దుఃఖ మర్జున!
ఒడలు కడచిన నుండవవి - నీ
వుడుగు మిఁక వనటన్.

ఎవఁడు భవమున నింద్రియములకు
వివశుఁడై జీవించఁడో అతఁ
డవిచ్ఛిన్న మహాత్ముఁడై చని
అవల ముక్తిఁ గనున్.

మేను నిల్క డలేని మిథ్యయె-
పూని నాశము పొంద దాత్మను-
జ్ఞానులకు నిశ్చయముగా ఇవి
కానిపించుఁ గదా.

జగజ్జగతీ జనన కారణ
మగుచు శాశ్వతమైన బ్రహ్మముఁ
దెగు డొనర్చెడి తీవ్రశక్తియె
అగపడంగలదే ?

అఖిలమును సత్యమ్ము నిత్యము
నవ్యయ మ్మగు ఆత్మ-కాయము
లన్నియును మసి యౌను-కావున
అనికి లెమ్మోయీ !

హత మొనర్చెడి దాత్మ, మఱియును
హత మ్మగునది ఆత్మ అను ఈ
వితపుఁ బల్కు వివేక ; మాత్మకు
మితియె లేదు సుమీ !

జనన మరణ మ్మనుట, పూర్వము
మనక ఇట జన్మమ్ము నెత్తిన
దనుట, త ప్పీ తనువుఁ బోలని
అనంతాత్మ యెడన్.

ఆత్మ పుట్టని అడఁగిపోవని
అవ్యయపు సత్యముగఁ దెలిసిన
అతం డే విధ మడఁగు హతుఁడై ?
హనన మెటు చేయున్ ?

చిరిఁగి పోయిన చేలముల నెటు
విరుఁడు విడి క్రొమ్మెలుఁగు బట్టల
ధరించునో అటు తనువు లాత్మయు
వరుసఁ దాల్చుఁ గదా.

* నేను, నీవు, వీఁడు, అనిపించుకొను మనమెల్లరము నిత్యాత్మైకరూపమున విరాజిల్లి బహు దేహరూపములు దాల్చుటచే వేఱుగాఁ గనిపింతుము. (శం. భా. మొద॥)

# చతుర్మత తత్త్వం - శాంకరాద్వైతం

శ్రీమాన్ వేదాళ తిరువేంగళాచార్యులు

(గతసంచిక తరువాయి)

అపుడు తనకు విశ్వాసపాత్రుడగు వ్యక్తి తెలిపిన విషయమేకదా - అది తాడు, పాముకాదు" అను విషయ మట ప్రత్యక్షమగును ! అట్లుపట తన కంటితో తాను జూచినపుడే ఆ తాడునం దుదివరకు ఆతనికి తోచు పాము తొలగిపోయినట్లగును. కనుక నూరక ఎన్నిమాటలు చెప్పినను అట దృఢమూల మగు రజ్జుసర్పభ్రాంతి పోలేదుకదా ! సామాన్యమైన రజ్జుసర్ప భ్రాన్తియే తొలగనిచో అనాదికాలపు వృత్తమై చిరతరానుభవరూఢమైన యీ ప్రపంచ భ్రాన్తి వట్టి పొడికబురులతో తొలగిపోగలదా ? లేదు. కనుక అందుకు తగిన సాధన సామగ్రిని సంపాదింపవలెను. తాడును పామనుకొన్నవానికి అది నిజముగా నంతేనో మరొకటో, తెలిసికొన వలెనని యిచ్ఛలేనిచో, నింకొకనికి తనని బోధింప నేమిపనీ ? ఒకపుడెవడైన తెచ్చినను వీనికామాటలు చెవికెక్కగలవా ? కనుక దాని నిజమును తెలిసు కొనుటకు కావలసిన ఆతురత-కోర్కె అతనికుండ వలెనుకదా ! అట్లే ప్రకృతములో గూడ బ్రహ్మను తెలుసుకొనవలెనను కోరిక (వివిదిషా) కలుగ వలెను. అందుకు కొంత సాధన సామగ్రిని వేద పురుషుడే సెలవిచ్చియున్నాడు. ఆ వివిదిష యంద రికిని కలుగదు. కొందరికి కలిగినను మనసులందు విషయాన్తరములవలన నభిభూతమై స్థిరపడజాలదు. ఏ కొలదిమందికో మాత్రము ఏర్పడును. వారెవరు ? "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేనదానేన తపసాఽనాశకేన" అని వేదపురుషుడు వివిదిషువులను తెల్పుచున్నాడు. ఏ మహానుభావులు చక్కగా అధ్యయనమొనర్చి, యజ్ఞముల యజించి, దానములచేసి తపంబు నెరవేర్చి అనాశకము-అనగా (ఏకాదశ్యాదులందు) ఉపవాసాది వ్రతములనొనర్చి బ్రహ్మను సామాన్యముగా దెలిసియుందురో వారికి మాత్రమే ఈ బ్రహ్మ వివిదిష యేర్పడును. కనుక ఈ వివిదిషాసాధనముల నెరవేర్చిన తరువాత బ్రహ్మ వివిదిష తప్పక నెరవేరును. అటుపిమ్మట పూర్వ మీమాంస నధ్యయనమొనర్చి వేదవాక్యముల నాయా న్యాయపురస్సరముగా విమర్శించి తెలిసు కొనవలెను. అందువలన నివి నిత్యము. ఇది అనిత్యము అను వివేకమేర్పడును. ఐహిలౌకిక విషయములన్నియు ననిత్యములనియు పారలౌకిక మగు బ్రహ్మము మాత్ర మొకటే నిత్యమనియు సామాన్యముగా తెలియును. అందువలన నైహి లౌకికములను భోగములందుగాని పారలౌకికభోగము లందుగాని వైరాగ్య మేర్పడును. ఎందువలన ? అవియన్నియు ననిత్యములగుటయేకాక బంధము లుగా గూడ తనకగును అని తెలియవచ్చునుగనుక. అపుడు వీటి యన్నింటినుండియు తొలగవలెనను కోరిక కలుగును. ఇది కొంచెమెక్కువగానే అపుడు "శాన్తిదాన్తి, ఉపరతి, తితిక్ష, సమాధి, శ్రద్ధా (షట్సంపత్తి) అనునవి క్రమముగానొదవి యితనిని బ్రహ్మజ్ఞానమునకై త్వరపెట్టును. కనుక ఈ సాధన చతుష్టయము నిత్యానిత్య వస్తువివేకము, ఇహా ముత్రార్థఫలభోగవిరాగము, ముముక్షుత్వము, శమద మాదిసాధనసమ్పత్తు అనునవి నాలుగు కూడ బ్రహ్మ జ్ఞానము కలుగుట కవశ్యముగా బూర్వముండకతప్ప నివి. ఇదివరలోజెప్పిన పూర్వమీమాంసా శ్రవణాదిక ముండిన నుండవచ్చును, ఉండకపోయినపోవచ్చును. ఏమనగా కొంతమంది మహానుభావులకు జన్మాన్తర కృతములగు సుకృత విశేషములచేత వేదాన్తముల

నధ్యయన మొనరించినవెంటనే బ్రహ్మజిజ్ఞాస కలుగ వచ్చును. కనుక పూర్వమీమాంసాధ్యయనము నియతముగా నుండనక్కరలేదు. కాని ఈ సాధన చతుష్టయముమాత్రము తప్పక యుండవలెను. ఇవి యున్ననెకాని గురుముఖమున సరిగా శ్రవణ మొనర్చుటగాని దానివలన క్రమముగా నేర్పడు బ్రహ్మజ్ఞానమును ఫలమును సరిగా ననుభవింప గల్గుట కాని అనగా వాక్యార్థజ్ఞానమను బ్రహ్మాత్మైకత్వ ప్రత్యక్షముగాని కలుగదు. శ్రుతి యిట్లున్నది. "శాన్తో దాన్త ఉపరతస్తితిక్షుశ్శ్రద్ధావిత్తో భూత్వా ఆత్మన్యే వాత్మానం పశ్యేత్" అని. కనుక పై జెప్పిన సాధన చతుష్టయమును సరిగా సమ్పాదించినవాడె బ్రహ్మ విద్యాధికారియని "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" సూత్ర ముతో బాదరాయణులు సూచించుచున్నారు. ఇటు "అథ" యనగా సాధన చతుష్టయమును సంపాదించిన తరువాత అని యర్థము. ఈ సంపత్త్యానంతరము శ్రుతి నుడివినట్లుగా నేర్పడు బ్రహ్మజ్ఞానము ఫలరూపమైనది కనుక నది తాను సిద్ధించుటకై విచారాత్మకమగు జ్ఞానము నాక్షేపించును. ఫలము స్వసిద్ధికై ఉపాయము నాకర్షించునుకదా! కనుక ఫలభూతమగు జ్ఞానమిట సూత్రములోని పక్షితమని తలచి దానికి సాధన చతుష్టయము సంపన్నమైన కాని యది లభింపదని శ్రీ శంకర భగవత్పాదులు ఇట్లు వ్యాఖ్యానించి రీవ్యాససూత్రమును. నిజముగాకూడ ప్రపంచాధ్యాస నివృత్తికి గావలసిన జ్ఞానము ఫలభూతమగు బ్రహ్మజ్ఞానమేకదా! దానికి సాధన చతుష్టయమే నియతముగా నుండవలయును గాని మరొకటి కాదుగదా! ఇట్లు సాధన చతుష్టయ సమ్పన్నుడగు నధికారి గురుసన్నిధికి చేరి చక్కగా వేదాన్తశ్రవణము నొనర్చును. అనగా వేదాన్తవాక్యముల నన్నింటిని మీమాంసాన్యాయ పురస్సరముగా నాత్మైకత్వ ప్రతిపత్తినె సమకూర్చునవియని గురు ముఖమునుండి వినును. ఆ పిమ్మట గురూపదిష్టమగు విషయమును తనకు దెలిసినట్టి లౌకిక వైదిక యుక్తులతో సమన్వయించుకొని ఉపదిష్టార్థమును సరిగా స్థిరపరచుకొనును. ఆ పిమ్మట స్థిరపడిన యా యర్థమును తన మనసులో నిరంతరము తైలధారవలె నవిచ్ఛిన్నమగు స్మృతి సన్తతితో సంభావించును. అట్లు నిది ధ్యాసన మొనర్పగా ప్రత్యక్షాకారమగువృత్తి జ్ఞానమేర్పడును. అనగా తత్త్వమసాది వాక్యార్థము ప్రత్యక్షమగును. అపుడా యద్వితీయాత్మ ప్రత్యక్షము కలుగగానే ఇక కృతకృత్యుడగును. ఇక కర్తవ్య శేషము ఏమియులేదు. ప్రపంచమంతయుగూడ తనకు మూలమగు మాయతో గూడనివృత్తమైపోవును. ఇట్లు బ్రహ్మభావము నొందుటయే యీ విద్య పరమార్థము. ఇట్లు మహాఫలమగు బ్రహ్మవిద్యను లభించుట కనువుగా బ్రహ్మవిచార మావశ్యకము అనుటలో సందేహ మేమున్నది? బ్రహ్మజ్ఞానము విధింపబడినతోడనే బ్రహ్మవిచారము ఆర్థికముగా విధింపబడినట్లయినది. ఈ బ్రహ్మజ్ఞానమును "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" యను సూత్రముతో అపాంతరతముడను వ్యాసుడు విధించుచు బ్రహ్మజ్ఞానమున కుపయోగించు విచార ముపనిషత్తులందును భగవద్గీతలందును, ఇంకను గొన్ని రామాయణ మహాభారతాదులందును కొన్ని స్మృతులందును కన్పట్టుచుండుటవలన వానినిగూడ చేర్చి యీ నాలుగధ్యాయములందును చక్కని చతురశ్రమైన బ్రహ్మవిచారమును ప్రదర్శించినాడు. ఇది యంతయు నాచార్య ముఖమున మనము వినవలెను. ఇదియే శ్రవణము. ఈ బ్రహ్మవిద్యకు ప్రథమాచార్యుడు నారాయణుడు పిమ్మట పద్మభవుడు, క్రమముగా వశిష్ఠుడు, శక్తి, పరాశరుడు, వ్యాసుడు, గౌడపాదుడు, గోవిందభగవత్పాదులు, శంకరభగవత్పాదులు. వారి శిష్యులు నల్వురు - పద్మపాదులు, హస్తామలకులు, త్రోటకాచార్యులు, వార్తికకారులని పేరుగొన్న సురేశ్వరాచార్యులు. ఈ పరంపర బ్రహ్మవిద్యారంభమున దశశాన్తులతోబాటు, దక్షిణామూర్తి స్తోత్రముతోబాటుగా తప్పక కృతజ్ఞతా పూర్వకముగా నిత్య మనుసంధేయమై యున్నది. ఈ బ్రహవిచార మొనర్చి బ్రహ్మవిజ్ఞానమున జక్కగా లభింపవలెనన్నచో ప్రధానముగా నుపనిషత్తులను, భగవద్గీతలను

అభ్యసింపవలెను. వాని యర్థమును సరిగా తెలియ వలెనన్నచో నారాయణాదిక్రమమున సాంప్రదాయిక విజ్ఞానము నభ్యసించిన శ్రీ వ్యాసునికన్న నింక నెవరు మనకు దానిననుగ్రహింపగలరు ? కనుకనే ఆ మహానుభావుడు బ్రహ్మసూత్రములు నాలుగధ్యాయ ములను మనకొరకై కటాక్షించి యున్నాడు. అతీన్ద్రి యమును అలౌకికమునగు నాత్మతత్త్వమునెరుగుటకై అపౌరుషేయములగు నుపనిషత్తులకన్న బిన్నయగు గ్రంథమిం కేమున్నది ? ఆ యుపనిషత్తుల సారము నంతయు శ్రీవాసుదేవుడు శ్రీ భగవద్గీతారూపమున వ్యక్తపరచెను. ఈ రెంటికన్న నాత్మతత్త్వమును దెల్పుట కుపాయములు ఇంక గొప్పవి లేవు. పురుషు లెవరైన నీ విషయమున మాటాడుచో వారికి భ్రమ ప్రమాద, అలస్య, వంచనాదిదోషములు సాహజిక ములు సంభవింపక మానవు. కనుక అపౌరుషేయ ములగు వేదవాక్యముల నాధారమొనర్చుకొనవలసి వచ్చినది. ఆదోసములేమియులేని యుపనిషత్తు లీ విషయమున ననుత్తరములగు ప్రమాణములు. ఏమనగా విషయము, అతీన్ద్రియమగు నాత్మ. ఇచట బ్రత్యక్షాది ప్రమాణము లేమియు బనిచేయజాలవు. కనుక తన్మూలకములగు ననుమానాదికమంతయు గూడనంతే. ఇక నొక శబ్దమే ఈవిషయమున బ్రమాణ మనదగును. దాని కొక దానికేకదా అతీన్ద్రి యమగు నర్థమును గోచరింపగలశక్తి యున్నది. కనుక అతీన్ద్రియమగు నర్థమును గోచరింప గల వాక్యములు కాని, అట్టి మహానుభావుని వాక్యములు కాని యీ అతీన్ద్రియాలౌకికమగు నాత్మతత్త్వము దెల్పుటలో బ్రమాణమూర్ధన్యములై యున్నవి. అట్టివి మొట్టమొదట నుపనిషత్తులు, రెండవవి దేవదేవుడగు శ్రీ వాసుదేవుడు అనుగ్రహించిన భగవద్గీతలు. తన తత్త్వమును స్పష్టపరచుటకసలు వానికన్న నితరు డెవడు సమర్థుడగును. ఆ భగవద్గీతలుకూడా ఉపని షత్తుల సారమే ఈ విషయములో నీ శ్లోకమును గమనింపుడు. "సర్వోపనిషదోగావః దోగ్ధా గోపాల నన్దనః । పార్థోవత్సః సుధీర్భోక్తా దుగ్ధంగీతామృతం మహత్" అని. కనుకనే యీ యుపనిషత్తులను భగవద్గీతలను వ్యాసుడు మహాఫలమగు బ్రహ్మజ్ఞాన మును కల్గించుటకై విచారరూపమున ననగా బ్రహ్మ సూత్రములుగా మన కందించినాడు. ఈ యుపోద్ఘాత మంతయు నెందుకనగా నీ సందర్భములో మనము గ్రహింపవలసిన దొక ప్రధానవిషయ మున్నది. "నేను చేయుచున్నాను "ఇత్యాదిరూపమగు లౌకికాను భవము లెన్ని యున్నను అసలీ తత్త్వము అలౌకిక మును, అతీన్ద్రియమును కావున నొక శబ్దమే (అతీ న్ద్రియాలౌకికార్థా ప్రతిపాదకముగనుక) ప్రమాణము. ఈ ప్రమాణముతో నిరోధించినచో ప్రత్యక్షాదులె అప్రమాణము లగును కాని ఈ శబ్దము వాని నిరో ధమువలన ప్రమాణము కాబోదు. కనుక ప్రత్యక్షాది ప్రమాణములతో జతపడకున్నను ఈ శబ్దప్రమాణమే అందును ఈ యపౌరుషేయమగు నుపనిషచ్ఛబ్దమే పరమ పూజ్యమును అప్రతిహతమును నగు ప్రమా ణము. ఈ విషయమే ఇట నీ యుపోద్ఘాతము వలన గ్రహింపవలసి యున్నది. కాగా "బ్రహ్మ మొకటియే సత్యము, ప్రపంచము మిధ్య, జీవుడు బ్రహ్మమే" నను త్రిసత్యములను గ్రహింపజేయునవి ఉపని షత్తులు, భగవద్గీతలు, బ్రహ్మసూత్రములు. ఈ మూడును చేరి ప్రస్థానత్రయమైనది. ఈ మూడింటి కి అర్థములను నీనిర్ణయించు స్థలములందు స్మృతీతి హాస పురాణాదుల గూడ సంగ్రహింపనగును గాని అసలు పరమప్రమాణము లుపనిషత్తులు. ఇది మొదటి ప్రస్థానము, వాని సారమును భగవద్గీతలలో శ్రీ భగవాను డుపదేశించెను. ఇవి రెండవ ప్రస్థానము. ఈ రెంటిని సమన్వయపరచి వ్యాసులు న్యాయ పుర స్సరముగా ప్రతిపాదించినవి బ్రహ్మసూత్రములు. ఇవి మూడవ ప్రస్థానము.

(సశేషము)



# శ్రీరామకథాసుధ

కీ. శే. శ్రీ గొబ్బూరు వేంకటానంద రాఘవరావు

(గతసంచిక తరువాయి)

4. శ్లో. యః కర్ణాంజలిసంపుటై రహరహ
స్సమ్యక్పిబత్యాదరా
ద్వాల్మీకేర్వదనారవిందగళితం
రామాయణాఖ్యం మధుః
జన్మవ్యాధి జరావిపత్తి మరణై
రత్యంత సోపద్రవం
సంసారం స విహాయగచ్ఛతి పుమాన్
విష్ణోఃపదం శాశ్వతమ్.

పై శ్లోకముల మూడింటి తాత్పర్యము ఈ క్రింద చూడనగును.

2. కవిత అనే వృక్షశాఖమీద సుఖముగా కూర్చొని, చెవుల పండువుగా, మధురస్వరముతో "రామా! రామా! అని ఎంతో తీయగా కూయుచున్న వాల్మీకికోకిలకు నమస్కరించుచున్నాను.

3. వాల్మీకి అనే పర్వతమునందు పుట్టి, రామాయణ పుణ్యస్రవంతి, తాను స్పృశించిన సమస్తమును పునీతము చేయుచు ప్రవహించి, ప్రవహించి, తుదకు శ్రీరామ సముద్రములో సంగమించుచున్నది.

4. వాల్మీకి వదనారవిందమునుండి స్రవించుచున్న రామాయణామృతమును చెవులనే దోసిళ్ళతో గ్రహించి నిత్యము ఆదరముతో గ్రోలి - జన్మము, వ్యాధి, విపత్తు, జరామరణాది మహోపద్రవములు - వీటి బారిని పడకుండ సంసారమును తరించి శాశ్వతమైన విష్ణుపదము చేరుకోగలము.

## పరివృక్తలు - కైకవరములు

శ్రీరామ, లక్ష్మణాది సోదర చతుష్టయ జన్మ కథకు ఉపక్రమింపకముందే - మనము రామాయణ కథ గమనికకు కీలకము లనదగు కైక వరములను గూర్చి సంగ్రహముగా తెలిసికొనుట అవసరము.

సంతానవతులు కాని సతులు సమర సమయము లందు భర్తలకు తోడుపడి, రథములకు సారథులై, తోలి, జయముగొని, వరములు పొందుట వేదకాలము నుండి మన దేశములో ఆచారము.

ముద్గలుడను మహాముని గోధనమును చోరులు అపహరింపగా-అతని సతీమణి- వంధ్య - ముద్గలాని భర్తగారి రథమును తోలి, దొంగలనుకూడ ముట్టి, ఓడించి, లక్షగోవులను మరల్చి తెచ్చినట్లు వేదగాథ ఉన్నది. దశరథునకు కౌసల్య, కైక, సుమిత్ర అనెడి రాణులు ముగ్గురు ఉండినను సంతానలాభము ఒకంతట కలుగలేదు. ఒకప్పుడు దేవాసురులకు సంగ్రామము పొసగగా, దశరథుడు దేవతలకు తోడ్పడ నరిగెను. అప్పటి కింకను సంతానప్రాప్తి లేనందున కైక దశరథుని తేరు తోలుచు యుద్ధమునకు వెళ్లెను. యుద్ధములో జయముగొని తనకు తోడుపడిన కైకకు రాజు రెండువరము లిచ్చెను. అప్పటి కవసరము లేక "కావలసినప్పుడు అడిగి పుచ్చుకుంటాను; అంతదాకా నిలవలో ఉంచండి" అన్నది కైక. "సరే!" అన్నాడు దశరథుడు.

అలాగే నరకాసురునితో యుద్ధమునకు బయలు దేరిన శ్రీకృష్ణుని సత్యభామ - పుత్రవతి కానందున-వెంబడించెను. వంధ్యలై భర్త రథము నడిపిన సతులకు వేదములో "పరివృక్త" లను పేరున్నది. "పరివృక్త" అను నక్షత్రమును పడమటి జోస్యులు Bellatrix అనుచున్నారు. కైక ఒక పరివృక్త.

## రాక్షసుల జన్మ - దౌర్జన్య వివరణము

బ్రహ్మదేవుని పౌత్రుడును, పులస్త్యఋషి పుత్రుడును అగు విశ్రవసునికి రావణ, కుంభకర్ణ, విభీషణులను కొడుకులు ముగ్గురును, శుప్పనాక అను కూతురును పుట్టిరి. అందు విభీషణు డొక్కడే సన్మార్గవర్తి. తక్కిన సంతానమంతా బహు క్రూరులు, హింసారతులు. గొప్ప తపస్సుచేసి రావణుడు దేవ దానవజాతు లెవ్వరిచేతను చావులేకుండ వరము పొందినాడు. రావణుని మేనమామ - ప్రహస్తుడును, రావణపుత్రులు ఇంద్రజిత్తు, అతికాయుడు మొదలగు వారును, రావణునివలెనే జగద్భయంకరులైరి. బ్రహ్మ వరగర్వితులై, యీ రాక్షసమూకలు లోక కంటకులైరి.

రావణుని స్త్రీ వ్యసనము మితిమీరిపోయినది. మయుడు కన్యాదానముచేసి రావణునికి పెండ్లిచేసిన మండోదరి - రాక్షసరాణి - గాక రావణుని అంతఃపురమున, అందకత్తెలు - చక్కనిచుక్కలు - వేయి మందికి తక్కువలేరు. అగ్నిలో ఎన్నికట్టెలు పడ వేసినా, అగ్ని చాలునని తృప్తిపడునా ? ఎంతమంది స్త్రీలతో ఎన్నివిధముల క్రీడించినా, రావణాసురునకు తృప్తి కలుగునా ? తుదకు పుంజికస్థల యను నప్సరస మూలముగా రావణునికి శాపమువచ్చినది. స్త్రీని బలాత్కరించినపుడు తల పగిలి ఆరక్కసుడు చావవలసినదే- రంభను భంగపుచ్చిన తరువాత రంభాప్రియుడు నలకూబరుడు కూడ రావణుని కట్టి శాపమే యిచ్చెను. వీటికి ఈశాపములకు లోబడి రాక్షసరాజు బలాత్కారసంగతి విధిలేక మానుకో వలసి వచ్చినది- లేనిపక్షమున, ఉన్మాది రావణుని వలన సీత మర్యాదకు కూడ ప్రమాదము వాటిల్ల వలసినదే.

ఈ రక్కసుల దౌర్జన్యము సహించలేక దేవతలు మేరు పర్వతము మీద సభచేసి, రావణాదుల వధోపాయముల నన్వేషించిరి. రావణునికి నరవానరుల వలన మరణం కలగరాదని వరంలేదుగనుక, విష్ణు భగవానుడు దశరథ పుత్రుడుగా, నరుడుగా అవతరించుటకును, తక్కిన దేవతలంతా, వారి వారి అంశలతో భూమిమీద వానరులుగా జన్మించుటకును, కపి సేనతో దాశరథి రాక్షస సంహారము గావించుటకును, సభలో నిశ్చయింపబడినది.

## శ్రీరామజననము

అయోధ్య రాజధానిగా కోసలదేశము నేలుచుండిన దశరథ మహారాజునకు కౌసల్య, కైక, సుమిత్ర అను రాణులు ముగ్గురుండిరి. ఎంతకాలము ప్రతీక్షించి చూచినను, ఏరాణి కడుపును ఫలించలేదు. మహారాజును, రాణులేగాక, అయోధ్యపురవాసులును, కోసల ప్రజలును వంశాభివృద్ధికొఱకు తల్లడిల్లు చుండిరి. అంతలో దేశమునకు అనావృష్టిదోషమును అవహిల్లెను. పెద్దల సలహానను సరించి, విభాండక సుతుడు, స్త్రీ పురుష భేదమెరుగని అమాయకుడు, ఋష్యశృంగుడను ఉత్తముని పిలిపించి, దశరథుడు అభిమాన పుత్రికగా పెంచుకొనుచున్న శాంతనిచ్చి వివాహముచేసి, కూతును అల్లుని తనవద్దనే ఉంచు కొనెను. మునికుమారుడు అయోధ్యలో అడుగు పెట్టినవేళ మంచిదే. వెంటనే మంచి వర్షములు కురిసినవి. అనావృష్టిదోషము అంతరించినది. భూమి సస్యశాలియై దేశము సుభిక్షమైనది.

పిమ్మట ఇక్ష్వాకుల కులగురువు వసిష్ఠమహాముని తోడ్పాటుతో దశరథమహారాజుచేత పుత్రకామేష్టి చేయించెను. యజ్ఞము జరుగుచుండగా ప్రాజాపత్య పురుషుడు పాయసము గొనివచ్చి దశరథునికిచ్చి "ఇది నీ రాణుల కిమ్మ"నెను. దశరథు డందు సగము కౌసల్య కిచ్చెను. మిగిలిన సగములో సగము కైక కిచ్చెను. ఇంకను మిగిలిన పాయసము రెండు భాగములుచేసి, వేర్వేరుగా సుమిత్ర కిచ్చెను. మహా మహిమగల ఆ పాయసాన్నము భక్షించిన వెంటనే రాణులు ముగ్గురును గర్భవతులైరి. గర్భరక్షణ క్రియలు యథావిధిగ జరిపి నెలలునిండిన పిదప, పుత్రముఖ వీక్షణ శోభన మెపుడు ప్రాప్తించునోయని ఎల్లవారు ప్రతీక్షించుచుండిరి.

శుభ జనన ముహూర్తము ఆసన్నమైనది. చైత్ర శుద్ధ నవమి బుధవారము, పునర్వసు నక్షత్రముతో కౌసల్యాదేవికి శ్రీరాములు జననమయ్యెను. మరునాడు దశమి, గురువారము పుష్యమీ నక్షత్రమున కైకకు భరతుడు జనించెను. ఆ మరునాడు ఏకాదశి శుక్ర వారము ఆశ్లేష నక్షత్రముతో సుమిత్రకు మొదట లక్ష్మణుడు జన్మించెను. ఆశ్లేష సర్ప దైవాత్యమైనది. విష్ణుభగవానుని మడుగుపాన్పు, శేషాంశమున ఉద యించిన లక్ష్మణుడు సర్ప దైవత్యమైన ఆశ్లేషతో జన్మించుట విశేషము. అతనికి ఇష్టముకానిపని యేదైన ఎదుట జరిగెనా. తోకత్రొక్కిన తాచుపాము వలె లక్ష్మణుడు బుస్సుమని ఎగిరిపడుట అతని నైజము. లక్ష్మణుని తరువాతశతృఘ్నుడును సుమిత్ర పుత్రుడై పుట్టెను. లక్ష్మణ, శతృఘ్నులు కవలవారు. సుమిత్రపుత్రులు. అయినను, లోకములో ఒక విచిత్ర మైన ఆచారము కనబడుచున్నది; వినబడుచున్నది. అదేమనగా: రామలక్ష్మణులు ఒక తల్లిబిడ్డలుకారు. రాముడు - కౌసల్యకొడుకు; లక్ష్మణుడు - సుమిత్ర కొడుకు; అయితేనేమి? ఆ యుభయుల మనస్సులు క్షీర నీర న్యాయముగా కలిసిపోయినవి. భ్రాతృ స్నేహము వారిద్దరిమధ్య అత్యంత దృఢతరమైనది. నిజమునకు వారు కవలవారుకారు, ఒకతల్లిబిడ్డలును కారు. అయినా నాటికిని, నేటికినికూడా లోకము వారిని కవలవారుగానే భావిస్తున్నది. ఇప్పటికిని, మనదేశములో ఏతల్లికైనా కవలపిల్లలు పుట్టినప్పుడు వారికి సాధారణముగా రామలక్ష్మణులనేపేర్లు పెట్టు కొనుట తప్పనిసరియైన ఆచారమైనది.

ఈ విధముగా దశరథ మహారాజుగారికి మూడు దినములలో ముగ్గురు రాణులవలన కులదీపకులైన కుమాళ్లనలుగురు ఉద్భవించి పెరుగుచుండిరి. తల్లులు ముగ్గురును, దశరథమహారాజును, మంత్రిసామంతాది పరివార జనమును, అయోధ్య ప్రజలందరును, ఆ చిన్నపాపలను చూచుకొని మురిసిపోవుచుండిరి. దశ రథుడు ఎగిరి కొండ నందుకొన్నట్లు అపరిమితానంద భరితు డగుచుండెను. ఇక కౌసల్య కొడుకును చూచు కొని ఉప్పొంగిపోవుచుండెను. ఎరుసు, అరమరిక లేక, తల్లులు ముగ్గురును నలుగురుబిడ్డలను ఒకే మాతృ ప్రేమతో గోముగా పెంచుకొని మురియుచుండిరి. ఏమి ముద్దులు! ఏమి ముచ్చటలు! ఏమి మురిపె ములు! ఓహో!

గీ. "ఒడిని బాలునుంచు, నొయ్యన ముద్దాడు,
శిరము మూరుకొనును చేతనిమురు"
ఆనంద పారవశ్యమున
"కనుల నీరునించు, కనుగొంటి మిన్నాళ్ళకయ్య
మిమ్మటంచు హర్షమందు."

ఇక శ్రీరాముడు తప్పటడుగులు వేయుచు, కౌసల్యతో నాడుచు నడుచుటను ఒక భక్తు డిట్లు వర్ణించినాడు:

సీ. "నాచిన్నిరామన్న! ననుగన్నతండ్రిరా!
నన్నేలునయ్య! నాయన్నరార!
నాముద్దులయ్య నాసామి రాగదవోయి!
అప్ప! చక్కదనాల కుప్ప రార!
నా పెన్నిధానమా! నా పుణ్యమూర్తి రా!
నా యింద్రనీలరత్నంబ రార!
బంగరుకొండ! నాపాలి భాగ్యమ రార!
అమృతంపు చెలమ రామయ్యరార!
చూత మెవ్వరువత్తురో చూతమనుచు
తల్లి పిలువంగ గజ్జెలు ఘల్లుమనగ
నవ్వి, చెలరేగి గునగున నడిచివచ్చు
నట్టి కౌసల్య గారాబుపట్టి దలతు!"

ఇదే విధముగా రాముని తమ్ములను తల్లులు ముగ్గురివద్దను అల్లారుముద్దుగా పెరుగుచుండిరి. అన్న దమ్ములు నలుగురును, సురూప తనుకాంతలందు ఒకరికొకరు ఏమాత్రమును తీసిపోక ఈడుగా, జోడుగా ఆడుకొనుచు, ఒకరి నొకరు యెన్నడు యెడబాసియుండక, అత్యంత సోదర స్నేహపాశ బద్ధులయి ఒక్కజట్టుగా పెరుగుచుండిరి. ఆకాశవీధిని లావణ్యముతో తళతళ మెఱయు భాద్రపదా నక్షత్ర చతుష్టయమునకు - పూర్వాభాద్ర-ఉత్తరాభాద్ర జంటల చుక్కలు నాలుగింటికి సాటి యీ రామలక్షణ భరత

శత్రుఘ్నులే, వీరు నలువురు అన్నదమ్ములకు ఉపమానము - మింట మెఱయు భాద్రపదా నక్షత్ర చతుష్టయమే.

పూర్వ ★..........★ భాద్రపద జంట.

ఉత్తర ★..........★ భాద్రపద జంట.

ఈ భాద్రపదా నక్షత్ర జంటలకు సంస్కృతములో ప్రోష్ఠపదా నక్షత్రములని పేరు గలదు, పైని పంద్రెండు పంక్తులలో వ్రాసిన అర్థమంతా జ్యోతిర్విదుడగు వాల్మీకి సంగ్రహముగా ఒక్కపంక్తిలో ఇమిడ్చి చక్కగా ఇలాగ చెప్పినాడు. "గుణవన్తో అనురూపాశ్చ రుచ్యాః ప్రోష్ఠపదోపమాః." రమ్యమైన యీ వాల్మీకి ఉపమాన వాక్యముయొక్క సారస్య సౌరభములను గ్రహించి అర్థము చేసుకోలేని ఆంధ్ర కవులు ఆ వాక్యార్థమును చల్లగా జారవిడుచుట మిక్కిలి శోచనీయము.

ఇట్లుజన ముద్దుగా పెఱుగుచున్న యీ అన్నదమ్ములు నలుగురకు దశరథమహారాజు యథాకాలోచితముగా చౌల, ఉపనయనాది సంస్కారములను చేయించి, విద్యాబుద్ధులు చెప్పించి, వేదాధ్యయనము చేయించి, శాస్త్రములు పఠింపించి, క్షత్రియోచితములైన అశ్వారోహణ, గజారోహణ, రథారోహణ క్రమములును, శస్త్రాస్త్రప్రయోగ ఉపసంహార విధులతో ధనుర్విద్యను నేర్పించెను. మొత్తముమీద బాలురు నలుగురికి దివ్య సౌరభోపేతమైన మంచి సంస్కృతి అలవడినది. అప్పటికి ఆ కుమారులు షోడశవర్షప్రాయులైరి.

(సశేషము)

# జయదేవకృతి

"కవిరాజరాజు"

(గతసంచిక తరువాయి)

నను నెడఁబాసి తాను బర
  నారుల నాయెదుటన్ విలాస భా
జనమగు చేతలన్ సలుప
  సాగెను జూచుచు మూఁగనౌచు నో
ర్పున నెటులుండగాఁగలను
  రోసెడు నామది యెప్పు డిందు చే
రునొ కనుగొందు శౌరిని ని
  రోధమునన్ జలచిత్తమూడఁగన్.

చెలియా ! ధూర్తుఁడు నిర్దయుండు హరి
  వేంచేయం డయో యంచుఁ జిం
తిలఁబో కాతఁడు కూఁడు జారిణులఁ
  బ్రీతిన్ దూతి ! నీకేల యీ
తలవం పీప్సిత మంది రాక ప్రియ
  సౌందర్యంపుమోజీడ్వఁ జం
చలతన్ సంగమసౌఖ్యమంద మన
  సాశన్ బోయెడున్ జూడుమా !

ఏచెలి శౌరితోడ రమియించునొ
  దానికిఁ గాముబాధయే
తోచదు వెన్నె లప్పు డది తూలదు
  కాకను బూసికొన్న సం
కోచపుఁ జందనంబునకుఁ గుంది
  వెతంబడ దేమి చెందదే
వీచిన మందమారుతపు
  వేదనమున్ విరహంపు బాధతోన్.

ప్రమదపడంగఁజేసెదవు
  పంచశరున్ మలయానిలుండ ! నన్
శ్రమపడఁ జేయసాగితివి
  చాలును దాళ మనోజ్ఞమాధవున్
సముఖమునందునిల్పి
  నిముసం బది పుణ్యము, ప్రాణమౌచు లో
కమునకు నీవు నాయెడ
  విఘాతవుఁ బ్రాణహరుండవౌదువే !

మలమల మాడ్చు మో మలయ
  మారుతమా ! కసిదీర్పనెంచి న
న్నలజడిఁ బెట్టనేల మదనా !
  వడిఁజంపుము ధర్మరాజుకున్
జెలియలివైన యో యమున !
  చేసెదు సైరణమేలనన్ను నీ
యలలను ముంచు హాయియగు
  నావల నింటికిఁజేర నేనిఁకన్.

తలఁచినమాత్ర నే హరుని
  దారుణశత్రులట్లుగాఁ జెలుల్
మలయపు వహ్నిరీతిగఁ గలా
  నిధి తీవ్రవిషంబుగా వెతన్
గలుగఁగఁజేయుచుందు
  రధికంబుగ నెంతొ దయావిహీనతన్
జెలఁగెడు కృష్ణ నే సతము
  చిత్తము వేడుక నాశ్రయించెడున్.

చీకటిరాత్రియం దొకట
    శ్రీహరి రాధనుగూడు నాయెడన్
గోకలు తారుమారగుట
    కొంచె మెరుంగమి వేకు వాటచే
వాకిట కేగుదేరఁ గని
    వారల వేషములన్ సఖీమణుల్
వీక హసింప రాధ మది
    వ్రీడకు లోఁబడ శౌరి నవ్వెడున్.

నడు నడు నంగనాచి వచ
    నంబులు పల్కకు నీవె గాని యే
పడతియుఁగాదు నాకుఁ బ్రియ
    భామిని యంచు విషాదభావమున్
వెడలఁగఁజేయఁజాలఁ దలి
    వేణిని జేరఁగఁ బొమ్ము టక్కు లీ
యెడ నిఁక సాగవంచు మది
    నెంచుము కృష్ణ ! ఫలింపవేమియున్.

కనులెఱ్ఱంబడె రాత్రిజాగరపు
    శృంగారంబునన్ జిక్కి నొ
క్కనఁబడ్డట్టులనుండె వాలకము
    తూగున్ జెందెడున్ జూడఁగాఁ
దనువే తెప్పలు పైకి లేవకయె
    మూతల్ వడ్డటుల్ తోచు లే
మను రాగంబునఁ గూడియుంటివని
    నమ్మన్దగ్గ సాక్ష్యం బివే.

వినఁగదె రాధ ! నీవు గనుపింపమి
    ఖేదముఁజెంది కాననం
బునఁ బడి రాత్రి నిన్ వెదుకఁ
    బూనుటచేఁ గను లెఱ్ఱవారె నొ

క్కేను దను వింతగాను రతి
    కేళిని గామిని నంటియుండుటన్
గనఁబడుచుంటి నిట్టు లనినన్
    వెగనాడ కపోహ జెందుచున్.

రాధ ! మనోజసాయక పరంపర
    తాక నతిప్రయాసతో
బాధ సహించి రాత్రిగడుపన్
    గలుఁగన్ మరునాఁటి వేకువన్
మాధవుఁ డేగుదెంచి కడు
    నమ్మికగా వినయోక్తులాడుచున్
గ్రోధముఁదీర మోకరిలి
    మ్రొక్కిన రాధ నసూయ నిట్లనున్.

కలికి విలాసమొప్పఁగను
    కాటుకదిద్దిన కన్నుదోయి నీ
వెలమిని ముద్దుఁబెట్టుకొన
    నెఱ్ఱని నీ యధరంబు మేఘపుం
బొలుపునుగన్న నీ మెయిని
    బోలెను బొంకఁగఁజూడవీ వెటున్
గలుగదు చూడు దర్పణము
    నన్ గనవచ్చెడు దాఁచె దెట్టులో.

చెలి నఖరాజి గాసిలఁగఁ
    జేయుటచేఁ దమినంటుకూటమిన్
గలిగిన రక్తరేఖలను
    గాంతివహించిన మేనుచొక్కమై
తలరిన జాళువామరకతంబును
    బోలి యనంగ సంగర
స్థలి నొడఁగూడినట్లు జయ
    సంపదగాఁ గనుపించుచుండెడున్.

వరదుఁడ ! నీ విశాలమగు
వక్షమునన్ గనవచ్చుచుండెడున్
బరవనితావిలిప్తమగు
పాదపులత్తుకయంటు రక్తిమన్
వరలుచు లోని మన్మథ
విపాకపు భూజము వెల్వరించు భా
సురమగు రక్తపుం జిగురు
జొంపముగాఁ గనఁదోచె మేలుగన్.

పీతాంబర ! తేటగ నీ
వాతెరపైనంటి గంటువడి బడి కడు న
న్నాతురఁబడఁజేయఁగడఁగె
నీ తనువున నే నిముడుకొని యట్టు లయారే !

రమణి ! నీ కర్పింపఁగఁ
గమలములనుగోయునెడను గాఢముగా భృం
గము నాపెదవిని గఱచెను
దమిదంతక్షతమిదియని తలఁచెదవేలా ?

మేనెంత మలినమైనదొ
మాననమున నంతకంత మాలిన్యము నే
పూనిన దగు నేమనఁగా
మానిను లనురాగమెపుడు మాపెడుకతనన్.

తెలియదుగాదె మాధవుఁడ !
తేటగ నీచరితంబు నీకు నేఁ
దెలిపెదఁ బ్రేమ సున్నమదతిన్
గడతేర్చిన నీకుఁగల్గనే
పొలతులమీఁద జాలి యన
బూటకమే యమునాతరంగిణీ
పులినములన్ జరించు విరిఁబోడుల
నంటెద వంతె నీ పదల్.

మాయలమారి మాధవుఁడ !
మానరటక్కులు కన్నులొప్పెడున్
బ్రేయసి పాదలత్తుకను
బిండినరీతిగ వక్షమూనె నే
నాయిక పాదతాడననొ
నవ్యపురాగము కోర్కె భంగమై
పోయిన నావిచారమటు
మోము వికాసముదప్పె లజ్జచే.

స్త్రీలకగు మోహనంబు వశీకరణము
బ్రానుపాటు జనాకర్షమారణములు
మహిమగల్గు నుచ్చాటనమంత్రమగుచు
మురళినాదమొసఁగు శ్రేయములనుమీకు.

## నవమ తరంగము

వలపులపీడనోర్చి వసివాడ
విలాసపుఁ గ్రీడపట్ల వే
డ్కలసుఖమేమిలేమిని
దిటంబెడలంగ విషాదచిత్తయై
తలఁచుచు శౌరిచర్యల
నెదఁ గలహాంతరిత ప్రసక్తితో
మెలఁగినరాధ నర్మసఖి
మెల్లనఁదెల్పఁగసాగె నీగతిఁ

మానవతీ ! యడంపఁదగు
మాధవుపైఁగల కోపమోపికన్
దానిపుడీ వసంతమునఁ
దాళకవేదన మందమారుతం
బేను సుఖింపఁగల్గుననియెంచి
నికుంజముఁజేరె నింట నే
మేనిఁబ్రకాంతిగల్గునొకో యేగి
యటన్ ముదమందఁజూడుమా.

వినుమిటురాధికా ! మిగుల
　　వీలగు నీ సమయంబుమించ ని
చ్చినఁ బరితాపమెచ్చుఁ జని
　　చెంతకుఁ బీనపయోధరంబు లా
తని యెదఁజొచ్చి వీపుపయి
　　దాఁపెడు సూటినినాట నీటుగా
మొనసితివేని శౌరి నిను
　　ముద్దిడి కేళి సలర్చు మెప్పుగన్.

మోహనాకారమున నొప్పు ముద్దుకృష్ణు
వీడవలదని నీకు నే విశదముగను
జిలుకకును బోధఁజేసినట్టులుగ రాధ
యెన్నితడవలొ తెలిపితి హితముగదుర.

ఏల విలపించెదవు కన్నులెఱ్ఱఁబార
మోముదిగులున వసివాడ గోముఁదప్పె
సఖులు నినుఁగని హేళన సలుపుచుండ్రి
యూరటనుగొనఁగదవె యోయువిదమిన్న.

అలపుబలపడు కతననే హరి శ్రమంబుఁ
బాపుకొనఁగఁ బద్మదళాల పాన్పునందుఁ
బవ్వళించెను సేవింపఁబజ్జఁజేరి
కనులుసార్థకపడఁ జేసికొనగదమ్మ.

కుములుచుండినఫలమేమి కువలయాక్షి
వాసుదేవుండువచ్చి నీవద్దనిలచి
ముచ్చటగ మాటలాడును ముదముగులుక
నమ్ము నామాట నిజమిది నగవుగాదు.

ఏలనెరాధ ! మాధవుని
　　యిష్టము నీకహితంబురాగ మం
తేలనె దుస్సహంబు నయ
　　మేటికి నాటిన కంటకంబు మ్రొ

క్కేఁ బనె యూసదంచితికదే
　　విషమౌటకుఁబూత సూర్యుఁడై
కాలుపఁ జంద్రుఁడగ్నియయి
　　కన్పడమంచుతలంప హేతువుల్.

ప్రమదముఁగూర్పఁగాఁ గలుగు
　　పాదములంబడి మ్రొక్కసాగునా
యమర శిరఃకిరీటమణి
　　హారతులంగొనజాలి గంగ జ
న్మమునకుఁ దావలంబయి
　　సమస్తసుఖంబులఁగూర్చు నా త్రివి
క్రము పదపద్మముల్ ప్రజల
　　రక్షణమే యెదఁజేసి ప్రోచెతున్.

## దశమతరంగము

సారసమిత్రుఁ డస్తగిరి
　　సానువుఁజేరినవేళఁ గృష్ణుఁ డే
తేరఁగఁ బట్టరాని కసి
　　దీరెడిమార్గములేక రాధ ని
ట్టూరుపులన్ వెడల్చు చెద
　　నోర్వక నెచ్చెలిమోముఁజూచ శృం
గార ముదంబునన్ గళము
　　గద్గదికన్ గొన శౌరి యిట్లనున్.

కారణమేమిశ్రేని కినుకన్
　　చలమూనకు రాధికా మనం
బారని మన్మథాగ్నికయి
　　యల్లడ తల్లడ మంద జీవనా
ధారముఁ గల్గఁజేయు
　　మమృతం బధరంబునఁజిందఁ జీకటుల్
పేరిమివాయ దంతముల
　　వెన్నెలలన్ జెలగించు పల్కులన్.

నిజముగ కోపమాపుకొన
నేరకయుండిన నించుమేన న
క్కజముగ గోటిపోటులను
కాదదియందువ కౌఁగిలించి నీ
భుజబలమున్బిగించు నను
బోల దదెంతటి దన్నతగ్గ భే
షజముగఁ బంటిగంటుల నొ
సంగుము నీ కసిదీరిపోవఁగన్.

అనువగు నీవెనాకు మణి
హారమవై బొలుపొందెగాక జీ
వనము గనుండి రక్షణకుఁ
బాల్పడ సంస్కృతి నేక మేలుగాఁ
జనుటకు నారకాటివయి
సౌఖ్యముఁ గూర్పఁగఁజాలు రాధికా
కొనుమిదిగో జోహారు విడు
కోపము నన్నెడఁబాయఁ బోకుమా!

ఓ పికవాణి రాధ! వినయోక్తులు
నీ చెలినంటవాయె పెఁ
గోపము రెచ్చ నేత్రములు
కోకనదంబుల మాడ్కి నొప్పి నే
నోపఁగరాని మారుని
ప్రయుక్తపు బాణములై చెలంగి రా
రాపులుపెట్టి నామదిఁ
గరంచెడు శాంతివహింపు మ్రొక్కెదన్.

త్రాణఁ జెలంగు బొంకమున
రాపడు నీచనుదోయినుండి పెన్
రాణఁదలిర్చు వక్షమున
రాజిల మేల్మణిహార పంక్తి యొ
డ్డాణపు గంటలింపెసఁగ
ఠంగని మ్రోగుచుఁ గ్రీడసల్పు పూఁ
బోణులకిచ్చు మారుని
ప్రమోదపు టాజ్ఞఁగ దోచు మేలుగన్.

కలికీ! రాధ గులాబిపూలను
దిరస్కారంబు గావింపఁగాఁ
జెలువారున్ భవదీయ పాదము
లెదన్ జేర్పంగఁ గ్రీడించుచో
వలపున్ గల్గఁగఁ జేసి
డెందము సుఖింపంజేయు పాదంబులం
దలరన్ గూర్చెద లత్తుకన్ బలికి
నీ వానందమున్ గూర్పవే.

మదనవిషంపుఁ దీవ్రతను
మాన్పఁగఁజాలెడి యందమైన నీ
మృదుపద పల్లవంబు తల
మీది కిరీటమురీతి నుంచు స
మ్మదమున మన్మథాగ్ని తెగ
మండుచు గాసిలఁజేయునట్టి యా
పదలను బాదపల్లవము
పాపుచు మేలొనఁగూర్చు రాధికా!



# శ్రీశైలమహాక్షేత్ర జీర్ణోద్ధరణ కృషి

## హైద్రాబాదు పురప్రముఖులతో ప్రత్యేకసంఘం ఏర్పాట్లు

శ్రీశైల క్షేత్ర జీర్ణోద్ధరణకు, శ్రీశైలంలో జరిగే మహారుద్రయాగానికి ప్రజలు విరివిగా విరాళాలు ఇవ్వాలనీ, జంటనగరాల పౌరులు ఈకార్యక్రమంలో తమ కర్తవ్యాన్ని నిర్వహిస్తారని తాము ఆశిస్తున్నామనీ ఆంధ్ర ప్రదేశ్ ఆంతరంగికశాఖ మంత్రి శ్రీ మందుముల నరసింగరావు 14 జూన్ సాయంత్రం శ్రీశైల భక్తబృందం ఆర్యవైశ్య భవనంలో ఏర్పాటుచేసిన బహిరంగసభలో ప్రసంగిస్తూ చెప్పారు. సభకు బెల్లంకొండ స్వాములవారు, శ్రీ రామానంద సరస్వతీస్వామి అధ్యక్షత వహించారు. జంటనగరాల వర్తకులు పురప్రముఖులు పలువురు సభకు విచ్చేశారు.

శ్రీయుతులు అనుముల రామనాథశాస్త్రి, వేదాల రామానుజస్వామి, కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, బిజుమళ్ళ మాధవశర్మ శ్రీశైల ప్రశస్తిని, శ్రీ రామానంద సరస్వతీస్వామి నిర్వహించబోయే మహా రుద్రయాగాన్ని గూర్చి ప్రసంగిస్తూ భక్తులైన వారంతా ఈ సత్కార్యానికి తమ, మన, ధనాలతో తోడ్పడాలని కోరారు.

యాదగిరి దేవస్థాన పరిపాలక సంఘం అధ్యక్షులు శ్రీ రాజా పన్నాలాల్ పిట్టీ ప్రసంగిస్తూ యాదగిరి క్షేత్ర ఉద్ధరణకు శ్రీ రామానంద సరస్వతి స్వామివారే కారకులని ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఒకటైన శ్రీశైలంలో ఆ స్వాములవారే మహా రుద్రయాగాన్ని నిర్వహించడం ముదావహం. మన దేశమంతా ఈ కార్యానికి చక్కగా తోడ్పడగలదని నమ్ముతున్నామని చెప్పారు.

దేవాదాయ శాఖ కమిషనరు శ్రీ పైడి లక్ష్మయ్య గారు శ్రీశైలక్షేత్ర ఉద్ధరణ భారతీయులందరి పవిత్ర కర్తవ్యమనీ, అట్టి మహాక్షేత్రంలో గొప్ప తపశ్శక్తి సంపన్నులైన శ్రీరామానంద సరస్వతి మహా రుద్ర యాగాన్ని తలపెట్టడంవల్ల అది త్వరలో మరీ ఉత్కృష్టస్థితికి రాగలదని ఆశిస్తున్నామని చెప్పారు. యాత్రికులకు శ్రీశైలంలో జరిగిన సౌకర్యాలను గూర్చి ముచ్చటిస్తూ తిరుమల తిరుపతి దేవస్థానం వారు శ్రీశైలంలో ఒక సత్రం నిర్మాణానికి లక్ష రూపాయలు విరాళం ఇచ్చారనీ, శ్రీశైల దేవస్థానం వారు నిర్మించే మరో సత్రానికి భక్తులు విరివిగా విరాళాలు ఇవ్వాలని అర్థించారు. యాత్రికులకు చేసే సౌకర్యాలపైననే దేవస్థానం ఆదాయం ఆధారపడి వుంటుందని అన్నారు. శివాజీగోపురం, కృష్ణదేవ రాయ గోపురం, హరిహరరాయ గోపురం వీటన్నింటినీ ఉద్ధరించవలసి వున్నదనీ ఈ మహాక్షేత్రం ఉద్ధరణకు ప్రజలంతా తోడ్పడాలన్నారు.

శ్రీ జూలూరి వీరేశలింగగుప్త లౌకిక ప్రజా రాజ్యంలో మతధర్మ సంస్థలు దెబ్బ తిన్నాయనే ఈ కాలంలో శ్రీశైలక్షేత్ర ఉద్ధరణ కార్యక్రమానికి మంత్రులు ప్రజలు ఉద్యోగులు తోడ్పడటం సంతోష కార్య మన్నారు. జంటనగరాల ప్రముఖులు మహా రుద్రయాగానికి, శ్రీశైలక్షేత్ర ఉద్ధరణకు శాయ శక్తులా తోడ్పడగలరని హామీ ఇస్తున్నాను.

శ్రీ దండు పెంటయ్య శ్రీశైలం యావద్భారతానికి జ్యోతిని ప్రకాశిస్తోందనీ, శ్రీశైలంలో జంట నగరాల పౌరులు ఇదివరకు ధర్మసత్రాలు నెలకొల్పా

రనీ, ఇప్పుడు గూడా క్షేత్ర అభివృద్ధికి తోడ్పడ గలరని తమ విశ్వాసం అన్నారు.

మంత్రి శ్రీ మందుముల నరసింగరావు శ్రీశైల క్షేత్రానికి ప్రభుత్వం 30 మైళ్ళ రస్తా రు. 20 లక్షలు వెచ్చించి వేసిందనీ, నాలుగైదు లక్షలు పెట్టి నీటి సరఫరా చేసిందనీ, విద్యుచ్ఛక్తి సౌకర్యం చేయగల దనీ, శ్రీ లక్ష్మయ్య కమీషనరు అయ్యాక శ్రీశై లంలో జరిగిన అభివృద్ధి ప్రశంసనీయమన్నారు.

శ్రీ రామానంద సరస్వతీస్వామి తాము కార్తీక మాసంలో శ్రీశైలంలో జరిపే మహారుద్రయాగాన్ని గూర్చి వివరిస్తూ అక్కడ తాము యాగాన్ని తల పెట్టడానికి ఆ క్షేత్రానికి వున్న గొప్ప ప్రశస్తిని గూర్చి వక్కాణించారు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వ రులు ముక్కోటి దేవతలు అక్కడ నిత్యనివాసం చేస్తూ వుంటారనీ, తాము లోక కల్యాణార్థం తల పెట్టిన యాగంవల్ల దేవతలకు ప్రీతి, ప్రజలకు శుభములు ప్రతిపాదించగలవన్నారు. ప్రతి వారి హృదయాల్లో ఆ పరమేశ్వరుడు ప్రవేశించి మహా రుద్రయాగాన్ని జయప్రదం చేయగలదని తమ అభి ప్రాయమనీ త్రిమతాలవారు ఇందులో పాల్గొంటారనీ చెప్పారు.

శ్రీ కొత్తూరు సీతయ్యగుప్త భారతీయులు తమ పవిత్ర దేవాలయాలను క్షేత్రాలను ఉద్ధరించుకో వలసిన అవసరాన్ని నొక్కి చెప్పారు సోమనాథ క్షేత్రాన్ని ప్రజల సహాయంతో సర్దారు పటేలు ఉద్ధ రించినటుల శ్రీశైల క్షేత్రాన్ని ఆంధ్ర ప్రజలు భారతీయులు పూర్వ వైభవంతో తులతూగేట్లు చేయాలనీ మహారుద్రయాగానికి తోడ్పడాలనీ కోరారు.

తరువాత హైదరాబాదు పౌరుల తరపున జీర్ణో ద్ధరణ కార్యక్రమానికి, మహా రుద్రయాగానికి సహాయం పంపదల నివ్వడానికి ఈ క్రింది ప్రముఖు లతో గల ఒక సంఘం నియమించబడింది.

శ్రీయుతులు మంత్రి మందుముల నరసింగ రావు. మంత్రి కాసు బ్రహ్మానందరెడ్డి, దేవా దాయశాఖ కమీషనర్ పైడి లక్ష్మయ్య, హైదరాబాదు నగర పాలక సంఘాధ్యక్షులు కృష్ణస్వామి, ముదిరాజ్ రాజాపన్నాలాల్ పిట్టీ, కొత్తూరు సీతయ్యగుప్త, కల్వా సూర్యనారాయణగుప్త, నాగమళ్ళ రామ కృష్ణయ్య, కొక్కొండ పరమయ్య, బచ్చు వెంకయ్య, సుబ్బా కాశీనాథం, తేలుకుంట నరహరి, కాటేపల్లి అంజయ్య, నాగమళ్ళ రాజయ్య, దాచేపల్లి పాపయ్య, బి. కిషన్‌లాల్, సముద్రాల చంద్రయ్య, పాపాలాల్, పేసర సత్తియ్య, శ్రీపతి గుండేరావు, రుద్రంగి రామయ్య, డాక్టరు కందాళ రంగాచార్యులు, డాక్టరు జి. వెంకటరెడ్డి, డాక్టరు పతంగి కిథన్, పాండు రంగం, జక్కాని నరసింహులు, జక్కాని రామ చంద్రయ్య, బూరుగు శంకరయ్య, వేలూరి దూర్వా సులు, వేలూరి లింగయ్య, తేలుకుండ రంగయ్య, పద్మా బొంతయ్య, బిజ్జల వీరయ్య. చల్లా వెంకటే శ్వరులు, వి. రాఘవశాస్త్రి, అడ్లూరి సీతారామశాస్త్రి, బి. సీతారామారావు, కప్పగంతుల లక్ష్మణశాస్త్రి భండారి, తోకర్సి కపాడియా, ఉప్పల వెంకయ్య గారలు :

## మంత్రి చర్చలు

రాష్ట్ర ఆర్థికమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి శ్రీశైలక్షేత్ర జీర్ణోద్ధరణ, మహారుద్రయాగ నిర్వ హణ సందర్భంలో నిన్న బాలాజీ భవనంలో సికింద్రాబాదు వర్తక ప్రముఖులు శ్రీ దండు పెంటయ్య దేవాదాయశాఖ కమిషనర్ శ్రీ పైడి లక్ష్మయ్య, తిరుపతి దేవస్థానం కార్యనిర్వాహక ఉద్యోగి శ్రీ చెలికాని అన్నారావు, శ్రీ మామిడిపూడి ఆనందం ప్రభృతులతో సమాలోచనలు జరిపారు.

శ్రీ కొత్తూరు సీతయ్యగుప్త, దుండిగళ్ళు జగదీ శ్వరయ్య, వేదాల రామానుజస్వామి, అనుముల రామనాథశాస్త్రి ప్రభృతులుగూడా శ్రీశైలక్షేత్ర జీర్ణో ద్ధరణకు కొన్ని సూచనలు చేశారు. ఈ నెలాఖరు నుంచి జంటనగరాల్లో ఇందునిమిత్తం ఏర్పాటుచేసిన పౌరసంఘాల విరాళాలు వసూలు చేస్తారు. సికింద్రా

జాదు పౌరసభ ఏర్పాటుచేసి సహాయసంఘములో వివిధ కార్యాలకు భిన్నమైన ఉపసంఘాలు ఏర్పాటు చేశారు.

ఆర్థికమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి మొన్న శ్రీశైల జీర్ణోద్ధరణ సలహాసంఘ అధ్యక్షులు శ్రీ దండు పెంటయ్య, కార్యదర్శి శ్రీ జూలూరి వీరేశలింగం గుప్త, దేవాదాయశాఖ కమిషనరు శ్రీ పైడి లక్ష్మయ్యగార్లతో శ్రీశైల క్షేత్రోద్ధరణకు జంటనగరాల ప్రజల సహాయ సంపదలను సమకూర్చే విషయమై సమాలోచించారు.

## పొన్నూరు శ్రీ భావనారాయణస్వామివారి తిరుకళ్యాణ మహోత్సవములు

పవిత్ర తుంగభద్రా నదీతట నివాసుఁడై, స్వర్ణపురీ విరాజమానుఁడై, సకల దేవతాకోటి వంద్యుఁడై చెన్నూరు శ్రీ భావనారాయణ స్వామివారి బ్రహ్మోత్సవము లీ వైశాఖశుద్ధ సప్తమి భృగువాసరమునఁ బ్రారంభింపఁబడి పూర్ణిమతో సంపూర్ణమైనవి. ఈ దినములలో నారాయణుని వాహనమైన గరుత్మంతుడు ధ్వజ స్తంభ శిఖరాగ్రభాగమున నిలచి దుష్టగ్రహముల వేనిని రానీయక పాఱద్రోలుచుండెనా యనునట్లు గరుడధ్వజ మాకాశవీధుల నాట్యమాడినది.

ఈ యుత్సవ దినములలోఁ బ్రతినిత్యము స్వామికి పునుగు, కస్తూరి, జవ్వాది మొదలగు సుగంధ ద్రవ్యములతోఁ గూడిన జలముతో నభిషేకించిరి. దీనినే తిరువంజనోత్సవ మందురు. సాయంసమయమున శంఖ చక్రాది వివిధాయుధ ధరుఁడై, పీతాంబర ధారుఁడై, వనమాలా విభూషితుఁడై, కందర్ప దర్పాపహార మనోహర దేహధారుఁడై, కోటిమన్మథ లావణ్యమూర్తి తనకై ప్రత్యేకముగా నేర్పాటు చేయఁబడిన రజితవేదికపైఁ గొలువుండి నేత్రానంద మొనర్చును. ఏ తద్బ్రహ్మోత్సవ సందర్శన లాలసులైన జనులు దేవసన్నిధికిఁ బోవుటయందుఁ బాదములు, దివ్యమంగళ విగ్రహ సందర్శనమందు నేత్రములు. పుండరీకాక్షుని పూజించుటయందుఁ గరములు, భగవన్నామ సంకీర్తనమందు జిహ్వ, విష్ణు కథాశ్రవణమందుఁ జెవులు, తరించి చరితార్థత నందినవని తృప్తితో బ్రహ్మానందభరితులైరి.

ఏ తన్మహోత్సవ సందర్భమునఁ బ్రత్యేకముగా నేర్పాటు చేసిన వేదికపై హరికథలు, భరతనాట్యములు, ఉపన్యాసములు, గానసభలు జరిగినవి. "దేవుని పెండ్లికి నందరు పెద్దలే" అన్నట్లు ఆబాలగోపాలం మహమహమికతో నత్యంత భక్తిశ్రద్ధా సమన్వితులై కార్యక్రమములను జయప్రద మొనరించిరి.

రాత్రి సమయములందుఁ బెరుమాళ్ళు శేష, హంస, హయ, వ్యాళి; హనుమదాది వాహనములపై వేంచేసి ప్రజాభీష్టముల నెఱవేర్చుటకో యన్నట్లు (పొన్నూరు) పురవీథులలో నూరేగుచుండ వైకుంఠమునుండి సాక్షాల్లక్ష్మీ వల్లభుండే యవతరించెనా యన్నట్లు భక్తాగ్రగణ్యుల మదికి తోచె. యశోదానందనుని బాల్యక్రీడలలో పండితపామర జనరంజనమైన గోపికా వస్త్రాపహరణమును స్ఫురింపఁజేయు పొన్నమాను వాహనోత్సవము నేత్రోత్సవమై యమందానందము గలిగించినది. శ్రీ స్వామి పెండ్లికొడుకై గజమాలాశోభితుఁడై గజవాహనారూఢుఁడై కన్యాదాతలతో రాయబారములు సలిపి శ్రీ సుందరవల్లీ రాజ్యలక్ష్ములను వివాహమాడిన యా దినమే సుదినము. ఆనాటి విశేషభోగముల వర్ణింప నల్పమతులు వలంతులుగారు. ఈ కళ్యాణోత్సవమునకు ప్రధానమైన తలంబ్రాలు శ్రీ చింతక్రింది వంశీయులగు పద్మశాలి వారు తెచ్చుటయాచారమై యున్నది. అమ్మవారు వారి ధాన్యంపు పాతరలో లభ్యమగుటయే కారణము. ఏతత్కారణముగ వారికి స్వామివారి పరమున దేవస్థానము ధర్మకర్తల తరపున మేనేజరుగారైన కె. ఎ. పి. చౌదరిగారు చందన తాంబూలాది సత్కార్యములతోబాటు వస్త్రముల నిచ్చి గౌరవించిరి. ఈనాటి యుత్సవమును తిలకించుటకుఁ బ్రజావాహిని యుప్పొంగి, పరవళ్ళు త్రొక్కుచు నేటికి జన్మ

తరించుసుగదా యని భావమున భావదేవుని భావించి భక్తిపారవశ్యముచే స్వశరీరముల విస్మరించి భక్తి గీతముల గానము చేయుచుఁ బ్రవహించినది.

మరునాడు ప్రాతఃకాలముననే శ్రీ రాజ్యలక్ష్మీ సుందరవల్లీ సమేతుడై గరుడవాహనమం దధిరోహించి తిరువీధ్యుత్సవ మొనర్చిరి. సాయం సమయమున రథోత్సవము. ప్రజానంద సాగరమున కవధులు లేకపోయినవి. సంతోష సంజనిత సంరావములు దశదిశలు పిక్కటిల్లినవి. ప్రచండమార్తాండుని ఖరకిరణజాల సంతృప్త శరీరులయ్యు రథరజ్జుసమాకర్షణాయత్తచిత్తులైరి. ఈ రథయాత్ర శ్రీ పాములపాటి వంశజులు (కమ్మవారు) వచ్చినగాని జరుగదని ప్రతీతి. ఈనాడుగూడ దేవస్థాన ధర్మకర్తల తరపున పాములపాటివారికి K. A. P. చౌదరిగారు చందన తాంబూలములతో వస్త్రములను సమర్పించారు. రథము జగన్నాథ రథమువలె నిరాఘాటముగ నిర్విఘ్నముగ సాగి స్వస్థానమునకుఁ జేరినది. (బ్రహ్మోత్సవములు పరిసమాప్తమైనవి) ఇంకను వసంతోత్సవము, పర్యంకోత్సవములు, పుష్పయాగోత్సవము మొదలగు విశేష వైభవ కాలక్షేపాదులు తత్తత్కాలానుగుణ్యముగ జరిగినవి. భక్తులు స్వామివారి తీర్థప్రసాదములను స్వీకరించి పరమానందభరితులైరి.

ఈ బ్రహ్మోత్సవములకుఁ బ్రత్యేకముగ చెన్నపురీ వాస్తవ్యులగు వి. కె. కన్నయ్య అండ్ పార్టీవారిచే నాదస్వర కచేరి జరుపబడినది.

ఈ తిరునాళ్ళ సందర్భమున వివిధములైన దుకాణములు, కలప వచ్చినవి. ఆరోగ్య పోషణకేంద్రము (న్యూట్రిషను) గుంటూరు డివిజనువారిచే శ్రీ భావనారాయణ స్వామివారి సార్వజనీన గ్రంథాలయమున నెలకొల్పఁబడి ప్రజాప్రశంసలకుఁ బాత్రమైనది.

శ్రీ భావదేవుని కృపా కటాక్ష వీక్షణాలేశముచే నెవ్విధమైన యుపద్రవములు జరుగనందులకు నాతని మహామహిమ కనంత నమోవాకములు.

వంశ పరంపరాగత ధర్మకర్తలైన శ్రీ రాజా వాసిరెడ్డి శ్రీ రామభాను భూపాల్ బహద్దరు మన్నె సుల్తానువారి యుత్సవ కార్యక్రమముల జయప్రద మొనరించుటకై యొనర్చిన ప్రయత్నములకు నభినందనీయులు.



ఏనాటివోకాక యీకాలమునకు కూడ నిలబడి యుం డుట మన మహాభాగ్యము.

ఇతరదేశస్థులకు కూడ భరతభూమి యొక్క పవిత్రత యనుభవగోచరమగుచున్నది. లెడ్‌బీటర్ అను ఆంగ్లేయుడు తన దేశములో నుండగానే యొకనా డాయనకు మైత్రేయ మహర్షి దర్శన మిచ్చెను. ఆత డాశ్చర్యచకితుడాయెను. అంత మైత్రేయు డాయనతో నిట్లనెను. "మేము లోకోద్ధర ణార్థము అదృశ్యరూపములో సంచరించుచుందుము. నీవు సత్స్వభావుడవు; పరమార్థచింతకుడవు; కావున నీ కాధ్యాత్మికోన్నతిని కల్గించుటకు వచ్చి నాను. నీవంటి ఆధ్యాత్మిక సాధకులకు అనుకూల వాతావరణము భారతదేశములోనున్నది; నీవట కేగి సాధన సాగింతువేని అదృశ్యరూపములోనున్న మహర్షులు నీకు సహాయము చేసెదరు." ఆ యుప దేశమునునసరించి లెడ్‌బీటర్ భారతదేశమునకు వచ్చి చాలకాలము కాశీలో నివసించెను. తర్వాత మద్రాసులో నివసించెను. భారతదేశము చేరిన తర్వాత తన యాధ్యాత్మికస్థితి యుత్తేజితమైన ట్లాతడే చెప్పుకొని యున్నాడు.

పుణ్యక్షేత్రములను దర్శించునట్టియు, అచ్చట తపోజపాదులను చేయునట్టియు మహానుభావు లా క్షేత్రమహిమచే నుద్దీపితులగుటయేకాక తమ పుణ్య గ్రంథముచేకూడ నా ప్రదేశమును వాసితము గావిం తురు. కావున భక్తులు సేవించుచున్నకొలదియు కొన్ని క్షేత్రముల మహిమ పెరుగుచుండును. స్నానము చేయువారి నందరిని పవిత్రులనుగావించు పుణ్యనదులుకూడ పతివ్రతలు స్నానము చేయుటచే పవిత్రములగునని మన శాస్త్రములు చెప్పుచున్నవి. కాళిదాసు చెప్పినట్లు మహా తపస్వులు మెట్టిన స్థలము తీర్థమగుచుండుటయు సత్యమే.

దేవతాసాన్నిధ్యముచేతకూడ ప్రదేశములకు మహిమ కల్గును. కుమారస్వామి, వినాయకుడు మున్నగు దేవతామూర్తులు అదృశ్యరూపములో కొన్ని క్షేత్రములయందు ప్రత్యేకాభిమానముతో నుండుటయు, భక్తులకు దర్శనమిచ్చుటయు కలదు "ఈ దేవతామూర్తులు ఉపాసకులచే కల్పించుకొన బడినవా? లేక యథార్థముగా నున్నవా" యను ప్రశ్నకు సమాధానముగా శ్రీ అరవిందయోగి నిష్క ర్షగా నీ దేవత లారూపములతో యథార్థముగా నున్నా రనియు కేవల ముపాసనకొఱకు కల్పింపబడినవారు కారనియు తమ శిష్యులకు వ్రాసిన లేఖలలో స్పష్ట పరచి యున్నారు.

భారతదేశములోని పుణ్యప్రదేశము లిట్టి దేవతా సాన్నిధ్యమున మహిమను గాంచినవి. రామభక్తు డొకడు తన అంధత్వమును బాపుకొనుటకు శ్రీరామ చంద్రుని చాలకాలము సేవించి చివఱకు భద్రాచల క్షేత్రమునకు వెళ్ళి యచట గోదావరిలో స్నానము చేసి లేవగానే యంధత్వముపోయి దృష్టి వచ్చెను. ఇది పత్రికలద్వారా లోకమునకంతకును వెల్లడి యాయెను మనోగత భక్తికి క్షేత్రమహిమ కలియుట యిట్లు సిద్ధి హేతువగును. అతని మనస్సులో భక్తి యదివఱకే యున్నను క్షేత్రమాహాత్మ్యమువలన ఇష్ట సిద్ధి భద్రాచలములో కలిగెను. ఈ యర్థనాస్తిక కాలములోకూడ నిట్టి నిదర్శనములు పెక్కులు క్షేత్ర మాహాత్మ్యమును చాటుచున్నవి. తిరుపతి మున్నగు క్షేత్రములలో భక్తులకు కల్గుచున్న మాహాత్మ్యాను భవములను గ్రంథస్థముచేసి వ్యాపింపచేయుచో నాస్తి కులకుకూడ ఆస్తిక్యము కల్గుననుటలో నతిశయోక్తి లేదు. హిందూ దేవాలయములు నల్గురు నొకచోట చేరుటకు సౌకర్యార్థమేర్పఱచుకొన్న ప్రార్థన మంది రములు కావనియు, ఆధ్యాత్మిక భావవాసితములై దేవతాసాన్నిధ్యముచే ప్రభావితములై, మంత్రతంత్రాది శాస్త్రీయవిధానములచే మహిమోపేతములైన పావన ప్రదేశములనియు గ్రహింపనగును.

* * *



# శ్రీరామకథాసుధ

కీ. శే. శ్రీ గొబ్బూరు వేంకటానంద రాఘవరావు

(గతసంచిక తరువాయి)

## విశ్వామిత్రుడు దశరథునికడకు వచ్చుట

అంత నొకనాడు కార్తికజ్యోతివలె తేజోమయు డైన విశ్వామిత్రమహర్షి దశరథుని చూడవచ్చెను. నృపాలు డతనిని భయభక్తులతో నెదుర్కొని, అర్ఘ్య పాద్యాదివిధుల పూజించి, "మునీంద్రా! మీకేమి కావలసినను సంశయింపక నన్నడుగవచ్చును. తప్పక మీకిచ్చెదను" అనెను.

విశ్వా: "మహారాజా! నేనొక యజ్ఞము చేయ వలెనని సంకల్పించినాను. తలపెట్టిన యజ్ఞము పది రోజులు నిర్విఘ్నముగా సాగించవలెను. తీరా నేను ఆరంభించే వేళకు మారీచసుబాహులనే రాక్షసులిద్దరు వచ్చి, నాయజ్ఞము భంగము చేస్తున్నారు. మీ రాముని నాకు తోడుగా పంపితివేని, నాయజ్ఞము నిర్విఘ్నముగా పరిసమాప్తి కాగలదు. శ్రీరాముని సాయము అర్థించు టకే నేను మీకడకు వచ్చితిని" అని ముని చెప్పగానే దశరథుని గుండెలు 'ఝల్లు' మన్నవి. రామునివిడిచి దశరథుడు ఒక్కక్షణమైనా ఉండలేడు. అదిన్నీగాక- సుందోపసుందుల పుత్రులైన మారీచ సుబాహులతో యుద్ధము చాలాకష్టమవని. మారీచుడు సామాన్యుడా? వెయ్యియేనుగుల బలముకలవాడు. ఇంక మాయా విద్యలలో వానియంతటివాడు బ్రహ్మసృష్టిలోనే లేడు లేడని రావణుడే వానిని శ్లాఘించినాడు. అటువంటి రాక్షసులతో యుద్ధముచేయుటకు—రామబాలుడా? ఒక చెంపకొట్టిన పాలు! ఒక చెంపకొట్టిన నీళ్ళు! అన తగినంత పిన్నవయస్సువాడు. ఘోరరాక్షసులతో యుద్ధమునకు బాలుడు- రామునెట్లు పంపగలడు? దశరథునకేమీ తోచలేదు.

తడబడుచు దశరథుడు చేతులు జోడించి! మునీంద్రా! మీరు కోరినది ఇచ్చెదనంటిని, నిజమే! కాని.క్షమించండి! రాముని పంపలేను." అన్నాడు. విశ్వామిత్రుడు కోపంతో మండిపడి, "ఛీ! అబద్ధీ కుడా!" అని కఠినంగా ఇంకా ఏమో అనబోవుట విని వసిష్ఠులు జోక్యంకల్పించుకొని, "మహారాజా! విశ్వామిత్రులు పరమేశ్వరు సంతతి ధనుర్విద్యా విశా రదులు. వారు తమయజ్ఞమును తామే సంరక్షించుకో గల సమర్థతకల వారే! అయినా శ్రీరాముల మేలు కోరి, అతనిని పంపమని మిమ్మల్ని అర్థించారు. అది మనకు మిక్కిలి శుభప్రదము. సిరి రా మోకాలొడ్డక. వారి వెంట శ్రీరాముని వెంటనే పంప గలవు. మన రామమూర్తికి త్వరలో కల్యాణము చేకూరగలదు."

వసిష్ఠ గురునాజ్ఞకు కట్టుబడి మహారాజు విశ్వా మిత్రుని వెంట శ్రీరాముని పంపుటకు అంగీక రించెను. తోడనే లక్ష్మణుడుకూడ అన్నగారి వెంట ప్రయాణమైనాడు. అందుకు ఎల్లవారు సంతోషించిరి. విశ్వామిత్రుని వెంట నడుగు రామలక్ష్మణులు, చూచు వారికి. శివుని వెంబడించు వినాయక కుమారు లట్లు తోచిరి.

## తాటక వధ

వారు నడిచిన దేశములను గూర్చి, దాటిన నదు లను గూర్చి, గడిచిన వనములను గూర్చి, చూచిన ఆశ్రమములనుగూర్చి విశ్వామిత్రుడు ఎన్నో విశేష ములు చెప్పుచుండెను. వారు మలద దేశము చేరి నంతలో తాటకి అనురక్కసి వారిపైకి బఱతెంచెను.

ఆ రాక్షసి సుకేతుడను యక్షుని కూతురు; సుందుడను దానవుని భార్య; వేయి యేనుగుల బలము కలది. ఆమె కంటబడిన మానవులను ఆమె చప్పరించి అవలీలగా తినివేయుచుండెను. ఆమె కొడుకు మారీచుడును తల్లినిపోలిన బలశాలి. క్రూరుడు. మాయావి. వారి మూలముగా ఆదేశము నిర్జనమైనది. విశ్వామిత్రుడు జన హంత్రిణియైన ఆ రక్కసిని చంపుమని రాముని నియోగించెను. "మునివర్యా! ఆడుదానినా చంపుట?" అని దాశరథి సంశయించెను. "దుశ్చారిణి, పాపమతి, జనహంత్రిణియైన నీ రక్కసిని చంపుట పాపముకాదు: రామా! పరమపుణ్యము" అని తెలిపి, ముని అతని శంకమాన్పి, దానిం జంప ప్రేరేపించెను. రాము డా రక్కసి నవలీలగా దునిమివైచెను.

విశ్వామిత్రునికి వసిష్ఠునిమీద కోపమువచ్చి, అతనిని సాధించుటకు శివుని మెప్పించి తాను సంపాదించిన శస్త్రాస్త్రములన్నిటిని, ప్రయోగ ఉపసంహార క్రమములతోకూడా ఆ మహాముని వాత్సల్యముతో రామునికి ఉపదేశించెను.

పిమ్మట వారు విశ్వామిత్రుని ఆశ్రమము చేరుకొనిరి. ఆ తరువాత మునీంద్రుడు తాను తలపెట్టిన యజ్ఞదీక్షలో ప్రవేశించెను. రామలక్ష్మణులు, రాత్రింబవళ్లు కన్నుమూయక యజ్ఞమును సంరక్షించుచుండిరి. ఐదురోజులు నెమ్మదిగా గడచినవి. ఆఱవనాడు రాకాసి మూకలతో మారీచ సుబాహు లక్కడ ఉట్టిపడిరి. చెవులు బ్రద్దలగునట్లు మహానినాదములు చేయుచు ఆ యజ్ఞశత్రువులు వేదికపై రక్తమాంసాదులు కురియింప జొచ్చిరి. రాముడు ఆగ్నేయాస్త్రము ప్రయోగించి సుబాహుని గొలియించెను; మారీచునిపై వాతూలాస్త్రము ప్రయోగించెను గాని మారీచుడు చావలేదు. ఆ యస్త్రము రక్కసుని శరీరమును గొని దక్షిణా పథమును, లంకవఱకుగల నూఱు యోజనముల సముద్రమును దాటించి, లంక చేర్చి, అక్కడ అంతరిక్షమునుండి ఎత్తిపడవైచెను; దానవుడు ప్రేగులు పెల్లగిల్లినంతటి పాటుపడెను. ఆపాటుతో "చావుతప్పి కన్ను లొట్టవోయె" నన్నంత పని పుట్టెను. జీవముతో లంకలో పడినదిమొదలు మారీచునకు రాముడనిన విపరీతమైన భయము కలిగెను. పూర్తిగా రాముడు అననక్కరలేదు. అందు మొదటిరేఫ- రకారము చెవినిబడిన చాలును- అది రామశబ్దములోని రకారమే అనుకొని భయముతో మారీచుడు త్రుళ్ళిపడెడివాడట! ఆరక్కసునికి రామనామము అంతటి భయకారణమైనది.*

మారీచ సుబాహుల నీవిధముగా పరిహరించిన తరువాత మునీశ్వరుని యజ్ఞము నిర్విఘ్నముగా పూర్తి అయినది. అటుపిమ్మట రామలక్ష్మణులను మునీశ్వరుడు మిథిలానగరమునకు తీసుకొని పోదలచెను. మిథిల నేలురాజు, జనకమహారాజు, ఉపనిషత్తులలో మిక్కిలి ప్రశంసింపబడిన గొప్పతత్త్వవేత్త. ఒక యజ్ఞము చేయదలచి ఆరాజోత్తముడు భూమిని దున్నుచుండగా, నాగటిచాలులో నితనికి ముద్దులు మూటగట్టుచున్న పసిబాలిక యొకతె దొరకెను. వేదములో నాగేటిచాలునకు సీత యని పేరున్నది. ఆకారణముచేత జనకుడు ఆపాపకు సీతయనియే నామకరణము చేసి, ఆమె తనకడుపున పుట్టిన కూతురే అనుకొని, అతిగారాబముతో పెంచుకొనుచుండెను. పిమ్మట కొంతకాలమునకు ఆబాలికకు వివాహయోగ్యమైన వయస్సువచ్చినది. చిరకాలమునుండి తమయింట నిల్లడగాపడియున్న శివధనువును పట్టియెత్తిన వీరునకు తన కూతురు సీత నిత్తునని జనకుడు దేశదేశముల చాటించెను. శ్రీరాము నా ధనుర్భంగమునకు నియోగించి సీతారాముల కల్యాణము ఏర్పాటుచేయుటకే విశ్వామిత్రుడు రామలక్ష్మణులను మిథిలకు తోడుకొని పోవనెంచెను.

---

*బాచిగాడు పెంచిన పిల్లి ఉడుకుడుకు పాలుత్రాగబోయి, మూతి తెగకాల్చుకొని, మరెన్నడును పాలు ఒల్లలేదని తెనుగు దేశములో లోకోక్తి. మారుతాస్త్రిపుపాటుతో మారీచునకు రామనామము అదలుపుట్టించినది.

## అహల్యకు శాపము - విమోచనము

వారు మిథిలాపురి మార్గమును బట్టి వెళ్ళుచుండగా, దారిలో వారికి గౌతమ మహర్షి ఆశ్రమము తగిలెను. ఆంధ్రజాతికి ప్రాణతుల్యమైన గోదావరినదిని ఈ సీమకు తీసుకొనివచ్చిన ఉపాయశీలి, మహా తపశ్శాలి గౌతముడే. గౌతముడు తెచ్చిన గోదావరికి అఖండ గౌతమి యనికూడ పేరున్నది. అటుపిమ్మట అత్రి, వసిష్ఠాది మునులు ఒక్కొక్కరు ఒక్కొక్క పాయ చొప్పున ఏడు పాయలను ఏడుగురు సాగర సంగమునకు ప్రవహింపచేసిరి.

గౌతమ మునీంద్రుని ధర్మపత్ని-అహల్య. ఆమె అత్యంత సౌందర్యవతి. ఇంద్రు డామె సహవాసము నభిలషించెను. గౌతముని వంచింపదలచి దేవేంద్రుడంతటివాడు దొంగ కోడియై ముని యాశ్రమమున ప్రవేశించి, అర్ధరాత్రమపుడు 'కొక్కొరోకో' యని కూసెను. గౌతము డాకూతకు మేల్కొని, వేకువయైనదని భ్రమపడి స్నానార్థమరిగెను. గౌతము నిట్లు వంచించి వెడలించినపిమ్మట ఇంద్రున కహల్య లభించినది. ఇంద్రుడు తనభర్తకాడు; పరపురుషుడు; ఆ సంగతి ఆమె పూర్తిగా ఎఱిగియుండియు, తాత్కాలిక శరీరసౌఖ్యము నభిలషించి, ఇంద్రునికి వశమై అతనితో వ్యభిచరించెను.

జరిగిన వంచన తెలిసికొని గౌతముడు ఇంద్రున కతి రోత తోచునట్లు శపించెను. తనభర్తయైన గౌతమునితోతప్ప పరపురుషులతో చరింపనని అగ్ని సాక్షిగా తాను చేసిన ప్రమాణమును నీట గలిపి, సౌఖ్యలేశముకొఱకు అహల్యచేసిన పాపమునకు ఉగ్రుడై, గౌతముడు పాషాణమవై పడియుండుమని ఆమెను క్రూరముగా శపించెను. ఆమె నాటినుండియు తాను చేసిన పాపమునకు పశ్చాత్తాపపడి తపించుచుండెను. చేష్టలుడిగి పాషాణమైనను, ఆమె చైతన్యము చెడలేదు.

భర్తగా రామెకిచ్చిన 'విపులశాపభరమున' నామె వేగిపోవుచుండెను. పశ్చాత్తాప మావేశించి ఆమె హృదయమును కాల్చివేయుచున్నది. కాల్చిన కొలది బంగారు దోషముకూడా హరించి శుద్ధసువర్ణమగునట! వన్నెమీఱునట!

పశ్చాత్తాపము - భగవన్నుతి - భగవన్నామ స్మరణము చేయుచు అహల్య పరాత్పరుడగు భగవంతునే శరణు వేడెను.

లోకములో సాధారణముగా పాపము చేయనివారుండరు. ఏదో పాపము! ఎంతో కొంత! ఎలాగో ఒకలాగ? ప్రజలు తెలిసో, తెలియకో చేస్తూనే ఉంటారు. అసలుపాపము చెయ్యనివారు ఉండరేమో! ఉంటే ఉండవచ్చు! అటువంటి నిష్కళంకుల మినహకంటె - ఏదో పాపము చేసి, పశ్చాత్తాపముతో శరణువేడిన వారిమీద భగవంతునికి వాత్సల్యము అధికమట! భగవంతుడు మహామహిమాఢ్యుడు. లోకములో ఎన్నో భాషలున్నవి; ఒక్కొక్క భాషలో దేవునికి ఎన్నెన్నో పేళ్ళు ఉన్నవి; భగవంతుని అసంఖ్యనామములలో అన్నిటికంటె శ్రేష్ఠమయిన దేది? అనే ప్రశ్నకు *శరణాగతరక్షకు డనేదేఅన్నిటికి మించిన* గొప్ప పేరు అని జవాబు. హిందువుల రామాయణ భగవద్గీతలు, క్రైస్తవుల బైబిలు, మహమ్మదీయులకొరాను, ఇతర మతముల ఉత్తమ గ్రంథములన్నీ ఈ విషయమే నొక్కి చెప్పుచున్నవి.

అహల్య పశ్చాత్తాపముతో కన్నీరు కార్చుచు, భగవన్నుతి చేసికొనుచు, ప్రతినిత్యము పరమాత్మని ప్రార్థించి శరణువేడుచు, ధూళిధూసరిత పాషాణ శరీరముతో జాలిగొల్పుచు పడియున్నది. ఆమె సమీపమునకు విశ్వామిత్రుడు శ్రీరాముని తోడితెచ్చెను. అప్పటి కామె పాపము పరిహరింపబడినది. పుణ్యమూర్తి శ్రీరాముని పాదరజ మామెపై పడినది; శాపాంతమైనది. రాహుగ్రహపీడనుండి విముక్తిగనిన సంపూర్ణ చంద్రబింబమువలె, సహజ సౌందర్యముతో ఆమె మరల ప్రకాశించుట చూచి ఎల్లవారు నద్భుతపడి హర్షించిరి. కరగిన బంగారు పూదెకదలిక, ఒప్పిదము, పదును కలిగి - ఉపలము లావణ్యవతి అహల్య యగుట. రామాయణములో అద్భుత రసమునకు మేటి ఉదాహరణము. (సశేషము)

# గీతాగానము

శ్రీ మోటూరి వేంకటరావు

(గతసంచిక తరువాయి)

ఖరాసులు నఱకంగఁ జాలవు—
కాల్పలేవు శిఖల్ - తరంగపుఁ
గడలి ముంపదు - గాలినొంప ద
ఖండ సత్వాత్మన్.

నఱకఁ బడ దది - నవసిపోవదు -
నెఱిని వీడదు - నిల్కడగ నె
త్తఱిని గూడ నితాంత నిస్తుల
సరణి వఱలుచు సనాతనమై
నిరవధికముగ నెగడి మార్పె
ఎఱుఁగ దాత్మ సుమీ!

అలవి కాదది విలోకించుట,
కలఁతి తలఁపున కానదది; ని
శ్చలపు నిర్గుణశక్తి - ఆత్మకుఁ
గలఁత పడ నేలా ?

అటులు గా కీ యాత్మ జనన
మ్మందు, మరణ మ్మందు ననెదవ ?-
అప్పుడెవను ఆర్తి నొంద అ
నర్హుఁడవు సుమ్మా!

పుట్టు నట్టిది గిట్టునని ఆ
గిట్టునది మఱి పుట్టు నంచును
గట్టి తలఁచే గలిగినన్ విధిఁ
దిట్టఁగాఁ దగునా ?

ఆది నగపడ నట్టి ఈ భూ
తాళి అంతరమందుఁ బొడవడి
అడఁగుఁ దుది మిథ్యాచు - దానికి
అదిరిపడ నేలా ?

కడిఁది వింతగఁ గ్రాలు ఆత్మను
గను నొకం, డొకఁ డనును, వేరొ
క్కండు వినుఁ దద్గతిని గూరిచి -
కాని తత్త్వముఁ గడఁగి యొక్కఁడు
గాంచ లేఁడు సుమీ!

స్వరదేహచ్ఛాయలను గల
సత్య నిత్య స్వరూపాత్మకు
చావుకై ఏ క్షణమునైన వి
చారపడ నగునా ?

క్షత్రియుండవు కాన, నీ దగు
క్షాత్రమునకే కలఁక చెల్లున ?
క్షత్రియుల కిల సంగరంబే
క్షాత్రమై వెలయున్.

స్వర్గ నగరీ ద్వార మౌచు ఎ
సంగు నాహవ సంగమునకై
క్షాత్రతేజులు సంభ్రమింతురు
సతతమున్ బార్థా!

ధర్మ రణమునఁ దడయుదేని స్వ
ధర్మమే త్యక్తం బగున్ స

స్వధర్మ పతన విధమ్మదే పా
తకము నపయశముగా.

అఖిల జగతియు అనుకొను దు
ష్కీర్తిముఁ గూరిచి - అధికుఁడగు అత
డపయశముతో అడవి కంటెను
అసువుఁ ద్రెంపఁ దగున్.

వీరుఁ డని ఎవ్వారు నిన్ను మును
గౌరవించిరో, వారె నిన్గని
"భీరు వీతఁడు పోరఁ జాలక
పాఱె నం చనరే ?

నీదు శౌర్యపు నెఱిని దూఱుచు
నింద నల్పఁగ నీ విరోధులు
నెగడు దినమిది - నింద కంటెను
నీచ గతి గలదే ?

అరులు నిన్ దెగటార్చినన్ సుర
పురిని జేరెద, వరుల గెల్చినఁ
బరఁగు రాజ్యపు సిరులు - కావున
దురమునకు లెమ్మా !

సమత సుఖదుఃఖములఁ గన్గొని
సమత ఫల నష్టములఁ గైకొని
సమత జయ మపజయము చేకొని
సమర కర్మను సలుపుచోఁ బా
పమును బొందవు సూ !

ఎలమి సాంఖ్యము నెఱుఁగఁ బలికితి,
నింకఁ గర్మపు సంకెలల్ విడ
నెట్టి యోగమ్మెలయునో వచి
యించెదను వినుమా !

కర్మ యోగపుఁ గతన అభియో
గపు వినాశము గలుగఁబోవ, ద
షమ్ము పొడమదు - కడఁగి ధర్మ్యపుఁ
గర్మ చిన్నది కాచుఁగద నధి
కపు భయావిలునిన్.

కడిఁది నిశ్చయ దొడర, బుద్ధికిఁ
గర్మయోగమె కద శరణ్యము -
కడిఁది నిశ్చయ సడలి మదిలోఁ
గదురుఁ బలుపోకల్.

వసుధలో అల్పజ్ఞులగు జన
వర్గములు శ్రుతివాక్య సరణిన్
బడసి స్వర్గపు ఫలము మాత్రమె
ప్రథమ మందు రొగిన్.

స్వర్గ కాముక పటలి సతతము
జన్మ కర్మ స్పష్ట ఫల సం
జాత బహు శైశ్వర్యముల ప్ర
స్తవము నెంత్రు కదా !

భోగ సంయుత భూరి భాగ్య వి
భూషితులుగాఁ బొదరి అపహృత
బుద్ధులై పరిపూర్ణ నిష్ఠను
బొందలేరు నరుల్.

నిగమ విదితపుఁ ద్రిగుణముల మది
దగుల నీయక నెగడి సత్త్వనఁ
బ్రిగతి యోగ ద్వంద్వ భావముఁ
దెగడి కను మాత్మన్.

బావి నీటను బరఁగు ఫల మది
పాఱు జలమునఁ బ్రమ్మ పగిదిని
బావన శ్రుతి ఫలము జ్ఞానుల
పజ్జ వర్తిల్లున్.

(సశేషము)

# వేదాంత దర్శనం

పండిత శ్రీ గోపదేవ్

(గతసంచిక తరువాయి)

ఉద్దాలక మహర్షి తన పుత్రుడైన శ్వేతకేతువునకు గల సంసార బంధన హేతువైన ప్రకృతి నిష్ఠను దొలగించి, మోక్షసాధనమైన బ్రహ్మనిష్ఠను సంపాదింప నుద్దేశించెను. అందులకై యాత డనేక విధముల భూమికను రచించుచు తొమ్మిది మారులు "త త్త్వ మ సి శ్వే త కే తో !" యని యుపదేశించి యున్నాడు. తుదకు తొమ్మిదవసారి దొంగ నుదాహరణముగా దీసికొని తన్మూలమున ప్రకృతి నిష్ఠ గల వానికి సంసారబంధన మేర్పడునని చెప్పి, బ్రహ్మ మందు నిష్ఠగలవానికి మోక్షము ప్రాప్తించునని చెప్పును. అట్టియెడ 'తత్త్వమసి' వాక్యమునకు బ్రహ్మనిష్ఠుడవగు' మని యర్థము కాక మరియొక యర్థ మెట్లు కాగలదు ! ఉపనిష ద్వాక్యముల యర్థమును నిశ్చయింప బ్రవర్తించు వ్యక్తి తప్పక వక్తృ తాత్పర్యమును గమనింపవలసి యుండును. వక్తయగు నుద్దాలకుడు తుదకు తొమ్మిదవ మాటు చెప్పిన విధము జూడ 'తత్' ము తన్నిష్ఠ పరముగా జెప్పినట్లు స్పష్టము కాకపోదు. "పురుషం సోమ్యోత హస్తగృహీతమానయం త్యపహార్షీత్ స్తేయమకార్షీత్, పరసు మస్మై తపతేతి, సయది తస్య కర్తా భవతి, తత ఏవానృత మాత్మానం కురుతే సోఽనృతాభిసంధోఽనృతేనాత్మాన మంతర్ధాతు పరశుంతప్తం ప్రతిగృహ్ణాతి సదహ్యతేఽథ హన్యతే" ౧.

"అథ యది తస్యాకర్తా భవతి తతఏవ సత్యమాత్మానం కురుతే స సత్యాభిసంధః సత్యేనాత్మాన మంతర్ధాయ పరశుం తప్తం ప్రతిగృహ్ణాతి స నదహ్యతేఽథ ముచ్యతే." ౨.

"స యథా తత్ర నాదాహ్యేతైతదాత్మ్యమిదం సర్వం తత్సర్వం సఆత్మా తత్వమసి శ్వేతకేతో!" ౩. ఛాం. ౬-౧౬ ౧.౨.౩.

'సోమ్య ! - సౌమ్యుడా ! దొంగతనము చేసినాడని సందేహించి యొకనిని రాజభటులు రాజునొద్దకు జేతులుకట్టి తెత్తురు. అతనిని బరీక్షించి చంపుటకై పరశువును (గొడ్డలిని) బాగుగ కాల్చుడని రాజు భటుల కాజ్ఞాపించును. అపుడాదొంగ తాను దొంగతనము జేసినవాడగునేని అసత్యమాడి తనను అనృతునిగ - అనృతపరాయణునిగ - అనృతమున నిష్ఠ గలవానినిగ - జేసికొనును. అత డనృతాభిసంధుడగును. అనృత నిష్ఠుడగునని భావము. అతడట్లనృతమయుడై కాలినగొడ్డలిని (తప్తం పరశుం) పట్టుకొని కాలి చచ్చును. అతడు దొంగతనము సేయనివాడగుచో దనను సత్యపరాయణునిగ - సత్యనిష్ఠునిగ - జేసికొనును. అనగా సత్యమునం దభిసంధి(ప్రణిధానము) కలవాడై సత్యనిష్ఠుడగును. తప్తపరశువును బట్టుకొనియు నతడు దహింపబడడు; చావడు. అంతట విడువబడును.'

అట్లే సత్యమగు బ్రహ్మమునందు నిష్ఠగలవాడు తప్తపరశువుతో సమానమగు సంసారముచే దహింపబడక ప్రారబ్ధము ననుభవించిన తదుపరి ముక్తుడగును - బ్రహ్మను బ్రాపించును—. కాబట్టి (ఐతదాత్మ్యమ్) ఏతేన = పరదేవతానామముగల బ్రహ్మముతోగూడి, సర్వజగత్తుకూడ నాత్మవంత మగుచున్నది. ఆబ్రహ్మము సత్యము. అదియే=ఆత్మ= బ్రహ్మము, తత్త్వమసి=తన్నిష్ఠుడవగుము-బ్రహ్మ

నిష్ఠుడవగుము. అనగా 'సో శ్వేతకేతో ! నీవు సత్యాభి సంధుడవు - సత్యనిష్ఠుడవు - కమ్ము' అని యుద్దాల కుడు పుత్రునకుపదేశించెనని యభిప్రాయము. అట్టి యభిప్రాయ ముద్దాలకునకు లేకున్న నతడు 'సత్యాభి సంధుడు దగ్ధుడు కాడు - ముక్తుడగును—' అని తన యుపదేశమున నుదాహరించకుండెడివాడు. ఉదా హరణమున సామ్యముండవలెను. ఇట మోక్ష కారణమున సామ్యము స్పష్టమగుచున్నది. 'దొంగ సత్యాభిసంధుడై ముక్తుడగును' అని సామ్యము జెప్పనగును. కాబట్టి వ్యాసమహర్షి (ఆచార్యుడు) 'తత్త్వమసి' వాక్యమునకు బ్రహ్మనిష్ఠుడవగు మని యర్థమును బోధించుటకే యీ సూత్రమున "తన్నిష్ఠస్య" యని ప్రయోగించి యున్నాడనుట నిక్కముము.

మఱియు ప్రతిజ్ఞాసామర్థ్యమువలన గూడ 'తత్త్వ మసి' వాక్యమునకు తన్నిష్ఠుడ - బ్రహ్మనిష్ఠుడ - వగుమనియే యర్థము సెప్పుట యుక్తము.

"ఉత తమాదేశ మప్రాక్ష్యో యేనాశ్రుతం
శ్రుతం భవత్యమతం మత మవిజ్ఞాతం
విజ్ఞాతమ్." ఛాం-౬-౧-౨

"శ్వేతకేతూ ! దేనిని వినుటచే వినని దంతయు విననట్లగునో, దేనిని దెలిసికొనుటచే నితరము తెలియని దంతయు దెలియునో (తమాదేశమ్) ఆయాదేశమును — ఉపదేశగమ్యమైన పరమాత్మను (ఆదిశ్యతే ఉపదిశ్యతే ఇత్యాదేశః) అప్రాక్ష్యః= ఉపాధ్యాయుల నడిగి తెలిసికొంటివా?" యను నీ ప్రతిజ్ఞ 'తత్త్వమసి' వాక్యమునకు సంబంధించిన ప్రకరణమున జేయబడినది. ఈ ప్రతిజ్ఞయందు బ్రహ్మము కాక మిగిలిన యశ్రుత మమత మవిజ్ఞా తము నంతయు శ్రుతము, మతము, విజ్ఞాతము కావలయుననినచో బ్రహ్మము దెలియబడవలయునని భావము. బ్రహ్మము సర్వజగత్తునకు నధిష్ఠానము కాబట్టి యధిష్ఠాన జ్ఞానమువలన నధిష్ఠేయ మంతయు దెలియనగునని వివేకము. 'తత్త్వమసి' వాక్యము ద్వారమున 'అబ్రహ్మమునీవు' అని శ్వేతకేతువునకు బోధించిన గలుగు లాభమేమి ? అబ్రహ్మము నీవే యని చెప్పినంతమున శ్వేతకేతువునకు బ్రహ్మజ్ఞానము గలిగి మోక్షము సిద్ధించునా? సిద్ధింపదు. బ్రహ్మము నందు నిష్ఠ(ప్రణిధానము)గలవానికే బ్రహ్మసాక్షాత్కా రము కలుగును. అందున మోక్షము సిద్ధించును. కాబట్టి 'తత్త్వమసి' వాక్యమునకు 'తన్నిష్ఠుడ వగు'మను నుపదేశార్థమే యుక్తమని తేలుచున్నది.

ఇంతేకాక యన్యవాక్యములందును నిట్లే యుప దేశింపబడి యుండుటవలనను 'తత్త్వమసి' వాక్య మునకు తన్నిష్ఠోపదేశమే యుక్తమగుచు. తైత్తిరీయో పనిషత్తునందు

"బ్రహ్మవిదాప్నోతిపరమ్" తై. ౨. ౧.

'బ్రహ్మము నెరిగినవాడుపరమును బొందును' అని పరమునుగూర్చి నుడువ నారంభించి, యటుపై సమస్త జగత్తుయొక్క యుత్పత్తిని వర్ణించి, తుదకు

"యదాహ్యేవైష ఏతస్మిన్నదృశ్యేఽనాత్మ్యే ఽనిరుక్తేఽనిలయనేఽభయం ప్రతిష్ఠాం విందతే అథ సోఽభయంగతో భవతి" తై. ౨. ౭.

'ఇంద్రియములకు గోచరము కానిదియు, శరీరము లేనిదియు, నిట్టిదియని విశేషించి నిర్వచింప వీలు లేనిదియు, నన్యము నాధారము సేసికొనక స్వమహిమ యందే యుండునదియు, నానందమయము నగు బ్రహ్మమునందు ముముక్షువెన్నడు నిశ్చలమైన ప్రతిష్ఠ (నిష్ఠ) ను బొందునో నాడే యా ముముక్షువు భయ రహితమగు బ్రహ్మమును బొందును.' అని యుప దేశింపబడినది. ఛాందోగ్యమున శ్వేతకేతువునకు బ్రహ్మనిష్ఠోపదేశము 'తత్త్వమసి' వాక్యము ద్వార మున నుపదేశింపబడినట్లే, యిట తైత్తిరీయము నందును ముముక్షువునకు బ్రహ్మనిష్ఠ యుపదేశింప బడినది. ఇట్టి యుపదేశ సామ్యమువలనను 'తత్త్వ మసి' వాక్యమునకు 'బ్రహ్మనిష్ఠుడవగు'మని యర్థము జెప్పుటయే యుక్తమగును. అట్లుకాక మోక్ష మపేక్షించువానికి తైత్తిరీయమున బ్రహ్మనిష్ఠసాధన ముగా నుపదేశించి, ఛాందోగ్యమున శ్వేతకేతువునకు బ్రహ్మము నీవేయని చెప్పినచో నుపనిషద్వాక్యము

లందు పరస్పరవైరుధ్య మేర్పడి యప్రామాణ్య ప్రసక్తి గలుగును. కాబట్టి 'తత్త్వమసి' యన తన్నిష్ఠుడ వగు మనుటయే సుసంగతము.

యుక్తిచేతను నుపర్యుక్తమగు నర్థమే యుచిత మని తేలుచున్నది. తండ్రియగు నుద్దాలకమహర్షి తన కడకు శిష్యభావముతో జేరిన శ్వేతకేతువునకు గురువై ("తత్సత్యం స ఆత్మా తత్త్వమసి") 'ఆ బ్రహ్మము సత్యము. అది యాత్మ - బ్రహ్మము. దానియందు నిష్ఠగలవాడ వగు'మని యుపదేశించెను. ఇట గురువు శ్రోత్రియుడు, బ్రహ్మనిష్ఠుడును తప్పక కావలయును.

('తద్విజ్ఞానార్థం సగురుమేవాభిగచ్ఛేత్.
సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్'
ముం-౧-౨)

'బ్రహ్మజ్ఞానము నిమిత్తము చేతియందొక సమిధను గ్రహించి, శ్రోత్రియుడు, బ్రహ్మనిష్ఠుడునగు గురువును సమీపింపవలయు' నని ముండకోపనిషత్తునం దుపదేశింప బడినది. దీనింబట్టి గురుత్వము వహించిన యుద్దాలకమహర్షియు శ్రోత్రియుడు, బ్రహ్మనిష్ఠుడునై యుండియుండవలయును. అత డట్టివా డనుటకు ('...తమాదేశ మప్రాక్ష్యః. యేనాశ్రుతం శ్రుతంభవతి...'ఛాం. ౬. ౧౧.) 'దేని నెఱిగిన నశ్రౌతము శ్రుతము, నమతము మతము నగునో యా బ్రహ్మము నుపాధ్యాయునివలన దెలిసికొంటివా ?' యను నుద్దాలకుని ప్రశ్నమే ప్రమాణము. స్వయముగా బ్రహ్మ సాక్షాత్కారము నందని వాడిట్లు ప్రశ్నింపగలడా? కావున, నుద్దాలకుడు బ్రహ్మనిష్ఠగలవాడై బ్రహ్మానందము ననుభవించినవాడనుట నిస్సంశయము. అందువలన శిష్యభావముతో సమీపించిన పుత్రునకు- శ్వేతకేతువునకు - మోక్షార్థము బ్రహ్మనిష్ఠుడవగుమని యుపదేశించుటయే యుక్తిసంగతమనకతప్పదు.

('బ్రహ్మసంస్థో ఽమృతత్వ మేతి' ఛాం.౨.౨౩)

'బ్రహ్మమునందు స్థితి గలవాడు మోక్షమునందు' నను నీ యుపనిషద్వాక్యము ననుసరించి బ్రహ్మనిష్ఠ మోక్షసాధనమని యెఱిగిన శ్రోత్రియుడు - వైదికుడు - మహర్షియు నగు నుద్దాలకుడు పుత్రునకు 'తత్త్వమసి' యను వాక్యముతో నీవు బ్రహ్మమని యెందుల కుపదేశించును ? అట్లుపదేశించిన వంచకుడు గాడా ? వైదికుడు వంచకు డెందుల కగును ? వంచకత పాపహేతువని వైదికునకు దెలియదా ? అందునను బుత్రవత్సలుడగు నుద్దాలకు డట్లెన్నడు జేయడు. కావున, 'తత్త్వమసి' వాక్యముతో 'బ్రహ్మనిష్ఠుడవగు'మని యుపదేశించుటయే యుక్తియుక్తమని భావము. (౭)

బ్రహ్మనిష్ఠ మోక్షమునకు హేతువైనంత మాత్రమున నాత్మశబ్దము ప్రకృతివాచక మేల కాదు ? ప్రకృతినిష్ఠయును మోక్షప్రాప్తికి కారణమే కదా ! బ్రహ్మసాక్షాత్కారమునకు ముందు ప్రత్యగాత్మ (జీవాత్మ) సాక్షాత్కారము కావలయును. జీవాత్మ సాక్షాత్కారమునకు ప్రకృతినిష్ఠ యెంతయు నవసరము. ఇట్లు ప్రకృతినిష్ఠ ప్రత్యగాత్మ సాక్షాత్కారమునకు కారణమగుచు బ్రహ్మసాక్షాత్కారమునకును హేతువగు చున్నది. బ్రహ్మసాక్షాత్కారమే మోక్షము. కాబట్టి ప్రకృతి నిష్ఠయును మోక్షోప దేశమునకు సంభవమే యగుచున్నది. అందువలన నాత్మశబ్దము ప్రకృతివాచక మెట్లు కాదన సమాధానము.

"హేయత్వావచనాచ్చ" ౧-౧-౮.

హేయత్వావచనాత్ చ = ప్రకృతినిష్ఠ హేయ (అగ్రాహ్య) మని చెప్పనందువలనను, ఆత్మశబ్దము ప్రకృతి వచనము కాదు.

బ్రహ్మనిష్ఠ మోక్షమునకు ముఖ్యహేతువని చెప్పియుంటిమేకాని, ప్రకృతినిష్ఠ ప్రత్యగాత్మ సాక్షాత్కారమునకు హేతువు కాదని నుడివియుండ మైతిమి. ప్రకృతినిష్ఠ యభ్యుదయమునకు, నిఃశ్రేయసమునకును సాధనమనియే యంగీకరింతుము. మోక్షప్రాప్తికి ముందు ఐహికాముష్మిక సుఖసమృద్ధి (అభ్యుదయము) నొందక తప్పదు. అందులకై మానవుడు ప్రకృతి యందు నిష్ఠగలవాడై ప్రకృతి యొక్క స్థూల సూక్ష్మరూపములను బాగుగ నెరుంగవలసి యున్నాడు. అట్లెరుగగా నతనికి ప్రకృతి సంపద యంతయు సిద్ధించును. ఆ సంపదను బొంది

యుండవలెను రమింపక స్వర్గ సుఖసంపదలను గుర్తించి మోక్షము నభిలషించును తదనంతరమే బ్రహ్మసాక్షాత్కారమునకై యత్నించి నిరంతర శ్రద్ధాసక్తులతో బ్రహ్మనిష్ఠుడగును; మోక్షమునందును. కాని, నానావిధములయిన ప్రాకృతిక సుఖసంపదలను పొంది మనుజుడు సాధారణముగ నందు రమింప నుద్యుక్తుడగును. కోట్ల కొలది మనుజులలో నొకడు మహాత్ముడు. వివేకి యైనవాడే ప్రాకృతికసంపదలలో ననురక్తుడు కాకివా డుండును. రూపరసాది విషయములు తృష్ణాజనకములై యనేకదుఃఖాయుష పర్యంత మనుభవించియు త్యజింప శక్యములు కానివై బంధనహేతువు లగుచున్నవని గుర్తించిన మహానుభావుడెవడో యొకడు వానినుండి విరక్తుడగును. రాగము మోక్షమునకు ప్రతిబంధకము. సంసారమున కదిసాధనము. సాంసారికవిషయములందనురక్తుడైన వ్యక్తి నిఃశ్రేయస మార్గమున నడువడు. మోక్షాపేక్ష గలవాడే సాంసారిక భోగముల నుండి విరక్తుడై బ్రహ్మసాక్షాత్కారమునకై యత్నించును. ప్రస్తుతమున నుద్దాలక మహర్షి తనకడకు శిష్యభావముతో నరుదెంచిన శ్వేతకేతువునకు ముందు ప్రకృతి నిష్ఠ నభ్యుదయసాధనముగ జెప్పి, సాంసారిక భోగములందు రక్తుడై సంసారదావానలమున దగ్ధుడు కాకుండునట్లు ప్రకృతినిష్ఠ హేయమని యుపదేశించి, తదుపరి బ్రహ్మనిష్ఠ మోక్షసాధనముగ జెప్పినట్లు గానము. ప్రకృతినిష్ఠ హేయమని యెందునను జెప్పి యుండడయ్యె. మోక్షసాధనమైన బ్రహ్మనిష్ఠనే యుపదేశించియున్నాడు. ఇంతేకాక, ("తస్య తావ దేవ చిరం యావన్నవిమోక్ష్యే అథ సంపత్స్యే") 'శరీర పాతము కాగానే బ్రహ్మవాప్తి - మోక్షము - కలుగునని ఫలమును వర్ణించియున్నాడు. కాబట్టి, (స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో) అను నీవాక్యము నందలి యాత్మ శబ్దము బ్రహ్మవాచకమే కాని ప్రకృతివాచకము కాదు. అందువలననే (సదేవ సోమ్యేదమగ్ర ఆసీద్ ఏక మేవా ద్వితీయమ్—ఛాం-ఒ.౨.౧.) అను వాక్యమునందలి సచ్ఛబ్దము నైతనము బ్రహ్మవచనమనుటలో నెట్టి సందేహము లేదు. ఇట్లీక్షణము ప్రకృతిధర్మము కాదని సర్వవిధముల సిద్ధమగుచున్నదని భావము. (౮)

ఈక్షణము ప్రకృతికి సంబంధించినది కాదనుటకు మరియొక హేతువు.

"స్వాప్యయాత్" ౧.౧౯.

స్వాప్యయాత్ = (స్వస్మిన్ - సతి - అప్యయః - లయః) సుషుప్తిలో జీవుడు బ్రహ్మమునందు లయ మగుటవలన నీక్షణము ప్రకృతికి చెందినదికాదు.

(సూత్రమునందలి స్వశబ్దము ప్రకరణగతమగు 'సత్' పదమునకు బోధకము. అప్యయమనగా లయము.) ("యత్రైతత్ పురుషః స్వపితినామ సతా సోమ్య ! తదా సంపన్నో భవతి, స్వమపీతో భవతి, తస్మాదేనం స్వపితీత్యాచక్షతే, స్వంహ్యపీతోభవతి" ఛాం-ఒ.౮.౧.) స్వపితి = నిద్రించును. నిద్రించునపుడు జీవుడు 'సత్' తో సంపన్నుడగును - బ్రహ్మముతో సంబద్ధుడగును. స్వమ్ = బ్రహ్మతో, అపీతోభవతి = లీనుడగును. అందువలననే (స్వపితి) నిద్రించుచున్నాడని చెప్పబడును. ఇట స్వశబ్దమునకు, 'సత్' అర్థము. అపిపూర్వకమగు 'ఇణ్' ధాతువునకు ప్రళయ మర్థము. స్వపితి = స్వమపీతోభవతి - బ్రహ్మమునందు లయమగుచున్నాడని భావము. ('సతాసోమ్య! తదా సంపన్నో భవతి') సత్తుతో సంపన్నుడగునని చెప్పి, యనంతరమున మరల, (స్వమపీతోభవతి) బ్రహ్మములో లయమగునని చెప్పినందున నిట లయము సంపత్తిరూపమున గ్రహింపవలెను. సంపత్తి యనగా నవిభాగము.

జాగ్రదవస్థయందు విజ్ఞానాత్మ (జీవుడు) జడచేతనాత్మకమగు బాహ్యవిషయములందు యథేష్టముగ రమించుచుండును. పగలంతయు దిరిగితిరిగి యలసి సొలసి రాత్రియందు వృక్షశాఖ నాశ్రయించు పక్షివలె జాగ్రత్ స్వప్నములందు విషయాసక్తుడై యలసిన జీవుడు సుషుప్తియందు విషయములనుండి విరతుడై బ్రహ్మమున (సత్తునందు) లీనుడైనట్లుండును. అందువలననే సాంఖ్యదర్శనమునగూడ

('సమాధి సుషుప్తి మోక్షేషు బ్రహ్మరూపతా' ౫. ౧౧౬) 'సమాధి యందును, సుషుప్తియందును. మోక్షము నందును జీవుడు బ్రహ్మసారూప్యము నందునని వర్ణింపబడియున్నది. ఈ సాంఖ్యసూత్రమున జెప్పబడిన బ్రహ్మరూపత యు బ్రహ్మసంపత్తియే. బ్రహ్మమునందవిభక్తముగా నుండుట వలన బ్రహ్మసారూప్యము నొందునని భావము. జీవుడిట్లు సుషుప్తియందు బ్రహ్మమున లయము నందుటయే 'స్వపితి' యను నామ మేర్పడుటకు నిమిత్తమని యెంచవలయును. అందు వలన నిట సచ్ఛబ్దము ప్రకృతి వాచకము కాదు. ప్రకృతి వాచకమందుమేని 'స్వపితి' యనగా ప్రకృతిలో జీవుడు లయుడగు చున్నాడని చెప్పవలసివచ్చును. జీవునివలె ప్రకృతి కూడ బ్రహ్మము నాశ్రయించి యుండును: కావున, జీవునకు ప్రకృతిలయము సంభవము కాదు. జీవప్రకృతులు రెండును బ్రహ్మము నాశ్రయించి యుండునవియే కాబట్టి, రెండింటి యునికియందును పారతంత్ర్యము సమానమే. తన యునికి కొఱకు నితరము నాశ్రయించు నొక వస్తువు తనలో మరియొకదానిని విలయ మొనర్చుకొనజాలదు. కావున ప్రకృతియందు జీవుడు లయమొందు ననుట యుక్తముకాదు. జీవునకు బ్రకృతి భోగ స్థానమే కాని, లయస్థానము కాదు. అందువలననే శ్వేతాశ్వతరము నందు,

(జహాత్యేనాం భుక్తభోగా మజో ఽన్యః" ౪.౫)

భోగమున్నంతవరకు ననుభవించి ప్రకృతిని జీవుడు విడుచునని వర్ణింపబడినది. కావున 'సత్' శబ్దము బ్రహ్మవాచకమే కాని, ప్రకృతివాచకము కానేరదు. జీవునకు బ్రహ్మము లయస్థానమనుటలో నెట్టి విప్రతిపత్తియు నుండదు. ప్రశ్నోపనిషత్తు నందుకూడ,

('పరే ఽక్షర ఆత్మని సంప్రతిష్ఠతే.' ౪.౫.)

'జీవుడు నాశరహితమగు పరమాత్మయందుండు' నని స్పష్టముగానే చెప్పబడినది. ఈవిధముగ సచ్ఛబ్దము బ్రహ్మమునే బోధించును. ఆ బ్రహ్మమే యాక్షణ కర్త. అందువలననే (సదేవసోమ్య) యని సత్ పదముతో బ్రహ్మము నారంభించి (తదైక్షత) యని 'తత్' పదముతో నా బ్రహ్మమునే పరామర్శించి యీక్షణము చెప్పబడినది. కాబట్టి యీక్షణము బ్రహ్మధర్మమే యగును కాని ప్రకృతి ధర్మము కాదను విషయము సుషుప్తి (గాఢనిద్ర) యందు జీవుడు బ్రహ్మమునందు లయమగు చున్నాడని (స్వాప్యయాత్) చెప్పుటవలనను సిద్ధమగుచున్నదని భావము. (౯)

ఈక్షణము ప్రకృతి ధర్మము కాదనుటకు మరియొక హేతువు.

"గతి సామాన్యాత్" ౧. ౧. ౧౦.

గతి సామాన్యాత్ = జ్ఞానత్వమువలనను నీక్షణము ప్రకృతిధర్మము కాదు.

గతియన నిట జ్ఞానము. గతిసామాన్యమనగా జ్ఞానత్వము. ఈక్షణమనగా సంకల్పము గర్భము నందుగల పర్యాలోచన మనెడి జ్ఞానమని పూర్వమే (ఈక్షతేర్నాశబ్దమ్. ౧. ౧. ౫) వ్రాసి యున్నాము. జ్ఞానము చేతనధర్మము. జడధర్మము కాదు. ప్రకృతి జడము. కాబట్టి యీక్షణ మనెడి జ్ఞానము బ్రహ్మధర్మమే యగును. ప్రకృతి ధర్మము కాదని భావము. (౧౦)

మరియొక హేతువు.

"శ్రుతత్వాచ్చ" ౧. ౧. ౧౧.

శ్రుతత్వాత్ చ = ఈక్షణము బ్రహ్మమునకు సంబంధించినదని యుపనిషత్తులందు జెప్పబడుటవలన నది బ్రహ్మధర్మమే యగును కాని, ప్రకృతిధర్మము కాదని సూత్రార్థము.

("స ఈక్షాంచక్రే" ప్రశ్న ౬.౩)

("ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్

నాన్యత్ కించన మిషత్ స ఈక్షత" ఐత .౧.౧)

అను నీ యుపనిషద్వచనములందు 'బ్రహ్మమీక్షించెను.' 'సృష్టికి పూర్వము బ్రహ్మమొక్కటియే యుండెను. అది యీక్షించెను.' అని స్పష్టముగా బ్రహ్మము నందీక్షణ ధర్మము వర్ణింపబడినది. కావున నీక్షణధర్మము ప్రకృతికి చెందినదికాదని తెలియు

చున్నది. ఇట్లు జగజ్జన్మాదులకు సర్వజ్ఞమగు బ్రహ్మమే నిమిత్తకారణమని సిద్ధమగుచున్నది.

## ద్వితీయాధికరణము

బ్రహ్మము సాక్షాత్కారము జేసికొనదగినదని చెప్పి లక్షణముకూడ వివరింపబడినది. బ్రహ్మజిజ్ఞాసత్వమును నిరూపించుటకై మరియొక యధికరణము నారంభించుచున్నాడు మహర్షి.

("ఆనందమయోఽభ్యాసాత్" ౧. ౧. ౧౨.) (బ్రహ్మపదమీ సూత్రము నందు నన్వయించును.) అభ్యాసాత్ = (ఒకేశబ్దమును పలుమారులు చెప్పుట యభ్యాసమనబడును.) అభ్యాసము వలన. ఆనందమయః = ఆనందమయమగు నాత్మ, బ్రహ్మ = బ్రహ్మమే యని యంగీకరింపవలెను.

తైత్తిరీయోపనిషత్తు నందు అన్నరసమయము. ప్రాణమయము, మనోమయము, విజ్ఞానమయమునని క్రమముగా జెప్పి, ("తస్మాద్వా ఏతస్మాద్ విజ్ఞానమయాదన్యోఽన్తర ఆత్మాఽఽనందమయః"తై. ౨. ౫) 'ఆ విజ్ఞానమయమున కంటె భిన్నమైన యంతరాత్మ ఆనందమయ'మని చెప్పబడినది. ఈ యానందమయ శబ్దముచే ('బ్రహ్మవిదాప్నోతిపరమ్' తై. ౨. ౧.) 'బ్రహ్మవిదుడు పరమును బొందు'నని ప్రకరణ ప్రారంభమున వర్ణింపబడిన బ్రహ్మమును గ్రహింప వలయునా ? లేక జీవాత్మను గ్రహింప వలయునా ? యని సందేహము. జీవాత్మయేయని పూర్వపక్షము. కాదు బ్రహ్మమేయని సిద్ధాంతము.

తైత్తిరీయమునందు (బ్రహ్మవిదాప్నోతి పరమ్) బ్రహ్మవిదుడు పరమును బొందునని ప్రారంభింపబడిన బ్రహ్మమునుండి,

('తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ, పృథివ్యా ఓషధయః, ఓషధిభ్యోఽన్నమ్, అన్నాద్ రేతః, రేతసః పురుషః"౨ ౧.)

'ఆకాశము, దానినుండి వాయువు, అందుండి యగ్ని, దానివలన జలము, జలమునుండి పృథివి, అందుండి యోషధులు, వానివలన నన్నము, అన్నము వలన రేతస్సు (శుక్లశోణితములు), దానినుండి శరీరము (పురుషుడు) పుట్టునని చెప్పి,

('సవా ఏష పురుషోఽన్నరసమయః' ౨.౧.)

'యీ శరీర మన్నరసమయ నామముతో జెప్పబడినది.' ఇట్టి స్థూలశరీరమును జెప్పి క్రమముగా దానియందుండు ప్రాణమయము, మనోమయము, విజ్ఞానమయము నను కోశములను వర్ణించి యనంతరమున

('తస్మాద్వా ఏతస్మాద్ విజ్ఞానమయాదన్యోఽన్తర ఆత్మాఽఽనందమయః') 'విజ్ఞానమయ కోశమునందుండు అంతతరాత్మ ఆనందమయ' మని యుపదేశింపబడినది. ఇట్లు శరీరమునందుండు ఆత్మ వర్ణింపబడినందున నానందమయశబ్దము జీవాత్మను బోధించును. బ్రహ్మమును బోధింపదు. ఆనందమయాత్మబ్రహ్మమగునెడల శరీరమున కంతరాత్మగా నేల చెప్పబడును? విశ్వమున కంతరాత్మయగు బ్రహ్మము శరీరమున కంతరాత్మగ నుపదేశించుట యుక్తము కాదు. శరీరాంతరమున నుండునది జీవాత్మయే యని ప్రసిద్ధము. కాగా జీవాత్మయే యిట గ్రహింపనగును.

మరియును శరీర సంబంధము దెలుపు శారీర పదముచే వ్యవహరింప బడుటచేతను జీవాత్మయే యానందమయశబ్ద వాచ్యమని గ్రహింపనగును.

('తస్యైష ఏవ శారీర ఆత్మా యః పూర్వస్య' ౨-౬.) అను నీతైత్తిరీయ వచనమునందు ఆత్మశారీరము-శరీర సంబంధి - అని వర్ణింపబడుట జూడనగును. శరీర సంబంధము బ్రహ్మమున కుండదు. యజుర్వేదమునందు, ("సపర్యగాచ్ఛుక్ర మకాయమవ్రణమ్" ౪౦-౮.)బ్రహ్మము కాయరహితమని స్పష్టముగాజెప్పబడినది. కావున శారీరాత్మ బ్రహ్మమనుట శక్యము కాదు. బ్రహ్మమునకు శరీరసంబంధ మంగీకరింతుమేని, ప్రియాప్రియము లంగీకరింపవలసివచ్చును.

('అశ్రోత్రవై సశరీరః ప్రియాప్రియాభ్యాం నహవై సశరీరస్య సతః ప్రియాప్రియయో రపహతి రస్తి' ఛాం. ౮. ౧౨. ౧.)

'శరీరముతో సంబంధముగల శారీరునకు (జీవునకు) ప్రియాప్రియములు గలుగును. వానినుండితొలగ వీలులేదు.' అని ఛాందోగ్యమున స్పష్టముగ జెప్పబడినది. బ్రహ్మమునకు ప్రియాప్రియములు - ధర్మాధర్మములు - సుఖదుఃఖములు - నుండవనుట సర్వతంత్ర సిద్ధము. జీవాత్మునకు సుఖదుఃఖములుండుట నిర్వివాద విషయము; కావున నానందమయ శబ్దముచే నిట జీవాత్మయే గ్రహింపదగి యున్నదని తాత్పర్యము.

ఇంతేకాక యిట నానందమయాత్మకు శిరస్సు మున్నగు నవయవములున్నట్లు వర్ణింపబడినందునను జీవాత్మయే గ్రహింపనగును. ('తస్య ప్రియమేవ శిరః మోదో దక్షిణః పక్షః ప్రమోద ఉత్తరః పక్షః ఆనంద ఆత్మా, బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా' తై.౨.౫.) అను నీవాక్యమునందు 'ఆయాత్మకు ప్రియమే శిరస్సు మోదము దక్షిణపక్షము, ప్రమోదముత్తరపక్షము, ఆనంద మాత్మ, బ్రహ్మము ప్రతిష్ఠ - ఆధారము - పుచ్ఛము' నని వర్ణింపబడినది. ఇట నానందమయ శబ్దముచే బ్రహ్మమును గ్రహింతుమేని శిరస్సు మున్నగు నవయవములు బ్రహ్మమున కంగీకరింప వలసి వచ్చును. అంగీకరించుట యుపనిషద్విరుద్ధ మగును.

('దివ్యో హ్యమూర్తః పురుషః' ముం.౨.౧.౨)

('తత స్తు తం పశ్యతే నిష్కలం ధ్యాయమానః' ముం. ౩. ౧౮.)

('అస్థూల మనణు' బృ. ౩. ౮. ౮.)

ఈ యుపనిషద్ వాక్యములందు బ్రహ్మమమూర్తము, నిష్కలము, అస్థూలము, అనణువు నని యవయవ రహితముగా వర్ణింపబడినది. కాబట్టి బ్రహ్మమునం దవయవ కల్పన యెంతమాత్రము నుచితము కాదు. మరియు నానందమయమగు నాత్మకు ('బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా' తై. ౨.౫) బ్రహ్మము పుచ్ఛము - ఆధారము - ప్రతిష్ఠ - గా జెప్పబడినది. ఆనందమయ శబ్దముచే బ్రహ్మమును గ్రహింతుమేని బ్రహ్మమునకు బ్రహ్మమే యాధారమని యంగీకరింపవలసి వచ్చును. అయ్యది సంభవము కానేరదు. బ్రహ్మము తనకు తానే యాధారము నాధేయము నెట్లుకాగలదు? కావున నానందమయ శబ్దము జీవాత్మవాచకమనుట యుక్తము. బ్రహ్మవాచకము కాదని పూర్వపక్షము.

సమాధానము: ఆనందమయము బ్రహ్మమేకాని జీవాత్మకాదు. ఈ శబ్దము జీవాత్మవాచకముగా నెక్కడను జూడము. వేదములందును, నుపనిషత్తులందును నానందమయశబ్దము బ్రహ్మవాచకముగానే ప్రయోగింపబడినది. తైత్తిరీయమునందే యానందమయమును బ్రస్తుతించి, యద్దానిని ('రసో వై సః' తై. ౨.౭) రసముగా జెప్పి, ('రసం హ్యేవాయం లబ్ధ్వాఽఽనందీ భవతి' తై. ౨.౭.) 'రసమును బొందియే జీవు డానందు డగును.' అని వర్ణింపబడినది. ఇంతేకాక ('ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చన' తై. ౨.౯.)

('ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్' తై.౩.౬.)

('తద్విజ్ఞానేన పరిపశ్యన్తి ధీరాః
ఆనందరూప మమృతం యద్విభాతి'
ముం. ౨.౨.౭)

('విజ్ఞాన మానందం బ్రహ్మ' బృ. ౩.౯.౨౮)

('రసేన తృప్తో న కుతశ్చ నోనః' అథ. ౧౦.౪.౮)

'బ్రహ్మానందము ననుభవించి భయపడడు'

'ఆనందము బ్రహ్మమని తెలిసికొనవలెను'

'అమృతమై, యానందరూపమున వెలుగు బ్రహ్మమును ధీరులు విజ్ఞానముతో నెరుగుదురు.'

'బ్రహ్మము విజ్ఞానము, నానందమునై యున్నది.'

'రసముచే తృప్తుడైన వానికి కొఱంత యుండదు.'

అను నిట్టి వాక్యములందును స్పష్టముగా బ్రహ్మ మానందమయమనియే వర్ణింపబడినది. ఏశబ్దమే యర్థమున బలుమాఱులు బ్రయోగింపబడునోయా శబ్దమునకదియే యర్థముగా గ్రహించుట యుక్తము; అన్యార్థము గ్రహించుటయు దగదు. కాబట్టి యభ్యాస బలమున నానందమయశబ్దము బ్రహ్మమునే తెలుపును. జీవాత్మ నెన్నడు దెలుపజాలదు.

తైత్తిరీయములందు 'ఆనందమయ' శబ్దము ప్రయోగింపబడి యున్నచో నయ్యది బ్రహ్మమును దెలుపగలిగి యుండెడిదేమో; కాని, కేవల మానంద పదము బ్రహ్మము నెట్లు తెలుపగలదంటిరేని, యది దోషము కాదు. ఇట నానందపద మానందమయమునే తెలుపును. బ్రహ్మమానందరూప మగుటచే నానందమనియు, సార్వభౌమాది సకల సుఖములదోట్టు దాటిన నిరతిశయమైన దగుటచే నానందమయమనియు జెప్పబడును. విశేషభేదము లేనందున నానందాభ్యాస మానంద మయాభ్యాసమే యని యెంచబడును. కొన్ని తావులందు నానందమయ పదమే పఠించుటయు జూడనగును.

('ఏత మానందమయ మాత్మాన
ముపసంక్రామతి.' తై. ౨.౮.)

'ఈ యానందమయమగు నాత్మ (బ్రహ్మము) ను బొందును.'

ఆనందమయ శబ్దము బ్రహ్మబోధకమైనను శరీరాంతరాత్మగా వర్ణింపబడుట దోషావహము కాదు. విశ్వాంతరాత్మయగు బ్రహ్మము శరీరాంతరాత్మ యగుటలో దోష మిసుమంతయు నుండదు.

శరీరాంతరాత్మగా వర్ణించుటచే శరీరసంబంధము విశేషముగ నానందమయమునకు జెప్పబడినట్లు కనబడుచున్నది; శరీరము, ప్రాణము, మనస్సు, విజ్ఞానము నను నాలుగును జీవాత్మకు సంబంధించినవే. బ్రహ్మమునకు సంబంధించినవి కావు. కాబట్టి యానందమయ శబ్దము జీవాత్మనే తెలుపును కాని, బ్రహ్మము నెట్లు తెలుపగలదు? అందురేని విజ్ఞానమయశబ్దము జీవాత్మను దెలుపున దగుటచేత నానందమయశబ్దము బ్రహ్మమునే తెలుపునని యందుము.

ఆత్మ శారీరము-శరీరసంబంధి-యని వర్ణించుటచే నానందమయశబ్దము బ్రహ్మమును దెలుపజాల దనుటయు యుక్తము కాదు. బ్రహ్మ మంతరాత్మయగుటచే శారీర మవనొప్పును. విజ్ఞానమయమగు జీవాత్మ పంచభూతములతో నేర్పడు శరీరమునం దంతరాత్మగా నుండునట్లు జగజ్జన్మాదులకు కారణమగు బ్రహ్మము కూడ చేతనాచేతనాత్మకమగు నీ జగత్తున కంతరాత్మయై యుండును.

('యో మాతంచ పిత్యంచ సర్వంయశ్చాధితిష్ఠతి
సర్వస్యచ కేవలం తస్మైజ్యేష్ఠాయబ్రహ్మణేనమః'
అథ-౧౦-౪.౮.౧.)

'భూతభవిష్య ద్వర్తమానముల నన్నిట నధివసించు కేవల సుఖస్వరూపమగు జ్యేష్ఠబ్రహ్మమునకు నమస్కారము' అని బ్రహ్మము సర్వము నధివసించి యుండుట మంత్రమునందు స్పష్టముగ వర్ణింపబడినది. పాంచభౌతిక శరీరము జీవాత్మకు శరీరమైనట్లు అంతరాత్మతాసామ్యమువలన విశ్వమంతయు బ్రహ్మమునకు శరీరముగ నెంచబడును. బృహదారణ్యకమున నియ్యది స్పష్టపరుపబడినది.

('యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అన్తరః
యం పృథివీ నవేద యస్య పృథివీ శరీరమ్.'
౩. ౭. ౩.

'యో ఽప్సు తిష్ఠన్ అద్భ్యో ఽంతరః
య మాపో నవిదు ర్యస్యాపః శరీరమ్.' ౪

'యో ఽగ్నౌతిష న్నగ్నే రంతరః
యమగ్ని ర్నవేద యస్యాగ్నిః శరీరమ్.' ౫

'యో వాయౌ తిష్ఠన్ వాయోరంతరః
యం వాయు ర్నవేద యస్య వాయుః శరీరమ్.' ౭

'య ఆదిత్యే తిష్ఠ న్నాదిత్యా దంతరః
యమాదిత్యో నవేద యస్యాదిత్యః శరీరమ్.' ౯

'యో దిక్షు తిష్ఠన్ దిగ్భ్యోంతరః
యం దిశో నవిదు ర్యస్య దిశః శరీరమ్.' ౧౦

'య ఆకాశే తిష్ఠన్ ఆకాశా దంతరః
య మకాశో నవేదయస్యా కాశః శరీరమ్' ౧౨

'యః ప్రాణే తిష్ఠన్ ప్రాణాదంతరః
యం ప్రాణో నవేద యస్య ప్రాణః శరీరమ్.' ౧౬

'యో మనసి తిష్ఠన్ మనసో ఽంతరః
యం మనో నవేద యస్య మనః శరీరమ్.' ౨౦

'యోవిజ్ఞానే తిష్ఠన్ విజ్ఞానాదంతరః
యంవిజ్ఞానం నవేద యస్య విజ్ఞానం శరీరమ్'

'యోవిజ్ఞాన మంతరోయమయతి
ఏషత ఆత్మా అంతర్యామ్యమృతః' బృ.౩.౭.౨౨.)

'పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆదిత్యుడు, దిక్కులు,ఆకాశము, ప్రాణము,మనస్సు విజ్ఞానమునను వానియందు బ్రహ్మముండును. కాని, వానికంటె నయ్యదిభిన్నము. పృథివ్యాదు లా బ్రహ్మము నెరుగవు. కాని, యవియన్నియు బ్రహ్మకు శరీరము. బ్రహ్మము వాని కంతరాత్మ' యని వాక్యముల భావము. ఇట్లు జగత్తంతయు బ్రహ్మమునకు శరీరముగా వర్ణింపబడుటచే బ్రహ్మము శారీరమనుటలో దోషముండదు. అటులయిన బ్రహ్మమునకు శరీరసంబంధమున్నందున ప్రియాప్రియముల - సుఖదుఃఖముల - తో సంబంధము కలుగునని యూహింప బనిలేదు. బ్రహ్మమునకు పృథివ్యాదులతో సామాన్య సంబంధమే కలదు; కాని జీవాత్మునకు పాంచభౌతిక శరీరముతోవలె విశేష సంబంధము లేదు. సామాన్యసంబంధము సుఖదుఃఖ జనకము కాదు. 'బాలకుడునిప్పువంటివా'డనినంత నతడు కాష్ఠములను దహించునని కాదుగదా ! కాబట్టి పృథివ్యాది రూపశరీరములందుండుటచే బ్రహ్మము శారీరమని చెప్పబడుట దోషావహము కానేరదు.

అవయవ శ్రవణమువలన బ్రహ్మ మానందమయము కాదనుటయు నుచితము కాదు. ఆత్మ సామ్యముచే నట్లు చెప్పవలసివచ్చినందున దోషము లేదని భావము. అన్నమయాదులకంటె బ్రాణమయాదులయిన ఆంతరాత్మలు భిన్నములుగా నుపదేశింపబడినట్లు, విజ్ఞానమయమగు నాత్మకంటె నానందమయాత్మ మరియొక యంతరాత్మగ నుపదేశింపబడినది.

('తస్య ప్రాణ ఏవ శిరః, వ్యానో దక్షిణః పక్షః, అపాన ఉత్తరః పక్షః, ఆకాశ ఆత్మా, పృథివీ పుచ్ఛం ప్రతిష్ఠా' తై. ౨. ౨.)

'దానికి శిరస్సు ప్రాణము ; దక్షిణ పక్షము వ్యానము ; ఉత్తరపక్ష పానము ; ఆకాశ మాత్మ ఆధారము పృథివి" యని విజ్ఞానమయమగు నంతరాత్మకు నవయవములు వర్ణించి,

('తస్మాద్ వా ఏతస్మాద్ విజ్ఞానమయా దన్యో అన్తర ఆత్మాఽఽనందమయః')

ఆ విజ్ఞానమయమగు నాత్మకంటె భిన్నముగ నానందమంతరాత్మగ వర్ణింపబడినది. కాబట్టి, విజ్ఞానమయమగు నంతరాత్మకు శిరః ప్రభృత్యవయవములు వర్ణించిన ట్లానందమయాంతరాత్మకును నవయవములు వర్ణింపబడినవి. అట్లుపదేశింపకున్నచో నుపదేశమునందు వైరూప్య మేర్పడును. ఉపదేశమున సారూప్యము ప్రాజ్ఞులకు శ్రద్ధకలుగజేయును. ఆనందమయమగు బ్రహ్మకు శిరః ప్రభృత్యవయములు పారమార్థికములు కావు. అవి కల్పితములే. బ్రహ్మము నిరవయవము కావున నందు పారమార్థికావయవములకు బ్రసక్తియే లేదు.

కల్పింపబడు నవయవములుకూడ ననురూపులు (సమాన లక్షణము కలవి) గ నుండవలెను. హస్తపాదాద్యవయవములు దేహసమాన లక్షణములుగలవై యుండును. అట్లే యానందమయ బ్రహ్మకు కల్పింపబడిన అవయవములును తత్సమాన లక్షణములు గలవిగా నుండుట యుక్తము. కావుననే మోదము, ప్రమోదము మున్నగు నానందవిశేషములే యానందమయమగు బ్రహ్మమునకిట నవయవములుగా గల్పింపబడినవి. మోదప్రమోదానందములు సాంసారిక వస్తూపభోగములవలన జనించు సుఖములు గావు. అవి విలక్షణములు. బ్రహ్మనిష్ఠగల ముముక్షువులకు లభ్యములు. ప్రియము, మోదము మున్నగునవన్నియు బ్రహ్మశబ్దముచే బోధింపబడు దివ్యార్థమునే బోధించును. కాబట్టి యానందమయ బ్రహ్మము నిరవయవమైనను పక్షిరూపమున రూపకాలంకారముతో బ్రహ్మమును నిరూపించుచు నవయవకల్పన జేయుట యుపనిషత్తులకు దోషావహము కాదని భావము.

(బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా) యని బ్రహ్మము పుచ్ఛము, ప్రతిష్ఠ- ఆధారము-గా వర్ణింపబడినందున నానందమయశబ్దము బ్రహ్మమును బోధింపదనుటయు సముచితము గాదు. అదియును కల్పనామాత్రమే. ఆనందమయమునకు శిరఃప్రభృత్యవయవములు సాదృశ్యముచే కల్పింపబడినట్లు, పుచ్ఛత్వము (ఆధారత) పైతము కల్పితమనియే యెంచవలయును.

రూపకమగుట వల్లయెడల సర్వాంగముల నుపన్యసించుట రూపకాలంకారవిదుల ప్రశస్తముగా నెంచెదరు. పుచ్ఛమనగా తోక. కాని, యిట ప్రతిష్ఠ యనెడి పదముతో నొక విభక్తియందు ప్రయోగింపబడిన నాధారమని యర్థముఁ జెప్పియుంటిమి. బ్రహ్మము చేతనాచేతనాత్మకమగు నీజగత్తున కంతటికి నాధారము. ఆనందమయ రూపబ్రహ్మము పక్షిరూపమున వర్ణింపబడుటచే సాదృశ్యమును గల్పించి పుచ్ఛరూపమున జెప్పబడినది. అయ్యది కల్పనామాత్రమే. ఛాందోగ్యమునందుకూడ బ్రహ్మమునకు బ్రహ్మమే యాధారమని వర్ణింపబడినది.

('సభగవః ః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి? సమహిమ్ని'
ఛాం. ౭.౨౪.౧)

'స్వామీ! ఆబ్రహ్మమెందు ప్రతిష్ఠితమైయున్నది?' యని ప్రశ్నింపగా 'తన మహిమయందు' అని సమాధానము చెప్పబడినది. కాబట్టి యానందమయము బ్రహ్మమేయనుట సర్వవిధముల సిద్ధమగుచున్నదని భావము. (౧౨)

ఆనందమయ శబ్దమునందు 'మయట్' ప్రత్యయమున్నది. (నిత్యం వృద్ధశరాదిభ్యః. అష్టా. ౪.౩.౧౪౪.) అను పాణినీయ సూత్రము ననుసరించి వికారార్థమునం దానంద శబ్దమునకు 'మయట్' విధింపబడినది. కావున, ఆనందమయమనగా నానందవికారమని యర్థము. ఆనందమయశబ్దము బ్రహ్మబోధకమందుమేని బ్రహ్మ మానందవికారమని చెప్పవలసివచ్చును. అది యానంద స్వరూపమేకాని యానందవికారముకాదు. జీవాత్మ ప్రళయవేళయందు బ్రహ్మమున నవిభక్తముగనుండి సర్గారంభమున మరల పృథివినుండి యోషధులు వెలువడునట్లు బ్రహ్మమునుండి వెలువడునదై యానందమయమునుండి వెలువడుటచేత నానందవికారమని యొక విధముగ జెప్పనగును. కావున నానందమయ శబ్దము జీవాత్మనే బోధించుట యుక్తమని మరల శంకింపగా సమాధానము:

"వికారశబ్దాన్నేతిచేన్న ప్రాచుర్యాత్" ౧.౧.౧౩.
(బ్రహ్మము, ఆనందమయము, నను రెండు పదములు నీ సూత్రమున ననువర్తించును,

వికారశబ్దాత్ = ఆనంద వికారవాచకమువలన, న = ఆనందమయము బ్రహ్మముకాదు. ఇతి = అని, చేత్ = అందురేని, న = కాదు, ప్రాచుర్యాత్ = ప్రాచుర్య శబ్దమువలన, ఆనందాధిక్యమును దెలుపు శబ్దమగుటవలన. ఆనందమయములోని 'మయట్' ప్రాచుర్యమును (అధిక్యమును) బోధించును. కాని, వికారమును బోధింపదు. 'మయట్' వికారార్థమునందు విధింపబడునట్లు ప్రాచుర్యమునందును విధింపబడును.

'తత్ ప్రకృతవచనే మయట్' అను పాణినీయ సూత్రము ననుసరించి 'మయట్' ప్రాచుర్యార్థమున విధింపబడుచున్నది. కాబట్టి యానందమయ పదమునందలి 'మయట్' ప్రత్యయము వికారార్థమున విధింపబడిన దైనంచక ప్రాచుర్యార్థమున విధింపబడినట్లు గ్రహింపనగును.

('నిత్యం వృద్ధశరాదిభ్యః' అ. ౪. ౩-౧౪౪) సూత్రము ననుసరించి 'మయట్' ప్రత్యయము వికారార్థమునందును విధింపబడుచున్నదికదా! 'ఆనందమయము' అను నీతావున వికారార్థమే యేల గ్రహింపగూడదు? అందురేని 'మయట్' ప్రాచుర్యము, వికారము నను రెండర్థములందును బ్రయోగింపబడ నవకాశమున్నప్పటికిని నెక్కడ నేయర్థము గ్రహించుట యుక్తమో యయ్యదియే గ్రహింపవలయును.

'శరీర మన్నరసమయము' అను తావున నన్నరసమయములోని మయట్ ప్రత్యయము వికారార్థమునే తెలుపుచున్నది. కాబట్టి, అన్నరసమయాది శబ్దసముదాయమున నున్న 'ఆనందమయ' శబ్దములోని మయట్ ప్రత్యయము సైతము వికారార్థమునే బోధించు నందురేని యదియును సరికాదు. కారణమేమన :- 'అన్నరసమయ' పదములోని మయట్ ప్రత్యయముకూడ నాధిక్యమునే బోధించుచున్నది.

(సశేషము)

# దేవ్యపరాధక్షమాపణ స్తోత్రము

రచన:
శ్రీ శ్రీ ఆచార్య శంకరులు

అనువాదము:
శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు

నేరను మంత్రయంత్రములు, నేరను బీజము లంబ! ధ్యానమున్
నేరను, ముద్ర లే నెఱుగ, నేరను నిన్ నుతియింప, పిల్వగా
నేరను నిన్ను, ఆర్తిమెయి నే విలపించుటయే నెఱుంగ, నిన్
జేరినవారి క్లేశములు చేరవటం బొకటే యెఱుంగుదున్. 1

తెలియక నీ పదార్చనవిధిన్, గ్రహియింపగ శ్రద్ధలేమిచే
అలసతచేత, పేదరికమబ్బుటచేత భవదంఘ్రి యుగ్మమున్
గొలువని పాతకిన్, సకలగోపని! తల్లి! శివా! సహింపవా?
కలుగునుబో కుపుత్రకుడు, కల్గదుగాదె కుమాత యెన్నడున్! 2

కలరుగదా సుశీలురు జగమ్మున పుత్రులు నీ కనేకు, లే
ఖిలమతి చంచలాత్ముడ నొకండ తనూజుడనై, భవత్పదం
బులకు దొలంగినంతటనె పోలునె నీకు ననున్ త్యజించుటల్
కలుగునుబో కుపుత్రకుడు, కల్గదుగాదె కుమాత యెన్నడున్! 3

అలసుడనై మదంబ! జగదంబ! భవత్పదపంకజాతముల్
గొలిచి యెఱుంగ, విత్తములుకొల్లగ నీ కిడుపాటి పున్నెమున్
సలిపి యెఱుంగ, ఇట్టి నను సాకెడి నీ కృప పెంపునారయన్
కలుగునుబో కుపుత్రకుడు, కల్గదుగాదె కుమాత యెన్నడున్. 4

వివిధములౌ విధుల్ తెలిసి వేలుపులన్ యజియింపలేక, వా
రి విడిచినాడ నే నెపుడొ; రిత్తగ ప్రాయపుబ్రొద్దువ్రాలె నో
భువనవిధాయినీ! ముదిమి ముప్పుతఱిన్ దెసమాలి యిప్పు డే
నెవరిమఱుంగు జొత్తు? జననీ! చెయిచాపవె సుంతతేపనై. 5

చేకొను నింద్రభోగము కుచేలుడు నీ మనువర్ణముల్ చెవిన్
సోకిన, మాకరందరుచి జొబ్బిలఁబల్కు శ్వపాకుడేని జ
ల్పాకత నో కదంబవనవాసిని ! చారు సుహాసినీ ! యథా
స్వీకృతమంత్రజాపవిధి చేపడు ఆ పద మెట్టిదో కదా ! 6

తన కేమున్నది వేసమేత మెయిపూతల్ బూదియుంగాక, పా
పనగల్ వ్రేల దిగంబరుండయి జటాభారమ్ముతో బిచ్చపుం
బునుకం దాల్చి చరించు నా పశుపతిన్, భూతేశు విశ్వాధినా
థుని గావించెను నీ కరగ్రహణ మెంతో వింత కాత్యాయనీ ! 7

ఏణవిలోచనా ! శశిముఖీ ! నినువేడను జ్ఞానభిక్ష, ని
ర్వాణముగోర, పెక్కువిభవమ్ములు గోరను, గోర సౌఖ్యముల్ ;
ప్రాణములేగుచో శివశివా ! మృడ ! శర్వ ! భవా ! మృడాని ! శ
ర్వాణీ ! భవాని ! యన్ జపపరాయణతన్ మదినిల్ప వేడెదన్. 8

ఉపచారమ్ములు నే యథావిధిగ నీ కొక్కప్పుడుం జేయలే
దపచారమ్ములు వాఙ్మనఃక్రియల గృత్యంబయ్యె నిత్యంబు, పా
ప పరీతుండను, దిక్కుమాలితి, అకూపారంబునుంబోని నీ
కృప యొక్కించుక చిల్కరించి నను రక్షింపంగ నీకే తగున్. 9

ఆపదలకోడి నేడు నన్నాశ్రయించె
శతుడు వీ డంచు దోసమెంచకు మపర్ణ !
ఆకటికి దప్పికింగాదె అర్భకునకు
ఆదకున్వచ్చు దల్లి, దయార్ద్రవేశి ! 10

నిండుమనమున నను గరుణించి ప్రోచు
టబ్బ మదికాదుసూ, జగదంబ ! నీకు,
సుతుని యపరాధములు పరశ్శతములేని
కడుపునం బెట్టుకొనుగాదె కన్నతల్లి ! 11

లేదు నను బోలు పాపియు, లేదు నిన్ను
బోలు పాపఘ్నియును; పెక్కు లేల పలుకు ?
లంబ ! నీ దివ్యచిత్తాన నవధరించి
యోగ్యమేది అది నీవ చేయుము భవాని ! 12

# భగవదర్చావిభూతి

## (లింగతత్త్వ స్వరూప భేదాది నిరూపణము)

శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు

కార్యరూపమున పరిదృశ్యమానమును స్థూల సూక్ష్మాకృతులతో నింద్రియగోచరమును నగు నీ విశ్వమునకు అదృశ్యము అతీంద్రియము సుసూక్ష్మము నైన యొక దివ్యశక్తి కారణభూతమై తేజరిల్లు చున్నదని వేదములు వాకొనుచున్నవి. అది సర్వజ్ఞము సర్వేశ్వరమునై అచింత్యాద్భుత దివ్యశక్తులతో విశ్వముయొక్క సృష్టిస్థిత్యాదులను జరుపుచున్నది. ఆ దివ్యశక్తినే ఆత్మ, పరమాత్మ, బ్రహ్మము, పరబ్రహ్మము, సత్తు, ఈశ్వరుడు, పురుషుడు, విశ్వకర్మ మున్నగు పదములచే వేదము పేర్కొను చున్నది. సత్యజ్ఞానానంతమగు నీ యేకైక పరతత్త్వము నుండియే అనృత జడదుఃఖాత్మకమగు జగము పుట్టుట. ఈ ఈశ్వర పదార్థమునకు కరచరణాద్యవశిష్టమైన శరీరముతో పనిలేదు. శరీరేంద్రియ నిరపేక్షముగానే యా వస్తువు జగత్క్రీడ జరుపగలదు. ఈ యర్థమునే దిగువ మంత్రములు నుడువుచున్నవి.

"అపాణిపాదో జవనోగ్రహీతా
పశ్య త్యచక్షుః స శృణో త్యకర్ణః
సవేత్తి వేద్యం న చ తస్యాస్తి వేత్తా
త మాహు రగ్ర్యం పురుషం మహాన్తం."

"న తస్య కార్యం కరణం చ విద్యతే
న తత్సమ శ్చాభ్యధిక శ్చ దృశ్యతే
పరాస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే
స్వాభావికీ జ్ఞానబలక్రియా చ."

— శ్వేతాశ్వతరము.

ఆదిమమగు నీ యీశ్వరతత్త్వము నపరోక్షానుభూతికి తెచ్చుకొన్న ఋషులు దాని ననేక విధములుగా గానముచేసి యున్నారు. "ఏకం న ద్విప్రా బహుధా వదన్తి" మున్నగు శ్రుతు లిందుకు నిదర్శనములు. శబ్ద స్పర్శ రూపరసాది భూతగుణములులేని యా సచ్చిదానందమును మానవు లనుభూతికి తెచ్చుకొనుట కనేక మార్గము లేర్పడినవి. అందు నిరాకారమగు నా తత్త్వమునకు రూపకల్పన మొనర్చి తదుపాసన మొనర్చుట యొక మార్గము. ఇది స్థూలమార్గమైనను సుసాధనమైన దనుటలో సందేహము లేదు. అందుకే అనేకములయిన తంత్రాగమ గ్రంథములు దీనిని బలపఱచుచున్నవి. కులార్ణవతంత్రమను గ్రంథ మిట్లనుచున్నది.

"చిన్మయ స్యాద్వితీయస్య నిష్కల స్యాశరీరిణః
ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా."
"సాధకానాం హితార్థాయ బ్రహ్మణో రూపకల్పనా."

చిన్మయము, అద్వితీయము, నిష్కలము, శరీర రహితము నగు బ్రహ్మమునకు ఉపాసకుల సౌకర్యమునకై రూపకల్పన మేర్పడినది. సాధకుల హితము కొఱకై బ్రహ్మమున కాకార నిర్మాణము.

జగత్కారణమగు నిరాకార నిర్గుణ పరబ్రహ్మము — దేశకాలాద్యనవచ్ఛిన్నమైన పరమతత్త్వము ను ఉపాసించుటకు ఆదిమకాలమున నొక చిహ్నము నేర్పఱుచు కొన్నారు. చిహ్నమనగా గుర్తు. సంస్కృతభాషలో గుర్తునకు లింగమను శబ్దము వాడబడి యున్నది. విశ్వముయొక్క సృష్టి స్థిత్యాదులకు హేతుభూతమైన సర్వవ్యాపక పరమ తత్త్వమున కీ వస్తువు చిహ్నమను నర్థమున మొదట లింగశబ్దము వాడబడి యుండును. ఆ నామము ననుసరించియే దాని స్వరూపముగూడ అండాకారముగా

చేర్పబడినది. బ్రహ్మాండమును దృష్టిలో నుంచుకొని కూడ బ్రహ్మాండస్వరూపుడును - విశ్వమయుడును నగు పరబ్రహ్మమున కేర్పఱుపబడిన లింగము (చిహ్నము)ను అండాకారముగా నూహించి తీర్చ యున్నారని భావింపవచ్చును. ఈ లింగము బిందు స్వరూపముగాగూడ భావింపబడుట యొక రహస్యము. శ్రీచక్రమున మొదట మధ్యస్థానమున బిందువును తదుపరి త్రికోణము (బిందుత్రికోణ వసుకోణ దశారయుగ్మం) నుండుట తదుపాసకులెఱింగిన విషయమే. అండాకృతికిని బిందుస్వరూపమునకును దగ్గఱి సంబంధ మున్నది. బిందువు ప్రసారావస్థలో అండాకృతిని, లేదా లింగాకృతిని పడయుచున్నది. ఇట్టి యర్థవిశేషములను మది నుంచుకొనియే ఆదిమ తత్త్వవేత్తలు లింగ పూజను విశ్వజనకుని పూజగా పూర్వకాలమున విధించియున్నారు. సారాంశము లింగము భగవంతునికి చిహ్నమనుట.

నిరవయవములగు నీ లింగమూర్తులేగాక సావయవములగు కేశవాదిమూర్తులుగూడ నిరాకారనిర్గుణ పరబ్రహ్మమునకు చిహ్నములని ఉత్తమ సాధకావస్థలోను, సిద్ధావస్థలోను భావింపబడకపోలేదు. శ్రీ శంకరులు పాండురంగాష్టకములో గాబోలును "పరబ్రహ్మలింగంభజే పాండురంగం" పాండురంగ స్వామిని అఖండపరబ్రహ్మమునకు లింగ (చిహ్న) మనియే గానముచేసినారు. ఇట్టి యుదాహరణములు పెక్కులు మనకు వాఙ్మయములో పొడకట్టుచున్నవి.

ఈ లింగములు తదారాధకులకు శివంకరములగుటచే శివలింగములనియు, భగవంతునికి చిహ్నములగుటచే భగవల్లింగములనియు గూడ నాడు పిలువబడెడివి. లింగములు సర్పపరివేష్టితములై, ఆ పాము పడగలచేత కప్పబడియుండుటను గూడ ప్రతిలింగాలయమునందును మనముచూచుచునే యున్నాము. లింగమున కలంకారముగానున్న యీ సర్పస్వరూపమునే నాగాభరణమని పిలుచుచున్నారు. ఈ నాగాభరణముగూడ ఒక విశిష్టార్థమును బోధించుచునేయున్నది. శరీరమునందలి షట్చక్రములలో ఆధారపద్మమున కుండలినీశక్తి యున్నది. అది సర్ప స్వరూపముగా భావింపబడినది. ఈ శక్తిని యోగానుష్ఠానముచే మేలుకొల్పి సుషుమ్నామార్గమున సహస్రారపద్మమున ప్రవేశపెట్టుట మోక్షసిద్ధికరమని ఒక యోగసంప్రదాయము. సహస్రారస్థితమైన అఖండపరబ్రహ్మముయొక్క దివ్యానుభూతిని యోగులీ మార్గమున ప్రయాణించి పడయుదురనుట రహస్యము. సర్పాకృతిగలదిగా భావింపబడిన యీ శక్తి నిద్రావస్థలో నున్నపుడు దాని తోక సహస్రారమునను, పడగ (తల) ఆధారమునను ఉండును. ఆధారస్థానమునుండి సహస్రారము (తలలోని భాగము) వఱకు వ్యాపించియున్న యీ నాడినే (సుషుమ్నామార్గము) స్థూలముగా వెన్నుపామని వ్యవహరించుచున్నారు. యోగులగువారు యోగాభ్యాసముచేసి యీ శక్తిని మేలుకొల్పుటచే అది ప్రబుద్ధమై వారు చెప్పినట్లు విని తలను సహస్రారమునకును, తోకను ఆధారములోనికిని త్రిప్పి క్రమమార్గమున నుండగలదు. అట్టిస్థితిలో సహస్రారపద్మస్థితమైన పరబ్రహ్మము నది యలంకరించి తత్సేవావిమగ్నమై ప్రకాశించును. ఈ తత్త్వరహస్యమే బాహ్యజగమున పరబ్రహ్మమునకు గుర్తుగా భావింపబడిన లింగపక్షమునను అనుసంధింపబడి నాగాభరణము లేర్పఱుపబడినవి.

యోగమార్గమునకు చెందిన ఈ లింగతత్త్వరహస్యము సృష్టిలోగూడ మన కగపడుచున్నది. మనము శివలింగపు పువ్వులను చూచుచున్నాము. ఈ పుష్పములు మనుష్య కల్పితములుకావు. ప్రకృతిలో సహజముగా ఈశ్వరునిచే సృష్టింపబడినట్టివి. ఈ పూవు వర్తులాకృతిగలదై యుండును. పుష్పమధ్యమున పానవట్టమువలె పీఠమొకటియు దాని నడుమ లింగమును నుండును. ఆలింగమునకు పైని పాము పడగవంటి రూపమొకటి యుండును. ఈ పూవు సర్వవిధముల దేవాలయములలోని నాగాభరణయుక్తమగు పీఠస్థితలింగమును బోలియుం

డుట. ఉపాసకు లిపుడైనను చూచి తద్రహస్యమును భావింపవచ్చును. వింతయైన ఈ పూవు పారమేశ్వర కళావిభూతినేగాక, శివలింగతత్త్వ రహస్యమును గూడ అనుభవసిద్ధముగ చాటుటలేదా? ఆ పుష్పమే ఒక గర్భాలయము. అందలి పీఠమే పానవట్టము. దానిమీది లింగమే భగవల్లింగము. మీది పాము పడగయే నాగాభరణము. ప్రకృతిలో నీశ్వరేచ్ఛగా నేర్పడిన యీ పూవు పరమేశ్వరుని ఈ రూపముగా నర్చింపుడని మానవులకు బోధించుచున్నదిగాబోలు! కావున లింగస్వరూపకల్పనము, లింగపూజావిధానము ఈరీతిగా లోకమున వెలసినట్లు భావించుట అసహజము కాదు.

ఆదిమకాలమున ఈలింగమునకు శైవ వైష్ణవాది భేదములులేవు. అది అఖండపరబ్రహ్మమునకు చిహ్నముగా మాత్రమే భావింపబడినది. కాలక్రమమున శైవ వైష్ణవాది మతములు ప్రబలగా ఈలింగము శివునికి మాత్రమే చిహ్నమైనట్లు తోచుచున్నది. తొలుత నిఖిల జగన్నాథుడగు సర్వేశ్వరున కుపయోగింపబడిన శివ శబ్దముగూడ తరువాత శంకరునికి మాత్రమే పర్యాయ పదమై యుండవచ్చును. అందుచేతనే శివతత్త్వ ప్రతిపాదకమైన మతము శైవమనియు పరబ్రహ్మలింగము వ్యష్టిపరమైన శివలింగమనియు వ్యవహరింపబడి యుండవచ్చును. శివవిష్ణ్వాది వివిధమూర్తుల పూజ పురాణయుగమున నెక్కువగా విజృంభించినది. పురాణములలోని పెక్కు గాథలలో వీరు రాగద్వేష వశులుగాగూడ చిత్రింపబడుటను మనము గమనింపగలము. శివ - స్కాందాదిపురాణములలోని "శివుని లింగము (మేఢ్రము) ఋషుల శాపమువలన తెగిపడి మింటిలోనికి మంటిలోనికి తెగ పెరిగిపోయినదనియు, దాని ఆద్యంతములు విష్ణువు బ్రహ్మయు నెఱుగలేకపోయినారనియు, అలింగమే లోకమునకు పూజార్హమైన దనియు, చెప్పుగాథలు ఎంతవఱకు శివతత్త్వప్రతిపాదకములో విచారింపవలయును. ఈ లింగము శివుని శిశ్నమనుట సమంజసమో, పరమేశ్వరునకు - పరబ్రహ్మమునకు చిహ్నమనుట సమంజసమో కూడ భావింపదగినదే. సృష్టియంతయు ప్రకృతి పురుషులచే జరుగుచున్నది గావున నీ లింగము పురుషచిహ్నమును, దాని కాధారమైన పానవట్టము అనగా పీఠము ప్రకృతి చిహ్నమును నని భావించుట సముచితము. అట్లే శ్రీ చక్రమునందలి బిందు త్రికోణములుగూడ పురుషునికిని ప్రకృతికిని చిహ్నములై యున్నవి. పరమపురుషుడగు శివుడు శక్తి (ప్రకృతి) యుక్తుడైననేగాని జగత్సర్జనాదులు జరుగనొల్లవు గదా!

స్థూలముగా చూచిన నీ లింగములు రుబ్బుడు పొత్రపు టాకారములో నుండునని మన మెఱుంగుదుము. ప్రథమమున నిరవయవములుగా నున్న యీ లింగములకు కాలక్రమమున ముఖములు కల్పింపబడినవి. ఈ ముఖములు ఒకటినుండి అయిదువఱకు పెరిగినవి. ఏకముఖ, ద్విముఖ, త్రిముఖ, చతుర్ముఖ, పంచముఖ శివలింగములుకలవు. శరీరావయవము లన్నింటిలో శిరస్సు ప్రధానము. (సర్వస్య గాత్రస్య శిరః ప్రధానం) కావున మొట్టమొదట నీ అఖండలింగమునకు ముఖకల్పనము చేయబడినది. పరమేశ్వరున కయిదుముఖములు కల్పింపబడుటలో గూడ ప్రత్యేకాభిప్రాయమున్నది. సృష్టి పంచభూతమయము; సృష్టి, స్థితి, లయ, తిరోధాన— అనుగ్రహములను అయిదుకర్మములతోగూడినట్టిది. ప్రపంచము గూడ సత్తు, చిత్తు, ఆనందము అను పరబ్రహ్మాంశములు మూడింటితోను, నామరూపములను జగదంశములు రెంటితోను మిశ్రితమైనట్టిది. ఆ పంచాంశములకు చిహ్నములుగానే మనుష్య హస్తమున కయిదేవ్రేళ్ళున్నవి. ఈ పంచసంఖ్యలను సూచించుచు ఆయా తత్వములకు చిహ్నములుగా పరమేశ్వరున కైదు ముఖములు భావింపబడినవి. ఇది యంతయు సాకారము సగుణమునగు పారమేశ్వరకళ. మనపురాణాగమములలో విశ్వకర్మయు, శివుడును పంచశీర్షులుగానే వర్ణింపబడియున్నారు. శివుడొక తలను నఱుకక పూర్వము బ్రహ్మదేవుడు గూడ పంచశీర్షుడేకదా! ఇక వేదమాతయని చెప్ప

బడు గాయత్రీమహాదేవికి గూడ అయిదు శిరములే యున్నవి. పంచశీర్షులగు శివబ్రహ్మ విశ్వకర్మలకు అభేదమునే పెక్కు ప్రమాణములు ప్రతిపాదించు చున్నవి. పరశివునకు విశ్వకర్మకు అభేదమును చెప్పుచు, పరశివవిశ్వకర్మతత్త్వము ప్రచలితమైనది. ఇందుకు నిదర్శనముగా పరశివవిశ్వకర్మాగమమని ఒక ఆగమగ్రంథము గూడ గలదు కాగా పంచశీర్ష యుక్తముపురుషస్వరూపమొకటి. అది శివ, బ్రహ్మ, విశ్వకర్మ వ్యపరపర్యాయములతో నొప్పుచున్నది. ప్రకృతికి ప్రతినిధిభూతమగు స్త్రీస్వరూపమొకటి. అది గాయత్రీనామముచే ప్రకాశించుచున్నది. ప్రకృతి పురుషశక్తులకు దంపతి భావసమారోపణము భారత సంప్రదాయముల కిష్టము. వ్యష్టిగా భావించినపుడు సృష్టి, స్థితి, లయము, తిరోధానము అనుగ్రహము అను నైదు కర్మములకును వరుసగా బ్రహ్మ, విష్ణు, మహేశ, ఇంద్ర, సూర్యులు కర్తలు. వీరి సమష్టి స్వరూపము పంచశీర్షయుక్త పురుషతత్త్వములో తోచును. ఈ బ్రహ్మాది పంచమూర్తులును పంచశక్తి యుక్తులు. జ్ఞానేచ్ఛా క్రియాశక్తులు మూడు ఆది-పరా శక్తులు రెండు, వెరసి పంచశక్తులు. ఈ శక్తులే లక్ష్మీ సరస్వతీ పార్వతీ శచీ సంజ్ఞలుగా భావింపబడి నవి. మరల ఆ మూర్తులకు ఈ శక్తులకు దాంపత్యము. వేదమతములోని ప్రకృతి పురుషతత్త్వము, దానికి చేయబడిన దాంపత్యచిత్రణము, పంచమూర్తులు, పంచబ్రహ్మలు, పంచఋషులు, పంచశక్తులు, నానా విధ దేవతలు, తత్కుటుంబ పరివార వాహనాదులు కడువిచిత్రములుగానుండును. ఇవిసామాన్యునకర్థము కానంత కఠినములు. అర్థమయిన ఆనందదాయక ములు, తత్త్వ బోధకములును, ఈ నానాత్వ మంతయు ఏకములోనే ఈ రహస్యములు పెక్కులు కీ. శే. శ్రీ కోలవెన్ను పరబ్రహ్మతీర్థుల వారు తమ "జగచ్ఛిల్ప" మను గ్రంథములో, వివ రించి యున్నారు.

పైని వివరించినరీతిగా ముఖలింగముల ప్రాదు ర్భావము జరిగి పంచముఖ లింగములు వెలసి సృష్టి రహస్య ప్రతిపాదకములయినవి. రానురాను ఈ శివ లింగము కరచరణాద్యవయవములతోను - ఆయుధా దులతోను వెలసి పత్నీ పుత్ర పరివారవాహనాదులతో గూడ నొక శివకుటుంబముగా పరిణమించి భక్తుల కారాధ్యమైనది.

చారిత్రక దృష్టితో చూచినచో హిందూదేశపు టాదిమ నివాసులు లింగపూజకులుగానే కనబడు చున్నారు. మొహంజోదరో - హరప్పాల కాలము నాటి జనులు ద్రావిడులనియు - వారి మతము శైవ మనియు చరిత్ర వేత్తల నిర్ణయముగదా! శైవమతా విర్భావమునకు పూర్వమే లింగార్చన మున్నదని మన మూహింపవచ్చును. సృష్టిలోని శివలింగపు పూవును ఏనాడో మానవుడు చూచి యుండును గావునను. యోగాభ్యాసమనునది మన దేశపు జనులలో మొహం జోదరో - హరప్పాలనాటి సంస్కృతికి పూర్వ కాలమునుండియు నున్నదని యూహింపవీలయిన చిహ్నములు దొరకినవి గావునను మీది యూహము నిరాధారముకాదు.

భగవదర్చావిభూతిని వివరింప నుద్దేశించిన యీ వ్యాసము లింగతత్త్వ నిరూపణముతో ప్రారంభమైనది గావున నానావిధ లింగస్వరూపములను, తన్నిర్మాణ రీతులను, తదర్చనోపాసనల ఫలములను మాత్రమే యిందు సంగ్రహముగా వివరింతును.

## ముఖలింగములు

పలు శిల్పాగమ గ్రంథములుగూడ ముఖలింగము లనుగూర్చి ప్రస్తావించి యున్నవి. ఒకటి, మూడు నాలుగు ముఖములుగల శివలింగములు ఐశ్వర్య ప్రదములును వాంఛాఫలసిద్ధిదములును. వీనిని గ్రామాదులయందు ప్రతిష్ఠించి పూజింపవచ్చును. ద్విముఖలింగము శత్రునాశనము చేయును. అందుచే దీనిని కొండలమీదను, అడవులలోను, శత్రురాష్ట్ర ములకు సమీపముననను ప్రతిష్ఠింపవలయునని శాస్త్రాను శాసనము. పంచముఖలింగములను అభిచారిక క్రియల కుపయోగింతురట. షొత్తముమీద ప్రత్యేక ప్రత్యేక

శాస్త్రలక్షణములతోనిర్మితములయిన లింగములు శత్రుజయాది వివిధ ఫలములనిచ్చునని శిల్పశాస్త్రములు చెప్పుచున్నవి. దీని కనుగుణముగనే పురాణములలోని రాజులు కొందరు యా లింగములను ప్రతిష్ఠించి పనికి పూని తత్తత్కార్యసిద్ధిని పొందినట్లు వర్ణనలు కథలు మనము వినుచున్నాము. ఈ ముఖలింగములు హస్తప్రమాణమునుంచి పంచహస్త ప్రమాణము వఱకు నుండవచ్చునని కొన్ని శాస్త్రముల మతము. లింగప్రమాణమునుగూర్చి పెక్కులు మతభేదము లున్నవి. కర్త ననుసరించియు, శిల్పాచార్యు ననుసరించియు, గర్భాలయప్రమాణమును బట్టియు ఈ కొలతలు పలురీతులుగల వగుచున్నవిగాన ఆ విస్తర మిట ప్రస్తావింపను. కోణములనుగూడ ముఖములుగా భావించెడి సంప్రదాయ మొకటి యున్నట్లున్నది. లింగమెన్ని పలకలుగలదిగానున్న అన్ని ముఖములు గలదని చెప్పు నాచార మొకటి కలదు. కంచిలోని కైలాసనాథ దేవాలయములోని కైలాసనాథలింగము పదునాఱు పలకలుగలది. అనగా షోడశాస్రమన్న మాట, దీనిని షోడశముఖ లింగమని అచ్చటివారు చెప్పుదురు. ముఖప్రకల్పనకు పూర్వము కోణములనే ముఖములుగా భావించు నాచారమున్న నుండ వచ్చును.

మదరాసురాష్ట్రములోని గుడిమల్లమను ప్రదేశమున శుంగరాజుల కాలమునాటి శివలింగ మొకటి దొరకినది. ఇది దాదాపు నిలువెత్తు లింగము. ఈ లింగమునం దేకముఖముతో కరచరణాద్యవయవ విశిష్టమైన శివమూర్తి రెండుచేతులుగలది చెక్కబడినది. ఆమూర్తి పాదములక్రింద నొక రాక్షసమూర్తి గూడ తీర్పబడియున్నది. ఇది అపస్మారమూర్తి కావచ్చునేమో! ఈ లింగమునుబట్టి లింగాకృతిలోనే సంపూర్ణ శివమూర్తిని జెక్కు సంప్రదాయముగూడ నొకనాడున్నదని తెలియుచున్నది.

శాకాటకులకాలమున వెలసిన శివాలయములలో ఏకముఖ, చతుర్ముఖ శివలింగములు స్థాపింపబడుచుండెడివి. వీరికాలమున మధ్యభారతదేశములోని అజయఘడ రాజ్యమున స్థాపింపబడిన చతుర్ముఖ శివమూర్తి యొకటి సుందరమైనది లభించినది. ఎల్ఫెంటా గుహలలోగూడ చతుర్ముఖ శివమూర్తి యున్నది. ఇట్టివి ముఖలింగములు క్రమముగా శివమూర్తులుగా పరిణమించె ననుటకు నిదర్శనములు. నిరవయవమగు లింగము నర్చించుటకంటెను సావయవమగు దైవమూర్తి నారాధించుటకు సాధకు లుత్సాహపడుచుండుట సహజమేకదా! లింగములో తత్త్వముమాత్ర ముండ సావయవమూర్తిలో సౌందర్యముతోగూడ తత్వమును రూపుకట్టుచున్నది.

## లింగము మూర్తిత్రయ స్వరూపము

"త్ర్యస్రేఽష్టాస్రకే వృత్తే బ్రహ్మా విష్ణుః శివః క్రమాత్,
దేవతాః సర్వ లింగేషు త్రిఖండేషు విశేషతః."
—శిల్పరత్నం

లింగము యొక్క పొడవును మూడు భాగములు చేయగా మొదటిభాగము బ్రహ్మాంశమనియు, రెండవ భాగము విష్ణ్వంశమనియు, మూడవభాగము శివాంశమనియు శిల్పశాస్త్రములు చెప్పుచున్నవి. వీనిలో బ్రహ్మభాగము చతురస్రముగాను, విష్ణుభాగము అష్టాస్రముగాను, శివభాగము వర్తులముగాను నుండవలయునని కొందఱి మతమును, వరుసగా నాలుగు, ఎనిమిది, పదునాఱు, ముప్పదిరెండు, అఱువదినాల్గు కోణములను దీర్చుచు కడకు వర్తులాకృతిని పొందింపవలయునని కొందఱి మతమునై యున్నది. ఇందు నాలుగు కోణములు గల బ్రహ్మాంశము పాదశిలలో ప్రవేశించును. ఎనిమిది కోణములు గల విష్ణుభాగము పీఠము (పానవట్టము) లో నిముడును. ఇక వర్తులాకృతి గల శివాంశము మాత్రము దృశ్యమై పూజకులకు పూజనీయమగుచున్నది. ఈ విధముగా ఒకే లింగములో త్రిమూర్తులు సమ్మిళితముచేయబడినారు. అఖండ లింగము అఖండ పరమేశ్వరస్వరూపమయినను వ్యష్టితత్వము ననుసరించిచూచిన మూర్తిత్రయా

స్వరూపమందే యిమిడియున్నదని యీ రహస్యము చాటుచున్నది. ఏకతలో ననేకతను, అనేకతలో నైక్యమును, వ్యష్టిలో సమిష్టిని, సమిష్టిలో వ్యష్టిని దర్శింపచేయు యోగ్యత భారతీయ సంస్కృతిలోనే నిబద్ధమైయున్నది. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు సృష్టి స్థితి లయములను కర్మముల కధినాథులైనను సమష్టి తత్వముగా భావింపబడినపుడు సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్త్వ సర్వశక్తిత్వ యుక్తులుగా గూడ వర్ణింపబడక పోలేదు. ఆ దృష్టితోనే యొక్కొక్క పురాణ మొక్కొక దేవుని యాధిక్యమును వర్ణించుచు చరితార్థ మగుచున్నది. ఉత్తమ స్థితికి చేరునప్పటికి వ్యవహారార్థము కల్పితములయిన నానావిధ నామ రూప వికారభేదములు మటుమాయమై తదతీతమగు పరమతత్త్వము మాత్రమే పరమార్థముగా గోచరించుచున్నది. కావుననే కాళిదాస కవీంద్రుడు త్రిమూర్తుల తత్వమును తరతమ భావ భేదరహితముగాను, సమగ్రముగాను దర్శించి వర్ణించినాడు. అతడుశివపారమ్య ప్రియుడైనను కుమారసంభవములో దేవతలు బ్రహ్మను ప్రార్థించు ఘట్టముననను, రఘువంశములో దేవతాకృత విష్ణుస్తోత్ర ఘట్టముననను బ్రహ్మ విష్ణుల సర్వశక్తిమత్త్వాదులకు - పరంధామత్వమునకు లోపము రానీక సర్వోత్కృష్టముగా వర్ణించి తత్వ ద్రష్టయైనాడు. ఇట్టి యుదాహరణములను బట్టి చూచినచో లింగార్చనా మహిమ యెట్టిదో వ్యక్తముకాగలదు లింగపూజ యింత దొడ్డదగుటం బట్టియే సావయవ మూర్తి పూజకన్నను లింగారాధనమే శ్రేష్ఠమని "పూజ్యోహరస్తు సర్వత్ర లింగే పూర్ణార్చనం భవేత్" అని అగ్నిపురాణ మనుచున్నది. ప్రత్యేకముగా శివమూర్తిని గాని, కేశవమూర్తిని గాని పూజించినచో అది ఆ యొక్కొక్కరికే చెల్లును. లింగారాధన మొనర్చినచో సృష్టి స్థిత్యాది ప్రవర్తకమైన సర్వేశ్వరునకు- పరబ్రహ్మమునకు ఆపూజ సమర్పితమగును. కావుననే లింగము సమష్టి తత్త్వమైన పరమేశ్వరునకు, అవ్యక్త పరబ్రహ్మమునకు చిహ్నమని ప్రతిపాదింపబడినది.

## పంచభూతమయలింగములు

భారతదేశములో పంచభూతమయములైన లింగములున్నవి జంబుకేశ్వరములో జలలింగము, కాళహస్తిలో వాయులింగము, కంచిలో పృథ్వీ లింగము, చిదంబరములో ఆకాశలింగము, అరుణాచలము (తిరువణ్ణామలై) లో జ్యోతిర్లింగమును కలవు. కంచిలోని పృథ్వీలింగము ఇసుకతో (సికతామయము) చేయబడినట్టిది. ఇసుక జలస్పర్శచేత వ్రీలిపోవునుగాన దీనికేనాడును అభిషేకముచేయరు. దీనిని సైకతలింగమని యనుచున్నారు చిదంబరములోని ఆకాశలింగము నిరాధారమైన ఆకాశప్రదేశముననే యుండునట ఈ పంచభూతమయ లింగములను నిర్మించుటలో ఎన్నో శిల్పరహస్యాలున్నవని శిల్పకళాభిజ్ఞులు చెప్పుదురు. తన్నిర్మాణ రహస్యములను గాని, ప్రతిష్ఠా రహస్యములను గాని యిచ్చట వివరింపను. జ్యోతిర్లింగము (అగ్ని భూతమయము- తేజఃప్రధానము) ఒక్క అరుణాచలములోనేగాదు. భారతదేశములో నింక పదునొకండు ప్రదేశములలోను గలదట. వానికే ద్వాదశ జ్యోతిర్లింగములని ప్రసిద్ధి. కాశీ విశ్వనాథస్వామియు, శ్రీశైల మల్లికార్జున స్వామియు జ్యోతిర్లింగములే. తెనాలి రామకృష్ణకవి తన పాండురంగ మాహాత్మ్యమున కాశిని వర్ణించుచు "విశ్వేశ్వరజ్యోతిర్లింగ విశుద్ధరత్నఖని" అనినాడు. ఎల్లోరా గుహలకు సమీపమున గూడ ఒక జ్యోతిర్లింగాలయమున్నది. ఇవిగాక పంచలింగము లని కొన్ని ప్రసిద్ధిచెందినవి గలవు. చిదంబరములోనిది మోక్షలింగమనియు, కుంభకోణములోనిది యోగలింగమనియు, శృంగేరిలోనిది భోగలింగమనియు, కేదారక్షేత్రములోనిది ముక్తిలింగమనియు, నేపాళములోనిది వరలింగమనియు కొందఱు సంప్రదాయజ్ఞులు చెప్పుచున్నారు. కొందఱి మతమున కంచిలోనిది యోగలింగమనియు, కాళహస్తిలోనిది ముక్తిలింగమనియు, శ్రీరంగములోనిది భోగలింగమనియు, అరుణాచలములోనిది వరలింగమనియు కలదు. ఈ మతభేదము లెట్లున్నను వివిధ ఫలముల

నిచ్చు నానావిధ లక్షణములు గల లింగములు భారత దేశమునం దేనాడో వెలసినవనుట యూఢి. అమరావతి లోని అమరేశ్వరస్వామిని సహస్రలింగమందురు. ఒకే లింగమున వేయిలింగాకార రేఖలు తీర్చినచో నది సహస్రలింగ మగుచున్నది. శ్రీశైలము, ద్రాక్షా రామము. *కాళేశ్వరము అను తావుల సుప్రసిద్ధము లైన మూడు లింగము లుండుటచే మనదేశమునకు త్రిలింగదేశమని ప్రసిద్ధి గలిగినది. ఇంకను కాళ హస్తి, అమరావతి, భీమారామము మొదలైన తావుల నెన్నో మహిమాఢ్యములైన లింగములు మనకున్నవి. కావున మన తెలుగుగడ్డ లింగారాధనకు పేరుగన్నది.

## నానావిధ లింగములు

లింగములను నిర్మించుటకు నవరత్నములను, శిలను, దారువును, పాదరసమును, బంగారు మున్నగు లోహములను సాధారణముగా నుపయోగింపవచ్చును. మాణిక్యము, స్ఫటికము, పుష్యరాగము విద్రుమము మొదలగువానితో చేయబడిన లింగములు ఆయా రత్నముల పేరులతోడనే స్ఫటికలింగము, విద్రుమ లింగము, ముక్తాలింగము, పద్మరాగలింగము నని పిలువబడును. రత్నమయలింగములను బంగారు పీఠము (పానవట్టము) మీదనే స్థాపింపవలయును. ఇవి సాధారణముగా చలలింగములుగానే యుండును. చలలింగము లాయాతావులకు కదలించుటకును, మెడలోగాని చేతియందుగాని ధరించి త్రిప్పుటకును వీలైనవి. అచలములు దేవాలయాదులందు ప్రతిష్ఠి తము లగునవి. శిలతో లింగమునుజేయు పట్టున శిలాపరీక్ష యవసరము. శిలలలో స్త్రీ, పుం, నపుంసక భేదములున్నవి. కాన పుంశిలతో లింగమును, స్త్రీ శిలతో పానవట్టమును, నపుంసకశిలతో పాదపీఠ మును జేయవలయునని శాస్త్రము చెప్పుచున్నది. ఉత్తముడగు శిల్పాచార్యుడీ శిలాపరీక్షచేసిగాని లింగా దులకు శిలల నెన్నుకొనరాదు. అజ్ఞానముచేగాని అనవకాశముచేగాని నిర్ణీత శిలలను తారుమారు చేసినచో అవి అనిష్టఫలములనే యొసంగును. రత్న ములలో స్త్రీ పుం నపుంసక భేదములు లేవు. రత్న దోషములు వేఱు. కావున ఆయాదోషములులేని నిర్మల రత్నములనే పూజార్థముగాని, ధారణార్థము గాని ఉపయోగింపవలయును. పాదరసము ను మూలికాప్రభావముచేగాని, లోహ సమ్మేళనముచేగాని ఘనీభవింపజేసి లింగములనుజేసి పూజింతురు. ఈ లింగములకు రసలింగములని పేరు. మనుచరిత్రము లోని సిద్ధునివద్ద ఈ రసలింగమున్నదని పెద్దన్నగారు (అనుటయు రసలింగమునిడు తన వ్రువ ప్రేంప సజ్జ దంతపు బరణిన్) చెప్పుచున్నారు ఈరత్నలింగ ములుగాని, రసలింగములుగాని భిన్నభిన్న ఫలముల నిచ్చును. "రత్నలింగస్య పూజాయాం ఫలం ముక్తి ప్రదాయకం" రత్నలింగపూజ మోక్షప్రదమని మాన సారము చెప్పుచున్నది. విజ్ఞులగువారివద్ద తత్ప్రభా వము నెఱింగి ఆ యా రత్న-రసలింగములను పూజకు లర్చింపవలయును.

చందనము, దేవదారువు, జువ్వి, రావి, చంద్ర, మారేడు మున్నగు వృక్షముల కొయ్యలతో దారు మయలింగములను నిర్మింతురు. మృణ్మయలింగముల కంటెను దారుమయలింగములు శ్రేష్ఠములు.

## లోహమయ లింగములు

"సౌవర్ణం రాజితం తామ్రం పైత్తలం కాంస్య మాయసం । సైసకం త్రాపుషంచేతి లోహంబింబం తథాష్టథా" బంగారము, వెండి, రాగి, ఇత్తడి, కంచు, ఇనుము, సీసము, తగరము అను నెనిమిది లోహ ములతోను లింగములను నిర్మింపవచ్చును. ఇట్టివి లోహమయ లింగములని చెప్పబడును. వీనికిగూడ ప్రత్యేక ప్రత్యేక ఫలములుగలవు. ఒక్కొక్క వ్యాధి

* కాళేశ్వర మనగా కాళహస్తి యని కొందఱును, నైజాము రాజ్యములోని కాళేశ్వరమని కొందఱును భావించు చున్నారు. ఈ కాళహస్తిలోనిది వాయులింగము, ముక్తి లింగము నగుటయేకాక స్వయంభూ లింగముగూడనని ప్రసిద్ధి యున్నది.

హరించుట కొక్కొక్క లోహముతో చేసిన లింగము నుపయోగింపవలయును. అట్లే ఒక్కొక్క ఫలమున కొక్కొక్క లోహముతో లింగమును నిర్మింతురు. ధనవంతుడైనను ప్రయోజనమునుబట్టి, ఇనుము, సీసము, రాగి మొదలగు విలువతక్కువ లోహములతో లింగమునుచేసి ఆరాధింపక తప్పదు. మోక్షార్థుల లక్ష్యమే వేఱుగావున వారికన్నియు నారాధ్యములే. అయినను ఫలమిచ్చుటలో మంద మధ్య మోత్తమత్వములు లేకపోలేదు. కనుకనే అగ్ని పురాణము లింగములకుగాని తదితర దేవతాప్రతిమలకుగాని ఉపయోగించెడి ద్రవ్యముల ఫలములను గూర్చి ఇట్లు చెప్పుచున్నది.

"మృణ్మయాద్దారుజే పుణ్యం దారుజాదిష్టకా భవేత్
ఇష్టకోత్థాత్ శైలజేస్యా ద్ధేమాదేరధికం ఫలం."

మట్టి, కొయ్య, ఇటుక (కాల్చినమట్టి - గాజుగూడ దీనిలోనికే చేరును) శిల, బంగారు అను వానితో మూర్తి నిర్మాణముచేసిన వరుసగా నొకదానికంటె నొకటి అధికఫల మిచ్చును. స్వర్ణలింగము స్వర్గాపవర్గ ఫలదము.

## క్షణిక లింగములు

"సైకతం, గోమయం, పైష్టం,
మాన్నం, గౌళం, ఫలాత్మకం
నావనీతం చ లింగాని
త్యజ్యతాం ప్రతివాసరం"

ఇంకను ఇసుక, గోమయము, పిండి, అన్నము, బెల్లము, పండు, వెన్న అను వానితోగూడ లింగములను జేసి యర్చింపవచ్చును. ఇవి చిరకాల ముండవు కాబట్టి ఏనాటి కానాడే పూజానంతరము త్యజింపవలయును. వీనికి జలధాన్యాది వాసక్రియ లుండవు. ఏయేటిలోనో స్నానముచేసిన భక్తుడు అచ్చటి యిసుకతోగాని, మట్టితోగాని, గోమయముతోగాని లింగమును నిర్మించి పూజింపవచ్చును. కాని పూజానంతరము దానిని వదలివేయవలయును. కాశిలో సైకత లింగము నిట్లే పూజింతురు. ఒక పండునుగూడ లింగముగా భావించి పూజింపవచ్చును. వెన్నతోను పిండితోను లింగమునుజేసి యర్చించు నాచారము నేటికిని కొన్ని శైవగృహములందు లేకపోలేదు. ఈ లింగములు తాత్కాలికములు. క్షణికలింగములని వీనికి పేరు.

## అష్టలింగములు

ఇంకను సమకర్ణలింగము, వర్ధమానలింగము, శైవాధిక లింగము (శివాంకము), స్వస్తికలింగము, సర్వతోభద్రలింగము, సార్వదేశికలింగము, ధారా లింగము, ముఖలింగమునని యెనిమిది భేదములతో లింగము లొప్పుచుండును. అందు మొదటి నాల్గును బ్రాహ్మణాది చతుర్వర్ణములవారికిని, తక్కిన నాల్గును ఎల్లవారికిని ఆరాధనీయములు. వ్యాసవిస్తరభీతిచే వాని లక్షణములను వ్రాయనైతిని. ముఖలింగ స్వరూప మిదివఱకే చెప్పబడినది.

సామాన్యముగా లింగము సకలము, నిష్కలము, మిశ్రమునని మఱల మూడు భేదములతో నొప్పుచుండును. ముఖాద్యవయవ విభాగములేక కేవలము వర్తులముగా నుండునది నిష్కలము. కరచరణాద్యవయవ విశిష్టమైనది సకలము. కేవలము ముఖము మాత్రముండి వర్తులముగా నుండునది మిశ్రము. ఇంకను చలము అచలము చలాచలము అను భేదములుగూడ గలవు. జలధాన్యా ద్యధివాసములు చేయించి ఆలయాదులయందు ప్రతిష్ఠింపబడినది అచలలింగము. అచలలింగములకు శిలను, సున్నమును, పాకముచేసిన మట్టిని, కొన్ని వస్తువులు కలిపిన సంకరపదార్థమును ఉపయోగించుటమంచిది. సామాన్య పీఠము మీదనుంచి పూజింపబడునది చల లింగమగును. ఇది రత్నములతో గాని, కొయ్యతో గాని, లోహములతో గాని నిర్మింపబడుట శ్రేష్ఠము. పలురంగులతో గుడ్డమీద గాని ఫలకములమీద గాని చిత్రింపబడునది చలాచలలింగము. ఇందు చిత్రింపబడిన లింగాకృతికి చలనముండదుగావున అచల ధర్మమును, ఆ ఆకారమున కాధారమైన గుడ్డ, కాగి

తము, పలక చలించును గావున చలనధర్మము నుండుటవలన ఇది చలాచలమయినది.

## స్వయంభూలింగములు

కొన్ని లింగములు స్వయముగానే పుట్టియుండును. అట్టివానిని స్వయంభూలింగము లందురు. ఇవి మహామహిమాఢ్యములు. వీనియందు శివశక్తి నిత్యవాసముచేయుటంబట్టి యివి దర్శనస్పర్శనార్చాదులచే అనుత్తమమైన ఫలముల నొసగును. కావున వీని మూలమును గూర్చి విచారించుట హానికరము. ఇవి జర్జరములైయున్నను, కోణములతోనున్నను, కుబ్జములైనను, పొడవుగలవైనను, పలకలవలెనున్నను, వంకరగానున్నను, నానావిధవర్ణాకారములతోనున్నను దోషములేదు. వీనికి శాస్త్రలక్షణము లున్నవా లేవా యనివిచారింపజనదు. ఇవి గిరినద్యబ్ధితీర్థారణ్యములందెచ్చబడినను, ఆలయరహితములుగాని, సహితములు గాని అయినను పూజార్హములే. ఈ స్వయంభూలింగముల శక్తి యమోఘము. కావుననే "స్వయంభువి తథా బాణే ప్యార్షేవా నియమో నహి" స్వయంభూలింగములు, బాణలింగములు, ఆర్షలింగములు శాస్త్రనియమములకు లోబడ నక్కఱలేదని శాస్త్రమే చెప్పుచున్నది.

## బాణలింగములు

మనదేశములో పెక్కు పర్వతములు లింగముల పుట్టుకకు పేరుగాంచినవున్నవి. లింగాద్రి, శ్రీశైలము కాశికాగర్తము, అమరేశ్వరము, కన్యాతీర్థము, మహేంద్రాద్రి నేపాళము, కన్యకాశ్రమము అనునవిలింగములు దొరుకుటకు ప్రసిద్ధమైన క్షేత్రములు. వీనిలో మొదటి నాలుగుతావుల యందును, మూడేసికోట్ల చొప్పునను, తక్కిన నాలుగుప్రదేశము లందును కోటి కోటి చొప్పునను మొత్తము పదునాలుకోట్ల లింగములున్నవని శిల్పరత్నము చెప్పుచున్నది. శ్రీశైలము వెళ్ళినవారు నేటికిని లింగాలగట్టుకు వెళ్ళి లింగములను తెచ్చుచుండుట మనమెఱిగిన విషయమే. ఈతావులలో దొరకు లింగములకు బాణలింగములని పేరు. ఇవిగూడ శాస్త్రప్రమాణములకు లోబడియుండ నక్కఱలేదు. వీనిని పీఠములమీదగాని, ఆలయములలోగాని ప్రతిష్ఠించి పూజింపవచ్చును. ఇవి సర్వులకును భుక్తిముక్తిప్రదములు. ఇంకను నదీసముద్ర పర్వతారణ్యములందు అకృతములై లభించిన లింగములు దేవతలచేతను, మునులచేతను, సిద్ధపురుషులచేతను ప్రతిష్ఠితములైనవి. బాణలింగములవలెనే లక్షణపర్యాలోచనము చేయకుండ పూజింపదగినవే.

లింగముల కొలతలు, ఆకారములు మున్నగు శాస్త్రనియమములు మానవశిల్పులచే చేయబడువానికే వర్తించునుగాని, బాణ-ఆర్ష-సిద్ధ-స్వయంభూలింగములకు వర్తింపనేరవని మఱువజనదు.

ఆదికాలపు పరబ్రహ్మలింగము శివపరమైన పిమ్మట శైవములో వచ్చిన నానాభేదములకును గుఱియై పలు నామరూపములతో విస్తరిల్లినది. పాశుపతము, కాలాముఖము, మహావ్రతము, వామాచారము, భైరవము మొదలగు భేదములు శైవమతములో వచ్చిన పిమ్మటను, శివుడు ఒక పౌరాణికదేవతగా భావింపబడి వివిధకథలు గాథలు బయలుదేఱిన పిమ్మటను నానావిధ లింగస్వరూపములు, గజహామూర్త్యాద్యష్టాదశ మూర్తి భేదములు విస్తరిల్లినవి. వీనియన్నింటను అంతర్లీనమై నామరూపవికారభేదముల కతీతమైన పరబ్రహ్మతత్వమునే లింగములో దర్శించి ఆరాధకులు కృతార్థులు కావలయుననుట మాత్రము రహస్యము-సత్యము. ఏకలింగమునుండి షోడశ, శత, సహస్ర, శతసహస్ర, కోటిలింగములుగా విస్తరించి విశ్వరూపమును దాల్చిన లింగస్వరూపతత్వ సమర్చనాదు లద్భుతావహములుకావా?



# చతుర్మత తత్త్వం - శాంకరాద్వైతం

శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులు

(గతసంచిక తరువాయి)

అయితే బ్రహ్మసూత్రములు అల్పాక్షరములుగా నుండుట వలనను ఏకార్థ ప్రతిపత్తి యావశ్యకమే. కనుకనే 'త్వం' పదములో కించిద్‌జ్ఞత్వ భాగమును, తత్పదములో సర్వజ్ఞత్వభాగమును త్యజించుటవసరమైనది. ఏల? త్వం పదము కించిద్‌జ్ఞుడగు జీవుని దెల్పును. తత్పదము సర్వజ్ఞుడగు బ్రహ్మమును దెల్పును. వీ రుభయులును ఏక విభక్తికములగు తత్, త్వం పదములతో జెప్పబడిరి కనుక అభిన్నులు కాకతప్పదు. కాని వీరి మాటలు- కించిద్‌జ్ఞత్వము, సర్వజ్ఞత్వమును వీరిని అభిన్నులనుగా జేయవలెను. మిథో విరుద్ధములగు కించిద్‌జ్ఞత్వ సర్వజ్ఞత్వములు వీరి నొకటిగానీయక అడ్డుపెట్టును. కించిద్‌జ్ఞుడు సర్వజ్ఞుడు నొకటియగుట కలదా? ఇట్లు తత్, త్వం పదముల వాచ్యార్థమునకు బాధయేర్పడినది. సామానాధికరణ్య వాక్య తాత్పర్యము ఏకార్థ ప్రతిపాదనమే ననుట మరువరాదు. కనుక ఇచట అన్వయము తత్, త్వం పదములకు కుదురలేదు. కనుక లక్షణ చెప్పకతప్పదు. కాని అన్వయానుపపత్తిని బట్టియే యిట లక్షణ యేర్పడుచో నీ రెండు పదములలో నే యొక్క పదమునందో భాగ త్యాగలక్షణ (జహదజహల్లక్షణ) అంగీకరించిననే అన్వయము సరిపడును. (త్వం పదములోని కించిద్‌జ్ఞత్వ భాగమున వదలినచో వట్టి చైతన్యము మాత్రమే మిగులును. అపుడు తత్పద వాచ్యమగు సర్వజ్ఞ చైతన్యముతో నభేదమునకు అనుపపత్తి లేదుకదా! ఇట్లే రెండవ యెడను గూడ గ్రహించవలెను.) కాని లక్షణకు బీజము "కున్తాః ప్రవేశయే" త్యాది స్థలముల ననుసరించి, తాత్పర్యానుపపత్తియే యని సిద్ధాన్తమైనది కనుకను సామానాధికరణ్యవాక్య తాత్పర్య మైక్యప్రతిపాదనము కావునను నిర్విశేష బ్రహ్మ ప్రతిపాదక శ్రుతిబలమును బట్టియు నిట నొక పదమునందు లక్షణ వలన పనినెరవేరదు. అపుడు, సర్వజ్ఞత్వమో లేక కించిద్‌జ్ఞత్వమో యేదో యొక విశేషముతోనే బ్రహ్మము సిద్ధించును. కాని నిర్విశేషాఖండచిత్తు లభింపదు. ఇదికదా శ్రుతి తాత్పర్యము! ఇట్టి నిర్ధర్మక నిర్విశేష బ్రహ్మమాత్ర ప్రతిపాదన తాత్పర్యము నెరవేరుటకై రెండు పదములందును లక్షణ చెప్పవలయును. చెప్పనిచో లక్షణ లేని పదమున సర్వజ్ఞత్వమో, లేక కించిద్‌జ్ఞత్వమో విశేషము ప్రతిపాదింపబడక తప్పదు. అపుడు విశేషణ భేదము వలన భేదమే కాక వాక్యమునం దత్యవసరమగు నఖండార్థతయు గుదురదు. కనుక నిపుడుభయత్ర- రెండు పదములందును (తత్, త్వం) భాగత్యాగలక్షణ చెప్పితీరవలెను. అప్పటికి నిర్ధర్మకము సిద్ధించును. కాని అర్థ సమన్వయము కుదురదు. చిత్, చిత్ అనియే రెండు పదముల యర్థము మిగులును. భిన్నములగు ప్రవృత్తి నిమిత్తములు లేనిదే అర్థములకు సమన్వయములేదుకదా! "ఘటము ఘటము" అనుచోట నర్థముల కన్వయము లేదుకదా! కనుకనే యది వాక్యలక్షణము కలదికాదు. అట్లే ప్రకృతములో కూడ రెండు పదముల యర్థములకును ప్రవృత్తి నిమిత్తభేదములేదు. చిత్త్వము, చిత్త్వము అనేకదా ప్రవృత్తి నిమిత్తములు. అందువలన నా రెండు చిత్తులకును అన్వయము కుదరక వాకృత్వము భగ్నమగును. అందువలన నట పదములందు లక్షణ

యను నీకీతి గొడవయంతయు విడచిపెట్టి ఆమొత్తము "తత్త్వమసి" యను వాక్యమునందే అఖండార్థకత్వ మును కుదుర్చుటకై లక్షణ చెప్పవలెను. అనగా నా మొత్తము వాక్యమే అఖండమగు "చిత్" అను నర్థ మును బోధించునని యంగీకరింపవలెను. లేదా యీ లక్షణాశ్రయణము వలన క్లేశములులేకుండ *ప్రాతి పదికార్థపర మీవాక్యమనియైన నొప్పవలెను. అపుడును "చిత్" అనియే పర్యవసానముకాగా సామానాధికరణ్య లక్షణమగు నేకార్థత అఖం డార్థత సుసంపన్నమగును. కనుకనే పెద్ద లిట్లు చెప్పిరి. ఈ స్థలమునుగూర్చి—"సంసర్గా సంగివాక్యార్థ హేతు తాయా గిరామియం. ఉక్తాఽఖణ్డార్థతా యద్వా తత్రాది కార్థతా" అని.

ఇట్లు నిర్విశేషకూటస్థ ప్రత్యగాత్మచైతన్యమును తత్త్వమస్యాది మహావాక్య చతుష్టయమువలనసరిగా నెఱింగి అనుభవారూఢమొనర్చుకొనుచో నీ ప్రపంచ మాయానివృత్తికల్గును. "భూయశ్చాంతేవిశ్వమాయా నివృత్తిః" అనికదా శ్రుతితెల్పును: జీవులకే మాయా వరణమున్నట్లుగా "అనృతేనహిప్రత్యూఢాః" "ఇన్ద్రో మాయాభిః పురురూప ఈయతే" "మాయాంతు ప్రకృతిం విద్యాత్ మాయినంతు మహేశ్వరం" ఇత్యాది శ్రుతిగణము తెల్పును. దీనికంతకు పర్యవ సానమేమి ? బ్రహ్మమొక్కటియే సత్యము. అది నిర్విశేషకూటస్థ అఖండస్వప్రకాశైకరసచిన్మాత్రము. తద్భిన్నముగా నగుపడు నీ జడప్రపంచమంతయు నసత్యము. మాయ యావరింపగా తాను వేరనిభ్రమ పడునుగాని వాస్తవముగా చిద్రూపుడగు జీవుడుకూడ బ్రహ్మమే—అను త్రిసత్యములను తేలినవి. అయితే అయ్యా! †మహాప్రకాశస్వరూపచైతన్యమగు బ్రహ్మ మును తమోమయియగు మాయ యెట్లావరించును ? అతనికెట్లు భ్రాన్తిగొలుపును? అసలీమాయ యెక్కడ నుండివచ్చినది? అను మూడు ప్రశ్నముల కిపుడవ కాశముకల్గినది.

కాని మొత్తముమీద ఈ మూడు ప్రశ్నములకును సరిగా జవాబు చెప్పవలసివచ్చినచో కష్టమే. ఏమనగా— అనాదికాలమునుండియు నీ ప్రపంచ మును దానికి సంబంధించిన వ్యవహారమును జ్ఞాన విజ్ఞానములను నడచుచునేయున్నవి. కనుక నిపు డెటనుండి యీ మాయ వచ్చిన దన్నచో నెవరెరుగ గల్గుదురు? తెలియదు. ఆ యర్థమే "మాయా" అను పదములో నున్నది. "యా, మా. సా, మాయా"అని వ్యుత్పత్తి. దాని యర్థమేమి ? ఏది లేదో. (మా-లేదు.

---

* ప్రాతిపదికార్థత యనగా—సర్వనామములకు పూర్వబుద్ధివిషయము లగు విశేషములతో నుపలక్షిత మగు ప్రకృ తార్థము వాచ్య మగును. "సరాజ్యం" అనుచోట 'సః' అను పదమునకు ప్రాతిపదికార్థము వ్యక్తి. పూర్వబుద్ధివిషయము లగు విశేషములు రఘువంశము వెనుకటి సర్గలలో జెప్పబడినవి రఘువుం దున్నవి. వానితో గలసి యిచట నీ వ్యక్తి వాచ్య మగును. అట్లే ప్రకృతములో తత్, త్వం పదములు రెండున్నూ ఇదివరలో ఈ ఛాందోగ్య షష్ఠప్రకరణములో వున్న సర్వజ్ఞత్వ, కించిజ్జ్ఞత్వములనే విశేషములతోడి చిత్తును బోధించును. చిత్తు ప్రాతిపదికార్థము. కడమని సర్వనామత్వమువలన అనుబద్ధములు ఉపలక్షణములు. కనుక ప్రాతిపదికార్థత యనగా కించిజ్జ్ఞత్వ సర్వజ్ఞత్వాదికము నంతన వీడి, కేవల "చిత్" అనుదానినే తెల్పుట. అనగా "నిర్విశేష చిత్" అని పర్యావసన్నార్థము.

"నిర్విశేష చితిరేవ కేవలా" అనికదా పెద్దల సూక్తి!

† అవిద్యా వ్యవధానం చ యద్యపి విద్యాస్యభావే పరమాత్మని న సాక్షా దస్తి. తథాపి తత్ప్రతిబింబకల్ప జీవద్వారేణ పరస్మి న్నుచ్యతే. నచైవ మన్యోన్యాశ్రయః. జీవవిభాగాశ్రయా అవిద్యా. అవిద్యాశ్రయ శ్చ జీవవిభాగ ఇతి. బీజాంకురవదనా దిత్వాత్. అత ఏవ కానుద్దిశ్య ఏష ఈశ్వరో మాయామారచయత్యనర్థికాం. ఉద్దేశ్యానాం సర్గాదౌ జీవానామభావాత్. కథం చాత్మానం సంసారిణం వివిధవేదనాభాజం కుర్యా దిత్యాద్యనుయోగో నిరవకాశః నఖల్వాదిమాన్ సంసారః నాప్యాదిమాన విద్యావిభాగః యేనానుయుజ్యేతేతి (౧.౪.౨౨ భామతీ.)

అస్తువా ఽనుపపత్తి రేవ, కార్యకారణయో ర్మాయాత్మకత్వాత్. అనుపపత్తి ర్హి మాయా ముపోద్బలయతి అనుప పద్యమా నార్థత్వా న్మాయాయాః (౧.౪.౨౨ భామతీ.)

తెలివి) దేనినిగూర్చి యెవ్వరికిని ఏమియు దెలియదో అది మాయ యని యర్థము. కడమమతముల వారందరు దీనినిగూర్చి యేదో చెప్పవత్తురు కాని తుదకు సరిగా నిరూపింపజాలక వెలవెలబోదురు కారణమేమి? అసలు నిజముగా నేది యీ సంసార బంధమునకంతకును కారణమో స్పష్టముగా నెవ్వరు నెరుగరు. ఊరక ఊహలుమాత్రమే. అసలీ ప్రపంచము, సంసారము అనునవి ఉన్నవోలేవో కూడ యెరుగరు. ఊరక ఊహలతో గొలువజూతురు. ఈ పదార్థములను మనము బుద్ధితోని వెచ్చించిన కొలదియు వానివాని స్వరూపస్వభావములు సరిగా బోధపడకపోవుటయే కాక చిట్టచివరకు అతిగహనములై గొడగొయ్యి అయిపోవును.

కనుక నవి (వానిసమూహమగు ప్రపంచము) ఇవి, ఇట్లున్నవనుటకు గాని, వాని తీరును కనుగొనుటకు గాని యవకాశములేదు. వానికొకస్వభావమున్నదనినిరూపించుట వీలుగల్గునట్లు వానినితెల్పజాలము.

ఈ యర్థమునే సిద్ధనాగార్జునుడు "బుద్ధ్యావివేచ్యమానాం స్వభావో నావధార్యతే। అతో నిరభిలప్యాస్తే నిస్స్వభావాశ్చ దేశితాః." (లంకావతారసూత్రం) అనెను. దీనికంతకును కారణమేదియను ప్రశ్నమును నట్టిదే. లోకములో నొక కార్యమున కొక కారణముండితీరవలెనను లోకవ్యవహారమునుబట్టి (వాడుకనుబట్టి) మన మీమాటను అనగా-"ఈ ప్రపంచమున కేది కారణము?" అను ప్రశ్నమును అడుగుచున్నాము. కాని వాస్తవమునకు కార్యముగాని కారణముగాని లేదు. దేనియంతట నదియే యేర్పడుచున్నది. దేనియంతట నదియే యున్నది: కారణమంతట కారణము, కార్యమంతట కార్యము నొకదాని కొకటి యెట్టి సంబంధమును లేకయే యున్నవి. లోకులు తమతమ భ్రాన్తివలన కానిసంబంధము నొకదానిని వాని కంటగట్టి కార్యమనియు గారణమనియు బేర్కొనుచున్నారు. కాని యొకదాని కొకటి కారణమునుకాదు. కార్యమును కాదు. బీజ మంకురమునకు గారణమని కదా మన వాడుక; అంకురము బీజము నుండి పుట్టుచుండ గా నెప్పుడైన జూచినారా? మనము చూచితిమా? పోనీ మట్టివిత్తనముయొక్క, వీనికడ నీప్రత్యక్షముపపన్నము కాగలదా? కాజాలదు. కనుక యేకాలమునుండి యెచటనుండి యేది యెట్లువచ్చినదో మనకు తెలియదు. అట్లు తెలియరాకయే ఈ ప్రపంచ భ్రాంతిలోపడి కొట్టుకొనుచున్నాము. "నేను చేయుచున్నాను" "నాదిది" ఇత్యాది రూపమగు లోకవ్యవహారమంతయు స్వాభావికముగానే ప్రవర్తించుచున్నది. (మిథ్యాజ్ఞాన నిమిత్తః....స్వాభావికోయం లోకవ్యవహారః..,శాం. సూ. అధ్యాసభాష్యము.) కనుక నీ మాయనుగూర్చిగాని దాని పనినిగూర్చి గాని మనమేమియు దెలుపజాలము. అది నిజముగా నున్నదా? యనినచో జవాబీయజాలము. (సాచ మాయా న విద్యతే గౌ. కా. అలాత) నిజముగా సంసారబంధమున్నదా? యని యడుగుచో నుత్తరము నుడువలేము. అది అనువర్తించుచున్నదా? అనుచో మన జవాబేలేదు. ఈ ప్రపంచమున్నదా? అది తత్త్వజ్ఞానముచే నివర్తించునా? యని యడిగిన మనకు ఉత్తరములేదు; దక్షిణములేదు. స్వప్నమాయే యథా దృష్టే గంధర్వనగరం యథా తథా విశ్వమిదం దృష్టం..నవిరోధో నచోత్పత్తి ర్నబద్ధో నచ సాధకః। నముముక్షు ర్నవై ముక్తః ఇత్యేషా పరమార్థతా। ప్రపంచో హి నివర్తేత యది విద్యేత కర్హిచిత్" అని గౌడపాదకారికలు తెల్పుచున్నవి.

ప్రపంచమనునదొకటి అసలున్నచో నివర్తించును కాని అసలేది? కావున మనకు తెలియవచ్చునట్లుగా నున్న యీ చిద్విలాసమంతయు మాయ-మిథ్య. సత్యమొక్కటే. అదే బ్రహ్మము. అది నేనేయను తెలివిని సంపాదించినచో నీప్రపంచ మాయయంతయు నివృత్తమగునని యిదివరలోనే తెల్పియుంటిమి. "నేనీ ప్రకృతికన్న వేరు. నే నుదాసీనచైతన్యమును. అనగా శుద్ధబుద్ధముక్త ప్రత్యగాత్మ చైతన్యమును." అను జ్ఞాన ముదయించి పూర్ణనిష్ఠ కుదురుచో నీయింద్రియజాతము సవాసనగా మూలకారణమగు మాయతోగూడ తొలగును. (ఇచట సాంఖ్య

మతపు పరిణామమును గ్రహించునది.) ఇట్లు ప్రకృతి యగు మాయయు చైతన్యమగు పురుషుడును పరస్పరభేదమును గ్రహింపజాలక యొకరి ధర్మముల మరొకరియందారోపించుకొని భ్రాన్తిలోపడి "నేను మగవాడను, నేను బ్రాహ్మణుడను, *"నేను దీని నొనరింపవలెను" అను లోకవ్యవహారము స్వభావసిద్ధముగా ననాదినుండి ప్రవర్తించుచున్నది. ఈ యధ్యాసము అవివేకమూలకమగు మిథ్యాజ్ఞానమువలన నేర్పడినది. ఈ యధ్యాసమెట్లు తొలగును? సహజ కృపాళువగు వేదపురుషుడు "తత్త్వమసి" "అహం బ్రహ్మాస్మి" "అయమాత్మా బ్రహ్మ" "ప్రజ్ఞానం బ్రహ్మ" అను నాల్గువంటి మహావాక్యములతో అద్వితీయాఖండ చైతన్యమొక్కటే సత్యమనియు నీవే ఆ చైతన్యమైన బ్రహ్మమనియు, ఈ ప్రపంచ ప్రతిభాస మొక్కటే నిన్నితోవనుండి తొలగించుచున్నదనియు కనుక "అహం బ్రహ్మ" యని సత్యమైన బ్రహ్మము తానే యను సత్యమును దర్శించుమని తెల్పుచున్నాడు. ఆ దర్శనరూపమగునది "తత్త్వమసి" వాక్యార్థజ్ఞానమే. ఇట్లువ్యాక్యార్థజ్ఞానము దర్శనముగా ఫలింపవలెనన్నచో నా వాక్యార్థమును నిరన్తరమును నిదిధ్యాసన(ధ్యాన)ము నొనర్పవలెననివిధించుచున్నారు. 'ఆత్మా వారేద్రష్టవ్యశ్శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః' అని వేదపురుషుడు.

(సశేషము)

* మమేదం కర్తవ్య మితి మదంశః పురుషోపరాగః బుద్ధేః స్వచ్ఛతయా తత్ప్రతిబింబ దశాత్త్వికః దర్పణస్యేవ ముఖో పరాగః; ఇదమితి విషయోపరాగః ఇన్ద్రియ ప్రణాళికయా పరిణతిభేదః, తాత్త్వికో నిశ్వాసాభిహత దర్పణస్యేవ మలినిమా కర్తవ్యమితి వ్యాపారాంశః - సిద్ధాన్త ముక్తావళీ (సాంఖ్యమతోపన్యాసః).

# శ్రీ పట్టీశ్వర దేవాలయము - పేరూరు

శ్రీ బులుసు వేంకటరమణయ్య

తూర్పుగోదావరిజిల్లాలో ఉన్న పేరూరు విద్వాంసులకు ప్రసిద్ధమైన స్థలం, అదికాకుండా దక్షిణ భారతంలో మద్రాసురాష్ట్రంలో కోయంబుత్తూరునకు ప్రక్కను మూడుమైళ్ళ దూరంలో ఒక దివ్యస్థలం ఉన్నది. ఆప్రాంతాలకు వెళ్ళేవారు తప్పకుండా పేరూరుకువెళ్ళి దేవదర్శనం చేసుకోకుండా రారు!

పేరూరు మతవిషయంలోనూ, చారిత్రకంగానూ, వైజ్ఞానికంగానూ, శిల్పకళావిషయంలోనూ, ప్రాముఖ్యం వహించివున్నది. ఈవిషయం అక్కడి శ్రీ పట్టీశ్వరస్వామివారి దేవాలయాన్నిబట్టి స్పష్టమవుతున్నది.

చరిత్రకు అందని కాలంనుంచికూడా ఈ క్షేత్రం వుంటూ, పేరుప్రతిష్ఠలు గడించివున్నది. ఇక్కడి దేవుడు స్వయం సముద్భూతుడుగాని, ఒకరిచేత ప్రతిష్ఠితుడుకాడు. ఇక్కడి స్థలపురాణంలో ఇలా ఉన్నది—

"పూర్వం ఒకప్పుడు కామధేనువుయొక్క దూడ యిక్కడి పిప్పలవనంలో మేస్తూవుండినది. అది అలా మేస్తూవుండగా దానికాలు ఒకచోట భూమిలోనికి కూరుకొనిపోయి, దానికి ఒక గట్టిపదార్థం తగిలినది. అలా తగలడంవల్ల, ఆ గట్టివస్తువునుంచి రక్తం పొంగి పొర్లి బయటికి వచ్చినది. అక్కడ త్రవ్విచూడగా శివలింగం కానవచ్చినది. తర్వాత అది వున్నచోటనే దేవాలయం ఏర్పడినది."

శైవవాఙ్మయంలో ఇది 'వైప్పుస్థలం' అని ప్రసిద్ధి కెక్కినది. ఏమంటే ఇక్కడి శివుని అప్పరునయనారున్నూ, సుందరనయనారున్నూ, తమతేవారాలలో స్తుతించి ఉన్నారు. అందువల్ల యీక్షేత్రం పరమపవిత్రంగా పరిగణించబడినది. సుందరమూర్తి నయనారు పూజించడం కోసం యీ దేవుని యెదుట నిలిచివున్నపుడు, ఆదేవుడున్నూ, దేవియున్నూ కానరావడంలేదు. వారు కర్షకదంపతుల రూపంలో—ఆ దగ్గరవుండే పొలంలో విత్తనాలు వెదచల్లుతూ వున్నారు. ఈవిషయాన్ని ఆపరమభక్తుడు గ్రహించి, స్తుతించగా, పరమేశ్వరుడు నిజరూపంతో ప్రత్యక్షమయాడు.

ఇక్కడి కనకసభ (బంగారు సభాభవనం) లో - నాట్యభంగిమంలో నటరాజస్వామియొక్క విగ్రహం ఎంతో సుందరంగా ఉన్నది. ఇక్కడ భగవంతుడు గోమునికీ, పట్టిమునికీ, దర్శనం యిచ్చాడు. పట్టిమునికి దర్శనం యివ్వడంవల్లనే యిక్కడి దేవునికి పట్టీశ్వరుడనే పేరు వచ్చి ఉంటును.

పరమపవిత్రమైన యీ స్థలానికి గొప్పతనం దీని ప్రాచీనతవల్లకూడా కలిగి వుండవచ్చును. ఇక్కడి గర్భగృహాన్ని క్రీస్తు శక ప్రారంభంలో సుప్రసిద్ధుడయిన కరికాలచోళుడు కట్టించాడట! తేవారంలో - భక్తాగ్రేసరుడు అప్పరు దీన్ని ప్రశంసించడం బట్టి క్రీ. శ. ఆరవశతాబ్దిలో ఇది ఉన్నత స్థితిలో ఉండినట్లు స్పష్టమగుచున్నది. క్రీ.శ. ఎనిమిదవ శతాబ్దిలో పాండ్యరాజొకడు వచ్చి ఇక్కడ విష్ణుదేవాలయాన్ని నిర్మించాడు. 8 వ శతాబ్దంలో సుందరర్ ఇక్కడికి వచ్చి పరమేశ్వరుని స్తుతించిన స్తోత్రాలు తేవారంలో ఉన్నవి. చోళరాజులు పాలించినకాలంలో - అనగా 11 వ శతాబ్ది 13 వ. శతాబ్దుల నడుమ ఇక్కడ అర్ధమంటపమూ, మహామంటపమూ నిర్మించబడినవి. 14, 15 శతాబ్దులలో హొయిసలరాజులూ, విజయనగరరాజులూ, యిక్కడికివచ్చి దేవుని దర్శించి అనేకంగా కానుకలు సమర్పించారు. 16-వ శతాబ్దంలో విజయనగరప్రభువులైన శ్రీకృష్ణదేవరాయాదులూ, 17-వ శతాబ్దిలోని నాయకరాజులూ ఇక్కడి దేవాలయాన్ని అభివృద్ధి పరచారు. ఇక్కడి కకనసభను మధురరాజ్యాన్నిపాలించిన అలఘాద్రి నాయకుడు నిర్మించాడు.

18-వ శతాబ్దిలో మైసూరు రాజ్యాన్ని స్వాధీనం చేసుకున్న టిప్పుసుల్తాను, ఈ దేవస్థానానికి వుండే యీనాం భూముల్లో సగంవరకూ అపహరించాడు. కాని, తర్వాత ఈస్టిండియా కంపెనీవారి స్వాధీనంలోనికి వచ్చాక, ఆ యినాములు తిరిగీ దేవాలయానికి

దళాలు పడినవి. 18-వ శతాబ్ది నడుమ భాగంలో శ్రీస్వామివారియొక్కయు, అమ్మవారియొక్కయు దేవాలయములు మరమ్మతు చేయబడినవి. ఆ కాలం లోనే అరవైముగ్గురు శైవభక్తుల (నయనార్ల) మంటపము నిర్మింపబడినది. ఈ ఇరవయ్యో శతాబ్దిలో ఇక్కడ కల్యాణమంటపమూ, ముఖమండపమూ నిర్మించబడినవి. గోపురంకూడా మరమ్మతు చేయ బడింది.

చారిత్రకంగా ప్రసిద్ధమైన యీ స్థలాన్ని గురించి 'తేవారం'లో ప్రశంసింపబడడమేకాదు. జానపద వాఙ్మయంలోకూడా ఈ క్షేత్రం ప్రముఖస్థానాన్ని ఆక్రమించుకున్నది. ఇక్కడి శాసనాలనుబట్టిచూస్తే వెయ్యి సంవత్సరాల క్రిందట ఇక్కడ ఎట్టి మర్యాదలు పాటింపబడినదీ, సంప్రదాయాలు ఉండినదీ తెలియగలదు. అరుణగిరినాథులు రచించిన "తిరుప్పుఘల్"లో (500 ఏళ్ళక్రిందట వ్రాయబడినదానిలో) ఇక్కడి దేవాలయపు వివరం ఉన్నది. తమిళభాషలో ఉన్న 'పేరూరు పురాణం' వాఙ్మయంలో ఉత్తమ స్థానాన్ని ఆక్రమించి ఉన్నది. అదేకాకుండా - ఈ క్షేత్రాన్ని గురించి చెప్పే గ్రంథాలు చాలా ఆ వాఙ్మయంలో ఉన్నవి.

ఇక్కడ శ్రీశాంతలింగస్వామి అనే యోగి వుంటూ అహింసా తత్వాన్నిగురించి ఎంతో వాఙ్మయాన్ని సృజించి జనాదరణం పొందారు. ఆయన లింగైక్యం పొందగా - ఆ స్వామిని సమాధిచేసిన చోటనే ఒక పెద్దమఠం నిర్మించబడినది. ఆ మఠం శ్రీ శాంతలింగమఠమనే చెప్పబడుతున్నది. ఇప్పుడు ఆ మఠంలో ఒక సంస్కృత విద్యాలయం నడుపబడుతూ ఉన్నది.

శిల్పవిషయంలో పేరూరు అత్యున్నత స్థానాన్ని ఆక్రమించగలదని చెప్పాలి. ఇక్కడి కనకసభలో ఉన్న విధంగా గొప్ప శిల్పం వేరెక్కడా కానరాదు. ఇక్కడ రెండువరుసల్లో వున్న పది పెద్దస్తంభాల పైని శివునియొక్క లీలలు అత్యద్భుతంగా చెక్కబడి వున్నవి. మంటపంలో కప్పులో నడిమిభాగంలో అనేక దళములతోకూడిన పద్మం ఉన్నది. ఆ మండపంలోని రాతిగొలుసుల శిల్పం చాలా ఆకర్షణీయంగా ఉన్నది. చిన్న స్తంభాలపైని పురాణాలకు సంబంధించిన పెక్కు శిల్పాలు కానవస్తున్నవి. తెప్ప తిరునాళ్ళు జరిపే యిక్కడి కొలను 16 కోణములుకలిగి యున్నది. లోపలికి దిగుటకు అనుకూలంగా మెట్లు అమర్చబడి ఉన్నవి. అక్కడి దారుమయ రథాలపై ఉన్న చెక్కడపు పనులు మిక్కిలి ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నవి. వీటినిచూచి, విదేశీయులైన అమెరికా ఖండవాసులున్నూ ఆశ్చర్యపడ్డారు ఉత్సవ విగ్రహాలు కూడా ఎంతో ఆకర్షణీయంగా ఉన్నవి. ప్రధాన దేవాలయానికి పరిసరాల్లో ఉండే చిన్నచిన్న దేవాలయాల్లోకూడా పెక్కు విలువైన శాసనాలు కానవస్తూ ఉన్నవి. అవి చాలా ప్రాచీనమైనవి కూడా.

పేరూరు పరిసరాలు చాలా ఆకర్షణీయంగా ఉన్నవి. దీని ప్రక్కనే ఉన్న నెయ్యాల్‌నదీతీరంలో కొబ్బరితోపులు దర్శనీయంగా ఉంటాయి. వాటికి - వాటితోచేరివున్న పంటపొలాలు శోభనుకూరుస్తూ ఉన్నవి. ఇక్కడవున్న "పట్టి - వినాయకుని" దేవాలయం స్వరూపంలో చిన్నదయినా చాలా అందంగా ఉంటున్నది. పిప్పలవృక్షంక్రింద - పరమేశ్వరుడు నాట్యం చేసినచోట - ఒక దేవాలయం నెలకొల్పబడినది. అందులో "అరసాంబలవణ" దేవుడు వెలసి ఉన్నాడు.

ఈ పవిత్రక్షేత్రానికి దక్షిణ దిక్కున ఒక దేవాలయమూ, ఉత్తరంవైపున ఒక దేవాలయమూ ఉన్నవి. ఉత్తరంవైపున ఉన్నదానికి ఉత్తరకైలాసమనీ, దక్షిణం వైపున ఉన్నదానికి దక్షిణకైలాసమనిన్నీ పేర్లు. ఇవి రెండున్నూ ప్రధానక్షేత్రానికి రక్షకములుగా ఉన్నవని చెప్పుతూ ఉన్నారు.

ప్రాచీనమైన శిల్పకళ యిక్కడ ఎంత ప్రశస్తమై ఉన్నదో - నవీనమైన చిత్రకళకూడా ఆరీతిగానే మేలయి ఉన్నది. చిదంబరంలో నటరాజస్వామి దేవాలయం ఆవరణలో ఉన్న సుబ్రహ్మణ్యస్వామి గుడిలో ఉన్నట్లుగా ఇక్కడి దేవాలయంలో మండపంలో కప్పుపైనను, ప్రక్కలను పౌరాణికము లయిన చిత్రాలు అనేకములయిన రంగులలో చిత్రింపబడి ఉన్నవి. దేవాలయ గోపురంపై వుండే శిల్పములకు రంగులుపూసి నూతనత్వం కల్పింపబడినవి. ఆ వర్ణములు ఎండలకూ వానలకూ ఏమాత్రమూ చెడిపోక వుండడం ఒక విశేషం!

ఆర్ద్రాదర్శనం ఇక్కడి విశేషపర్వదినం! నాడు చాలామంది భక్తులు ఇక్కడికి వచ్చి స్వామిదర్శనం చేసుకుంటారు.

* * *

# జయదేవకృతి

"కవిరాజరాజు"

(గతసంచిక తరువాయి)

అనుమానంబునఁ జిక్కుకొంటివిగదే
  యబ్జాక్షిరో ! వీడుమా
మనమేవేళను నిన్నె పొందఁదలఁచున్-
  మన్నించునే సుందరీ
గని తావెచ్చట నన్యులం దొదిగి
  ధన్యత్వంబుఁ గాంచంగ మా
నిని ! నన్ గౌఁగిటఁజేర్చి తీర్చుకొనవే
  నీయిష్ట మెట్లట్లుగన్.

అతివా ! నిర్దయ నున్న నీవిపుడు
  చేయన్ జూచితే శిక్ష గా
ఢతమిన్ గౌఁగిట గ్రుచ్చి పేర్చి
  కసిగాట్లంబెట్టి మర్దింపు మూ
ర్జిత కోపం బడఁగున్ ముదంబగును
  గేరింత న్ననున్ దేల్చు దు
ర్మతి కందర్పుని బారినుండి
  దయతో రక్షింపఁగా వేడెదన్.

యువకుల నంటి సర్పమటు
  లుండిన నీ కుటిలంపు భ్రూయుగం
బవిరళ తప్తకామ విష
  మగ్గల మొనటు రేచి పీడగాఁ
దవిలెడు బాధ తీరెడు విధం
  బెది యంచుఁ గనుంగొనంగ నిం
దు వదన ! నీదు మోవిసుధ
  దోఁచును దానికిఁదగ్గ మందుగాన్.

ముగుద ! మనోహరుండయిన
  ముద్దుల కృష్ణుఁడు వచ్చె నిన్నుఁ జూ
డఁగను దనంతఁదా నిదె
  కటాక్షముఁ జిక్కె యడంచుఁ దాప మం
తగ విముఖత్వ మేమి ఫలితంబిడు
  కూడని మౌన మెంతయున్
వగలను మంచె నన్ను విడ
  నాడకు ముచ్చటలాడు వేడుకన్.

కనులా కల్వల శోకపుష్పములెగా
  గండస్థలుల్ మోవిమం
కెన దంతంబులు మల్లెమొగ్గలగు
  ముక్కెయౌను సంపెంగ చ
క్కని నీ మోము పసందు సేవమెయి
  లోకంబున్ జయింపంగఁ గ
ల్గెను రాధామణి ! పుష్పబాణుకడనే
  లేదింతకే ప్రజ్ఞయున్.

కనులు మదాంకముల్ వదన
  కాంతులు కమ్మని యిందుచంద్రికల్
జనుల కగున్ మనోరమము
  చక్కని నీ నడసొంపు రంభలే
యనఁ దగియుండె నౌర తొడ
  లారయ మారునివిండ్లు కన్ బొమల్
గనుఁగొనఁ జిత్రరేఖలు
  విలాసమునం దెవరీడు నీ కిలన్ ?

కరము మనోజ్ఞ వేషపు
 వికాసము నంటిన మాధవుండు సం
బరమున ముద్దుముచ్చటల
 మక్కువఁ జూపి కురంగలోచనన్
ద్వరఁ బొదరింటి సెజ్జకును
 దార్ప విలాసపు సంజవేళలో
నరసి సఖీలలామ ప్రియ
 మారఁగ రాధనుగూర్చి యిట్లనున్.

ముగుద! తలంచుకోగదవె
 ముద్దుల కృష్ణుడు నీదుసఖ్య మ
త్తగ బహుభంగులన్ విలసితంబుగ
 నిన్ బ్రతిమాలి ప్రీతిఁ జెం
దఁగఁ దగురీతి వందన మొనర్చి
 పదంబులనంటి క్రీడ స
ల్పఁగ నిరవైన ప్రబ్బపొద
 పాన్పునఁ బండెను వేగ మేగుమా.

గలగలమంచు మ్రోయఁ జిఱు
 గజ్జెలు నీ జఘనస్థలిన్ నడన్
వలమగు నూపురంబులు
 ఘనంబుగ మ్రోగ ఝుణంఝుణ ధ్వనిన్
జలనము రాజహంసల
 ప్రసక్తిని దూరము బారఁజేయ నిం
పలరఁగ నేఁగి మాధవుని
 యాసలఁ దీర్పఁగ శయ్యఁ జేరుమా!

వినఁగదె రాధికా! మిగుల
 వేడ్కను బిల్చెడి కోకిలంపుఁ గూ
తను దనివార మాధవుని
 దాఁపునఁజేరి వినోదలీల స
ల్పను నినుఁజేర రమ్మనుచుఁ
 బాడుచునుండెను దోడుపాటగా
మన మలరింపసాగె నళి
 మక్కువ దీర్పఁగలెమ్ము పొమ్మికన్.

గాలికిఁ దీఁగలూఁగు నెడఁ
 గన్పడు కెందలిరాకుతీరు కెం
గేలును బోలి రావలెను
 నీ విటు నన్ దనియింపఁగా రతిన్
గోల! యటంచు నిన్ బిలువఁ
 గోరినరీతిని నొప్పెఁ గాన నీ
జాల మిఁకేమి పోలదిఁకఁ
 జయ్యన శౌరిని గూడ నేగుమా!

మదనావేశము ముమ్మరంబయి
 విరామంబేమి లేకుంటచేఁ
గదలుఞా ముత్యములట్లు చెమ్మటలు
 నీ కాయంబు నిండెఞా మనో
రథ మీడేరఁగఁ గృష్ణుఁ డెంతొ
 ముదమారన్ గౌఁగిటఞా జేర్చు నం
చిది సూచించెడు తెల్ప వేడు మిది
 నీ యింపైన పాలిండ్లనే.

తలపడినావు కృష్ణునిఁక
 ధాటిగ మారునిపోరొనర్పఁగాఁ
గలవని నీ సఖుల్ దెలియఁ
 గల్గిరి సిగ్గిల నేల దీరపున్
జలముడుగంగఁ జేసికొని
 సంశయమున్ దిగనాడి మేఖలన్
జెలఁగెడు గజ్జె డిండిమము
 చే నరదంబును బొమ్ము కూడఁగన్.

చెలుల చేతులతోడఁ జేతులు మెలంచి
కంకణంబుల ఘళఘళల్ కదలునిండ
నడల కులుకందమును బొందుపడఁగఁజేయఁ
జేరఁజని మాధవుని పొందుగూడి మనుము.

కనులలరించు కాటుకయుఁ
గర్ణములన్ బువుగుత్తులున్ దలన్
గొనబగు నల్లగల్వలు గనుంగవ
కస్తురి లేపనంబుతో
మన మెరియంగఁజేయు నిను
మక్కువఁ గౌఁగిట గ్రుచ్చి కూడ వం
చనమునఁ జేర్చె నీ పొదకు
సామి తమిన్ మృగశాబలోచనా!

ఈతఁడు చూపు మాయ వగ
లెల్ల నిజంబని నమ్మఁబోకు సం
కేతమునందుఁ జేరు పర
కీయలఁ గూడెడి వాంఛ మెండు ధీ
చాతురిఁ జూపి దాటు హరి
జాగ్రత చీకటిరాత్రి చూడుమిం
దాతని ప్రేమ నాణెమున
కాగునొ లేదొ పరీక్షఁజేయుమా!

ముదమిడు కంఠహారముల
ముంజెయికింగల కంకణాళిపై
పెదవిని నద్దుబాసను
చెవింగల కమ్మల నున్న రత్నముల్
కదలికచేత దీప్తులను
గ్రమ్మిన పూఁబొదముందు చూచి మే
లొదవఁగఁ గాంచి శౌరినిఁ
జలోత్తిగ సిగ్గిలు రాధ కిట్లనెన్.

మెక్కి రసాలపుం గొనలు
మెచ్చగఁ గోకిల కూయ ఘుంకృతుల్
పిక్కటిలంగ భృంగములు
విందగు తేనెను ద్రావు నామెన్
జిక్కని కుంజమందు విర
చించిన మాలతి పూలపాన్పునన్
జక్కఁగఁ బండె శౌరి చని
సత్వర మాతనిఁగూడు రాధికా!

సుదతీ! మాధవుఁ డాత్మలో నిను
వహించు న్నిత్యమున్ సొక్కుచున్
మదనార్తిన్ సుధఁ జిందు నీ యధరబింబం
బానినన్ దేరు మే
లొదవం గౌఁగిటఁ జేరు మొక్కనిముషం
బుప్పొంగ నిష్టంబు తీ
ర్పఁదగున్ భీతిలనేల భక్తులకు
సంపత్కాముఁ డీ శ్రీశుఁడే.

కులుకుచు లోలలోచన
ముకుందుని మోమును గాంచె నోరచూ
పుల నునుసిగ్గుదొంతరలు
మూతలుపెట్టిన తెప్పలెత్తి లోఁ
గల యభిలాష గెంట ఘలు
ఘల్లని యందెలు వేయఁ దాళమున్
వలపుల తీపి రాగమును
బాడ మనోహరుఁ గూడె వేడుకన్.

### ఏకాదశ తరంగము

అనయంబున్ మమకారబద్ధమగు
సత్యానందపు నోమునన్

గన మందస్మిత ముల్లసిల్లఁగను
భోగాపేక్షచే రాధికన్
దనియన్ గన్గొని చంద్రదర్శనముచేతన్
మీది కుప్పొంగసా
గిన సంభ్రంబటు లొప్పు ప్రేమమయుఁడౌ
కృష్ణున్ భజింతున్ మదిన్.

అరుదుగ రాధ ముత్యముల
హారము నిల్పఁగఁ గంఠమందు సా
దరముగఁ దాల్చి శోభిలు
విధంబది నల్లనిమేనిపై మనో
హరమగు నంటి ముత్యముల
యందము ఫేనముతోడ నొప్పు సుం
దరయమునంబలెం బొలుచు
ధన్యుని మాధవుఁ గొల్తు నెమ్మదిన్.

కనఁదగు నీలమేఘపు
వికాసమునన్ దొలుకాడు మేన వి
న్ననువునఁ బట్టు పీతవస
నంబు చెలంగుకతానఁ బుప్పొడిన్
దనరెడు నల్లకల్వవలెఁ
దద్దయు నొప్పి వినోదలీల లిం
పొనరఁగ సల్పు ప్రేమమయు
యోగ్యుని మాధవునిన్ భజించెదన్.

నిలుకడలేక బెక్కుకల
నీటగుచూపుల నిండుతోడ ము
ద్దులొలుకు మోము శోభిలఁగఁ
దోడ్పడఁజేర్పడు క్రీడలందు వే
డ్కలు ననురాగయుక్తమయి
క్రాల శరత్తున నీటఁ బూల ప
ఙ్క్తులను జెలంగు ఖంజముల
జంటనుబోలెడు శౌరి నెన్నెదన్.

దినమణివంటి కుండలపు
దీప్తులతో నలరించి రాధ మో
మును సుధఁజిందు నామె నును
మోవిని జుంబనఁజేసి కాంక్షదీ
రను రతిసల్పువాంఛను
నిరంతరమున్ జిఱునవ్వు మోము నిం
డను జెలువారు శ్రీపతి
ననారతమున్ స్మరియింతు నెమ్మదిన్.

జలదములమధ్య వెలయు వెన్నెలనుబోలి
మింట నలరారు చంద్రునివంటి మంచి
గంధపుంబొట్టు మోమునఁ గలిగి వెలుగు
సుందరాకృతి నొప్పు గోవిందుఁ దలఁతు.

పులకలునిండ మే నదరి
పొంకముఁదప్పఁగఁ జెందుపొందునం
దలయుటచే మనోబల మ
పార్థముగాఁగ ధరించె నట్లు భూ
షల నలరారు దివ్యమణి
సంఘపు దీప్తులతో వెలుంగు మం
జుల శుభవిగ్రహున్ హరిని
జూచి భజించెదు రాధ వేడ్కతోన్.

బాళినిదూలి కోర్కె బల
వంతముచేత నపాంగవీక్షణాం
దోళనఁ జెంది దేనినొ కనుంగొన
వీనులచెంతఁ జేరుచో

హోళినిగూర్చు మాధవుని
    నారయ నశ్రులు జాలువారినన్
గేళిని దేలఁగాఁ జెమట
    నీటమునింగినటయ్యె రాధకున్.

పొదరిలు సేవఁజేయు పువుఁ
    బోడులు వీడఁగఁ గృత్రిమంబుగన్
గదియఁగఁగోరి నవ్వుచును
    గౌఁగిట రాధనుబట్టి శయ్యకున్
మదనుఁడు మెచ్చఁ జేర్చు ప్రియ
    మాధవు మోమును గాంచనోడెఁ బ
య్యెద తొలగంగఁ గుచ్చెళు
    లొకించుక జారఁగ నవ్వ నెచ్చెలుల్.

తదుపరి మెల్లమెల్లఁగను
    దగ్గరకున్జని రాధవక్షమున్
గదియఁగ వక్షమున్ గలిపి
    కౌఁగిటిలోఁ గదియించి బిట్టుగా
నదిమి దిటంపుఁజన్గవ
    ప్రియా! యెదనాటియు వీపుదూసెనం
చదటున మోముద్రిప్పి పెడ
    నారయు కృష్ణుఁడు మమ్ముఁబ్రోఁచెడున్.

అందమునందు మన్మథుని
    యాలినిబోలి యనంగుక్రీడకున్
బొందగు తావుగాఁ దనరు
    ముద్దియ సిస్తగునట్టి రాధ మేల్
డెందమెయౌ ప్రహ్లాదం బట
    ములింగి యురోజసరోజకేళి గో
విందుఁడు సల్పు హంసగను
    పేర్మి నతం డెపు డోము మమ్ములన్.

ద్వాదశ తరంగము

చనఁగ సఖీజనంబు సహ
    జంబగు సిగ్గు బలంబు చూపఁగన్
మనసిజరాగ సక్తతను
    మంజులహా చిఱునవ్వు వాతెఱన్
మొనయఁగ తేఁజిగుళ్ల సుమముల్
    గల పాన్పుసుగాంచి కుల్కు రా
ధనుగని వాసుదేవుఁ డుచితంపు
    రసోక్తులఁ బల్కె నల్లనన్.

కిసలయతల్పమునం దిడు
కుసుమ శరీరంపు రాధ కోమలపదముల్
వసివాడు నెదియొ కని యిం
పెసఁగెడు సుకుమారమైనదిదియనుకొనెదన్.

కొమ్మరో! రప్పించితిని ర
యమ్మున వచ్చితివి నడచి యలపున నెజ్జన్
నెమ్మదిగఁ జాపు పదములఁ
గమ్మిన శ్రమదీర నొత్తఁగడఁగెద రాధా!

వదన మృగాంకునుండి దిగఁ
    బారెడు నీ యమృతంపు వాక్కులన్
మదవతి! ముద్దుముద్దుగ
    వినంబడఁ బల్కుచు విందుగూర్పవే
పొదలెడి నీ యురోజముల
    పూన్కకు నడ్డు పయంట గాన నె
మ్మదిగఁ దొలంగఁ ద్రోయుచుఁ
    దమాషగ నే సుఖియింతు రాధికా!

వలపున వాని కౌఁగిలిడు
    వాంఛను బొందుకతాన మెండుగాఁ

బులకలు నిండఁ గాఁచుకొని
పొంగు మెఱుంగు పసందుఁ జెంద గు
బ్బల తమిదీర నా కఠిన
వక్షమునన్ గదియించితేని నీ
సొలపునఁ దీరు నా బులుపు
సుందరి చూడు సుఖింప వేగమే.

అన్నులమిన్న! తీవ్ర విరహాగ్నిని
వేగుచుఁ దాళఁజాల కా
పన్నతలో విలాస మెడఁబాయ
నెటో నడపీన్గునై సుఖం
బన్నది లేక ప్రాణము గడంటఁగ
దప్పిని దూలితిన్ క్షణం
బన్న గతింతు నిల్పు
మధురామృతపానమొసంగి జీవమున్.

కోకిల కూజితంబులకుఁ
గుంది విషాదముఁజెందియుంటి నే
నా కనరేగ చంద్రవదనా!
రశనన్గల గజ్జె నాదమున్
జోకఁగఁజేసి నీదు మృదు
సూక్తులతో వినిపించు మెంతయున్
నాకదె మేలుగూర్చు శ్రవణంబులకున్
హితవౌచు రాధికా!

కౌగిళులందుఁ బుల్కలు
వికాసపుఁ జూపుల తెప్పపాటు సం
భోగములందు నశ్రుజల
పూరము వాతెఱనంటు వేళలన్
సాగెడు నర్మభాష లపసవ్యము
గాఁ గనిపించుచుండి పెన్

రాగరసంపు సౌఖ్య పరిణామములై
యలరారె నెంతయున్.

కుచగిరులందుఁ జిక్కగను
గ్రుచ్చిన నొక్కులు మోవిరక్తపున్
రచనను పొంపుఁ గాంచునటు
నాటిన కాటులు వీడి తూఁగఁగాఁ
గచమగు కౌఁగిలింతల సు
ఖమ్ముల సద్రతిఁ దేలియాడుచున్
రుచిపరితృప్తిఁ గొన్న హరి
నొవ్వ ననంగు డిఁ కేమి చేసెడున్?

కేరుచు రాధ మాధవుని
గెల్వఁగ సాహసమూని సంకులం
బౌ రతికేళి సంగరను
యత్నమునన్ దలపడ్డ బాహులన్
జారెను శక్తి నిల్చె జఘనంబు
చలించెను వక్ష మక్షలం
జేరెను మూత పౌరుషము
చేడెల కెట్లొనఁగూడు భద్రమై?

నిదురచెడంగ నెఱ్ఱవడె
నేత్రము లింపగు మోవిరక్తిమన్
వదలిచినట్టుగాఁగ మృదు
వక్షము పాటల గోటిముద్ర కా
న్పదపడ కొప్పు వీడఁ బువు
బంతులు రాల రవంత జారి వి
డ్డది మొలనూలు గల్గు చెలి
డాలు ముకుందు నలర్చె వేకువన్.

చెలిక్రీడఁ శ్రమకోడి కాకువుగఁ
దా సీత్కారముఁ జేసి కొఁ
గిలి బిగ్గఁ బిగియించి మోము
తమితోఁ గ్రీఁగంట వీక్షించుచో
గిలిగింతంబడి దంతముల్
గనుపడఁ గేరింతతో నుండ నిం
పొలయఁ వాతెర నొక్కనోచుకొను
నా యుత్సాహి ధన్యాత్ముఁడౌ.

వలపుల రక్తిఁ గూర్చి తన
వశ్యునిగాఁ బ్రియు నండఁజేర్చుకోఁ
గల నెఱజాణ రాధ తమకంబునఁ
గేళినిఁ దూలి చాలఁగా
నలసిన మాధవుఁ గదిసి
యందముచింద నలంకరించుకో
వలె నను వాంఛచేఁ దెలియఁ
బల్కెఁగదా చిఱునవ్వు నవ్వుచుఁ.

ఓ యదునందనా ! నుదుట
నుంచుము కుంకుమ, పూయుమింపుగా
నాయెదఁ జందనంబు,
జఘనంబునకుఁ మొలనూలుగూర్చు, మా
ప్యాయతఁ గొప్పునం దురుము
వల్లరు లందెలు కాళ్ళకుంచి కై
సేయుము కంకణంబులను
జేతుల కన్ను నొనర్చె నట్లుగఁ.

చిందఁగ గానకౌశలము
చిత్తము శ్రీహరి తత్త్వచింతనా
నందవివేకముం గనఁగ
నవ్యవిలాసపుఁ గావ్యలీల లిం
పందఁగఁ బండితుండు కవియౌ
జయదేవుఁడు కూర్చె గీతగో
విందము హర్షమొప్ప సరవిఁ
బరిశోధనఁ జేయఁగఁ బుధుల్.

దేవి రామాంబకును భోజదేవునకును
బుత్రుఁడై నట్టి జయదేవ బుధవరుండు
బంధుయుత పరాశరకంఠ వాక్సరణిని
బాడె గీతగోవిందాష్టపదుల నెలమి.

కనినఁ క్షీరమ నీరసంబు జలమే
కాఠిన్యమౌ శర్కరఁ
దిన ద్రాక్ష సరిపోలఁజాల దెటులఁ
దేనెఁ బసందేమి లే
దన నీడా మృతమైనదేమి
యమృతం బయ్యారె మాకందమా
యెనరాదే యధరంబ నిల్వఁగలవా
యింపైన కావ్యోక్తితోఁ ?

యమునాకూలమునందుఁ గేళితతి
నట్లానందుఁడై రాధదే
హమునందొప్పిన మౌక్తికావళిని
డాయఁవచ్చు రోమావళిఁ
గొమరౌ వేణిగఁ బోల్చి పండ్లని
వెసఁ గుబ్బల్ స్పృశింపఁ వినో
దమునఁ వర్తిలు శౌరిహస్తములు
సంధానించు కళ్యాణముల్.

వందిత భక్తి బోధపరుపఁ
జయదేవుఁడు కూర్చె గీతగో
విందము సంస్కృతంబునఁ
బ్రవీణతతో రచనంపురక్తి కా
నందము నొంది పద్యము
లొనర్చితి పూర్ణముగాఁ బ్రజాళిమె
ప్పందిన నాప్రయాసమున
కయ్యెడె ధన్యతఁగూర్చు నెంతయుఁ

★

# श्रीमद्गांधी गीता

रचयितारः

श्री केशिराजु वेंकट नृसिंह अप्पारायाः

## स्वराज्य योगः

*शिष्यः उवाच :—*

सत्याग्रहस्य सारस्तु स्वार्थत्यागो भवे द्यदि ।
स्वार्थे स्वराज्यरूपे मां नियोजयसि किं प्रभो ॥१

If the essence of Satyagraha is self-sacrifice, why then, O my lord, you engage me in this selfish thing, i. e., Swarajya?

व्यामिश्रेणेव वाक्येन बुद्धिं मोहयसीव मे ।
विविच्य कथ्यतां भूयः संशयापन्नतां विना ॥२

You are, as it were, confusing my mind with your dubious words. Please clarify again leaving no scope for any doubt.

*महात्मा उवाच :—*

स्वराज्य मिति शब्दो हि पवित्रो वेदसम्मतः ।
आत्मशासन मस्यार्थः न तु स्वेच्छानुवर्तनम् ॥३

The word SWARAJ is a sacred word, a Vedic word, meaning self-rule and self-restraint, and not freedom from all restraint which 'independence' often means.

भारतस्यैव मोक्षो मे तृप्तये न भविष्यति ।
तद्द्वारोद्धर्तुमिच्छामि देशान् पाश्चात्यपीडि-
तान् ॥४

My ambition is much higher than independence. Through the deliverance of India, I seek to deliver the so-called weaker races of the Earth from the crushing heels of western exploitation.

प्रबुद्धं च स्वतन्त्रं च भारतं हि भवेद्यदि ।
शांतिसौहृदसंदेशं तत्सलोकाय दास्यति ॥५

An India, awakened and free, has a message of peace and good-will to a groaning world.

स्वयं पाश्चात्यदेशानां पादेषु शरणं गतं ।
कथं मानवसेवार्थ मर्पय त्यात्मनो बलम् ॥६

An India, prostrate at the feet of Europe, can give no hope for humanity.

प्राणधारण सामर्थ्यम् संपाद्य प्रथमं ततः ।
परार्थे ह्यात्मनः प्राणान् समर्पयति सज्जनः ॥७

India must learn to live before she can aspire to die for humanity.

भारतस्य स्वराज्यात्तिर्लोके क्रान्तिं करिष्यति ।
तस्य क्लैब्यं न तस्यैव सर्वलोकस्य हानिकृत् ॥८

India's freedom must revolutionise the world's outlook upon Peace and War. Her importance affects the whole of mankind.

देशीयाद्वा विदेशीयात् शासना न्मुक्ति मिच्छता ।
क्रियमाणो नित्ययत्नः स्वराज्य मिति कथ्यते ॥९

Self-Government means continuous effort to be independent of government

control whether it is foreign government or whether it is national.

दुश्शासन प्रतीकारशक्तिं सर्वा य दाप्नुते ।
तत् स्वराज्यं य देकेषां नाधिपत्याप्तितो भवेत्।। १०

Real SWARAJ will come not by the acquisition of authority by a few, but by the acquisition of the capacity by all to resist authority when it is abused.

सदोषमपि रक्ष्यं हि स्वातन्त्र्यम् सर्वथा क्षितौ ।
सुराज्येन स्वराज्यस्य न स्थानं पूर्यते क्वचित्।। ११

For me, the only training in Swaraj we need is the ability to defend ourselves against the whole world and to live our natural life in perfect freedom eventhough it may be full of defects. Good government is no substitue for self-government.

स्वयत्नेनैव संपाद्यं स्वराज्यं सर्वदा भुवि ।
ईश्वरोऽपि न शक्नोति तद्दातु मिति मे मतिः।। १२

I have had the hardihood to say that Swaraj could not be granted even by God. We would have to earn it ourselves.

मृत्युभीतिपरित्यागः स्वराज्य मिति कथ्यते ।
यद् भीतेन नहि प्राप्यं प्राप्तं चापि न तिष्ठति।। १३

Swaraj is the abandonment of the fear of death. A nation which allows itself to be influenced by the fear of death cannot attain Swaraj and cannot retain it even if somehow attained.

अस्म त्संस्कृति रक्षार्थम् स्वराज्यं कांक्ष्यते मया ।
नव्यसृष्टिं च वांछामि भारतीयत्वमूलकाम् ।। १४

My Swaraj is to keep in tact the genius of our civilisation. I want to write many new things; but they must all be written on the Indian slate.

स्वराज्ये यदि नोद्दिष्टं संस्कृतेः परिरक्षणं ।
शुद्धसंस्कारवत्त्वं च तदा तत् तृणवद् वृथा ।। १५

If Swaraj was not meant to civilize us and to purify and stabilise our civilisation, it would be nothing worth.

---

# मनुष्यः–महर्षिः

आंध्रमूल
रचयितारः
**वड्डुलमूडि गोपालकृष्णार्याः**

संस्कृतीकरण
अनुवादकाः
???

**38**

घासलब्धिः
पशुगणानां
परम तुष्टि-
प्रदा लोके !

अपूपैः सह
सुख भोजनं
विवाहादिषु
सुष्ठु भोजनः
मागळाग्रं

भुक्त्वा भृशं
भोजनप्रिय-
मानवालिः
हृष्टचित्ता
भवति लोके !
विरह पीड़ा-
युत प्रोषित-
भर्तृकाणां
तत्पराणां
सतीनां यदि
प्राणनाथाः
प्रेमपूर्णाः
प्रत्यागताः
भवेयु स्ताः
गात्रपर्व
नेत्रपर्व
भूमिं गतं
स्वर्गसौख्यम्
सहज हृदया-
नंद भोगं
अनुभवंति हि !
कांतिपूर्ण
स्वर्ण भूषण
भूषितः सन्
निस्तुल प्रभ
कौस्तुभोज्ज्वल
हृदय भागः
पाररहित
प्रसन्नत्वं
प्राप्य तुष्यति

पद्मनाभः !
निर्मल नदी
नीर पूरैः
अक्षराणा-
नल्पमन्त्रो-
च्चारणमहो-
च्चाटनैः सं-
भावनीयं
सुपरिपूर्ण
सदभिषेकं
प्राप्य रुद्रः
चिन्मयत्वं
तन्मयत्वं
मन्मयत्वं
महानंदं
समनुभूय
स्वपिति हि सुखं !
एव मेव
कोविदालिः
सत्यशौच
ज्ञानमान
त्यागदान
ध्येय योग
न्यायधर्मान्
सच्चिदानं-
दानुमूर्ति
प्राप्य लभते
सर्वतुष्टिं
महानंदं
भो मनुष्य !
भो मनीषिन् !

## 39

अल्पर्धाभिः
कल्पितानि
जल्पितानि
पापपूर्ण
प्रकथनानि
हृदयव्यथा-
दायकानि
श्रुत्वापि मा
क्षोभंगमः
बुद्धिमान् त्वं
परस्त्रियः
एकांतगाः
गौरवधिया
मातृ बुद्ध्या
भावय सदा
चिंतय सदा
पूजय सदा
कांस्यनिर्मित
कौपीनवान्
चंचलत्वं
मुंच तूर्णं
सद्गुणगणैः
विराजस्व
भो मनुष्य !
भो मनीषिन् !

## 40

मुष्टि परिमित -
मन्न कबलं
अलब्ध्वा क्षुत् -
पीडितोऽपि
कुक्षिदाह
क्षामरक्षो
गोचरोऽपि
त्वं परखे
न कुरु वांछां
परस्वं खलु
शत्रु धूळिः (मृत्यु धूळिः)
तमश्चित्रं
कारासखं
विश्वसिहि भोः
शिलासदृशं
वीटिकामुख
निष्ठीवनं
ज्ञायतां भोः
हृदयकुहरे
वार्यतां भोः
त्यज्यतां भोः
निष्ठीव्यतां
किंचिदपि भोः
उत्तमांगं
न च नम्यतां
ईषदपि भोः
न विचिंत्यतां
वंचनेति च
न हि मन्यतां
भो मनुष्य !
भो मनीषिन् !

# The Thousand Pillared Temple of Hanumakonda

*By*

S. G. KRISHNAMURTHY, D.SC.

This temple was constructed by Kakati Rudra in 1162 A. D. immediately after the series of successes he achieved in battles with the Western Chalukyan governers Domma, Meda, Mailagideva, Choda Bhima and finally against Tailapa the king himself. The plan and construction of this first one of the famous temples of Kakateeyas fully reflects the glory of the occasion that prompted its construction. In size it is bigger than any temple in that region and it adopted the thousand pillared model of construction as well as the trikoota plan, which were the newest modifications in temple building in that century. The Lakshmidevi temple at Doddagaddavalli (1117 A.D.), Kedaresvara at Vanavasi, and Somesvara at Haralhalli had popularised the trikoota model and the Peda Thumbulam Chennakesava Temple (1106 A.D.) brought in the thousand pillared model as well as the raised plinth. Rudra combined all these features into forming the impressive Rudreswaralaya of Hanumakonda, now known as the thousand pillared temple. The trikoota model—that of constructing three temples to face a common square hall or mandapa entered by a flight of steps from the free side—was already employed by a family of Telugu Chodas for Chaaya Someswara temple at Panagal, but the coursing of the stones to construct the walls of the garbhagriha and the vestibule in front of it (known as Antaraala) was horizontal as in the small temples of the Western Chalukyas. Here in Rudreswara, the inner layer of the walls is made by horizontal coursing but the outer one shows a close vertical arrangement of slabs sculptured with pillars in high relief on the outer face. It is these pillars fringing the outer face of the temple alround that made it look like a 'thousand pillared' temple. (I imagine that the space between the walls was filled with mud to help their holding together, but rain through all these countries would have washed it away. Air conditioning the walls is certainly too strange an idea for those times and smaller temples at Alampur clearly show horizontally coursed double walls with mud in between). Raised plinths are characteristic of the famous temples of Khajuraho but the stellate form of the plinth here and the wide perambulatory path zigzagging alround the temple point to Belur Chennakesava temple as the example followed. The smaller floor area of this temple helps to bring its height into prominence and cover up the absence of the shikharas, which is so keenly felt at Belur.

This temple might have had a praakaara with the smaller entrances on the East and North seen even today but is entered mainly through the big square mandapa on the South. The main part of the city is even now to the South of the temple and it is natural that the main entrance is on that side though South-facing of a Hindu temple was rare in these days. The smaller rectangular shrines to the West of the temple probably housed a Sivaacharya superintendent of the temple and the stepped tank in the North-East served to bathe the visitors.

# వైదికయుగము

శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరి

విశ్వమానవ ప్రపంచములో ఒకనాఁడు వైదిక భారతీయుల అఖండనాగరకతకు మూలకందమైనది వైదికయుగమని విదేశ్యులు ఘోషించినందాఁక భారతీయులలో గుర్తించినవా రెందఱో లేరు. భారత జాతికి ప్రత్యేక ప్రాతినిధ్య మిచ్చి సర్వోన్నతస్థితి కాధారమైన వాఙ్మయమే వైదికవాఙ్మయము. వేదములు మొదలు జ్ఞానోపదేశములు గావించిన గ్రంథములన్నియు వైదికకక్ష్యకుఁ జేరినవే. స్పష్టప్రతిపత్తికై వానినే మూఁడు తెగలుగా - ప్రాచీనులు విభజించిరి. వానిలో మొదటివి నాలుగు వేదములు. రెండవతెగలోనివి బ్రాహ్మణములు. మూఁడవతెగ - సూత్రగ్రంథములు. ఇందలి పరస్పర స్వరూపవైలక్షణ్యము- విశిష్టత దిక్సూచిగా సూచించుటయే యీఁదలి ప్రధాన వస్తువు.

స్తోత్రరూపములయిన ఋక్కులే భారతీయుల మొదటి భాండారము. అవి యుండుటఁ జేసియే ఆద్యవేదము ఋగ్వేదమైనది. ఋక్కులు ఛందోనిబద్ధములు. సూక్తములు ఋక్సమూహములు. మంత్రములు సూక్తసమన్వితములు. వేదములు మంత్రోపదేశములు. ఉపదేశము లన్నియు సాక్షాత్తు జ్ఞానోపదేశములే కాదు ; పరోక్షముగా - పరంపరగా ఫలితమిచ్చునవియుఁ గావచ్చును. నాఁటి సాంఘికాచారములు జాతిభేదప్రవృత్తులు పౌరోహిత్యపు దర్పములు నగలు నాణెములు ఉద్యోగ సద్యోగములు మక్కువ పడెడి మ్రొక్కుబడులు సేవించెడి తీర్థములు, పూజించెడి దైవతములు కాంక్షించెడి కాంక్షలు స్పష్టముగా ప్రతిపాదించిన ఘట్టము లెన్నో గలవు. వానిలో గోపరిపాలనము వ్యవసాయ తత్పరత మిక్కిలి ముఖ్యములుగాఁ దోఁచును. దుక్కి దున్నుట - విత్తనములు విత్తుట - ఏటినీటిసాగుబడి- ఆనాఁటికే ప్రసిద్ధములైనవి. సేద్యమున కనువగు నట్టులు నీటిని బాఱించుట నాఁటికే ప్రాఁతబాట. ఆనకట్టలు కట్టి నీటిని నడపించుట నిన్నమొన్న పుట్టినది కాదు. మూఁడువేల యేండ్లనాఁడే సింధునదీ ప్రాంతీయులు చేసి చూపిన పనులని తేలినది. వైదిక భారతీయుల అసాధారణ ప్రతిభను మఱచిపోయిన నేఁటి లోకమునకు - అవి యన్నియు నెవ్వరో - ఇదానీంతనులు సృష్టించి యిచ్చినట్టులు స్ఫురింపవచ్చును.

సామవేదము రెండవది. ఋగ్వేదమునకు సన్నికృష్టమగుటవలన - తక్కినవానిలో నిదియే లెక్కకు ముందుగా వచ్చును. ఇందలి విషయమున కంత ప్రాముఖ్యము లేదందురు. డెబ్బదియైదు మంత్రములు మాత్రమె యిందు - క్రొంగ్రొత్తలు. తక్కినవన్నియు ఋగ్వేదోద్ధృతములే. రాగవిశేషములు గానము చేయఁబడుటలో సామవేదము విశిష్టత వర్ణింతురు. ఆ గానము శ్రవణానంద మగుటచేతనే సామవేదము సార్థకమైనది.

మూఁడవది యజుర్వేదము. ఇది, విధిభాగము - అర్థవాద భాగము, అని రెండు విధములు. శాసించు ఘట్టము మొట్టమొదటిది ; ఇతికర్తవ్యతాబోధకము రెండవది. ఆయా యాగక్రియల కనువగు మంత్రము లుండుటవలన యజుర్వేదమని పేరు వచ్చినది. విశ్వవాఙ్మయములో గద్యరచనకు - ఇదియే మొదటి కేంద్రమని నిర్ణయించిరి.

నాలవది - అధర్వవేదము. దీనికి - అంతగా - ప్రామాణ్య మేర్పడలేదు. ఎన్నో గ్రంథములలో 'త్రయీవిద్య' అనియే వ్యవహారమున్నది. వ్యాధులు శ్వాపదులు యాతుధానులు మాయావులు మున్నగు

వారిని జేర్కొనుచు. వారివారిని-అణఁచుటకై యుపకరించెడి మంత్రములెన్నో అధర్వవేదములో నున్నవి. ఇట్టివానినే - అభిచారకర్మము లందురు. ఇట్టివి యుండుటఁబట్టియు - ఇందలి భాష అర్వాచీనద్యోతకమగుట వలనను - ఈ వేదమున కర్వాచీనత - అప్రామాణ్యము కలిగి యుండవచ్చునని విమర్శకుల సిద్ధాంతము. ప్రామాణికమో అప్రామాణికమోగాని, ఇందలి విశేషములు మిక్కిలి ఆశ్చర్యము కలిగించుచుండును. చరిత్రదృష్టిలోఁ జూచినను మనోహరముగాఁ గానవచ్చును. ఇందు - సంసారసుఖము - శ్రేయస్సు - స్వస్త్యయనము-దీర్ఘాయురారోగ్యములు-గ్రామవాసక్షేమము-వైరప్రశమనము మున్నగువానిని-ఆశంసించెడి మాంగలిక మంత్రము లెన్నియేనియుఁ గలవు. భిషక్కులకు దైవజ్ఞులకు - ఈ వేదము పెట్టని కోట. దాఁచుకొన్న శాశ్వతమగు నిధి. శత్రూత్సాదనోపయుక్తమగు నీ నాలవవేదము బ్రాహ్మణజాతికి పరంపరగా దక్కిన బ్రహ్మాస్త్రము వంటిదని మనుస్మృతి ఘోషించినది. మహాభారతమునాఁటికి దీనికే ప్రాధాన్యమును గొందఱు పాటించుటయుఁ గద్దు. పురోహితులు - అధర్వవేత్తలే కావలయునని-అధర్వవేదీయ బ్రాహ్మణములు - ఉగ్గడించుచున్నవి. ఆ వాక్యములను వినియే అనాఁటి రాజులెల్లరు-అభిచారిక క్రియలలో ఆరితేఱిన అధర్వపండితులకు మాత్రమే పౌరోహిత్య మిచ్చెడివారు. ఆభిచారిక మంత్రములు వివిధ రోగములను ఉపశమింపఁ జేయుననియు భూతప్రేతాదులను - ఆకట్టుననియు ఆనాఁటి గట్టి నమ్మకము. కావుననే జ్వరము - శ్విత్రము - కామల-గండమాల - జలోదరము - రాజయక్ష్మము - నేత్రరోగము - శిరోరోగము - హృద్రోగము మున్నగు రోగములును, తదుపశాన్త్యర్థకములగు సూక్తములును నాలవ వేదములో మెండుగఁ గానవచ్చును. రోగప్రశాంతికి ఔషధములను ముందు వాడి మంత్రములను బ్రయోగించెడివారు. అదియుఁగాక, ఇతర సంహితలలోఁ గన్న-ఇందు 'ఈశ్వరాస్తిత్వవాదము' దృఢపడినది. భారతీయుల నాగరికతాప్రాభవమును బరికింపవలెనన్న - ఈ వేదమే ముఖ్యమైనదని విదేశీయ విద్వాంసుల తీర్పు.

వేదార్థము సుసాధ్యమైనంతదాఁక బ్రాహ్మణములవతరించియుండలేదు. అధ్యాత్మిక విద్యావిషయకమగు ధార్మిక మార్గమును జక్కఁగా జూపుచు బ్రహ్మకు సంబంధించి యుండుటఁజేసి బ్రాహ్మణములైనవి. వేదములు ఛందోబద్ధములుకాఁగా బ్రాహ్మణములు గద్యమయములైనవి. వేదములకు దేవతాభివర్ణనమే ముఖ్యము. బ్రాహ్మణములకు - కర్మస్వరూపనిరూపణమే తాత్పర్యము.

సాంఘిక దృష్టితో సమీక్షించినచో బ్రాహ్మణయుగమే ప్రధానమైనదిగాఁ దోఁచును. అనాఁటికే వర్ణస్థిరీకరణ వైఖరి పురోహితుల చండప్రచండత ప్రబలములై పరిపుష్టి చెందినవి. పౌరోహిత్యవృత్తి సార్వభౌమ ప్రవృత్తికన్న సౌఖ్య సంధాయకమై సర్వజన శ్లాఘ్యమై పరగినది. వైదికముగా - పౌరోహితులు పెట్టినదేభిక్ష, వారి శాసనమే రాజశాసనము; వారి మన్ననయే లాఁతివారి మనుగడకు మూలము.

అవల, బ్రాహ్మణములు శ్రుతులుగా మన్నింపఁబడ్డవి. పదపడి-ఆరణ్యకము లవతరించినవి. వానికిఁ బిదప - ఉపనిషత్తులుద్భవించినవి. ఇవియే విశేషముగ ఆత్మతత్త్వమును వెల్లడించెను. ఈభాగమే బ్రాహ్మణ యుగమున కంతిమసీమ. ఇందలి 'విశ్వేదేవతా వాదమే' రానురాను బరిపుష్టినొంది 'వేదాంతము'గా మాఱినది. దీనినే భారతీయులు 'తత్త్వవిద్య' యని సంభావింతురు.

మూఁడవది సూత్రయుగము. విస్తృతములగు విషయములను సంగ్రహపఱచుటయే సూత్ర గ్రంథముల ప్రవృత్తి. సూత్ర గ్రంథములలోని వాక్యములు తంత్రీవార్తా వాక్యములకన్న సంక్షిప్తములై పోవుటయుఁగద్దు. ఒక్కొక్కయెడ సూత్రములు బీజగణిత సరణిని త్రోసిరాజనును. లోకవ్యవహార ధర్మములలో యాగక్రియా పద్ధతులలో, సూత్ర గ్రంథములలో నొకతెగ ప్రచారము చేసినవి. ఇంకొక్కతెగ,

వేదాంగములైన వ్యాకరణాది భాగములను బోషించినవి. అవియే పాణినీయ తంత్రము మున్నగునవి.

సూత్రయుగములో మధ్యభాగమున జన్మించిన పాణిని మహర్షి లౌకిక భాషకు - ప్రారంభసీమ నేర్పఱచి చూపెను. నాఁటినుండియు నాతని శాసనమే అనుమతించి, యొకే త్రాటిక్రింద లౌకిక సంస్కృత గ్రంథములన్నియు నడువసాగినవి.

ఇవియే వైదిక గ్రంథముల కంతిమసీమ. ఋగ్వేదమునాఁడంకురించిన భారతీయ నాగరకతాద్యోతి, అథర్వవేదమునాఁటి కట్టెపొతగట్టి సూత్రయుగమునాఁటికి ప్రజ్వరిల్లినది. ఆ జ్వాలిక - ఆదీప్తికి జగమంతయు మిఱుమిట్లుగొని నమోనమ యని గారవించెను. అట్టి వైదికములోని నేఁటి వైఖరి యెట్టిదో మఱొకసారి పరిశీలింతము.

## గర్భగుడిముందు పెద్ద 'పాదం' గుర్తులు

కర్నూలుకు 35 మైళ్ళదూరంలో అరణ్య మధ్యంలో నున్న శ్రీ కౌలుట్ల చెన్నకేశవస్వామి ఆలయం గర్భగుడిముందు నిన్న రెండు 'పాదం' గుర్తులు కనుపించాయి. పొడవు 18½ అం., వెడల్పు 7 అం. కోనేటి బురదనుంచి వచ్చినట్లు నిగనిగలాడే మంటితో ఆ పాదపుగుర్తులు కనుపించాయి.

ఇటువంటి సంఘటనే ఒక శతాబ్దం క్రిందట జరిగినట్లు ఆనాటి అర్చకులు చెప్పినారని తెలిసింది. అప్పుడు ఎండిన కోనేటిలో కనుపించినవట. నిన్న సాయంత్రం దేవునికి, పాదములకు, పూజలు జరిగినవి. ఈ క్షేత్రం పౌరాణిక కాలంనాటి కౌండిన్యాశ్రమమని ప్రసిద్ధిగాంచినది.

# శ్రీ వీరబ్రహ్మాష్టకము

శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు

౧

ఎవఁడు శ్రుత్యంతములనెల్ల నేర్పరించి
తెలుఁగు తత్త్వాలలో ప్రబోధించినాఁడొ ;
ఆ త్రయీమూర్తి రుచిర పాదాబ్జసీమఁ
జేరి నటియించుఁగాత నా చిత్తభృంగి.

౨

ఎవనియానతి యవన మహీశులేని
అలరుచెత్తుగా శీర్షములందుఁ దాల్చి
పాలనమొనర్త్రి ధార్మికప్రభుత నెఱపి ;
అట్టి గురునందు నా మనం బలరుఁగాక.

౩

ఆ సనాతనఋషిధర్మమైన శిల్ప
కర్మయోగముఁ బూని నైష్కర్మ్యసిద్ధిఁ
జాటె నే కర్మకుశలుఁ డా సంయమీంద్రుఁ
డొసఁగి ప్రోచుత సత్కర్మయోగదీక్ష.

౪

ఘనతరాష్టాంగ యోగంబు కాలిపోయి
శుష్కవేదాంతమున యోగశూన్యమైన
జగమునకా యోగమార్గ సంస్థాపన మొనర్చు
నర్చుయోగీశ్వరుఁడు శరణమ్ము నాకు.

౫

కులమునకుఁగాక యోగ్యతకును గుణమ్మ
నకును మన్ననయొసఁగి యంత్యజునకేని
ఔపనిషదర్థ పీయూష మందఁజేయు
నట్టి గురుదేవు చరణమ్మ లాశ్రయింతు.

౬

యతులకేగాని ముక్తి, గృహస్థతతికి
నూర మనెడు నపోహముం దొలఁగఁజేసి
గేస్తుధర్మమ్మ ప్రకటించు గృహివరేణ్యుఁ
డెపుడు వసియించుఁగాత నా హృదయపీఠి.

౭

హైందవ మహమ్మదీయ సఖ్యమ్మకొఱకు
సర్వమానవ ధర్మమ్మ చాటిచెప్పి,
ఆలకింపు డమృత పుత్రులందఱన్న
విశ్వధర్మ నిర్ణేత భావింతు నెపుడు.

౮

ఆతఁడు తమోరజస్సుల కవల వెలుఁగు
సత్త్వమూర్తి త్రయీశిరస్సారరూపి
వెలుఁగులకు వెల్గు ప్రణవైకవేద్యమైన
తత్త్వ మా బ్రహ్మగురుఁడు ప్రత్యక్షమగుత.



# శ్రీరామకథాసుధ

కీ. శే. శ్రీ గొబ్బూరు వేంకటానంద రాఘవరావు

(గతసంచిక తరువాయి)

## శివధనుర్భంగము

పిమ్మట రామలక్ష్మణులతో విశ్వామిత్రుడు మిథిల ప్రవేశించెను. జనకమహారాజు తగు విధమున వారి నెదుర్కొని, అర్ఘ్యపాద్యాది విధుల పూజించి సగౌరవముగా విడియించెను. మహర్షి విశ్వామిత్రుడు రామలక్ష్మణులను మహారాజునకు పరిచయము చేసి సీతాస్వయంవరముకొఱకే తాము వచ్చినసంగతి తెలిపెను.

రాజకొమరులు వేలకొలది భుజములు త్రోపులాడ సందడిగా శివధనువు చూడవచ్చిరి. అందొక్కడైనను ధనువును తిలమాత్రమైనను కదల్పశక్తుడు కాకపోయెను. భీతిల్లి బీరువోయేవారూ, కదల్పలేక కళవళించేవారూ, చిక్కులోపడినామని చీకాకుపడేవారూ, నవ్వుపాట్లకు సిగ్గుపడి శిరస్సులు వంచుకొని వెడలిపోయేవారూ - అయి ఆశాభంగముతో అవతలకు పోయేరాజకుమాళ్ళనుచూచి "విల్లెత్తు మగవాడొకడైన ఈ సభలో లేడా? పృథ్వి వీరవిహీనమయ్యెనా? మా సీత పెండ్లిగాక కన్యగా ఉండిపోవలసినదేనా?" అని జనకుని మనస్సు తల్లడ పడెను.

అంతవరకును స్వయవరమందిరమునందు గంభీరముగా గూర్చుండియుండిన శ్రీరాముడు, అపుడు లేచి, గురు విశ్వామిత్రులకు సమస్కరించి, ఆశీస్సుతో అనుజ్ఞగొని, గరుడుడు నాగశిశువును పట్టినట్లు, అవలీలగా వింటి నెత్తి, పట్టుకొని. "మోపెట్టి, గుణంబుపట్టి, ఘన బాహాశక్తితో తీసినన్। దునిగెం జాపము భూరిఘోషమున వార్థుల్ మ్రోయు చందంబునన్."

ఇట్లు ధనువు భంజించి, మృగరాజు ఠీవినిమీరి నిలుచున్న రామునిజూచినంతనే జనకుని మనస్సందేహములన్నీ మానినవి. అతడు అపరిమితానంద భరితుడయ్యెను. జానకి మనస్సును వికసించినది పూర్వజన్మసుకృతమువలన సీతకు అన్నివిధములా తగిన వరుడు లభించెనని బంధుజనులును, పౌరకాంతలును, ఎంతో ముదమందిరి.

జనకమహారాజు దశరథునికి లగ్నపత్రిక పంపించెను. విశ్వామిత్రునివెంట రామలక్ష్మణులు వెళ్ళిన తరువాత వారి క్షేమసమాచారము వినరానందువల్ల, కంగారుపడి దశరథుడు లేఖను చదువుకోక వార్తాహరుల నిట్లు ప్రశ్నింపకడగెను. "దూతలారా! మా రామలక్ష్మణులు క్షేమంగా ఉన్నారా? మీ రెక్కడనుంచి యిలా వచ్చారు? మా చిరంజీవుల్ని మీరు స్వయంగా చూశారా? సుఖంగా ఉన్నారా? జనక పట్నానికి ఎందుకు వెళ్ళినట్లు?" అని పిచ్చివానివలె ప్రశ్న పరంపర కురియించగా వార్తావహులు శాంతముగా సమస్తాంశములు ఎఱుగజెప్పి "ప్రభూ! మీబిడ్డలు క్షేమంగా ఉన్నారు. వారి పెండ్లికి మీరంతా సుఖంగా తర్లిరాగలందులకు శుభలేఖా, లగ్గపత్రికా తెచ్చాము" అని నచ్చచెప్పి సంభ్రమముడిపిరి. అప్పటికి మనస్సు కుదుటపడి దశరథుడు వారు తెచ్చిన లేఖలను, పత్రికను ఆమూలాగ్రముగా చదివించుకొని ఆనందబాష్పములు రాల్చెను. సభికులు, పరివారము, పౌరులు, అందరును పరమ సమ్మోదము నొందిరి. దశరథుడా వార్తావహులను తగువిధమున గౌరవించి, వస్త్ర భూషణాదులు బహుమానమిచ్చి, వివాహము - మాఘ

బహుళ తదియ - ఉత్తర ఫల్గునీ నక్షత్రమునాటికి తరలి వచ్చుచున్నామని ఆమోదపత్రిక నంపెను.

పున్నమనాటి సముద్రమువలె అయోధ్యాపురము శ్రీరాముల కల్యాణ మహోత్సవమునకు ఉప్పొంగి నది. పట్టణమంతా చక్కగా అలంకరింపబడి శోభాయ మానముగా నున్నది. పెండ్లివేడుకలు చూచుటకు కుతూహలపడుచున్న స్త్రీ పురుష లందరిని వెంట గొని దశరథుడు మిథిలకు తరలివచ్చెను. జనకుడును మగపెండ్లివారికి ఎదురు సన్నాహాది ఉత్సవ లాంఛనములు సగౌరవముగా జరిపించి, తోడ్తెచ్చి, తగు విడిదులలో విడియించెను.

## సీతా కల్యాణ మహోత్సవము

అమృతముగా అలంకరింపబడిన కల్యాణ మంటపము చూచుటకు వేయికళ్ళు చాలవనుట నిజము. సీతారాములు మంగళ స్నానములుచేసి, వివాహోచిత వస్త్రాలంకార భూషితులై ఎల్లవారికి నేత్రోత్సవము చేయుచుండిరి. దశరథుని కులగురువు, వసిష్ఠులు, వేదమంత్రములు చదువుచు, అగ్నినారాధించి హోమములు చేయుచుండెను. జనకమహారాజు వరపూజచేసి, శ్రీరాముల కాళ్ళు కడిగి సీతను సాలంకృతముగా మంత్రపూత జలములతో కన్యాదానము చేసి, పాణిగ్రహణము చేయించి,

శ్లో. "ఇయం సీతా మమసుతా సహధర్మచరీ తవ
ప్రతీచ్ఛచైనాం భద్రంతే పాణింగృహ్ణీష్వపాణినా
పతివ్రతా మహాభాగా ఛాయే వానుగతా సదా."

అని శ్రీరామునికిచ్చి వివాహము చేసెను. పిమ్మట సీతారాములు అగ్నిసాక్షిగా, పెద్దలయెదుట 'నాతి చరామి' ప్రమాణములు చేసికొనిరి. "నిన్నుతప్ప పరస్త్రీ నెవ్వతెను చూడను, ముట్టను, చరింపనని" శ్రీరాములును, "మిమ్మునుతప్ప పరపురుషు లెవ్వరితోను చరింప"నని సీతయు ప్రమాణవాక్యములు పలికిరి - నాటినుండి సీతాదేవికి జగత్తంతయు శ్రీరామమయముగాను, శ్రీరామునికి విశ్వము సీతామయముగాను తోచుచుండెను. జనకుని తమ్ముడు, కుశధ్వజుని కూతుల పెండ్లికూడ ఈ పెండ్లితోనే జరిగెను. ఊర్మిళను లక్ష్మణునికిని, మాండవిని భరతునకును శ్రుతకీర్తిని శత్రుఘ్ననకును ఇచ్చి జనకుడు పాణిగ్రహణములు చేయించెను. పిమ్మట కూతులకు గోగజాశ్వ రథాదులను, ధనకనక వస్తువాహన, దాస దాసీజనములను యథోచితముగా సరణము లిచ్చి,

"మా కూతుల దాసులుగా, గైకొని పాలింపుడయ్య కరుణాచ్ఛులు" అని జాలిగొలుపు వాక్యములతో అప్పగింతలు పెట్టి వీడ్కొల్పగా, దశరథుడు కోడండ్రను చూచుకొని, సంతోషముతో మురియుచు, తన రాణులకును, రాణివాసపు ప్రజలకును, పరివారమునకును ఇట్లు కట్టడిచేసెను :

ఉ. "ఇవ్విధి పిన్ననాట పెఱ
యింటికి వచ్చినవారు, వీరి మీ
రెవ్విధి పేర్మిపెంచెదరొ,
యీ జనకక్షితినాథు కూఁతులన్
మవ్వపు ప్రేముడింగనుడు
మన్ననతో కనుఱెప్పలట్టులై."

"కోడళ్ళు, మనయింటికి వచ్చినారు" అని రాసి, రంపానపెట్టి, కోసుకొని తినక, ముద్దుగా, మురిపెముతో మల్లెపూవుల విధమున చూచుకొని, కంటికి ఱెప్పల విధమున కాచి సంరక్షించుకోండి" అని రాణులకు రాజబంధువులకు, పరివారమునకు దశరథుడు ఆజ్ఞాపించెను.

## పరశురాముని రాక

ఇట్లు కొడుకులను కోడండ్రను వెంట తీసికొని, సంతోషముతో నుప్పొంగుచు, దశరథుడుఅయోధ్యకు మరలివచ్చుచుండగా, దారిలో 'మునివేషమును ధరించిన వీరరసమో ౹' అన్నట్లు పరశురాముడు వారికి అడ్డమువచ్చెను. భృగురాముని పేరు విని నంతనే దశరథునికి గర్భనిర్భేదమయ్యెను. ఒడలు వడకెను, శరీరముపై చెమటలు క్రమ్మెను. అల్లంత దూరమునుండి అసూయ గ్రక్కుచు, భార్గవరాము డీవిధముగా బొబ్బలిడుచు రఘురాముని సమీపించుచుండెను :

ఉ. "రాజట ! అంత మీద
మరి రాముడు దానట ! భీకరాజులన్
రాజుల ద్రుంచి, తత్ప్రస్రుత
రక్తమునన్ పితృతర్పణ క్రియల్
రాజిలచేసి యున్న భృగు
రాముడు తుచ్ఛ మదాంధులైన యీ
రాజుల గీజులన్, వెడగు
రాముల గీముల చూచి సైచునే ? !"

ఇట్లు బిగ్గరగా కేకలు వేయుచు, మీదికివచ్చు పరశు రాముని జూచి, "స్వామీ ! మాపై తమకు ఒక్కమా రింతటి ఆగ్రహము రేగుటకు ఏమి తప్పుచేసినాము ?" అని కించిదవహేళనముగా లక్ష్మణుడు ప్రశ్నించెను. "ఏమి తప్పు చేసినారో ఎరుగరా ఏమి ? పాపము! నాకు శస్త్రాస్త్రములు ప్రసాదించిన పరమగురు మహేశ్వరుల చాపము విఱిచి ముక్కలుచేయుట తప్పుకాదా ? అంతకంటె నేరమేమి చేయవలెను ? అని భార్గవరాముడు గర్జించెను. లక్ష్మణుడు, తేలికగా "ఓసి! ఇంతేకదా ? తుక్కువిల్లు ముక్కలుచెయ్యడమే గొప్ప తప్పని తమరు భావిస్తే-భావించ వచ్చునను కొండి ! కాని, "ఆప్రాతవిల్లె తమకు ప్రీతిపాత్రంబైన కబురుపంప, నతుకు, కమ్మరీడు ?" కబురంపి పిలి పించమని సెలవా ? అని లక్ష్మణుడు విరసోక్తిఆడెను. శాంతనిదానములకు నెలవనదగు శ్రీరామమూర్తి విస్తరంగ గంభీర సముద్రమట్లు, చేతులు జోడించి, నిలిచి "స్వామీ ! దోషిని నేను. మీరు చెప్పిన శివ ధనుస్సు విరిచి మీకు సంతాపము గూర్చినవాడను నేను. తమరు నా యెడ-

"కనికరమొనర్తురో, కినుకనె కనబరుతురో, కొట్టదలతురో, కట్టందలతురో, మనుతురో, త్రుంతురో, పనుతురో, ఒనరింపుడు యథేచ్ఛ ! బంటువోలెన్ నిలతున్ !" అని చల్లగ వినయ విధేయతలతో పలికి, పాలపొంగువంటి పరశురాము నుద్రేకమును మాన్పెను. భార్గవుడును పరమశాంతుడై ఇట్లనెను. "ఆదికాలమందు విశ్వకర్మ రెండు విండ్లు తయారుచేసినాడు. అందొకటి, త్రిపురాసురసంహార కాలమునాడు శివునికిచ్చెను. శివుడు దానిని దేవరాతు నింట నిడిచిపెట్టెను. జనకు డాదేవరాతుని వంశము వాడు. బహుకాలము వాడుకలేక ఆ విల్లు తుక్కు నాటెను. మొన్న నీవు విరిచి విఱ్ఱవీగేది ఆ తుక్కు విల్లే. రెండవవిల్లు, విశ్వకర్మ విష్ణుదేవుని కిచ్చినాడు. అదే నా చేతికి వచ్చినది. అదే యిది. దీని నెత్త గలిగితే, నీపస బయటపడుతుంది. ఏదీ ! యిది పట్టుకో చూతాం" అని తనచేతివిల్లు భార్గవుడు రాఘ వుని కందిచ్చెను. లోహములద్వారా విద్యుత్‌శక్తి ప్రవహించునని ఇప్పు డందరకు తెలిసినసత్యమే. అంతవరకు భృగురామునందు గూఢముగా నున్న విష్ణుశక్తి, వింటిద్వారా వెడలి శ్రీ రాముని దేహములో ప్రవేశించెను. దానితో కోరలుతీసిన పామువలె భార్గవుడు నిర్వీర్యుడై చతికిలబడినాడు. గర్వభంగ మైనది.

"ఏమో అనుకొంటిని ! రఘురామా ! నా విల్లు ఎత్తినపుడే నీవు విష్ణుని అవతారమూర్తివని నాకు స్పష్టమైనది. సరి ! ఇక నాపని అయిపోయినది. నా శక్తి నీలో ప్రవేశించినది. ఈ విల్లు ఇక నీచేతిలో ఉండవలసినదే. ఇదే నేను వెళ్ళిపోతున్నాను." అని వెడలిపోయెను. గర్వమునకు భంగపాటు తప్పదని భృగురాముడు మనకు గొప్పపాఠము నేర్పినాడు !



# చతుర్మత తత్త్వం - శాంకరాద్వైతం

శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులు

(గతసంచిక తరువాయి)

అయితే బ్రహ్మ సూత్రములు అల్పాక్షరములుగా నుండుటవల్లను, సూత్రముల విభాగపు సంకేత మేమియు లేకపోవుటవల్లను సూత్రములయందుచాలా వరకును, విషయ వాక్యముల గుర్తులు స్పష్టముగా లేకపోవుటవల్లను వానియభిప్రాయమును స్పష్టముగా నిర్ణయింప వీలుగాకున్నది. ఇంతకన్న నుపనిషత్తులు, గీతలు, ఈ రెండే చాలా సుబోధములుగా నున్నవి. అయినను వేదములు అనంతములు కావున (అనంతా వై వేదాః) వాని యన్నింటి తాత్పర్యమును, అల్పాయువులమును, అల్పశ్రుతులమును, అల్పజ్ఞులము నగు మనకందరకును, దుర్గమముగానుండును. (బిభే త్యల్ప శ్రుతా ద్వేదో మామయం ప్రతరిష్యతి) వాటినంతను క్రోడీకరించిన శ్రీ భగవానుని తాత్పర్యముగూడ మనబోంట్లకు దుర్విజ్ఞేయమే. ఆ సమకాలీకులకు మాత్రమే గీత సుజ్ఞేయముగా నుండెను. వ్యాసుడు శ్రీ భగవానునకు సమకాలికుడు. ఇంకను ఇతరులుకూడ సమకాలికులున్నను* ఆదిమాచార్యుడగు నారాయణునుంచి సంప్రదాయ శుద్ధముగా ఉపనిషద్విజ్ఞానమును సంపాదించిన యాచార్యులు శ్రీ వేదవ్యాసులకన్న నితరులెవ్వరునులేరు. ఎవరైన నింతకుపూర్వము ఉపనిషత్తులను విచారించినను వారుగ్రంథములను రచించినట్లుగా తెలియదు. "సమాచార"మను గ్రంథమొకటి వ్యాసునకు పూర్వమున్నను (స్వాధ్యాయస్య తథాత్వే నహి సమాచారేఽధికారాచ్చ

* కొంతమంది ఈ బ్రహ్మవిద్యకు పరమేశ్వరుడు అనగా పార్వతీపతి ప్రథమాచార్యుడని చెప్పుదురు. అది అయుక్తము. శ్రీ శంకరులు నారాయణునకే గీతా భాష్యములో ఈ వైదిక విద్యా సాంప్రదాయమున ప్రథమాచార్యత్వమును తెల్పిరి కాని, శివునకు గాని, తదితరునకు గాని ఎచ్చటను దెల్పలేదు. అదియుగాక నే నెరిగినంతవరకు శ్రీ శంకర భగవత్పాద సాంప్రదాయమున నెచ్చటను వారి ప్రస్థానత్రయమును (వారి మతమునందు ప్రధానముగా తత్వనిరూపణైక ప్రవృత్తములను) బట్టి శివునకు ఎచ్చటను ఏవిధముగాను కూడ ప్రసక్తి కన్పింపలేదు. వైదిక మార్గమునం దెచ్చటను కూడ పార్వతీపతికి బ్రహ్మవిద్యా ప్రసక్తి గానీ, అసలు పరమేశ్వరత్వము గానీ, ప్రధానపూజ్యత గానీ సంభవింపనేరదు. శ్రీశంకరులా విషయము నెరుగనివారుకారు కనుకనే వారు శ్రీమన్నారాయణుని తదవతారములను శ్రీరామచంద్రుని ఇత్యాది పరమ వైదిక సంపత్సంభావ్యులనే స్మరించిరి కాని, శివునకు ఈ బ్రహ్మవిద్యలో ప్రథమాచార్యత్వ ప్రసక్తి కానీ మరొకటి కానీ వారు తమ ప్రస్థానత్రయమున స్మరింపలేదు. కడమవా రెవరో పాశుపతమైన భస్మ రుద్రాక్ష ధారణమందు అభినివిష్టులు వారికి నారాయణాది ఆచార్యత్వమునందలి ద్వేషము వలన శివునకు ప్రథమాచార్యత్వము గల్పించియుందురు. భస్మ రుద్రాక్షధారణ మెట్లవైదికమో, ఇదియు నట్లే అవైదికము. శ్రీ శంకరు లంగీకరించని దిది. శ్రీశంకరులు ప్రమాణముగా పేర్కొనిన ఉపనిషత్తులం దెచ్చటను కూడ పై విషయములు ఉపాత్తములుకాలేదు. శంకరులు వీనిని పరిగ్రాహ్యములుగా తెలుపలేదు. తరువాత చాలా గ్రంథము లుపనిషత్తులను పేరున వెలసినవి. వానిలో నున్నను శ్రీ శంకరానుపాత్తములను అనంగీకృతములను నిషిద్ధములను నంగీకరించుట శ్రీ శంకర భగవత్పాదానుయాయుల మనుకొనువారికి తగదుకదా! "పత్యురధికరణమున" పాశుపతాగమము, తత్సంబంధియగు ననుష్ఠానము, తదుక్తమగు తత్త్వము ఇవన్నియు సూత్రకారులవలెనే భాష్యకారులగు శ్రీ శంకర భగవత్పాదులు గూడ నిషేధించియున్నారు. ఇది పాశుపతులగు శైవులో లేక శాక్తులో వారివారి సహవాస ప్రాబల్యము వలన వీరి యందు వ్యాపింపజేసియుందురు. వివేకులు ఇంకను పరిశీలింతురుగాక.

సవవచ్చ తన్నియమః 2.3-3) అది వేదవ్రతాదులను గూర్చియు, విద్యాధ్యయనాదులను గూర్చియు మాత్రమే తెలుపునుగాని యాత్మ తత్త్వమునుగూర్చి స్పష్ట పరచినట్టుగా కనుపట్టదు.

ఈపారాశర్య వ్యాసునికన్న పూర్వ మింకను గొంతమంది వేదాంతములగూర్చి విచారించిరి. సూత్రములుగూడ రచించినట్లు కన్పట్టుచున్నది.

అవికూడ హేతు పురస్సరముగా బ్రహ్మత్వ మును నిరూపించినవేనని భగవద్గీతలో భగవానుడు "ఋషిభి ర్బహుధా గీతం ఛందోభిర్వివిధైఃపృథక్, బ్రహ్మసూత్ర పదైశ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః" (భగవద్గీత 13 అ. 14 శ్లో.) అను శ్లోకములో తెలి పెను. ఇపుడు అవి ప్రత్యేకముగా మన కగపడుట లేదు. అవియన్నియు నీవ్యాసుని బ్రహ్మసూత్రము లలోనే యంతర్భవించినవని తోచును. అచ్చటచ్చట వారి పేరులు మాత్రము వ్యాసుని బ్రహ్మసూత్రము లలో వినబడుచున్నవి. ఆ యందరి అభిప్రాయము లును ఈ సూత్రములలోనే క్రోడీకరింపబడినవని తోచును. కనుక నిట్లు సకలసారమగు నీ బ్రహ్మ సూత్రముల ద్వారముగానే మనము, ఉపనిషత్తులు, భగవద్గీతలు, వీటిలో న్యాయపురస్సరముగా ప్రవే శించుటయు వాటి యర్థము నవగత మొనర్చుకొను టయు యుక్తము అని తలచి యాదిశంకరులే మూడు ప్రస్థానములకునుగూడ భాష్యములను రచించిరి.

సకల వేదములు, సకల వేదాన్తములు, భగవద్గీ తలు, బ్రహ్మసూత్రములుకూడ అద్వైతమునే బోధించుచున్నవని అనేక ప్రమాణములతో, అనేక యుక్తులతో నిరూపించిరి. పూర్వ మీమాంసా న్యాయములను ప్రతిపాదించిరి. "విద్వదనుభవ" మును నొక విశిష్ట ప్రమాణముగా స్వీకరించిరి. ఆత్మాద్వైతతత్త్వజ్ఞు లిట విద్వాంసులు. శ్రీశంకర భగవత్పాదులు తమ యద్వైతమత తత్త్వమును వెనుకఁజెప్పిన ప్రస్థానత్రయ* భాష్యములలోనేకాక సనత్సుజాతీయమునకు, విష్ణు సహస్రనామములకు గూడ భాష్యములు వ్రాసి వాటిలోగూడ నిరూపించిరి. వివేకచూడామణి, భజగోవింద స్తోత్రము, మనీషా పంచకము మొదలగు గ్రంథములను రచించిరి. వారు రచించినవని చెప్పుడు గ్రంథములన్నియు వారు రచించినవేయని నమ్మజాలము. ఉదాహరణము నకు సర్వసిద్ధాంత సంగ్రహము - ఇది శంకర రచయితమని ప్రఖ్యాతిగాని శైలీభేదమే కాక ఇతర విషయములు గూడా నిది ఆదిశంకర విరచితము కాదని స్పష్టపరచుచున్నవి. ఇట్లే శ్వేతాశ్వతరో పనిషద్భాష్య విషయమునగూడ పండితులు విప్రతి పన్నులగుచున్నారు. (సశేషము)

---

* బౌద్ధమతమునందు కూడా సూత్ర వినయ అభిధర్మములని ప్రస్థానత్రయమున్నది. సూత్ర ప్రస్థానము, వినయ ప్రస్థానము, అభిధర్మ ప్రస్థానమునని. ఆ త్రోవ ననుసరించియే యీ శాంకరులును ఈ ప్రస్థానత్రయమును కల్పించి యుందురు. బౌద్ధమతముతో స్వల్ప విభేదము తప్ప మిగిలినదంతయు వారి సమాచారమునే వీరును గ్రహింతురు. కనుక వారు ప్రస్థానత్రయమని యేర్పరచుకోగానే వీరుగూడా దీని నేర్పరచియుందురు. ఏమనగా కడమ మతములం దెచ్చటను గూడా ప్రస్థానత్రయమను వాడుకలేదు. వారు కూడ శ్రుతి గీతా సూత్రములను ప్రమాణముగా నంగీకరించువారే అయినను- వారి కీ శబ్దమే వాడుకలేదు. ఇంకొక విచిత్రము కూడ గమనింపవచ్చును. సౌగత మతములో

"సూత్ర వినయాభిధర్మేణ విశుద్ధిం కల్పయంతి యే, గ్రన్థతో నతుచార్థేన నతే నైరాత్మ్య మాశ్రితాః"

అని లంకావతారములో చెప్పినట్లుగా ప్రస్థానత్రయమున కైక్యములేదు. శ్రీ శంకరుల పద్ధతిలోగూడ నీ ప్రస్థాన త్రయమున కైక్యములేకపోవుటయే పరమార్థముగా కనుపడుచున్నది. ఛాందోగ్య షష్ఠప్రపాఠకమును ఉపనిషద్భాష్యములో నొకతీరునను, సూత్రభాష్యములో మరొకతీరునను శ్రీ శంకరులు వివరించుటను బట్టియు పై విషయము ప్రమాణిత మగును. అయినను నిదియంతయు నూహయే. అసలు తత్వమేదియో ప్రస్థానత్రయమని వీరొక్కరే వాడుటలోని రహస్య మేదియో పెద్దలు, తత్వజ్ఞులు తెలుపవలసియుందురు. మాకు ఆవిషయమున నింకను నిస్సంశయముగా తెలియలేదు.

# పుణ్యభూములు - పుణ్యపురుషులు

## 2

జటావల్లభుల పురుషోత్తము .ఎ.

సన్నిధి మాత్రముచేతనే భక్తులను పవిత్రులను చేయగల దివ్యపురుషు లీదేశమున నేటికిని గలరు. పుష్పమునుండి పరిమళము వ్యాపించునట్లు అట్టి మహామహుల అంతఃకరణమునుండి పవిత్ర భావ తరంగములు చుట్టుపట్ల ప్రదేశములకు ప్రవహించు చుండును.

"యథావృక్షస్య సంపుష్పితస్య దూరాద్గంధోవాత్యేవం పుణ్యస్య కర్మణో దూరాద్గంధోవాతి."

(నారాయణోపనిషత్ 11-1)

తిరువణ్ణామలైలో శ్రీ రమణమహర్షి దర్శనము చేసినవారి కిట్టి యనుభవ మగుచుండెను. 1936 వ సంవత్సరమున శ్రీ రాజేంద్రప్రసాదుగారు మహర్షి దర్శనము చేసి బయటకు రాగానే పత్రికావిలేఖకుల ప్రశ్నకు సమాధానముగా నిట్లు చెప్పిరి: "ఒక గంట సేపు నేను మహర్షి సన్నిధినుంటిని. ఆయన నాతో మాట్లాడలేదు. నేనాయనతో మాట్లాడలేదు. కాని ఆ కాలమున నాకు శాంతి, ఆనందము అనుభూతము లైనవి." ప్రస్తుత రచయితకు కూడ మహర్షి సమక్షమున నట్టి యనుభూతి కలిగెను.

మహాపురుష సాంగత్యము పరమపావన మనునది నేటికిని మనదేశమున ప్రత్యక్ష గోచరము. దర్శన స్పర్శనములచే శిష్యుల నుద్ధరింపగల మహాత్ములను గూర్చిన కథలను పురాణములలో మనము చదువుచునే యున్నాము. అవిచ్ఛిన్న సంస్కృతి పరంపరగల యీ దేశములో నట్టి మహానుభావులు ప్రతి కాలములోను నుండుటలో నాశ్చర్యము లేదు. రామకృష్ణ పరమహంస మొట్టమొదటిసారిగా వివేకానందకు దివ్యానుభూతిని గల్గించినరీతి ప్రసిద్ధమైనది. దానిని గురించి శ్రీ వివేకానందయే స్వయముగా నిట్లు చెప్పుకొని యున్నారు: "పరమహంస తన కుడిపాదమును నా శరీరముపై నుంచెను. నేను నేత్రములను తెఱచి చూచుచుండగనే యా మందిరము, సమస్త వస్తువులు గిఱ్ఱున తిరుగ నారంభించినవి. సమస్త దృశ్యము క్షణములో అదృశ్యమాయెను. నాతోబాటు చరాచర ప్రపంచమంతయు లయించి పోవుచున్నట్లు తోచెను...."

కూర్మన్యాయముగా భక్తుల ననుగ్రహించు మహానుభావుల చరిత్రలు మన మతగ్రంథములలో వర్ణింపబడి యున్నవి. తాబేలు తన పిల్లలు దగ్గఱలేనప్పటికిని వానిని తలచుకొనుచో వానికి కడుపునిండును. అట్లే దూరదేశమున కేగిన మహర్షి తన గృహమున పరిచర్య చేయుచున్న శిష్యుని అనుగ్రహ బుద్ధితో తలచుకొనగా నా శిష్యునకు సమస్త విద్యలు కరతలామలకములైనవను నొక కథ ఉపనిషత్తులలో కలదు మన దేశమున ఆధునిక యుగములో కూడ నిట్టి మహానుభావు లున్నారనుట నేటి ప్రపంచములో భారతదేశమునకుగల ఆధ్యాత్మిక విశిష్టతకు ప్రబల నిదర్శనము.

స్వామి వివేకానంద అమెరికాలోనుండగా ఆ దేశస్థు డొక డాయనను విందునకు పిలిచెను. స్వామిజీ వెళ్ళునప్పటి కాతని గదిలో రామకృష్ణ పరమహంస చిత్రపట మొకటి కన్పట్టెను. అది స్వామిజీ కాశ్చర్యమును గల్గించెను. అదివఱ కాదేశములో పరమహంస చిత్రపటములు వ్యాప్తిలో లేవు. ఈ పటము మీ కెట్లు వచ్చినదని స్వామిజీ యాగేస్తు నడిగెను. ఫ్రాంక్ డోరక్ అను పేరుగల యా

అతిథేయు డిట్లు సమాధానము చెప్పెను. "ఈ మహా పురుషుని నేనెన్నడును చూడలేదు. ఈయనను గూర్చి వినియుండలేదు. కాని నా యందలి యను గ్రహముచే నీయన నాకు నిద్ర, మెలకువ కానప్పుడు దర్శనమిచ్చి యాధ్యాత్మికోపదేశముచేసి యదృశ్యు డాయెను. నేను వెంటనే లేచి యా రూపము నీరీతిగా చిత్రించుకొంటిని." భారతదేశములోని సిద్ధపురుషులు ప్రపంచములోని యన్నిప్రాంతములలోను తమ యనుగ్రహమును ప్రసరింపచేసి యాధ్యాత్మిక సౌభాగ్యమును పెంపొందించుచుండు ననుట కిట్టి నిదర్శనములు కలవు. మరి యేదేశమునకును నిట్టి జగద్గురుత్వ వైభవము లేదు.

భగవంతునివలెనే సిద్ధపురుషులు భక్తులకు ఆధ్యాత్మికోత్తేజనమును మాత్రమేకాక ఆర్తి నివారణము గూడ గావింపగలరు. అమెరికాలోని కాలిఫోర్నియా నగరవాసియైన పౌలిన్ నోయే (Paulin Noye) అను వనిత బహురోగపీడితయై వెదకికొనుచు రమణమహర్షి వద్దకు వచ్చెను. ఆమె బాధలన్నియు తొలగి పోయెను.

మహాపురుషులు చూపగల మహిమలు బహు విధములుగా నుండును. మనకిపుడు కావలసినది వారి యాధ్యాత్మిక విశిష్టతమాత్రమే. వారు ప్రపంచ వాసనల నతిక్రమించుటయేకాక అన్నమయ ప్రాణ మయ మనోమయ విజ్ఞానమయానందమయములైన పంచకోశములతో తాదాత్మ్యము చెందక పంచ కోశాంతర్వర్తియైన ఆత్మస్వరూపమును గుర్తించి ద్వంద్వాతీతులై నిత్యానందానుభూతిలో నుందురు. వారు మృత్యువున కతీతులు; ఈ దేహమును విడువ రనికాదు; తమ మరణముపట్లకూడ ద్రష్టృభావమునే కల్గియుందురు. వారు లోకములోని యన్ని విషయము లను చూచుచు నిత్యానందానుభూతిని విడువనట్లే తమ మరణమును కూడ బ్రహ్మానందానుభూతితో కూడియే చూడగల్గుదురు. ఇచ్ఛాపూర్వకముగాకూడ దేహమును విడువగల్గుదురు.

స్వామి వివేకానంద 4-7-1902 తేదీని దేహ త్యాగము చేసెను. కొలది దినములకు పూర్వమే పంచాంగము తెప్పించి యా దివసమువద్ద గుర్తు పెట్టెను. శంకరేంద్రతీర్థస్వామి యను పీఠాధిపతి 10-7-1949 తేదీ రాత్రి 11-30 గంటలకు దేహము త్యజించిరి. ఆ పూర్వదివసముననే వారు "సమాధి చెందుటకు రేపు చాల శుభదివసము" అని తమ శిష్యులకు చెప్పిరి. ఏవిధమైన అస్వస్థతలేక రాత్రి 10 గంటల వఱకు తమ విధులను నిర్వర్తించుకొని వారు తాము ముందుగా చెప్పియుండిన సమయమున దేహత్యాగము చేసిరి.

స్వామి వివేకానంద దేహత్యాగముచేసిననాడే మద్రాసులో రామకృష్ణ మఠమున నిద్రించుచున్న రామకృష్ణానందస్వామికి "నేను శరీరమును ఉమ్మి వైచితిని" అను స్వామిజీ పలుకులు వినబడెను.

ఆధ్యాత్మిక ప్రశాంత వాతావరణమును పశుపక్షుల మీదకుగూడ ప్రసరింపచేయగల మహర్షులీ దేశమున నేనాడో యుండుటయేగాక నవీన యుగములోకూడ కన్పట్టుట ప్రపంచవాసుల కాశ్చర్యము గల్గించు చున్నది. మృగములు, పక్షులు, సర్పములుకూడ రమణమహర్షిని చేరుటయు, ఆయన మాటల నర్థము చేసికొనుటయు తాను స్వయముగా చూచినానని పాల్‌బ్రంటన్ అను ఆంగ్లేయుడు తన గ్రంథములో (A Search in Secret India లో) వ్రాసి యున్నాడు. కేవల భౌతికవాదమును ఖండించుటకు అంతఃకరణమునుండి యిట్లు కొల్లలుగా సత్వగుణ మును పైకి చిలుకు దివ్యపురుషుల యునికి నేడు ప్రబలాధారముగా నున్నది.

ఆధ్యాత్మికోన్నతిని పొందుటకు మహాపురుష సాన్నిధ్యము పుణ్యక్షేత్ర సంసేవనము మిక్కిలిగా తోడ్పడును. పుష్పమునుండి పరిమళము వ్యాపించు నట్లు పుణ్యతరంగములుకూడ సదృశ్యరూపములో చుట్టుపట్లకు ప్రసరించును.

అట్లే పాపప్రదేశములనుండియు పాపులనుండియు పాపతరంగములు వ్యాపించును. కావున పుణ్య

పరిసరములను సేవించుట యెంత ముఖ్యమో పాప పరిసరములను చేరకుండుట యంత ముఖ్యము. పాపులచెంత చేరరాదనుట కొక ప్రబల నిదర్శనము శ్రీ రామకృష్ణ పరమహంస పవిత్ర జీవితములో కలదు. ఒకనాడు పరమహంస ధ్యానములో ప్రవేశింప సంకల్పింపగా నందుల కేదో అడ్డు తగులుచున్న ట్లాయనకు గోచరించెను. తుదకొక మహాపాపాత్ముని సాన్నిధ్యమే యీ యాటంకమునకు కారణమని పరమహంస తన శిష్యులకు చెప్పెను. తనవద్దకు వచ్చినవారి పుణ్యపాపములను వాసనచూచు శక్తి శ్రీ వివేకానంద కుండెను. మనోగతభావములకు, పాపపుణ్యములకు బాహ్యప్రపంచముమీదను, ఇతరుల మనోరంగముమీదను గల్గు ప్రభావమును గుర్తింతు మేని, పుణ్యాత్ములు సంకల్పబలమువలన నెట్టి అద్భుతములను సాధింపగలరో తెలిసికొందుమేని తపశ్శీలురు, యోగులు మున్నగువారి సాన్నిధ్యమును అనుగ్రహమును అమూల్య నిధానములనుగ భావింప గల్గుదుము; వారి యునికియే లోకమునకు మహాభాగ్యమని తెలిసికొందుము. అస్మదాదులము కరచరణాద్యవయవములతో లోకమునకు చేయు నుపకారమును శతగుణముల మించిన యుపకారమును వారు తమ యునికిచేతనే చేయగల్గుదురు.

1947 వ సంవత్సరము ఆగష్టు 15 వ తేదీని భారతదేశమునకు స్వాతంత్ర్యము వచ్చిన సందర్భమున శ్రీ అరవింద యొక ప్రకటనచేయుచు తన జన్మదివసమున స్వరాజ్యమువచ్చుట యాదృచ్ఛిక సంఘటన కాదనియు తనసాధనకు ఫలిత మీసంఘటనలో నున్నందున తన జన్మదివసముతో నిది గూఢమైన సంబంధమును గల్గియున్నదనియు నుడివెను. కొన్ని దశాబ్దములక్రిందటనే క్రియాత్మక రాజకీయములనుండి విరమించిన శ్రీ అరవింద యిట్లు చాటగల్గుటకు కారణ మాయన భౌతికాతీతరంగములో తపస్సంకల్పాదిరూపమున గావించిన సాధనయే కాని మరొకటి కాదు. లోకములో లొల్లుకొనువారే లోకోపకారము చేయుచున్నారనియు, యోగ తపోనుష్ఠానములలో నున్నవారు లోకమున కుపకరించుట లేదనియు భావించుట మహాపురుష దూషణమను పాపమును మూటకట్టుకొనుటయే యగును.

భారతదేశములో పరంపరగా వచ్చుచున్న మతాచారములు, మంత్రయోగతపశ్చర్యలు, ఉపవాసములు, వ్రతములు మున్నగువానివలన నేర్పడిన యాధ్యాత్మిక వాతావరణమే యిట నితరదేశములలోకంటె హెచ్చుమంది జ్ఞానులు, యోగులు, పుణ్యాత్ములు బయలు దేరుటకు కారణమైనది. ఈ వాతావరణమునకు కారణములైన మతవిశ్వాసములను ఆచారములను మూఢత్వముగానే భావించు కొందరు వివేకానందుని "మీదేశములోని పాతబడిపోయిన యాచారములను నిర్మూలించుటకు మీరెందులకు ప్రయత్నింపరు?" అని యడుగగా స్వామిజీ యిట్లు సమాధానము చెప్పెను. "ఫలమునుబట్టి చెట్టుయొక్క గొప్పతనమును నిర్ణయింపవలయునుగదా? మీరు నిరసించుచున్న విగ్రహారాధన సంప్రదాయమునుండి మహాజ్ఞానులు బయలు దేరుచున్నపుడు నేను దాని నెట్లు ఖండింపగలను?" అని శ్రీ వివేకానంద సమాధానము చెప్పెను. సనాతన భారతీయ సంప్రదాయములకును పుణ్యపురుషు లీ దేశమున బయలుదేరుటకును నిట్టిసంబంధము కలదు. దీని కనుగుణముగనే గతశతాబ్దిలో నీ దేశమున బయలుదేరిన మహాజ్ఞానులు, యోగులు ఎల్లరును నిచ్చటి సనాతనమతములోని ఉపాస్యదేవతామూర్తులను, ఆరాధన పద్ధతులను, పుణ్యక్షేత్ర విశేషాదులను, సదాచారములను, వీనిమహిమనుసంపూర్ణముగ నంగీకరించినవారే కాని వీనిని తేలికగా చూచినవారుకారు. ఎంతకాల మీ సనాతన సంప్రదాయము లీ దేశమున నిలచునో యంతకాలము ఇందుండి కొందరైనను మహాయోగులు, తపశ్శీలురు, జ్ఞానులు బయలుదేరుచుందురు.



# హిందీలో భక్తిసాహిత్యం

శ్రీ జి. యస్. రావు, సాహిత్యరత్న

మధ్యయుగమున భారతదేశంలో చెలరేగిన మత వుద్యమాలలో శ్రీ శంకరపాదుల అద్వైతప్రచారం, రామానుజాచార్యులవారి వేదాంత ప్రచారోద్యమం ముఖ్యమైనవి. ఆనాటి వుద్యమ నాయకులలో ముఖ్యులైన మధ్వాచార్యులవారి ఆదర్శాలను లక్ష్యంగా చేసికొని చైతన్యప్రభువు రాధా మాధవ సంప్రదాయాన్ని పురికొల్పాడు. ఆచార్య వల్లభుడు కృష్ణ భక్తి వుద్యమాన్ని లేవదీశాడు. భాగవత యుగంనాడు ప్రారంభమైన కృష్ణభక్తి ప్రచారం ప్రేమ ప్రధానమైందిగా పరిణమించి, ఆత్మచింతనకన్నా విజ్ఞాన సంపదకన్నా ప్రేమభావానికున్న ప్రాధాన్యతను గూర్చి చాటింది. నింబార్కాచార్యులవారు వీటన్నిటికంటె కొంత భిన్నత్వాన్ని చూపుతూ మాధవసంప్రదాయాన్ని స్థాపించాడు.

క్రీ. శ. 15వ శతాబ్దంలో కృష్ణభక్తి సమాజాన్ని గూర్చి జరిగిన ప్రచారకార్యంలో హిందీభాషా ప్రాంతంలో ఎక్కువకృషిసల్పినవాడు వల్లభాచార్యులు. ఆయన తన వేదాంతాన్ని "శుద్ధాద్వైతం" అన్నాడు. భక్తిమార్గాలలో "పుష్టిమార్గ" మన్నాడు. శ్రీకృష్ణుని అనుగ్రహంతో జీవి సచ్చిదానంద స్వరూపాన్ని పొందవచ్చన్నాడు. శంకరాచార్యులవారు బ్రహ్మకు జీవికి మధ్య వున్న మాయా ప్రపంచాన్ని తొలగించాలన్నాడు. కాని వల్లభాచార్యులవారి శుద్ధాద్వైతంలో నవీనమైన ప్రతిపాదన లున్నాయి. బ్రహ్మ ఆవిర్భావ, తిరోభావ శక్తులను కల్గినట్టివాడు. సత్, చిత్, ఆనందం అను త్రిరూపాలు కలవాడు. సృష్టికర్త ఒకసారి జగత్తుగా పరిణమిస్తాడు. ప్రపంచంకంటె భిన్నంగా తన సహజరూపంలో వుండనూ వుంటాడు. తాను ఆవిర్భావ, తిరోభావ స్వరూపాలతో భిన్నంగా గోచరిస్తాడు. జీవిరూపంలో ఆయన సత్, చిత్ రూపాలు ఆవిర్భవించినవి. ఆనందస్వరూపం లోపించింది. జడపదార్థాలలో సత్యతత్త్వం వున్నది. మిగతా రెండు స్వరూపాలు తిరోభవించాయి. శంకరపాదుల సిద్ధాంతాన్ని ఈ విధంగా మార్చివేశాడు. అందుకే "శుద్ధాద్వైత" మన్నాడు.

కృష్ణుడు పరబ్రహ్మ స్వరూపుడు అన్నారు వల్లభులు. దివ్యగుణ సంపన్నుడైనవాడు పురుషోత్తముడు. వైకుంఠం ఆయన లోకం. గోకులం వైకుంఠంలోని ఒక చిన్న ప్రాంతం. గోకులంలో వున్న బృందావనం, యమునానది, గోవర్ధనపర్వతం, యింకా అక్కడున్న పైరుపచ్చలు, చెట్లు చేమలు, రాళ్ళు రప్పలు, ఆలమందలు మొదలైన వాటితో కృష్ణుడు అలక్ష్యభావం కలిగి రాసక్రీడలు చేస్తాడు. ఈ నిత్యజీవన వలయంలో ప్రవేశించిన ప్రతిమానవుడు మోక్షప్రాప్తికి అర్హుడవుతాడు. కాని భగవదనుభూతి, భగవదనుగ్రహం లేనిదే యిదిమాత్రం సాధ్యమా? ఈ భగవదనుగ్రహమే "పుష్టి" అనీ, "పోషణ" అనీ వల్లభాచార్యులవారు పేర్కొన్నారు.

పుష్టి సంప్రదాయంలో ఎందరో తన్మయులైన భక్తులు కావ్యగానం చేసారు. వల్లభాచార్యులవారు వున్న గోవర్ధన పర్వతంపైనున్న మందిరమే కవుల సంఘంగా మారింది. అనంతమైన సాహితీశిల్పం వెలసింది. కోకొల్లలుగా గీతాలు వ్రాయబడినయి. ఆ గీతాలే, ఆవేశపూరితాలైన ఆ పాటలే హిందీ సాహిత్యాన అసంఖ్యాకలైన ఉద్గ్రంథాలుగా రూపొందాయి. ఆ కవుల జీవిత కథలతో కవుల చరిత్రలూ, సాహిత్య చరిత్రలూ నిండిపోయాయి.

ఆచార్యవల్లభుడు సహజంగా తెలుగువాడు. ఆయన తండ్రి లక్ష్మీధర సోమయాజి వుత్తర దేశానికి వెళ్ళి అక్కడే స్థిరపడిపోయాడు. అక్కడే పుట్టి పెరిగిన వల్లభుడు ఒక మహాప్రవర్తకుడై హిందీ సాహిత్యాభివృద్ధికి ఘనమైన సేవలు చేశాడు. ఆయన శిష్యమండలి వ్రాసిన కావ్యాలే ఆనాటి హిందీ సాహిత్యంలో సగానికి ఎక్కువయిన స్థానాన్ని ఆక్రమించింది. ఆయన చేయగలిగిన ఈ సాహితీ సేవ యింకొక వ్యక్తి చేయగలిగినట్లు హిందీ సాహిత్య చరిత్రలో కన్పించదు.

హిందీ సాహిత్యానికి జీవం భక్తికవితా సారస్వతమే. భక్తి సారస్వతంలో రామాయణకథా సంలాప చరిత్రలు పోగా ప్రముఖమైన గ్రంథాలు కృష్ణజీవితానుబంధాలయిన భక్తిగీతాలే. ఇవి ఎన్నో ? ఏమో? వీటిని వ్రాసిన వారంతా వల్లభుని శిష్యకోటిలోనివారే. 'అష్టఛాప్' సాహిత్యచరిత్రలో ఒక మహా అధ్యాయం. అందులోనూ సూరదాసు వ్రాసిన గీతాలు ఆనాటికి, ఈనాటికి, ఉత్తరదేశంలో ముఖ్యంగా వ్రజభాష మాట్లాడే గోకులంలోని జానపద వీథుల్లో మార్మోగుతున్నాయి. ఆ పాటలలో నిండి నిబిడాకృతులైన ఆచార్యులవారి వేదాంత భావపరంపరలు పండిత పామరుల్లో వ్యాపించి వున్నాయి.

ప్రాపంచికమైన బాధలన్నీ మరిచి కృష్ణుణ్ణి సేవించమన్నారు వల్లభాచార్యుల వారు. ప్రాపంచిక మోహాలను విడనాడందే దివ్యత్వం లభించదు. చిదానందస్వరూపుని చూడలేం. ఈ విషయాలన్ని ప్రజల హృదయాలకు హత్తుకు పోవాలి. అందుకే వల్లభుడు గోకులానికి అంత ప్రాధాన్యత యిచ్చాడు. కృష్ణుడు దోగాడిన ప్రాంతమంతా బంగారుతుల్యంగా భావింపబడింది. ఆగోకులంలో విరహతాపంచే తపిస్తున్న గోపికల్లో తానూ లీనమైపోయాడు. గోకులంలో వున్నవారంతా భగవంతుని భక్తులే, కాని యోగవశాత్తు ఒకడు పరమాత్ముని పెంచిన తండ్రి, మరొకడు ఆయనతో ఆడుకుంటూ వుండిన స్నేహితుడు. విభిన్నరూపాలలో ఆయన్ను పూజించేవారు. వారందరి హృదయాల్లోనూ భక్తిభావం పరవళ్ళు త్రొక్కేది.

ఆచార్యులవారు స్థాపించిన ఈ సంప్రదాయాన్ని క్రమంగా ఆయన పుత్రుడు గోస్వామి విఠలదాసు వృద్ధిలోకి తీసుకవచ్చాడు. విఠల్‌నాథ్ వ్రజభాషలో వ్రాసిన "దోసౌ బావన్ వైష్ణవన్‌కీ వార్తా" అన్న గ్రంథంలో తనకు 252 మంది శిష్యు లున్నట్లు వ్రాశాడు. వల్లభుని శిష్యకోటివారు వల్లభుల మరణానంతరం విఠలదాసుని అనుసరించారు. యిందులో దిగ్దంతులయిన ఎనిమిదిమంది కవులున్నారు. వారే 'అష్ట ఛాప్' అని ప్రతిష్ఠ బడిశారు. వీరికావ్యం వాత్సల్య రసభరితం. వీరి సంపూర్ణ జీవన తపోఫలమంతా గీతసాహిత్యానికే అంకితమైంది. విజయనగర సామ్రాజ్యకాలంలో తెలుగుభాషలో అష్ట దిగ్గజాలు అపూర్వమైన కావ్యాలను సృష్టించారు. తెలుగునాట రంగులు వేశారు. హిందీకవితా సారస్వతాన ఈ 'అష్ట ఛాప్' కృష్ణ జీవితంలోని మధుర సన్నివేశాలను పాటలుగాపాడి చిరస్థాయిగా ఒక నూతనాధ్యాయానికి పునాదులు వేశింది. వారి గానాలాపనయే ఒక ఉత్కృష్ట కావ్యం. వారి పరిచయమే ఈ వ్యాసానికి సారాంశం.

1. *సూరదాసు:* సూరదాసు ఆగ్రా నగరానికి ప్రక్కగావున్న "రేణుకా" గ్రామంలో క్రీ. శ. 1483 సంవత్సరంలో జన్మించాడు. ఆయన తల్లిదండ్రులు బీదస్థితిలోవుండి సూరదాసుకు అనువైన విద్యా సౌకర్యాలు చేకూర్చలేదు. కాని సహజ ప్రతిభ కలవానికి శాస్త్ర విద్యలతో నిమిత్తమేముంది ? సూరదాసు జన్మాంధుడని ప్రతీతి. ఒకనాడాయన దారితప్పి బావిలో పడిపోగా శ్రీకృష్ణుడు ఆయన్ను రక్షించి నేత్రదృష్టి ప్రసాదించాడట. కాని అనంతరూపుడైన పరమాత్మునిచూచి పాపపంకిల పూరితమైన ప్రపంచ రూపాన్ని చూడటానికి యిష్టపడలేదు సూరదాసు. అందుకే కృష్ణుడు ఆయన కోర్కెను తిరస్కరించలేకపోయాడని వినికిడి. కాని అంత సాక్ష్యం దృష్టాదృష్టికూటకపదాలలో ఆయన చేసిన శృంగారాది

వర్ణనలు ఒక జన్మాంధుడైన కవి చేయలేడన్న ఆలోచించవలసిన విషయం.

ఆచార్యవల్లభులతో సంపర్కంలేని యౌవనదశలో సూరదాసు కాషాయవస్త్రాలు ధరించి బైరాగిలా పరిభ్రమిస్తుండేవాడు. కాని వల్లభులవారితో పరిచయ మేర్పడ్డ పిదప ఆయన దయకు పాత్రుడై ఆయన సలహాలను మన్నిస్తూ వచ్చాడు. ప్రతినిత్యమూ కొన్ని కీర్తనలు వ్రాసేవాడు.

సూరదాసు షుమారు లక్ష యిరువదిఆయిదువేల గీతాలు వ్రాసాడు. అందు యాభై వేలవరకు విభిన్న గ్రంథాలలో లభ్యాలు. ఆయన రచనల్లో "సూర సాగర్" ఉత్తమగ్రంథం. సూరదాసు కావ్యంలో వాత్సల్య భావానికి ప్రాధాన్యతవుంది. కవి కృష్ణుని తన స్నేహితునిగా భావిస్తాడు. అతని బాల్యక్రీడలు యశోద వడే ఉబలాటాలు క్రమంగా శృంగార క్రీడలు గోపికల విరహం మొదలగు విషయాలన్నీ ముఖ్య మైనవి.

సూరదాసు సమస్త గీతాలు ఒక ఎత్తు. ఆయన వాత్సల్య, విరహ గీతాలు ఒక ఎత్తు. వీటి రచనలో ఆయన అందెవేసిన చెయ్యి. బాల్య చాపల్యాన్ని వర్ణించటంలో ఇతన్ని పోలినవాడు మరొకడు లేడ నటం నిస్సందేహమైన విషయం. కృష్ణుని జన్మ దినోత్సవం, ఆతడు దోగాడటం, పారాడటం, తప్ప టడుగులు వేయటం. వచ్చీరాని చిలుక పలుకులు పలకడం, మొదలైన విషయాలెన్నో సహజంగా వ్రాసాడు.

కృష్ణుడు పారాడుతున్నాడు. యిల్లంతా చుట్టివేసి దుమ్మూ ధూళీ అంతా శరీరానికి చేసుకొన్నాడు. పెరుగుకుండలో మూతిపెట్టి పెరుగు రాసుకున్నాడు.

"ఘటరున్ చలత్ రేనుతన్ మండిత్, ముఖ దధి
లేప్ కియే."

కృష్ణుడు కొంచెం పెద్దవాడయ్యాడు. బలరాముడితో ఆడుకొంటాడు. ఒకనాడు బలరాముడి జుట్టుపై కృష్ణుడికి దృష్టి మరలింది. అమ్మదగ్గరకు పరుగెత్తి వెళ్ళాడు.

"మైయా కబ్‌హీ బఢైగీ చోటీ కితీబార్ యోహీ
దూధ్ పియత్ భయి. యహ్ అబ్‌హీ హౌం
ఛోటీ........ జైసే బల్‌కీహై లాంబీ, మోటీ"

"అమ్మా! నాజుట్టు ఎప్పుడు పెరుగుతుందే? వాడి జుట్టు చూడు, ఊరికే పెరుగుతుంది. నీవు బాగా పాలు త్రాగితే పెరుగుతుందంటావు కానీనాకేం పెరుగదే?" అని అడుగుతాడు.

ఎన్నోసార్లు కృష్ణుడు నిద్రపోతుండడం. నందుడు లేపి తీసుకవచ్చి నిద్రకళ్ళతో ఉన్న కృష్ణునికి అన్నం పెట్టడం వర్ణింపబడింది.

కృష్ణుడు ఆలమందలను పాలిస్తాడు. గోపబాలకు లంతా గిలిగింతలు పెట్టి గేలిచేసి ఏడిపిస్తారు. రెండో రోజు పోనని మారాం పెట్టాడు.

"మైయా! హౌం న చరైం హౌం గాయి సిగరే
గ్వాల్ ఫిరావత్ మోసౌం మేరేపాయి పిరాయిం
జోన పత్యాహి పూఛి బల దావుహి, అపని
సౌంహ్ దిలాయీ"

ఒకటేమిటి? ఆయనవున్న వాతావరణానికి అను వైన ప్రతి చిన్నవర్ణన హృదయంగమంగా చేసాడు సూరదాసు.

కంసవధకోసరం కృష్ణుడు మధురాపురానికి వెళ్ళాడు. అవసరాన్నిబట్టి అక్కడే వుండిపోయాడు. కాని ప్రేమోన్మాదులైన గోప బాలలు కృష్ణుణ్ణి చూడ కుండా అట్టేకాలం వుండలేకపోయారు. వచ్చిపొమ్మని లెక్కలేనన్నిసార్లు కబురు పెట్టారు. కాని కృష్ణుడు రాలేదు. రాజకార్యానికన్న ముఖ్యమైందా ప్రణయ వ్యాపారం? ఏమయినా వారి హృదయాలు రాత్రిం బవళ్ళు తపించిపోతుంటే సహించలేడు. ఆ విష యాలు వినలేడు. వారిని లాలించి, ఓదార్చే ఒక వ్యక్తిని పంపాలనుకొన్నాడు. విజ్ఞానగర్వంతో విర్ర వీగే ఉద్ధవుడు జ్ఞాపక మొచ్చాడు. ఉద్ధవుడు యోగి. జ్ఞానమే ముఖ్యమంటాడు. భక్తి ప్రేమలకి భగవ త్సన్నిధిలో లవలేశమైనా విలువలేదంటాడు. కాని గోపికలకు ప్రేమే జీవిత సర్వస్వం. సరే! తగిన వైద్యుడే ననుకొన్నాడు. "వుద్ధవుడికున్న ఆ మూఢ

నమ్మకంగూడా తగ్గాలి. అందుకు యిది ఒక్కటే మార్గం" అని ఆలోచించి ఉద్ధవుణ్ణి పంపుతాడు.

ఇదంతా భాగవతంలోని కథాక్రమమే. దీనికే సూరదాసు భ్రమరగీతాలని మెరుగులు పెట్టాడు. ఉద్ధవుడు గోకులం చేరాడు. అందరినీ పిలిచి కృష్ణుని సందేశమంటూ తన జ్ఞాన వేదాంతాన్ని ఏకరువు పెట్టాడు. గోపిక లదంతా విన్నారు. ఇంతలో ఎక్కడి నుండో ఒక తుమ్మెదవచ్చి రాధాదేవి పాదంపై వ్రాలింది. గోపికలు రాధిక వుద్ధవుణ్ణి గేలిచేద్దామను కున్నారు. తుమ్మెద నల్లనిది. వుద్ధవుడు నల్లనివాడు. సరే. "తుమ్మెదా" అని సంబోధించి వుద్ధవుని ఎత్తి పొడుపులతో తిట్ట ప్రారంభించారు. ఆతని జ్ఞానాన్ని, నిర్గుణబ్రహ్మని కాకులు పొడిచినట్లు పొడిచిపెట్టారు. తమ హృదయాలు దుఃఖంతో భారవంతాలైన తమ శరీరాల స్థితిని గోకులంలోని ఆబాలగోపాలం పదే బాధనీ తనివితీర విన్పించారు. వీటికి "భ్రమర గీతా" అన్న పేరు కల్గింది. భ్రమర గీతాలు ఆనాడు చాల ప్రచారంలోకి వచ్చాయి. దేశంలో నిర్గుణ సంప్ర దాయానికున్న ప్రాపకాన్ని తగ్గించాయి. అష్టఛాప్‌లోని ప్రతికవీ, భక్తిగీతాలు వ్రాసిన ప్రతికవి భ్రమరగీతాలు వ్రాశాడు.

సంయోగ వియోగ వర్ణనలో సూరదాసు అందె వేసిన చెయ్యి. గోపికల విరహవర్ణనలోని విభిన్న దశలను వర్ణించాడు. కళాదృష్టితో సూరదాసు వ్రాసిన కవిత వుత్తమశ్రేణికి చెందినట్టిది. పలు విమర్శకులు ఆయన ఆవేశాన్ని, భావశక్తిని పలుసార్లు ప్రశంసిం చారు. కృష్ణుని శీలవర్ణన భాగవతాన్ని ఆధారం చేసు కొని వ్రాయబడినా తన స్వతంత్ర వ్యక్తిత్వాన్ని చాటుతుంది. సూరదాసు చిత్రించిన కృష్ణుడు మధుర స్వరూపుడు. కాని భారతంలోని రాజనీతి విశారదుని వంటివాడు కాదు. ప్రేమోన్మాది. సూరదాసు హిందీ సాహిత్యంలో ఒక మహోన్నత స్థాయి నందు కొన్నాడు. నందదాసు సూరదాసు తరువాత 'అష్ట ఛాప్' లోని కవులలో ప్రముఖస్థానాన్ని ఆక్రమించాడు.

2. *నందదాసు:* వల్లభాచార్యులవారి శిష్యులలో నందదాసు ప్రముఖుడు. ఈయన బహుముఖమైన ప్రజ్ఞ కలవాడు. ఈయన వ్రాసిన గ్రంథాలు పదహారు వరకు చెప్పబడ్డాయి. (1) రాస పంచాధ్యాయి, (2) సిద్ధాంత పంచాధ్యాయి, (3) అనేకార్థ మంజరి, (4) మాన మంజరి, (5) రూపమంజరి, (6) రస మంజరి, (7) భ్రమరగీత్, (8) గోవర్ధనలీల, (9) శ్యామ్ సగాయీ. (10) రుక్మిణీమంగల్ (11) సుదామా చరిత్, (12) భాషా దశమస్కంధ్, (13) పదావళ్ హితోపదేశ్, (14) నాసికేత్ పురాణ్ ప్రభృతులు.

ఈయన వ్రాసిన రాస పంచాధ్యాయి వుత్తమ గ్రంథంగా పరిగణింపబడింది. ఈయన వ్రాసిన భ్రమరగీతాలు చాల చమత్కార కృతులు. సూరదాసు గోపికలు అమాయకురాళ్ళు. తమ దీన హీనస్థితిని వినిపించి ఉద్ధవుని మనస్సు కరిగించారు. నందదాసు గోపికలు తర్కపటుత్వం కలవాళ్ళు. వేదాంతాన్ని తిరగవేసినవారు. దిట్టంగా వాదించి ఆ వుద్ధవుడి నోరు మూయిస్తారు. ఈయన సిద్ధాంత పంచాధ్యాయి భక్తిరస పూరితులైన పాటల సంకలనం. నందదాసు వుత్తమశ్రేణికి చెందిన కవులలోని వాడు. ఈయన నిర్గుణవాదాన్ని పూర్తిగా ఖండించి రూపుమాసే టట్లు చేశాడు. రాసపంచాధ్యాయిలో వున్న గీతాలు ఈయన వుత్తమ కవిత్వానికి వుదాహరణలు. పద గుంభన, అర్థగాంభీర్యం— ఈ రెంటికి నందదాసు పేరుబడినవాడు.

3. *గోవిందస్వామి:* ఈయన గోస్వామి విఠల్ దాస్ శిష్యపరంపరలోని వాడు. ఈయన గొప్ప పాటగాడనీ, ఈయన మధురాతిమధురాలైన పాటలు వినేందుకు తాన్సేన్ వచ్చేవాడని ప్రతీతి. గాన మాధుర్యానికి పోల్చదగిన కవితాపాటవం ఈయనలో లేదని అన్నాడొక విమర్శకుడు. ఈయన వ్రాసిన శృంగారపదాలు, సుద్దులు మొదలైనవి ఆ ప్రాంతంలో పల్లెపట్టున విన్పిస్తవి.

4. *పరమానందదాసు:* వీరు క్రీ. శ. 1493 సం.లో జన్మించారు. వాత్సల్యరస వర్ణనలో సూరదాసు తరువాత అంతటివాడు పరమానందదాసే. ఈయన కీర్తనలు, భజన గీతాలు వింటూ ఆచార్య వల్లభుడు మైమరచేవాడట. ఈయన "పరమానంద సాగర్" అన్న పుస్తకం వ్రాశాడు, ఆచార్య హజారీ ప్రసాద్‌జీ తన సాహిత్య చరిత్రలో "ఈయన పదాలలోని భాషాలాలిత్యంమాత్రం పొగడదగింది. తక్కినవారికన్నా ఈ విషయంలో ఈయనలో ఒక ప్రత్యేకత వున్నది." అని వ్రాశాడు.

5. *కృష్ణదాసు :* కృష్ణదాసు అష్టఛాప్ కవులలో ముఖ్యమైనవాడు. రాసక్రీడల వర్ణనలలో "సెబాస్" అనిపించుకున్నాడు. ఈయన పాటలు రాధాకృష్ణుల విహార యాత్రలతో తత్సంబంధితాలైన శృంగారంతో తొణికిసలాడుతవి, ఈయన "శృంగారవర్ణనలు అతిగా ఉన్నాయి." అన్నాడొక విమర్శకుడు. ఈయన వ్రాసిన గీతాలు "కృష్ణదాస్‌కా కీర్తన్" "జగత్‌మాన్ చరిత్" అన్న గ్రంథాలలో సంకలనపరుచబడ్డాయి. ఈయన పాటలలో అర్థగాంభీర్యంకూడా మెండుగానే వుంది,

6. *కుంభనదాసు :* కుంభనదాసు వల్లభాచార్యుల వారి ప్రియశిష్యులలో ఒకడు, ఈయన క్రీ. శ. 1468 వ సం. లో జన్మించాడు. బాల్యంనుండి భక్తి విషయాల్లో అభిరుచి ఎక్కువ.

ఈయన గ్రంథాలేవీ వ్రాసినట్లు తెలియరాలేదు. ఈయన కీర్తనలు, భజన గీతాలు విభిన్నమైన గేయ సంపుటాల్లో సంకలిత మొనర్చబడ్డాయి. ఈయన వర్ణనలలో "కృష్ణ రాసక్రీడలు"చాల చక్కగా వర్ణించాడు. కోకొల్లలుగా పాటలు వ్రాశాడు. సంగీతంలో ఈయన పాటలు మునకలువేశాయి. అందుకే జానుతనం జాలువారుతూ తీయగా వున్నాయి, ప్రజల హృదయాలకు హత్తుకుపోయాయి.

ఇతడు అక్బరు చక్రవర్తి సమకాలికుడు. ఈయన గొప్పతనాన్ని చెప్పగావిని అక్బరుపాదుషా తన రాజధాని అయిన ఫతేహ్‌పూర్ సిక్రీ (ఆగ్రాకు సమీపంగావుంది) కి పిలిపించాడు. కొలువుకూటంలో వుండిపొమ్మన్నాడు. కాని ఆయనకు రాచమర్యాదలలో అభిరుచి లేకపోయింది. అందుకే ఒక పాటలో—

"సంతన్ కో కహా సీకరీసోఁ కామ్, ఆవత్ జాత్
పన హియా టూటీ బిసరిగయె హరినామ్"

"సీక్రీపురంతో నావంటి సాధుల కేంపని? ఆ రాచమర్యాదలలో, వైభవాల్లో హరిస్మరణే మరువగలను." అని అన్నాడు.

7. *ఛీతస్వామి :* ఈయన కవిత భక్తిరసప్రధానమైనది. తేలిక భాషలో చక్కని భావాలను పొందుపరిచాడు. కాని "చెప్పుకోతగిన క్రొత్తదనాలేవీ ఈయన కవిత్వంలో కన్పించ" వన్నా డొక విమర్శకుడు.

8. *చతుర్భుజదాసు :* ఈయన కీర్తనలు స్ఫుటమైనట్టివి. ఈయన రచనల్లో శృంగార భక్తిరసాలు ఒకదానికొకటి తగ్గకుండా ఉన్నాయి. శిల్పంవలె ఈకవి పాటలు భావభంగిమలతో నిండిపోయాయి. కృష్ణుడు జన్మించినది మొదలు గోపికల విరహవృత్తాంతంవరకు జరిగినకథ ఈయన పాటలుగా వ్రాశాడు. ఈయన వ్రాసిన పుస్తకాలు "ద్వాదశ్ యశ్ భర్త ప్రతాప్" "హిత్‌జీ కో మంగల్" మొదలైనవి. ప్రేమావతారుడైన కృష్ణుడికి తన జీవితాన్ని పూర్తిగా అంకితంచేసి మైమరిచి ఆనందించిన కవుల గీతాలతో ఉత్తరదేశంలోని బహుప్రాంతాలు మారుమ్రోగుతుంటాయి. మీరాబాయి జీవితకథ, ఆమెపాటల్లోని ప్రతి అక్షరంలోనూ ప్రతిబింబిస్తూవుంది. ఆమె భావావేశాన్ని ఎలా మరువగల్గుతాం ? గోవర్ధనగిరిపై నున్న కృష్ణమందిరంలో 'అష్ట ఛాప్' కవులు ఈ దేవాలయానికున్న ఎనిమిది ద్వారాల్లో ద్వారపాలకుల వలె కూర్చొనేవారు. భక్తికీర్తనలు పాడేవారు. వారి కీర్తనలు సంగీత సాహిత్యాలకు నిధులు, ఇది సాహితీ పరమైన మహావిప్లవం. యుగయుగాలవరకు సువర్ణాక్షరాలలో లిఖింపబడి వుంటుంది,

★

# శ్రీశైల పుణ్యక్షేత్రమునకు

## రాష్ట్రపతి

# రాజేంద్రప్రసాదుగారి ఆగమనము

శ్రీ వికారినామ సంవత్సర శ్రావణ శుద్ధ పౌర్ణమి మంగళవారము పుణ్యదినమున (18-8-59) మధ్యాహ్నము 12 గంటలకు శ్రీశైలమునకు రాష్ట్రపతి డాక్టరు రాజేంద్ర ప్రసాదుగారు విజయముచేసిరి. వారిని ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు, దేవాదాయ కమీషనరు శ్రీ పైడి లక్ష్మయ్యగారు, తిరుపతి తిరుమల దేవస్థానముల బోర్డు అధ్యక్షులు ఏ. సి. సుబ్బారెడ్డిగార్లు పుష్పమాలాలంకృతులను గావించి ఆహ్వానించిరి. శ్రీ సంజీవరెడ్డిగారు, శ్రీ పైడి లక్ష్మయ్యగారిని రాష్ట్రపతికి పరిచయముచేయగా శ్రీ లక్ష్మయ్యగారు అచట విచ్చేసియున్న యితర ప్రముఖులను, సుబ్బారెడ్డిగారిని, తిరుపతి బోర్డు సభ్యులను, శ్రీశైల క్షేత్రములో సాగుచున్న నిర్మాణ కార్యక్రమములో పాల్గొనుచున్న దాతలను, ఇతరులను రాష్ట్రపతిగారికి పరిచయముచేసిరి.

ఆనాటి సాయంకాలము రాష్ట్రపతి శ్రీశైల జల విద్యుత్కేంద్ర స్థాపనకు నిర్ణయించిన స్థలమును దర్శించిరి. నాటి సాయంకాలము 7 గంటలనుండి 8 గంటలవరకు శ్రీ మల్లికార్జున స్వామివారి దేవాలయమున కెదురుగా నేర్పరుపబడిన నాటకశాలలో కర్నూలు నాట్యకళాపరిషత్తువారు శ్రీ పైడి లక్ష్మయ్యగారు రచించిన 'మార్కండేయ' నాటకము శ్రీ రాజేంద్రప్రసాదుగారి అధ్యక్షతక్రింద రసవంతముగా ప్రదర్శించిరి. ఆనాటి రాత్రి 9 గంటలకు రాష్ట్రపతి తిరుపతి దేవస్థానమువారొసంగిన విందారగించిరి. మరునాడు 7 గంటలనుండి 7½ గంటలవరకు శ్రీ రాజేంద్రప్రసాదుగారు శ్రీ మల్లికార్జునస్వామి, శ్రీ భ్రమరాంబాదేవి ఆలయముల దర్శించి, శ్రీ స్వామివారిని, అమ్మవారిని సేవించిరి. ఆ ఉదయమే 8 గంటలనుండి 8½ గంటలవరకు జరుపబడిన బహిరంగసభలో శ్రీ రాజేంద్రప్రసాదుగారు శ్రీశైలములో ఒక లక్షరూపాయల ఖర్చుతో తిరుపతి దేవస్థానమువారు నిర్మింపనున్న సత్రమునకు శంకుస్థాపన చేసిరి. ఆ సభలో శ్రీ పైడి లక్ష్మయ్యగారు, గవర్నరు భీమసేనసచారుగారు యితర మంత్రుల సానుభూతి ప్రోత్సాహములు పురస్కరించుకొని క్షేత్రమున జరిగిన నిర్మాణ కార్యక్రమమును వివరించిరి. శ్రీ సుబ్బారెడ్డిగారు, తిరుపతిదేవస్థానమువారు చేయుచున్న మహత్కార్యముల వివరించుచు వారి ప్రజాహితైక కార్యములలో భాగమైన సత్రనిర్మాణమునకు శంకుస్థాపన చేయవలసినదిగా శ్రీ రాష్ట్రపతిని కోరిరి. శ్రీ రాజేంద్రప్రసాదుగారు మత విషయకముగా మనము అనాదిగా ఐకమత్యము చూపుచున్న విషయము జ్ఞప్తికి తెచ్చి యీ విషయములో యిప్పుడు కృషి ఎక్కువ జరుగుచుండుట యావద్భారతదేశైక్యమున కుపయోగకారి కాగలదని చెప్పి, జరిగిన నిర్మాణకార్యక్రమమునకు సంతసము వెల్లడించిరి.



# రాష్ట్రపతి డాక్టరు రాజేంద్రప్రసాదుగారు

## శ్రీశైలక్షేత్రమున శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారి ధర్మశాలకు శంకుస్థాపన చేయు సందర్భమున సమర్పించబడిన

# పద్యరత్నములు

౧

శ్రీ శేషాచలవాస! శిష్టవినుతా! శ్రీ వేంకటేశ! ప్రభూ!
శ్రీ శైలాధిప! మల్లికార్జునవిభో! శ్రీ కాళహస్తీశ్వరా!
శ్రీశా! భద్రగిరీశ! బ్రోవుఁ డెలమిన్ శ్రీరాయువుల్ గూర్చి, యీ
సౌశీల్యున్, గుణశీలు రాష్ట్రపతి రాజన్‌బాబునిన్ ధీమణిన్.

జనకుని దేశమౌ మిథిల - జన్మమునొందిన కారణంబ, యా
జనకమహీతలేశ్వరుని జాడలనేగుచు రాజయోగివై,
మనుచు, ప్రజాళిచేతకడు మన్ననలందుచు దేవుఁడంటివా
డని, వినుతింప నెల్లరును హాయిగనుంటివి కర్మయోగివై.

అదిశంకరుఁడాది అద్వైత సిద్ధాంతు లార్యనాగార్జునా చార్యవరులు
కాకతీయాంధ్ర భూకాంతులైన ప్రతాప రుద్రుండు, గణపతి రుద్రమాంబ
రెడ్డిరాజులు, తెల్గురేడులు శ్రీకృష్ణరాయాదులున్ కవి-రాజవరులు
ఛత్రపతిశివాజి చక్రవర్తి ప్రభృతులందఱి, మన్నన లందిరనగ
రంగవైభవ, నిత్యకల్యాణములును బచ్చతోరణములతో శివా, భవాని
దేవి! భ్రమరాంబనాథుఁడై తేజరిల్లె ఘనత శ్రీశైలమల్లికార్జునుఁ డనంగ.

—పైడి లక్ష్మయ్య

౨

త్రైలోక్యావనమల్లికార్జునమణిః భక్తౌఘచింతామణిః
శ్రీశైలే భ్రమరాంబికామణిరుచిప్రస్ఫీతసచ్చిన్మణిః
శ్రీమద్భారతదేశనాయకమణిం రాజేంద్రవిద్వన్మణిమ్
దీర్ఘాయుష్యసమస్తరాజ్యవిభవైః ఆకల్పమాకల్పతామ్.

సర్వస్మిన్ జగతి హ్యాజాతరిపుభిర్యారాధితం సజ్జనైః
భాషాణాం భువి దక్షిణః పతిరితి ప్రఖ్యాతమత్యున్నతమ్
అస్మద్భారతసంస్కృతేరనుపమం జీవత్ప్రతీకం బుధమ్
రాజేంద్రం భ్రమరాంబికాఽనుకలితః శ్రీపర్వతేశోఽవతాత్.

ప్రజ్ఞావాన్ భీమసేనః నిపుణతరమతిః పాలనే రాజ్యపాలః
సంజీవాఽఽద్యా అమాత్యా అథ భువనగురోః శ్రీగిరీంద్రేశ్వరస్య
క్షేత్రీయే ధర్మకార్యే శ్రుతివిహితవిధౌ తత్పరా లక్ష్మయాద్యాః
రాజన్ రాజేంద్ర తుభ్యం సుమహితవచనైః స్వాగతం వాచయంతి.

—కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

౩

श्रीमान् ज्ञानसुखैकपूर्ण उभयाविद्याविनिर्मुक्तचिन्
मार्ताण्डोज्ज्वलभानुमान् सुरतरुः श्रीमल्लिकाख्योऽर्जुनः
यत्र श्री भ्रमरांबिकाभुजलतासंवेष्टितो राजते
श्रीशैलं तदिदं निसर्गविमलं क्षेत्रं पवित्रं महत् ॥

कृष्णातीरविराजमानमतुलप्रख्यं पुराणादिषु
त्रैविद्यप्रतिपाद्यमानविभवं ज्योतिर्मयं गीयते
लिंगं लीनरहस्यबोधकमिदं ह्यान्ध्रप्रदेशे स्थितं
श्रीमन् भारतराष्ट्रपालनपटो राजेन्द्र ! ते स्वागतम् ॥

**वाङ्मय महाध्यक्ष वड्लमूडि गोपालकृष्णार्यः**



# కనకదుర్గ ఆలయానికి రోడ్డు

మున్సిపల్ వాటర్‌వర్క్సు సమీపంలో గల గ్రాండ్‌ట్రంక్ రోడ్డునుంచి, ఇంద్రకీలాద్రిపర్వతంపై నున్న శ్రీ కనకదుర్గ ఆలయంవరకు రు. 2 లక్షల ఖర్చుతో ఒక రోడ్డు నిర్మించాలని హిందూ దేవాదాయ ధర్మాదాయసంస్థ ఆలోచిస్తున్నది. దీని పొడవు 2200 అడుగులు.

భారతప్రభుత్వ అడిషనల్ కన్సల్టింగ్ ఇంజనీరుగా పనిచేసి విరమించిన శ్రీ ఎ. నాగేశ్వర అయ్యరు ఇచ్చటికి వచ్చి ఇందుకు సంబంధించిన పథకాలు, అంచనాలు రూపొందించారు. కొన్నిసంవత్సరాలుగా పురజనులు చేస్తూవచ్చిన అభ్యర్థనను పురస్కరించుకొని దేవాదాయ కమీషనరు శ్రీ పైడి లక్ష్మయ్య ఈరోడ్డు నిర్మాణానికి సంకల్పించారు. ఇందుకు తగిన నిధులు సేకరించటంగురించి ఆలోచిస్తున్నారు.

## శ్రీశైలంలో మృగేంద్ర వాహన నిర్మాణం

### దేవాదాయాల కమీషనర్ విరాళం

జులై 25వ తేదీన శ్రీశైలం దేవస్థానంలో భ్రమరాంబ ఆలయమునకు ఎదురుగా మృగేంద్ర వాహనం నిర్మాణానికి దేవాదాయశాఖ కమిషనర్ శ్రీ పైడి లక్ష్మయ్య 501 రూపాయలు విరాళం పంపించారు.

## శ్రీశైల గణపతికి బంగారు కవచం

హైదరాబాదులో జులై 3న శ్రీశైలంలో వినాయక చవితికి రత్నగర్భ గణపతికి బంగారు కవచం అమర్చబడగలదనీ, ముందు గోపురం ఇతర కట్టడాల నిర్మాణం చురుకుగా సాగుతున్నదనీ ఆంధ్రప్రదేశ్ దేవాదాయ కమిషనర్ శ్రీ పైడి లక్ష్మయ్య చెప్పారు.

రాష్ట్రపతి డాక్టరు రాజేంద్రప్రసాద్ శ్రీశైలం సందర్శించేనాటికి యాత్రికులకు దేవస్థానంవారు నిర్మిస్తున్న సత్రములో 12 గదులు పూర్తికాగలవనీ, ఇదిగాక ఆర్యవైశ్య సత్రము లింగాయత్ సత్రములో గూడ మరికొన్ని కొత్తగదులు తయారు కాగలవు అన్నారు.

## శ్రీశైల ఆలయ అభివృద్ధి కార్యక్రమం

### శ్రీ పైడి లక్ష్మయ్యగారు రచించిన నాటక ప్రదర్శనం

శ్రీశైల దేవాలయోద్ధరణ విషయంలో జరుగుతున్న కార్యక్రమానికి ఆర్థికంగా సహకరించేందుకు వచ్చేనెల ఆఖరువారంలో "మార్కండేయ విజయం" నాటక ప్రదర్శన శ్రీశైలంలో జరుగుతుందని దేవాదాయ కమీషనర్ శ్రీ పైడి లక్ష్మయ్య కర్నూలులో తెల్పారు.

శ్రీ లక్ష్మయ్య ఇంకా ఇలా అన్నారు: "శ్రీశైలంలో జిల్లా ధర్మకర్తల మహాసభ జరుగుతుంది. నేను స్వయంగా రచించిన "మార్కండేయ విజయం" అనే నాటకమును శ్రీ భ్రమరాంబా మల్లికార్జున పదసరోజములకర్పించడమేగాక, ఈ గ్రంథ విక్రయ రూపముగ లభించే ద్రవ్యము, నాటకరూపంగా వచ్చే ద్రవ్యాన్నికూడా దేవాలయాభివృద్ధికి అంకితంచేశాను. శ్రీశైలంలో ప్రదర్శించే సందర్భంలో మంత్రులు శ్రీ డి.సంజీవయ్య, శ్రీ ఎ. భగవంతరావు, కర్నూలులో సెప్టెంబరు మాసంలో ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి తిలకిస్తారు. శ్రీయుతులు సి. యం. రామయ్య, బైరాపురం రామయ్య. బి. వీరయ్యచారి ఇంకా తదితరులు కర్నూలు నాటక కళాపరిషత్తు తరపున నాటకాన్ని ప్రదర్శించేందుకు ఏర్పాట్లు చురుకుగా జరుపుతున్నారు.



# సింహాచలం గుడివద్దకు కొండమీదుగా రోడ్డు

### పని జరుగుతున్నట్లు మంత్రి శ్రీ భగవంత్‌రావుగారి ప్రకటన

సింహాచలం గుడికి కొండవద్దనుంచి రోడ్డు నిర్మాణం సందర్భంలో అడవులను కొట్టివేయడం, మట్టం పరిశీలన పనులు జరుగుతున్నవని శ్రీయుతులు భీసెట్టి అప్పారావు, ఎస్. కాశిరెడ్డిగారల ప్రశ్నలకు సమాధానంగా శాసనసభలో దేవాదాయ ధర్మాదాయాల శాఖ మంత్రి శ్రీ అనగాని భగవంతరావు ఇవాళ చెప్పారు. ఈ రోడ్డు నిర్మాణానికి ఎంత అయ్యేదీ - అందులో దేవస్థానం ఎంత భరించవలసివస్తుందనే అంశాలు ఇంకాపరిశీలనలో ఉన్నవనిమంత్రిచెప్పారు.

### భద్రాచలం దేవాలయ జీర్ణోద్ధరణ

*సలహాసంఘం ఏర్పాటుకు యోచన*

భద్రాచలం దేవాలయ జీర్ణోద్ధరణ కృషికి సాధ్యమైనంత త్వరలో ఒక సలహాసంఘాన్ని నియమించే విషయం ప్రభుత్వ ఆలోచనలో వున్నట్లు దేవాదాయ శాఖ మంత్రి శ్రీ అనగాని భగవంతరావు చెప్పారు.

భద్రాచలంలో వున్న సత్రాలు సక్రమముగా నిర్వహించబడేట్టుగూడా ప్రభుత్వం తగుచర్యలు తీసుకోగలదనీ, యాత్రికులకు తగు వసతిసౌకర్యాలు వృద్ధిచేయగలదనీ మంత్రి చెప్పారు. గోదావరిపై భద్రాచలం దగ్గర వంతెన పూర్తి అయినప్పుడు యాత్రికులకు అధిక సౌకర్యాలు కలుగగలవు అన్నారు. (జూలై 2)

### తిరుత్తనిలో ఆడి కృత్తిక ఉత్సవాలు

*3 లక్షల మంది యాత్రికుల రాక*

తిరుత్తనిలోని శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి ఆడి కృత్తిక విశేష ఉత్సవాలూ, తెప్ప ఉత్సవాలూ కిందటి నెల 27 వ తేదీదాకా జరిగినవి. సుమారు 3 లక్షలమంది యాత్రికులు వచ్చారు. 42,000 మంది పూలకావిళ్లు తెచ్చి స్వామికి సమర్పించారు. వెండి, బంగారు ముడుపులూ, కానుకల రూపంలో స్వామికి రు. 70,000 ఆదాయం వచ్చింది. దేవాదాయ ధర్మాదాయాలశాఖ కమీషనరు శ్రీ పైడి లక్ష్మయ్య నాయుడూ, తదితర అధికారులూ యాత్రికులకు చక్కటి సౌకర్యాలు జరిపించారు. దేవాలయ నిర్వహణాధికారి శ్రీ ఐ. ఎల్. ఎన్. వెంకట్రావు, పంచాయతీబోర్డు అధికారులూ ఉత్సవాలు జయప్రదంగా జరగడానికి నిర్విరామకృషి చేశారు.

---

### తిరుపతిలో అన్నవరం దేవస్థానం సమాచారశాఖ స్థాపన

#### హెరిడిటరీ ట్రస్టీ శ్రీ ఐ. వి. గోపాలరావుగారి ప్రకటన

తిరుపతిలో అన్నవరం శ్రీ వీర వేంకట సత్యనారాయణస్వామి దేవస్థానం సమాచార శాఖను ఒకదానిని ఆగస్టునెలనుంచి ప్రారంభం చేసినట్లు ఆ దేవస్థానం హెరిడిటరీ ట్రస్టీలయిన శ్రీ ఐ. వి. గోపాలరావుగారు ప్రకటిస్తున్నారు. ఈ సమాచారశాఖద్వారా తగు సంగతులు తెలిసికొని భక్తులెల్లరు సత్ఫలితాలను పొందగోరుచున్నారు.

## ౧౦ వ యధికరణము

బ్రహ్మము వ్యాపకమని నిర్ణయింపబడినది. అది స్వయంజ్యోతియని చెప్పుటకొరకు మహర్షి సూత్రము నారంభించుచున్నాడు.

"జ్యోతిశ్చరణాభిధానాత్" ౧. ౧. ౨౪.

చరణాభిధానాత్ = చరణము బ్రహ్మార్థకమగుట వలన. జ్యోతిః = జ్యోతిః శబ్దము, బ్రహ్మవాచకమే యని సూత్రార్థము.

('యదతః పరో దివో జ్యోతిర్దీప్యతే విశ్వతః పృష్ఠేషు సర్వతః పృష్ఠేష్వనుత్తమే షూత్తమేషు లోకేష్విదం వావ తద్యదిదమస్మిన్నంతః పురుషే జ్యోతిః' ఛాం. ౩. ౧౩.)

'ద్యులోకమునకు పైనున్న నే జ్యోతి ప్రకాశించు చున్నదో యదియే యన్నిటికంటెను పైనను, ఉత్తమానుత్తమ లోకములందును ప్రకాశించుచున్నది. ఈ మనుష్య శరీరమునందును నదియేయున్నది.'

ఇందలి 'జ్యోతిః' శబ్దము బ్రహ్మబోధకమా, లేక యాదిత్యాదుల ప్రకాశమును బోధించునాయని సంశయము కలుగుచున్నది. కావున చెప్పుచున్నాము.

('ఖంవాయుర్జ్యోతి రాపః పృథివీ
విశ్వస్యధారిణీ' ముం-౨. ౧. ౩.)

'ఆకాశము, వాయువు, జ్యోతి, జలము, భూమి.' అను నీపదములలో జ్యోతిః శబ్దము అగ్నిబోధకము.

('ఏష సంప్రసాదోఽస్మాత్ శరీరాత్ సముత్థాయ పరంజ్యోతిరుపసంపద్య స్వేనరూపేణాభి నిష్పద్యతే' ఛాం-౮. ౧౨. ౩.)

'ఈజీవు డీశరీరమును విడిచి పరమజ్యోతిని జేరి స్వస్వరూపమున నుండును' అను నీతావున జ్యోతిః శబ్దము బ్రహ్మవాచకము. ఇట్లు భిన్నార్థము లలో జ్యోతిః శబ్దము పఠింపబడినందున సందేహము గలుగుట సంభవము. ఇట నాదిత్యాదుల తేజస్సే యనుట పూర్వపక్షము. కాదు బ్రహ్మ బోధకమే యనుట సిద్ధాంతము.

(యదతః పరో దివో జ్యోతిర్దీప్యతే) అను నీ వాక్యమునందలి 'దీప్యతే' యను క్రియాపదము జ్వలనమును దెలుపును. జ్వలనము రూపవంతమగు నగ్న్యాదిత్యుల ధర్మమే యగును. అయ్యది నీరూపమగు బ్రహ్మమునకు ధర్మము కాదు. కావున యిట జ్యోతిః శబ్దము సూర్యాదుల తేజోవిశేషమును బోధించు ననుటయే యుక్తము. మరియు పైవాక్యమునందు 'దివముకంటె పైన జ్యోతి దీపించుచున్న' దనుటలో నొక సీమ (హద్దు) తెలియుచున్నది. కావున కొంతొక యవధిలోనుండు పదార్థమును బోధించు జ్యోతిః పదము సర్వవ్యాపకమగు బ్రహ్మబోధకమెట్లు కాగలదు ? కావున నాదిత్యాది తేజో బోధకమనుటయే సంగతము.

ఇంకను (విశ్వతః పృష్ఠేషు, సర్వతః పృష్ఠేషు ఉత్తమేష్వ నుత్తమేషు లోకేషు)

'ఉత్తమానుత్తమ లోకములందును' అను నీపదములతో జ్యోతిస్సుకు లోకాదు లాధారముగా వర్ణింపబడుటయు జూనుచున్నాము. జ్యోతి బ్రహ్మబోధకముగు నెడల బ్రహ్మమునకు లోకము లాధారము లనవలసి వచ్చును. అది యుక్తము కాదు. సర్వాధారమగు బ్రహ్మమునకు లోకము లాధారము లెట్లగును? కావున జ్యోతిః శబ్దము తేజోవిశేషమును బోధించు ననుటయే యుక్తము. బ్రహ్మవాచకము కాదని పూర్వపక్షము.

సిద్ధాంతము : (యదతః పరో) యను నీ వాక్యమునకు పూర్వమునగల వాక్యమునందు, ('తావానస్య మహిమా తతోజ్యాయాగ్ంశ్చ పూరుషః, పాదోఽస్య సర్వా భూతాని, త్రిపాదస్యామృతం దివి' ఛాం-౩-౧౨-౬.)

బ్రహ్మమును నాలుగుపాదములుగ వర్ణించి, సర్వభూతములు బ్రహ్మమున కొక పాదమనియు, మిగిలిన మూడుపాదములు (అమృతం దివి) భూత సంస్పర్శము లేక యమృతమయమై యున్నవనియు వర్ణింపబడియున్నవి. కావున బ్రహ్మమే యిట జ్యోతిః పదముచే గ్రహింపనగును. తేజస్సు కాదు. మరియు

ద్యుశబ్ద సంబంధముండుటవలన జ్యోతిః శబ్దమిట బ్రహ్మవాచకమనియే నుడువవలెను.

(త్రిపాదస్యామృతందివి) యను నీవాక్యము నందు ద్యుశబ్దము త్రిపాదబ్రహ్మముతోను, (యదతః పరోదివో జ్యోతిః) అను నీవాక్యమునందు జ్యోతిః పదముతోను సంబద్ధమైయుండుటను జూడవచ్చును. అందువలన జ్యోతిః పదము బ్రహ్మవాచకమనియే తెలియనగును.

ఇంతేకాక, యీ ప్రకరణమున బ్రహ్మము ప్రకృతమగుటవలనను జ్యోతిః శబ్దము బ్రహ్మ ప్రతిపాదకమే యన నొప్పును. ఆదిత్యాది తేజో విశేషముకాదు.

'దీప్యతే' యను క్రియాపదము వాక్యమునందు గ్రహింపబడినదనియు, నది జ్వలనార్థకమగుటవలన జ్యోతిః శబ్దము తేజోవిశేషమును బోధించునన టయు యుక్తముకాదు. 'దీప్యతే' యను క్రియా పదము ప్రకాశార్థమునను వాడబడును. బ్రహ్మము రూపవంతముకానందున నగ్న్యాది జ్వలన ధర్మము గలది కాకున్నను, 'బ్రహ్మము (దీప్యతే) ప్రకా శించుచున్నది' యని యర్థముజెప్పిన దోషముండదు. కాబట్టి 'దీప్యతే' అను క్రియా పదప్రయోగమువలన జ్యోతిః శబ్దము బ్రహ్మవాచకము కాదనుట యుక్తి యుక్తముకాదు.

ద్యులోక పర్యంతము జ్యోతి దీప్తమగుచున్న దనుటవలన నొక యవధి గోచరమగుచున్నది; కాబట్టి జ్యోతిః పదము తేజోవిశేషమునే బోధిం చునుకాని, నిరవధిక బ్రహ్మమును బోధింపదను టయు సమంజసముకాదు. అంతర్బహి ర్భేదములేక యంతటనుండు బ్రహ్మము నట్లుపదేశించుట యయుక్తముకాదు. బ్రహ్మము వ్యాపకము. అయ్యది సర్వాంతర్యామి యైనట్లు సర్వమునకు వెలుపలను నున్నది.

('తదంతరస్యసర్వస్య. తదు సర్వస్యాస్య బాహ్యతః' యజు- ४०.౫)

అను నీయజుర్వేద మంత్రవర్గములందు బ్రహ్మము సర్వమున కంతర్భాగమునను, బాహ్యమునను నున్నట్లు స్పష్టముగా జెప్పబడెనది. సర్వపదముచే గ్రహింపబడు బ్రహ్మండములో దివముకూడ నొక భాగమే యైనందున బ్రహ్మండముకు బదమున దీపించు బ్రహ్మము దివమునకు బరమునకూడ ప్రకాశించు చున్నదనుటలో దోషమేమియు నుండదు. ఇట్లే యాధారశ్రవణమునందును జ్యోతిః శబ్దము బ్రహ్మవాచకమనుటలో నెట్టి దోషము నుండదు. సర్వగతమగు బ్రహ్మము త్తమానుత్తమ లోకము లందున్న దనుటలోను దోషమేముండును? కావున నుపర్యుక్త వాక్యములలోని జ్యోతిఃశబ్దము బ్రహ్మవాచకమే కాని, సూర్యాది తేజోవాచకము కాదు. (౧౪)

పై విషయమునందొక సందేహము నుద్భావించి మహర్షి సమాధానము జెప్పుచున్నాడు.

"ఛందోఽభిధానా న్నేతిచే న్నతథా
చేతోఽర్పణ నిగదాత్ తథాహి దర్శనమ్."

౧. ౧. ౨౫.

ఛందోఽభిధానాత్=పూర్వ వాక్యమునందు గాయత్రీ ఛందస్సునుగూర్చి చెప్పుటవలన, నేతిచేత్= తరువాతి వాక్యములోని తేజఃపదము బ్రహ్మవాచకము కాదందురేని, న=అట్లనరాదు. తథా = ఆవిధముగ, చేతోఽర్పణ నిగదాత్=మనస్సును నివేశింపజేయు టను జెప్పినందున, జ్యోతిఃపదముతో బ్రహ్మమే గ్రహింపనగును.

తథాహి=ఆవిధముగనే, దర్శనమ్=మరియొకచో జూడబడుచున్నది.

జ్యోతిఃశబ్దము గ్రహింపబడిన వాక్యమునకు పూర్వమునమన్న వాక్యమున చతుష్పాద్ బ్రహ్మము వర్ణింపబడి యున్నందున జ్యోతిఃపదము బ్రహ్మ బోధకమే కాగలదని పూర్వసూత్రమున నిర్ణయింప బడినది. అయ్యది సరికాదు. కారణమేమన: పూర్వ వాక్యమునందు వర్ణింపబడినది చతుష్పాద్ బ్రహ్మము

కాదు. ప్రకరణ ప్రారంభమున ('గాయత్రీ వా ఇదం సర్వం భూతం యదిదం కించ' ఛాం. ౩. ౧౨. ౧.)

'ఈ భూత ప్రపంచమంతయు గాయత్రియే' యని గాయత్రిని ప్రారంభించి. ('సైషా చతుష్పదా షడ్విధా గాయత్రీ') యా గాయత్రినే వాక్కు, భూతము, పృథివి, శరీరము, ప్రాణము, హృదయము నను నారుభేదములు గలది యని వివరణ పూర్వకముగ నుపసంహరించి.

('తదేతద్ ఋచాభ్యనూక్తమ్, తావానస్య మహిమా తతో జ్యాయాగుంశ్చపూరుషః, పాదోఽస్య సర్వా భూతాని, త్రిపాదస్యామృతం దివి.'

ఛాం. ౩. ౧౨. ౫. ౬.)

'ఇయ్యది ఋక్కుచేతను జెప్పబడినది. దాని మహిమమంతయే. అంతకంటె పురుషుడెక్కువ; సర్వభూతము లతని కొకపాదము; అతని పాద త్రయము దివమునందమృతము' అను పూర్వము వివరణ పూర్వకముగ నుపసంహరింపబడి గాయత్రి విషయముననే యీవాక్యముకూడ నుదాహరింప బడినది. ఇట్లుదాహరింపబడిన వాక్యమున నం దకస్మాత్తుగ బ్రహ్మ మెట్లు చెప్పబడును? ప్రకరణాగత చతుష్పాదాత్మక గాయత్రి నుదాహరింపబడిన ఋక్ మంత్ర మకస్మాత్తుగ బ్రహ్మను బోధించుననుట యుక్తము కాదు.

('యద్వైతద్ బ్రహ్మ' ఛాం. ౩. ౧౩. ౭.) అను నీవాక్యమునందలి బ్రహ్మశబ్దముకూడ గాయత్రినే బోధించుచున్నది. గాయత్రియే ప్రకృతము. బ్రహ్మమునేల బోధింపదగు నయ్యది యప్రకృతము కాబట్టి యీ ప్రకరణమునందలి 'జ్యోతిః' పదము బ్రహ్మబోధకము కాదని పూర్వపక్షము.

సమాధానము : జ్యోతిః పదమిట చతుష్పాదాత్మక గాయత్రిని బోధించుననుట యుక్తముకాదు.

('గాయత్రీవా ఇదం సర్వం భూతం
యదిదం కించ. ఛాం. ౩. ౧౨. ౧.) అను నీవాక్యమునందు గాయత్రి సర్వ భూతాత్మకమని చెప్పబడినది. కాబట్టి యందలి గాయత్రి పదము ఛందస్సును బోధించుననుట సంభవము కాదు—ఛందస్సు వర్ణాత్మకము—అయ్యది సర్వభూతాత్మక మెట్లు కాగలదు? కాబట్టి యట గాయత్రిపదము బ్రహ్మవాచకమే కావలసి యున్నది. బ్రహ్మమే సర్వభూతాత్మకము. 'గాయత్రి' పదము బ్రహ్మాభిప్రాయముతో బ్రయోగింప బడినపుడు బ్రహ్మము సర్వాధిష్ఠానకారణ మగుటచే నయ్యది సర్వభూతాత్మకమనుటలో దోషముండ నేరదు.

('గాయతి చ త్రాయతే చ ఇతి గాయత్రీ) గానము ద్వారమున రక్షణ కర్తృత్వము బ్రహ్మమునందే యుక్తమగును. గాయత్రి వర్ణాత్మకము కావున నయ్యది జడము; బ్రహ్మము చేతనము, రక్షణ కర్తృత్వము చేతనమున కొప్పును. కాని, జడమునకు కాదు. కాబట్టి జ్యోతిః పదము బ్రహ్మవాచకమే యగును. అటులయిన,

('గాయత్రీ వా ఇదం సర్వం భూతం) అని యిట గాయత్రిపదముచే బ్రహ్మమేల చెప్పబడవలెనన గాయత్రీ పదముచే జెప్పబడు బ్రహ్మమునందు మనస్సును బ్రవేశింపజేయు నిమిత్తమని సమాధానము చెప్పనగును.

మహర్షు లిట్లే యటనట నుపదేశింతురు. ఇయ్యది వారి రీతి. గాయత్రి బ్రహ్మబోధకము, బ్రహ్మము బోధ్యము. పైవాక్యమున ప్రతిపాద్యము బ్రహ్మము ప్రతిపాదక శబ్దము ద్వారమున బోధింపబడినది. బ్రహ్మము సూక్ష్మతమము. అందు మనస్సు ప్రవేశింప వలయుననిన, నయ్యది పలుమారు భావింపవలసి యున్నది. బ్రహ్మమును బలుమారు భావింప నను వగు సాధనము దానిని బ్రతిపాదించు పదమునకు మించి మరియొండేది యగును? లక్ష్యమున బాణమును బ్రవేశింప జేయుటకు ధనువు తోడ్పడునట్లు, బ్రహ్మమున మనస్సును నివేశింప జేయుటకు బ్రహ్మప్రతిపాదక శబ్దము మిక్కిలిగ దోడ్పడును. ప్రతిపాదక శబ్దము నభ్యసింపనివాడు ప్రతిపాద్య విషయమున మనస్సును సమాహితము (స్థిరము) చేయజాలడు. అందువలననే దర్శనాంతరమున.

('తజ్జప స్త దర్థ భావనమ్' యో. ౧.౨౮) 'ప్రతిపాదక శబ్దజపము, ప్రతిపాద్యమగు నర్థభావనము రెండును మనోనిగ్రహమునకు సాధనముగ జెప్పబడినవి. బ్రహ్మప్రతిపాదక శబ్దములలో ముఖ్యము ప్రణవము (ఓమ్)

(ఓమ్ క్రతో । స్మర. యజు-౪౦.౧౫.)

'ఓ జీవా; 'ఓమ్' అని స్మరింపుము.' అని యజుర్వేదమున నుపదేశింపబడినది. ఇట్లే యోగము నందును,

('తస్య వాచకః ప్రణవః' యో. ౧-౨౭.)

బ్రహ్మమునకు వాచకము ప్రణవము -ఓమ్- అని వర్ణింపబడినది. మనస్సు బ్రహ్మమునందు ప్రవేశించుటకు ప్రణవము ధనువువంటిదని ముండకోపనిషత్తునందు వర్ణింపబడి యుండుటను జూడగలము.

('ప్రణవో ధనుః శరోహ్యాత్మా
బ్రహ్మ తల్లక్ష ముచ్యతే
అప్రమత్తేన వేద్ధవ్యం
శరవ త్తన్మయో భవేత్' ముం. ౨-౨-౪ )

'ప్రణవము ధనుస్సు. మనస్సు శరము - బాణము. బ్రహ్మము లక్ష్యము. అప్రమత్తుడై (జాగరూకుడై) లక్ష్యమును భేదింపవలెను. బాణము లక్ష్యమున లగ్నమగునట్లు జీవుడు బ్రహ్మమునందు లగ్నుడు కావలెను.

'ఓమ్' అను శబ్దమెట్లు బ్రహ్మవాచకమో యట్లే గాయత్రీ ఛందస్సుకూడ నిట బ్రహ్మవాచకముగ గ్రహింపనగును. ఇట్లే యితరోపనిషద్వాక్యములందును చూడనగును.

('ఓమితి బ్రహ్మ, ఓమితీదం సర్వమ్' తై.౧-౮)

కాబట్టి గాయత్రీఛందస్సు బ్రహ్మవాచకమే; కాని, వర్ణాత్మక ఛందోబోధకము కాదు. అందువలననే 'జ్యోతిః' పదము బ్రహ్మబోధకమని చెప్పబడినది— (౨౫).

మరియొక హేతువు

"భూతాది పాదవ్యాప దేశోపపత్తే శ్చేవమ్" ౧-౧-౨౬

భూతా.... పత్తేశ్చ= బ్రహ్మమునందే భూతము, పృథివి, శరీరము, హృదయము నను పాదచతుష్టయము సంగతమగుటవలనను. ఏవమ్ = ఇట్లే గాయత్రీపదముచే బ్రహ్మమే యుపదేశింపబడునని యంగీకరింపవలయును.

('గాయత్రీ వా ఇదం సర్వం యదిదం కించ.)

'ఈభూతజాతమంతయు గాయత్రియే' యని ప్రారంభించి, భూతము, పృథివి, శరీరము, హృదయము నను వానిని వివరించి యనంతరమున (సైషా చతుష్పదా షడ్విధా గాయత్రీ') నియ్యది యారు విధములయిన నాలుగు పాదములుగల గాయత్రి యని యుపసంహారము చేయబడియున్నది. ఇయ్యది గాయత్రీ ఛందస్సేయయిన దానికి భూతపృథివ్యాదులు పాదములుగా వర్ణింపబడి యుండెడివికావు. ఛందస్సు వర్ణాత్మక మగుటచేత దానికి భూతములున్నగునవి పాదములగుటయు పొసగదు. ఛందస్సు అక్షరముల సన్నివేశము తక్క మరియొండెట్లు కాగలదు ? ఛందస్సేయుపనిషత్తున కభిప్రేతమగుచో ('తావానస్యమహిమా....) అను ఋఙ్మంత్రమును నుదాహరింపబడి యుండదు.

(తావానస్య మహిమా-ఋ ౮ ౪. ౧౭ ౩.) అను నీమంత్రము బ్రహ్మమహిమను వర్ణించుచు బ్రహ్మబోధకమ్మై యుండుట యుపనిషత్తుకు దెలియదా ! ఉపనిషద్రచయిత యగు మహర్షి బ్రహ్మపరమగు మంత్రమును గాయత్రీ ఛందస్సుపరముగ నెట్లు వర్ణించును ? మరియు నీమంత్రమునందలి (అతో జ్యాయాగ్ంశ్చ పూరుషః) పురుషపదము బ్రహ్మపరమ్మై యర్థవంతమగును కాని, ఛందస్సును బోధింపనేరదు.

ఇంకను నీ ప్రకరణమునందే
(తదేతత్ పూర్ణమపరివర్తి-పూర్ణామపరివర్తినీం శ్రియం లభతే య ఏవంవేద,'
ఛా-౩ ౧౨. ౯.)

('ఇయ్యది పూర్ణము; పరివర్తనము లేనిది. దీనినిట్లు దెలిసినవాడు పరివర్తింపని సంపదను బొందును.' అని ఫలశ్రుతియు జెప్పబడియున్నది. ఇట్టి పూర్ణము నపరివర్తియునగు సిరినిబొందింపజేయుశక్తి వర్ణాత్మకమగు ఛందస్సుకు గలదనుట యసంగత

మగును. బ్రహ్మయే యట్టి శ్రీకరము గాగలదు. అదియే పూర్ణము సపరివర్తియును. అందువలననె,

(పూర్ణమదః, పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే, పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావ శిష్యతే. బృ. ౩. ౮. ౮.)

అని యుపనిషత్తులో మరియొకచోవర్ణింపబడినది. కాబట్టి యుపనిషద్వాక్యము (గాయత్రీవా ఇదం సర్వం భూతం) నందలి గాయత్రీపదము గాయత్రియను పేరుగల బ్రహ్మమునే చెలుపును. అందువలననే తరువాతి వాక్యమునందుగల 'జ్యోతిః' పదముకూడ బ్రహ్మవాచకమే యనుట నిస్సందిగ్ధము. (౨౫)

' ఈ విషయముననె మరియొక శంకకు సమాధానము.

"ఉపదేశ భేదాన్నేతిచే న్నోభయస్మి
న్న విరోధాత్" ౧. ౧. ౨౬.

ఉపదేశ భేదాత్ = ఉపదేశములలో భేదముండుటచే న ఇతి చేత్ = జ్యోతిఃపదము బ్రహ్మవాచకము కాదందురేని, న = అది తగదు. ఉభయస్మిన్నపి = రెండు వాక్యములందును. అవిరోధాత్ = అర్థ విరోధము లేదు.

(గాయత్రీ వా ఇదం సర్వం) 'ఇది యంతయు గాయత్రియే' యని ప్రారంభించి యందుల కుదాహరణముగా గ్రహించిన మంత్రమునందు, (త్రిపాదస్యామృతం దివి) 'ఈ బ్రహ్మముయొక్క యమృత పాదత్రయము దివమునందు' అని ద్యులోకము బ్రహ్మమున కాధారముగ నుపదేశింపబడినది. రెండవ జ్యోతి ర్వాక్యమునందు (యదతః పరోదివః) 'ఈ ద్యులోకముకంటె బరమున' అని ద్యులోకము జ్యోతి కవధిగ జెప్పబడినది. ఇట్లు ద్యులోక మొకచో నాధారముగాను, మరియొకటి నవధిగాను వర్ణించుటచే నుపదేశములలో వైరుధ్యము గనబడుచున్నది. అందువలననే పూర్వవాక్యమునకు ద్యులోకమునందు త్రిపాద్బ్రహ్మ మున్నదనియు, తరువాతి వాక్యమునకు ద్యులోకమునకు బరమున బ్రహ్మమున్నదనియు పరస్పర విరుద్ధార్థము లేర్పడుచున్నవి. ఇట్టి యర్థభేద ముండుటవలన పూర్వవాక్యమున జెప్పబడిన బ్రహ్మమే తరువాత జ్యోతిర్వాక్యమునందు గ్రహింపబడవలయుననుట యుక్తము కాదని సమాధానము.

ఉపర్యుక్త రెండు వాక్యముల యర్థమునందు విరోధమొందునులేదు. బ్రహ్మము వ్యాపకము. అయ్యది భూమి మొదలు ద్యులోకమువరకు నంతటను లోపల, వెలుపల నను భేదములేక వ్యాపించి యున్నది. అందువలననే యజుర్వేదమునందు—

(తదంతరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః) బ్రహ్మము సర్వమున కంతర్బహిర్భాగములలో నున్నది.' యని వర్ణింపబడినది. కాబట్టి సర్వాంతర్బహిర్ వ్యాపకమగు నాబ్రహ్మము ద్యులోకమునందును, ద్యులోకమునకు బరమునను గలదని వర్ణింపబడుట మిక్కిలి యుక్తమే యగును. ఉపదేశద్వయమందు నెట్టి విరోధమునులేదు. కాబట్టి (జ్యోతిః చరణాభిధానాత్) అను తావునగల 'జ్యోతిః' పదము బ్రహ్మవాచకమే యనుటతథ్యము—(౨౬)



# రామాయణము - పురుషకార వైభవము

శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

రామాయణములో అమ్మవారి పురుషకార వైభవము, భారతములో స్వామి ఉపాయ వైభవము ప్రధానముగ ప్రతిపాదితము లైనవని పూర్వాచార్య శ్రీవచనము. వాల్మీకి మహర్షికూడా "కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్" (రామాయణ మాద్యంతము ఆ తల్లియొక్క మహత్తరగాథయే) అని నుడివెను. భగవంతునితో నిత్య సంశ్లిష్టయయ్యును చేతన జనోద్ధరణకై ముమ్మారు భగవద్విశ్లేషము ననుభవించినది తల్లి. నూతిలోపడిన బిడ్డతోపాటుగ నూతిలో దుముకు తల్లివలె రావణాసురునిచే చెరపెట్టబడిన దేవతాస్త్రీల విముక్తి సాధించుటకై తానును స్వయముగ చెరననుభవించినది జగన్మాత!

పురుషకారత్వ మనగా ఘటకత్వము; రెండువస్తువులకు సంయోగము కలిగించుట. సంసారార్ణవ విపన్నులైన చేతనులకు సర్వేశ్వర సాయుజ్యము ఘటింపజేయుటలో అమ్మవారి పురుషకారకృత్యమావశ్యకము. పరమేశ్వరు డెంత దయామయుడో అంత కఠినస్వభావుడు కూడ. జీవులను వారివారి కర్మల ననుసరించి దండించు కాఠిన్యముగూడ ఆయనకు గలదు. తల్లిమాత్ర మట్లుకాక, కాఠిన్య స్పర్శయేలేని కేవల దయామయి. ఇటు చేతనుల కర్మపారతంత్ర్యము నశింపజేసి, వారిని ఈశ్వరోన్ముఖులుగా చేయుటకు, అటు—స్వామి కర్మ పారతంత్ర్యమునకు స్వస్తిచెప్పి, ఆయన నిర్హేతుక జాయమాన కరుణావీక్షణము ఆర్తులైన ప్రపన్నులపై ప్రసరింపజేయుటకు నిరంతరము తల్లి శ్రమించుచుండును.

సీతారాములు అరణ్యవాసమునకు బోవ నుద్యుక్తులైన సమయమున లక్ష్మణస్వామివచ్చి దీనముగ తననుగూడ వెంట గొనిపోవలసినదని రామునికాక, ముందుగా సీతనే అర్థించును:

స భ్రాతు శ్చరణౌ గాఢం నిపీడ్య రఘునందనః
సీతా మువాచాతియశాః రాఘవంచ మహావ్రతమ్.

(లక్ష్మణుడు అన్నగారి పాదములను గాఢముగా కౌగిలించుకొని, సీతతోను, మహావ్రతుడైన రాఘవునితోను ఇట్లు విన్నవించుకొనెను.)

ముందుగా సీతతో విన్నవించి, పిమ్మట రాఘవునితో 'కూడ' (చ) విన్నవించుకొనెనట! ఇచట రాఘవునికి వాడిన 'మహావ్రతమ్' అను విశేషణము ఆయన దురాపాద్యతను, అమ్మవారి పురుషకారావశ్యకతను సూచించుచున్నది.

ఇట్టిదే మరొక సన్నివేశము. సీతారామలక్ష్మణులు పంచవటి చేరిన తరువాత "యోగ్యప్రదేశము నిర్ణయించి, ఒక పర్ణశాల నిర్మింపుము" అని శ్రీరాముడు లక్ష్మణుని ఆదేశించెను, యోగ్యతాయోగ్యతలు నిర్ణయించు స్వాతంత్ర్యము నాయన లక్ష్మణునికే వదలెను కాని, సర్వ ధర్మములు పరిత్యజించి, స్వామికి శేషభూతుడుగ నున్న లక్ష్మణస్వామి కీ ఆదేశము హృదయ విదారకమైనది,

"ఏవ ముక్తస్తు రామేణ లక్ష్మణ స్సంయుతాంజలిః
సీతా సమక్షం కాకుత్స్థ మిదం వచన మబ్రవీత్
పరవానస్మి కాకుత్స్థ! త్వయి వర్షశతం స్థితే
స్వయంతు రుచిరే దేశే క్రియతామితి మాం వద."

(రాముడట్లు చెప్పగా లక్ష్మణుడు బద్ధాంజలియై సీతాసమక్షమున ఆ కాకుత్స్థునితో ఇట్లనెను: "ఓ

స్వామీ! నీకు నూరేండ్లు వచ్చినను నేను నీకు పరతంత్రుడనే! నీవే స్వయముగా రుచిర ప్రదేశమును నిర్ణయించి, ఇచట పర్ణశాల నిర్మింపుమని నన్నాదేశింపుము.")

ఇచట 'సీతాసమక్షమ్' అను పదము అత్యంత సార్థకముగ ప్రయోగింపబడినది. లక్ష్మణునివంటి మహా ప్రపన్నుడుగూడ స్వామి యనుగ్రహమును బొందుటకు సీతను పురుషకారముగా ఎట్లు స్వీకరించినది సూచించుటకే ఆదికవి సీతాసమక్షమునసే లక్ష్మణుడు రాఘవునితో విన్నవించుకొనినట్లు వర్ణించెను.

ఇక—కాకాసురుని విషయములో ఆతల్లి చూపిన కృప అవధుల నెరుగనిది. మహాక్రూరుడైన జయంతుడు కాకి రూపమున వచ్చి, ఆ తల్లి విషయములోనే అకృత్యము తలపెట్టెను. వానిపై కోపించి స్వామి బ్రహ్మాస్త్రము ప్రయోగించినారు.

"స పిత్రాచ పరిత్యక్తః సురైశ్చ సమహర్షిభిః
త్రీన్ లోకాన్ సంపరిక్రమ్య త మేవ శరణంగతః"

తండ్రిచేతనే పరిత్యక్తుడైన వానిని దేవతలుగాని, మహర్షులు గాని ఎట్లు రక్షింపగలరు? మూడు లోకములవెంట గ్రుమ్మరి క్రుమ్మరి ఆ కాకము తిరిగి స్వామినే శరణు వేడెను.

"పురతః పతితం దేవీ ధరణ్యాం వాయసం తదా
తచ్ఛిరః పాదయోస్తస్య యోజయామాస జానకీ
తముద్ధాప్య కరేణాథ కృపాపీయూషసాగరః
రరక్ష రామోగుణవాన్ వాయసం దయయైక్షత."

(కన్నెదుట నేలపై బడిన ఆ వాయసమునుజూచి దేవి వాని తలను స్వామి పాదములపై చేర్చినది. చేతితో ఆ కాకమును పైకి లేవనెత్తి. కృపామృత సముద్రుడైన స్వామి వానిపై దయావీక్షణములు బరపెను.)

ఒక్క తల్లికి తప్ప తనమీదనే దురాగతము తలపెట్టిన వానిమీదకూడ అంతటి వాత్సల్యము వేరెవ్వరికుండును? స్వయముగా కాకాసురుని అపచారమును మన్నించుటేకాక, వాని శిరస్సును స్వామి పాదములపై జేర్చి వానికై స్వామి కృపనుగూడ అర్థించిన ధరాజాత క్షమాగుణము అనన్యాదృశము గదా!

స్వామితో కలసియుండిన కాలముననేకాక, వియోగము పొంది విదూరగ నుండిన సమయమున గూడ జానకి తన పురుషకారకృత్యమును విరమింపలేదు. రామాయణములో ఆదినుండి తుదిదాక కృపాప్రపూర్ణమైన ఆ మాతృ హృదయము ప్రస్ఫుటమగుచునే వచ్చినది. కాకాసురుని కటాక్షించినట్లే, అంతకంటె ఘోరదుష్కృత్యము నాతల్లి విషయములో తలపెట్టిన రావణునిగూడ ఆమె అనుగ్రహింపబూనినది. రావణు డెట్లయిన స్వామి శ్రీపాదముల నాశ్రయించునట్లు చేయుటకై ఆమె బహువిధముల యత్నించినది.

"ఇహ సన్తో నవా సన్తి సతోవా నానువర్తసే
తథాహి విపరీతాతే బుద్ధి రాచారవర్జితా."

"ఓ రావణా! ఈ లంకలో సత్పురుషులే లేరా! ఒకవేళ ఉన్నను వారిని నీవనువర్తింపవా? ఏల నీ బుద్ధి విపరీత మార్గములనుబట్టి, సదాచారవర్జితమైనది?" అని ఆ రావణునియందును తల్లికృపనే వెలయించినది.

జానకీదేవి కృప పరాంకోటి నందుకొన్న ఘట్టము ఇంకను ముందున్నది. రావణవధానంతరము అంతకు పూర్వము జానకిని హింసించిన రాక్షస కాంతలను చిత్రవధ చేయుదునని హనుమంతుడు బయలుదేరెను. అప్పుడు తల్లి వానిని వారించి ఇట్లన్నది:

"పాపానాం వా శుభానాం వా వధార్హాణాంప్లవంగమ
కార్యం కరుణ మార్యేణ న కశ్చి న్నాపరాధ్యతి"

("పాపములవలనగాని శుభములవలనగాని వధార్హులైనవారి విషయములో ఆర్యుడు కారుణ్యమునే చూపవలెను. ఈ లోకములో అపరాధము చేయనివాడని ఒక్కడు కలడా నాయనా!")

సాపరాధులైన వారియందుకూడ జగన్మాతకృప ఎట్లు పొంగి వచ్చునది ఈ పలుకులు విశదము చేయుచున్నవి. ఈ సన్నివేశమును మనమునందిడుకొనియే

శ్రీ గుణరత్నకోశములో భట్టర్‌వారు అమ్మవారి నీ విధముగ స్తుతించినారు :

"మాత ర్మైథిలి! రాక్షసీ స్త్వయి తథై
వార్ద్రాపరాధాం స్త్వయా
రక్షన్త్యా పవనాత్మజా ల్లఘుతరా
రామస్య గోష్ఠీ కృతా
కాకం తం చ విభీషణం శరణ
మిత్యుక్తిక్షమౌ రక్షతః
సా న స్సాంద్ర మహాగస స్సుఖయతు
క్షాంతి స్త వాకస్మికీ."

(తల్లీ ! మైథిలి ! ఆర్ద్రాపరాధలైన రాక్షసస్త్రీలను గూడ హనుమంతుడినుండి కాపాడజాలిన నీ కృప తనను శరణువేడిన కాకాసుర, విభీషణులనుమాత్రమే రక్షించిన శ్రీరాముని కృపను అధిగమించినది. అట్టి నీ క్షమాగుణము సాంద్ర మహాపరాధులమైన మాకు ఊరట కలిగించుగాక !)

స్వామితో సంశ్లేషదశలో—— 'క్షిపామి' (త్రోసి వేయుదును), 'న క్షమామి' (క్షమింపను) అని భీష్మించుకొని కూర్చున్న స్వామికి చేతనులయందు కరుణ కలుగునట్లు తల్లి ఉద్బోధించును. విశ్లేష దశలో—— స్వామి శ్రీపాదముల మరచి, దుష్టమార్గ ముల వెంటబోవు చేతనుల మనములను భగవచ్చర ణాభిముఖములుగ నామె తీర్చిదిద్దును. స్వామిని, చేతనులను గూడ మొదట నుపదేశముచేతనే ఆమె వశంవదుల నొనర్చుకొన జూచును. అది విఫల మైనచో, స్వామిని తన సౌందర్యముచేతను, చేతను లను తన కృపచేతను ఆమె లోగొనును.

అసలు 'శ్రీ' శబ్ద వ్యుత్పత్తిలోనే తల్లి పురుషకా రత్వము వ్యక్తమగుచున్నది. 'శ్రిఞ్-సేవాయాం' అను ధాతువునుండి 'శ్రీయతే' ఆశ్రయింపబడునది గావున శ్రీ అని యొకవిధముగాను, 'శ్రయతే' ఆశ్ర యించునది కనుక శ్రీ అని మరియొకవిధముగాను శ్రీ శబ్దము విష్పన్నము చేయవచ్చును. చేతనులచే ఆమె ఆశ్రయింపబడును; అచేతన పునరుజ్జీవన మునకై ఆమె సదా స్వామి నాశ్రయించుచుండును. 'శ్రూ-హింసాయాం,' 'శ్రూ-విస్తారే' అను ధాతువుల నుండిగూడ 'శ్రీ' శబ్దము సాధింపవచ్చును. 'శృణాతి నిఖిలాన్' (సర్వదోషములను నశింపజేయునది గనుక) శ్రీ అని ఒకవిధమైన వ్యుత్పత్తి; శ్రూణాతిచ గుణైర్జగత్' (గుణములచే జగత్తునంతను నింపును గనుక) శ్రీ అని మరియొక విధమైన వ్యుత్పత్తి. ఈ వ్యుత్పత్తులవలన చేతనులలోని దోషములను హరించి గుణములు విస్తరింపజేయుటలో శ్రీ దేవికి గల సామర్థ్యము వ్యక్తమగుచున్నది.

రామాయణములో స్వామితో తల్లికి కలిగిన సంశ్లేష విశ్లేషములు కేవలము లీలామాత్ర కల్పిత ములుగదా ! నిజమున కామె స్వామితో నిత్యాను షక్తయే ! ఈదృష్టిలో-సీతా వియోగకాలమున విభీష ణాదులపై స్వామిచూపిన కృపనుగూడ ఆయన హృదయైక సంవాసిని అగు అమ్మవారి పురుషకార ఫలితముగానే గ్రహింపవచ్చును.

కొందరికి ఒకశంక కలుగవచ్చును. "రావణుని బలాత్కారముచే సీత లంకకేగినది గాని, దేవతా స్త్రీల విముక్తికై తానై కోరికోరి చెరబడినదా ?" అని. నిజమునకిట్టి శంకలు నాస్తికులకుతప్ప కలుగవు. లేకున్న-'శీతోభవ !' అని అగ్నిదేవునే శాసింప గలిగిన తల్లి 'నష్టోభవ రావణ !' అని అనలేక ఊరకున్నదా ?

పురుషకారముగా నాచరించుటకు మూడు విధము లైన యోగ్యతలు కావలెను; కృప, పారతంత్ర్యము, అనన్యార్హత్వము. రామాయణములో సీత స్వామితో వియోగము ననుభవించిన మూడు సందర్భములలోను వరుసగా ఈ మూడుగుణములు ఆమెలో వ్యక్తమైనవి. మొదటిసారి రావణాపహృత యైనపుడు 'దేవ్యా కారుణ్యరూపయా' అని అభివర్ణిత అయిన సీత కృపాగుణము వెల్లువలు కట్టినది. 'న కశ్చి న్నాపరాధ్యతి' అని సాపరాధుల విషయములో సైత మామెకృప ప్రవర్తిల్లినది. రావణుడు పరాజితుడైనట్లు శ్రీరాముడు జయించినట్లు కలగని త్రిజట ఇతర రాక్షసస్త్రీలకు తన స్వప్నవృత్తాంతము చెప్పగా,

అంతవరకు సీతను హింసించుచుండిన ఆ రాక్షసాంగన లందరు భయపడిరి. అప్పుడు సీత "భవేయం శరణం హి వః" అని వారికి అభయప్రదానము చేసి వారి నోదార్చినది.

రెండవమారు పట్టాభిషేకానంతరము శ్రీరామునిచే సీత వివాసిత అయినప్పుడు ఆమెలోని పారతంత్ర్య గుణము ప్రస్ఫుటమయినది.

"పతిర్హి దైవతం నార్యాః పతిర్బంధుః పతిర్గతిః
ప్రాణైరపి ప్రియం తస్మాత్ భర్తుః కార్యంవిశేషతః"

(నారికి పతియేదైవము; పతియే బంధువు; పతియే గతి; ప్రాణములకంటె గూడ ప్రియతరుడు పతి; పతికార్యమే సతికి కర్తవ్యము.)

"నఖల్వద్యైవ సౌమిత్రే! జీవితం జాహ్నవీజలే
త్యజేయం రాఘవం వంశే భర్తుర్మా పరిహాస్యతి."

(లక్ష్మణా! నా గర్భమునుండి వచ్చిన రఘువంశ సంతానము నష్టము కారాదను అభిప్రాయముతో నేడే గంగలో పడి ప్రాణములను వీడజాలకున్నాను)

ఈ పలుకులలో సీత తానెప్పుడును స్వామికి పరతంత్రురాలనే అని తన పారతంత్ర్య గుణము విశదము చేసినది.

మూడవ మారు భూవివరమును ప్రవేశించు సమయములో సీత-

"అనన్యా రాఘవేణాహం భాస్కరేణప్రభాయథా"

(సూర్యునినుండి కాంతి విడివడియుండజాలనట్లు రాముని వీడి నాకు అస్తిత్వము లేదు.)

అని తన అనన్యార్హత్వమును చాటినది.

వాల్మీకి కృత శ్రీమద్రామాయణము నానామహార్థ రత్నఖని. భారతీయులపాలిటి కది ఒక కల్పవృక్షము. భట్టర్ వారు చెప్పినట్లు- మహాపాపాత్ములకు గూడ మోక్షము కలిగించునట్టి అమ్మవారి పురుషకార వైభవమును సప్రపంచముగ ప్రతిపాదించుచున్న శ్రీమద్రామాయణము అధికారి, అనధికారి, భేదము లేకుండా సర్వజనోపాదేయమైనది.

[ఈ వ్యాసములో ముప్పాతిక మూడు వీసములు పూర్వాచార్య శ్రీవచనముల కస్ఫుట ప్రతిధ్వనులు తమిళమున శ్రీ పిళ్లై లోకాచార్య విరచితమైన శ్రీ వచన భూషణమునుండి, శ్రీమన్మణవాళ మహాముని కృత తద్ వ్యాఖ్యనుండి గృహీతము.]

## శ్రీశైలం దేవాలయానికి రాష్ట్రపతి విరాళం

*శ్రీశైలం దేవాలయ పునరుద్ధరణ కార్యక్రమానికి రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్రప్రసాద్ రు. 500 విరాళం ప్రకటించారు. శ్రీశైలంలో తిరుపతి దేవస్థానం అధ్వర్యాన నిర్మిస్తున్న ధర్మశాలకు శంకుస్థాపన చేసే సందర్భంలో రాష్ట్రపతి ఈ విరాళం ప్రకటించారు. మల్లికార్జునస్వామి దేవాలయంలో అయిదు బంగారు కలశములను నెలకొల్పడానికి విజయవాడలోని కనకదుర్గ గుడి తరఫున వచ్చిన రు. 5 వేల విరాళం చెక్కును శ్రీశైలం దేవాలయం కార్యనిర్వాహణ ఉద్యోగి శ్రీ రాజగోపాలరాజుకు రాష్ట్రపతి అందజేశారు.*

# గీ తా గా న ము

శ్రీ మోటూరి వేంకటరావు

(గతసంచిక తరువాయి)

మదిని గామము మమత నహమును
వదలి విషయవ్రాతముల హృదిఁ
బొదల నీయని బుద్ధిమంతున
కొదవు సుఖశాంతుల్.

బ్రహ్మ మందలి పరమ పదవిని
బడయఁ గోరి ప్రపంచ విషయ
ప్రచయ దళన ప్రజ్ఞ నెసఁగెడు
బహుళ నిష్ఠాపరుని యోగిని
బాడు మోహము పట్ట, దతఁ డు
జ్వలిత ముక్తిఁ గనున్.

## తృతీయాధ్యాయము

### కర్మయోగము

అటులు కృష్ణుఁడు వల్క నా సవ్యసాచి
యిటు లనియెఁ "గేశవా ! ఇల యోగబుద్ధి
కర్మకంటెను మహితగతి యేని భయద
కర్మకై నన్నేల గడఁగు మంచనెదు ?

ద్వివిధభావములఁ జిందిలు వాక్యసరణి
నవహితమ్ముగను మోహము నెంద బుద్ధి
పలుకుచుంటివి— దేనివలన శ్రేయమ్ము
గలుగునో యేర్పరచి తెలుపు మద్దాని."

అనఁగ మధుసూదనుం డనియె నీ రీతి
"అనఘ ! విను మేను సృష్ట్యాదినే సాంఖ్య
గణమునకు జ్ఞానయోగము, కర్మయోగ
మొనగూర్చితిని కర్మయోగి సంతతికి.

తన కర్మలను ద్యజించిన యంత మాత్ర
మొనరునే నైష్కర్మ్య మొక్కింత యేని—
తన కర్మసంచయమ్మును మనుజుఁ డెంత
అణఁచివేసినను సిద్ధిని బొందఁ గలఁడె ?

క్షణకాల మైనఁ గర్మను జేయకుండ
మనఁ గల్గునే ధరిత్రిని మానవుండు ?
ప్రకృతిఁ బుట్టిన గుణప్రకరంబు వలన
సకలజీవులు కర్మ సలుపంగవలెను.

కర్మేంద్రియమ్ములను గట్టివైచినను
నిర్మలాత్ముఁడు గాక నిఖిల విషయములు
మతి ననారతము సంస్మరణ మ్మొనర్చు
నతఁడు మూఢుండు- మిధ్యాచారపరుఁడు.

అటుగాక సర్వేంద్రియములు చిత్తమునఁ
బటుతర ప్రజ్ఞతో బంధించి వాని
సహజ ప్రవృత్తులను సాగంగఁజేసి
యిహమందు ఫల మంద నెంచఁడు వివేకి

నియతకర్మను జేయ నీకె శ్రేయమ్ము-
జయ మొందలేవు నైష్కర్మ్య మార్గమున-
కర్మ విడనాడినఁ గడచునే నీకు ?
నిర్మలమ్ముగఁ జనునె నీ తనూయాత్ర ?.

జన్మమునకై కాక జరుపఁబడు కర్మ
లన్నిఁటను గౌంతేయ ? యైహికపుఁ గట్లు
గలగొనున్ గనుక సంగరహితుఁడ వగుచుఁ
జలుపవలెఁ గర్మలను ఫలకాంక్ష వీడి.

సృష్టిఁ దలకొని ప్రజను శిష్టయజ్ఞాళి
సృష్టించి అల్ల సరసీరుహోద్భవుఁడు
'జనులు గాంచెదరు యజ్ఞములచే వృద్ధి
వెనుక నది కోర్కులను బితుకు నంచనియె.

హవనమ్ము లందు భవ్యంపు హవ్యముల
దివిజుల కొసంగి ప్రీతిని గూర్తు రేని
వర్షములు గురిపించి పంటలను బెంచి
హర్షమును మీ యెదల హవణింత్రు వారు.

యాగములచే దేవతాళి మీ కిష్ట
భోగముల్ గూర్చెదరు మోదమ్ము చెంది-
అనిమిషుల్ సమకూర్చునవి వారి కిడక
యనుభవించినఁ జోరుఁ డగు నతఁడు పార్థ!

జన్నమ్ము లైదు కొనసాగఁగా మిగులు
నన్న శాకమ్ములను దిన్నచో సమయు
ననుగతాఘములు: యజ్ఞార్థమై గాక
తనకోస మని వండు కొనఁ బాప మొదవు.

ప్రాణతతి యన్నమ్ము వలన నుత్పన్న
మౌనుఁ బరన్యుచే నన్నమ్ము గలుగు,
సవనముల చేత పర్షతియును యజ్ఞ
నివహమ్ము కర్మలఁ బ్రభవ మొందుచుండు.

వేదోద్భవం బగుచు వెలయుఁ గర్మమ్ము,
ప్రాదుర్భవిం చక్షరమున బ్రహ్మమ్ము,
గాన సర్వవ్యాప్త మైన బ్రహ్మమ్ము
రాణించు సుమి యనారతము యజ్ఞమున.

*ఈ చక్రవర్తనం బెవఁ డనుసరించి
యాచరింపఁడొ యతం డఘసమాశ్లిష్ట
కర్ముఁడై విషయసక్త స్వాంతుఁ డగుచు
శర్మంబు గనక నిస్సారుఁడై బ్రతుకు.

ఇంద్రియములకు లోఁగ కెవఁ డాత్మయందె,
సాంద్ర మహదానంద సంతృప్తు లందె,
నిరతిమై సతతమ్ము వఱలునో యతని
కరయంగఁ జేయఁ దగినట్టి పని లేదు.

నిర్మలం బగు నాత్మ నిష్ఠతోఁ గడిఁగి
కర్మ లొనరించినఁ గలుగరు ఫలమ్ము—
సలుపకుండినను నష్టమ్ము వాటిలదు—
తలఁప భూతాళితోఁ దనకుఁ బనిలేదు.

ఫలకాంక్ష లేక కర్మలను జేయంగ
వలయు ; ఆ కృత్యముల వలన మోక్షమ్ము
గలుగు ; ఎయ్యెడ నేని కర్మయోగమ్ము
సలుపు పురుషున కిదియె సత్పథమ్ము పార్థ!

జనకాది బుధులు నిష్కామ కర్మంబు
లొనరించి మోక్షంబు గనిరి — ఆ త్రోవ
గని. ప్రజానీకమ్ము గలుషమార్గములఁ
జననీని హితకర్మలను జేయవలెను.

జ్ఞానియే కార్యమ్ము జరుపునో కానిఁ
బూని తక్కిన జనమ్ములు సేయ నెంత్రు
వాని కేది ప్రమాణ మౌనొ వారికిని
మానిత ప్రబల ప్రమాణమే యగును.

(సశేషము)



*కర్మ లనెడు యజ్ఞములు భూతము లాచరింపఁగాఁ బర్జన్యుఁడు సంతసించి యన్న మిడును. దాని వలన సకల భూతవ్రాతము పెంపొంది యజ్ఞములు సేయును. ఇట్లు జగమునకు నాదియు నంత్యము నగు ఈ కర్మ యజ్ఞపరిణామ చక్రమై యొప్పెడిది.

# చతుర్మత తత్త్వం - శాంకరాద్వైతం

శ్రీ వేదాల తిరువేంగళాచార్యులు

(గతసంచిక తరువాయి)

శైలిభేదమేకాక ఎచటనుగూడ ప్రస్తావింపబడనివియు, శ్రీ శంకరులు ప్రస్తావింతురని సంభావింపదగనివియు నగు శ్రీ విష్ణుతిలకము, విష్ణుధర్మోత్తరము, శివధర్మోత్తరము, శివపురాణము, బ్రహ్మపురాణము మొదలగునవి యటప్రమాణములుగా బ్రస్తావింపబడినవి. ఇది శ్రీ శంకర భగవత్పాదుల పద్ధతి కాదు. మరియు నీ గ్రంథము శ్రీ శంకర భగవత్పాదుల గ్రంథము కాదనుటకై యసాధారణ చిహ్నమున్నది. సామాన్యముగా నాదిశంకరు లొనర్చిన భాష్యము లన్నియు ఆనందగిరిచే వ్యాఖ్యానింపబడుట యొక యసాధారణ చిహ్నము. అది ప్రకృతములో గన్పడు శ్వేతాశ్వత భాష్యమునకు లేదు.

సరి, ఇట్లు చాలాగ్రంథములను అస్మదాదిమూఢుల నుద్ధరించుటకై రచించిన ఆదిశంకరులు చూర్ణినది యొడ్డున మళయాళదేశములో "కాలటి" యను నగ్రహారమున నంబూద్రి బ్రాహ్మణవంశమున నవతరించిరి. వారి జన్మకాలమును నానావిధములుగా దెల్పుదురు. అందు ఆదిశంకరపీఠమైన శ్రీ శృంగేరీ పీఠ సంప్రదాయము ననుసరించి కలియుగాబ్దములు (3058) మూడువేల ఏబది ఎనిమిదవ సంవత్సరమున ఈశ్వర సంవత్సరమున వైశాఖశుద్ధ పంచమీ భానువాసరమున నార్ద్రానక్షత్రమున 11, 15 ఘడియలకు మిథునలగ్నమున నుదయించిరి. తండ్రి శివగురుభట్టు, తల్లి ఆర్యాంబ.

విరూపాక్షపీఠపు సంప్రదాయమునుబట్టి కలియుగాబ్దములు 3889 వ సంవత్సరమున జననము, క్రీ. శ. 799 చైత్రమాసమున జననమని మరొకరి మతము. కుంభకోణ పీఠమువారి యభిప్రాయము కలియుగాబ్దములు 2593 యగు నందనవత్సర వైశాఖ మాసమున పునర్వసు నక్షత్రమున శంకర జననమని, శ్రీముఖ సంవత్సరమని కొందరు, హేవిళంబియని కొందరు ఈశ్వర యని ఇంక కొందరు. ఈమహాను భావుడు ముప్పదిరెండు సంవత్సరములలోనే పై జెప్పిన ప్రస్థానత్రయ భాష్యాది గ్రంథములు రచించి బ్రహ్మైక్యము నందిరి. (వీరి గోత్రము ఆత్రేయ గోత్రమని రాయప్రోలు లింగనసోమయాజిగారు) వీరు ప్రవచించిన యద్వైతమునకు జీవాతువగు విషయము జీవబ్రహ్మైక్యము. ఇది శ్రోతలందరి మనసుల కెక్కుటకై యనేకమంది గ్రంథకర్త లనేకమైన దృష్టాన్తములతో నుపపాదించిరి. ప్రతిపాదన మార్గము లెన్ని తీరులున్నను ఎంత భిన్నములుగా నగుపడినను ప్రధాన ప్రతిపాద్యమగు జీవబ్రహ్మైక్యము విషయములో నెవ్వరికిని విప్రతిపత్తి లేదు. ఎవరెన్ని తీరులలో నుపపాదింపబోయినను అద్వైతు లందరునుగూడ శ్రీ శంకరుల స్థానత్రయభాష్యములను సనత్సుజాతీయభాష్యాదులను అనుసరించియే ప్రతిపాదింపక తప్పదు.

ఇంక నింతకుపూర్వము నిరూపించిన యా మత తత్త్వములు మూడింటిలో మొదటి తత్త్వమును గూర్చి తెలుసుకొందము. 1. బ్రహ్మమొక్కటియే సత్యము- ఇది మొదటి సత్యము.

అయితే బ్రహ్మమొక్కటియే సత్యమగుచో నీ నానావిధములుగా గన్పడు ప్రపంచమంతయు నెక్కడిది? ఇది స్పష్టముగా గన్పడుచున్నదే. ఇట్లున్న

ఈ ప్రపంచమును లేదనగలమా? దీనికేమి సమాధానము? బ్రహ్మస్వరూపము సరిగా తెలియకపోవుట వలన నీయా శంక కల్గుచున్నది. అది సరిగా బోధపడినచో నీయా శంకయే కలుగదు కనుక నా బ్రహ్మస్వరూపమును సరిగా దెల్పుదుము. అసలు బ్రహ్మమనగా నేమి? "జన్మాద్యస్య యత." అని పారాశర్యుడు తెల్పుచున్నాడు. ఈ బ్రహ్మ లక్షణమును వివరింతుము.

"యతో వా ఇమానిభూతాని జాయన్తే యేన జాతాని జీవన్తి యత్ప్రయన్త్యభిసం విశన్తి తద్బ్రహ్మేతి" అని తైత్తిరీయ భృగువల్లిలో చెప్పబడినది. ఈ కనుపడు సకలమును దేనినుండి పుట్టుచున్నదో ఈ పుట్టినదంతయు దేనివలన జీవించుచున్నదో దేనియందిది యంతయు పోయి లీనమగుచున్నదో అదియే బ్రహ్మము అని బ్రహ్మలక్షణము తెల్పబడినది. ఇది కార్యముఖమున లక్షణము. దీనివలన నసలు వస్తువుయొక్క స్వరూపమేమియు తెలియదు. ఏమనగా ఒకచోట కాలిపోయిన యూరున్నదనుకొనుడు. "ఈ యూరును కాల్చినదగ్ని" అని చెప్పినందువలన నగ్నియొక్క కార్యము తెలియునుకాని స్వరూపమెరుకవడదుకదా. అట్లె యీ ప్రపంచముయొక్కయు ఉత్పత్తి స్థితిలయములకు కారణము బ్రహ్మము అనుట వలన నీవ్యాసపు ప్రారంభమున కల్గిన యాశంకకు ఈ ప్రపంచమునకు కారణమేమి అనుదానికి సమాధానము వచ్చినదేకాని అసూయాది కారణముయొక్క స్వరూపము స్పష్టముగా బోధపడలేదు. అయితే శుక్లపక్షపు విదియనాడు నెలపొడుపు నెరుగుటకై చంద్రుడెటనున్నాడు అని యడుగగా "ఆ కొమ్మమీదుగా నున్నాడు" అని చెప్పినట్లు.

(శాఖాచంద్ర న్యాయము)గా నేర్పడినది. జగత్కారణముగా బ్రహ్మము దెలిసినది అనగా కొమ్మ తాను తటస్థముగానుండి చంద్రుని గుర్తింపజేసినట్లుగా ఈ జగత్తు తాను తటస్థముగానుండి బ్రహ్మమును గుర్తింప జేయుచున్నది. కనుక నిది తటస్థ లక్షణము అనబడును. దీనివలన జగమునకు కారణము బ్రహ్మము అని తెలిసినది. అయితే జగమునకు బ్రహ్మమెట్టి కారణమా? సమవాయి కారణమా? అసమవాయి కారణమా? నిమిత్త కారణమా? ఈ మూడు రకములేకదా కారణము? జగము దేనినుండి కల్గుచున్నదో యనుటవలన బ్రహ్మము జగమునకు నిమిత్తకారణము. కులాలుని వలన కుండలు కల్గుటలేదా? బ్రహ్మయందు జగము లయమొందుచున్న దనుటవలన బ్రహ్మము జగమునకుపాదాన మగుచున్నది. కుండలు మన్నునందే కదా లయమొందుచున్నవి. ఇట్లు జగమునకుపాదానము నిమిత్తమునను రెండురకముల కారణమును బ్రహ్మయైనది.

## బ్రహ్మయొక్కటియే సత్యము

అయితే బ్రహ్మయే యీ విస్తృత్తమగు జగత్తునకుపాదానమగుచో నింక విస్తృత్తమగు నీజగత్తును కార్యమునకు బీజమత్యంత సూక్ష్మముగాకదా యుండవలెను? విస్మృతమగు మఱ్ఱిచెట్టు దాని బీజముల సంగతిని విచారింపుడు. కనుక నేది కారణమను విషయములో ననేకు లనేకవిధములుగా బరిశోధించిరి. సాంఖ్యులు జడ చైతన్యములని ప్రపంచమును రెండు రకముల విడగొట్టి రెండును రెండురకములకును కారణములనిరి. అపుడు అభిన్ననిమిత్తోపాదానము సిద్ధింపదు. "తదైక్షత బహుస్యాంప్రజాయే యత దాత్మానం స్వయమకురుతా. యనుశ్రుతి బ్రహ్మకు అభిన్ననిమిత్తోపాదాన భావమునేకదా తెల్పును; ఈ యుభయవిధ కారణము బ్రహ్మమనుటలో రెండు రెండురకముల కారణములు అను సాంఖ్యులకన్న కొంత ముందుపోయినట్లైనది. ఏమనగా—కర్తలుగా భోక్తలుగా, భోగ్యముగాను అకర్తగాను, అభోక్తగాను, అభోగ్యముగాను, అనేక విధములుగా నీప్రపంచ మున్నది. అంతేకాక కొన్ని కొన్ని యెడలనియత దేశకాలములై నియతఫలములై కొన్ని కన్పడును. మరికొన్ని అనియత దేశకాల ఫలములై యున్నవి. ఇట్లొక విధముగాకాక అనేక విరుద్ధ

మూలగానున్న ఈ ప్రపంచమున కొకజడముగాని అసమర్థుడునగు నొక చేతనుడుకాని ఇంచుమించు నశ్లేయగు పరమాణువులుగాని కారణములనుట యుక్తముగాదు.

కనుక నీవు ప్రపంచమునంతను ఎవరో ఒక సమర్థుడును సర్వజ్ఞుడును సర్వవేత్తయు నైనవాడు సంకల్పించి నిర్మించియుండవలెను. అయితే యింత విరుద్ధ ధర్మ ప్రచితమగు నీ ప్రపంచమునకు శూన్యమే కారణము కారాదా? ఈ విషయ ముపని షత్తులలోనే "తద్ధఏక ఆహుః అసర్వా ఇదమగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయం తస్మాదసతస్సజ్జాయతే" అని యాశంకించి "కుతస్తు ఖలు సోమ్యేవంస్యాత్ ఇతి హోవాచకథమసతస్సజ్జాయేత సచేవసోమ్యేద మగ్ర ఆసీత్ ఏకమేవా ద్వితీయం" అని నిరాకరింప బడినది. ఈ పూర్వ పక్షోత్తర పక్షముల స్వరూపమిది సకల విరుద్ధధర్మములకును నిలయమగు నీ ప్రపంచ మున కొక బీజముండి తీరవలెను. కనుక నది సత్త గుచో విరుద్ధ ధర్మాశ్రయము కావలసివచ్చును. అది అట్లుండదుకదా కనుక అందుకై శూన్యమే కారణ మగుట యుక్తము. మూలము అభావము కనుక దాని యందెట్టి ధర్మమును ఉండజాలదు. కావున నట విరుద్ధధర్మ సమావేశమనునది యుండబోదు. అని పూర్వపక్షరూపము. దీనిసమాధానమిది—

ఈ వాదమును బూర్తిగా బరియాలోచించుచో కార్యకారణములకు సాజాత్యముండి తీరవలయును. అను సూత్రముమీద నాధారపడియున్నది. అపుడు సత్తుగా స్ఫురించుచున్న ఈ ప్రపంచము అసత్తు నుండి ఎట్లు పుట్టును? అభావమునుండి యేవస్తువైన ఉదయింపగలదా? వస్తువును ఉత్పాదించుశక్తి యేదానికుండునో అది అభావమగుట ఏమికర్మము? భావమే సత్తే యగును. నిర్విశేషముకదా అభా వము. మరియు సత్తును ఉత్పాదించునది సత్తే కానిచో వెలుగు కావలయువాడు సత్తైన దీపము కొరకేల ప్రయత్నించుచున్నాడు? అభావముకొరకే ప్రయత్నింపవలెను. లేదా అభావము నప్రయత్న మును కుదురకున్నచో నూరకుండవలెను. అంతే కాని భావమైన దీపముకొరకు లోకము ప్రయత్నిం చుట కుదురదు.

మరియు కార్యకారణ భావమున సత్తునుండియే సత్తుదయించుట నంగీకరింపనిచో, అభావమునం దెవ్వరికిని ప్రయత్న వ్యాపారములు ప్రసక్తింపవని, మీరే యంగీకరింతురు. కనుక నెవ్వడును ఏపనిని చేయక అందరు సోమరిపోతులై యుండవలసి యుండును. దేనికిని ఏదియు గారణముకాదుగదా? జగదుపకారణమునకై ఏర్పడవలసిన మతము పర్యవ సానమున జగదపకారమునకు ఏర్పడుట యుక్తము కాదుగదా!

"ఉత్సీదేయురి మేలోకాః నకుర్యాంకర్మచేదహం" అని గదా ప్రామాణికసూక్తి! ఇందువలన నేమి తెలియుచున్నది? లోకము నిర్వ్యాపార మగుచో నశింపక తప్పదని కావున మీమతము జగత్తున కుపకారము చేయకపోగా అపకారమునకు తప్పక ఉపయోగించును. "నహికశ్చిత్ క్షణమపి యాతు తిష్ఠత్య కర్మకృత్" అని యున్నది. కనుక స్వభా వముచేతనే చేతనునకు గర్మప్రవృత్తి యుండును. అనుటయు కుదురదు. అట్లగుచో నేపనియు ప్రయో జనము నుద్దేశింపని దగుటవలన ప్రపంచమంతయు నిషిద్ధాచరణ మొనరించినదగును. "నకుర్యాన్నిష్ఫలం కర్మ" యని గదాస్మృతి.

కనుక నీవాదమును వదలి జగన్నిర్మాణ సామ ర్థ్యముగల దానినే మూలమని యంగీకరింపకతీరదు. అపుడు మీకును మాకును మాటభేదమేకాని సధర్మక పదార్థమే జగత్కారణముగా సిద్ధమగును. సధర్మక మగుచో నది సత్తుగాకతప్పదు. అభావము నిర్ధర్మ కమేకదా? కనుక సూన్యమునుండి జగము ఏర్పడె ననుమాట యుక్తి యుక్తముగాదు.

మరియు మీయుక్తులు మాకును మాయుక్తులు మీకును ప్రకృతమున దురసహ్నవములుగా నున్నను కేవల మేయాధారమును లేక ప్రవర్తించు నీతర్క

మంతయునిష్ఠే అప్రతిష్ఠతమై నిలువ నీడలేకుండ బోవును. ఆకాశముష్టి హననమే యగును.

ఇంకొక రకముగా నూహించినను, నటతర్కమే కదా ప్రశక్తించును. అప్పటికి అప్రతిష్ఠ తప్పదు. అనగా ఒకచోటికి పర్యంతనిష్ఠ మేర్పడనే యేర్ప డదు. (తర్కాప్రతిష్ఠానా దన్యథానుమే యమితిచే దేవమప్య నిర్మోక్ష ప్రసంగః) కనుక నిట్టి అప్రతిష్ఠితమైన యీ కుతర్కమును బట్టుకొని యూగులాడుటకన్న (అలమప్రతిష్ఠితకు తర్కపరి హాసనేన) ఏదైననొక .... .... సుప్రతిష్ఠితమగు నొక యాధారమును గైకొని వానినిబట్టి మన తర్క ములను ప్రవర్తింపజేసినచో మనమొక యొడ్డునకు జేరి నిలువబడగలము. కనుకనే పారాశర్యుడు జగ జ్జన్మాది కారణత్వమును అనుమానాంగమైన హేతు వుగా నీయలేదు. ఇక నేమి? తైత్తిరీయశ్రుతిని బట్టి బ్రహ్మలక్షణముగా నిరూపించినాడు. ఈవిషయమున॥ "జన్మాద్యస్యయతః" అను ద్వితీయసూత్రోక్తమైనది. వేదశాస్త్రోక్తమగు లక్షణమేగాని బ్రహ్మను మానాంగ మగు హేతువుగాదను విషయమున, ప్రమాణ మేమందురా? మూడవసూత్రమైన "శాస్త్రయోని త్వాత్" అనునదే. దీనిని దాని వెను వెంటనే యుపన్యసించుటయే ప్రమాణము ఇది రెండవ సూత్రము అనుమానోపన్యాసమే యగుచో "శాస్త్ర యోనిత్వాత్" అని అట మూడవ సూత్రమున శాస్త్ర ఉపన్యాసము కుదురదు. అప్రాప్తార్థప్రాపకముగదా శాస్త్రము "అప్రాప్తేశాస్త్రమర్థవత్" "ప్రత్యక్షేణాను మిత్యావాయసూపాయో నబుద్ధ్యతే ఏనం విదంతి వేదేన తస్మాద్వేదస్యవేదతా" అని పెద్దలందురు గదా?

(సశేషము)



# జంటనగరాల్లో దేవాలయాల స్థితి

## శ్రీ డి. సూర్యనారాయణస్వామి అధ్వర్యాన సంఘం ఏర్పాటు

### న్యాయశాఖ కార్యదర్శి

హైదరాబాదు, సికిందరాబాదుల్లో దేవాలయాల పరిస్థితిని విచారించి మూడు మాసాల్లోగా రాష్ట్రప్రభుత్వానికి ఒక నివేదిక సమర్పించటానికి ప్రభుత్వ న్యాయశాఖ కార్యదర్శి శ్రీ డి. సూర్యనారాయణస్వామి అధ్యక్షులుగా ఒక విచారణ సంఘం నియ మించబడినదని దేవాదాయ శాఖమంత్రి శ్రీ అనగాని భగవంతరావు ఆంధ్రపత్రిక ప్రతినిధికి సెప్టెంబరు 15 న చెప్పారు.

ఈ విచారణ సంఘంలో శ్రీ గోపాలరావు ఎక్బొటే, శ్రీ నూకల నరోత్తమరెడ్డి సభ్యులుగాను, ప్రభుత్వ ఆంతరంగికశాఖ ఉపకార్యదర్శి శ్రీ వి. పి. రామారావు కార్య దర్శిగాను నియమించబడ్డారు.

# శ్రీరామకథాసుధ

కీ. శే. శ్రీ గొబ్బూరు వేంకటానంద రాఘవరావు

(గతసంచిక తరువాయి)

## శ్రీరామచంద్రునికి పట్టాభిషేక ప్రయత్నము

పరశురామునివలన భయము వాసి దశరథుడు, కొడుకులతోను క్రొత్తకోడండ్రతోను అయోధ్యాపుర ప్రవేశముచేసి అత్యంత ప్రమోదచిత్తుడై పండ్రెం డేండ్లు సుఖముగా రాజ్యమేలెను. అత్తమామల చాటున, అల్లారుముద్దుగా, క్రొత్తకాపురములు చేసి కొనుచు, కోడండ్రు సమస్త భోగభాగ్యము లనుభ వించుచు, ఏ కొఱంతయు లేక హాయిగా సుఖపడు చుండిరి. పండ్రెండేండ్లు ఈ విధముగా సుఖముగా దంపతులకు కాలము గడచినది.

పిమ్మట నొకనాడు దశరథుడు సభలో నిట్లు ప్రకటించెను.

"మాన్యులారా!

క. మిక్కిలి భోగములందితి
నెక్కుడు సంపదలుగంటి నెల్లగుణములన్
చక్కని కొడుకుల బడసితి
నిక్కంబిని పెద్దకాల మేలితి నింకన్."....

ఇంత చాలదా? ఆశకు ఎంతకెంత? ఇక వృద్ధుండ నైతిని. రాజ్యభారము మరి నేను భరింపనోపను. నా పెద్దకొడుకు శ్రీరాముడు అన్నివిధముల ఉత్తముడు.

మ. "ధీరోదారుడు, నిర్వికారుడు,
జగద్వీరుండు సౌజన్య ని
స్తారుం డుత్తమశీలు. దక్కకుల
విస్తారుండు శూరుండు గం
భీరుం డిద్ధ విచారసారు డగుటన్
పెంపెల్ల విశ్వంభరా
భారంబెల్ల భరింప రాఘవు
మహాభాగు న్నియోగించెదన్."

"శ్రీరామచంద్రమూర్తికి పట్టాభిషేకముకట్టి నేను తప్పుకోదలచినాను. ఎల్లుటి దినము బాగున్నదట. కనుక ఆనాడు శ్రీరామ పట్టాభిషేకము జరుగగలదు." అని తెలియబలికి, రామమూర్తిని పిలిపించి సభలో అందరి యెదుట నతని కా సంగతి ఎఱుగజెప్పి, అందుకు సంసిద్ధముగా ఉండ నియమించెను.

మరునాటి రాత్రి మహారాజు కైకమందిరమున కరిగెను. అంతకు పూర్వమే మందర దుర్బోధ తగిలి, కైక, అలకాగృహమున కరగి, మొగము ముడుచు కొని, ముసుగు పైచుకొని, కటికనేల పడుకొని, ఏమి ప్రమాదము సంభవించెనో? ఏమో? అని చూపరు లకు భయము పుట్టించెను. ఆమె మందిరమునకు ఆ రాత్రి మహారాజు వెడలుట జగత్తునకు సంక్షోభకారణ మైన గొప్ప తప్పిద మనక తప్పదు. "వార్ధిక్యము వచ్చినది. ఓపిక నశించినది. రాజ్యభారము వహింప రాముని నియోగింతు" నని రాజ్యసభలో ప్రకటించిన ముసలిరాజు క్రొత్తశోభనపు పెండ్లికొడుకువలె కైక శయనమందిరమునకు వెడలుటను గూర్చి ఏమన వలెను? అతని దేహమునకేగాని భోగలాలసత్వము నకు వార్ధక్యములేదు. అందుకే ప్రాజ్ఞులు "పురుషుడు పేరిన నేతికుండవంటివాడు; స్త్రీ. అగ్నివంటిది" అన్నారు. ఎంత చక్కని ఉపమానము! సెగదగల నంతసేపే కద? పేరిన నేతి బింకము? సెగ తగి లెనా, కరిగి కారిపోక తప్పదు. దశరథుని కర్మ మా నాడు అట్లే కాలినది! అలకాగృహముచేరి, అతిదీన ముగా నేలపడియున్న అందకత్తెను చూచి, చిడిముడి పాటుతో ఆమె నిట్లు పలుకరించెను. "ప్రాణేశ్వరీ! ఏల నీకీ కోపము? ఏమి కావలెనో నీదాసుని నన్నడిగి

పుచ్చుకో. 'అడిగిన ప్రాణంబు లాదిగా నెవ్వియేన్ వంచింప కిత్తును వనజనయన!' ముసుగుతీసి, నీ సుందర మందహాసశోభిత వదనము చూపి నన్నల రించి, కావలసినది గైకొనుము. అంతేగాని, ఎందుకీ కారణములేని కోపము? కటికనేల పడక? మాట లాడని మౌనము? చాలు! చాలించు! లే! లేచి, నన్నేలుకో!" అని ఆమెకు పూర్తిగా వశుడై, దాసుడై ఆమె పాదములకడ వ్రాలినాడు.

ఇంకేమి? కైక పాచిక పారినది—ఆమె'కోటలో పాగా వేసినది.' ముసుగు తీసినది; మందహాస శోభతో సుందరవదనము చూపినది. గాలములవంటి చూపులు ప్రియునిపై బఱపినది. దశరథ మత్స్య మున కవి గట్టిగా గ్రుచ్చుకొని, పట్టితెచ్చి ఆమెచేతికి అందిచ్చినవి.

కైక: ప్రాణేశ్వరా! నాడు దేవాసుర యుద్ధమపుడు మీరు దేవతలకు సాయపడ నరిగినపుడు, నేను మీకు సారథినై, మీ రథముతోలి, గెలిపించి నందుకు, మీరు చాలా సంతోషించి నాకు రెండు వరము లిచ్చినారు. జ్ఞాపకమున్నదా? మఱచి పోయినారా?

దశ: మఱచిపోతానా? మఱువలేదు. జ్ఞాపకమున్నది.

కైక: ఆ వరములు అవసరమునకు దాచుకొ న్నాను. ఇప్పుడు వాటి అవసరము వచ్చినది. ఇవ్వండి.

దశ: అవి ఇదివఱకునుంచి ఉన్న ప్రాతబాకీ వరములే. క్రొత్తవేమీకావు. అడుగు; పుచ్చుకో; బాకీ తీర్చుకో! తీర్చుకొని నన్ను ఋణవిముక్తుణ్ణి చెయ్యి! అంతమాత్రానికి అలగవలెనా? పిచ్చి పిల్లా! ఇచ్చాను; ఇచ్చానులే! ఇచ్చానులే! లే!

కైక: అయితే అడుగుతున్నానువినండి! ఒకటి—నా కొడుకు భరతుడికి అయోధ్యరాజ్యం పట్టాభి షేకం చెయ్యడం; రెండవది— రాముణ్ణి పధ్నాలుగేళ్ళు వనవాసానికి పంపించడం. ఈ రెండు వరాలూ నాకు ముందు చెల్లించి నా బాకీ తీర్చుకోండి. అన్నది, నిర్మొగమాటంగా.

దశరథునిమీద మబ్బులేని పిడుగు పడ్డది. గొడ్డలి పెట్టుకు వృక్షంలాగ ఆయన క్రుంగి కూలిపోయాడు. మరేమున్నది? కైకా! కైకా! నీవు నా కైకవను కున్నానుగాని, నాతలక్రింద నాగుపామువనుకోలేదు. ఎంతపని చేశావే?" అని దీనముగా వాపోవుచు, దశరథుడు కంటికి నేలకు ఒక్కధారగా ఏడ్చుచు పడియుండెను. ఇందుకే 'అంగన నమ్మరాద'న్నారు పెద్దలు.

పట్టాభిషేకము జరుగునను భ్రమతో శ్రీరాముడు అందుకు సిద్ధపడుచుండగా "తక్షణము రమ్మ"ని కైక అతనికి కబురంపెను. వెంటనే రాముడక్కడకు వచ్చెను. దీనాననుడు, బాష్పాకులలోచనుడునైన తండ్రిగారి దురవస్థచూచి, భీతిల్లి, రాముడు కైకకు నమస్కరించి, "అమ్మా! నాయనగారు అదోకలా గున్నారేమి? అందుకు కారణము నేనేనా? ఏమైన అపరాధము చేసినానా?" అని యడిగెను.

కైక: "నీ వేమీ చేయలేదు. కాని, నీవిపుడు ఇక చేయవలసిన పని ఉన్నది. అది మీకు ఇష్టమైన పని కాదు. అది నీతో విప్పి చెప్పలేక నీతండ్రి నీళ్ళు నములుచు - మౌనము ధరించినాడు" అని తాను లోగడ పొందిన వరములను, వాటి నిప్పు డివ్వమని తానడిగిన విధమును, రాజు ఇచ్చితినను టను తెలియజెప్పి, "ఇప్పుడు నా భరతునకు పట్టాభి షేకము జరుగవలెను. నీవు మారు మాటాడక పధ్నాలుగేళ్ళు వనవాసమునకు పోవలెను. జనకుని సత్యము నెరవేర్చే కుమారుడవైతే కట్టు! రామా! వెంటనే అడవులకు ప్రయాణంకట్టు! పట్టు అడవి దారి! నడు వనవాసానికి! పధ్నాలుగేళ్ళూ పూర్తి అయేదాకా తిరిగి రాకూడదు. అలోగా అయోధ్యలో మరి అడుగు పెట్టబోకు. ఏం, తెలిసిందా?" అని గర్జించినది.

పరమశాంతమూర్తి- శ్రీరామమూర్తి ఈమాటలు విని ఈషన్మాత్రము చలింపలేదు. చిఱునవ్వుతో ఆమెకిట్లు మాఱు పలికెను. "అమ్మా! నీవు వరము లడిగినావా? తండ్రిగారు ఇష్టపడి నీకు వరము

లిచ్చినారా ? తమ్ముడు భరతుడు రాజ్యమేలునా ? నాకు వనములో నమ్మని పాదసేవాభాగ్యము లభించునా ? ఇంతకంటె నాకు కావలసినదేమి ఉన్నది ? ధన్యోస్మి ! ధన్యోస్మి ! ధన్యోస్మి ! నే నిప్పుడే వనవాసమునకు బయలుదేరి పోతున్నాను. తల్లీ ! నమస్కారము ! సెలవు !"

ఆ వృత్తాంతము విని సీత అడలెను. పెండ్లియైనది మొదలు సీతారాముల పవిత్రప్రేమ క్రమముగా పెంపొంది, ఇప్పటికి పరిపక్వస్థితికి వచ్చినది. ఆ దంపతుల ప్రేమాభివృద్ధిని వాల్మీకి ఇట్లు ప్రశంసించినాడు—

శ్లో. ప్రియాతు సీతారామస్య
దారాః పితృ కృతాఇతి
గుణాద్రూప గుణాచ్చాపి
ప్రీతిర్భూయో వ్యవర్ధత."

ఇప్పుడు, రాముని విడిచి, సీత ఒక క్షణమైన అయోధ్యలో నుండగలదా ? పతివ్రతకు తండ్రి తల్లి, కొడుకు, కూతురు, చెలికత్తెలు, స్నేహితులు— ఎందరున్నా, భర్తయేకదా ? పరమగతి.

శ్లో. న పితా, నాత్మజో నాత్మా
న మాతాన నసఖీజనః
ఇహ ప్రేత్యచ నారీనాం
పతిరేకోగతి స్సదా."

అన్నారు, పెద్దలు.

గీ. "నన్ను నీకు నిచ్చి నరనాథ నాతండ్రి
సంతసించియుండు నెంతయేని
చనునె అగ్నిసాక్షి సహధర్మచారిణి.
నయిన నన్ను నిలువుమనుట నీకు ?"

కం. దనుజ మృగోరగ భయములు
నను జెందునె నీవు గలుగ నాథా నాకున్
నినుబాసి మనుటకంటెను
మనమున దలపోసిచూడ మరణంబొప్పున్."

భర్త ననుసరించిన స్త్రీకి స్వర్గము తప్పదు ; విడిచిన స్త్రీకి నరకమును తప్పదు. "మీరే నా ప్రాణము ; నా దైవము. మిమ్ము విడిచి ఇక్కడ ఉండను - ఉండలేనని" సీత ఖండితముగా చెప్పగా, తనతో ఆమె వనవాసమునకు వచ్చుటకు రాముడు సమ్మతించెను.

## లక్ష్మణుడు

శేషాంశ సంభూతుడు, అకార్యకరణము, అధర్మము, జరుగుటకు అతడు సహించలేడు. అట్టిదేదైన ఎదుట జరిగెనా, తోకత్రొక్కిన త్రాచువలె బుస్సుమని లేవవలసినదే : అగ్ని తగిలిన తారాజువ్వవలె రివ్వుమని పైకెగురవలసినదే ! లక్ష్మణుని స్వభావము అటువంటిది.

కైక దుర్మంత్రమునకును, రాముడు కిక్కురుమనకుండ, చిఱునవ్వుతో వనవాసక్లేశముల నంగీకరించి నందుకును లక్ష్మణుడు పట్టరాని కోపముతో భగ్గున మండిపడెను. కోపరక్తాస్యుడై, బొమలుముగిలించి, మిడుగుఱులు వెడల, పటుఖడ్గము చేతపట్టి, ఝళిపించుచు, అన్నగారితో లక్ష్మణుడిట్లనెను :

చ. తలపగ నీ వశక్తుని
విధంబున నాడెదు, రామచంద్ర నీ
కొలది యెఱుంగడీతడతి
కుత్సితుడై మతిదప్పి
అలిమాటలు విని యింత తెంపున
కొడంబడె, తానొక సత్యవాదియై
పలుకడె మొన్న ? నేడు నిను
పట్టము గట్టెదనంచు ? బొంకొకో ?

కం. నిను నభిషిక్తుని జేసెద
ననుచు వసిష్ఠాదిమునులు నఖిల మహీశుల్
విననాడెను; — ఇప్పుడీ క్రొత్తవరములు
తనయాలును తానుగా కితరులెఱుగుదురే ?"

కం. "మదనాతురతం బలికిన
యది సత్యమట ? మహా సభాంతరమున దా
విదితంబుగాగ బలికిన
యిది బొంకట ! దీనికింక నేమనవచ్చున్ ?!"

"తండ్రి నీతిగలవాడైతే పుత్రులు పితృవాక్య పరిపాలకులు కావలసినదే ! తండ్రి అవినీతిపరుడైతే, పుత్రులది యేల సహించవలెను ? అన్నా ! నాకు

అనుజ్ఞ ఇచ్చిన చాలును. కైకను, ఆమె పక్షము వారికిని నా శక్తి—నా పజా—ఎటువంటిదో రుచి చూపించి గడ్డి తినిపించి పంపగలను." అని లక్ష్మణు డాడిన కఠినోక్తులకు రాముడిట్లనెను.

"లక్ష్మణా! నీవు నా భక్తుడవు! నీ శక్తి యుక్తు లెటువంటివో నేను ఎఱుగుదును. మన కులాచార గౌరవములను, ఉత్తమ శీలమును విచారించి మాట లాడుము. నాయనా! దశరథమహారాజుగారు—మన తండ్రిగారు; కైకమ్మ - మనతల్లి; భరతుడు - మన తోడపుట్టిన సోదరుడు. ఇందులో పైవారెవరు? బాబా? ఇందులో ఎవరిమీద కత్తి దూస్తావు? ఎవరి మీద బాణప్రయోగం చేస్తావు? ఎందుకు మనలో మనకు అంతఃకలహములు? పైవాళ్ళంతా వచ్చి—మనిషి ఒక్కొక్కతరహాగా మనకు సలహాలు చెప్పడం ఎందుకు? దూరం ఆలోచించు. నామాట విను! భరతునికి అండగా ఉండి, అతనిచేత నీవు అయోధ్యరాజ్యం చక్కగా ఏలించు." రాముడాడిన ఈ మాటలకు లక్ష్మణుడు కట్టుబడిపోయెను. "అన్నా! నీవులేని అయోధ్యలో నేను ఉండలేను. సూదితో దారమన్నట్లుగా నేను నినుగొల్చి నీవెంట అడవులకు రావలసినవాడనే. అందుకు అనుమతించి దయతో అనుజ్ఞ ఇవ్వండి." అనగా రాముడు 'సరే! రా! అని సమ్మతించెను. లక్ష్మణుడుకూడ వనములకు ప్రయాణమయ్యెను. ఇక కౌసల్యకుకలిగిన ఆశాభంగమునకు—మితిలేదు.

సీ. పున్నమనుపొంగు పూర్ణాబ్ధి శోషించె
    అక్కట నాయభాగ్యంబుకతన.

అని దీనముగా వాపోయినది. ఆమె దుఃఖము ఎల్ల వారికి ఎంతో జాలిగొల్పినది. ఈ ఘట్టములో శ్రీరాముని పితృభక్తి, సోదరప్రేమ, సీత పాతివ్రత్యము, రామలక్ష్మణులమధ్య భ్రాతృస్నేహము-అనునవి లోకమునకు ఆదర్శప్రాయముగా ప్రదర్శింపబడినవి. ఈ మహావీయుల ఉత్తమశీలములకు లోకములో వారికి వారేసాటి*. (సశేషము)



* నికషము అనే నల్లటి గీటురాయిమీద బంగారు గీటుపెట్టి షరాబులు బంగారువన్నె నిర్ణయిస్తారు. త్రైపారు వేసి చూస్తేగాని తత్త్వం బోధపడదు. మొగల్ ఔరంగజేబ్, పాదుషా, చరిత్ర, జ్ఞప్తికి తెచ్చుకొని చూదాము. స్వార్థముకొఱకు తనను కన్నతండ్రి - షాజహానునే చెఱలోపెట్టి, అబద్ధములాడి సోదరులను మోసముచేసి, నెత్తురు టేళ్ళను ప్రవహింపజేసి, ఘోరయుద్ధములలో వారినందరి నోడించి, బహుదారుణ క్రౌర్యముతో వారిని చంపించి, భ్రాతృ రక్తసిక్తములైన రుధిర హస్తములతో సింహాసనమెక్కిన ఆలమ్‌ఘీర్ పాదుషా ప్రదర్శించిన ఘోరస్వార్థ పరత్వమునకు, శ్రీరాముని స్వార్థ త్యాగమునకును ఎంతటి అంతరమున్నది! ఔరంగజేబు ఏమి అనుభవించి ఏమి తీసుకొని పోయినాడు? శ్రీరామునకు లేనిదేమి? శ్రీరామభక్తు లెందరు? ఔరంగజేబు ఆరాధకులెందరు? ఎవరిపేరు, లోకములో, కాలము గడుచుకొలది వ్యాప్తిచెంది వర్ధిల్లుచున్నది? - శిబి, కర్ణ, దధీచులవంటి త్యాగమూర్తులపేర్లు లోకములో శాశ్వతముగా ఉండవలసినవే. స్వార్థము తాత్కాలికము. శాశ్వతమైనది - త్యాగమే.

# భ్రమరాంబ లాలిపాట

శ్రీ నేదునూరి గంగాధరం

పసిబిడ్డల్ని నిద్రపుచ్చేటప్పుడు, తల్లులు లాలి పాటలు, జోలపదాలు పాడుతూ వుంటారు. భక్తులు తమ యిష్టదైవాలను స్మరించేటప్పుడు లాలిపాటలు, జోలపదాలు పాడుకొంటారు. శ్రీశైలభ్రమరాంబమీద, బాగాల వీరశరభేంద్రకవి ఈలాలిపాట రచియించాడు.

ఈ పాటలో మానవబాలికల వయఃపరిణామాల ననుసరించి, జరిగే మార్పులను వుటంకిస్తూ, చిట్ట చివర షట్చక్రాలను సమరసభావభక్తి యుక్తంగా పేర్కొని, ముముక్షుపేక్షులకు ఆనందంకలిగే లాగుగ యీ పాట రచియించాడు.

ఆనంద భైరవి రాగం — అటతాళము

పల్లవి : లాలి భ్రమరాంబ లాలి;
శాంబవీ లాలి హైమవతీ లాలీ
లాలి దుర్గాంబ లాలి;
జగదంబ లాలి రుద్రాణి లాలీ.

1. నెలపురుడు వెళ్ళలేదు; అప్పుడే
నలుగురికి వేడ్కౌతగను
చెలరేగి మాటలాడ; యీచిలుక
పలుకు లెవ్వరు నేర్పిరో ॥లా॥

2. నాగర్భమందు బుట్టి; చక్కగా
జోగాడలేవు యిపుడు,
నాగకంకణుడు నిన్ను; పెళ్ళాడ
యోగంబుగల్గు నమ్మా ॥లా॥

3. ఏడవకు యెపుడు తల్లి; బంగారు
మేడలో జలకమాడి;
మూడు వేళల చక్కగా: మీ తండ్రి
చూడగా ముద్దులాడు ॥లా॥

4. విభూతిరేఖదీర్చి;తిన్నగా
శోభనపు జోలబాడి
సౌభాగ్యరక్ష గట్టి; దేవేంద్ర
వైభవమె కాపుబెట్టి ॥లా॥

5. బొంకముగ దృష్టిదీసి; అందముగ
కుంకుమాలంకరించి
శంకరుని బిరుదు బెట్టి; ముందుగా
శెంకాయబంతి వేసి ॥లా॥

6. మృదువైన పాన్పుమీద; నిన్నుంచి
మేల్మి సాంబ్రాణివేసి
యెదురుగా వచ్చి నేను, వుయ్యాల
కదలించివస్తి గదవే ॥లా॥

7. బుడుతవలె నేటి వరకు; చక్కగా
మెడలైన నిలుపలేవు,
నడుమునకు బలము గలిగి: కూర్చుండి
నడువ ఎన్నడు నేర్తువే ॥లా॥

8. మారాము లెరుగవమ్మ; నాముద్దు
గారాబు పట్టివమ్మ
ఈరాత్రి యింత చెలియా; యీకిసరు
పోరు యెందుకు వచ్చెనే ॥లా॥

9. బిడ్డ యిక తాళ గదవే; నీపొత్తి
గుడ్డలెప్పుడు వుదకనే
గొడ్డురాల్మాటలటవే; మేలయిన
దొడ్డముద్దుల గుమ్మవే ॥లా॥

10. తలయెత్తి నన్ను జూచి; మృగధరుని
పిలువమని సౌజ్ఞజేసి
కులికేవు నీవు యిపుడే; యీమాయ
వలపు లెక్కడ బుట్టెనే ॥లా॥

11. పలుమారు కోపమటవే; మేముమీ
యలుకలకు తాళగలమా;

జలజాక్షి చాలుగాని; నా కలికి
చిలుక యూరకయుండుమా ॥లా॥

12. నెలబాలనీకు యిపుడూ, పురహరుని
చెలిమి కోరిక లెక్కడా।
తెలిసింది నిజమునుమ్మా, మనసులో
తలచుకొని క్రీడించవే ॥లా॥

13. శృంగారవల్లి నీకు; చక్కగా
వుంగ ద్రావింతురావే
బంగారుబొమ్మ నీకు; జోకొట్టి
సంగీతములు బాడెద ॥లా॥

14. బొజ్జవాడింది లేవే; పాలిచ్చి
బుజ్జగించేను నిన్ను
నిర్జరామరులందరు నిన్మెచ్చి
గజ్జెలందెలుపంపి రీ ॥లా॥

15. ఎచ్చోటి మనబంధువుల్, మిముజూడ
వచ్చి హస్తములనిండ,
పచ్చగాజులు ధరించి; యెత్తుకొని
ముచ్చటలాడిరి కొందరు ॥లా॥

16. కమలాయతాక్షిరేమే నీజాత
కములుజూచిరి పెద్దలు
ప్రమధాధిపతికి బాగా భార్యవై
ప్రమదముగ నుందువనిరీ ॥లా॥

17. ఈశ్వరుని పిలుపనంపి; త్వరగాను
ఈశ్వరూపము చాతను
శాశ్వతముగా విబుధులు; ఒప్పించి
వైశ్యదేవుని సాక్షిగా ॥లా॥

18. కన్యకా చక్రమందు. చక్కగా
నున్న వైశాఖశుద్ధ
పౌర్ణమీ సోమవారం. లగ్నంబు
నిర్ణయించిరి పెద్దలు ॥లా॥

19. ప్రియమైన మునులువచ్చి; సొంపుగా
జయము జయమనుచు పొగడ
యతిసురలు పన్నుతింపా; సౌవర్ణ
మైన యరుగులమీదను ॥లా॥

20. తలలంటిపోసి మీకు చక్కగా
మధుపర్కములు కట్టిరి
తెలివిగా జుట్టుదీర్చి, ముందుగా
వెలలేని సొమ్ముబెట్టి ॥లా॥

21. గాయకముతెలిసి నీవు యీబాల
ప్రాయంబునందు విరులు
కాయజాంతకుని బిలువ. యింద్రుని
రాయబారము బంపి ॥లా॥

22. వైశాఖ మాసమందు శుభలేఖ
వ్రాసిపంపించి రపుడు
కాశీ పురీశ్వరుండు; భోగ సం
కాశముగవచ్చి జూచి ॥లా॥

23. కైవారములు జేయగా; దానవులు
దేవతలు మ్రొక్కగాను,
పావకులు యక్షింతలు, దీవించి
మైపైన వేయగాను ॥లా॥

24. ఇభవరదు పూజసేయ; అల్లమ
ప్రభుడు దీర్ఘాయువనగ,
సభవారు సన్నుతింప; బంధువులు
జయజయాయంచు పలుకా ॥లా॥

25. గంధర్వులంతవచ్చి; పన్నీరు
గంధంబు పూయగాను,
గంధవాహనుడు బాగా; భాషికము
సంధించి విరులుముడువా

26. వారి జానసుడువచ్చి; ముత్యాల
తోరణంబులు గట్టగా
ధారాధరిత్రియందు; మిముజూడ
కోరివచ్చితి మిప్పుడే ॥లా॥

27. కళ్ళ కాటుకలు దిద్ది, పన్నెండు
యేళ్ళలోపలనీటుగా
యిళ్ళు వాకిళ్ళుదీర్చి; బంగారు
పెళ్ళి పీటలమీదను ॥లా॥

28. ధైర్యమున మిమ్ముపుంచి, శతకోటి
సూర్యప్రకాశముగను

మర్యాదగాను నగలుతెచ్చి,
సౌందర్యముగ ధరియించిరి ॥లా॥

29. సనకాది మునులువచ్చి, మీ రెండు
ఘనమైన కొంగులకును,
కొన బ్రహ్మముళ్ల వేసి, శృంగార
వనములో పెళ్ళిచేసి ॥లా॥

30. పాకారి పడతివచ్చె; చెంగావి
కోక రవికలు ధరించి,
రాకేందువదన నీకు, చక్కగా
నాగవలి శాయగాను ॥లా॥

31. రావమ్మ శోభనాంగి, నీమనో
భావమ్ము లన్నిదెలిసె,
మీవంటి సుతులెమీకు, భూమిపై
దైవంబులందుచూడ ॥లా॥

32. సంతోషముగ వెలదులు, భోగ
వసంతంబులాడ నిలచీ,
భ్రాంతిగా మిమ్ముజూచి, నుతియించి
ఆక్షింత లేసిరపుడు ॥లా॥

33. ఆధార చక్రమందు, బంగారు
సౌధాంతరముమధ్య,
మేధా విశాలముగను, నీప్రాణ
నాథుణ్ణి కూడిరావె ॥లా॥

34. అష్టాంగయోగగిరిపై, చక్కగా
స్వాధిష్ట చక్రధరునీ,
యిష్టముగ నిలచియిపుడే, సకల
ప్రతిష్టగా నుండవమ్మా ॥లా॥

35. మణిపూరకమున వెలసి, హంసపై
మరి అనాహతము చూచి,
ప్రణవస్వరూపమునను, చిద్భిందు
గుణనిధి విశుద్ధపురమై ॥లా॥

36. అగ్నేయచక్రమందు, కూర్చున్న
సుజ్ఞానమూర్తివలెనే,
ప్రజ్ఞావిశేషంతో, రక్షించు
సుజ్ఞానతేజవమ్మా ॥లా॥

37. విశ్రాంతి జెందవమ్మా, భువన
సహస్రార చక్రధరునీ
శుశ్రూషజేసి బాగావర్థిల్లి,
అత్రేయముననుండుడీ ॥లా॥

38. చిత్కళలు జెందవమ్మా, వేదింత
చిత్కళలు జోలపరచి,
సత్కళలు తెరలుగట్టి, చిద్భిందు
చిత్కళంబుజ రాణివై ॥లా॥

39. శ్రీరాజవదననీకు, ముత్యాల
హారతులు దెత్తిమమ్మ
గౌరీనిరంతరంబు, దంపతులు
చేరి చల్లగ నుండుడీ ॥లా॥

40. ధారుణీచక్రమందు, బాణాల
వీరశరభేంద్ర కవిని
యేరీతినైనదలచి, రక్షించి
వేరుగా నుండవమ్మా ॥లా॥



# మనిషి - మహర్షి

వడ్లమూడి గోపాలకృష్ణయ్య

[సాంఖ్యయోగాది విషయ ప్రాధాన్యంకల "మనిషి-మహర్షి" గేయకృతి ప్రథమభాగం 1958 లో కొన్ని నెలలపాటు క్రమంగా హైదరాబాద్‌నుంచి వెలువడే "గోలుకొండపత్రిక" దిన పత్రికలో ప్రచురితమైనది. ఆ ప్రచురితమైన తొలిభాగం సంస్కృతీకరణమే ఆరాధనలో సెప్టెంబరు సంచికవరకూ ప్రచురితమైనది. మిగిలిన తెలుగు రెండవభాగాన్నికూడా క్రమంగా ఆరాధన పాఠకుల కందిస్తున్నాము. ఎడిటర్.]

**45**

సార్థకముగ - ప్ర
వృద్ధమైన - సు
బుద్ధికలుగు - స
మిద్ధగుణగణ
సజ్జనాగ్రణి
స్వార్జితము - పి
త్రార్జితము లగు
ఆస్తిపాస్తుల
అఖిలధనముల
అనభివృద్ధికి
అంకితముగా
అనవసరమౌ
అనిత్యములౌ
అల్పకార్యాల్
పాలుచేయక
పాడుచేయక
చేతులారా
చెరుపుచేయక
మానవాళికి
మానవత్వము
మహితమైన - సు
మనస్తత్త్వము
మన్మహత్త్వము
మహిత తత్త్వము
ప్రచలితముగా
విచలితముగా
చెల్లచెదరై
చెదరకుండగ
ప్రశాంతతమై
విశాలతమై
అశేషముగా
విశేషముగా
సురూఢమ్ముగ
పరిఢవిల్లగ
పరమతత్త్వము
బ్రహ్మతత్త్వము
బహుముఖాలుగ
అహోరాత్రులు
అహోయన జన
మొహోయనగను
దేశసర్వ వి
దేశములలో
దశదశలుగా
దశదిశలుగా
వ్యాప్తమై - ప
ర్యాప్తమౌటకు
ఉన్న సంపద

లన్నిటిని - అ
వ్యయముగాగను
వ్యయము చేయుచు
మృతుండయ్యు - అ
మృతుండై - దీ
ధితులుగల - ఉ
ద్గతులలో - స
ద్గతులలో - పలు
సుతులతో - తన
బ్రతుకు వెలుగగ
పరమపదమున
వరలు విశ్వే
శ్వరుని జేరును
పరగు పరమే
శ్వరుని జేరును
తుదకు జగదీ
శ్వరుని జేరును

ఓయి మనిషీ!
ఓ మనీషీ!

## 46

కాగి పొంగుచు
ఆగి ఆరని
అనలె ఆరని
ఆలపాలుగ
నెసగి పొంగుచు
బుసబుసలుమని
బుసలుకొట్టుచు
మిసమిసలుగల
పసలుమించుచు
నైగవిగ్యము
తోగుచుండే
భోగరాగ - స
రాగములతో
మోహమయమై
దాహమయమగు
దేహశక్తిని
దోహలించే
యూహలెదుగుచు
యెదిగియెదుగని
ముదిరిముదురని
చాగుకల - నూ
నూగుమీసల
కవులుతగిలే
రవులురగిలే
తనువుపొంగే
మనసుమింగే
తనివితీరని
మనసుతీరని
వింతవింతల
భ్రాంతిమంతము
లైన వాంఛల
అంతమెనయని
మోసులెత్తుచు
ఆశలెదిగే
సరసమెరిగే
చవులువూరే
స్వార్థమెరిగి - ప
రార్థమెరుగని
అర్థమెరిగిన
అర్థదృష్టుల
అమలమై - అ
త్యమల సుధగతి
మధురమై - అతి
మధురమౌ - సద్
యవ్వనముతో
యజ్ఞగతత్రే
తాగ్నులో - శు
ద్ధాగ్నులోయన
వెలుగుసద్గుణ

కలితుడై ప్ర
జ్వలితుడౌనరు
డలఘుడౌనరు
డమలుడౌనరు
డాత్మయౌవన
మఖిలమును - వై
వాహామహోమ
హామ్మలో సుమ
హోగ్నిసాక్షిగ
పెండ్లిఆడిన
పేర్మికల - హ్రా
న్మర్మమెరుగని
నర్మమెరుగని
పూతజీవిత
పూర్ణ యౌ - అ
న్నాతికే - తన
నాతికే - అ
ర్ధాంగికే - ప్రియు
రాలికే హృద
యేశ్వరికె - ప్రా
ణేశ్వరికె - అ
ర్పించి సుఖములు
మించగా - అ
వ్యయముగాగను
వ్యయము చేయుచు
మృతుండయ్యు - అ
మృతుండై - దీ
ధితులుగల - ఉ
ద్గతులలో - స
ద్గతులలో - పలు
నుతులతో - తన
బ్రతుకు వెలుగగ
పరమపదమున
వరలు విశ్వే
శ్వరుని జేరును
పరగు పరమే
శ్వరుని జేరును
తుదకు జగదీ
శ్వరుని జేరును

ఓయిమనిషీ !
ఓమనిషీ !

**47**

అండదండలు
నిండుకొన్నను
బెండువడకయె
దండికల తన
నిండుగుండెలె
అండలుగ - పలు
దండలుగ - పెను
కొండలుగ - లో
నుండగా - నెద
నుండగా - హృది
మెండుగా తగ
చండమౌచు ప్ర
చండమై బ్ర
హ్మాండ భాండము
నైన తుండెము
తుండెములుగా
గుండగుండగ
గుండచేసే
పిండి చేసే
కండరాల్కల
మొండిబలమును
బండబలమును
కలిగి చెలగుచు
బలిమికలుముల
నిలచువీరుడు
వెలుగువీరుడు
ఆత్మబల స

ర్వస్వమగు తన
పుష్టినెల్లను
ద్రాష్టుడల్లుగ
దుష్టభ్రష్టా
రిష్టమయ దు
శ్చేష్టపరముగ
కుచ్రచేష్టల
వెఱ్రిచేష్టల
పాలుచేయక
పాడుచేయక
చేతులారా
చెరుపుచేయక
పూతపావనిజ
మాతృభూసం
రక్షణకు - పరి
రక్షణకు - రిపు
రూక్షశక్తుల
భక్షణకు - స్వా
తంత్ర్యపక్షవి
పక్షరాక్షస
కక్ష్యలను - అరి
పక్షులను - తన
అక్షయమ్మగు
దక్షతన్ - పృథు
దీక్షతో - స
ద్దీక్షతో - వం
చించుటకు - ని
ర్జించుటకు - పై

మించుశత్రుల
త్రుంచ వారల
కంచుడొక్కలు
మంచి ఉక్కునె
యెంచు గుండెలు
చించుటకు - తెగ
చించి నిలువున
చీల్చుచున్ చెం
డాడుటకు - కొం
డాడుటకు - అ
వ్యయము గాగను
వ్యయము చేయుచు
మృతుండయ్యు - అ
మృతుండై - దీ
ధితులుగల - ఉ
ద్గతులలో - స
ద్గతులలో - పలు
నుతులతో - తన
బ్రతుకు వెలుగగ
పరమపదమున
పరలు విశ్వే
శ్వరుని జేరును
పరగు పరమే
శ్వరుని జేరును
తుదకు జగదీ
శ్వరుని జేరును

ఓయి మనిషీ!
ఓ మనిషీ!



# శంకరుల బహుముఖ ప్రతిభ

## పొన్నూరులో శ్రీ చంద్రమౌళి ప్రసంగం

"శంకరాచార్యులు బహుముఖ ప్రతిభావంతుడు. భారతీయ సంస్కృతీ చరిత్రలో అయనకు ప్రముఖమైన స్థానమున్నది" అని ఇటీవల పొన్నూరు శ్రీ భావనారాయణస్వామి గ్రంథమాల పక్షాన వెలువరించి "శంకరుల జీవితం" అనే ఆంగ్లగ్రంథ ఆవిష్కరణ సందర్భంలో జరిగిన సభలో శ్రీ కల్లూరి చంద్రమౌళిగారన్నారు. భారతీయ సంస్కృతిని గూర్చి ఆవతార పురుషులగురించి మత సంస్థాపకుల గురించి విపులంగా ప్రసంగించారు. సభకు ఆంధ్ర ప్రదేశ్ దేవదాయ ధర్మాదాయ శాఖ కమీషనర్ శ్రీశైలభక్తరత్న శ్రీ పైడిలక్ష్మయ్యగారు అధ్యక్షత వహించారు. శ్రీలక్ష్మయ్యగారు అధ్యక్షోపన్యాసంలో శంకరాచార్యుల జీవితంలోని ముఖ్యఘట్టాలనుగురించి గంటసేపు దీర్ఘోపన్యాసం చేశారు.

శ్రీ యన్. రామేశన్ (I. A. S.) గారు ఆంగ్ల భాషలో శంకరాచార్య జీవితం గురించి ఒక గ్రంథం వ్రాశారు. దానిని పొన్నూరు శ్రీ భావనారాయణస్వామి దేవస్థానంవారు ముద్రింపించారు. ఈ ముద్రిత గ్రంథావిష్కరణసభ యిటీవల అతి వైభవంగా పొన్నూరులో జరిగింది. గ్రంథకర్త ఈ గ్రంథాన్ని భావనారాయణస్వామికి సమర్పించారు. కృతిసమర్పణకు ముందు తాను ఆగ్రంథాన్ని రచయించడానికి చేసిన పరిశ్రమను వివరించారు. దేవస్థానం ధర్మకర్తలు శ్రీ వాసిరెడి భానుభూపాలప్రసాద్‌గారు ఈ ఉద్గ్రంథాన్ని భావనారాయణస్వామికి సమర్పించినందుకు శ్రీ రమేశన్‌గారికి కృతజ్ఞతాభివందనాలర్పించారు. అనంతరం శ్రీ రామేశన్‌గారిని ఆశీర్వదిస్తూ కామకోటి పీఠాధిపతులు శ్రీ శంకరాచార్యుల వారు పంపిన దుశ్శాలువను బహూకరించారు. సంస్కృత కళాశాల సంస్కృతాధ్యాపకులు శ్రీ నిష్ఠల సుబ్రహ్మణ్యసన్యాసిశర్మగారు ఈ గ్రంథావిష్కరణ సందర్భంలో చక్కని శ్లోకాలువ్రాసి చదివినారు. (ఈ శ్లోకాలను దేవనాగరి లిపిలో ప్రత్యేకంగా ఆరాధనలో ప్రకటిస్తున్నాము—ఎడిటర్.) వందన సమర్పణతో సభ సమాప్తమైనది.

---

### తిరుమల తిరుపతి దేవస్థానం ట్రస్టీ

రిటైర్డు జిల్లాజడ్జి శ్రీ మోచర్ల శ్రీరామమూర్తిని కీ. శే. శ్రీ బి. సిహెచ్. నారాయణమూర్తి స్థానే తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మకర్తల సంఘం సభ్యుడుగా నియమించారు. వీరు 1960 అక్టోబరు 24 వరకు ఈ పదవిలో వుంటారు.

---

# శ్రీశైలదేవాలయ మరమ్మతులు

## విరివిగా విరాళాలివ్వాలని శ్రీ పైడి లక్ష్మయ్యగారి విజ్ఞప్తి

రాష్ట్ర ప్రభుత్వ హిందూమత దేవాదాయ శాఖల కమీషనరు శ్రీ పైడి లక్ష్మయ్యగారు ఇటీవల గుంటూరు విచ్చేసిన సందర్భంలో స్థానిక కన్యకా పరమేశ్వరీ దేవస్థాన సత్రం ఆవరణలో బహిరంగ సభ ఏర్పాటు చేయబడినది. సభకు శ్రీ తెల్లాకుల జాలయ్య, యం. ఎల్. ఏ. గారు అధ్యక్షత వహించారు. సభలో శ్రీలక్ష్మయ్యనాయుడుగారు చేసిన ప్రసంగంలో శ్రీశైల దేవాలయాల మరమ్మతుల నిమిత్తం విరాళాలిచ్చిన దాతలకు కృతజ్ఞత తెలిపారు. 'ఇంకా ఎక్కువగా ఈ జిల్లాలో విరాళాలు వసూలు కాగలవని ఆశిస్తున్నానని, గతంలో నడచిన ప్రతి ఉద్యమంలోను నాయకత్వం వహించడానికి గుంటూరు జిల్లా ప్రథమశ్రేణి నాయకులను దేశానికి సమర్పించిన ఘనత మరపురానిదని ఆయన చెప్పారు. శ్రీశైల దేవాలయం యొక్క చారిత్రాత్మక, పౌరాణిక ప్రాముఖ్యతలను వివరిస్తూ దేవాలయాన్ని మండపాలను శ్రీరాముడు, పంచపాండవులు నిర్మించారని, కృష్ణదేవరాయలు, కాకతీయరాజులు, శివాజీ, తెలుగు రాజులు అక్కడకు వచ్చి స్వామివారిని అర్చించేవారవడానికి అనేక నిదర్శనాలువున్నవని శ్రీ లక్ష్మయ్యగారు వెల్లడించారు. భారతదేశంలో ఇది ఒక ప్రాచీనమైన దేవాలయమే కాక ఈ ప్రాంతం యొక్క మాహాత్మ్యం చాల గొప్పదని ప్రతీతి. నాటి కట్టడాలు నేడు జీర్ణావస్థలో వున్నవి. వాటి పునరుద్ధరణకు ద్రవ్యం అత్యవసరంగా కావలసియున్నది. ప్రతి ఒక్కరు దీనిని గుర్తించి ఉదారంగా విరాళాలు ఇచ్చి ఈ బృహత్తర కార్యక్రమం నిర్విఘ్నంగా పూర్తికావడానికి కృషిచేయవలసిందని అభ్యర్థిస్తున్నానని దేవాదాయ కమిషనరు తమ ప్రసంగాన్ని ముగించారు. సభాధ్యక్షులు శ్రీ లక్ష్మయ్యగారికి స్వాగతం చెప్పి సభికులకు ఆయనను పరిచయం చేస్తూ చేసిన ఉపన్యాసంలో ఇలా అన్నారు: శ్రీ లక్ష్మయ్యగారు శ్రీశైల దేవాలయాల పునరుద్ధరణకు చూపే శ్రద్ధాసక్తులు గమనార్హములై వున్నవి. ఆయన ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డిగారిని దైవ కార్యోన్ముఖులను చేయుటలో చూపిన చతురత, పునరుద్ధరణ వ్యవహారాలలో వ్యక్తమవుతున్నదని, దక్షతను గురించి చెప్పాలంటే నేడు ఆ ప్రాంతంలో కనబడే అభివృద్ధిని వివరిస్తే చాలు అని శ్రీ జాలయ్యగారు తమ ప్రసంగాన్ని ముగిస్తూ ఐదువేల రూపాయల చెక్కును దాతల తరపున కమీషనరుకు అందజేశారు. సభానంతరం శ్రీ లక్ష్మయ్యగారి గౌరవార్థం విందు చేయబడింది.

కమీషనర్ ఇక్కడ ప్రముఖులను కలుసుకునే ముందు ఆయన కాకానిలో మల్లికార్జునస్వామివారి దేవాలయాన్ని, మంగళగిరి దేవస్థానాలను, భావన్నారాయణస్వామి దేవాలయం సందర్శించి అక్కడి పరిస్థితులను స్వయంగా పరిశీలించారు.



# अराधनायां दैव्यां हि सर्वमाराधितं जगत्

**श्री निष्ठल सुब्रह्मण्य सन्यासि शर्मा,**
श्री भावनारायणस्वामि संस्कृत कलाशालाध्यापकः

काञ्चीपुरीस्थं विमलं य दस्ति
श्री कामकोट्याह्वय पीठ मेकम्
तत्राधितिष्ठन्त इमे जयन्ति
श्री चन्द्र सच्छेखर भारतीन्द्राः ॥

श्री भावनारायण साक्षिणोस्य
ग्रन्थावली प्राच्यवचोभिरामा
सम्यक्प्रकाशीक्रियते य दत्र
दिव्योत्सवोयं जयमेतु नित्यम् ॥

ग्रन्थोय माद्यो जयतु प्रकृष्ट
श्री शङ्कराचार्य सुवृत्तनामा
प्राच्यै स्तदन्यै र्विलस न्वचोभी
रामेश विद्वत्प्रवरप्रणीतः ॥

कृते र्गृहीता विमलान्तरङ्गः
श्रीराम भानुप्रभु सुप्रसादः
श्रीवासिरेड्ब्यन्वयवार्धिचन्द्रः
पारंपरी धर्म सुकर्तृताढ्यः ॥

यन्नेति नेत्यागम सुप्रसिद्धं
आराजमागोप मतिप्रकाशम्
यः शङ्कराचार्य सुवृत्त माढ्यं
रामेशनामारचयन् कृती स्यात् ॥

कृतेः पती राम शुभ प्रसादः
कृति स्सती शङ्कर दिव्य गाथा
कृते र्विधातोभयसुप्रकाशो
रामेशनामात्मसुखा द्वितीयः ॥

देवालयादाय सुधर्मसंस्था
स्वादाय निर्वाहक पूज्य पीठम्
आरूढवन्तोऽत्र सदान्ध्रराष्ट्रे
श्रीशैल दिव्योद्धृति जागरूकः ॥

श्रीलक्ष्मयाख्यो हि सुवर्णवंश्य
श्शुभस्सभाध्यक्षपदाधिरूढः
यतोखिलानां समुदाय ऐष
प्रकाशते सर्वगुणाभिरामः ॥

आन्ध्रप्रदेशस्थित शासनार्हे
सदस्यवर्यः परमो मनीषी
कल्लूरि वंश्यो बुध चन्द्रमौलिः
प्रारंभ दिव्योत्सव मातनोति ॥

भोः पैडि वंश्या विमलान्तरङ्गाः
श्री लक्ष्मयाभिख्य शिवात्मनिष्ठाः
जागर्लमूड्ब्यन्वय भासुराभाः
श्री चन्द्रमौळि प्रवरा श्शुभाह्वाः ॥

श्री राज्यलक्ष्मीप्रभु रेष भाव
स्साक्षी हि नारायण दिव्यमूर्तिः
श्री भानुभूपाल शुभ प्रसादं
रामाभिधं पातु स साक्षिभक्तम् ॥

गीर्वाणवाणी मिह काव्यसद्म
प्राचीन विज्ञान शुभप्रकाशम्
रामेशनामान मुमेश भक्तम्
श्री शङ्कराचार्य सुवृत्त विज्ञम् ॥

प्राच्ये परस्मिन् वचसि प्रवीणम्
पाया त्सदा शङ्कर देशिकेन्द्रः
य ष्षण्मतस्थापन बद्ध दीक्ष
स्समन्वयात्तत्त्विति सञ्जघोष ॥

अहो अहस्स्या च्छुभदं नितान्तं
तत्सामरस्यं विदुषां समाजः
समन्वया त्तत्तु निदान मीड्यं
श्री शङ्करस्यास्ति मुदे बुधानाम् ॥

य स्स्वात्मशक्त्या मतषट्क माद्यं
संस्थापयामास सुसिद्धवाचा
प्रस्थान भाष्यत्रय मेष चक्रे
नानात्वसूत्रैक्य महो बभाषे ॥

स्वातन्त्र्य लक्ष्मी सहितेत्र देशे
योगोय माभाति सुपुष्कराख्यः
सर्वत्र देशे ष्विह शाङ्करं तत्
प्रचार माप्स्य त्यतिशान्ति लब्ध्यै ॥

संसार वारांनिधि मुत्तरीतुं
तरिः प्रगीता शिवतत्त्ववित्तिः
निष्कामकर्माचरणा दुपायात्
चित्तस्य चैकाग्र्यदशाविशेषात् ॥

प्रत्यक्षत स्स्या दुत तत्परोक्षात्
सत्यं मुमुक्षो रपरोक्षतो वा
शक्त्या युत श्री भ्रमराम्बयायं
साक्षाद्धृदि स्या दिह मल्लिकेशः ॥

मतत्रयं वेदवचस्त्रयं वा
मूर्तित्रयं वा क्षरगत्रयं वा
देहत्रयं कूटगतं त्रयं वा
बिन्दुत्रयं बीजगतं त्रयं वा ॥

तेजस्त्रयं त द्भुवनत्रयं वा
गुरुत्रयं कोणगतं त्रयं वा
शक्तित्रयं वा निखिलं जग त्स्यात्
ते वाचकेस्मि न्भविताक्षरेन्तः ॥

शब्दात्मिका सा भ्रमराम्बिकोक्ता
तत्र स्फुर न्नर्थमयोर्जुन स्त्वम्
सिद्ध श्च सम्बन्ध इ हात्मनोर्वा
महो भजेहं परमं गुहाख्यम् ॥

नानात्वगैकत्वनिदान मेकं
वेदान्त सिद्धान्त शुभागमोक्तम्
चक्रान्त रीशी भ्रमयस्यशेषं
तस्यै नमः श्री भ्रमरांबिकार्ये ॥

सर्वेषु चक्रेषु लसत्सु लोके
सर्वार्थसंसाधक मुत्तमं यत्
परांबिकायाः प्रिय मुत्तमं त
च्छीचक्रराजाह्वय मेक मास्ते ॥

अतः परोत्कर्ष निदान मेतत्
श्री बीज युक्ता परमावळिस्स्यात्
यद्वै परित्यज्य न कोपि किंचित्
लोके लिखत्येव त दस्ति मूलम् ॥

परात्मनोंशेषु लसत्सु सम्यक्
श्रीरामचन्द्रो भुवि सुप्रसिद्धः
ऐवं महाबीजमयं तदास्ते
धामैव श्रीशैल कृताधिवास ॥

परेशपूजाविधये समर्था
श्चकासतीड्या बह वोत्र वृक्षाः
तथापि तुर्यादि विलाससाक्षी
जागर्ति पुण्यः खलु श्रीद्रुमाख्यः ॥

सहस्रनामानि बहूनि लोके
सर्वात्मिकायाः परमेशशक्तेः
रहस्य साहस्र शुभाह्वयं तत्
श्रीमातृ नामैव समस्त सिद्ध्यै ॥

भोगप्रदास्सन्ति हि काश्चि देवं
योगप्रदास्सन्ति परास्सुविद्याः
भोगाविरोधेन सदा विमुक्त्यै
श्रीपूर्विका सा परमात्माविद्या ॥

श्रीशैलवासिन् भ्रमरांबिकायाः
पते, शुभाकार सरत्नगर्भ
त्वं मल्लिकाभिः परिपूज्यमान
स्सदार्जुनस्स्वात्मदृशि स्थितोसि ॥

यस्याः प्रदादान्महितान्तरङ्गा
स्सिद्धिं परां दिव्य वचो लहर्याः
सम्प्राप्य सिद्धा जगतो विभूत्यै
चरन्ति नौमि भ्रमराम्बिकाम् त्वाम् ॥

अहो महात्मन् नवरत्नगर्भ
भर्गात्मजन्मन्नव भक्तसंघम्
दुर्गाप्रियोऽनर्गळसर्गलीलां
विधातु मीष्टे गणपात्मशक्त्या ॥

श्रीशैल मल्लीश्वर दिव्यधामन्
सीमन् जगत्या इह सर्गशक्तेः
भूमन् निजानन्द नवाकृते स्त्वं
साक्षिन् प्रभो श्रीभ्रमरांबिकायाः ॥

संज्ञा भवे त्पूज्यतमस्य लोके
श्रीयोग युक्ता परितः प्रसिद्धा
आद्या परांबा भ्रमरांबिकैषा
श्रीमातृनाम्नी सकला चकास्ति ॥

कदापि धैर्या च्चलितो भवे न्नो
वायु ष्वनेके ष्विह तेषु तेषु
शृङ्गाग्रसंदर्शनतो विमुक्त्यै
श्रीशैलनामा गिरिशाधिवासः ॥

चिल्लीलया ते जगत स्सविन्या
मल्लीश्वरस्सललितान्तरङ्गः
ह्लास्यलीलां कुलकौलरम्यां
सल्लापगीतिं हृदि संश्रृणोति ॥

अध्यक्षवर्याश्शिवतत्त्वविज्ञा
गीर्वाणवाणी हृदयज्ञवर्याः
सुधर्म कर्तृ प्रवरा महान्त
स्सर्वेपि सभ्यास्सुहृदो हिताश्च ॥

श्रीभावनारायण दिव्य सद्म
सत्कार्यदर्शी भुवि पद्मनाभः
ग्रन्थप्रकाशोत्तमकार्यदर्शी
पेरय्यशास्त्री सुकलालयेशः ॥

श्रीभारतोर्वी जयमेतु नित्यं
प्रजाप्रभुत्वं विमलं विभातु
भाषान्तरात्यन्तिक सौहृदाढ्या
विजानराशि र्जयमेतु दिव्या ॥

शुद्धापराध्यात्मिकदीप्ति रास्तां
जातीय सत्संस्कृति रुद्धृता स्यात्
सत्सौमनस्यं परिपूर्ण मैत्री
सर्वत्र सिद्धिं परमां लभेताम् ॥

श्री राज्यलक्ष्मी सहितो महात्मा
श्री भावनारायण साक्षिदेवः
सद्भावनां शान्तिमयीममोघां
कुर्यात्सदा सर्वजग द्धिताय ॥

चतुर्दशैकोत्तम पद्यरूपा
मालेय माभाति हि चंद्रवेदा
'श्री शंकराचार्य' चरित्रमूला
जीया द्विमर्शग्रथितेशशक्तेः ॥

जयतु भारतम्
जयतु संस्कृतम्
जयतु विज्ञता
जयतु शान्तता ॥

( सुवर्णपुर श्री भावनारायणस्वामि प्राच्यग्रन्थावली प्रकटनायां श्री शङ्कराचार्य ग्रन्थाविष्करण महोत्सव सभायां पठितेयं श्लोकावली )

---

# श्रीमद्गांधी गीता

रचयिताः

**श्री केशिराजु वेंकट नृसिंह अप्पारायाः**

## स्वराज्य योगः

भारतस्य समग्रस्य स्वराज्यं कांक्ष्यते मया ।
देशीयैश्च विदेशीयै राज्यभागैः सह स्थितः ॥ ३०

Independence of India should mean independence of the whole of India including what is called India of the States and the other foreign powers.

स्वातंत्र्यं भारतीयानां स्वराज्य मिति कथ्यते ।
नतु तेषा मिदानीं ये प्रजाना मत्र शासकाः ॥ ३१

Independence must mean that of the people of India, not of those who are to-day ruling over them.

अनुसृत्य प्रजाभीष्टं वर्तेरन् पालकाः सदा ।
प्रजानां सेवकाः स्यु स्ते तदाज्ञापरिपालकाः ॥ ३२

The ruler should depend on the will of those who are under his heels. Thus, they have to be servants of the people, ready to do their will.

प्रारंभस्तु स्वराज्यस्य भवे न्नीचैःस्थिते जने ।
अतः सर्वाधिकारै श्च ग्रामराज्यं प्रवर्तयेत् ॥ ३३

Independence must begin at the bottom. Thus, every village will be a republic or panchayat having full powers.

स्वयंपोष्याः स्वयंपाल्याः ग्रामाः सर्वे भवंतु नः ।
स्वयंरक्षणशक्ता श्च विश्वशक्तेः पुरोऽपि ते ॥ ३४

It follows, therefore, that every village has to be self-sustained and capable of managing its affairs even to the extent of defending itself against the whole world.

शिक्ष्यंते ते तथा येन बाह्याक्रमणगोचराः ।
नश्येयु र्न तु नम्येरन् आत्मरक्षण तत्पराः ॥ ३५

It will be trained and prepared to perish in the attempt to defend itself against any onslaught from without.

एवं च नर एवात्र प्रधानं व्यक्तितायुतः ।
पराश्रय स्वैच्छिक श्चेत् नरस्य न निषिध्यते ॥३६

Thus, ultimately, it is the individual who is the unit. This does not exclude dependence on and willing help from neighbours or from the world.

आत्मदौर्बल्यमूलं हि पारतंत्र्यं विहाय यत् ।
न कोऽपि हीयते लोके स्वातंत्र्यादिति मे मतिः॥३७

It is my certain conviction that no man loses his freedom except through his own weakness.

दौर्जन्य प्रतिरोधेन बाधां सोढु मनिच्छवः ।
शिरो नमंति बहवः पुरो दौर्जन्यकारिणः ॥ ३८

Most people choose rather to yield to the will of the tyrant than to suffer for the consequence of resistance.

अतः संत्रासनं मुख्य मायुधं त न्निषंगके ।
निर्भीकस्यपुर स्तस्य वीर्यहीना बिभीषिका ॥ ३९

Hence does terrorism form part of the stock-in-trade of the tyrant. Immediately the subject ceases to fear the despotic force his power is gone.

यदि स्वतंत्रस्त्रीपुंसा न जीवेम कथंचन ।
मरणं श्रेय इत्येव मन्येमहि सदा भुवि ॥ ४०

We must be content to die if we cannot live as free men and women.

आत्मवान् स्वर्णनिगलं लौहाच्छ्रेयो न मन्यते ।
निगलत्वगतो दोषो न तु धातुगतो हिसः ॥ ४१

Golden fetters are no less galling to a self-respecting man than iron ones. The sting lies in the fetters, not in the metal.

न स्वराज्यं शनैः प्राप्यं यत् स्यात् प्रसववत् क्षणे ।
यावत्पूर्णस्वराज्याप्ति र्नस्यात् दासा वयं भुवि॥ ४२

There is no such thing as slow freedom. Freedom is like a birth. Till we are fully free, we are slaves. All birth takes place in a moment.

आत्मनः पारतंत्र्यस्य स्वयमेव हि कारणं ।
यदा वांछति स्वातंत्र्यं तत्क्षणे लभते नरः ॥ ४३

Man has to thank himself for his dependence. He can be independent as soon as he wills it.

इति श्रीमद्गांधीगीतायां स्वराज्ययोगो नाम तृतीयोऽध्यायः समाप्तः

---

गताङ्के २० श्लोके "शांतिं स्थापितुं" इत्येतस्य स्थाने "शान्तिस्थापन" मिति पठितव्यम् ।

# मनुष्यः – महर्षिः


आंध्रमूल
रचयितारः
वड्लमूडि गोपालकृष्णार्याः

संस्कृतीकरण
अनुवादकाः
???


**43**

मृण्मय मिदं
जन्म दुःखं
श्रीश्च दुःखं
धीश्च दुःखं
स्त्री च दुःखं
छलं दुःखं
जरा दुःखं
मृति दुःखं
मानवानां
संसृति रसौ
सकलाधृवं
दुःखपूर्णं
भ्रातर श्च
स्वसार श्च
दारपुत्राः
माता पिता
बंधुसुहृदः
बद्धवैराः
धनागारं
सौधजालं
मनो वांछा
कृतं सर्वं
पलालं खलु !

असत्यं खलु !
निद्रां त्यज
त्यक्त्वा भृशं
दीर्घनिद्रा
मा भू दिति
गाढनिद्रा
मा भू दिति
बुद्धिनिद्रा
मा भू दिति
नेत्रयुग्मं
उन्मीलय
पश्य मार्गं
पश्य पापं
पश्य पुण्यं
आत्मानमपि
पश्य स्वयं
पश्य सत्यं
अलस गत्या
न नश्ये स्त्वं
दीर्घदर्शी
जागरूकः
ऐधि नित्यं
भो मनुष्य !
भो मनीषिन् !

**44**

अप्रमेयं
अमूल्यं हृत्-
पेटिकास्थं
ज्ञान रत्नं
महित रत्नं
महा रत्नं
हर्तु कामः
अनुक्षणमिह
देह बद्धः
दाह युक्तः
काम संज्ञः
क्रोध संज्ञः
मोह संज्ञः
लोभ संज्ञः
मदाभिख्यः
मत्सराख्यः
ऐतेऽखिलाः
कष्टाष्टकं
नष्ट स्थितिं
प्रापयंतः
भ्रष्टतायाः
दुष्टतायाः
सृष्टिकाराः
पुष्टिकाराः
पाररहितं
वैर मेवा-
हार इति ये
जीवंति ते
षट तस्कराः
गुण तस्कराः

महा चोराः
छन्नवेषाः
संचरंतः
छद्मवेषाः
पीडयंतः
जृंभमाणाः
दृप्यमाणाः
महा चोराः
सर्व चोराः
तस्कराणां
तस्कराः स्युः
गूढ दर्शन
तस्कराः स्युः
अति विनीताः
तस्कराः स्युः
बकध्यानाः
धर्मकंचुक
तस्कराः स्युः
अदृश्याः किल
तस्कराः स्युः
अवश्याः किल
तस्कराः स्युः
उच्छिष्ट मपि
हर्तुकामाः
इंगित मपि
हर्तुकामाः
गगन मप्या-
हर्तुकामाः
तस्कराः स्युः
श्लाघापराः
तस्कराः स्युः

सेवापराः
तस्कराः स्युः
मुष्करा अपि
तस्कराः स्युः
निद्रां त्यज
त्यक्त्वा भृशं
दीर्घनिद्रा
मा भू दिति
गाढ निद्रा
मा भू दिति
बुद्धिनिद्रा
मा भू दिति
नेत्र युग्मं
उन्मीलय

पश्य मार्गं
पश्य पापं
पश्य पुण्यं
आत्मान मपि
पश्य स्वयं
पश्य सत्यं
अलस गत्या
न नश्ये स्त्वं
दीर्घदर्शी
जागरूकः
ऐधि नित्यं
भो मनुष्य !
भो मनीषिन् !

---

## SPEECH OF

# DR. RAJENDRA PRASAD

(President of India)

AT SRISAILAM ON 19—8—1959

"When I was first asked to pay a visit to Srisailam, I readily agreed not only because I would be able to see a new place but also because I will be able to worship there. After coming here, all that I have seen has impressed me with the earnestness, with which the renovation of the temple and its surroundings had been taken in hand specially through the enthusiasm of the Chief Minister. When I was going round the temple this morning, I could see the old columns and the old statuary, which abound in this temple and it struck me what engineering feat it must have been. I do not know when this temple was built. Certainly it must be more than 1000 years ago. To have constructed this temple so rich in beauty and so full of very beautiful architecture and statues that has lasted unattended and uncared for during all vicissitudes of weather these 1000 years and more. I wonder if all the big constructions, which we are engaged in at present, will last in one-tenth of that time if they are left uncared for or unattended to and without what is officially, probably technically called quin quennial repairs. I do not know the material which was used, but it seems this place is fortunate in having the kind of stone, which can stand the severity of weather and it is that kind of stone that had been used and which had been to some extent responsible for long life; but apart from the natural aspect which has sustained millions and millions of our people to come to see it in the great faith that has inspired them. After all it is this faith which has made India what it is. It is this faith which would continue to keep India what she is, if she is able to maintain it. We may have all kinds of facilities and amenities, for physical comforts, desirable and even necessary and we should not spare any efforts to make our people a little a bit more comfortable, a bit better provided with the amenities of life. But at the same time we shall be committing the greatest sin, which the man is capable of, if we neglect the spiritual food which has sustained our people for generations. It is temples like this, which furnish and cater spiritual food; and temples like this which build and sustain our fate which has been ours for generations. After all India forming from the snowy heights of the Himalayas right upto Kanyakumari, from Somnath upto Jagannath Puri, this India has got so many differences of language, of climate, of habits of living. But, in spite of all these differences there has been that underlying unity which has kept us together in spite of all the trials and tribulations, which history has exposed us. In politics it is only for the first time that we have become one but as a people, in our culture, in our religious outlook, in our faith in fundamental things of life, we have been one for millions of years, and God

willing, if we are able to maintain that one-ness, any other kind of vicissitude which it may be our luck to face in future will pass only in the same way, as in the past, as have passed through these vicissitudes of life. Emperors have come and gone, rulers have ruled, misruled, oppressed; some have ruled well and piously with the good of the people at heart. All this we have seen, we have seen also the rise and fall of empires. We have seen invasion. We have seen people coming from thousands of miles away and settling in this country ruling over us. They have not been able to disturb that fundamental unity so far. But I must warn you and I also must warn the country to-day that we are passing through a stage which is not free from risk to that fundamental unity of the country, which has maintained us as one. Political unity by itself will not be able to keep us alive. Political unity by itself may not be able to keep itself alive unless we maintain that fundamental unity and it is that unity which can be sustained through devotion to such temples and it is devotion, which has sustained us all these centuries. Let me hope that the renovation of this temple means the renovation of the faith and I am very happy to hear that since the attainment of SWARAJ, enthusiasm of the people for visiting the places of pilgrimage has increased, as evidenced by the phenomenal rise in the revenue of the greatest temple on this side, the temple of Tirupathi and if that is any indication, I hope, it augurs well for the future and if it continues, I shall die happy only to live again."

# The True Teacher

*By*

FRANCIS BRABAZON,
( An Australian disciple of MEHER BABA)

•

The True Teacher is that one
who, having no need to come, for my sake came;
having no need to remain, for my sake remains;
and who, having no need to go, will for my sake go;

who rocks me to sleep and at the same time awakens me;
makes me blind at the same time sharpens my sight,
and removes my ignorance by making me know nothing :

who without admonition makes me aware of my short comings;
without urging me to effort awakens and sustains my interest,
and rewards me without letting my ego become inflated :

who puts on a coat when it is cold and takes it off when it is hot,
satisfies hunger and thirst in the same way as I do,
but does not sleep as I sleep but watches for me my sleeps of unconsciousness:

who in every way in every day life acts like an ordinary man is easily pleased
and hurt, but being beyond pleasure and pain suffers as no one else can suffer and
whose bliss shines thru his suffering :

who is the father of children he has never begotten,
the mother who never brought forth with labour,
the brother and friend who sees no one but himself;

who is the Goal and its revelation and the path way to it
and the path-treader who treads no path any whither
because he is where he is and has never been anywhere else :

who, in fact, is the supreme Reality
but appears to my eyes as very man, to my mind as Rightness
and to my heart as the ineffable Beloved who may be approached and attained.

# The Discovery of God

*Original:*
SRI KAKARAPARTHI KRISHNA SASTRI

*Translation:*
SRI P. VENKATESWARLU, M. A

**(Continued from the previous issue)**

The Sun was about to set on the Western horizon. The temple of Lord Chandrasekhara was jam-packed. The bell was ringing without rest or stop. In a Jiffy, the 'Vibhuti' was disappearing. Perhaps, because of the custom of non-acceptance of offerings, to Siva, the big 'Nandi' in front of the Linga was almost heaped upon with flowers called 'Nandivardana' and 'Bilva' leaves. Though that was not the day auspicious to Siva, the reason for such mammoth gathering was the Swami's arrival with his disciple into the temple.

The Swami and his disciple were sitting and discussing about something in a 'Kalyana Mantapa' which was specially built on one side in the middle of the Temple 'Prakara'. Bhuma Swami and Lord Sankara were equally sharing the looks of the Bhaktas in the temple.

Some were showering pitiful looks on the Swami thinking that something terrible would happen in the presence of the God himself. Some were murmuring in the ears of their neighbours that it would be better for the Swami to stay away from the wicked and questioned why the Swami should stick to his gun.

Everybody thought the time for the sacred blood of Swami drenching the 'Kalyana Mantapa' was fast approaching. Nobody had the nerve enough to fall at the feet of the Swami nor hint at the impending danger. Even so none went out of the temple. Sangayya's former command was echoing in their ears and was rocking them but poor people were not aware of its revocation. Understanding the terrible fear of the people, both the Guru and the disciple sat there brimming with smiles.

Meanwhile, a care-free fellow brought the news of the arrival of Sangayya. It was like a bolt from the blue. The news spread like a drop of oil in water. The people just moved a little away from the 'Kalyana Mantapa' and stood there with bated breath observing pin-drop silence.

An ear-ringed scholar walking in front of him, Sangayya stepped in the temple Prakara. Observing that everyone's looks are centred on him, Sangayya felt shy of himself. Raising his head he looked at the people with loving looks but the softness in his looks did not have its effect. Knowing this, Sangayya despaired, heaved a sigh and hanging his head walked straight to the Sanyasi. Adjusting his upper cloth the ear-ringed man followed Sangayya proudly.

Sangayya soon prostrated himself before the Sanyasi and raised his head slowly. Owing to the fiery and piercing looks of Sangayya, the ear-ringed man could not but prostrate also. Kesava greeted both of them with 'Narayana Smarana' and all of them sat in the presence of the Sanyasi.

"Swami! this man is a great scholar in our village. When he recites 'Purana'

everyone should bow his head to him. My wife has a great regard for this man. Every day in the noon, he recites Purana in our house for an hour," said Sangayya introducing the Pandit to the Swami.

"Oh! I see. The very look of him is the index of his scholarship. (Laughing) I am glad that to our Sangayya the meaning of all puranas is as clear as Crystal," said Swami with serene face.

"This Sangayya is not as fortunate as you imagine. I have not heared the 'Purana' sitting steadily even for a day. That is why I said in the beginning itself that he is my wife's Guru," said Sangayya smilingly.

"Because of the existence of complete theistic women in our 'Bharatha Desa', our Dharmas of Ancient religion are still survived and alive. Look here! A Brahmin boy eats in a hotel in the city without observing customs. But can he eat with his cloths on in his house, however independent he may be? What is the reason? Is it not because of the fear of his wife or mother? A great man who denounces the idolatry on the public platform, will keep 'Mudupu' to Lord Venkateswara by the force of his mother or wife when his children are ailing a little. What, Gopinath! Is this not our experience?" said Bhuma Swami in reply to Sangayya and to strengthen the friendship of the scholar.

"In this world everywhere, atheism has spread its tentacles. It is burning with spiritual hatredness," said Pandit Gopinath proudly raising his eye-brows and with 'Upadesh Mudra' and with ear-rings oscillating. But in the meantime remembering that the cruel and wicked dictator Sangyya was there in his proximity, he was perturbed and corrected his statement with a dry smile, saying, "Only our Sangayya's family is an exception."

Meanwhile, a young man of twenty years who was standing along with others and observing the Sanyasi, who was educated in English and clad in full European style, swiflly came forward and drew near the 'Mantapa'. Looking piercingly at Gopinath bawled out "Hey! Why are you attacking our non-brahmins again? Are you not content with the suppresion of us by your Brahmin Rishis?"

Hesitatingly Sangayya held the hand of that youth and pacified him saying silently "He did not say anything of us." Then to Sanyasi he said, "Swami! He is my sister's son. His name is Gopal. He is studying for the B.A. degree examination in Madras,"

Observing him from tip to toe, Bhuma Swami smiled and said, "Come on, son! sit here."

With the hint of Sangayya to do 'Namaskarams' to Swami, Gopal though unwilling, waved his hat a little and sat beside his uncle.

"What, you are the nephew of our Sangayya! You are as agile as your uncle. I feel very glad to see the active and middle some boys," said Swami to Gopal with a smiling face and looking at the Pandit said, "What Mr. Sastri. I don't know how far you agree with me. A boy who is a dummy in his boyhood will remain so even in his manhood. His flowering of his brain is very little. See! How Sri Krishna, who was very mischievous in his boyhood, became an ace politician who rocked the whole Bharath when he attained his manhood! Why worldly matter alone? Is Gita not his 'Bhiksha' to us in the spiritual world?"

Pandit Gopinath did not open his mouth. Seeing that the Swami was justifying his disobedience and unmannerliness,

suddenly Gopal could not but have great regard for the Swami. He hung his head a little and sat quiet meddling with the button of his shirt.

"With regard to castes, Shri Sastri and Gopal seem to be poles apart. Can I hear a little by both of you?" said Bhuma Swami looking at their faces. Immediately Sangayya joined and said, in defence of his nephew, "He is innocent. Mere childish pranks." Gopinath took advantage of these words uttered by Sangayya because of his bhakti (devotion) towards Swami, and shaking off his fear, said to prove the crime of his opponent · "No sooner does he hear the name of a Brahmin than he rebukes him. No need to tell of me." Then Gopal fretted and said mockingly "We only blabber when we suffer but your caste is almost cut-throat. You can't continue your ways as before. We can't remain suppressed by you. We have opened our eyes and now you can't wag your tail." "No, No," said Sangayya with his eye-brows constricted to stop his nephew.

"Sangayya! by checking him alone, you can't make him cool down. His doubts will not be cleared. There will be no mental satisfaction. Just as the ball played to the earth rebounds with greater energy, and the drum emits the sound as it is patted, if you stop him by scolding, his hatred would increase still more. Until they find an outlet the unbounded bliss or anger or sorrow will not de lessened. If they are intentionally forced to remain inside, at times they may lead to the death also. Look here. Do you realise why there is a custom among us to examine the bereaved carefully? Why should one by one go and make them cry? Is it not to take off the weight of the heart's sorrow? Have you not heard that the news of friends' death resulted in sudden heart-failures in many cases? That is why the death news will not be revealed suddenly. Same is the case with bliss. Did we not read in the newspapers that a man of stark poverty heard the news of his winning some lakhs of rupees in a lottery which resulted in his death? So every care should be taken with regard to the entrance and exit of anger, bliss and sorrow. Now my trash is over and let me hear their opinions," said Bhuma Swami with calmness which gave pleasure to Gopal and made the Brahmin feel that the Sanyasi was also a brahmin, thus making him fearless.

*Gopal*: Swami! I seak without fear or favour. There is no end to the injustice done to us by the ancient brahmins even to this day. They say brahmins are born from the mouth of the God and we, the Sudras from the feet. They are the masters and we are the servants. They are qulified to read the Vedas and we are not fit to read a letter of them. Further, our ancestors will not be emancipated if we do not wash their feet and sprinkle the water on our heads. They sit without any worry and live upon the others like parasites ruining the Bharata. We will have to work day and night in rain or shine and feed them. Oh! There are hundreds and thousands like this. From ages immemorial, they have been suppressing us like this.

*Bhuma Swami*: Babu! Gopal! What you said just now is true. But in the end you said 'suppressing' which is not true. Let us keep it aside. Let me hear what our Pandit Gopinath will reply to your allegations.

*Gopinath*: What is there to say? Long ago, our Maharishis, who were the Seers of the past, present and the future, determined our castes like that. They were not only Mahatmas but great Taponidhis (ascetics). The same is

being followed from time immemorial. There is 'Dharma' in them and in this Kaliyuga it is slowly becoming conspicuous by its absence. As Markandeya Maharshi says, in the Mahabharata, 'Brahma Dwesha' (hatred of Brahmins), 'Anna Dwesha' (hatred of food) have cropped up their heads to the very letter.

*Gopal*: It is for those unjust writings that we abuse you and your rishis. Do you understand? Otherwise.........

*Bhuma*: (Interferring with Gopal) Son! you keep quiet. Did Sastri interfere when you were talking? You should not overlook the rules of the discussion and interfere with anyone unless he finishes his say. (Looking at Sastri) Mr. Sastri! Is this the reply you give? You said this is all due to the defect of Kaliyuga. If so why don't you attribute the sin of the abuse of Brahmins and rishis to Kali himself instead of to this boy? I doubt the reasonableness of your reply. You are a great scholar and this boy is a modern-educated one. Without attempting to reason out, each of you are advocating your own caste. But have both of you ever examined the origin and the cause of these four castes impartially? Had you tried with your acute brains, the hatred of castes would have been wiped out. In our country, unity had developed to a great extent. Look here. When we want to know a thing do we understand the real facts without discussing and thinking over it fully with a calm and collected mind? Let it be a worldly matter or a spiritual matter.

*San*: None has the patience or the power to give reply calmly and leisurely to the insignificant questions of Gopal.

*Bhuma*: (Laughing) Sangayya! Not only Gopal but our Gopinath Pandit also has to ponder over this a little. Son! Gopal! Your first allegation is God's face and feet, and the birth of Sastri and yourself from them. Is it not so?

*Gopal*: (Laughing) Yes. Swami! Is this not dead against Nature? Have we ever seen or heard anywhere about the birth of men or any creature, for that matter, either from the face or from the feet? How senseless!

*Gopi*: Tell me whether they are senseless or ungrateful. Did they not tell you what is good and what is bad? Did they not give you books of theoritical and practical politics? Did they not philonthrophically offered us the Ayurveda which cures the diseases of the whole humanity and makes us live? Who are the authors of the six Darshanas? Who are the Taponidhis that made 'Paramatma' easily accessible eventhough he is indescribable and inexpressible? Now as their ill-luck would have it, they are being abused.

*Bhuma*: What, Gopal! Eventhough you don't agree with Gopinath on other matters, do you agree so far as that our Maharishis have written books on great things and given them to us?

*Gopal*: I don't say they are intellectuals. The foreigners themselves have showered hosannahs over their unequalled works. Swami! Are there not pearls as well as crocodiles in the ocean?

*Bhuma*: (Laughing) Son! You have mistaken pearls for crocodiles. Let us reason out. See, the foreigners themselves have shown how true and correct are the matters revealed by these great intellectual giants. What do you say the reason for the same wise men, the

same great Maharishis saying that the people are born from the face, hands, thighs and feet which is ludicrous?

*Gopal*: If so, do you mean to say they have not written?

*Bhuma*: They have written. Did I doubt it? What I ask is why they have committed a mistake in such a small matter. Another question is why the same doubt did not occur to your ancestors.

*Gopal*: Due to lack of sufficient education and critical attitude.

*Bhuma*: Good heavens! Son! Should you say so? Do you meen to say they were not educated? Do yon mean to say they were not wise? Because they had good critical power, they grasped the inner meaning and satisfied themselves. Like them if you had also calmly and wisely thought over and examined this......

*Gopal*: I am not such a wise man. Well, Why Don't you kindly disclose the hidden truth to me?

*Bhuma*: Are you keen and earnest to know it? After I finish my talk, if you have any doubts ask me plainly.

*Gopal*: Oh! Yes.

*Bhuma*: I hope Sir, Gopinath pandit will also try to give me his ear.

*Gopi*: Why should I hear? Whoever is in illusion he should hear and grasp.

*Kesava*: Mr. Sastri! If you are not in illusion, why can't you clear the doubts of Gopal and satisfy him? Why should you give trouble to our Swami?

*Bhuma*: Gopal! I think you have understood the reply of Sri Gopinath. I am grateful to the Pándit for not giving me trouble.

**(To be continued)**

# ĀRĀDHANA

( RELIGIOUS MONTHLY MAGAZINE )

VOL. V DECEMBER, 1959 NO. 12



PUBLICATION OFFICE:

## ĀRĀDHANA

OFFICE OF THE COMMISSIONER
*Hindu Religious & Charitable Endowments*
*( Administration ) Department, ( Andhra Pradesh )*
**HIMAYATNAGAR, HYDERABAD.**

**ANNUAL SUBSCRIPTION Rs. 12/-**

**PER MONTHLY COPY Re. 1/-**

# విషయసూచిక

తెలుగు



संस्कृतम्



ENGLISH



★

ముఖచిత్రం :

వేణుగోపాలస్వామి - ధ్రువమూర్తి - బలరామునిపేట, బందరు

" ఆనందరూప మమృతం య ద్విభాతి "




సంపుటం 5 డిశంబరు, 1959 సంచిక 12

त्वं हि विश्वतोमुख विश्वतः परिभूरसि ।

अप नः शोशुचदघम् ॥

॥ ऋ. १.९७.६. ॥

నీవె విశ్వతోముఖుడవు
నీవె విశ్వవ్యాపకుడవు
మాదు కష్ట నష్టాలను
మాయించుము పరమేశ్వర !
ప్రక్షాళనమౌనులె మా
పాపపంకిలం సర్వం.

प्र यदग्नेः सहस्वतो विश्वतो यन्ति भानवः ।

अप नः शोशुचदघम् ॥ ॥ अ. १.९७.५ ॥

హే విశ్వతేజస్వి !
ఈ విశ్వసర్వస్వ
దుర్విఘ్న నాశకా !
సర్వజ్ఞ ! విశ్వజ్ఞ !
నీ దివ్యతేజాల
మాదురిత పుంజాలు
నిశ్శేషమౌతాయి
నిండు దయ జూడుమా !!

—" కళాకృష్ణులు "





# అర్చన

సర్వాంతర్యామియు సశరీరుడు అయిన పరమేశ్వరుని ప్రతికృతి లోహమృత్తిక దారువులతో ఒనర్చి ధ్యానించిన నరుడు ఐహికాముష్మికసిద్ధిని సారూప్యాన్ని పొందగలడు. ఈ విగ్రహారాధనను కొందరు సందేహించి ఇంద్రియగోచరుడు కాకుండా కళారహితుడై అలంబనమునకు రానటువంటి దేవుణ్ణి నిశ్చలమైన మనస్సుతో ధ్యానం చేయవలెనని ప్రయత్నిస్తారు. కాని అహంకార మమకారాదులతో భ్రాంతులైన జనులు అటువంటి ధ్యానం చెయ్యడానికి సమర్థులు కానేరరు.

అనంతమంగళ సమూహంతోకూడి కోటి మన్మథుల సౌందర్యంమూర్తీభవించి ప్రపంచ పాలన సృష్టి నష్టులకు కారణుడు సకల జగదాశ్రయుడు భక్తులను అనుగ్రహించే శక్తియుక్తుడు అయిన ఆ సాలంబనమూర్తి ధ్యానార్చనలనుచేసి హోమమొనరించి అతని ఆకారంగా పరిణమించి అచంచలమై అనన్యస్కమైన మనస్సుతో ఏకజన్మసిద్ధమైన విరక్తిజ్ఞానంతో సంసారార్ణవాన్ని నరుడు తరిస్తాడని శ్రుతి స్మృతులు ఉద్ఘోషిస్తున్నవి.

చిన్న మర్రిగింజలో మహా వటవృక్ష మణగి ఉన్నట్లుగా ప్రళయకాలంలో అఖిల ప్రపంచ వృక్షానికి బీజభూతుడై అణుమాత్రుడై సృష్ట్యనంతరం బ్రహ్మాండ లక్షకోటులు విరాడ్రూపంతో తానై మహత్తులకే మహత్తరుడైన ఆత్మను సర్వజగన్నియామకుని సంకల్పరహితుని వివిధారాధనలతో అర్చించి నరులు జన్మమరణాది దుఃఖరహితులు కాగలరు.

చిన్మయుడు అద్వితీయుడు నిష్కళుడు అశరీరి అయిన బ్రహ్మకు రూపాన్ని కల్పించడం ఉపాసనకార్యమని రామతాపనీయోపనిషత్ బోధిస్తున్నది.

ఈశ్వరునికి దేహబుద్ధితో దాసుడను. జీవబుద్ధితో అతని అంశాన్ని. ఆత్మబుద్ధితో ఈశ్వరుడే నేను అని భావించవలెనని మరొక ఉపనిషత్తు పేర్కొంటున్నది.

భక్తి - ఈశానుభవం - ప్రేమ - లక్షణభక్తి కలిగి ఉన్న నరులు దేవుని పాదపద్మ సరస్సంబంధ హంసలు - అనగా పరమహంసల సాంగత్యము పొంది దేహగేహాద్యనురాగ త్యాగులై మోక్షేచ్ఛ సైతం లేనివారుగా ప్రకాశింపగలరని భాగవతం ఉద్ఘాటిస్తున్నది.



# తిరుపతి వేంకటాచలపతీ!

శ్రీ రామవరపు నరసింగరావు

స్థిరతర భక్తముక్తికర శీల సమార్జిత సర్వ సన్నుతీ!
నిరత యశో విశేష మహనీయ లతా వితతీ గతోన్నతీ!
భరిత దయామయాత్త బహు భవ్యమతీ! సుకృతీ! వరాకృతీ!
తిరుపతి వేంకటాచలపతీ! కలికాల నరైక సద్గతీ!

తిరిగి న వేందుకాంతమణి తీరుగఁ దెచ్చి యభిష్టుఁజేయఁ బే
రురము నలంకరింప నుపయుక్త విభూషలనీయ భక్తిమై
పరమ నదీతటాదులను బ్రార్థన సల్పఁగ శక్తిహీనుఁడన్
తిరుపతి వేంకటాచలపతీ! కలికాల నరైక సద్గతీ!

మఱువక మత్ హృదగ్రమణిమంటపమందు వసింపుమయ్యా! పె
న్నురము నలంకరించెదఁ బ్రియోక్త ఛలోక్తి వినూత్న రత్నసం
భరిత శతాధికగ్రథిత పద్య విశేష విభూషణావళిన్
తిరుపతి వేంకటాచలపతీ! కలికాల నరైక సద్గతీ!

కరిముఖ విఘ్నకారణ వికల్పరతిన్ సరస్వతీ సతీ
సరసవచో విలాసకళ సాగరకన్య శుభావలోకనన్
హరిహరమూర్తి దివ్యమహిమాధిక మాత్మఁ దలంతు నెంతయున్
తిరుపతి వేంకటాచలపతీ! కలికాల నరైక సద్గతీ!

గురులకుఁ దల్లిదండ్రుల కకుంఠగతీ కృత సత్కృతుల్ యతీ
శ్వరులకు భవ్య కావ్య రససార సుధాకర పూర్వ సత్కవీ
శ్వరులకు దైవభక్తులకు సాగిలిమ్రొక్కి రచింతు నీ కృతిన్
తిరుపతి వేంకటాచలపతీ! కలికాల నరైక సద్గతీ!

కరము చిరంబుగన్ వెలయగన్ గృతివిచ్ఛేద నంకితంబు మ
త్సరగుణహీన ధన్యులు ప్రజాగణ మాన్యులు నన్ను గన్న దే
వరలకుఁ దల్లి దండ్రులకు వారక భక్తివిధేయతా మతిన్
తిరుపతి వేంకటాచలపతీ ! కలికాల నరైక సద్గతీ !

సరసపు వాక్కుచేత నిను సన్నుతిచేసిన మోక్షమంట ఏ
విరసపు బల్కునైన బలవించిన జాలును ముక్తికంట నే
సరస తరంబులున్ విరస సంగతులున్ సరిజేసి మ్రొక్కెదన్
తిరుపతి వేంకటాచలపతీ ! కలికాల నరైక సద్గతీ !

సరస జనానురాగకర చంపకనేత్ర ! నితాంత రక్షణా
చరణమునందు నీ చరణ చంపకయుగ్మమె యాశ్రితాళికిన్
శరణమునౌట బూజనము సల్పుదు చంపక సంచయంబులన్
తిరుపతి వేంకటాచలపతీ ! కలికాల నరైక సద్గతీ !

శరణము సంహృతావృదరిషత్పరిషజ్జల పాపకూప సం
సరణము సర్వలోక జన సంచయ నిత్య శుభంభవత్పవ
చ్ఛరణము మోక్షకారణము సంకట సంహరణాచణంబు శ్రీ
తిరుపతి వేంకటాచలపతీ ! కలికాల నరైక సద్గతీ !

వరద ! నినుం గనుంగొనని ప్రాయ మనర్థక హేయమాయ నిం
గరముల మ్రొక్కనట్టి యల కాయము దుష్టబలీయగాయ మో
హరి ! నిను దెల్పలేనిదగు న్యాయము పంకిల తోయఛాయ శ్రీ
తిరుపతి వేంకటాచలపతీ ! కలికాల నరైక సద్గతీ !

పరమము మోక్షభాజనము త్వచ్చరణాంబురుహం బిహంబునన్
పరమ మునీంద్ర సారస విభాకర సార గుణాకరా ! పరా
త్పర ! మము బ్రోవవేల ? మఱపా ? వరదా ! సురలోకవందితా !
తిరుపతి వేంకటాచలపతీ ! కలికాల నరైక సద్గతీ !



శ్రీశైలంలో రాష్ట్రపతికి కమీషనర్ శ్రీ పైడి లక్ష్మయ్యగారు స్వాగతంచెపుతూ
శ్రీశైలచరిత్ర వివరించుతున్న దృశ్యం.



రాష్ట్రపతికి ఏ. సి. సుబ్బారెడ్డిగారు పూలమాల వేసి స్వాగతం చెప్పుతున్న దృశ్యం.
(తిరుమల తిరుపతి దేవస్థానంవారి సౌజన్యంతో)

వరముగదా ! భవద్భజన భాగ్యము గల్గుట మోక్షకాంక్ష తీ
వరముగదా ! త్వదీయ పదభక్తులకెల్ల విభాసవత్సరో
వరముగదా ! ముముక్షులకుఁ ద్వత్పదభక్తియె ముక్తికేళికిన్
తిరుపతి వేంకటాచలపతీ ! కలికాల నరైక సద్గతీ !

మురహర ! దుఃఖహేతుమణి ముక్తవిముక్త విముక్తినియ్యవే
లర ? తవ పాదభక్తఘనులం గనులం గనజాలవేల ? చె
చ్చెఱ దరిఁజేర్పవేల ? సరసీసరసీరుహ చారునేత్ర ! శ్రీ
తిరుపతి వేంకటాచలపతీ ! కలికాల నరైక సద్గతీ !

మరు మరుభూములన్ మసలి మత్తిలి వందురు మందభాగ్య పా
మరు మరుపుం దొలంగునటు మన్ననచేయుచు గావవేల ? వే
మరు మరుగుం జొఱంగ మఱి మార్గము నీవెక ! లోక నాయకా !
తిరుపతి వేంకటాచలపతీ ! కలికాల నరైక సద్గతీ !

అరదము ద్రోలినావు విజయాఖ్యుని పంటలు పండ ; వెండి వా
నరులను నేలినావు; కరుణాగుణ మెంతయు నిండ నండకై
కరి కడ వ్రాలినావు; భవకర్మము జెండగరావె దండకున్ ?
తిరుపతి వేంకటాచలపతీ ! కలికాల నరైక సద్గతీ !

పరికరహీన దీనుడను భావన నీవిట సాహసించి న
న్నరమరసేయఁ బప్పుడకదయ్య ! ఒకేఒక ప్రాస నాకడన్
వరలు దదీయ ధార పటువజ్రసమమ్ము ఘనమ్ము నమ్ముమా
తిరుపతి వేంకటాచలపతీ ! కలికాల నరైక సద్గతీ !

వర రుచిరాననాంబుజ విభాసిత హాస వికాసమాధురిన్
మరగిన రక్తియుక్తుడగు మత్తుడు కోరునె యన్యదైవమున్
సరసిజ మాధురిఁ మరగు షట్పదమెంచునె నత్తగుల్లలఁ
తిరుపతి వేంకటాచలపతీ ! కలికాల నరైక సద్గతీ !

ఖరకర సామ్యదీప్త తవ క్రముఖాబ్జ విలాసమూర్తి సుం
దరతర మందహాస లలితంబు గటాక్ష విలక్షితేక్షణా
భరితము గాంచి గుప్తమగు వజ్రమనంచు నెఱుంగనైతినో
తిరుపతి వేంకటాచలపతీ! కలికాల నరైక సద్గతీ!

శిరమున రత్నకాంచన విశేష విభాస కిరీటరాజమున్
వర ముఖచంద్ర సత్కిరణ పంక్తులు నన్ మిఱుమిట్లుగొల్పగన్
బరగులు వాఱు జిత్త కపి బట్టి యడంచుట యెట్టులోగదా!
తిరుపతి వేంకటాచలపతీ! కలికాల నరైక సద్గతీ!

కరయుగ కంకణద్యుతులు కంధర కౌస్తుభ మాల లీల లా
భరణ ధగద్ధగల్ మెఱయ భక్తిని జూడగ రక్తికల్గెడున్
పరమ విరక్తికల్గునటు ప్రక్కకు ద్రిప్పగదే! గదాధరా!
తిరుపతి వేంకటాచలపతీ! కలికాల నరైక సద్గతీ!

నిరతము సేవజేయుదున? నేఁను లౌకిక కర్మకాండతో
సరి! ధన మాసగొల్పుదున? చాలదు పైస సరే! మరేమి కే
సరము లొసంగి మ్రొక్కుదున? చంపరె నాగరికాగ్రగణ్యు లో
తిరుపతి వేంకటాచలపతీ! కలికాల నరైక సద్గతీ!

తరతరమందు నీ భజన తప్పక చేయగ భక్తజాలముఁ
జిరతర ముక్తిభాజనులఁ జేయుట చెల్లెను నాడు నేడు నీ
తరమునఁ గూఁడ బ్రాఁతగు విధానమె? కావలె మార్పు లిప్పుడున్
తిరుపతి వేంకటాచలపతీ! కలికాల నరైక సద్గతీ!

స్థిరమయి శ్రీకరంబయి యశేష సుఖాకరమై కడుఁ మనో
హరమయి యున్నతంబునయి యంచితమై నవ నాకలోకమౌ
తిరుపతి జేరుకొంటగద దివ్యత చేకుఱె నీ కనంతమై!
తిరుపతి వేంకటాచలపతీ! కలికాల నరైక సద్గతీ!

(సశేషము)

# శ్రీ శోభనాచలస్వామి దేవాలయం

శ్రీ సూరి రామజోగిశాస్త్రి

ఆసేతుసీతాచలపర్యంతము ఎక్కడెక్కడ ప్రకృతి సౌందర్యము వెల్లివిరిసియుండెనో అచ్చటనెల్ల దివ్య క్షేత్రములు విలసిల్లి యున్నవి. కృష్ణామండలమున విజయవాడకు 17 మైళ్ల దూరముననుస, నూజివీటికి 13½ మైళ్ల దూరమునను ఆకిరిపల్లి యను దివ్యస్థలము శివకేశవులకు నిలయమై యొప్పుచున్నది. పౌరాణికముగాను చారిత్రకముగాను ఈ క్షేత్రము చాలా ప్రసిద్ధికెక్కిన యాత్రాస్థలమై అఖండవైభవ మనుభవించిన యీ దేవాలయములు ప్రస్తుతము శిథిలావస్థకు నిలయము లగుటచే వీటి పూర్వోత్తర సందర్భము లాస్తిక మహాశయుల కెరుకపరుచుట యుక్తమని నిట వొందు పరుచుచున్నాను. Oriental - Manuscript Library Local Records Vol. No. LI లో, స్కాంద పురాణాంతర్భాగమైనట్లు యుల్లేఖింపబడిన యీదిగువ శ్లోకములవల్ల యీస్థల మాహాత్మ్యము కొంతవరకు విశదము కాగలదు.

శ్లో॥ కృతే శుభగిరి స్స్వర్ణః
త్రేతాయాం రాజత స్తథా
ద్వాపరే తామ్రవర్ణశ్చ
కలావాసీ చ్ఛిలామయః॥

కల్యాణాద్రిః కృతయుగే
త్రేతాయాంతు శుభాచలః
ద్వాపరే సుప్రసన్నశ్చ
కలౌ శోభనపర్వతః॥

వారాహం రూపమాస్థాయ
భగవాన్ విష్ణు రుత్తమః
లోకత్రయోపకారాయ
నిర్మమే సర ఉత్తమం॥

పురా కృతయుగే రాజా
శుభవ్రత ఇతి స్మృతః
పర్వతేస్మిన్ తపః కృత్వా
తుష్టావ మధుసూదనం॥

పర్వతేస్మిన్ సదా తిష్ఠ
రమయాసహ కేశవ
తస్యాభిప్రాయ మాజ్ఞాయ
భగవాన్ భక్తవత్సలః॥

నివాస మకరో దస్మిన్
తస్మాచ్ఛుభగిరి స్మృతః —

శ్రీస్వామివారు వున్న పర్వతము కృతయుగమునందు బంగారమయమై కల్యాణపర్వతమనే పేరం బరిగెననియు, త్రేతాయుగమున రజతమయమై శుభాచలమను పేర నొప్పెననియు, ద్వాపరమున తామ్రవికారమై సుప్రసన్నపర్వతమను నామంబున బరగెననియు, కలియుగంబున శిలామయమ్మై శోభనపర్వతమను పేరున విలసిల్లుచుండెననియు చెప్పబడియున్నది. కృతయుగమందు శుభవ్రతుడనే రాజు మహావిష్ణువునుగూర్చి తపస్సుచేసి నేనుపర్వతాకారమైయుండులాగునయున్నా అందుమీద ఈశ్వర సహితముగా లక్ష్మీసమేతుడవై నాయందు చిరస్థాయిగా నివాసము చేయవలసినదని కోరినమీదట శివకేశవు లుభయులు యీ పర్వతముపై నివసించినట్లు చెప్పబడియున్నది. శుభవ్రతుడనేరాజు పర్వతరూపము వహించెను గాన యీ పర్వతము శోభనాచలమని పిలువబడుచున్నది. ఈ పర్వతముకు పశ్చిమముగా సమీపంలో సరస్సు శ్రీ స్వామివారు వరాహరూపమెత్తి తవ్వినారుగాన వరాహపుష్కరిణియను పేరంబరగు

చున్నది. కిరి అనగా వరాహము. కిరిరూపము ధరించి ప్రసిద్ధమగు యీ వరాహ పుష్కరిణిని వెలయించుటం జేసి తన్నామమే యీ గ్రామమునకు ఆకిరిపల్లి యని సార్థకమైనది.

ఈ దివ్యస్థలము కౌండిన్యస గోత్రసంభూతులైన దేవులపల్లి అచ్యుతభాగవతి, అనంత భాగవతులచే కనుగొనబడి (17 వ శతాబ్దమున) వారలచే నిత్య నైవేద్య దీపారాధనలు జరుపబడుతూ వచ్చినవి. అప్పటికి యీ ప్రాంతమంతయు నైజాము పాలనలో నుండుటచే వారితరపున స్థానికాధికారులగు శ్రీ ఇందుపూడి లక్ష్మీనారాయణరావు పంతులుగారు కొండపల్లి ఫిర్కాలో నున్న స్థలం పరగణాకు చెందిన యీ గ్రామమును శివకేశవులకు నిత్యనైవేద్య దీపారాధనలకున్నూ నిత్యోత్సవం వగైరా వుత్సవములకున్నూ యీగ్రామందానం చేసివున్నారు. ఈ దానపట్టా యివ్వబడిన 1626 సంవత్సరమునుంచి 1800 సంవత్సరము వరకు పై అచ్యుత భాగవతుల వంశీయులే యీ దేవాలయములకు ధర్మకర్తలుగా వున్నట్లు కనుపించుచున్నది.



శ్రీ శోభనాచలస్వామివారి వరాహపుష్కరిణి. సుమారు 10 ఎకరాల చెరువు. చుట్టూకట్టిన రాతిసోపానాలు చెక్కుచెదరకుండా ఉన్నాయి. మధ్యనున్నది మండపం.

దరిమిలాను నూజివీడు జమీందారులునూ, వెలమవారునూ, పరమ భక్తులునూ అయిన శ్రీ రాజా వెంకటాద్ర్యప్పారావుగారు తమ సంస్థానంలోని యీ దేవాలయ పరిపాలనకు తమరు ధర్మకర్తృత్వము వహించుట యుక్తమని తలచి దేవస్థానములో కొన్ని మర్యాదలను, హక్కులను, లోగడ ధర్మకర్తలగు అచ్యుత భాగవతులు, అనంత భాగవతుల వంశీయులకు యిచ్చి 1800 సంవత్సర ప్రాంతమున యీ దేవాలయముల వంశపారంపర్యా ధర్మకర్తలుగా దేవాలయముల పరిపాలనను స్వీకరించిరి. తదాది యీదేవాలయములను అనేకవిధముల నభివృద్ధిలోనికి తెచ్చిరి. దాక్షిణాత్య పద్ధతిని యీ దేవాలయముల పునర్నిర్మించిరి. దిగువనుంచి ఎగువకు పర్వతముమీదికి సోపానముల నిర్మించిరి. నిత్యోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవములకున్నూ, బ్రహ్మోత్సవ, అధ్యయనోత్సవములకు సరిపడులాగున కొన్ని గ్రామములు: వర్లమూను, మల్లేశ్వరం, పోతవరప్పాడులను శ్రీస్వామివార్లకు దఖలుపరిచిరి. కొన్నిలక్షలు ఖరీదుచేయు పై వరాహపుష్కరిణికి నాల్గు వైపులను 5, 6 యకరముల విస్తీర్ణముగా రాతిసోపానములను నిర్మింపజేసిరి.

శోభనాచలపర్వతము చుట్టున్నూ ప్రదక్షిణ మొనర్చుటకు రోడ్డునిర్మించిరి. గ్రామసౌందర్యమును పెంపొందించుటకు నాల్గువైపులను మంటపములు నిర్మించిరి. ఇందు కల్యాణమంటపము విశేషముగా పేర్కొ నదగియున్నది.

శ్రీ స్వామివార్ల కైంకర్యము అవిచ్ఛిన్నముగా జరుగులాగు ఆరాధకులకు, అధ్యయనపరులకు, వ్యవహర్తలకు, చాకలిమంగలి వగైరా యితర నౌకర్లకు పర్వీసు యీనాములు కల్పించిరి. శ్రీ స్వామివార్లకు అశేషముగా బంగారు, వెండి ఆభరణములు, వజ్ర వైడూర్య మరకతమాణిక్యములు పొదిగిన యలంకరణములున్నూ సమర్పించి, వుత్సవ సమయములలో నేతెంచు వేలాది యాత్రికులకు తీర్థప్రసాదముల నుచితముగా నొసంగుచు, ఏ సందర్భములోను, ఏ వుత్సవములలోను శ్రీ స్వామివార్ల కైంకర్యమునకు ఎట్టి లోటుపాట్లు రాకుండ తాము సన్నిధిన యుండి సర్వోపచారములు జరుగు నేర్పాట్లుచేసి యీ దేవస్థానములను సర్వవిధముల నభివృద్ధిలోనికి తెచ్చిరి. ఈ స్థితి ననుభవించిన యీ దేవాలయములు నేడు నామమాత్రములుగానుండి చూపరులకు శిథిలములై తోచుటయు, నిత్యధూపదీపనైవేద్యములకు కూడ శ్రీ స్వామివారు నోచుకొనకపోవుటయు చూచు భక్తులకు విషాదముగలుగక మానదు. యిందుకు కారణముల వివరించుట యుక్తమైనను గ్రంథవిస్తరభీతిచే ముందు సంచికలో వివరించదలచితిని. ఆస్తికులగు పుణ్యాత్ములును, దైవ ద్రవ్యపరిపోషకులగు నధికారులును, యీ దేవస్థలములవైపు దృష్టిసారించి, పునర్నిర్మాణమునకు తగువిధమున పూనుకొనగలరని యాశించుచున్నాను.



శ్రీ శోభనాచలస్వామివారి ఉత్సవం జరిపే కొళాయి

# వెలనాటి అర్చక పరీక్షాఫలితాలు

ఆంధ్రప్రదేశ వెలనాటి అర్చక పరీక్షాధిపతులైన ఆగమ విశారద శ్రీ ఆమంచి వీరరాఘవయ్యగారిచే సీతానగరము కేంద్రమున 1959 సెప్టెంబరులో జరుపబడిన అర్చక ఆగమప్రవేశ పరీక్షలయందు ఈ క్రింది నెంబర్లు కల విద్యార్థులు కృతార్థులైనారు.

ప్రథమశ్రేణి :

106, 107, 126, 130, 132, 134, 135, 140, 141, 158, 171, 172, 183, 186, 190, 191, 193, 194, 207, 208, 215, 216, 219, 221, 227, 228, 229, 231, 232, 234, 235, 236, 237, 243, 246, 250, 255, 259, 266, 269, 275, 280.

ద్వితీయశ్రేణి :

108, 109, 111, 113, 114, 115, 116, 120, 122, 123, 124, 125, 127, 128, 129, 131, 133, 136, 137, 139, 142, 143, 144, 146, 147, 148, 149, 150, 151, 152, 154, 155, 157, 160, 161, 162, 163, 165, 166, 167, 168, 169, 170, 173, 174, 175, 176, 177, 178, 179, 180, 181, 182, 184, 185, 187, 188, 189, 192, 195, 196, 197, 198, 199, 200, 201, 202, 203, 204, 205, 206, 209, 210, 211, 212, 213, 214, 220, 222, 223, 224, 225, 226, 230, 233, 239, 240, 241, 244, 245, 247, 249, 251, 252, 253, 254, 256, 257, 258, 260, 261, 262, 263, 264, 265, 267, 268, 270, 271, 272, 273, 274, 278, 279.





శ్రీశైలంలో రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ గారికి స్వాగతం యిచ్చినప్పటి చిత్రం.
గవర్నర్ - ముఖ్యమంత్రి - ప్రభృతు లిందులో ఉన్నారు.



శ్రీశైలంలో రాష్ట్రపతి సభకు వచ్చిన ప్రముఖుల్లో కొందరు.

(తిరుమల తిరుపతి దేవస్థానంవారి సౌజన్యంతో)

ుండుటవలన వానిని దెలుప ననువగుపదము లనేక ములు శాస్త్రమునందు వాడబడినని. వేదమే యిందు లకు ప్రమాణము.

('ఇంద్రం మిత్రం వరుణ మగ్ని మాహురథో దివ్యః ససుపర్ణో గరుత్మాన్ ఏకంసద్ విప్రాబహుథా వద_న్త్యగ్నిం యమం మాతరిశ్వానమాహుః" ఋ. ౨. ౩. ౨౨. ౪౬.)

"సద్రూపమగు నొకే పదార్థము (పరమాత్మ) ను విద్వాంసులు బహువిధముల, ఇంద్రుడు, మిత్రుడు, వరుణుడు, అగ్ని, దివ్యుడు, సువర్ణుడు, గరుత్మంతుడు, యముడు 'నని చెప్పుదురు.' మరియు,

(తదేవాగ్ని _స్తదాదిత్య _స్త ద్వా యు_స్త తు చంద్రమాః, తదేవశుక్రం తత్బ్రహ్మ తాఆపః సప్ర జాపతిః" యజు. ౩౨. ౧.)

'అదియే యగ్ని, ఆదిత్యుడు, వాయువు, చంద్రుడు, శుక్రుడు, బ్రహ్మము, ఆపస్సు, ప్రజాపతి' అని యజుర్వేదమున చెప్పబడినది. ఇంకను,

('సధాతా, సవిధర్తా, సవాయుర్నభ ఉచ్ఛ్రితం' అధర్వ ౧౩. ౪. ౪. ౩.)

('సో ఒర్యమాసవరుణః సరుద్రః సమహాదేవః')

('సోఒగ్నిః సఉసూర్యః సఏత మహాయమః' అధర్వ ౧౩. ౪. ౪.-౪-౫.)

'అతడే ధాత, విధాత, ఉన్నతాకాశము, అర్యముడు, అతడే వరుణుడు, అతడే రుద్రుడు, అతడే మహాదేవుడు. అతడగ్ని, అతడే సూర్యుడు, అతడే మహాయముడు అని యధర్వ వేదమునను వర్ణింప బడినది. కాబట్టి యుపాసనా ప్రకరణములందు వాడబడు నగ్న్యాది పదములు, పరబ్రహ్మమునే యుపాస్యదైవముగ బోధించుననుట నిక్కువము.

అటులయిన, మనోమయత్వము, ప్రాణశరీరత్వమునను ధర్మములు బ్రహ్మమున నెట్లు సంగతము లగునని సందేహింపబనిలేదు. అవియును బ్రహ్మమునందు సంగతములే యగును. సర్వవ్యాపారములను విడచి మనస్సును బ్రహ్మమునందు లగ్నమొనర్పుటయేగదా ! యుపాసన యనబడును. దీర్ఘకాలము తెంపులేకుండ 'నభ్యాసవైరాగ్య' ములను శ్రద్ధాసక్తులతో నభ్యసించినపుడు మనస్సు రాజసతామస మాలిన్యములనుండి విముక్తమై శుద్ధమగును. అట్టి శుద్ధచిత్తమే బ్రహ్మమునందు లగ్నమై బ్రహ్మవ్యాప్తమగును. అట్టి స్థితిని లక్ష్యమునందుంచుకొనియే ఋషులు మనోమయయమని బ్రహ్మముసువ్యవహరించి యుండిరి. మనోమయమన బ్రహ్మము మనస్సుతో నుపాసింపదగినదని భావము. ఇట్లే ప్రాణశరీరము కూడ బ్రహ్మమున నుపపన్నమగును. ప్రాణశరీరమన ప్రాణము శరీరముగాగలది యని యర్థము.

(సఉప్రాణస్యప్రాణః' కేన.౧ ౨) 'అబ్రహ్మము ప్రాణమునకు బ్రాణ'మని బ్రహ్మమునకు ప్రాణము శరీరముగ వర్ణింపబడుట యుపనిషత్తులందు జూడనగును. సర్వాంతర్యామియగు బ్రహ్మము ప్రాణాంతర్గతమయి ప్రాణము శరీరముగా గలిగియున్నదనుటలో నాశ్చర్యమేల ? కాబట్టి శాండిల్య విద్యయందు వర్ణింపబడిన బ్రహ్మము పరబ్రహ్మమేకాని జీవాత్మ యెన్నటికిని కాదని స్పష్టమగుచున్నది.

"వివక్షితోప పత్తేశ్చ" ౧.౨.౨.

వివక్షి...పత్తేశ్చ = శాండిల్య మహర్షి చెప్ప దలచిన గుణములు బ్రహ్మమునందుపపన్నము లగుట వలనను బ్రహ్మపదము పరబ్రహ్మవాచకమే యగును. జీవవాచకము కాదు. అని సూత్రార్థము.

శాండిల్యవిద్యయందు ముందు బ్రహ్మ ముపాస్యముగ జెప్పి యనంతరమున నందలి యుపాస్య గుణములిట్లు కొన్ని వర్ణించియున్నాడు.

('మనోమయః ప్రాణశరీరో భారూపః సత్య సంకల్ప ఆకాశాత్మా సర్వకర్మా సర్వకామః సర్వ గంధః సర్వరసః సర్వమిద మభ్యాత్తోఒవాక్యనాదరః' ఛాం. ౩ ౧౪ ౨.)

'మనోమయము, ప్రాణశరీరము, భారూపము, సత్యసంకల్పము, ఆకాశాత్మ, సర్వకర్మము, సర్వకామము, సర్వగంధము, సర్వరసము, సర్వవ్యాప్తము, అవాక్కు, అనాదరము' అని వర్ణించి మరియు నిట్లే,

('ఏష మ ఆత్మాఽంతర్ హృదయే జ్యాయాన్ పృథివ్యా, జ్యాయానంతరిక్షాద్, జ్యాయాన్ దివో, జ్యాయానేభ్యోలోకేభ్యః" ఛాం. ౩.౧౪.౩.)

'ఈ నా హృదయాంతరమున నున్న యాత్మ పృథివికంటె, నంతరిక్షముకంటె, ద్యులోకముకంటె, వింతయేల! ఈలోకములకన్నింటికంటెనుగొప్పది' అని వర్ణించియున్నాడు. ఈ చెప్పబడిన గుణము లన్నియు పరబ్రహ్మ. పరమేశ్వరునందే సంపూర్ణ ముగ వర్తించును. జీవాత్మయం దీ గుణములు సంభవములు కావు. మనోమయత్వము, ప్రాణశరీరత్వము, భారూపత్వము జీవునియందున్నను, సత్య సంకల్పత్వాది ధర్మము లతనియందు సంభవములు కావు. జీవుని సంకల్పములన్నియు సత్యములుకాగల వని యెవరు చెప్పగలరు ? జీవుని స్వరూప మాకాశమువంటిది—వ్యాపకము—అనుట యెట్లు సంగత మగును? బ్రహ్మమునం దీ గుణములన్నియు నుండు ననుటలో సందియమావంతయు నుండదు. జగత్తును సృష్టించుటలోనేమి, దానిని ధరించుటలో నేమి, యటుపై దానిని లయింపజేయుటలో నేమి బ్రహ్మ సంకల్పమున కెట్టి విఘాతమును కలుగదు. కావున బ్రహ్మము సత్యసంకల్పము. అది వ్యాపకము; అత్యంతసూక్ష్మమును. మాపాది గుణహీనమగుటచే బ్రహ్మ మాకాశస్వరూపముకలదై యాకాశాత్మమగు చున్నది. సర్వమన ప్రపంచము. అది కార్యము (కర్మ) గా గలది బ్రహ్మము— బ్రహ్మమే యీ జగద్రూపకార్యమునకు కర్త—యని భావము. అందు వలననే ఋగ్వేదమునందుకూడ (య ఇమా జజాన) 'ఎవడు వీనిని జనింపజేసెనో' యని వర్ణింపబడినది. ఇట్లే ముండకమునందును, (కర్తారమీశం) 'ఈశుడు కర్త' యనియు, శ్వేతాశ్వతరమున (స విశ్వకృత్) 'అతడు విశ్వకర్త'యనియు వర్ణింపబడినది. కామము లనవిట పదార్థములు.కామింపబడునవియగుటచే కామ శబ్దవాచ్యము లగుచున్నవని భావము. కామము (పదార్థము) లన్నియు బ్రహ్మాయత్తములు-బ్రహ్మాధీనములు కాబట్టి బ్రహ్మముసర్వకామము. ఇట్లేసర్వగంధములకు నధిష్ఠానమగుటవలన సర్వగంధమనియు, సర్వరసాధిష్ఠానమై సర్వరసమనియు బ్రహ్మము నుడువబడును. ఇట్లే మిగిలిన ధర్మములన్నియు బ్రహ్మమునం దెట్లు వర్తించునో సులభముగ గ్రహింపనగును. నిత్యతృప్త మగుటచే బ్రహ్మమునకు దేనియందు నాదరభావము నుండదు. అందుచే నయ్యది యనాదర మనబడును. జ్యాయస్త్వము, పరమమహత్వము నను గుణములు కూడ బ్రహ్మమునందే వర్తించును. శాండిల్యమహర్షిచే వర్ణింపబడిన ధర్మములన్నియు నిట్లు బ్రహ్మమునందే సంగతములగుటచేత బ్రహ్మపద మిట పరబ్రహ్మ బోధకమేకాని జీవాత్మబోధకము కాదని సిద్ధమగు చున్నది. (౨)

సిద్ధాంత పక్షమును నిరూపించి మహర్షి పూర్వ పక్షమును నిరాకరించుచున్నాడు.

"అనుపపత్తేస్తునశారీరః". ౧-౨-౩.

అనుపపత్తేః = వివక్షిత గుణము లుపపన్నములు కానందున, శారీరస్తు = జీవుడుమాత్రము, న=కాదు.

మనోమయత్వాది గుణములన్నియు జీవాత్మకు చెందిన వనుటకు వీలులేదు. మనోమయత్వము, ప్రాణశరీరత్వము, భారూపత్వమునను మూడు గుణములు జీవునియందు సంభవములైనను, సత్యసంకల్పత్వాది గుణములు సంభవము కానందున శాండిల్య విద్యాప్రకరణమున బ్రయోగించిన బ్రహ్మపదము పరమాత్మవాచకమే యగును కాని జీవాత్మ (శారీర) వాచకము కాదని తాత్పర్యము. (౩)

"కర్మ కర్తృవ్యపదేశాచ్చ" ౧ ౨. ౪.

చ = మరియు, కర్మ...దేశాత్ = బ్రహ్మము కర్మగాను, జీవుడుకర్తగాను నుపదేశింపబడుటవలన.

శాండిల్య విద్యా ప్రకరణమున సత్యసంకల్పాది గుణములగల బ్రహ్మ ముపాస్యముగాను, జీవుడుపాసనాకర్తగాను నుపదేశింపబడినందున బ్రహ్మ పదమిట పరబ్రహ్మవాచకమేయగునుకాని, జీవాత్మ బోధకము కాదని సూత్రభావము. (౪)

"శబ్ద విశేషాత్" ౧. ౨. ౫.

'కర్మ, కర్త' అను నీ శబ్దములందు భేదము న్నందున, పూర్వసూత్రమునందు బ్రయోగింపబడిన యీ శబ్దములు గౌణములు - అప్రధానములు అనుటకును వలను పడదు.

(ఏష మ ఆత్మాఽన్తర్హృదయే')

'ఈ నాహృదయాంతరమున నున్న యాత్మ' యను నీ వాక్యమునం దుపాసింపదగిన బ్రహ్మము (ఆత్మా) ప్రథమా విభక్తిలోను, ఉపాసకుడైన జీవుడు (మే = నా) 'నా' యని షష్ఠ్యంతముగాను బ్రయోగింపబడినవి. ప్రథమావిభక్తి షష్ఠీ విభక్తి కంటె విశిష్టమనుట నిర్వివాదవిషయము. కర్మపదము కర్తృపదముకంటె భిన్నముగా నిర్దేశింపబడినందున నీ వ్యవహారము ముఖ్యముకాదని యుపేక్షింపరాదు. మరియు నుపాసనాక్రియకు కర్మగా జెప్పబడిన పదార్థము బ్రహ్మము-ఆత్మ-యను శబ్దములచేతను, నుపాసకుడైన కర్త 'పురుష' శబ్దముచేతను నుల్లేఖింపబడియుండుట జూడవచ్చును. 'కర్మ, కర్త' అను శబ్దములలోగల విశేషము కర్మకర్తృవ్యపదేశము ముఖ్యముగా నెంచినపుడే యుపపన్నమగును. గౌణముగానెంచినపుడా (కర్మ కర్తృవ్యపదేశమునగల) భేదము సిద్ధింపదు. రాజుయొక్క పురుషుడు అను నీ పదములలోగల భేదమును గౌణముగా నెంచెదమేని, రాజు స్వామియనియు, పురుషుడతని భృత్యుడనియు నెన్నడును సిద్ధింపదు. కాబట్టి యుపాస్యోపాసకపదములలోగల భేదము గౌణమని యుపేక్షింపదగదని భావము. (౫)

"స్మృతేశ్చ" ౧.౨.౬.

స్మృతివలనను కర్మకర్తృవ్యపదేశము గౌణమన వలనుపడదు.

('ఏవం యః సర్వభూతేషు
పశ్యత్యాత్మాన మాత్మనా
స సర్వసమతామేత్య
బ్రహ్మాభ్యేతి పరంపదమ్."
మను. ౧౨.౧౨౫.)

'ఎవడిట్లు సర్వప్రాణు లందును పరమాత్మను దర్శించునో వాడు సర్వసమత్వముంబొంది పరమపద మను బ్రహ్మను చేరును.' అను నీ మనుస్మృతి వచనమునందును కర్మకర్తృభేదము స్పష్టముగా దెలియుచున్నది.

అభ్యేతి=ప్రాప్తించును—చేరును— ఇట ప్రాప్తి క్రియకు కర్మగానున్న బ్రహ్మము - ఆత్మ, ప్రాప్తి క్రియకు కర్తయైన జీవాత్మకంటె భిన్నముగా వర్ణింపబడుట సుస్పష్టము. ఈ భేదము నిట గౌణము (అముఖ్యము) గా నెంచకుండుటకే బ్రహ్మకు పరమపదమను విశేషణము కూడ జేర్చబడినది.

పదమనగా ప్రాప్తవ్యము - పొందదగినది - సాక్షాత్కారము చేసికొనదగినదనిభావము. అట్టి పదములు మూడు. 1. ప్రకృతి 2. జీవాత్మ 3. పరమాత్మ. అందు ప్రకృతి మొదటిపదము. సాంసారికదుఃఖములనుండి మోక్షమపేక్షించువాడు ప్రకృతిని ముందుగా నెఱుగును - దాని యథార్థ స్వరూపమును గుర్తించును - పొందునని యభిప్రాయము. ప్రకృతిచే ప్రత్యగాత్మ-జీవాత్మ-యావరింపబడి యున్నది. కావున బ్రకృతి నెరుగనివాడు ప్రత్యగాత్మ నెరుగజాలడు. అందువలననే సాంఖ్యదర్శనకారులు ప్రకృతి పురుషవివేకమును మోక్షమున కనివార్యసాధనముగా వర్ణించినారు. జీవున కంతరాత్మ యగునది పరమాత్మ యనబడును. కావున నా పరమాత్మ సాక్షాత్కారమునకు ప్రకృతి సాక్షాత్కారము కూడ హేతువగును. ఇట్లు ప్రకృతి మొదటిపదము. రెండవ పదము జీవాత్మ. పరమాత్మ మూడవపదము. ఇందు ప్రకృతికంటె సూక్ష్మము జీవుడు. జీవునికంటెసూక్ష్మము పరమాత్మ. ప్రకృతి సూక్ష్మము, జీవాత్మ సూక్ష్మతరము. పరమాత్మ సూక్ష్మతమ మని భావము. అందువలన సూక్ష్మమగు ప్రకృతిని ముందుగ బొంది, యనంతరమున సూక్ష్మతరమగు జీవుని సాక్షాత్కారమొనర్చుకొని తుదకు సూక్ష్మతమమగుపరమాత్మను ప్రాప్తింపనగును. ఇదియే పరమపదమగు పరమాత్మను బ్రాప్తించు క్రమము.

(తద్విష్ణోః పరమంపదం సదా పశ్యంతి సూరయః) 'విద్వాంసు లా పరమపదము నెల్లపుడు జూచుచుందురు.' ఇట్లు బ్రహ్మమును బరమపదముగా జెప్పి జీవబ్రహ్మలకు గల భేదమును స్మృతి స్పష్టము సేయుచుండగా నుపాస్యోపాసక భేద మముఖ్య మనుట యుక్తముకానేరదు—(౬)

ప్రస్తుతము జీవున కణీయస్త్వమును లింగముగా నాశంకించి దానిని నిరాకరించుచున్నాడు.

"అర్భకౌకస్త్వాత్ తద్ వ్యపదేశాచ్చ నేతి చేన్న నిచాయ్యత్వా దేవం వ్యోమవచ్చ" ౧.౨.౭.

అర్భకౌకస్త్వాత్ = అల్పమగు హృదయము నివాసస్థానమగుటవలన, తద్వ్యపదేశాచ్చ = అల్ప మని చెప్పుటవలనను, నేతిచేత్ = బ్రహ్మపద మీ ప్రకరణమున బరమాత్మవాచకము కాదందురేని, న=అట్లనరాదు. నిచాయ్యత్వాత్ = హృదయమున నుపాసింపదగినందువలనను, ఏవమ్=ఇట్లే, వ్యోమ వచ్చ=ఆకాశమువలె నన్నింటికంటె పెద్దదిగా నుప దేశింపబడుటవలనను బ్రహ్మపదము పరమాత్మ వాచకమే.

(ఏషమ ఆత్మాఽన్తర్ హృదయే); 'ఈ నాహృద యాంతరముననున్న యాత్మ' యని బ్రహ్మము హృద యమున నున్నట్లు చెప్పబడియున్నందున, హృదయ మల్పము కాబట్టి యందున్న యాత్మయు నల్పమన వలసి వచ్చును. ఇంతేకాక,

('అణీయాన్ వ్రీహేర్వా యవాద్వా, సర్షపాద్వా, శ్యామాకాద్వా, శ్యామాక తండులాద్ వా'). 'వ్రీహి కంటెను, యవల కంటెను, అపగింజ కంటెను, శ్యామాకధాన్యము, దాని బియ్యముకంటెను నల్పము.' అను నీవాక్యమునం దల్పత్వమును వర్ణించుట జూడ నీప్రకరణమునందు బ్రహ్మము వర్ణింపబడినదనుట యుక్తముకాదు. హృదయమున నుండుటచే నది పరిచ్ఛిన్నము - సీమితము - అల్పము కాక తప్పదు. అల్పత్వాది ధర్మములు జీవాత్మయందుండును కాని బ్రహ్మమునందెట్లు సంగతము లగును? కాబట్టి యీ ప్రకరణమున బ్రహ్మశబ్దము జీవాత్మబోధకమే యందు రేని యది యుక్తముకాదు. పరమాత్మను గూర్చియు నిట్లు చెప్పుట యసంగతము కాదు.

బ్రహ్మము సర్వభూతాంతరాత్మ యగుటంబట్టి సర్వస్థానగతమై విభుత్వ ధర్మముగలది యనుట నిక్కువమే అయినను నది హృదయాంతర్వర్తి యనుటయు దోషయుక్తముకాదు. సర్వగతమగు బ్రహ్మము హృద్గతమేల కాదు? అట్లే యది ప్రత్య గాత్మయందు నుండును. బ్రహ్మము సర్వాంతఃపాతి యయినందున నల్పమగు హృదయమునందును, అల్పతరమగు జీవునందును గలదు. సర్వగతమగు బ్రహ్మమును హృదయ పుండరీకమున నుపాసించుట సుఖకరము, కాబట్టి యది హృదయస్థానిక మనియు, నల్ప మనియు జెప్పబడినది. అంతమాత్రమున నయ్యది యట్టిదే యనరాదు. ఆ బ్రహ్మ మాకాశము వలె నన్నిలోకముల కంటెను గొప్పది యనియు వర్ణింపబడుట నిటజూతుము ('జ్యాయాన్ పృథివ్యా... నేభ్యో లోకేభ్యః') 'పృథివి, అంతరిక్షము, ద్యులో కము నను నీ లోకముల కన్నింటికంటెను గొప్పది.' కాబట్టి బ్రహ్మపదవాచ్యమగు పరమాత్మ సర్వగతమై, సర్వజ్యేష్ఠమైనను హృదయ పుండరీకమున నుపాస్య ముగా నల్పమని వర్ణించుట యనుచితముకాదు. కాబట్టి జగత్పతి యగు పరమాత్మయేయిట బ్రహ్మపద వాచ్యమని గ్రహింపవలెను. జీవాత్మ యెన్నటికిని కాదు. (౭)

పరమాత్మ హృదయస్థమగు నెడల హృదయ మున నున్న జీవునకు భోగము (సుఖదుఃఖానుభవము) కలుగునట్లు పరమాత్మకేల కలుగదని సమాధానము.

"సంభోగప్రాప్తిరితిచేన్న వైశేష్యాత్" ౧. ౨. ౮

సంభోగ ప్రాప్తిరితిచేత్ = సుఖదుఃఖానుభవము గలుగునందురేని, వైశేష్యాత్ = విశేషముండుట వలన. న=అట్లు కలుగదు.

జగత్కారణమగు పరబ్రహ్మము హృదయమున నున్నదని యంగీకరించినచో, హృదయమున నుండు జీవునకు సుఖదుఃఖములు కలుగునట్లు పరమాత్మకును సుఖదుఃఖ ప్రాప్తికలుగునని యంగీక

రింపవలసి వచ్చును. అగ్ని జ్వాలలచే నావరింపబడిన గృహముననుండు నిరువురు వ్యక్తులలో నొకరు దహింపబడుటయు మరియొకరు దహింపబడకుండుటయు సంభవముకాదుగదా! కాబట్టి హృదయస్థమగు పరమాత్మయు జీవునివలెనే సుఖదుఃఖము లనుభవింపవలసివచ్చు సందురేని యట్లుకాదు.

జీవ పరమాత్మ లొకే స్థానమున నుండువారైనను వారిలో భేదమున్నది. జీవాత్మకు కర్మసంబంధమున్నది. పరమాత్మకు కర్మసంబంధము లేదు. భోగప్రసక్తి కర్మనిబంధనము కర్మనిమిత్తకము కర్మానుబంధము. అది కర్మప్రయుక్తము, స్థానప్రయుక్తము కాదు. శరీరసంబంధముగల జీవాత్మకే కర్మసంబంధముండును. పరమాత్మకు శరీరముతో సంబంధము లేనందున నతనికీ కర్మానుబంధ ముండదు. శరీరముతోనే జీవుడు శుక్లాశుక్ల-పుణ్యాపుణ్య-సుకృత దుష్కృత కర్మము లాచరించును. ధర్మాధర్మము లనెడి వాసనలను సంచయ మొనర్చును. అందుమూలమున నాయా సమయములందు సుఖదుఃఖములనెడి ఫలముల ననుభవించును. జీవునకు శరీరముతో సంబంధము కలుగుటకు మూల మవిద్యయే యనుట సర్వతంత్ర సిద్ధాంతము. పరమాత్మ కవిద్యాసంబంధము లేదు; కావుననే శరీరసంబంధమును లేదు. కాబట్టి తన్మూలకమగు కర్మానుబంధముకానీ, తత్ఫలరూప సుఖదుఃఖానుభూతికానీ పరమాత్మకు సంభవింపవనుట నిక్కువము. విద్యాస్వభావముగల పరమాత్మ కవిద్యాసంబంధమేర్పడదని వేరుగ జెప్పనేల? వాస్తవమున నిట్లు భిన్నరూపులగు జీవేశ్వరులలో నొకరి కర్మఫలము మరియొకరికి సుఖదుఃఖములను గలిగించు ననుట యతిప్రసంగమగును.

పరమాత్మ డానందస్వరూపుడు - సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, జగత్కారణము. జీవుడట్లుకాదు. ఈశ్వరుడు క్లేశకర్మ విపాకాశయములచే పరామృష్టుడుకాడు. జీవుడు తత్పరామృష్టుడు. పరమాత్ముడు పరమమహత్పరిమాణము గలవాడు. జీవుడణుపరిమాణము గలవాడు. ఇంతటి భేదము (విశేషము) జీవపరమాత్మలలోనుండగా నొకేస్థానముననున్నంత మాత్రమున జీవునకువలె పరమాత్మనకును సుఖదుఃఖములు గలుగుననుట యుక్తముకాదు. ఋగ్వేదమునందలి యొకమంత్ర మీ విషయము నిట్లు స్పష్టముచేయుచున్నది.

('ద్వాసుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే; తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యన శ్నన్నన్యో అభిచాకశీతి" ఋ. ౨-౩-౧౭-౨౦)

రెండు పక్షు లొకవృక్షము నాశ్రయించియున్నవి. అయ్యవి, సయుజౌ=సంబంధము గలిగియున్నవి సఖాయౌ=సమానస్వరూపము గలవి. ఆ రెంటిలో నొకటి, స్వాదుపిప్పలమత్తి = రుచిగల ఫలమును దినుచున్నది. మరియొకటి, సాక్షిగా నెల్లయెడల ప్రకాశించుచున్నది.

ఈ మంత్రమున జీవేశ్వరులు రెండుపక్షులుగాను, ప్రకృతి వృక్షముగాను వర్ణింపబడినవి. సుపర్ణః = మంచిరెక్క. జీవేశ్వరులకు క్రియాశక్తి యొకరెక్కగాను, జ్ఞానశక్తి మరియొక రెక్కగాను వర్ణింపబడినవి. క్రియాశక్తి, జ్ఞానశక్తియు నను నీ రెండుపక్షములులేకున్న పక్షవిహీన పక్షి యాకాశమున నెగురజాలనట్లు జీవేశ్వరులు జగన్నిర్మాణాదికార్యములు నిర్వహింపజాలరని సూచింపబడినది. ద్వా=ద్వౌ= రెండు అని సంఖ్యాబోధక శబ్దము మంత్రమున బ్రయోగింపబడుటవలన జీవేశ్వరు లొక్కటే యను నద్వైత (ఏకాత్మ) వాదము వేదవిరుద్ధమనియు దెలియుచున్నది. సయుజా = సయుజౌ = స్వసత్తా సమానసత్తాకసంబంధౌ = పరస్పర మొకరియునికికి సమానమగు మరియొకయునికి గలిగియుండుటయను సంబంధముగలవారు. అనగా నీశ్వరుని యునికి యెట్టిదియో జీవుని యునికియు నట్టిడియే యని యర్థము. జీవేశ్వరులు సదాతనులు - సనాతనులు. వారికి గల సంబంధమును సనాతనమే. అయ్యది యాగంతుకము కాదు, మధ్యలో వచ్చినది కాదు.

పరమాత్మ నియామకుడు. జీవుడు నియమ్యుడు. కావున జీవేశ్వరులకు నియమనియామక భావసంబం

ధము గలదనియు గుర్తింపవలెను. జీవేశ్వరులు, సఖాయా = సఖాయౌ = సమానఖ్యానము (లక్షణము) గలవి. జీవేశ్వరులకు చైతన్యము-జ్ఞానము-లక్షణము. పరమాత్మ చేతనమైనట్లు జీవాత్మయు చేతనమే యని భావము. కావున జీవేశ్వరులలో సామ్యము బొత్తిగా లేదనుట తగదు. ఇట్లు జీవేశ్వరులకు కొన్ని విష యము లందు సామ్యమున్నను నానందమున సామ్యములేదు.

సమానంవృక్షం = ఒకే వృక్షమును (వృశ్చ్యతే ఇతివృక్షః) వ్రయ్యలు చేయనగును కావున వృక్ష మనబడుచున్నది. వ్యష్టి విషయమున దేహమే వృక్షరూపమున నిట జెప్పబడిన ట్లెంచవలయును. అందునను హృదయము మాత్రమే గ్రహించుట యుక్తము. సమష్టి విషయమున ప్రకృతియే వృక్ష ముగా గ్రహింపనగును. వృక్షము ఛేదింపబడును. అట్లే హృదయ ప్రకృతులును ఛేదింపనమవగును. కావున నవి వృక్షపదముచే జెప్పబడినవని భావము.

పరిషస్వజాతే = పరిష్వజతః = ఆశ్రయించి యున్నవి. భోక్తగా జీవుడును, నియంతగా పర మేశ్వరుడును హృదయమును, ప్రకృతిని నాశ్రయించి యున్నట్లు గుర్తింపవలెను.

"స్వాదుపిప్పలం అత్తి = జీవుడు శుభాశుభ కర్మ ఫలముల ననుభవించుచున్నాడు. అన్యః = ఈశ్వరుడు, అనశ్నన్ అభిచాకశీతి = సుఖదుఃఖముల ననుభవింపక యంతటను నిరీక్షించుచున్నాడు.' అని స్పష్టముగా మంత్రమున వర్ణింపబడినది. కాబట్టి జగత్పతియగు పరమేశ్వరుడు హృదయమున నున్నంతమాత్రమున జీవునివలె సుఖదుఃఖములకు లోనగు చున్నాడనుట సిద్ధింపదు. కాగా ఛాందోగ్యోపనిషత్తునందు గల శాండిల్యవిద్య యందు (సర్వం ఖల్విదం బ్రహ్మ త జ్జలానితి శాంత ఉపాసీత) గ్రహింపబడిన బ్రహ్మ పదము పరమేశ్వర వాచకమేకాని జీవవాచకము కాదు. (౮)

బ్రహ్మమునందు భోక్తృత్వధర్మము లేదని నిరూ పించి యత్తృత్వధర్మము గలదని చెప్ప మహర్షి యధికరణాంతరమును ప్రారంభించుచున్నాడు.

"అత్తాచరాచర గ్రహణాత్" ౧.౨.౯. బ్రహ్మము, చరాచరగ్రహణాత్ = స్థావర జంగమాత్మకమగు నీ జగత్తునంతటిని భక్షణయోగ్యముగ గ్రహించుటవలన అత్తా = భక్షకుడు.

కఠోపనిషత్తునందు ('యస్య బ్రహ్మ చ క్షత్రం చోభే భవత ఓదనః, మృత్యు ర్యస్యోపసేచనం క ఇత్థావేద యత్ర సః" కఠ. ౨-౨౫).

'ఎవనికి బ్రహ్మక్షత్రాది సర్వప్రపంచము నోదన స్థానీయమో (అన్నమో) సర్వభంజకమగు మృత్యు వెవ్వనికి ఘృతస్థానీయమో (వ్యంజనమో) యట్టి పరమాత్మను దుశ్చరిత్రతాది దుర్గుణరహితుడు కాని వా డెవడు తెలిసికొనగలడు?' ఆపరమాత్మ యెట నున్నదియు నెవ్వడును తెలిసికొనజాలడని భావము.

ఉపర్యుక్తవాక్యమున జెప్పబడిన భక్షకుడు(అత్తా) జీవాత్మయా? లేక పరమాత్మయా యని సందేహము. వాక్యమునందు జీవాత్మనుకానీ, పరమాత్మనుకానీ తెలుపుటకు దగు విశేషపద మెందును గనబడదు. కావున సందేహము జనించుట సహజము. ఈ యధి కరణమున జీవాత్మయే భక్షకుడనుట పూర్వపక్షము. కాదు పరమాత్మయే యనుట సిద్ధాంతము.

అత్తృత్వమన భోక్తృత్వము. కాబట్టి, అత్తా = భోక్తయని భావము. భోక్తృత్వము జీవునియందే గలదు. ('తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి') 'జీవే శ్వరులలో నొకడగు జీవుడు కర్మఫలమును భుజించు చున్నా'డని ఋగ్వేదమున వర్ణింపబడినట్లు పూర్వాధి కరణమున బ్రతిపాదింపబడినది. కావున నీ యధి కరణమునందును జీవాత్మయే భోక్తగా గ్రహింపనగు నని ప్రాప్తింపగా, నయ్యది యుక్తముకాదు. పరమా త్మయే యిట భోక్తయని సమాధానము.



# స్తుతిహారతీద్వయం

సేకరణ

శ్రీ నేదునూరి గంగాధరం

## శ్రీశైల భ్రమరాంబాదేవి స్తుతి

(మారువ రాగం - అటతాళం)

ఇంత చక్కని తల్లి యెవరే వోయమ్మా !
ఇంతి ; మహాదేవుని యిల్లాలె కొమ్మా ఇం.

కంబుకంధరి నీలకంఠి భక్తోద్ధారి
బింబోష్ఠియైనట్టి అంబెవ్వరమ్మా ?
అంబుజభవురాణి హరిరాణి కన్నను
దంబైన శ్రీజోగులాంబె మాయమ్మా. ఇం.

డమరు త్రిశూల ఖడ్గములు హస్తములందు
కొమరొప్పుచున్నట్టి రమణెవ్వరమ్మా ?
ఉమ మహిషాసురు నురుమీ చెండాడిన
భ్రమరాంబ శ్రీశైల భ్రమరే మాయమ్మా ! ఇం.

డాలు వజ్రాలు ముత్యాలు పవడాలు నీ
లాలు సవరాల జవరా లెవరమ్మా ?
బాలేందుఫాల దిక్పాలపాల శివ
ఫాలాక్షు పట్నంపు లోలాక్షే యమ్మా ! ఇం.

భుగభుగమను కప్పురము కుంకుమ నుదుట
నిగనిగమని మెరయు మగువ లెవరమ్మా ?
మిగిలిన పద్దెనిమిది పీఠముల నుండ
దగినట్టి కామాక్షి తరుణే వో కొమ్మా ! ఇం.

నవరత్న సింహాసనమున గూర్చుండి
శివ నామము లెంచు చెలి యెవరమ్మా!
రవణ కోవెలకుంట రంగని సోదరియు
వివిధా భక్తుల పరంజ్యోతే మాయమ్మా! ౩౦.

## శ్రీశైల భ్రమరాంబాదేవి మంగళహారతి

(ఆనందభైరవి రాగం - అటతాళం)

హారతిదుగో; మంగళ హారతిదిగో; భ్రమరాంబదేవి హా.

హారతిదుగో; శీతకర నీహార తార పటీర సురతరు
హారకుంద సమానకీర్తి విహార శోభిత దిక్సతీతతి హా.

అంబ చికుర కరంబ రోలంబ యనవరత కలధౌ
తాంబరాంచిత సైకత నితంబ సల్లలితవదని వి
డంబ నందిత కుముద హితబింబ సతతాభిహృద హే
రంబ అరుణా సురాంకిత శంపరాశ విభాసురాధర
బింబ భక్త జనావలంబ కదంబ వనసంచారిణీ ఘన
శంబరాంతక జనకసోదరి. హా.

ఏణ ధరకరరాణి కల్యాణి మాణిక్య వీణాపాణీ
మౌని సమూహ సంత్రాణి, పంచాస్య విభుకంఖాణీ
కుందకలిత రదశ్రేణీ, చంబక సుమాంచిత ఘోణీ
వినుత జనావళి ప్రాణీ, హే నీలజలధర వేణీ
యంగీకృత శుచివ్రజ వాణి పాలిత కమలభవనా
వాణి శివ శర్వాణి దేవి పురాణి శుంభ నిశుంభ హారిణి. హా.

ఘోరి దుర్మద చండ ముండారి మాతంగమౌని కుమారి
సుకవిచకోర కంజారి, ఓంకార పంజర కీర కైటభ తిమిరచరవైరి
శృతి నిగమ విపి మయూరి నందిత పంచశరసారి
బహుశక్తి వేలిత సారెకును నిను పూజనేయగ

గోరి చేరి నుతించినను నా నేరమెన్నుట గోర నీకిది
మేరగాదిపు డాధరింపుము. హా.

పాలితామర జాల శ్రీలోల ప్రాలేయ మహిధర
బాలబాల మృంగచూడాల, రతికోటి శతశుభ
ఖేల కిల్బిష తూలవాతూల, తరుణాంబుహిత
ఫాల మహిష సురాహితాభీల, చరాచరాళిని
లోల మహిమోత్తాల నుత సుగు
ణాలవాల సుశీల నన్నిపు డేలజాల మి
దేల శాంభవి, చాలదయ నవలీల బ్రోవుము. హా.

ఉల్లసిత మునివల్లభిమతల్లీ హల్లిసక ముదిత
ఖిల్లి పురహర వామపురఝుల్లి, సురభామినీ సౌ
దల్లి బుధజన కల్పతరువల్లి, రజితావనీధర ఝల్లి
గణ హృదయాంబురుహభిల్లి, రక్షింపవే మా తల్లి
శ్రీ శివ లంకవంశ మల్లయాఖ్య కవీంద్ర
నుతపద పుల్లపంకజ కర నఖోద్భవ
హల్లి కాంబిక గురు దశాకృతి. హా.

# కృష్ణాపట్నపు దేవాలయాలు

శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

కృష్ణాపట్నము నెల్లూరికి పదిహేను మైళ్ళ దూరమున సముద్రతీరములో వున్న గ్రామము. నెల్లూరు తెలుగు చోళులకు రాజధానిగా వుండిన కాలములో కృష్ణాపట్నము ఆ రాజధానికి రేవుపట్నముగా వుండినది. పల్లవుల రాజధాని కంచికి మహాబలిపురమూ, చోళుల రాజధాని తంజావూరికి నాగపట్నమూ వలెనే నెల్లూరికి కృష్ణాపట్నము సముద్రపు రేవు. ముఖ్యముగా వర్తకస్థానమేఅయివుండినా, కృష్ణాపట్నంలో మహాబలిపురములో వలె ప్రసిద్ధ దేవాలయములు కలవు. పద్దెనిమిది దేశాలవారూ ఈ గ్రామీణులతో చేరి దేవాలయాలకు కానుకలిచ్చినట్లు ఒక ఆలయములో శాసనము కూడా కలదు. ఇక్కడి ఆలయాలు తెలుగు చోళులు నిర్మించినవే అనిపిస్తుంది. మనుమసిద్ధేశ్వరాలయమనే ఈశ్వరాలయమొకటీ గోపాలస్వామి ఆలయమనే విష్ణ్వాలయమొకటీ ఈనాటికీ నిలచిఉన్నవి. ఊరినిండా అక్కడా అక్కడా దేవాలయ స్తంభాలూ, స్తంభపీఠాలూ, ఉష్ణీషాలూ చెదరి చెదరి పడివుండడము చూస్తే ఇక్కడ ఇంకా కొన్ని ఆలయాలుండేవనీ అవి శిథిలమైపోతే నవకర్మ చేయించేవారు కూడా లేకపోయినారనీ అనిపిస్తుంది. నెల్లూరినుంచి ఈ పల్లెకు చేరే దారిలో దీనికి రెండు మైళ్లు ముందుగా ముత్తుకూరు అన్న ఊరు కలదు. ఆ వూరిలో వీరభద్రుని విగ్రహమొకటీ, వాసుదేవుని విగ్రహమొకటీ దేవాలయప్రాంగణాలలోచెదరిఉన్నవి ముత్తుకూరికీ కృష్ణాపట్నానికీ నడుమ పొలములో (సప్తమాతృకలలోని) వైష్ణవి విగ్రహము—మూడడుగుల ఎత్తున్నది— నల్లశేనపురాతిది పడివున్నది. వెన్నెలరోజులలో కృష్ణాపట్నము—అప్పటి దీనిపేరు 'కొల్లత్తురై'— పెద్దనగరము. మార్కొపోలో మోటుపల్లినిగురించి వ్రాసినది కృష్ణాపట్నానికి కొంత చెల్లివుంటుంది ఆరోజులలో.

మనుమసిద్ధేశ్వరాలయానికి ప్రాకారమూ పశ్చిమమువైపు ప్రాకారమండపమూ ఉన్నవి. ఆలయము పశ్చిమ ముఖము. కనుక మహాద్వారము ప్రాకారపు పడమటి గోడలో వుంది. ఈ మహాద్వారానికి ముందు ఇటూ అటూ నాలుగు అడుగుల ఎత్తున స్తంభాల మండపమున్నది. ఇటూ అటూ వరుసకు నాలుగు స్తంభాల చొప్పున మూడువరుసలు కలవు. మండపమంతా మొదటలో ఎరుపూ తెలుపూ చేరిన శేనపురాతితో కట్టారు. ఈ మండపము అధిష్ఠానముమీద నేలకు జానెడు ఎత్తున శిల్పపు పట్టీవున్నది. దేవాలయమువైపు ఈపట్టీలో శివభక్తుల తన్మయనృత్యమూ, భిక్షాటనమూర్తి వెంటపడిన ఋషిభార్యలూ, శివుణ్ణి పూవుటమ్ములతో ముట్టడించే మన్మథుడూ, మల్లుల విన్యాసములూ ఉన్నాయి. ఈమండపము మొదట ఎర్రరాయితో కట్టినారు. ఏకారణమువల్లనో పడిపోయింది. ఇటీవలి వారెవరో నల్లరాతి స్తంభాలను మలిపించి అమర్పించారు. ఆ స్తంభాలకు నాలుగు పక్కలా శిల్పము కిక్కిరిసివుంది. స్తంభాలమీద దూలములమర్చడానికి దాపులుగా పెట్టినముక్కలు విజయనగరశిల్పాన్నికూడా బాగా అతిక్రమించాయి. స్తంభాలను కొన్నిటిని అంచులవద్ద రెండు అంగుళాల మందముగల చిన్న స్తంభాలుగా వింగడించారు. ఈ రీతియత్నము విజయనగరసామ్రాజ్యశిల్పమే చేసింది కాని ఇతర సంప్రదాయాలు చేయలేదు. స్తంభాల మీది శిల్పంలో యోగము కల్పించే యత్నము లేనే లేదు. సాదృశ్యమంతా తాంత్రికశైవముతో తెలుగు చోళవంశాలవారి రచనలలో పానుగంటి స్తంభాలు

విడిచేస్తే ఇంతశిల్పమున్న స్తంభాలు మరిలేవు. ఈ శిల్పము తెలుగుచోళులది కాదనీ, ఏ కాళహస్తీశ్వరాలయనవకర్మకాలమునాటిదోననీఅనుకుంటున్నాను.

ఈ ఆలయము పశ్చిమముఖ మన్నాను. ఈ గోపుర మండపములో నుంచి ఆలయప్రాంగణము లోనికి తెరుచుకునే ద్వారబంధము 10 అడుగుల ఎత్తుంది. దాని నిలువుకంబాలమీద శిల్పమేమీలేదు. ఈద్వారాని కెదురుగా నాలుగు కంబాల నందిమండపమున్నది. చోళదేవాలయాలలో ప్రధాన దేవాలయము (తంజావూరి) బృహదీశ్వరాలయములో కూడా ఆలయానికి బయట నందిమండపమున్నది. కాని ఇది నాలుగు కంబాలూ శిఖరపుకప్పూతో విజయనగర కాలపు మండపములాగున్నది. నంది బండనంది. విశేషము ఏమీలేదు.

ఆలయము భూమట్టాన కాక మూడు అడుగుల ఎత్తుగల అధిష్ఠానముమీద ఉండడము ఒక సంప్రదాయము. నెల్లూరు చోళులఆలయాలు రంగనాథస్వామి ఆలయమూ, కాళహస్తీశ్వరాలయమూ, అత్తిరాల పరశురామేశ్వరాలయమూ అధిష్ఠానము మీద నిర్మించినవే. ఈ ఆలయము కూడా అధిష్ఠానము మీదనే వున్నది. పానగల్లూ, వర్ధమానపురమూ ఆలయాలు అధిష్ఠానము మీదనే కలవు. అయితే పశ్చిమ చాళుక్యుల, పల్లవుల ఆలయాలూ అధిష్ఠానముమీదనే వున్నాయి. తెలుగు చోళుల ఆలయాలకు ఈ లక్షణ మున్నదని ప్రత్యేకముగా చెప్పవలసిన అవసరమేమీ అంటే, ఈ ఆలయాలు కాకతీయ శిల్పసంప్రదాయాన్ని అవలంబించలేదని సూచించడానికే. కాక



శ్రీ సిద్ధేశ్వరస్వామి దేవాలయం

తీయుల త్రికూటాలయాలూ, జైనాలయాలూ కూడా ఈ పద్ధతికి భిన్నముగా వున్నాయి.

ఆలయానికి గర్భగృహమూ శుకనాసీ కలవు గర్భాలయమునకు ద్వారబంధము లేదు. అంతరాళ మునకు మాత్రమే కలదు. ఈ ద్వారబంధముపై కమ్మీనడుమ గజలక్ష్మి కలదు. అంతరాళానికి వెలు పల అంతకంటె సుమారు మూడురెట్లు వెడల్పూ, కొంచెమింతకంటె ఎక్కువ పొడవూ ఉన్న అర్ధమండప మున్నది. ఈ మండపానికి పశ్చిమము వైపున్న ముఖద్వారముకాక దక్షిణమువైపున మాత్రము ఒకద్వార మున్నది. వెల్దుర్తి శ్రీ రామాల యానికీ వీరభద్రాలయానికీ గర్భాలయ ద్వారబంధాలు లేవు, రాజరాజేశ్వరాలయ అర్ధమండపానికి దక్షిణము వైపున ద్వారమూ మండపమూ ఉన్నాయి ఈమనుపు సిద్ధేశ్వరాలయానికివలెనే, అదీ చోళ సంప్రదాయపు ఆలయమే. ఈ ఆలయంలోని పానవట్టమూ లింగమూ ఇనుపఖనిజపు నున్నని చాయగల రాతితో మలచినవి. పానవట్టము సరిగ్గా రోలువలెనే ఉన్నది. నడుము దగ్గర ఎత్తు చాలాతక్కువ. పీఠపద్మమని పేరు దీనికి. లింగము తొమ్మిది అంగుళాలు వ్యాసమూ 18 అంగు ళాలు పొడవూ గల స్థూపకము.

అర్ధమండపంలో పండ్రెండు స్తంభాలు సుమారు తొమ్మిది అడుగులు ఎత్తూ ఒక్కఅడుగు వ్యాసమూ గల గరుకు స్థూపకాలు. నెల్లూరి ఆలయాలలోనూ అత్తిరాలలోనూ ఇవే. నెల్లూరి చోళులూ పొత్తపి చోళులూ ఈరకపు స్తంభాల్నే వాడినట్లు కనిపిస్తుంది. ఈ స్తంభాలమీద పెట్టిన అడ్డుముక్కలుకూడా నిశ్శిల్ప ములే. అయితే ఈముక్కల క్రింది అంచులను మాత్రము నాసికలుగా చెక్కినారు.

దేవాలయశిఖరము చోళశిఖరాలవలె నలుపలకలు గానూ లేదు, తంజావూరు సుబ్రహ్మణ్యేశ్వరాలయము వలె కుదురుగా గుండ్రముగానూ లేదు. ఏదో శిఖరము కట్టి వదలినారు. దేవాలయపు వెలిగోడలు అర్ధస్తంభా లంకారమునేగాని శిల్పాల్ని ధరించలేదు-నెల్లూరి రంగ నాథస్వామి ఆలయమువలెనే.

అర్ధమండపంలో ఉత్తరంవైపు అరుగుమీద భైరవవిగ్రహ మున్నది, నలుగురు విఘ్నేశ్వరు లున్నారు. ఈవిగ్రహాలు ఇతర ప్రదేశాలనించి తెచ్చి ఇక్కడ పెట్టినవై యుంటాయి. భైరవుని విగ్రహము కుక్కయొక్క విన్యాసముతోసహా పట్టీశ్వరములోని భైరవుణ్ణి సరిగ్గాపోలివుంది. ప్రాకారపుగోడలో నాలు గైదు విగ్రహాలు తాపించబడివున్నాయి. విఘ్నేశ్వరుడు తొడమీద కూర్చున్న దిగంబరిదేవితో ఉత్తర కామికాగమములో చెప్పినట్లున్న ఆకుపచ్చని శిలా విగ్రహమొకటి ఉన్నది. ఈ శిలదే ముత్తుకూరు ఆలయంలో కూర్చున్న వాసుదేవమూర్తిని-శంఖచక్ర గదాధారి విష్ణుమూర్తిని - ఒక విగ్రహమున్నది. తక్కిన విగ్రహాలు సిద్ధేశ్వరాలయంలోనివి నల్ల రాతివి. గోపురమండపనవకర్మ చేసినకాలంలోనివి కావోలు.

ఈ ఆలయము నెల్లూరినేలిన రెండో మనుమసిద్ధి రాజుపేర కట్టినదట. క్రీ. శ. 1256 సంవత్సరము నాటిశాసనము-కొల్లత్తూరై ప్రజలూ పద్దెనిమది మంది విదేశీయ ప్రముఖులూ చందిరట్టిరై పిళ్ళెయార్ దేవాలయ పూలవనములో సమావేశమై ఈవూరి సిద్ధేశ్వరదేవరకు కానుకలిచ్చిన శాసనమొకటీ, క్రీ.శ. 1279 లో ఇరుమాడి తిరుకాలత్తిదేవని విజయరాజ్య వత్సరాలు రెండుగడచిన నాటి శాసన మొకటీ ఈ దేవాలయంలో దొరికేయి.

## గోపాలస్వామి ఆలయము

నెల్లూరి నేలిన తెలుగు చోళరాజులలో మనుమ గండగోపాల, రాజగండగోపాల పేరులుగల రాజులు పెక్కురున్నారు. కృష్ణాపట్నపు గోపాలస్వామి ఆల యముమీద శిల్పాలంకారము—— సిద్ధేశ్వరాలయము మీది శిల్పముకంటె చాలా ఎక్కువగా ఉన్నది. కనుక ఈ ఆలయము సిద్ధేశ్వరాలయము నిర్మింప బడిన తరువాతనే నిర్మింపబడినదేమో ననిపిస్తుంది. సిద్ధేశ్వరాలయ సోపానములమీది శాసనము—— ఒక రాజు విజయ రాజ్యవత్సరాలు 26 గడిచినతర్వాత

విష్ణ్వాలయానికి గోపుర మండపాదులు నిర్మించిన ట్లున్నది— ఈ ఆలయాని కేమైనా సంబంధించిన దేమో! నెల్లూరి చోళులలో 26 సంవత్సరాల కాలము ఏలిన దొక్క తిరుకాలత్తిదేవుడనే మొదటి తిక్క రాజు (రెండో మనుమసిద్ధి కొడుకు) మాత్రమే సిద్ధేశ్వరాలయము తండ్రిపేరా, ఈ మనుమగండ గోపాలాలయము కొడుకుపేరా కట్టించియుండును.

ఈ ఆలయము తూర్పుముఖము. దీనికి ప్రాకారమూ, దేవాలయాని కెదురుగా మండపమూ కలవు. ఈ మండపము వాస్తవానికి గోపురమండపము. ఈ మండపాలమీద (గోపుర) శిఖరాలు లేవంతే. చోళ దేవాలయాలకూ, పాండ్య దేవాలయాలకూ శిఖర గోపురాలుంటాయి. తెలుగుచోళులు కృష్ణాపట్నమూ, అత్తిరాలా, నెల్లూరూ (ఇరుకాళమ్మ దేవళము) ఆలయాలకు గోపురమండపాలు కట్టించారు కాని గోపుర శిఖరాలు ఎత్తించలేదు.

ఈ ఆలయానికి గర్భాలయమూ, శుకనాసీ, ఇంకొక అంతరాళమూ, అర్ధమండపమూ కలవు. దేవాలయాలకు సామాన్యముగా గర్భాలయము ముందు శుకనాసి అనే అంతరాళముంటుంది. ఈఆలయానికి శుకనాసీ, దానిముందు మరికొంత వెడల్పు ఎక్కువగల అంతరాళమూ వున్నాయి. పైనుంచి కనపడే ఆలయపు రూపులో గర్భాలయమూ, శిఖరమూ, శుకనాసీ మాత్రమే శిల్పాలంకృతములు. ఇంతవరకూ నిర్మించిన శిల్పులు వెళ్ళిపోయారో మరేమి జరిగిందో కాని దీని తరువాతి నిర్మాణము స్థానికశిల్పులు తిరుకాలత్తి దేవుని కాలములో సాగించినట్లు కనబడుతుంది. శిలాలంకారము నెల్లూరి చోళుల తొలి ఆలయాలకు లేదు.



శ్రీ వేణుగోపాలస్వామి దేవాలయం

అంతరాళానికి ముందు అర్ధమండపము స్థూపకాకార స్తంభాలతో ఉన్నది. దీనినడుమన నాలుగు స్తంభాలూ శిల్పాలంకృతములు కాకపోయినా, లోకప్పు అలంకారాన్నిబట్టి రంగమండపాన్ని నిర్దేశిస్తున్నాయని అనుకోవాలి. ఇక్కడి లోకప్పుకి శిల్పాలంకారము లేదు కాకతీయుల ఆలయాల మండపాలలోవలె.

ఆలయమూ అంతరాళమూ ఎరుపుకలిసిన తెల్ల రాతివి. శిఖరము ఇటుకా సున్నమూతో నిర్మించినట్టిది. అధిష్ఠానమూ, ఆలయము గోడలూ రాళ్ళను అడ్డముగా పేర్చి నిర్మించారు. అధిష్ఠానము మూడువరుసలూ, గోడలు నాలుగు వరుసలూ, చూరు ఒక వరుసా మొత్తము 8 వరుసలైనవి. చూరు రెండు పట్టీలుగా అర్ధశిల్పంతో వుంది. కింది పట్టీలో హంసలు చిన్నవి ఉన్నాయి. పై పట్టీ తొమ్మిది అంగుళాల వెడల్పున రూపాలూ విన్యాసాలూ వివరంగా తెలుస్తూన్నశిల్పాలతో నిండివుంది గుడిచుట్టూ. సవ్యంగా ప్రదక్షిణ మారంభిస్తే, మొదట చిలకవాహనమ్మీద మన్మథుడూ రతీదేవీని. తరుణులు ఒకచేత కమండలమువంటి పాత్రలు పట్టుకొని ఎత్తిన రెండోచేత పూలుజల్లుతూన్నట్టున్నారు. వసంతోత్సవ సూచన ఏమైనా అయితే కావచ్చును. అంతరాళపు చూరు దాటి ఆలయము చూరుమీద వాలిసుగ్రీవుల పోరాటమూ పక్కన రాముడు, సప్తతాళభేదనమూ, మళ్ళీ చిలుకతేరివజీరూ, అనంతశయనుడూ, తలపైపు ఒంటికాయ వీణలతో కిన్నరదంపతులు. పశ్చిమముఖాన్న గజేంద్రమోక్షమూ గోగోపికాసహిత రాజగోపాలుడూ నృత్యబృందమూ కలవు. దక్షిణాన్న కలశధారిణులు స్త్రీలూ, రెడ్డికం వేసుకుని కూర్చున్న రాజూ (కంసుడు కాబోలు) మల్లయుద్ధం. మళ్ళీ చిలుకతేరివజీరువిన్యాసాలు. తరువాత కృష్ణలీలలు. అంతరాళం ఉత్తరపు చూరుమీద దశరథుడు బ్రహ్మచారి బాలుని చంపడమూ, ఆ బాలుని తలిదండ్రులు చెట్టుకు తగిలించిన కావడిలో, ఆ పైన వాద్యసహిత కోలాటము. అధిష్ఠానమునకు కొంచెము పైన అక్కడొక బొమ్మా ఇక్కడొక బొమ్మా చొప్పున చాలా పలచగావున్నాయి. దక్షిణపార్శ్వాన ఆసనాధిష్ఠితుడగు రాముని వెనుక సీత, ఆమె వెనుక లక్ష్మణుడూ. ఎవతెయో స్త్రీ నృత్యంచేస్తోంది, శూర్పణఖా? ఉత్తర పార్శ్వంలో గోపికావస్త్రాపహరణ మున్నది.

ఈ ఆలయపు చూరు శిల్పానికీ, సిద్ధేశ్వరాలయ గోపురమండప అధిష్ఠాన శిల్పానికీ పోలికలున్నాయి. ఆ మండపమేమైనా ఈఆలయానికి సమకాలికమేమో; నెల్లూరిరంగనాయకుల ఆలయానికీ ఇరుకాళ్ళమ్మ ఆలయానికీ ఈరకపు శిల్పాలంకారములేదు. అర్ధ మండప స్తంభాలూ వాటిపైముక్కలూ మాత్రము అవే. ఆలయపు గోడలచూరు వెంట అర్ధశిల్పము లమర్చడమూ గర్భాలయానికి కాక అంతరాళానికే ద్వార బంధము అమర్చడమూ, స్థూపకాకార స్తంభాలతో అర్ధమండపము నిర్మించడమూ నెల్లూరు చోళసంప్రదాయాలనిపిస్తున్నది. అత్తిరాలా, వెల్దుర్తీ ఆలయాలకు చూరుదగ్గర అర్ధశిల్పముంది. అత్తిరాలా, నెల్లూరూ ఆలయ మండపాల స్తంభాలూ స్థూపకాకారాలే. అయితే ఈ మన్మగండ గోపాలాలయమే నెల్లూరి చోళుల ఆలయాలన్నిటా సుందరమైనదనిపిస్తున్నది.

ఈ రెండు ఆలయాలూ చోళసంప్రదాయపు ఆలయాలే. నెల్లూరు చోళుల వ్యవహారాలలోనికి కాకతీయులు గణపతి దేవుని కాలము వరకూ చెయ్యి చేసుకోలేదు. కనుక కాకతీయుల దేవాలయ శిల్పలక్షణాలు తెలుగు చోళశిల్పంలో ఆకాలంవరకూ కానరావు. కృష్ణాపట్నపు గోపాలాలయ అర్ధ మండపములోని రంగమండపము కాకతీయ దేవాలయాల రంగమండపాల్ని జ్ఞప్తికి తెస్తోంది. కనక ఆ దేవాలయపు అర్ధమండపము మూడో మనుమసిద్ధి రాజు-తిక్కన గారిని పోషించినరాజు - కాలంలోనిదైనా కావచ్చును. తెలుగు చోళుల ఆలయాలు ఇంకా పరిశీలించవలసియున్నది.



# శ్రీ రామ కథా సుధ

కీ. శే. శ్రీ గొబ్బూరు వేంకటానంద రాఘవరావు

(గత సంచిక తరువాయి)

సీత ఆ సంగతులన్నీ శ్రీరామునితో చెప్పి ఆయనను అలరించెను. అనంతరము వారి వనవాస వృత్తాంతము నీ క్రింది పద్యము చక్కగా విశదము చేయగలదు.

శా. "మాసార్థంబొకచో, దినంబొకయెడన్
మాసద్వయంబొక్కచో
మాసంబొక్కెడ, వత్సరార్థమొకచో
మాసత్రయంబొక్కెడన్
మాసత్రిద్వయ మొక్కెడ న్నొకయెడన్
మాసాష్టకం బొక్కచో
నాస ల్మీర వసించె నా రఘువరుం
డయ్యై తపోభూములన్."

ఆటుతరువాత వారు అగస్త్యమహాముని ఆశ్రమమునకు వెళ్ళి, అతనిని సందర్శించి, ఆశీస్సులతో నమ్మునీశ్వరు డిచ్చిన వైష్ణవాస్త్రములను, శరాసన అక్షయ తూణీరయుగమును, దివ్యఖడ్గద్వయమును పరిగ్రహించిరి. అతని యుపదేశానుసారముగా గౌతమీతీరమున, పంచవటివద్ద పర్ణశాలకట్టి రాముడు అందు నివసింప నారంభించెను.

సీత, భూపుత్రి కావడముచేత కాబోలు; ఆమెకు మొక్కలను, బాలమృగాలను పెంచుటయందు సరదా హెచ్చు: ఆమె నాటిన మామిడిమొక్కలకు ప్రతిదినము గోదావరినుండి కుండలతో నీళ్లుతెచ్చి పోసి పెంచుచుండేది - మొక్కలు పెరిగి పెద్దవవుతూ వుంటే వాటి నీడను పెంపుడుమృగములు విశ్రమించేవి. రావణ సంహారం అయినతరువాత పుష్పక విమానం మీద అయోధ్యకు తిరిగి వెళ్లుతూ కూడా, పర్ణశాల వద్ద సీత పెంచిన మామిడిచెట్ల నీడలలో విశ్రాంతికొఱకు పండుకొనిన పెంపుడు జంతువులను శ్రీరాములు సీతకు చూపి వినోదించినారు. "అవి సీతారాములను కోరుతున్న"వని సహర్షంగా ప్రశంస చేసినారు.

## చుప్పనాతి

ఈ రాక్షసి రావణాసురుని చెల్లెలు. విద్యుజ్జిహ్వుడను రాక్షసుని భార్య; జంబుకుమారుని తల్లి. ఒకానొక యుద్ధంలో రావణుడు తన బావమఱిది అనియైనా సందేహించక దాని భర్తను చేతిఖడ్గముతో చెఱుకు కట్టును నరికినట్లు ఒక వ్రేటుతో రెండు తుండ్లక్రింద నరికి చంపినాడు. తండ్రి పగతీర్చుటకు జంబుకుమారుడు వెదురుపొదలో దాగి ఇంద్రుని గూర్చి తపస్సు చేయగా, శక్రు డొక చంద్రహాసమును పంపి, జంబుని బహూకరించెను. "నాకెందుకీ చంద్రహాసం?"అని వాడు తృణీకరించి పుచ్చుకోలేదు. అంతరిక్షంలో అల్లాడుతున్న ఆయుధమును లక్ష్మణుడు పట్టుకొని, వాడి యేమాత్రమున్నదో చూతమని కాయలు పువ్వులతో ఉన్న వృక్షశాఖలు నరుకుట చూచి, ఒక విప్రుడు 'పువ్వు కాయతో ఉన్న కొమ్మల్ని ఎందుకయ్యా, నిష్కారణంగా నరుకుతావు? కావలిస్తే ఆ వెదురుపొద నరికిచూడు' మని కొంటెగా చెప్పిన సలహా విని లక్ష్మణుడు వెదురుపొద ఒక్క వ్రేటుతో నరుకగా— జంబుకుమారుని శరీరం కూడా తండ్రి దేహం వలెనే రెండు తుండ్లైపడినది. రక్తస్రావము చూచి 'లక్ష్మణుడు బ్రహ్మహత్య చేస్తినిగాబోలు!'నని జడిసి, అన్నగారికి తెలియబఱచి పాపపరిహారమార్గం అన్వేషించవలసినదని విన్నవించినాడు. రాముడీ

సంగతి పెద్దలకు తెలుపగా "లక్ష్మణుడు మంచి పని చేసినాడు. చచ్చినవాడు రక్కసుడే! పుణ్యమే గాని పాప మేమీ లే"దని వారు రాముని సంశయము మాన్పినారు.

చుప్పనాతి హృదయమే లేని రాక్షసి. దానికి భర్త చచ్చినాడనిగాని, కొడుకు చచ్చినాడనిగాని విచారము లేదు. తన శరీరసుఖమూ, వెకిలితనమూ, ఇతరుల బాధించి తాను సంతోషము పొందడమూ. ఇటువంటి దుర్గుణముల పుట్ట—ఆ రక్కసి. ఒకనాడు పర్ణశాల ముందు శ్యామసుందర రామమూర్తి స్ఫురద్రూపము చూచి మోహించి, నిర్మొగమాటముగా ఆతనిని చేరవచ్చి "సుందరాకారా! వీడు నీ తమ్ముడా! తమ్ముడని చూడక, తెగటార్చు. ఈ జరఠి నీకు భార్య కాదగదు. గుటుక్కున మింగేస్తాను. మనం ఇద్దరమూ హాయిగా ఉందాము" అన్నది. శ్రీరామమూర్తి అపహాస్యంగా లక్ష్మణుని చేరుమనెను. లక్ష్మణుడు కొంటెగా "వెఱ్ఱిమొహమా! రాముని వదలుకోకు" అనగా, బిరబిర మళ్ళీ పర్ణశాల చేర వచ్చినది. దానింజూచి. సీత నవ్వు ఆగక, పకపక నవ్వగా, కోపము తెచ్చుకొని సీత నొక్కట మ్రింగ తలపడెను. రాము డా దానవిని గట్టిగా పట్టుకొని "లక్ష్మణా! క్రూరులు, దుష్టాత్ములు అయిన రాక్షసులతో హాస్యము లాడకూడదు. ఊరుకుంటే ఇది సీతను మింగక మానదు. అనుమానించక దీని ముక్కు చెవులు తెగకోసి పంపించు" అని ఆజ్ఞాపించగా, లక్ష్మణుడు సోణమంటునట్లు దాని ముక్కును చెవులను తెగకోసి పొమ్మనెను. గుంజుపీల్చి గిరాటు వేసిన తాటిదొక్కవలె అసహ్యమై దీనమై చిన్నబోయిన ముఖముతో, తనకు అన్నవరుసవాడును, జనస్థానమునకు అధిపతియు నైన ఖరుని చేరబోయి రక్కసి గోలుగోలున నేడ్చుచు తన పరాభవమునకు ప్రతికృతిచేసి పగదీర్చుమనెను. అదేదో చూచిరండని ఖరుడు పంపగా, పదునలుగురు రాక్షసులు పటుశూల హస్తులై రాముని పొడిచిచంపవచ్చిరి. దూరమునుండి చూచి రాముడు పదునాలుగు బాణములతో శూలములు ద్రుంచి, మరి పదునాలుగు బాణములతో రాక్షసుల దునిమివైచెను. అది చూచి చుప్పనాక మిక్కిలి భయపడి, దిక్కులు మారు మ్రోగునట్లు బిగ్గరగా రోదనముచేసి, సర్వసైన్యములతో రాముని మీద యుద్ధమునకు రమ్మని ఖరుని త్వరపెట్టెను.

చుప్పనాక ప్రోత్సాహమువలన పదునాలుగువేల మంది రాక్షసయోధులతో ఖరదూషణ ప్రముఖులు రామునిమీదకు ఎత్తివచ్చిరి. ప్రక్క కొండగుహలో సీతను దాచి, అచటి గొందె దాపున లక్ష్మణుని కాపు పెట్టి, రాముడొక్కడే రాక్షసుల నెదిరించి నిల్వరింప వెడలెను.

నదులెన్నియైనను సముద్రమున నణగిపోవునట్లు, పదునాలుగువేల రాక్షసయోధుల బాణములును— రామబాణముల యెదుట లెక్కకురాక అణగిపోవుచుండ, రామాస్త్రములు నిగిడి వందలు - వేలు రాక్షసుల సంహరింపజొచ్చెను. ఆ దృశ్యము - చూపరులకు భయాశ్చర్యములు గొలుపుచుండెను. రామబాణ పరంపరలు మిడుతలతఱుచున ఎక్కడ జూచిన తామెయై సమరక్షోణి నాక్రమించి, ఏనుగుల కుంభముల పగిల్చి తోకలనుండి ఉచ్చిపోవుచు, గుఱ్ఱములతో సహా అశ్వికులను దిబ్బుమన కూలద్రోయుచు, రథికసారథుల గుదిగ్రుచ్చి యొక్కట చంపుచు, చతురంగబలసమేతముగా, రాక్షసానీకముల ఘోరముగా ద్రుంపదొడంగిన - రాకాశిమూకలు క్రమముగా పలచబడినవి - సేనానాయకుడు, దూషణుడనువాడొక మహాపరిఘమును రెండుచేతులతో పట్టుకొని రాముని చంపుదునని మీదకురాగా— రాము శరాఘాతమున వాని రెండుబాహులు దునిసిపడెను; దేహమును మిట్టిపడి కూడిచచ్చెను. త్రిశిరుడు రవంతసేపు పోరి ఘడిసెను. ఖరుడును కొంతసేపు రామునితో పోరి విరథుడై, గదాపాణియగుచు రాముంగదియవచ్చువాడు వైష్ణవాస్త్రమున పొలిసెను. ఇట్లు రాముడొక్కరుడేయైనను, నిశ్శేషముగా పదునాల్గువేల దానవులను సంహరించి, దక్షాధ్వర ధ్వంసముచేసి వెలిగిన ధూర్జటికి సాటియగుచు, మహామునుల అభినందనముల

నందుకొనిసీతాలక్ష్మణసమేతుడై సంతోషసాగరమున తేలెను.

ఈ యుద్ధములో చావక మిగిలిన రక్కసుడు - అకంపనుడనువాడు రావణుని కీ వృత్తాంతమంతయు నెఱింగించి, సీత నపహరింపుమని సలహాచెప్పెను. రావణుడు మారీచునితో నాలోచించెను. "వలదు - రామునితో విరోధము వల" దని వాడు వారించెను, అంతటితో సీతాపహరణ ప్రయత్నము రావణుడప్ప టికి మానెను. తోడనే 'ముక్కుచెవులులేని మొండి" చుప్పనాతివికృతవేషముతోవచ్చి, రావణునెదుటనిలిచి వెక్కివెక్కియేడ్చి రామునివృత్తాంతమంతయుతెలియ చెప్పి- సీతమీద ఈర్ష్యతో మండిపడుచు "అన్నా! నీ అంతఃపుర స్త్రీలలో ఏ ఒక్కతే సీత కాలిగోరికి పోలదు. మండోదరి వదినె సీతముందు- ముచ్చ బొమ్మ! జగదేకసుందరి సీత! ఆవిడె పిఱుదులు మన్మథుడి పెళ్ళి అరుగులు- ఆసీతను తెచ్చుకొని యేలుకుంటే, నీ రసికత సార్థకం అవుతుంది. నీసరదా తీరుతుంది! నా పగా తీరుతుంది! దానిమీద అడ బిడ్డరికం చెలాయించి, ధూం ధామ్ చేస్తూఉంటే నాకు నిజంగా పండుగ" అని యేమేమో చెప్పి అన్నను ఉసికొలిపినది. రావణుడు పూర్తిగా మరులుకొని సీతను చెఱతెచ్చుటకు నిశ్చయించినాడు.

మరల మారీచునింటికి వెడలి "తప్పదు, సీతను తేవాలి, రా" రమ్మనినాడు. మారీచుని బుద్ధులు పెడ చెవినిబెట్టి, 'ఇన్నిమాటలెందుకు? నామాట విని, నాతో వచ్చి, సీతను నాకప్పగిస్తే నీకు నా అర్ధరాజ్యం యిచ్చి సన్మానం చేస్తాను. మారుమాటాడితే- నీ తల నరికేస్తాను- ఏమంటావు?' అని గదిమి అడిగినాడు. మారీచుడును, "నాకు నక్కచావు వొచ్చినది. చావు ఎలాగా తప్పదు. వద్దంటే వీడు చంపుతాడు. కద్దంటే రాముడు చంపుతాడు. వీడిచేత చస్తే- చావడమే. అంతే. రాముని చేతులో చస్తే- శాశ్వతమైన మోక్ష లాభం ఉన్నది. దిక్కుమాలి చావడంకంటె, చచ్చి మోక్షం సాధిస్తే నయంకదా?" అని తనలో తాను ఆలోచించుకొని, రామబాణముతో చచ్చుటకు నిశ్చయించుకొని, పద, మరి" అని రావణునితో జనస్థానమునకు బయలుదేరినాడు.

అయోధ్యలో రాజభోగములు విడిచి, రామునివెంట సీతవచ్చుటచేత వారి దాంపత్య ప్రేమ ఎంతో పెంపొందినది. పుష్పకోమలి, సీత వనవాస క్లేశము లకు పాల్పడినదని రాముడు పడినజాలి ఆ పుణ్య దంపతులమధ్య అనురాగమును మిక్కిలి అతిశయింప చేసినది. అందుచేత వనవాసము వారికంత కష్టముగా తోచలేదు. ఇటువంటి పవిత్రప్రేమపాశబద్ధులైన సీతారాములకు వారి ప్రేమైక జీవనమునకు- పంచ వటిలో నడుగుపెట్టిన మాయలాడు మారీచుని మూల ముగా కష్టపరంపరలు ఆరంభమైనవి.

## మాయలేడి

కం. ఒడలెల్లను బంగారము
పొడలెల్లను రత్నసమితి బోలిన మెఱుపుల్
నడలెల్ల నెఱపి మెలగెడు
కడలెల్ల విలాసరేఖ కళలం దొప్పెన్.

సీతదృష్టిని ముఖ్యముగా ఆకర్షించుట కీమారీచుడు బంగారు ముద్దుల లేడియై పర్ణశాల పరిసరముల నడయాడదొడగెను. అతిరమ్యమైన ఆ మృగ సౌంద ర్యమునకు ముచ్చటపడి మెచ్చి- సీత రామునకుచూపి ఇట్లు పలికెను :

గీ. ప్రాణనాథ! కంటె పసిడిలేడి హొరంగు
వేడ్కనించు నొబగు వింత హొయలు!
చంద్రునందు లేడి జగతికి దిగియెనో?
కాక ఇట్టి మృగము కలదె జగతి!

ఆ మాయలేడి రూపురేఖలు చూచినంతనే లక్ష్మణుడు నిజముగ్రహించి, "అన్నా! ఇది నిజముగా బంగరులేడి కాదుసుమా! మాయరక్కసుని దొంగ రూపము. మనలను వంచించుటకే వాడిట్టి రూపముతో మన యెదుటకు దిగినాడు! వద్దు! ఈ లేడిని పట్టుటకు ప్రయత్నించవద్దు! వద్దుసుమా!" అని హెచ్చరించినా, సీతారాములు అతని మాటలు పాటించలేదు. "ఎలా

గైనా పట్టితెచ్చి దీన్ని నా కివ్వాలి. తప్పదు" అని సీత ముద్దులు గునిసినది.

శ్లో. "ప్రాయస్సమాపన్న విపత్తికాలే
ధియోపి పుంసాం మలినా భవంతి"

గీ. "విధికృతంబున చెడనున్న వేళలందు
బుద్ధి పరికింప కూరక పొలియుగాదె"

అన్నారు పెద్దలు. ఆ వాక్యానుసారము రామునికి మతిబోయి, లేడి వెంటబడి అడవిమార్గము బట్టినాడు. ఎండమావులను భ్రమసినట్లు, మాయలేడి వెంట బహుదూరము బోయి పోయి అలసి, దానిని ప్రాణముతో పట్టుట అసాధ్యమని విసిగి, చంప నిశ్చయించుకొని రాము డొక అమోఘబాణప్రయోగముతో దానిం బడగూల్చెను. రాముని కంఠస్వరముతో, "హా! లక్ష్మణా" అని ప్రాణోత్క్రమణ సమయమున నరచి, మారీచుడు నేలగూలి చచ్చెను.

"తమ్ముడు అంటూనే ఉన్నాడు. వీడు మాయ రక్కసుడు! చస్తూ నా కంస్వరముతో వాడు అరచిన అరుపువిని, సీతా, లక్ష్మణుడూ ఎంత బెగిలినారో! ఎలా వున్నారో! ఏమో! వాళ్ళని మళ్ళీ ఇవాళ చూస్తానో! చూడనో! మనస్సు చాలా శంకాకుల మౌతున్నది." అని తలపోయుచు, రాముడు పర్ణశాల వంకతిరిగి ఆదారిపట్టి బెగులుచు, త్వరగా అడుగులు వేయుచు వచ్చుచున్నాడు.

ఇక పర్ణశాలలో సీతా లక్ష్మణులెట్లున్నారో చూతము - మారీచుని అఱుపు చెవిని పడగానే సీతకు గుండెలు బ్రద్దలైనంత మనక్షోభం కలిగినది. "వెధవలేడిని-నేరకపోయి తెమ్మన్నాను! వారు-ఎలా వున్నారో? ఏవిటో? నాకేమీ తోచడంలేదు. చప్పున వెళ్ళు! వెళ్ళి ఆయనకు తోడుపడాలి సుమా! లక్ష్మణా!" అన్నది, సీత, గ్రుడ్లనీరు కార్చుచు గద్గద స్వరంతో. 'కాస్త తొందరగా అడుగువేసి కదులు జాలం చెయ్యకు, పద, పద' అని చాల త్వరపెట్టినది. విశ్చలధైర్యంతో లక్ష్మణుడు "కంగారుపడకండి! వదినా! అన్నగారికి వచ్చిన భయం ఏమీలేదు. ఇదంతా కృత్రిమం రాక్షసమాయ- నన్ను ఇక్కడ నుంచి కదపడానికి పన్నినమాయ. కంగారు పడకండి. కాస్త ధైర్యం తెచ్చుకొని ఓపిక పట్టండి. ఇప్పుడు నేను కదిలితి నట్టాయెనా, మీకు చాలా ప్రమాదం సంభవిస్తుంది. నమ్మండి నా మాట: నిప్పునకు చెదలంటవు: శ్రీరాముల వారికి ప్రమాదంరాదు" చెప్పతగినట్లు ధైర్యం చెప్పినాడు. కాని సీతకు ధైర్యము తాళలేదు. లక్ష్మణునిచర్య ఆమెకు మరొక విధముగా తోచినది. కోపము పట్టలేక, ఆ సంగతంతా ఆమె ఇట్లు పలికినది. "భరతుడు రాజ్యంలాక్కున్నాడు. నన్ను వశం చేసుకుందామని నీకు దుర్బుద్ధి పుట్టినది. కదలకుండా నిట్రాడిలాగ నిలబడ్డావు. ఇందుకే సవతుల కొడుకులు పగవాళ్ళన్నారు. ఎంత నసిగినా, నీకు నేను లొంగను; వశంకాను నిలువునా నీరై కూలగలవు. చూసుకో" అని కాళీకరాళమూర్తియై తూలనాడినది.

సీత మాటలకు వణకిపోయి లక్ష్మణుడు రెండు చెవులు మూసుకొని, రెండు చేతులు జోడించి "అమ్మా! నీవు నా పరదేవతవు; తల్లివి; గురుపత్నివి. నేను నీకు పుత్రునివంటివాడను. నన్ను నీవు ఇటువంటి మాటలు అనవచ్చునా? అన్నగారి సెలవైతే ఇక్కడ ఒక్క క్షణమైనా ఉంటానా? ఇంక నీకు పంచమహాభూతాలే కాపు. ఇదుగో! నేను పోతున్నా! వెళ్ళిపోతున్నాను" అంటూ తిరిగితిరిగి పర్ణశాల వంక చూస్తూ, చూస్తూ, ఉండలేక, వెళ్ళలేక, ఎంతో యాతనపడుతూ, లక్ష్మణమూర్తి వెళ్ళిపోయాడు.

"ఎప్పుడు వెళ్ళిపోతాడా! లక్ష్మణుడు!" అని, ఒడుపుకోసం ప్రతీక్షిస్తున్న రావణాసురుడు, కపటముని వేషముతో పర్ణశాల గడప చేరినాడు. వానిని చూచినంతనే సీత గుండెలు తటతట కొట్టుకున్నవి. "మాయముండా లేడి - ఎందుకు వచ్చినది? పట్టి తెమ్మని వారిని నేనెందుకు నియమించి పంపించాను? ఆ ఆర్తరవంఏ‹విటి? ఎందుకు పుట్టినట్టు? మమ్మల్ని ఎంతో భయభక్తులతో సేవిస్తున్న మఱిది - ఉత్తముడు - లక్ష్మణస్వామిని, నిష్కారణంగా మనస్సు

నొచ్చే మాటలు ఎందుకన్నాను ?" అని పశ్చాత్తాప పడి తలపోసుకొనుచుండగా, ఆమెకన్నీళ్ళు కాలవలై కారుచున్నవి. సీత బెగిలిచూస్తున్నది. దొంగముని కన్నులకు కనబడినాడు. ఆమె యిచ్చిన అర్ఘ్యపాద్యాదులు సవినయంగా అందుకొని, కుశలప్రశ్న చేసి పూర్వోత్తరము అడిగినాడు. సీత చెప్పినది.

పిమ్మట, ఆ మాయాపరివ్రాజకుడు తనసంగతంతా ఇలాగ గొప్పగా చెప్పుకొన్నాడు.

"బ్రహ్మదేవుఁడు సాక్షిత్తూ మాకు ముత్తాత. లంకాపట్నం మా రాజధాని. తెల్లారకుండా వాయువు మా పట్నంలో పాచిపన్లు చేస్తుంటాడు; వరుణుడు కళ్లాపు పని చూసుకుంటాడు. వంటలూ - వార్పులూ- అగ్నిదేవుడి పన్లు. కర్చువెచ్చాలన్నీ కుబేరుడివి. పువ్వులసేవ పురందరుడు - అంటే ఇంద్రుడిది. మా కోట కందకాలు - సముద్రాలు. నా పేరు చెబితే అందరికీ - హడలు-గడగడాటు. ఇలాగ ఒక రాజ్యం కాదు, ఒక లోకం కాదు - మూడులోకాలూ ఒక్కతాడుమీద నడిపిస్తున్నాను. రాక్షసచక్రవర్తి - రావణాబ్రహ్మను-నేను. తెలిసిందా ? నీ భర్త నరమాత్రుడు; చపలుడు; చవట; ఆ రామునితో యీ ఘోరకాంతార భూములలో పడి నీవు కుందనేల ? సకల భోగ భాగ్యము లనుభవించుచు, లంకకు రాణివై నన్ను ఏలుకో, సీతా ! ఏలుకో" అన్నాడు.

సీత వడవడ వణకినది. "బ్రహ్మ మనమడవైతే ఇటువంటి కారుకూతలు కూయవచ్చునా ? శ్రీరామునికి నీకు ఎక్కడికేవల్ల ? ఏనుగకు, దోమకుగల తేడా కనిపిస్తున్నది" అని తూలనాడగా, రావణుడు మిక్కిలి కోపించి, నిజస్వరూపముతో ఆమె యెదుట నిలిచాడు. వానింజూచి సీత మూర్ఛపోయినది. అపాళముగానే రావణు డామెను బొదివిపట్టి రథముమీద పెట్టుకొని లంకాభిముఖుడై వెడలిపోయినాడు.

అంతలో సీతకు తెలివి వచ్చినది. "లక్ష్మణా ! నిష్ఠూరములాడి నీమనస్సు నొప్పిపెట్టించినందుకు పాపఫలం వెంటనే నాకు అనుభవమవుతున్నది, రామా ! పదితలల బ్రహ్మరాక్షసుడు నన్ను ఎత్తుకొని పోతున్నాడు ! తల్లీ ! గోదావరీదేవి ! నువ్వైనా నా సంగతి రాములవారితో చెప్పవమ్మా ! ఎవరూ నా మాటలు వినిపించుకో రేమిపాపం ? అడ్డపడి ఎవరూ నన్ను విడిపించరు ! ఎందుచేత ?" అనే సీతమొఱ్ఱ దూరంనుంచి జటాయుపక్షి విన్నాడు, రావణునితో తలపడి ఘోరయుద్ధముచేసి దనుజునికి తహతహ పుట్టించినాడు. సీత నొక్కయెడ డించి, రక్కసుడు ఖడ్గము చేతపట్టుకొని, గృధ్రమును డాసి దారుణముగా ప్రహరింపగా, జటాయుదేహ మా దెబ్బలతో పజ్జియలైనది; రక్తము కాలువలై పాఱినది. పక్షిరాజు అశక్తుడై నేల కూలిపోయినాడు. సీత నెత్తుకొని, రథముమీద పదిలముగా పెట్టుకొని, ఎప్పటియట్ల దానవుడు లంకాభిముఖుడై పయనము సాగించుచున్నాడు.

ఋశ్యమూకపర్వతముమీద సుగ్రీవుడను కపిరాజు నలుగురు మంత్రులతోకూడ ఆమె కంటపడినాడు. వారు తనకు తోడుపడగలరని సీతకు విశ్వాసము కలిగినది. గుడ్డచెంగున తనభూషణముల మూటగట్టి, వానరుల మధ్యపడునట్లు సీత మూటను జారవిడిచినది. సుగ్రీవు డా మూటనుతీసి, జాగ్రతగా కొండ గుహలో దాపించియుంచెను. రావణుడు సముద్రము దాటి, ఒడలెఱుగక పడియున్న సీతతో లంకలో ప్రవేశించి త్రిజటకు సీత నప్పగించి, లాలనచేసి తన్నంగీకరించునట్లు బోధింప నియమించి అశోకవనములో పెట్టెను.

మారీచుని చంపి, కలగిన మదితో, పంచవటి మార్గమున పర్ణశాల దెస నడచుచు వచ్చు రామునికి- దీనాననముతో లక్ష్మణు డగపడెను. రాముని గుండె గుభేలుమన్నది. 'సీత నొంటిగా విడిచి ఇటేలవచ్చితి? తండ్రీ !' అని రాముడు దీర్ఘనిశ్వాసము విడిచెను. "అన్నా ! నేనెంత ధైర్యము చెప్పినను వినక, వదినె 'అగ్రజుని చేటు గోరి, అధిక పాపాత్మ ! కదలకున్నావు... ' అని దురుక్తులు- అవాచ్యములాడినది. ఆ నిష్ఠురములకు మరి నేనక్కడవిలబడలేక మిమ్మల్ని వెతుక్కుంటూ యిలాగ వచ్చాను." "ఎంతపని చేస్తివి

లక్ష్మణా! మనలను వంచనచేయదలచిన రాక్షసులు మానహాని చేయక మానుతారా? ఎంత అపయోగం?" అని దీర్ఘ నిశ్వాసాలు విడుస్తూ, పర్ణశాల చేరుకొనే సరికి, ఏమున్నది? సీతలేక చిన్నబోయి, పర్ణశాల పాడుబారియున్నది. సీత కనబడకపోగా, శ్రీరాము నకు పిచ్చియెత్తినట్లే అయినది. జనస్థానమంతా కలయవెతికినా సీత జాడ కనబడలేదు. లక్ష్మణుడు ధైర్యము చెప్పినంతసేపూ ఉత్సాహముతో విని, ఆ కాస్తసేపు దుఃఖము దిగమ్రింగి, తరువాత దుఃఖిం చుచు, రాముడు అడుగులు వేయుచు పోవంబోవ నొకచోట- ఇంకను సజీవుడై పడియున్న జటాయు వగపడెను. రావణుడు సీతను చెఱగొనిపోయిన వృత్తాంతము ఆయన్నదమ్ములకు జటాయువే విన్న వించెను. ఏప్రదేశములో సీతవృత్తాంతము దాశరథు లకు జటాయువు వినిపించెనో, ఆప్రదేశము పల్నాటిలో నేటికిని 'వినుకొండ' అను పేఱ బఱగుచున్నది. పండి తులు వినుకొండను శ్రుతపర్వతమని సంస్కృతీ కరించినారు.

పిమ్మట పక్షిరాజు- జటాయువు ప్రాణములను విడిచెను. అతడు దశరథుని మిత్రుడు. సీతనిమిత్తము రావణునితో పోరి, తనుత్యాగముచేసిన ఆత్మబం ధుడు. అందుచేత రామలక్ష్మణులకు అతనియందు అత్యంత గౌరవ విశ్వాసములు పెంపొందినవి; వార లాతని దేహమునుదహించి, దర్భపూతముగా హరిణ మాంసముతో పిండముపెట్టి, ప్రేతత్వముడిపి అక్షయ పుణ్యలోకమున కనిచిరి.

- సీతను వెతుకుచు వారు ఇంకను వెళ్ళగావెళ్ళగా యోజనదీర్ఘబాహుడగు కబంధుడు రామలక్ష్మణులం బట్టి దిగిచెను. రాము డొకబాహువును, లక్ష్మణుడు రెండవ బాహువును నరికివేయగా, వాని పాపము భస్మమైనది. వాని యభిమతప్రకారమే, వాని కళే బరము దహించినంతలో వానికి శాపాంతమైనది. వాడొక దివ్యుడై దశదిశలు వెలిగించుచు మింటదోచి, వారి కిట్లు హితము చెప్పెను. "మహాపురుషులారా, మిమ్ముమ వంచించి, మీరు లేనిసమయములో, రావ ణుడు సీతాదేవి నెత్తుకొనిపోయి లంకలో నుంచినాడు. ఒక ఉత్తమమిత్రుని తోడ్పాటు లేక మీరు వానిని సాధించి సీతను తెచ్చుకోలేరు. మీరు తూర్పుగా నడిచి, పంపాసరోవరము దాటి వెళ్ళండి. మీకు ఋశ్యమూకపర్వతము కనబడగలదు. ఆకొండమీద సుగ్రీవుడను కపిరాజు నలుగురు మంత్రులతో నివ సించుచున్నాడు. మీరు సుగ్రీవునితో సఖ్యముచేసి, అతని సాయముబడసి, రావణు వధించి, సీతను తేగలరు. అతని తోడ్పాటులేక మీరు రావణుని సాధించలేరు. కనుక జాలము చేయక, ఋశ్యమూక మునకు వెడలిపొండు" అని వారికి హితము నుప దేశించి, కబంధుడు దివమున కరిగెను.

ఆ రాత్రి అచ్చటనే వసించి, మరునాడు దాశరథులు పంపాసరోవరపు పశ్చిమతీరము చేరుకొనిరి. అక్కడనే శబరి నివసించు మతంగముని ఆశ్రమ మున్నది. ఆమె శ్రీరాముని భక్తులలో ముఖ్యముగా లెక్కింప వలసిన ఉత్తమురాలు.

## శబరి

ఉ॥ ఎంతటిపుణ్యమో? శబరి
యెంగిలి కొంటివి? వింతకాదె?

పుణ్యశీలురగు మతంగాదిమహామునులు కొందరు యజ్ఞముచేసి భగవంతు నారాధించిన పవిత్రాశ్రమము లోనే నివసించి, భక్తితో వారిని సేవించుచు, దేవ బ్రాహ్మణ సేవానిరతితో జీవితమును గడపిన పావన శీల—శబరి. వారి దివ్యాశ్రమములో వన్యఘాతుక మృగములకు సాధుజంతువులతో విరోధము లేదు. మునులు దేవతలను పూజించిన దర్భలు ఎండిపోవు; పువ్వులు వాడవు; నిత్యసౌరభముతో దేవపారిజాత ములవలె అట్లే ఉంటవి. ఈ విశేషములను శబరి శ్రీరామునకు చూపి, చెప్పి. ఇంకను ఇట్లు విన్న వించినది—'రామప్రభూ! తమరు చిత్రకూటములో నేంచేసి ఉన్నప్పుడు నా గురువులు పుణ్యలోకము పొందినారు. వెళ్ళక ముందు, వారు నాకు తెలియ పలికిన దేమంటే: శబరీ! ఇంకా కొంతకాలం నీవు

ఇక్కడనే ఉండు. సీతారామలక్ష్మణులు ప్రస్తుతం చిత్రకూటంలో ఉన్నారు. కార్యార్థులై దాశరథులు ఇక్కడకు ఈమతంగాశ్రమమునకు వస్తారు. మిమ్మల్ని సేవించుకొని తరువాత పుణ్యలోకములకు వెళ్ళవలసినదని మా గురువులు నాకు ఆజ్ఞాపించారు. ప్రభూ ! ఈ దీనురాలు సమర్పించిన ఈపండ్లు ఆరగించి నన్ను ధన్యను జేయ వేడుతున్నాను' అని విన్నవించి, తియ్యనిపండ్లు సమర్పించెను. అతి మధురములగు నా పండ్లను రాము డతిప్రీతితో భక్షించి మిక్కిలి తృప్తుడయ్యెను.

పిమ్మట శబరి "దేవా ! మీ అనుజ్ఞబడసి, ఈ దేహము విడిచి నా గురులున్న పుణ్యలోకమునకు పోగోరెదను." అని విన్నవించెను. శ్రీరాముడవశ్యముగా నట్లేచేయుమని సెలవిచ్చెను. శబరి చితిపేర్చి, అగ్నిముఖమున నాత్మార్పణము చేసుకొని, తనువు త్యజించి తానభిలషించిన పుణ్యలోకము బడసెను. శ్రీరామలక్ష్మణు లా విచిత్ర దృశ్యము కనులార జూచి ఆశ్చర్యపడిరి. పిమ్మట వారు ఋశ్యమూక పర్వతము చేరవచ్చిరి.

## సుగ్రీవుని భయము

సుగ్రీవుని అన్న ఇంద్రపుత్రుడు, వాలి బహుబల పరాక్రమశాలి. బ్రహ్మవరగర్వితుడగు రావణుడు వాలితో చాలలేక ఓడిపోగా, వాలి యారక్కసుని, తన తోకతో చుట్టిపట్టి, మహాసముద్రములలో ముంచెత్తి, త్రాహిత్రాహి యనిపించి విడిచిపెట్టినాడు, నాటినుండి రావణుడు బుద్ధిమంతుడై కిష్కింధ పొంతకు పోలేదు. మహిషరూపుడు దుందుభి యనువాడు పోరికి నిలువగా, వాలి, వాని దుమ్ములు విరిచి, డొక్కచీల్చి, స్రవించు రక్తధారలతో వాని పీనుగను ఋశ్యమూకముపై చిమ్మివైచెను. తన పవిత్రాశ్రమమిట్లు రక్తసిక్తమై, మైలపడినందుకు, మిక్కిలి కోపించి, మతంగ మహాముని "ఈ యడవిలో అడుగు పెట్టితివా, తలపేలి చచ్చెద" వని వాలికి శాపమిచ్చెను.

మునిశాపమునకు భయపడి వాలి, మతంగవన ఋశ్యమూక పర్వతప్రాంతముల వంకకైన పోవుట మానుకొనెను. తరువాత వాలిసుగ్రీవుల మధ్య వైరముపుట్టి, వాలి, తమ్ముని కిష్కింధనుండి వెడలగొట్టి, సుగ్రీవుని భార్య, రుమను కూడ అపహరించి వావివిడిచి మరదలితో బహుధూర్తంగా ప్రవర్తిస్తున్నాడు. సుగ్రీవుని మనస్సు ఈ యవమానముతో ఘూర్ణిల్లుతున్నది. మతంగశాపమునకు వెఱచి, వాలి ఋశ్యమూకమునకు రాలేదు గనుక, సుగ్రీవుడు తన నలుగురు మంత్రులతో నిర్భయముగా ఈ వనములో నివసిస్తున్నాడు.

సుగ్రీవునికి సింహస్వప్నంలాగ ఎల్లప్పుడు వాలి వలన భయమే. వాలి, ఈ కొండకు రాలేక, సుగ్రీవుని చంపుటకు, కపటమునివేషములతో శత్రువులను రప్పించి కుట్ర చేయుచున్నాడని అతని భయము. వారి తేజోవిశేషములకు వెఱగంది, అత్యంత సంభ్రమముతో మంత్రి హనుమంతునితో రహస్యముగా నిట్లనెను. ''ఆంజనేయా ! వాలి పంపగా, మనలను వెతకి చంపుటకే తాపసవేషములతో వారు ఇక్కడకు వచ్చినారని నాకు తోచుచున్నది. అలాగ కాకపోతే- నిజమైన తాపసులకు, శరచాపధారణం ఎందుకని నా శంక" అను సుగ్రీవు పలుకులకు, ధీమంతుడు హనుమంతుడు, ఇట్లు మారుపలికెను. ''అర్కతనూభవ! వీరు కపటవేషధారులుగా నాకు కనపడడములేదు ! పుణ్యశీలురైనవారిని పాపమతులని శంకింపకూడదు. వీరెవరో, ఎందుకు ఇలాగవచ్చినారో, సంగతేమిటో, అంతా కనుక్కుందాము. ఏమంటే, వీరు రాజవంశ్యులూ, రాజతేజులూ, రాజవీర్యులూ అయిన రాజపురుషులలాగ కనబడుతున్నారు. ఇటువంటి తేజస్సూ, మనోహర రూపురేఖావిలాసాలూగల మహనీయులు- దుష్టులుకారని నా మనస్సు తెలియబల్కుతున్నది. అయినా, నేను వెళ్ళి, వారి సంగతంతా కనిపెట్టి, వారి పూనికలూ, సంకల్పాలూ ఎటువంటివో కనిపెట్టి వస్తాను. తంబళ్ళ అనుమానాలు తలకెక్కించుకోక, ధైర్యంగా ఉండమని తమకు నా విన్నపము" అని

ధైర్యము చెప్పి, దీర్ఘదర్శి, హనుమానుడు రామ సౌమిత్రుల చేరనరిగెను.

దాశరథులను సమీపించి, వారికి వినతుడై, పిమ్మట ఆంజనేయుడు ఇట్లువారిని ప్రశ్న చేసెను."ఆర్యులారా! మీరు రాజపుత్రులో, యతులో మాకు బోధపడడము లేదు. మీ చిహ్నాలు- రాజచిహ్నాలు; మీ వేషాలు మునివేషాలు. మీరు ఎవరు ? ఇలాగ ఎందుకు వచ్చారు ? ఇటువంటి మునివేషాలు ధరించి, ఈ అడవులలో మీరు ఉభయులూ, ఇలాగ తిరగవలసిన అవసరం ఏమి వచ్చినది ? అని మా శంక" ఈ మాటలు విని, శ్రీరాముడు హనుమంతునిముఖం తేఱిచూచి పురుషాంతర కోవిదుడగుటచేత అతని సంగతి యావత్తూ ఒక్కమారు కనిపెట్టగలిగినాడు. కనిపెట్టి లక్ష్మణునితో ఇలాగన్నాడు. "లక్ష్మణా ! ఇతడు పుట్టు బ్రహ్మచారి. భుజబలోన్నతశాలి, ఇతని శరీరం వజ్రపంజరం! మర్మజ్ఞుడు: మంచివాడు! నమ్మతగినవాడు. విశ్వాసపాత్రుడు. జానకి వృత్తాంతం ఇతనివల్ల మనకు తెలియరాగలదని నాకు తోచినది" అనగానే హనుమంతుడు శ్రీరాముల పాదములకు సాష్టాంగ దండప్రణామము లాచరించి "స్వామీ ! నన్ను చూచినంతనే నా స్వభావము సరిగా కనిపెట్టి విశ్వాసపాత్రుడనంటిరి. ధన్యుడనైతిని. నాజన్మము సార్థకమైనది. ఈ క్షణము మొదలుకొని నాకు మీరే తల్లి, తండ్రి, యజమాని, దైవము- సమస్తము మీరేనని భావించుకొని మీ పాదములనే సేవింతును. 'మారుతస్య వేధసః' అని భయభక్తులతో పూజించు కొందును." అని విన్నవించెను.

లక్ష్మణుడును "మిత్రమా ! నీమాటలు మాకు నచ్చినవి. నిన్ను చూచినంతనే మాకు ఎంతో హర్ష మైనది. నీ పూర్వచరిత్ర వినకోరెదము" అని యడుగగా— హనుమ ఇట్లు మారుపలికెను. "ప్రభూ! నేను సూర్యపుత్రుడను, కపిరాజునైన సుగ్రీవుని మంత్రిని- పేరు హనుమంతుడు. వాయుపుత్రుడను. సుగ్రీవుని మీ బంటుగాజేసి, మిమ్ము సేవించునట్లు నేను చేయగలను. తమసెలవైతే, ఇప్పుడేవెళ్ళి, మీపాదములు గొలువ, నతని నిక్కడకు తీసుకొని రాగలను" అనెను. లక్ష్మణుడును, "వాయుపుత్రా ! నీవు సంకల్పించినట్లే చేయుము. శ్రీరాములు సాధింప లేని కార్యములు లేవు. అయినా రాజులు ఒంటరిగా వెళ్ళడం క్షత్రియధర్మంకాదు. 'బంగారమునకు వెలిగారవు హత్తుగడ' లాగ నీద్వారా రామసుగ్రీవుల స్నేహము చక్కగా హత్తుకొని ఉభయులకు శుభమూ, శ్రేయస్కరమూ కాగలదు కనుక శీఘ్రముగా సుగ్రీవు నిట తోడ్కొని రమ్ము !" అని వీడ్కొలిపెను.

ఉ. "అరయ నెంతనేరుపరియై
చరియించినవాని దాపునన్
గౌరవ మొప్పగూర్చు నుపకారి
మనుష్యుడు లేక మేలు చే
కూర దదెట్లు హత్తుగడగూడునె
చూడ పదాఱువన్నె బం
గారములోననైన వెలి
గారము కూరకయున్న భాస్కరా."

ఆంజనేయులు సుగ్రీవుని చిఱునగవుతో సమీపించి "ఓ కపికులాధీశా ! నీవు దన్యుడవైతివి. నీపుణ్యము పండినది. అనాయాసముగా నీకు శ్రీరామనిక్షేపము లభించినది. నీబెంగ లుడిగినవి; అక్కరలు తీరినవి. సంశయములు విడిచి రఘురాము నాశ్రయించి కొలువ తగును" అని భయము నుడిపి, ధైర్యమొసగి, రాము సన్నిధానమునకు తోడ్కొని వచ్చెను. సుగ్రీవుడు జడి దీరి, రామచంద్రునికి మ్రొక్కి, మచ్చికతో అతని మన్ననలను పొందెను. ఉభయులును నమ్మకము లిచ్చిపుచ్చుకొని అగ్ని సాక్షిగా సఖ్యము చేసికొనిరి. వాలివలన సుగ్రీవున కెట్టి భయములేకుండ ఉడిపి సంరక్షించెదనని శ్రీరాముడు ప్రతిజ్ఞ చేసెను. రావణుని సాధించి సీతను తెచ్చుటకు సర్వవిధముల రామునికి తోడుపడి సేవింతునని సుగ్రీవుడు ప్రమాణము చేసెను.

వాలిని చంపగల శక్తిసామర్థ్యాలు శ్రీరాములకు కలవని వారు ఏమిచేసి ఋజువిస్తే నీకు నమ్మకం కలుగుతుంది ? అని ఆంజనేయుడు సుగ్రీవుని ప్రశ్న

చేశాడు. "ఈ యేడు తాళములను ఒక్కబాణంతో కూలదోస్తే— శ్రీరాములు వాలిని చంపగల సమర్థులని నమ్ముతాను" అన్నాడు సుగ్రీవుడు. "అదెంతపని ?" అన్నారు శ్రీరాములు; మందహాసంచేస్తూ విల్లందు కున్నారు; శరంతీసి అమర్చారు.

"చ. ఘనధనువెక్కువెట్టి
　　పటుకాండము నారి నమర్చి భూరి గ
　ర్జన తెగనిండగా దిగిచి
　　సాయకమేసిన, సప్తతాళముల్
　తునిమి, నగంబుగాడి
　　యిలదూఱి, రసాతలమంటి చేతికిం
　దనరంగవచ్చె, హంసగతి
　　దచ్చెర మెంతయు, నాతతత్వరన్."

"సీ. అప్పుడు తెగిపడ్డ ఆతాళములుచూచి యచ్చెరు వొందుచు నర్కసుతుడు" సాష్టాంగ దండప్రణా మములుచేసి "రామప్రభూ ! నీ శరశక్తి ఎంత అద్భుతం ? బాణమొక్కటి సప్తతాళముల ద్రుంచి, పాతాళవివరంబు సొచ్చివచ్చె ! నా వగలన్నీ ఎగిరి పోయినవి; సందేహములు నమసిపోయినవి; వాలి భయము నన్ను వదలిపోయిన దింక. మనసు కుదట బడియె మానవేంద్ర" అని మళ్ళీమళ్ళీ దండాలుపెట్టి, ధరణి సాగిలబడి మ్రొక్కుచుండెను.

రావణుడు సీతను బలవంతముగా లంకకు చెఱ గొనిపోవునపుడు ఆమె దిక్కులుమారుమ్రోగ నేడ్చుచు, సుగ్రీవాదుల కందునట్లు వడవైచిన నగలమూట సంగతి తెలిపి, సుగ్రీవు డా యాభరణముల తెప్పించి, రామునకు సమర్పించెను. వాటిని చూడగానే రాము నకు కనుల నీరుగ్రమ్మెను. లోకమంతా అంధకార బంధురమైనట్లు తోచి, రాముడు లక్ష్మణుని బిలిచి, "లక్ష్మణా! చూడు! ఈ యలంకారములు మీ వదినె వేనా ?" అని యడిగెను. "అన్నా ! నిత్యమూ, ఉదయమే ఆమె పాదములకు నమస్కరించడం తప్ప నేను అన్యమెఱుగను. ఆతల్లి చెవులకు, ముక్కునకు, కంఠమునకు, చేతులకు- ఏమేమి ఆభరణములు పెట్టుకొనుచుండెనో నే నెప్పుడూ తలయెత్తి చూడ నైనా చూడలేదు. ఉదయం నమస్కారం చేసేటప్పుడు ఆమె పాదముల నలంకరించిన అందెలు మాత్రం నా కంటపడేవి. ఇవి ఆమెకాళ్ళ అందెలేనని పోల్చ గలిగేను, తక్కిన నగలసంగతి నాకు తెలియదు. నేను చెప్పలేను. శ్లో॥ నాహంజానామి కేయూరే, నాహంజానామి కుండలే నూపురేత్వభిజానామి నిత్యం పాదాభి వందనాత్." సీత మఱది, లక్ష్మణస్వామికి సాటి లోకములో మరొకరు కనబడరు, అంత యోగ్యుడు అతడు.

కన్నులు తుడుచుకొని, శ్రీ రాముడా మె యాభరణములను చూచి, వక్షమునకు ఒత్తుకొని, బహుభంగుల విలపించెను. ఆ విలాప ప్రకారము కందుకూరి రుద్రకవి జాలిగా ఇలాగు వర్ణించినాడు : "కన్నుల నశ్రులు గమ్మగవగచున్ ! ఔరా ! విధి వశమని తలయూచున్ ! ఏటికి ప్రాణములిక యని తలచున్ ! క్రమ్మర సొమ్ములు ఔమ్మన నొత్తున్॥ ఇట్లు చాలా సేపు దుఃఖించి, లక్ష్మణ, సుగ్రీ వాంజనేయులు ఉపశమన వాక్యములు పలుకగా విని, ఏడుపు దిగమ్రింగుకొని, రాముడు సుగ్రీవుని భయ ముడుపుటకు తానేమి చేయవలెనో తెలిసికోగోరెను.

అపుడు సుగ్రీవుడిట్లనెను. "దేవా ! వాలి మా అన్న. నాతో అతనికి సుస్థిరవైరం. అతడు నన్ను బ్రతకనివ్వడు. నాభార్య తనకు మరదలు అని సంకోచంకూడా లేకుండా, ఆమెనుకూడా లాగుకొని తన అంతఃపురంలో పెట్టుకొని, వావివరసలైనా తలపెట్టక, నీచాతినీచంగా ప్రవర్తిస్తున్నాడు. పాపం ఎప్పటికి పండుతుందో" అని వలవల ఏడ్చినాడు. శ్రీరాముడు "మీ వట్ల వాలి ఇంత పాపమునకు ఎందుకు ఒడిగట్టుకుంటున్నాడు ? అసలు మీ విరోధ ముకు మూలకారణం అడుగుతున్నాను."

సుగ్రీవుడు : మాయావి అనే రాక్షసుడు కిష్కింధ వచ్చి, మీరు లెవరైనా ఉంటే నాతో యుద్ధానికిరమ్మని ఆహ్వానించాడు. మా అన్నా, నేనూ ఇద్దరమూ కూడా ఎదట పడేసరికి, వాడు జడిసి, పరుగువుచ్చు కున్నాడు. మేము విడిచిపెట్టక, వెనుకనే పరుగెత్తి

రావడము చూచి. పారిపోయి కొండగుహలో దూరేను. మా అన్న కూడా వెళ్ళి గుమ్మందగ్గర నన్ను ఉండమని నిలబెట్టి, తానుకూడా గుహలో ప్రవేశించి తరుముకొని వెళ్ళాడు. చాలానాళ్ళు నేను గుహాముఖం కాచుకొని ఉన్నాను. తరువాత లోపల ఏదో గొప్పగొడవ జరిగినట్లు శబ్దం వినవచ్చినది. రక్తం వెల్లువలై గుహద్వారందాకా వచ్చినది. అది చూచి వాలికేదో ప్రమాదం సంభవించినదని భయపడి, శత్రులు నామీదకు రాకుండా, అడ్డుగా రాయి పెట్టి, కిష్కింధకు వెళ్ళి. జరిగిన సంగతి అంతా చెప్పేను. మంత్రులు నీవే వానరరాజువని నాకు పట్టాభిషేకంకట్టేరు. ఇలా కొంతకాలం జరిగిన తరువాత, ఒకనాడు ఆకస్మికంగా వాలి దిగబడ్డాడు. నన్ను చూచి కోపంతో మండిపడి "వీడెప్పుడూ నా చేటు కోరే ఒక చెనటి బ్రాహ్మణ చిన్నవాడికి—— వీడిలాగే అన్న బతకడం ఇష్టంలేక 'అబ్బిగాడుచస్తే వాడిపొత్తుపంచ నాకు వస్తుంది' అన్నాడట. వాడు పొత్తు పంచకోరినాడు. వీడు నాచావు, నారాజ్యం కోరినాడు" అని ఉగ్రుడయ్యాడు. "నేను నీచావు కోరలేదు; నీరాజ్యమూ కోరలేదు—— నేనిప్పుడే పోతాను. నీరాజ్యం నాకు అక్కరలేదు. నీమంత్రులు నన్ను ఏలమంటే సరేనన్నాను. నువ్వు క్షేమంగా తిరిగివచ్చావు; సంతోషం. నీవే నీరాజ్యం ఏలుకో. నన్ను కటాక్షించు" అని నమస్కారంచేసి క్షమాపణ కోరాను. ఉఁహుఁ. నా భార్యనుకూడా తన అడాలోనే ఉంచుకొని నన్ను గెంటేశాడు. మతంగ శాపంవల్ల ఋశ్యమూకం మీదికి రాడుగనుక నేనూ, నా మంత్రులూ నిర్భయముగా ఆకొండమీద బ్రతుకుతున్నాము.

"అయితే అతన్ని యుద్ధానికిపిలు- ఏమున్నది? చంపేస్తాను. తగువు తీరిపోతుంది." అన్నారు శ్రీరాములు.

సుగ్రీవుడు కిష్కింధవెళ్ళి ఒక్క బొబ్బపెట్టి వాలిని యుద్ధానికి పిలిచినాడు. (తెనుగు దేశంలో ఇప్పటికీ, పెద్ద బొబ్బలను, 'సుగ్రీవ బొబ్బ' లనడం లోకోక్తి అయినది. అంత పెద్ద బొబ్బపెట్టి వాలిని యుద్ధానికి రమ్మని సుగ్రీవుడు పిలిచినాడు. కోపముతో మండిపడి, వాలి సరభసముగావచ్చి సుగ్రీవునితో తలపడినాడు. శ్రీరాముడు విల్లు పట్టుకొని బాణము అమర్చి పొంచొని చూస్తున్నాడు. కాని అనుకోని చిక్కు, గట్టి చిక్కు, ఒకటి సంప్రాప్తమైనది. వాలి సుగ్రీవులిద్దరును అన్నదమ్ములు. వారి రూపు, రేఖ విలాసములు, ఒక అచ్చున గ్రుద్దినట్లు ఒకలాగే ఉన్నవి. వాలి ఎవరో. సుగ్రీవుడెవరో, పోల్చుకోలేక రాముడు తడబడుతున్నాడు. 'వాలిని కొట్టబోయి పొరపాటున సుగ్రీవునేకొట్టి చంపుతానేమో! అంతకంటె మిత్రద్రోహం ఏమి ఉంటుంది?' అని భయపడి ఎత్తినబాణం దించవలసి వచ్చినది. వాలి దెబ్బలకు తాళలేక సుగ్రీవుడు ఋశ్యమూకంవైపు పరుగెత్తి వచ్చేశాడు. రామునిచూచి సాగ్రహంగా "నీలాంటి శూరుడు అన్నమాట తప్పి నమ్మించి గొంతు కొయ్యవచ్చునా?" అన్నాడు. "మిత్రమా! నేను సర్వసిద్ధంగా ఉన్నాను. బాణంతీసి నారిలో సంధించి పట్టుకున్నాను. కాని మీ అన్నదమ్ములిద్దరూ ఒక్కలాగ ఉన్నారు. కొంపదీసి నాబాణం నీకు తగిలి నిన్ను చంపుకుంటానేమో అని జంకిపోయాను. ఏదైనా ఒక ఆనవాలు—లక్ష్మణా ఒక పుష్పమాలికతో సుగ్రీవుని కంఠం అలంకరించు. అప్పుడిక పొరపాటు జరగదు" అని రాముడు తమ్ముని కాజ్ఞాపించగా లక్ష్మణుడు చక్కని గజపుష్పమాల తయారు చేసి, సుగ్రీవుని మెడలో వేశాడు. ఇక రాముడు పొరబడవలసిన పనిలేదు సరేగదా, ఆ పూలదండతో సుగ్రీవునికి ఉత్సాహ బలపరాక్రమములతో క్రొత్త వికాసము లభించినది.

ఈ లాంఛన చిహ్నము ధరించి, సుగ్రీవుడు, మళ్లీ కిష్కింధాపుర ద్వారంచేరి, గర్జించి బొబ్బపెట్టి మహా నినాదంచేసి, 'రా! నాతో యుద్ధానికి ర'మ్మని వాలిని మరొకమారు పిలిచాడు.

అది విని, మహోగ్రుడై, వాలి మళ్ళీ యుద్ధానికి సిద్ధపడి తొందరగా వెళ్ళబోతూఉంటే- అతనిరాణి

తార అడ్డుపడ్డది. "ప్రభూ! నామాట వినండి! ఇన్నాళ్ళలాగాకాదు, సుగ్రీవుడు శ్రీరాముని శరణు పొంది మైత్రి సంపాదించి ఆధైర్యంతో మిమ్మల్ని పిలుస్తున్నాడు. ఈమాటు మీరు గెలవలేరు సుమండీ! వినండి నామాట! యుద్ధం మానండి! మీతోడబుట్టిన తమ్ముడితో ఎల్లకాలమూ విరోధమేనా? చాలు! ఈపాటికి చాలించండి, '*సుస్థిరవైరం బనుజన్మతో తగదు-కూడదు*' అన్నారు పెద్దలు. ఇకనైనా సఖ్యంగా శాంతంగా దినాలు పోనీండి. అతని భార్య నతనికి ఇచ్చెయ్యండి. ఏదో కొంత అడవి, కొన్ని కొండలు అతనికిచ్చి ఏలుకొని బతకమనండి" అని హితవు చెప్పినది. బలగర్వితుడు, మదాయత్తచిత్తుడు అయిన వాలి ఆమాటలు పాటించలేదు. తారను తోసివేసి, సుగ్రీవుని చంపుతానని, సరభసంగా పరుగెత్తి వెళ్లాడు వాలి. అంత్యకాలం సమీపించినపుడు, ఏ వ్యక్తులూ హితము పాటించరు; పాటించలేరు కూడాను.

పోరికివస్తూనే వాలి సుగ్రీవుని ఒక్కగుద్దు గుద్దగా దేహం యావత్తూ రక్తమయం అయింది. కాస్త తేరుకొని సుగ్రీవుడు ఒకగొప్ప మద్దిచెట్టు పెరికి, దానితో గట్టిగా ఒకదెబ్బ కొట్టేసరికి, వాలి మూర్ఛపడిపోయినాడు. కొంతసేపటికి తెలివితెచ్చుకొని, లేచి, తమ్మునితో మళ్ళీ తలపడినాడు. బాహాబాహి, ముష్టాముష్టి, దంతాదంతి, నఖానఖి, పాణీపాణి-వారిమధ్య ద్వంద్వయుద్ధం కొంతసేపు నడిచింది. సుగ్రీవుడు, సాలలేక, వాలికి చిక్కి లొంగిపోతున్నాడు. వాలి తాలూకు బలపరాక్రమాలనూ, మెడలో పూలదండ లేకపోవుటనూ గమనించి శ్రీరాముడు వాలిని సరిగా పోల్చుకొని, ఇక ఆలస్యము చేయకూడదని

"ఉ. సాలము పొంతనిల్చి
రఘుసత్తము డమ్మరివోసి, శద్ది వి
న్మూలముగాగ విల్దిగిచి
దృష్టియు ముష్టియుగూర్చి, గోత్రభృ
త్కూలము వజ్రపాతహతి
కూలు విధంబున నేసె న
వ్వాలి ప్రతాపశాలి మృడు
వందనశీలి సురాలి మెచ్చగన్."

అని కవయిత్రి మొల్ల వర్ణించినట్లు రామాస్త్రపతితుడై వాలి నేలగూలినాడు.[1] లోతు రొంపిలో దిగబడి, లేవలేని ఏనుగులాగ వాలి కూలబడి మరి లేవలేకపోయినాడు. ఎదుటికి వచ్చిన రామునిచూచి, వాలి చాలా దుఃఖపడి "తార చెబుతూనే ఉన్నది; విన్నానుకాను; నువ్వు మహాధార్మికుడవంటే కాబోలు ననుకొని నమ్మి మోసపోయాను. కార్య మెఱుగక రొంపిలో దిగబడ్డాను."

"రామా! న్యాయమెఱుగక చంపితివి! నర
నాథ! పాపము కట్టుకొంటివి! పోయవు!
ఇంతేకాక నీవొక భూమిపతివా?
శ్రీరామ: నీరామ చెఱగొన్న రావణుని
వారధుల ముంచితిని వాలమునచుట్టి!
ఒకమాట నాకు చెప్పకపోయితివిగాక
సకలదైత్యుల దున్మి జానకిని దేనే!"

---

1. శ్రీరాముడు వాలిని గూలనేసిన ఘట్టము- కందుకూరి రుద్రకవికూడ చాలా సొగసుగా వర్ణించినాడు - అది యీ దిగువ వ్రాయుచున్నాను!

"ఉగ్రనిశ్వాసముల్ హుమ్మని వెడల,.... ఉరగేంద్రనిభమైన ఒక దివ్యశరము తిరమొప్ప సంధించి తెగనిండ దిగిచి! వానరాధీశ్వరు వక్షస్థలంబు పూనిక గుఱిచూచి పొంచి యేయగను! ననలకీలలుగ్రమ్మ నమ్మహాశరము చని వాలి తొమ్ము వెచ్చని నెత్తుటొలుక! సరికట్టైనప్పుడు.... శరము తోడనుకూడ జగతిపైవ్రాలె! ప్లవగనాథుని దూఱిపాఱ శేదయ్యో!"

వాలి దురవస్థ తార విన్నది. తొందరగా వచ్చి చూచినది. దుఃఖముతో కోపించి ఆమె శ్రీరాము నాక్షేపించి, నిందించినది. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు సుగ్రీవ విజయ గ్రంథమునందు విమర్శించి వ్రాసినట్లు[2] — శ్రీరాముడు చెట్టుచాటున పొంచి, వాలి మేన గాడనేసిన వాడిములకుల కంటె-ఇక్కడ తార రామునెదుట ప్రత్యక్షముగా నిలిచి, అతని యంత రంగమునొచ్చినోవునట్లు ప్రయోగించిన క్రొవ్వాడి పలుకుములుకులు చదవండి :

"అలి జెఱగొని పోయినట్టి దశాస్యుడుండగ,
నిర్నిమిత్తము
వాలినేటికి చంపితివి, రఘువంశతిలకా ?
ఇట్టి సాహసకర్మ మెచటికినేగె భరతుడు
సీమ వెడలగ
గొట్టి రాజ్యము పుచ్చుకొన్నెడ, కువలయేశా ?
నాయమేటికి దప్పితివి, రఘునాథ !
జానకి తోడనే చెఱ
బోయెనే నీ రాజనీతియు, భూరిమతియున్ !"

* * *

వాలి యనంతరము సుగ్రీవుడు కిష్కింధకు పట్టాభిషిక్తుడై, రాజ్యము మంత్రులపై పెట్టి సుఖ విలాసగోష్ఠితో ప్రొద్దులు పుచ్చుచుండెను. వర్షకాలము త్వరలో సమాప్తమయ్యే దినములు చేరవచ్చినవి. బుద్ధిమంతుడగు హనుమంతుడు రామకార్యమును మఱచి సుఖముగా దినములు గడుపుతున్న సుగ్రీవుని మందలించి, కార్యావసరము లెఱిగించెను. సుగ్రీవు డా హితోక్తుల కలరి, వానరసర్వసేనాధిపతి నీలుని బిలి పించి, వానరసైనికులందఱును తనయాజ్ఞగా వారము దినములలో కిష్కింధకు వచ్చితీరవలెనని శాసించి, లోకమంతటను ఈ శాసనము చాటిరండని తగిన ఉద్యోగులను నియమించెను. వారట్లేచేసిరి. ఆ యాజ్ఞానుసారం వానరసేనలు వారములోగా కిష్కింధ చేరుకొనినవి. ఈ సంగతి ఇపుడే చదువగలము. బహునిశితమైన సుగ్రీవు నాజ్ఞానుసారము కపివరు లందఱు వచ్చి వ్రాలుటచేత అవిలంఘనీయములైన ఆజ్ఞలు మన దేశములో లోకోక్తులై నేటికిని "సుగ్రీవాజ్ఞ"లన బఱగుచున్నవి.

రామ, లక్ష్మణ, సుగ్రీవ, హనుమదాదులందఱును కిష్కింధకు రవంత దూరములో నున్న విశాల ప్రదేశములో సమావేశమైరి. అంతలో నానాదేశముల నుండి కపివీరు లచ్చటికి వచ్చి చేరిరి. వినతుడను వానరవీరుని ససైన్యముగా తూర్పున కంపి తూర్పు దేశము లన్నింటిలో సీతను వెతకి నెలరోజులలో

---

2. చూడండి - కందుకూరి రుద్రకవి రచించిన సుగ్రీవ విజయము - పీఠిక శ్రీ ప్రభాకరశాస్త్రిగారి విమర్శ. శ్రీకపిలేశ్వరపుర అధినాయకులు ప్రకటించినది. సప్తతాళములపైవేసిన రామశరము ఆ చెట్లనుగూల్చుటేగాక-భూమిని గాడి రసాతలమంటి క్రమ్మఱ రాము తూణీరము చొచ్చెను. వాలి ఎంతటి బలశాలి ! రామ బాణము అతని దేహము భేదించి వెడలజాలక-అతని శరీరము లోనే చిక్కుపడి నిలిచి ఉండిపోయినది. వాలి యొడలు వజ్రకఠినమై రామ బాణమును నిరోధించి, నిల్వరించి, నిలువగలిగినది. ఈ విశేషము రుద్రకవి చక్కగా వర్ణించితెలిపి, వాలి బలసామర్థ్య ముల నద్భుతముగా చిత్రించి వంద్యుడైనాడు.

తిరిగిరమ్మని వానరరాజు నియమించెను. అట్లే దక్షిణదిశకు హనుమదాదులను[3], పశ్చిమమునకు సుషేణుని, ఉత్తరమునకు శతబలిని పంపెను. నెల నాటికి తూర్పు, పశ్చిమ, ఉత్తర దిక్కుల కరిగిన వానర వీరులు సీత ఎక్కడను కనబడలేదని తెలిపి హనుమంతుని రాకకోరుచున్నామనిరి.

(సశేషము)

---

3. హనుమంతుడు, జాంబవంతుడు, అంగదుడు లోనగు వానర వీరులను పంపకముందు సుగ్రీవుడు హనుమంతునిట్లు ప్రశంసించెను. "బుద్ధిమంతా! రామకార్య ధురంధరుడవను బిరుదుతో శాశ్వతప్రఖ్యాతి పొందుటకు నీకు మహత్తరమైన అవకాశము నేడు లభించినది. పంచభూతములు నీకు తోడుపడగలవు. శత్రువులు ఎవరు, ఎప్పుడు, ఎక్కడ ఎదిరించినప్పటికీ నీకు జయము నిశ్చయము. మా కందరికి మిక్కిలి ప్రీతికరమగు రాముకార్యమును సాధించి చిరకీర్తితో మనుము." అని ప్రోత్సహించెను. చిఱునగవుతో శ్రీరాముడు హనుమ నిట్లు ప్రశంసించెను. "సుగ్రీవా! హనుమంతుడు ఉన్నత నీతివంతుడు; అద్భుత తేజశ్శాలి. అందుకు తగిన శక్తియుక్తులు, సాహస విక్రమ ఉత్సాహములు కల ధీమంతుడు. ఇతనిని తొలిసారి చూచినపుడే మన కార్యసిద్ధి ఇతని మూలముగా అవగలదని నాకు స్ఫురించినది. ధీమంతుడా! సీతను చూచివచ్చి, ఆమె కుశలవార్త మాకు ఎఱిగించి నాప్రాణములు నిలిపి మా వంశము రక్షించగల ధీరుడవు నీవే! కనుక నీకే భద్రముద్రిక ఇస్తున్నాను. తీసుకొని, పట్టుకువెళ్లి సీతకివ్వు. ఇత్తివా-ఆమె, కం॥ మానగ నీ ముద్రిక గని! మానసమున సంతసించి మారుతసుతుని। న్నేనిట బుత్తెంచితినని। జానకి సత్కృతులు నీకు సమ్మతి జేయున్."-అని అత్యంత ఆదర, అభిమాన విశ్వాసములతో రాముడిచ్చిన అంగుళీయకము 'నిజనామాంకిత, కాంచన, మణిగణ, కమ్రకిరణ, సదమల, శోభా, కనదంగుళీయకము'ను శిరమునదాల్చి హనుమంతుడీ యనుగ్రహమునకు నుబ్బి, కపులమధ్య గంతులువైచి, ఎల్లవారిని నవ్వించి సంతోషపరచెను.

# గీతాగానము

శ్రీ మోటూరి వేంకటరావు

## చతుర్థాధ్యాయము

### జ్ఞానయోగము

అటులు కర్మయోగ సరణి
నర్జునునకుఁ దెలిపి మఱియు
హరి వచించె నిటు జ్ఞానమ
హత్తర యోగమును గూర్చి.

"అవ్యయ మగు నీ యోగము
నర్కునకు నేఁ దెలిపితి,
నతఁడు మనువునకుఁ జెప్పఁగ
నతఁ డిక్ష్వాకునకుఁ దెలిపె.

పరంతపా! ఇటుల్ పరం
పరాగత మ్మైన యట్టి
వరయోగము రాజర్షులు
కర మెఱుంగఁ గలిగిరి - అది
చిరకాలము వలనఁ జెడెను.

ఆచరణయె లేక మూల
నడఁగి యుండు జ్ఞానయోగ;
మాదియైన దాని మూల
మరయుమ - భక్తుఁడవు సఖుఁడ
వైనందుకు వినిపించెద
నతి రహస్య మగు దానిని."

అంతఁ గ్రీడి పలికె "జనన
మందితి వీ విపుడు; మున్నె
అవతరించె భానుఁడు; సృ
ష్ట్యాదినె రవి కెట్టులఁ దెలి
యంగఁ జెప్పినాఁడవో, నే
నరయఁ జాలకుంటిని - నా
కద్దానిని దెల్పు మయ్య!"

అనుడు కృష్ణుఁ డనె "నిర్వర
మనేకమ్ము లగు జన్మము
లందియుంటి, మెఱుఁగుదు నే
నవ్వానిని - నీ వెఱుఁగవు.

జనన మెఱుఁగనట్టివాఁడఁ
జావు లేని శాశ్వతుఁడను
సర్వము నియమించు నట్టి
శక్తియుతుఁడ నయ్యుఁ బ్రకృతి
సహజ మాయచే జనింతు.

ఎపుడు సడలునో ధర్మ,
మ్మెపు డధర్మ మేచునో, నే
నపుడె పుట్టుచుందు భువిని
విపుల ధర్మమును గావఁగ.

సాధుజనుల రక్ష కొఱకు
సమద ఖలుల శిక్షకొఱకు
సద్ధర్మముఁ గాచుటకై
సంభవింతు యుగయుగాన.

అఖిల జన్మ కర్మ రహ
స్యమ్ములు నాచేత విదిత
మైన యట్లు నమ్మి తెలిసి
నట్టి మనుజుఁ డర్జున ! దే
హమ్ము విడిచి మఱల జన్మ
మందఁడు నన్నుఁ బొందఁ గలిగి.

వీత రాగ భయ క్రోధ
విబుధులు, నన్నాని నాకు
వేఱుకాని వారు, శరణు
వేడుకొనెడువారు, తపో
విజ్ఞానముచేఁ బునీత
విధులను నన్నుఁ బొందఁగలరు

ఎవరెవ రెట్లెట్లు నన్ను
బ్రవిమల గతిఁ గొల్తురొ నే
నవిరళ కృపఁ బ్రోతు వారి;
భువిని బెక్కు వితముల మా
నవు లెల్లరు నా త్రోవల
నవిరతమ్ము ననుసరింత్రు

కర్మ వలనఁ గలుగు ఫలముఁ
గాంక్షించెడు వారలు నా
కవు వానులఁ గొల్తు, రుర్విఁ
గర్మలచే ఫలములు వే
గముగా సిద్ధించును గద

* త్రిగుణ కర్మ రీతులు నా
లుగు జాతులుగాఁ బొడమెను—
జగతి వాని కర్తగ నే
నగుచుఁ బ్రకృతి వశుఁడఁగామి
నెగడెద సుమి అకర్తగను.

కర్మలు నను ముట్టఁ బోవు-
కర్మ ఫలము నేఁ గోరను-
కడఁగి దీనిఁ దెలియువాఁడు
కర్మ బంధములఁ జిక్కఁడు.

కర్మ లాచరించితి మను
గరువము ఫలకాంక్ష లేని
ఘన ముముక్షులే కర్మలు
గావించిరి కద—అ జన
క ప్రభృతుల గతి నీవు స్వ
కర్మల నొనరింపుమయ్య.

కర్మాకర్మముల నడుమ
కవులె మోహమొందుచుంద్రు -
కాన అశుభమును వీడి అ
ఖండ ముక్తి దేనివలనఁ
గనఁ గలవో అది తెలిపెద.

శాస్త్ర సుముఖమగు కర్మను
శాస్త్ర విమతమగు దానిని
పరిచూచి అకర్మను గను-
చనదు కర్మతత్వ మెఱుఁగ.

కర్మల నేఁ జేయలేదు -
కర్మ లింద్రియముల వలనఁ
గలిగెనంచుఁ గర్మయం ద
కర్మను, గర్మముగఁ దగ న
కర్మను నొగిఁ గనెడు వాఁడె
ఘన బుధుఁడగు కర్మవిదుఁడు.

కాంక్షను దునుమాడి నియత
కర్మ నెవఁడు సల్పునొ ని

*సత్వ రజస్తమములు త్రిగుణములు. అందు రజము క్రమముగ సత్వముతోఁ దమముతోఁ గలయఁగ సత్వము, సత్వరజము, రజస్తమము, తమము, అను నాలుగు జాతులు వెలసినవి.

క్షముగ జ్ఞానాగ్ని చేతఁ
గాల్పఁబడిన కర్మలు గల
కడు నేర్పరియంచు విబుధ
గణము వచించెదరు పార్థ !

సతతము సంతృప్తి, నిరా
శ్రయు, మెసఁగఁగఁ గర్మపు ఫల
సంగ రహితుఁడగు నాతఁడు
సలిపి కర్మ నలుపఁడుగద.

తన మానసమును నాత్మను
దన వశమ్ము చేసి, సర్వ
మున నిగ్రహమూని, ఆస
గొనక, కేవలము శరీర
మును బ్రోచుటకై సలిపెడు
పనుల నరుఁడు పొందఁ డఘము.

తనకుఁ దా లభించు దానఁ
దనివి సెంది, జంట లన్నిఁ
టిని దొలంగి, మచ్చరమ్ము
నణఁచి, కల్గు దానికిఁ గ
ల్గని దానికిఁ గలఁత పడక,
పనులను నెరవేర్చు నట్టి
మనుజుఁడు బంధింపఁబడఁడు.

ఆశాబంధము లడంగి,
అచల జ్ఞానాప్త చిత్తుఁ
డగు ప్రాజ్ఞుని యజ్ఞార్థ
మ్మై పొసంగు కర్మ శేష
మావంతయు లేక మాయు.

అర్పణము హవిస్సును హో
మాగ్ని హోమ కర్త్ర. కర్మ
లన్నియు బ్రహ్మ స్వరూప.
మా కర్మ సమాధి నున్న

అతఁడు గాంచు యజ్ఞఫల
మ్మదియుఁ గూడ బ్రహ్మమగును.

దైవ యజ్ఞమును గొల్తురు
దగ బ్రహ్మానిలమునఁ గొం
దఱు యోగులు ; యజ్ఞ పదా
ర్థము నాత్మను యజ్ఞాకృతిఁ
దవులఁ గట్టెదరు కొందఱు.

సంయమాగ్నిచేఁ గొందఱు
చక్షువు మొదలైన యట్టి
సర్వేంద్రియముల వేల్తురు;
శబ్దాదిక విషయములను
సర్వేంద్రియ కీలలందు
సతతము నర్పింత్రు వేఱు
జను లుర్విని బాండుతనయ !

ప్రాణకర్మ లెఱుఁగుటచేఁ
బ్రజ్వలించు నట్టి ఆత్మ
వర సంయమ మనెడు యోగ
పావకమున నింద్రియాను
భవ కర్మల లయము సేయ
భావింతురు మఱికొందఱు.

అరయ, దపోయాగ, మాగ
మాధ్యయనపు యోగయజ్ఞ
మా పదార్థ దానయజ్ఞ
మదియుఁగాక జ్ఞానయజ్ఞ
మతుల శితవ్రత మఖ మొగి
నాచరింతు రితర జనులు

కుడిముక్కున గాలిఁబీల్చి
యెడమవైపు విడిచి, యట్లె
యెడమనుండి గాలిఁబీల్చి
కుడితట్టున విడిచిరెంట

విడవక ప్రాణాయామము
దొడరి సల్పెదరు కొందఱు

పూని బైటి గాడ్పులందె
లీనము గావించి మఱియు
లోన వెలయు గాలుల న
వ్వానిలో లయమ్మొనర్చి
జ్ఞానులు నియతాహారులు
గా నెసంగి నిఖిల యజ్ఞ
మానిత కర్మల నెఱింగి
కానరుగద కలుషమ్మును.

యజ్ఞము లొనరించి పిదప
యజ్ఞశేష మైనయట్టి
యమృతాన్నము దిను నాతం
డా సనాతన బ్రహ్మము
నందు యజ్ఞునకుఁ గల్గ ది
హ, మ్మెటు లొదవ న్యమ్ములు ?

బ్రహ్మ ముఖమునం దీ గతి
బహు విధ మఖ నికరమ్ములు
పరఁగెఁ, గర్మజములుగఁ ద
ద్బహుళ యజ్ఞముల నెఱింగి
పడయుము కౌంతేయ ! ముక్తి

ద్రవ్య సాధ్యమై చను న
ధ్వరము కన్న జ్ఞాన సుసా
ధ్య మ్మగు యాగము మేలగు,
దాని యందుఁ గర్మ ఱడుఁగ-

బ్రహ్మ జ్ఞానేశ్వరులను
భక్తిని సేవించి వారిఁ
బ్రశ్నించి యమూల్యమైన
బ్రహ్మ జ్ఞానోపదేశ
భాగ్య మొందుమో యర్జున !

దేని నెఱింగిన మోహముఁ
బూనవో, భూతాళిని నె
ద్దానివలన నీలో నా
లోనఁ గాంచఁగలవో యది
జ్ఞానమని గ్రహింపు మనఘ !

పాపు లందఱను మించిన
పాపివైన సరే - సకల
పాప పయోధిని దరింపఁ
బడవ కదా సుజ్ఞానము.

అగ్ని రగిలి, బొగులు కట్టి
యల భస్మ మొనర్చు రీతి
నఖిల కర్మ నికరము జ్ఞా
నాగ్ని దగ్ధ మొనరించును.

జ్ఞానము వలెఁ బరిపూతం
బైన దొండులేదు : యోగ
మూని సిద్ధి నొందినట్టి
మానిసి తన యంతరాత్మ
లోనఁ గాంచు స్వయముగఁ గా
లాను భావ్యముగను బార్థ !

పరమం బగు జ్ఞానంబును
బడయఁ గోరు వాఁడు శ్రద్ధఁ
బరఁగు నట్టి వా డింద్రియ
వశుఁడు కాని వాడు మోక్ష
పదవి నొందు శీఘ్రగతిని.

జ్ఞానము శ్రద్ధయును లేని
సంశయాత్ముఁ డెందును నా
శము నెందును వాని కెన్న
జగము పరమ సుఖము సున్న

(సశేషం)

# వ్యాస తాత్పర్యనిర్ణయము

శ్రీ వీరఘంట సత్యనారాయణశాస్త్రి

(గత సంచిక తరువాయి)

మధ్యస్థులనగా — వాది ప్రతివాదులకు అభిమతమయిన పక్షద్వయమునందు స్వపక్షత్వాభిమానము శూన్యమయి ఆ రెండుపక్షములందలి బలాబలనిర్ణయ కుశలురగుటయే.—ఇట్టి మధ్యస్థత్వము బాహ్యమత ప్రవిష్టులకు సంభవించునని చెప్పుదురా ? లేక కపిలాది తన్త్రప్రవిష్టులగువారికి సంభవించునని చెప్పుదురా ? లేదా వేదాన్తశాస్త్ర ప్రవిష్టులగువారికి సంభవించునని చెప్పుదురా ?

ఇందు మొదటిది సంభవించనేరదు. బౌద్ధ - ఆర్హత - చార్వాకాది బాహ్యమత ప్రవిష్టులగువారు వేదప్రామాణ్య మంగీకరింపనివారగుటచే ఉపనిషదధ్యయనాభావముచే నాయుపనిషత్తులయందలి ఉపక్రమోపసంహారాది షడ్విధతాత్పర్య లింగస్వారస్య బలాబలనిర్ణయ సామర్థ్యము లేనివారగుటచే వారికి మధ్యస్థత్వప్రసక్తియే లేదు. వేదాక్షర శ్రవణమునకు గూడ అనధికారులగుటచేగూడ వారి సన్నిధానమందు వేదాన్తవిచారము ప్రత్యవాయకరంబు నగుచున్నది.

రెండవదియునుకాదు. కపిల-కణాద - గౌతమాది మతప్రవిష్టులు ఇప్పుడెచ్చటను కనబడకపోవుటచే వారికికూడ మధ్యస్థత్వకల్పన అభిత్తిచిత్రాయమాణమటు యున్నది. జీవానేకత్వము-ప్రపఞ్చసత్యత్వము-పరక్షేత్రజ్ఞ భేదవాదిత్వము మొదలగువానియందు అభిమానముచే పక్షపాతముకలవారగుటవలన వారికి పూర్వమందుచెప్పబడినట్లు మధ్యస్థత్వము సంభవింపనేరదు.

మూడవదియునుగాదు— వేదాన్తశాస్త్ర ప్రవర్తకులయిన భాష్యకారాదుల మతమునందు ప్రవేశించిన వారిలో భగవత్పాద - రామానుజ - మధ్వ - శ్రీకణ్ఠ - మత చతుష్టయమునందు ప్రవేశించినవారే ఎక్కువగా నుండుటవలన వారిలో వారికి పరస్పర విరుద్ధమయిన భేదాభేదములయందు ఒక్కొక పక్షమవలంబించిన వారగుటచే ఆ ఉభయవాదులకు అంగీకారమైన మధ్యస్థత్వము గగన కుసుమాయమానమయినది. మరియు వాని ప్రతివాది జ్ఞాన తారతమ్య నిర్ణయ వ్యాపారమునందు కృతార్థులగుటచే తత్వ నిర్ణయ వ్యాపారమునందు వారికి పరంపరా ప్రాప్తమయిన గురూపదిష్టమయిన స్వమతాభిమాన దురాగ్రహము నివారించుటకు శక్యమయినదికాదు. కనుకనే "వాది దౌర్బల్యం వినా న మతదౌర్బల్యం" వాది దౌర్బల్యము గాని వాద దౌర్బల్యము లేదనియెడి సామెత సిద్ధించుచున్నది. అందువలన యుక్తి మాత్రబలముచే గాని, శ్రుతి మాత్రబలముచే గాని యుక్తి సహకృతశ్రుతి మాత్రబలముచే గాని, మధ్యస్థ విద్వత్సన్నిధాన బలముచే గాని, తత్తద్వాదులచే నంగీకరింపబడిన కూట సాక్షివాక్య సదృశములయిన సూత సంహిత - బోధాయనవృత్తి మొదలగువానిచే అనుగ్రహింపబడిన భగవత్పాద రామానుజాది భాష్యగ్రన్థ పర్యాలోచనచే గాని ఈ యర్థమే వ్యాస తాత్పర్య విషయమని ఎవరిచేతను నిర్ణయించుటకు శక్యముకాదు. అట్లయినచో నీవుమాత్రము వ్యాస తాత్పర్య విషయమిదియేయని ఎట్లు నిర్ణయించగలవని యందురా ! వినుడు.

స్తోత్ర భాష్యమునందు హరిహరులలో సత్వ గుణాశ్రయు డెవడని సంశయము కలుగగా "స్యాన్నాగర ద్రావిడ వేసరం చక్రమేణ వై సత్వ రజస్తమాంసి, మహీసురోర్వీపతి వైశ్యకాశ్చ హరిశ్చ

ధాతా హర ఆదిదేవః" అని మధ్యస్థ శిల్పశాస్త్ర వచన బలముచే సత్వగుణాశ్రయుడు విష్ణువే యని వేదాన్తాచార్యునిచే నిర్ణయించబడినది.

చతుర్వేద తాత్పర్య సంగ్రహమందు శివ నారాయణులలో నెవరికి నమస్కారము చేయవలెనను సంశయము రాగా "వజ్రిణ్యా ముద్రయా శక్రం పద్మిన్యా దర్శయేద్విధిం, శంఖిన్యా కేశవం రుద్రం శిరస్యంజలిముద్రయా" అని మధ్యస్థ భరతశాస్త్ర వచనబలము ననుసరించి "యా శంఖినీభవతి శంకర! వజ్రిణీయా ముద్రాచ యా కమలినీ భరతోపదిష్టా తాభిర్భవ_స్త్యభినయా విబుధాన్తరాణాంమౌళి స్పృశా కరపుటాంజలిముద్రయా తే" అని సుదర్శనాచార్యునిచే శివునమశ్శేషిత్వమని నిర్ణయించబడినది.

ఆ ప్రకారమే యిచ్చటను పూర్వోక్తములయిన భగవత్పాద - రామానుజాది భాష్యకారుల అభిమతార్థములలో ఏ అర్థమునందు వ్యాస తాత్పర్యము కలదను సంశయము రాగా తన్నిర్ణయము కొఱకు మనకు మధ్యస్థులుగా నేర్పడియున్న కపిల - కణాద-గౌతమ-పతఞ్జలి - జైమిని - తన్త్రములయందును;పాశుపత - పాఞ్చరాత్ర - బౌద్ధ - ఆర్హత - చార్వాక - తన్త్రములగు పది తన్త్రములయందును— "యావత్పరమతం ననిరాక్రియతే తావత్స్వమత మప్రతిష్ఠితం భవతి" "పరమతమును నిరాకరించనిదే స్వమతము ప్రతిష్ఠితము గానేరదు." అనెడు న్యాయంబున స్వమత స్థాపన కొఱకు పరమత నిరాకరణ ప్రస్తావములో కపిల కణాదాదులచే కేవలాద్వైతమే వ్యాస తాత్పర్య విషయమని తలచి అనువదించి నిరాకరించుటచే ఆ అద్వైతమే వ్యాస తాత్పర్య విషయమని నిర్ణయించబడుచున్నది. అట్లు గౌతమ మహర్షియు చెప్పియున్నాడు. "విప్రతిపత్తౌ సాక్షినిమిత్తా సత్యవ్యవస్థా" విప్రతిపత్తి కలిగినప్పుడు సత్యవ్యవస్థ సాక్షినిమిత్తమైనది. అందుచే అద్వైత ప్రతిపాదకమైన సూత సంహితా మూలకమయిన భగవత్పాదీయ భాష్యమే ప్రమాణమని నిశ్చయింపబడుచున్నది.

జీవానేకత్వము-ప్రపంచ సత్యత్వము-పరక్షేత్రజ్ఞ భేదము - మొదలగువాని యందలి యభిమానముచే కపిల-కణాద - గౌతమ - ప్రభృతులకు మధ్యస్థత్వము లేదని పూర్వము చెప్పి ఇప్పుడు వారికి లేని మధ్యస్థత్వమును అంగీకరించి తదనువాద బలమువలన యీ యర్థమే వ్యాసతాత్పర్యమని చెప్పినచో స్వవచన వ్యాఘాతము వచ్చునందురేమో! అటుల గాదు-కపిల కణాదాదులకు భేదాభేద ప్రతిపాదక శ్రుత్యర్థ విచారమునందు మధ్యస్థత్వము లేకపోయినను వారికి వ్యాసమతము ననువదించి ఆ వ్యాసమత నిరాకరణ పూర్వకముగా స్వమత స్థాపన కొఱకు వ్యాససిద్ధాన్త మవశ్యము తెలిసికొన దగుటచేతను, ఆ సిద్ధాన్తము నందు తమ కెట్టి స్వపక్షత్వాభిమానము లేకపోవుట చేతను వ్యాసతాత్పర్యమునందు మధ్యస్థత్వము సంభవించుట కెట్టి యభ్యన్తరము లేదు.

అట్లైన కపిలాద్యనువాద రూపమయిన యుక్తి బలముచే వ్యాసతాత్పర్య మిది యని నిశ్చయించబడినచో నితర భాష్య గ్రన్థాదులయం దెవ్వరికిని ప్రవృత్తి కలుగదని చెప్పరాదు. "తంత్వౌపనిషదం పురుషం పృచ్ఛామి-నావేదవిన్మనుతే తం బృహన్తం" ఇత్యాదిశ్రుతులచే షడ్విధ తాత్పర్య లిఙ్గాద్యుపేతమయిన శ్రుతిబలముచేతనే పరతత్వ నిర్ణయము చేయవలె ననెడు అర్థమే వ్యాసతాత్పర్య మగుటవలన ఆ యర్థమునే ప్రతిపాదించునట్టి తత్తద్భాష్యగ్రన్థ పర్యాలోచన చేతనే తన్నిర్ణయము చేయవలసియుండగా వానిలో భగవత్పాదభాష్యము ననుసరించి వ్యాసతాత్పర్య నిర్ణయము యుక్తమా? శ్రీకణ్ఠరామానుజమధ్వాది భాష్యముల ననుసరించి వ్యాసతాత్పర్య నిర్ణయము యుక్తమా? అనెడు వాది విప్రతిపత్తి రూపమయిన సంశయము రాగా కపిలాద్యనువాదముచే పుష్టిచెందిన భగవత్పాద భాష్యమునందు చెప్పబడిన ఉపక్రమోపసంహారాది షడ్విధ తాత్పర్య లిఙ్గాదులతో గూడిన శ్రుతిబలము చేతనే వ్యాస తాత్పర్య నిర్ణయము యుక్తము గనుక అందఱికిని

తత్తద్భాష్యగ్రన్థాదులయందు ప్రవృత్తి సంభవించుట కెట్టి అభ్యంతరము లేదు.

వేదాన్త శాస్త్రమునందు "రచనానుపపత్తేశ్చ నానుమానమ్" ఈ మొదలగు అధికరణములయందు పూజ్యుడగు వ్యాసమహర్షిచే సాంఖ్య మత నిరాకరణ మెట్లు చేయబడునో అలాగుననే సాంఖ్యతన్త్రము నందును పూజ్యుడగు కపిలమహర్షిచే వేదాన్తశాస్త్రాభిమతమైన కేవలాద్వైత - భేదాపాదికత్వ - ప్రపఞ్చానిర్వచనీయత్వా ద్యనువాదపూర్వకముగా అద్వైతము ఖండన చేయబడెను. అది ఆ సాంఖ్య తన్త్రమం దెట్లు నిరాకరించబడినదనగా: అందలి సూత్రములను వ్రాయుచున్నాను. సాంఖ్యశాస్త్ర ప్రథమాధ్యాయమునందు 'నా విద్యాతోవ్యవస్తునాబన్ధాయోగాత్' 'వస్తుత్వే సిద్ధాన్త హానిః, విజాతీయద్వైతాపత్తిశ్చ' 'విరుద్ధోభయ రూపాచేత్' 'నతాదృక్పదార్థా ప్రతీతేః' ఆ అధ్యాయమునందే 'ఉపాధి భేదేపి' 'ఏకస్య నానా యోగ ఆకాశస్యేవ ఘటాదిభిః' 'ఉపాధి ర్భిద్యతే నతు తద్వాన్' 'ఏవ మేకత్వేన పరివర్త మానస్య' 'న విరుద్ధ ధర్మాధ్యాసః' 'అన్య ధర్మత్వేఽపి నారోపాత్త త్సిద్ధిరేకత్వాత్' 'నాద్వైత శ్రుతి విరోధో జాతి పరత్వాత్' 'విదిత బన్ధకారణస్య దృష్ట్యా తద్రూపమ్' 'నాన్ధదృష్ట్యా చక్షుష్మతా మనుపలంభః' 'వామదేవాది ర్ముక్తోనాద్వైతమ్' 'అనాదావద్య యావదభావా ద్భవిష్యదప్యేవమ్' 'ఇదానీమివ సర్వత్ర నాత్యన్తోచ్ఛేదః'.

ఇట్లు ప్రథమాధ్యాయ మందలి సూత్రములు చెప్పి పఞ్చమాధ్యాయ మందలి సూత్రముల నుదాహరించుచున్నాను. పఞ్చమాధ్యాయమునందు- 'నా విద్యా శక్తి యోగో నిస్సంగస్య' 'తద్యోగే తత్సిద్ధా వన్యోన్యాశ్రయత్వమ్' 'న బీజాంకురవత్ సాదిసంసారశ్రుతేః' 'విద్యాతోఽన్యత్వే బ్రహ్మ బాధ ప్రసక్తేః' 'అబాధే నైష్ఫల్యమ్' 'అవిద్యా బాధ్యత్వే జగతోప్యేవం' 'తద్రూపత్వే సాదిత్వమ్' ఆ అధ్యాయమునందే వేరొకచోట 'నానిర్వచనీయస్య తదభావాత్'; ఆ అధ్యాయమునందే మరొకచోట - 'నాద్వైత మాత్మనో లిఙ్గా త్తద్భేద ప్రతీతేః' 'నానాత్మనాపి ప్రత్యక్ష బాధాత్' 'నోభాభ్యాంతే నైవ' 'అన్య పరత్వ మవివేకానాం తత్ర' 'నాత్మా ఽవిద్యానో భయం' 'జగదుపాదానకారణం నిస్సంగత్వాత్' 'నైక స్యానన్ద చిద్రూపత్వే ద్వయోర్భేదాత్' 'నానన్దాభివ్యక్తి ర్ముక్తిర్నిర్ధర్మత్వాత్,'

ఇట్లు పఞ్చమాధ్యాయమునందలి సూత్రములనుజెప్పి షష్ఠాధ్యాయమునందలి సూత్రములను జెప్పుచున్నాను. షష్ఠాధ్యాయమునందు- 'ఉపాధిశ్చేత్తత్సిద్ధౌ పునర్ద్వైతమ్ - ద్వాభ్యామపి ప్రమాణ విరోధః' 'ద్వాభ్యామప్య విరోధాన్న పూర్వముత్తరంచ సాధకాభావాత్' 'ప్రకాశస్తత్సిద్ధౌ కర్మకర్తృ విరోధః' 'జడవ్యావృత్తోజడం ప్రకాశయతి చిద్రూపః' 'నశ్రుతి విరోధో రాగిణామ్ వైరాగ్యాయతత్సిద్ధేః' 'జగత్సత్యత్వ మదుష్ట కారణ జన్యత్వాద్బాధకాభావాత్'.

ఇట్లు ఒకటి - అయిదు - ఆరు అధ్యాయములందలి పరమత నిరాకరణమే ప్రయోజనముగాకల కపిల సూత్రములందు కేవలాద్వైతాదికము అతి స్ఫుటముగా కనిపించుటవలన అట్టివాది ఎవరని ఆకాంక్ష రాగా వ్యాస సూత్రములందు పరస్పర విరుద్ధార్థ ప్రతిపాదిక బహువిధభాష్య ప్రచారముచే సంశయము వచ్చి తన్నిర్ణయము చేయవలసిన అవసరము కలుగగా పతఞ్జలి - జైమిని - గౌతమ - కణాదాది సూత్రకారులకున్ను - పాశుపతాది తాన్త్రిక మతప్రవిష్టులకున్ను - చార్వాకాది బాహ్యమత ప్రవిష్టులకున్ను - అద్వైత మంగీకరించని వారగుటవలన వాదిత్వము సంభవింపదుగాన పారిశేషిక ప్రమాణము వలనను, ప్రకారాన్తరముగా ఆ నిర్ణయముయొక్క ఆకాంక్ష నివర్తించదు కనుకను, వ్యాసభగవానుడే వాదియని సిద్ధమగుచున్నది. మరియొకరీతిగా వ్యాస మహర్షిని విడిచి ఎవరినో మరియొకరిని అప్రసిద్ధుని వాదిగా నంగీకరించి వాని కభిమతమైన కేవలాద్వైతమునకు వ్యాస తాత్పర్య విషయత్వములేదని చెప్పుట కంగీకరించినను, భట్టభాస్కర- యాదవ ప్రకాశ- శ్రీకణ్ఠ - రామానుజ - మధ్వాది భాష్యకర్తల

కభిమతమయిన యర్థములలో నీయర్థమే వ్యాస తాత్పర్యమని ఎవనిచేతను నిర్ణయించుటకు శక్యము కాకపోవుటవలనను, ద్వైతవాదులకు స్వపక్షస్థాపన చేసికొనలేనట్టి వితణ్డవాద ప్రసక్తి సంభవించును. అందువలన నీరెండు విధములయిన ఆకాంక్ష శాన్తించుటకు వ్యాసుడే వాదియని మన కిచ్ఛలేక పోయినను ఒప్పుకొనవలసియున్నది. ఈ యర్థమే తటస్థులగు మాత్సర్య విహీనులకు హృదయంగమ మయినది. ఈ విషయమయి కొంతమంది భేద వాదులు కపిలసూత్రములందుగల కేవలాద్వైతాను వాదరూప బ్రహ్మాస్త్రమునకు ప్రతిక్రియను జేయు టకు సమర్థత లేనివారయినను పరంపరగా వచ్చు చున్న భేదవాసనచే కలుషితమైన అన్తఃకరణము కలవారయి నిజ మతాభిమానమును విడచిపెట్టుటకు సమర్థత లేనివారగుచు తమతమ బుద్ధ్యనుసారముగా కల్పింపబడిన యుక్త్యాభాసములయిన సూచీ శకల ములచే కేవలాద్వైతానువాద రూప బ్రహ్మాస్త్రమును పరిహరించుటకు కోరుచున్నవారలయి సాంఖ్య శాస్త్రానుసారముగా కేవలాద్వైతము వ్యాస తాత్పర్య విషయమని చెప్పుట యుక్తముకాదని పదమూడు రకముల పూర్వపక్షములను జేసిరి.

1. అందలి మొదటిప్రశ్నమిది—సాంఖ్యసూత్ర ములను పెద్దలెవరు తమ గ్రంథములం దుదహ రించక పోవుటచే కపిలునిచే చెప్పబడినవని నిశ్చ యించుటకు వీలులేదు.

దానికి సమాధానము—పూజ్యపాదులగు విద్యా రణ్యులు సూత సంహితకు వ్యాఖ్యయగు తాత్పర్య దీపికయందు "అతఏవ సాంఖ్యై రుచ్యతే సత్వ రజస్తమసాం సామ్యావస్థా ప్రకృతిః" అనియు అప్పయ్య దీక్షితులవారు తమ పరిమళ గ్రన్థమునందు 'అనుమానికమప్యేకేషామ్' అను నధికరణమునందు "అతఏవ 'స్థూలాత్పంచతన్మాత్రస్య' అనునది మొదలుగాగల 'సంహత పరార్థత్వా త్పురుషస్య' ఇత్యన్తాని కపిల సూత్రాణి" అనియును, బాలకృష్ణా నన్దచరణులు పురుషార్థ రత్నాకరమనెడు గ్రన్థము నందు "మోక్షస్తు లక్షిత స్సాంఖ్యైః అథత్రివిధ దుఃఖాత్యన్త నివృత్తి రత్యన్త పురుషార్థః" అని యును, అభియుక్త గ్రన్థములందు కపిలసూత్రము లుదాహరింపబడుటచే సాంఖ్యసూత్రములు కపిలునిచే జెప్పబడలేదని చెప్పుటకు వీలులేదు.

ఇచ్చట మరియొక అవాన్తర పూర్వపక్షము చేసిరి. ఇట్లు అభియుక్త గ్రన్థములలో కపిలసూత్రము లున్నను, మీరు ఉదహరించుచున్న "కేవలాద్వైతాను వాద సూత్రములు కపిలునిచే జెప్పబడినవని నిశ్చ యించుటెట్లు? అని.

దానికి సమాధానము—కపిల సూత్రములకు వ్యాఖ్యానము రచించిన "అనిరుద్ధాచార్యులు" మొద లగువారు "అథత్రివిధ దుఃఖాత్యన్త నివృత్తి రత్యన్త పురుషార్థః, ఇత్యారభ్య" "యద్వా తద్వా తదుచ్ఛిత్తిః పురుషార్థః" అను సూత్రమువరకు మధ్యగల సూత్రము లన్నింటికి వ్యాఖ్యానము చేయుటవలన పై నుదహరింపబడిన కేవలాద్వైతానువాద సూత్ర ములు కూడ తన్మధ్యపతితము లగుటచే కపిల ప్రణీతములని చెప్పుటయందు నిర్వివాదము.

రెండవ పూర్వపక్షము— ప్రాచీనాద్వైత గ్రన్థ ములయందు కపిల సూత్రోక్తి కేవలాద్వైత సాధక మయిన యుక్తిగా జెప్పకపోవుటవలన కేవలాద్వై తము వ్యాసతాత్పర్య విషయ మెట్లగును?

దానికి సమాధానము—శాంకర భాష్యాది ప్రాచీన గ్రన్థములందు గౌతమ కపిలాది సూత్రకారులే ప్రతి వాదులుగా కనబడుటవలన వారి మతములను నిరాక రించుటయందు ప్రవర్తించిన భాష్యకారాదులు ఈ ఆధునిక భేదవాదుల వాదమును నిరాకరించుటకొఱకు కపిలానువాద యుక్తి పర్యన్తము పరుగిడుట వారి కంత అపేక్షితముగా కనబడకపోవుట వలనను, అప్పయ్య దీక్షితాది గ్రన్థకారులకు తమతో సమాను లగు యుక్తి ప్రమాణోపన్యాస సమర్థులయిన భేద వాదులు లేకపోవుట వలననే కపిల సూత్రానువాద రూప యుక్తిని అపేక్షించకయే పరమత నిరాకర ణము చేయుట సంభవము కనుకను కపిల సూత్రాను వాద యుక్తిని అపేక్షించలేదు. ప్రాచీన గ్రంథముల యందు ఉదహరించలేనంత మాత్రమున సాంఖ్యాను వాదము కేవలాద్వైతసాధకయుక్తిగా పరిగణింపబడ దని చెప్పుట మూఢ ప్రలపితముగా గూడ నగును.



# శ బ రి

భాషాప్రవీణ
శ్రీ బృందావనం రంగాచార్యులు

విమలతపః కుటీరమున
వేదికపై నవమల్లికాపరా
గము నొలికించి - సుందర
సుఖంకర తోరణపంక్తితోడ - ర
మ్యముగ నలంకరించుకొని
సాంజలివై రఘురాము పాదప
ద్మములకడన్ సపర్యలు
నమస్సులు సల్పెడు నామె యెవ్వరో!

సాదర విలోకనాల దాశరథి యామె
హృదయపూజాంజలిని స్వీకరించుచుండె
భక్తిభావనలో బరవశతనంది
మురుసుకొని పోవుచున్నదా ముసలి యవ్వ.

కనులం దుత్తమశాంత తేజ
మొలుకంగా సర్వలోకేశు న
ర్చనలో శక్తిసమస్తమున్
సడల - వార్ధక్యమ్మునన్ దైవ భ
క్తిని కేలూతగబూని నిశ్చల
తపోదీప్తిం బ్రకాశించు యో
గిని యాధ్యాత్మిక భావసంపదలు;
జేగీయమ్ము లెల్లప్పుడున్.

ఆ ప్రశాంత విశాలమౌ ఫాలభాగాన
కోటిచంద్రుల చల్వ కొల్వుదీర
వార్ధక్యమునకు లోబడిన నేత్రాలలో
తేజమ్ము భక్తి దీధితుల నిలుప
తడబడు పలుకుల తహతహలో ముమ్మ
రమ్మగు పూజ్యభావమ్ము మెరయ
ఫలమూలందించెడి పనియందు మాతృత్వ
రాగలహరుల సొంపు ప్రోగుపడగ
ఆశ్రమమెల్ల నీవెయై యణువణువున
పరవశమ్మయి - శ్రీరామచంద్రు చరణ
సేవలో మాన్యవై మురిసెడి త్వదీయ
ధన్యజీవనమునకు వందనము తల్లి!

పరమ పావనమూర్తి సేవావ్రతాన
నిశ్చలానందవై భవనియతి దేలు
శబరివా! నీవు తల్లి! విశాల విశ్వ
వంద్యమౌ; తావకీన భవ్యంపుగాథ.

అకలుష జీవనమ్మున
మహత్తరభక్తి పథానువర్తివై
సకలము విస్మరించితివి
చల్లని సామికి రామమూర్తికిం
బ్రకటితమాయె నీ పరమ
పావన భావన - మెచ్చివచ్చె, తీ
రిక యెటులో యొనర్చుక
నిరీక్షణ సల్పెడి నిన్నుజూడగన్.

సాధ్వీమతల్లి కౌసల్య చల్లని యొడి
నోచిన బంగారునోము ఫలము
దశరథరాజు సుందర నందనోద్యాన
మందు పూచిన ఘనమైన పూవు
కౌశిక యాగదీక్ష సమాప్తమొనర్చి
దివ్య తేజాన వర్ధిల్లు శక్తి
నిరత నిశ్చల జపనిష్ఠా గరిష్ఠులౌ
పరమ సాధుజనాల పాలి కాపు

కొండ కోనలు - వనములు - గుహలు వెదకి
కొనుచు నరుదెంచె నా మహాఘనుడె నిన్ను
ఎట్టి మమకారమో ! యేమొ ! యెరుగమమ్మ !
స్వర్ణసుమముల పూజలు జరుపుకొమ్మ !

ఎంతటి పుణ్య పూజ
లొనరించితివో గద ; తొల్లి జానకీ
కాంతుని నిష్కళంక
మమకార సుధానిధిలో త్వదాశ్రమ
ప్రాంతము భవ్య సంపదల
బంగరు కాంతుల నీనుచుండె. వే
దాంత పవిత్రభావ
విభవాతిశయ ప్రతిభా ప్రపూర్ణమై.

నిరుపమ భావనం దగిలి
నిర్మల ధర్మపథంబునే మనో
బరమున నిల్పి- మానసము
భక్తిమయంబుగ- వండలాది వ
త్సరములు దివ్య దీక్షగొను
సంయమి చంద్రులు పొందలేని దా
శరథిని స్వేచ్ఛగా గొలువ
జాలితి వెంతటి ధన్యురాలవో!

కన్నుల విందొనర్చు
నవకమ్మగు మేనున జేయి వైచి ; మా
యన్న ! వరాలకొండ !
యని సాదరచిత్తము భక్తిభావ సం
పన్నముగాగ దివ్య
కుసుమమ్ముల గూర్చిన మాలతోడ ; రా
మన్న నలంకరించు
కొనునంతటి భాగ్యము దెంతవారికో.

మమకారాతిశయమ్ముచే
శ్రమ సహింపన్ బూని యెంతెంత దూ
రమొ ! కాంతారమునం
జరించి ; తరుణారామమ్ములం జొచ్చి ; రు
చ్యములౌ పండ్లు సువాసనా
మిళిత పుష్పవ్రాతమున్ ; స్వామి కో
సము సాధించి గడించి
తెచ్చితివె ! వాత్సల్యంబు నిండారగన్.

ఒక్కొక పండునే కొరుకు
చుంటివి- వాని రుచుల్గ్రహించి ; యొ
క్కొక్కటి గాగ వారల
మహోత్తమమైన కరద్వయమ్మున
న్మక్కువ మీరగా నిడుచు
మాటలతో దినిపించుచుంటివే !
యెక్కడిదమ్మ ! యీ చనువు
నింత మమత్వము ; నీకు వారికిన్.

మంచి ఫలమ్ము లిచ్చుటయె
మానసమం దతి ముఖ్యమంచు భా
వించుట ; ముందుగా గొరికి
యివ్వదలంచుటలోని యర్థమం
చెంచెనొ ! యేమొ ! స్వామి-
భుజియింపదొడంగెను మూడభక్తి భా
వాంచిత తావకీన మధు
రాశయ పూర్ణ మృదూపహారముల్.

ప్రవిమల మానసమ్మమల
భక్తి రసాన్వితమై రహింప మా
ధవ పదసేవయందె
సతతమ్ము శ్రమించెడివార లెందరీ
భువిని గలారు- నీ వలె
నపూర్వ ఫలమ్మును బొందగల్గిరే
యెవరయినన్ ? జరిత్రకె
గడించితి వీవు నిజమ్ము నవ్యతన్.

పొంగులువారు భావముల
బూర్ణమనమ్మున గొల్చువారికే
కొంగున బంగరై ముదము
గూర్చు బరాత్పరు డన్నమాట నీ
యెంగిలి పండ్ల గాథ
వివరించెను- భక్తుల యంతరంగ శు
ద్ధిం గని గాక, దైవము
మదిం బులకింపగజేసి డాయునే !

ప్రథిత రామకథా రసాపగల దరచి-
జ్ఞానసారము గ్రోలెడి మానవులకు
పరమ పావనమైన నీ చరితలోని
అక్షరాక్షర మాదర్శమైనదమ్మ !

★

# శ్రీ మెహర్‌బాబా జీవిత చరిత్ర

## శ్రీ శ్రీనివాసరావు

మెహర్‌బాబా 1894, ఫిబ్రవరి 25 న పూనా నగరంలో జన్మించారు వీరి తల్లితండ్రులు ష్రీన్‌భాను, షెరియార్‌జీ ఇరానీ. విద్యార్థిగా ఆటలు, సంగీతం, కవిత్వం, సాహిత్యాల్లో ఎక్కువ ఆసక్తి చూపేవారు.

పూనా, దక్కన్ కళాశాలలో చదువుచుండగా వీరికి సద్గురు హజరత్‌బాబా జాన్‌తో పరిచయ మేర్పడింది. ఆమె ఆశీర్వచన ఫలితంగా బాబా జీవితంలో పూర్తిమార్పు వచ్చింది. బాహ్యస్మృతిని పూర్తిగా కోల్పోయారు. దైవసంబంధమైన ప్రేమలో లీనమైపోయారు. 1915 లో వీరు సద్గురు శ్రీ శాయిబాబాను ఉపాసినీ మహరాజును సందర్శించారు. వీరిరువురి సాంగత్య ఫలితంగా శ్రీ బాబా ఆధ్యాత్మికంగా పరిపూర్ణతను పొందారు. శ్రీ బాబాకు బాహ్యస్పృహ కలిగేటట్టు చేయటానికి ఉపాసినీ మహరాజ్‌కు ఏడు సంవత్సరాలు పట్టింది. సకోరీ ఆశ్రమంలో ఉపాసినీ మహరాజ్‌కు శ్రీ బాబా ఈ ఏడుసంవత్సరాలలో అతి సన్నిహితులయ్యారు. ఆధ్యాత్మిక విషయాల్ని గురించి వీరిరువురు రాత్రింబవళ్లు తర్జనభర్జన చేశారు. శ్రీబాబా బ్రహ్మజ్ఞానాన్ని పొందారు. ఉపాసినీ మహరాజ్ వీరిని ఈ యుగంలో అవతారమూర్తిగా పేర్కొన్నారు. వారి శిష్యులను అనుచరులను అందరిని శ్రీ బాబాను అనుసరించవలసినదిగా వారు ఆదేశించారు.

1921 నుండి శ్రీ బాబా మానవాభ్యుదయానికి లోక కల్యాణానికి పాటుపడుతున్నారు. వివిధ మతములవారు వివిధ దేశములవారు వీరికి శిష్యులు కాజొచ్చారు. నిస్స్వార్థ సేవను వారికి అలవర్చారు. వారందరిని ఆధ్యాత్మికంగా విజ్ఞానవంతులుగా చేశారు. శ్రీ బాబాలోని దివ్యత్వాన్ని వీరు చవిచూడ గలిగారు.

శ్రీ బాబా అనేక ఆశ్రమాల్ని స్థాపించారు. అహమ్మదు నగరానికి సమీపాన 'ఆరంగామ్'లో ఒక పాఠశాలను స్థాపించి, జాతి మతభేదములను పాటింపక అందు అన్నిమతముల బాలురను చేర్చుకొను ఏర్పాటుచేశారు. ప్రేమాశ్రమము పేరిట మరొక పాఠశాలనుకూడ నెలకొల్పారు. పేద విద్యార్థులకు ఇందు ఉచిత భోజన వసతి సౌకర్యాల్ని కల్పించారు. వీటినేగాకుండ ఒక ఉచిత వైద్యశాలను, సాధనాశ్రమమును, మస్తు ఆశ్రమమునుకూడ స్థాపించారు.

మస్తులను గురించి కొంచెం వివరించటం అవసరం కావచ్చు. మస్తులు ఆధ్యాత్మిక ఉన్మాదులు. వీరికి బాహ్యస్మృతి ఉండదు. ఎప్పుడు దైవచింతనలోనే ఉంటారు. శ్రీ బాబా వీరికి సేవచేస్తూ దైవ సాక్షాత్కారాన్ని పొందటానికి తోడ్పడుతు ఉంటారు. శ్రీ బాబా రోగులకు స్వయంగా సేవచేస్తూంటారు. భిక్షులకు ధనవస్త్రాదులనిచ్చి వారికి పాదపూజ చేస్తుంటారు.

శ్రీ బాబా 1925 ఫిబ్రవరి 10 నుండి మౌనదీక్ష వహించారు. ఇంగ్లీషు అక్షరములుగల పలక నొకదానిని తమ సందేశాలను వివరించటానికి ఉపయోగిస్తూ ఉండేవారు. 1954 అక్టోబరు 4 న వారు ఆ పలకనుకూడ విడనాడారు. అప్పటినుండి వారు వ్యక్తం చేయవలసిన విషయాన్ని సంజ్ఞలద్వారానే వ్యక్తం చేస్తూంటారు. వారి అనుచరులు వాటిని లిఖితరూపంలో పెడుతుంటారు వాటిని వారికి చదివి వినిపించి సరిగా నున్నది లేనిది తెలిసికుంటారు. వీరి సంజ్ఞలకు గుర్తులకు ఒక ప్రత్యేకత ఉంది. వారిని

దర్శించినవారికే వాటి ప్రత్యేకత గ్రాహ్యంకాగలదు. వాటిని వివరింప వీలుపడదు.

వీరి అనుచరులు ప్రపంచం నలుమూలల ఉన్నారు. అనేకసార్లు వీరు ఇంగ్లండు అమెరికా మొదలైన దేశాలను సందర్శించి వారి భక్తులను తరింపచేశారు. వారు క్రొత్తగా ఎట్టి మతాన్నిగాని స్థాపించటానికి పూనుకోలేదు. ప్రేమద్వారా మానవుడు మోక్షమును పొందవచ్చుననే వారిసందేశం. ప్రాపంచక జీవితాన్ని విడనాడమనిగాని, వర్ణాశ్రమధర్మాల్ని విడనాడమని గాని వారు కోరడంలేదు. ప్రపంచములోని వాస్తవిక పరిస్థితులను ధైర్యంతో ఎదుర్కొని ఆధ్యాత్మికంగా ఉన్నతిస్థాయిని చేరమనే వారు కోరేది. సత్యాన్ని గ్రహించడానికి ప్రతి మానవుడు కృషిచేయాలని వారు బోధిస్తున్నారు. ఎవరినీకూడ తమతమ మతాన్ని విడిచిపెట్టమని వారు కోరడంలేదు. వివిధ మతాలు కూడ దేవుని వివిధ దృక్పథాల్ని విపులీకరించటాని కుపకరిస్తాయని వారు ఉద్ఘాటిస్తున్నారు. దైవసాక్షాత్కారాన్ని పొందటానికి మతం ఒక మార్గమని వారి అభిప్రాయం. వారిచ్చిన విశ్వసందేశాలలో కొన్నింటిని ఈ క్రింద పొందుపరుస్తున్నాను.

''నేను మేల్కొలుపుటకే గాని బోధించుటకు రాలేదు" "మీరందరు ఏనాటినుండో అనాదిసిద్ధముగా నున్నవారే. మీరందరు కలిసి ఒకటే పరమార్థ స్వరూపము. మీలో ప్రతి ఒక్కరిలోను దైవము ఇమిడియున్నాడు. ఆ దైవస్వరూపము కాలముచే కట్టుబడదు, అది అనంతము. అందువలన మీరు అనంతులే కాని ఈ నా డు మీరు బంధితులు. యుగయుగములనుండి మీరు ఈ బంధములలోనే యున్నారు. ఈ బంధములను మీరు ఒక క్షణమాత్రములో విముక్తి నొందెదరు. ఆ బంధవిముక్తికి ఉన్న ఒకే ఒక దారి 'సర్వవిలీనమైన ప్రేమ'." "నన్ను అర్థము చేసికొనవలెనని యత్నింపకుడు. నాలోతు మీకందునదికాదు. నన్ను కేవలము ప్రేమింపుడు" "తమ సర్వస్వము నాయందు అర్పించిన వారు పిమ్మట తమ సర్వస్వము నాయందే కనుగొనగలరు" "ప్రేమమయుడు తన ప్రేమికులకు దాసుడు. తన భక్తులకు భక్తుడు. ఇదే ప్రపంచమునకు నేనిచ్చు సందేశము" ''సామాన్యముగా అందరు అనుకొను మనస్సు నాకులేదు. నాకున్నది విశ్వహృదయము. దానిని తెలిసికొనుటకు విశ్వహృదయమే కావలెను." ఈ విధంగా వారిచ్చిన సందేశాలు అనేకం గలవు. వాటి నన్నిటిని సామాన్యంగా అర్థంచేసుకోవడం, ఆచరించడం చాల కష్టంతో కూడుకొన్నపని. అనంతమైన భక్తివిశ్వాసాలు అవసరం. మానవులను ఆధ్యాత్మికంగా పురోగమింపచేయటానికి వారు చేస్తున్న కృషి అపారం. వారు అనేకసార్లు ఉపవాసాలు చేస్తుంటారు. ఏకాంతంగా అనేక నెలలు గడుపుతూ ఉంటారు. వారు తలపెట్టిన ప్రతి పని యొక్క లక్ష్యాన్ని అర్థంచేసుకోవడానికి సామాన్య మానవులకు సాధ్యపడదు.

వారు రచించిన గ్రంథాలు అనేకం ఉన్నాయి. వాటిలో చాల గ్రంథాలు ఇంగ్లండు అమెరికా దేశాలలో ప్రచురింపబడినాయి. ఈ దేశంలోకూడ అనేకం ప్రచురింపబడినాయి. 'గాడ్ స్పీక్సు', 'విజిన్ హ్యుమానిటీ' 'లైఫ్ యట్ ఇట్సు బెస్టు'. వాటన్నిటిలో వారు బోధిస్తున్న అనేక ఆధ్యాత్మిక విషయాల్ని గురించి వివరంగా వివరింపబడి ఉంది. వారు రచించిన ఇంకా కొన్ని గ్రంథాలు ముద్రింపబడలేదు. వాటి ముద్రణకు వారింకా అనుమతించలేదు. మెహరుబాబా - ఒక విజ్ఞాననిధి, ఆత్మ సాక్షాత్కారాన్ని ఉపకరించేది అది.

వారిని దర్శించటానికి ఎప్పుడుపడితే అప్పుడు వీలుపడకపోవచ్చును. ఏకాంతంలో గడిపే దినాల్లో వారిని ఎవరు కూడ కలియుటకు వీలుపడదు. వారిని దర్శించినవారికి వారిలో ఉండే మహత్తరశక్తి విశదమవుతుంది. అనేకమైన సందేహాలతో, వివిధ విషయాల్ని గురించి వారిని ప్రశ్నించాలని వెళ్లినవారందరు వారిని దర్శించగానే వారి సందేహాలు తొలగిపోతాయి. వారికి ప్రశ్నించవలసిన విషయాలు కూడ ఉండవు. వారు జాతి మత వర్గ విభేదాల్ని పాటించరు. వారిని

ఎవరైన కలియవచ్చు. బీదలపై వారు ప్రత్యేక శ్రద్ధ వహిస్తూఉంటారు. వారి అనుచరులు ప్రపంచం అంతటా చాలమంది బీదవారే.

వారి విశ్వసందేశాలని వివరించటానికి అమెరికాలో 'ఎవేకనర్' అనే పత్రికను వారి అనుచరులు నిర్వహిస్తున్నారు. ఆంధ్ర తదితర రాష్ట్రాలలో వారి సందేశాల్ని వివరించే అనేక పత్రికలు నడుపబడుచున్నాయి.

ఒక సందర్భంలో శ్రీ బాబా నేను నిప్పువంటి వాడినని తెలిపారు. అది ఈ క్రింద యథాతథంగా పొందుపరుస్తున్నాను.

**Baba is Fire**

"When you feel cold
And sit near the fire
It drives your cold
And makes you perspire
When you feel hungry
And cook on the fire
It gives you your food
for which you aspire
But if you like a fool
Try to play with fire
It may burn you so badly
That would make hell admire."

(శ్రీ ఆది కె. ఇరాని, ఆంధ్ర మెహర్ మండలి (కాకినాడ) ప్రచురించిన విషయాన్ని ఆధారం చేసుకొని.)

## సవరణ

నవంబరు నెల ఆరాధనలో ప్రచురించిన "మనిషి - మహర్షి" 34 వ పుట 2 వ కాలంలో

కన్నబిడ్డనె
తన్నితరుముచు
అన్నెమెనయగ
కన్నుమొరగే
కంగులెరిగిన
నంగిగోవులు

అన్నదానిలో చివరి రెండు పంక్తులు

కందులెరిగిన
గంగిగోవులు

అని ముద్రించబడింది. పాఠకులు సవరించుకొన ప్రార్థన.

—ఎడిటర్.

# యుగయుగాల చరిత్రతో భక్తిప్రబోధం చేయండి

## స్వాగతోపన్యాసంలో శ్రీ బి. రంగన్నగౌడ విజ్ఞప్తి

### శ్రీశైలంలో కర్నూలుజిల్లా దేవాలయాల ధర్మకర్తల ద్వితీయ మహాసభలు

కర్నూలుజిల్లా దేవాలయాల ధర్మకర్తల ద్వితీయ మహాసభలు శ్రీశైలంలో నవంబర్ నెల 28 వ తేదీన మహా వైభవంగా జరిగాయి. 27 వ, తేదీ రాత్రి భోజనానంతరం విషయ నిర్ణయ సభ జరిగింది. 28 వ తేదీన ఉదయం అల్పాహారవిందు తర్వాత ఎనిమిదిన్నర గంటలకు తిరిగి విషయనిర్ణయసభ జరిగింది. తీర్మానాలుకూడా చేశారు.

పతాకవందనం తర్వాత దేవాదాయశాఖ కమీషనర్ శ్రీ పైడి లక్ష్మయ్య బి. ఏ. బి. యల్. గారు శ్రీ శివాజీసభామందిర ప్రారంభోత్సవం చేశారు. స్థానిక స్వపరిపాలనామాత్యులు శ్రీ డి. సంజీవయ్యాగారు సభను ప్రారంభించారు. మహాసభ జ్యోతిని శ్రీ లక్ష్మయ్యాగారు వెలిగించారు. గుంటూరు వెళ్ళవలసిన ప్రత్యేక కార్యక్రమం ఏర్పడినందువల్ల దేవాదాయశాఖామంత్రి శ్రీ అనగాని భగవంతరావుగారు ఈ మహాసభలలో పాల్గొనలేదు. ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ బి. రంగనగౌడగారు స్వాగతోపన్యాసం చేశారు. శ్రీ పేపూరి యెల్లమందయ్యాగారు కార్యదర్శి నివేదిక చదివారు. ఆహ్వానసంఘంవారు మంత్రి శ్రీ సంజీవయ్యాగారికి, శ్రీ లక్ష్మయ్యాగారికి సన్మానపత్రం సమర్పించారు. శ్రీ పైడి లక్ష్మయ్యాగారు ప్రధానోపన్యాసం చేశారు. శ్రీ యన్. యస్. గుప్త, శ్రీ సి. పి. తిమ్మారెడ్డి (M. L. A.) ప్రభృతులు ఉపన్యసించారు. సాయంత్రం 5½ గంటలకు తేనేటివిందు జరిగింది. శ్రీ కేశవనాథ్, బేబి కస్తూరి, కుమారి నిర్మల ప్రభృతుల శివతాండవనృత్య ప్రదర్శనం జరిగింది. రాత్రి 8½ గంటలకు మంత్రి శ్రీ సంజీవయ్యాగారి అధ్యక్షతను శ్రీ లక్ష్మయ్యాగారు రచించిన "మార్కండేయ విజయం" నాటకప్రదర్శనం జరిగింది.

ఆహ్వానసంఘాధ్యక్షులు శ్రీ బి. రంగనగౌడగారి స్వాగతోపన్యాసం పూర్తిపాఠం యీక్రింద ప్రచురించబడుతున్నది.

*మహాశయులారా !*

#### స్వాగతము - సుస్వాగతము

పతిత పావన పూజ్యదైవ నిలయ ధర్మకర్త్రాధికారము వహించిన మీకెల్లరకు, ఉన్నతాధికార, అధికార, అనధికార, మహాశయులకు ఈ మహాదివ్యపుణ్యక్షేత్రమున స్వాగతమిచ్చు భాగ్యము లభించినందులకు ధన్యుడను. ఇది మహా సుదినము.

మా ఆహ్వానమును గౌరవించి వ్యయప్రయాసలకోర్చి ఇందరుదెంచిన మీకెల్లరకు శ్రీశైలవాసు డాయు రారోగ్యైశ్వర్యము లొసగి రక్షించుగాక :

మనము ఈ సమావేశమున చర్చించు దేవాలయముల సముద్ధరణ, మతరక్షణ మున్నగువాటిని, నిర్మాణ కార్యము సృష్టించుటకు దీక్షవహించి కీర్తి, పుణ్య, యశస్కాములగుటకు, శ్రీ పరమేశ్వరు డనుగ్రహించుగాక :

ఈ శ్రీశైలమహాక్షేత్ర మాహాత్మ్యము ఎంతయో గలదు. అది ఎల్లరికి తెలిసియుండుటచేత ఆ ప్రసక్తి మీకే వదలి ప్రస్తుతాంశమున కుపక్రమించుచున్నందులకు మన్నించుదురుగాక ?

## యుగాలనాటి దేవాలయములు – వేదకాలము

*సత్యసాధన సత్పురుషవరేణ్యులారా !*

దేవాలయములు ఈనాటి సృష్టికావనియు, యుగయుగాల క్రితమే సృష్టికాబడినవనియు, వేదపురాణ, చరిత్రలు, విశదపరచుకొనుట యట్లుండగా, ఈ శ్రీశైలభ్రమరాంబ మల్లికార్జున ఆలయములు యుగాలసృష్టిని నిరూపించుచు ప్రబల నిదర్శనము లిచ్చుచుండుట మీకు తెలిసున్న విషయమే. వేదపురాణకాలములలో దేవాలయములు, ఆశ్రమములు, మఠములు, మానవానీకముయొక్క విజ్ఞాన, భక్తి, ముక్తి మున్నగు ప్రపత్తులు ప్రసాదించుటకు ఎక్కువ తోడ్పడినవని చరిత్రలు తెలుపుచున్నవి. ఈనాడు శ్రీ తిరుపతి దృష్ట్యా, వేద, పురాణ, కాలము పునరావృత్తి ప్రారంభమైనదని అనేకులు నమ్ముచున్నారు. అందు జరుగు భక్తి, ముక్తి కార్యకలాపాల సాక్ష్యము నమ్మదగినదే.

మన పూర్వులు శ్రీ తిరుపతివలెనే ప్రజానీకమున, మత, ఆధ్యాత్మిక ధర్మాలు పెంపొందుటకు సుళువగు మార్గములు ఈ దేవాలయములేనను గొప్పనమ్మకముతో హిందూమత రక్షకు పెట్టనికోటలగు దేవాలయములు సృష్టించి వాటి స్థిరత్వమునకు దాతలు అపారద్రవ్యము, భూములు, దానమొసగిరి. దేవాలయములు ప్రపంచమున కొనర్చిన మహత్తర ప్రయోజనములు అనేకముండుటచేతనే విరివిగా దేవాలయములు సృష్టి కాబడినవి....

## చరిత్ర, దేవాలయములు

*నీతి కార్యధురంధరులారా !*

హిందూరాజులు మనదేశమును పాలించుచున్నంతవరకు దేవాలయములు ప్రవర్ధమానముగా ప్రకాశించి రక్షణలు పొందినవని చరిత్రలు విశదపరచుచున్నవి. దేశము మహమ్మదీయ పాలన సంక్షోభమునకు గురియైనప్పుడు అనేక దేవాలయములు మశీదులుగా మారినవి. ఆ అదను పురస్కరించుకొనిన పోర్చుగీసు కంపెనివారు దక్షిణ రాష్ట్రమును ఆక్రమించుతూ అందుగల కొన్ని దేవాలయములను క్రైస్తుచర్చీలుగా మార్చుకున్నారు. ఈ ఎదురు దాడులను హిందూరాజులు నెదుర్కొని మిగిలియున్న దేవాలయములను రక్షించగలిగిరి అనిచరిత్రలు సాక్ష్య మిచ్చుచున్నవి.

అయినప్పటికి కీడులో మేలొనగూడినదనుకుంటాను. ఈ వుభయదాడుల వలన హిందూదైవనిలయాలు భగ్నమొందినప్పటికిన్ని ఆ దైవస్థావరాలు ఏ అత్యాచారవ్యవస్థల కుపక్రమింపక వారి మతాచార సర్వాంతర్యామియగు భగవానుని ప్రార్థనలకు వినియోగించుకొన్నారు. ఆవిధానము భగవంతునికి సమ్మతమే ననుకుంటాను. భగవద్గీతలో, శ్రీకృష్ణపరమాత్మ :

శ్లో॥ యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్ । మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః॥

పార్థా ! భక్తులు నన్ను ఏరీతిగా దలచిన కోపగింపక అనుగ్రహించి ఆమార్గమును అనుసరించుచున్నానని బోధించెను. మహమ్మదీయ, క్రైస్తవ ఉద్దేశ్యములు గీతా నియమమునకు సమన్వయముగా నుండుటచేతనే వారి ఆశ యము ధన్యతగాంచె ననుకుంటాను.

కాగా : అన్నిధర్మాలు గుర్తించిన హిందువులకు దేవాలయముల పారుపత్యం లభించగానే పరశురాముడు రాజుల హతమార్చినట్లు కొన్ని దేవాలయములు ఖతమొనర్చినారు. వాతాపి సర్వం జీర్ణించుకున్నట్లు కొన్ని దేవాలయ ముల ఆస్తులు కొందరు జీర్ణించుకొన్నారు, కొన్ని దేవాలయముల ఆస్తి పాస్తులు సముద్రమును అగస్త్యోపాసన జేసినట్లు

గుటకాయస్వాహాజేయుటకు కొందరు కొంగజపం జేయుచున్నారు. అందు కనుకూలముగా ...జ్రకశిపువరములవంటి ఇనాం భూముల పట్టాలచట్టం హుటాహుటి బయలుదేరి విహరించుచున్నది. అనేకులు జోహారు కొట్టుచూ భగీరథ యత్నమువంటి ప్రయత్నము సిద్ధించెనను ఱక్కుల సంతోషముతో మూటాముల్లె సిద్ధపరచుకొని "మా పెద్దలే ఆపేరను కొనుచు" పట్టాలుపొందుటకు ప్రయాణం కట్టుచున్నారు—

ఇదంతా ఎందుకు ప్రస్తావించుచున్నానంటే, మహమ్మదీయ క్రైస్తవుల దాడులు, మనవారి దాడులు యేవి ఉత్తమమైనవో ఆలోచించి ఈ అన్యాయార్జిత ఆశాపిశాచాన్ని హడలించి అంతమొందించు మార్గాలు అన్వేషించుటకు మనవిజేయుచున్నాను.

చరిత్ర మరెట్లున్నదంటే? మహమ్మదీయ పోర్చుగీసు దాడులు అణగారిన మీదట ఈస్టిండియా కంపెనీ పాలన భారతావనిపై ప్రారంభమైనది. ఈ క్రొత్తపాత సంధులలో పైరీతిగా అనేక దేవాలయములు నాశనమైనవి. మహమ్మదీయ గ్రీసు దాడులే శ్రేషమనిపించుకొన్నవి. బ్రిటిషుపాలన పాదుకొనగానే దేవాలయముల ఆస్తుల దురాక్రమణనుగురించి ప్రజాందోళన చెలరేగినది. దీనితో మిగిలున్న దేవాలయములు ప్రభుత్వదృష్టి నాకర్షించినవి. ప్రభుత్వం ప్రజా ఆందోళనకు మాన్యత గలిగించినది.

1817 సం. లో ప్రభుత్వము "రెగ్యులేషను" అను ఆక్టు సృష్టించి ధర్మాదాయముల పాలన, రివిన్యూబోర్డుకు వప్పగించినది. ఈ ఆక్టువల్ల 1839 సం. వరకు ఏదో ఒకరీతిగా పాలనసాగి స్వార్థుల దోపిడీలతో ఉగ్గిసలాడుచున్న దేవాలయములకు ఈ ఆక్టు యూతకర్రరీతి సహకరించినది.

ఇంతలో దేవాలయముల పాలన ప్రశ్నలండను సభలో చర్చకు గురియైనది. ఆ సభవారు "క్రైస్తుమతము అవలంబించిన రాజులు, మంత్రులు, విగ్రహారాధన జరుగు హిందూ దేవాలయములను పాలింపరాదు; వాటిని ఆస్తులతో సహా తక్షణమే స్వదేశస్థులకే వప్పగించవలెను" అని తీర్మానించిరి. ఆ ఉత్తర్వులు రాగానే మద్రాసు రాజధానియందుగల మతధర్మసంస్థలు ఆయా జిల్లాధికారులు తమకు యుత్తమని తోచినవారికి వప్పగించి 1839-40 సం. లో ప్రభుత్వ పెత్తనం వదలుకొనిరి.

ఈ సమయమున అదనుగుర్తెరింగిన పెత్తనందారులు కొందరు వెనుకటివలెనే దేవాలయముల ఆస్తులు సంగ్రహించి దేవాలయముల పేరుప్రతిష్ఠలు నాశనముజేయుచుండిరి. ఈ ఘోరదురంతదుర్దశ వారించుటకు తిరుగా ప్రజాందోళన సాగినది. దీనితో 1863 సం. ఢిల్లీ శాసనసభలో ఒక చట్టం తయారుజేసి దేవాలయములను కమిటీలకు వప్పజెప్పిరి ఈ చట్టం, వంశపరంపరాహక్కుగాగల దేవాలయములను, మఠములను ఏలాటి తనిఖీ లేక వదలినది. దీనితో అమితాదాయంగల శ్రీరంగం, తిరుపతి దేవాలయములే వృద్ధిజెందలేకపోయినవి. ఈ శ్రీశైలం, అహోబిలం, హంపి, మున్నగు పుహాక్షేత్రాలు అట్లే, మినుక్కుమినుక్కుమంటూ అణగుండగా, మధ్య, కనిష్ఠతరగతుల దేవాలయములగతి తలచుకోనేల? ఈ రీతిగా 1920-22 వరకు తొట్రుపాటులతో దేవాలయములు కాలంగడిపినవి. అనేకం అంతిమ దశలో "నిష్ఠేద బ్రహ్మపదావలంబనగతిన్ గ్రీడించు యోగీంద్రుమర్యాద" వెలయుచుండెను. "కంచెయే చేనుమేసిన కాపుగతి యేమున్న" దను రీతిగా బాధ్యతగల హిందువులే అన్యాయ దురంతాలకు చేతులు జాచిన అన్యులకేమి పట్టినది? సంతోషించుచూ భాగాలు పుచ్చుకొనుచూ ఎవరి పని వారు చక్కబరచుకొనుచుండిరి. ఇప్పట్టున ప్రజాందోళన లున్నట్టు చరిత్రలు చూపెట్టలేదు.

మనము మద్రాసు రాజధానిలో వ్యవహరించుచున్నప్పుడు ఆ శాసనసభ మంత్రి కీ॥ శే॥ పానుగల్లు రాజాగారు ఈ యుదంతమంతా దెలిసియుండుటచేత 1923 సం॥ దేవాదాయముల చట్టం నిర్మించి హిందూమత దేవాదాయముల బోర్డు రూపొందించిరి. దానితో అనేక దేవాలయములు తల లెత్తినవి. స్వార్థులకు గర్భావేదన మిక్కుటమైనది. కొందరు చట్టమును ప్రతిఘటించిరి. చట్టమును రద్దుపరచుకొనుటకు సుప్రీం కోర్టువరకు శ్రమపడిరి. ఆ ఢాకల తర్జన భర్జనలతో చట్ట లోపాలు సరిదిద్దుకొని దిట్టపడినది. బోర్డు దినదినాభివృద్ధి జెందినది. శ్రీ గవర్నమెంటు హస్తగతమైనది.

ఇప్పు డీ డిపార్టుమెంటు గౌ. శ్రీ మంత్రుల పాలనలో క్రీడించుచున్నది. నేటి శాసన సభ్యులకు మన దేవాలయముల పీడితావస్థలు తెలుస్తున్నవి. కాని దేవాలయముల బాగోగులు కోరువారు శ్రీ రాజాగారివలె కీర్తికాంతను వరించువారు ఇంతవరకు అరుదైనందున కాలమహిమను తలపోయవలసి వచ్చినది. కాని కాలమహిమచేత కొందరు

సభ్యులు కొన్ని మాత్రం జేసినారు. ఒకాయన మోహిని చట్టం నిర్మించి దేవుని యీనాంభూములు భోగంవారికి పట్టాలు యిప్పించినారు. ఒకాయన దేవుని యినాంభూములు అర్చకులకు, దేవుండ్లకు పంపకాలు యేర్పాటు చేసినారు. ఒకాయన యినాములు పట్టాలిచ్చు చట్టం చేసినారు. ఇంకా వుండవచ్చు. ఈ రీతిగా దేవాలయాలు "క్రిందెట్లు మీదెట్లు క్రిష్టంభొట్లు" అన్నట్లు "లేరెవ్వరు దిక్కుమాలిన మొరాలకింపన్" అను రీతి స్వరించుచున్నవి.

## నేటి యుదంతము

*సదయ హృదయులారా !*

యుగాలనాటి మానవానీకముయొక్క ధైర్య, స్థైర్య, సత్య, ధర్మానుష్ఠానము లీనాడు కట్టుకథ లనిపించు చుండవచ్చు. "దైవాధీనం జగత్సర్వం మంత్రాధీనంతు దైవతం" అను సత్యమును పరిశీలించవలెనన్నచో శిథిలమైన దేవాలయములుగల గ్రామములు, పూజలులేక పాడుపడిన దేవాలయములుగల గ్రామముల క్షీణ దుర్దశలు విశాల భావమున తిలకించినచో వేదవాక్కులయొక్క సత్యము, దేవాలయములయొక్క మహత్తర ప్రయోజనములు తేటతెల్ల మగును. ఈ కాలమున దేవున్ని మాత్రం గ్రుడ్డినమ్మకముతో త్రోసివేయలేదుకాని, వర్ణ, ఆశ్రమ, మత, ధర్మములు లేవు. మోక్షము, గీక్షము హుళక్కి; ప్రకృతి సాక్ష్యమే నిదర్శమనువారికి యీ గొడవ అంతా నచ్చదు. నేడు జరుగు చుండే వేదవిమర్శనా విడ్డూర యుదంతములు క్రొత్తగా ప్రారంభమైనవికావు. యుగాలనాటి మానవానీకముయొక్క హయాములో సహితము సత్య ధర్మాదిమతములు అప్పుడప్పుడు కాలచక్ర కల్లోలమున క్రిందుమీదౌచుండుట సహజ మని చరిత్రలు తెలుపుచున్నవి. ఆ ప్రక్రియ మనకు తప్పినదికాదు. అయితే విశ్వవిఖ్యాతమగు నీశ్వర సమేష్టి యానందము అందరిని ముగ్ధుల జేయుచున్నది.

ఇటీవల ప్రపంచ మత మహాసభ ఢిల్లీలో జరిగినది. ఆ సభను ఇండియా ప్రెసిడెంటు శ్రీ బాబూ రాజేంద్ర ప్రసాదుగారు ప్రారంభించుతూ "మానవుడు మత ధర్మాలకు లేక ఆధ్యాత్మిక ధర్మాలకు తగిన స్థాన మివ్వకపోతే విజ్ఞాన శాస్త్రాభివృద్ధినుంచి ప్రయోజనము పొందలేరు" అని నుడివిరి. మరియు ఆ సభకు అధ్యక్షత వహించిన ఇండియా వైస్ ప్రెసిడెంటు శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణ పండితులుగారు "భావి మానవజాతి రక్షణ నిమిత్తం మానవుడు తాత్కాలిక బుద్ధి వైపునుంచి ఆధ్యాత్మిక చింతవైపు తన మనస్సును హృదయాన్ని మరలించుకోవాలి; మహాసభ మన మతాలపట్ల ఇతర మానవులపట్ల గౌరవం కలిగేటట్టుచేస్తే జన్మతః వ్యక్తులుగాని జాతులుగాని గొప్పవికావు అనుట మరువజాలరు" అని యుద్బోధించిరి.

ఈ అమృత వాక్కులలో భావగర్భితమగు అద్భుత పారమార్థ మిమిడియున్నదనుకుంటాను. ఈ ధర్మాలు ధర్మకర్తల హృదయాల కంకితమైననాడు దేవాలయాలు ధన్యతనొంది దేశము సర్వేషాం సుఖః ప్రమోద మొందగలదు.

## మన కర్తవ్యము

*దేవాలయోద్ధారకసుధీమణులారా !*

అయినదైనది, పోయినది పోయినది. గతమును అవగాహన జేసుకున్నాము. ప్రకృత మీనాడు మన విజ్ఞానమును వినియోగించి మన కర్తవ్యమును నిర్ణయించుకొనవలసిన సమయ మిదే ననుకుంటాను. శైలాసాధిపతి యగు శ్రీ భ్రమరాంబ మల్లికార్జునులు, మన యాప్సితములు సిద్ధిజేయుటకు నిరీక్షించుచున్నారు. సందియము వలదు. కార్యాలోచన నిమగ్ను లగుదురుగాక!

మన యీ ఆందోళన ఈనాటిది కాదనియు, వెనుకటికాలమున నీరీతి అనేకము జరిగియుండుటచేతనే ఇంత వరకు కొన్ని దేవాలయములైనా ధరణిపై మనియుండగలిగెననియు విశదపడుచున్నది. నేటి ఆందోళన పెరవలి ప్రథమ సభతో చరిత్రలో నూతనాధ్యాయమును ప్రారంభించుకొన్నది. పెరవలి ధన్యత గాంచెను.

ఇయ్యది ప్రజాప్రభుత్వం. ప్రజలలో గొప్పచైతన్య మున్నది. ప్రజలయొక్క మన్నన, ప్రజల చేదోడు వాదోడు లేనిది పాలనావిధానము సుకరము, శ్రేయము నొందజాలదని రాజనీతిజ్ఞు లంటున్నారు. "వైజ్ఞానిక, వేదాంత

శిరోమణి" యగు శ్రీ డాక్టరు రాధాకృష్ణ పండితులు, రాజరాజన్య శిరోరత్నమగు శ్రీ డాక్టరు బాబు రాజేంద్రప్రసాదు, సప్తఖండములయందు రాజనీతిజ్ఞతయం దారితేరిన శ్రీ డాక్టరు నెహ్రూపండితులు, మున్నగు మహాశయులు ప్రజా రాజ్యమున ప్రజలబాధ్యతలు నొక్కిచక్కాణించుచున్నారు గదా! దేవాలయముల అభివృద్ధులులేని సూత్రములుగల శాసనములను పాటించవలయునా? లేక దేశ సుఖప్రదములగు దేవాలయాభివృద్ధి రక్షణలుగల వేదమహర్షుల సూత్ర ములవంటి శాసనములను పాలించి కృతార్థత జెందవలయునా! అను నిర్ణయాలు ఆలోచించుటే మన కర్తవ్యమని తలచుచున్నాను.

పెరవలి ప్రథమ మహాసభలో అత్యావసరమగు కొన్ని తీర్మానములు కావింపబడినవి. ఈ మహాసభకు అనుభవజ్ఞులు దేవాలయములపై భక్తివిశ్వాసములుగల పెద్దలగు ధర్మకర్తలు అనేకు లరుదెంచినారు. మీ మీ అనుభవాలు వ్యక్తపరచి, దేవాలయముల ఆస్తులు పారుపోక దక్కించి దేవాలయములు ఎక్కువ అభివృద్ధుల జెందించుదురని మిక్కిలి ఆశించినాను.

దేవాలయముల ఇనాం భూములు భోగంవారికి, అర్చకులకు తదితరులకు పంపకంజేసినట్లు విశదపరచు కున్నాము. దేవుడు మైనరు. మైనరు ఆస్తి అలా పంపకాలు జేయుటకు ఎవ్వరికి ఏలాటి హక్కులులేవని ఇటీవల సుప్రీం కోర్టు తీర్మానించినదని విన్నాను. నిజానికి దేవాలయాల ఆస్తులు అలా పంపకాలగుట దేవాలయా లంతరించుటకున్నూ హిందూమతమును కూలద్రోయుటకున్నూ పునాదులేనని గట్టిగా చెప్పవలసియున్నది. ఆవిధముగా నమ్మవలసియున్నది. ఈ ఆస్తులు భుక్తపరచుకొన్నవారినుంచి సుళువుగా దేవాలయాలకు స్వాధీనమగుటకు ప్రభుత్వము చెయ్యిజేసుకోవాలి.

## ముగింపు

*దయాంబుధి భక్తచింతామణులారా!*

దేవాలయముల క్షీణస్థితులగురించిన ఆందోళనను ప్రత్యక్షముగా గాంచుటకు ధర్మాదాయముల మంత్రి గౌ॥ శ్రీ ఎ. భగవంతరావుగారు, స్వపరిపాలనా మంత్రి గౌ॥ శ్రీ డి. సంజీవయ్యగారు, ధర్మాదాయముల కమీషనరు శ్రీ పైడి లక్ష్మయ్యగారు, గజేంద్రుని రక్షణకు శ్రీహరి పారిపోవుచుండగా "తనవెంట సిరి లచ్చివెంట నవరోధవ్రాతము దాని వెన్కను బక్షీంద్రుడు" అని పోతన గాంచిన రీతిగా తదితర అధికారులు దేవాలయాల అవరోధాలు దీర్చగల మహాదయాసముద్రు లెల్లరు నరుదెంచినారు. మన సదుద్దేశ్యములు రక్షణపొందగలవని ఆసించుచున్నాను.

విశాలమగు మనజిల్లాలో శ్రీ ప్రభుత్వం అజమాయిషి క్రింద షుమారు మూడువేల దేవాలయములున్నవి. అదుపు ఆజ్ఞలేని దేవాలయములు షుమారు పదివేలున్నవి. జీవచ్ఛవములైన దేవాలయములు షుమారు ఆరువేలుండవచ్చు. భూగర్భమున అణగారిన దేవాలయములు సుమారు నాలుగు వేలుంటవి. వీటికన్నింటికి యినాం భూములున్నవి. కొన్ని పలుకుబడిగలవారికి, కొన్ని తదితరులకు, కొన్ని పరిచారకులకు భుక్తమైనవి, అగుచున్నవి దేవాలయములలోని దేవులకు పూజాపునస్కారములు లేక అనేకం అంతరించుచున్నవి, అంతరించినవి. ఈవిధముగా దేవాలయాల అదృశ్య కార్యము పూర్తియగుటకు ఇంకా కొంతకాలం జరుగగలదేమోననుకున్నాము. కాని ప్రస్తుతం అమలుకొచ్చిన యినాం భూముల చట్టంవలన పర్యవసానం ముంగిట చేరింది. ఈ పట్టాలు కాకముందే కొన్ని యినాములు విక్రయాలైనవి. విక్రయా లగుచున్నవి, దేవాలయముల స్థలాలు కొందరు డెవలప్మెంటు స్కీముకు అంటగట్టి భవనాలు కట్టినారు, కట్టిస్తున్నారు. కొందరు స్వంత వినియోగాలకు భవనాలు కట్టినారు, కట్టిస్తున్నారు. వీటినన్నిటిని దేవాలయాలకు దక్కించాలి.

మన సంఘము సురక్షితముగా సుస్థిర సేవజేయుటకు ఆర్థికపుష్టి గలిగించాలి. మన సంఘ సదుద్దేశ్యములు ప్రజాలోకమున ప్రాకుటకు "శ్రీశైలం" అను ఒక వారపత్రికను ప్రచురణ జరిగించాలి. ప్రభుత్వము దేవాలయాల ప్రాముఖ్యత, రక్షణ మున్నగువాటి నుద్బోధించుటకు ప్రచారకుల నియమించాలి. దేవాలయముల యినాములపై విధించు పట్టారేటు పన్నులో పూర్వము యినాం రేటునిస్తు మినహాయించుకొని ఎక్కువగల శిస్తురూకలను దేవాలయాలకు బేరీజు పద్దుక్రింద యిప్పించాలి. పూజలులేక శిథిలమైన దేవాలయముల యినాములు పరహస్తంనుంచి భక్తులు ఆకర్షించిన పేద దేవాలయాల కిప్పించాలి. కనిష్ఠ తరగతి దేవాలయాలకు ప్రభుత్వం ఏటా వసూలగు కంట్రిబ్యూషనులో క్షేమనిధి పద్దు

క్రింద గ్రాంటు యిప్పించాలి. యోగ్యతగల దేవాలయములు స్థాపించుకొన్న ప్రాథమిక పాఠశాలలను ప్రభుత్వం గుర్తించి ప్రారంభంనుంచి గ్రాంటు నొసగుటకు కోరాలి. డెవలప్‌మెంటు స్కీముక్రింద ప్రజల కందజేయు సంగీత భజన సామగ్రులు దేవాలయాల భజనలకు, గ్రామ ప్రభాతసేవోత్సవాలకు అన్వయింపజేయాలి.

శ్రీ పైడి లక్ష్మయ్యగారు సభాజ్యోతిని వెలిగించినందులకు కృతజ్ఞతలు దెలుపుచూ వారి పాలనకాలముననే దేవాలయముల అనర్థములు అంతమొంది, ఆజ్యోతి విశ్వఖ్యాతిగా ప్రజ్వరిల్లుచూ దేదీప్యమానమై వెలగాలని సర్వేశ్వరుని ప్రార్థించుచున్నాను.

బాధ్యతగల అమాత్యులు గౌ॥ శ్రీ ఎ. భగవంతరావు, యం.ఎ.,ఎల్.ఎల్.బి. గారు సభాధ్యక్షత వహించుట, గౌ॥ శ్రీ డి. సంజీవయ్య. బి.ఎ.,బి.యల్., మంత్రిగారు సభను ప్రారంభించుట ఆంధ్ర ప్రదేశ్ వ్యాప్తమగు దేవాలయములు పునరుద్ధారణయగు సుసమయ మాసన్నమైనదనియే గోచరమగుచున్నది. కేంద్ర ప్రభుత్వము దేవాలయములగోడు ఆలకించుటకు శ్రద్ధవహించరని పేపర్లలో చదివినాను. ఈ సభవారు ఆంధ్ర ప్రదేశ్ దేవాలయముల రక్షణలను దృష్టియందుంచుకొని చేసిన ఈ తీర్మానములను ధన్యత నొందించి త్వరలో చట్టరూప మొందించి కేంద్ర ప్రభుత్వ విచారణకు ఆదర్శనీయముగా రూపు రేఖలు దిద్ది దేవాలయాలను శాశ్వతముగా మనింపజేయాలని మంత్రుల వారిని ప్రార్థించుచూ సభవారి కందరికి వందనములర్పించి ముగించుచున్నాను.



ఆంధ్రప్రదేశ్ కార్మికశాఖామాత్యులు శ్రీ డి. సంజీవయ్య, ధర్మాదాయశాఖాధ్యక్షులు శ్రీ పైడి లక్ష్మయ్యగార్లకు కర్నూలుజిల్లా దేవాలయాల ధర్మకర్తల ద్వితీయ మహాసభ ఆహ్వాన సంఘంవారు సమర్పించిన సన్మానపత్రములో ఈ క్రిందివిధంగా విన్నవించారు.

*అమాత్యశేఖరా!*

భారతావనియందు ప్రసిద్ధిగాంచిన మహాపుణ్యక్షేత్రమగు ఈ శ్రీశైలభ్రమరాంబ మల్లికార్జునస్వాముల సన్నిధిన స్వాగతమిచ్చు భాగ్యము లభించినందులకు ధన్యులము. మా ఆహ్వానమును మన్నించి రాజకీయకార్యము లెన్నియున్నను ఇందరుదెంచి సభను దిగ్విజయమొందించిన మీరలకు అనేక కృతజ్ఞతావందనములు.

*రాజకీయధురంధరా!*

యుగాలనుండి అవిచ్ఛిన్నముగా విరాజిల్లుచు చరిత్ర ప్రసిద్ధిజెందిన హిందూదేవాలయము లీనాడు అనేకము క్షీణదశలో దైన్యమొందుచున్నవి. దేవాలయములు ప్రజానీకమున కవసరమగు విజ్ఞాన, జీవన మున్నగు ప్రవృత్తులు వృద్ధిబొందించుటకు ఎంతో తోడ్పడుచు ప్రభుత్వ వ్యయము క్లుప్తపఱచి పాలనకీర్తి ప్రకాశింపజేయుట తమకు తెలియనిదికాదు.

ప్రభుత్వం సృష్టించిన ఇనాంభూముల చట్టం దేవాలయములు, మఠములపై వజ్రాయుధమువలె చెలరేగి కొన్ని భూములు వ్యక్తులకు పట్టాలు కలిగించుచున్నది. అమ్మకాలగుచున్నవి. ఈ ఆచరణతో అప్పుడే కొన్ని దేవాలయాలలో పూజలులేక మూతబడి, స్థలాలు ఇండ్లకు, దొడ్లకు భుక్తమగుచున్నవి. ఈ విధముగా ఆంధ్రావని గల అన్ని దేవాలయములు, మఠములు అస్తమంకాకముందే వీటికి సంభవించిన విఘాత, విచ్ఛిన్న దుర్దశలు ఇనాం భూముల చట్టములో మినహాయించి రక్షణలుగలిగించాలని కోరుచున్నాము—

ఇదివరలో ప్రభుత్వము ఇనాంభూముల సర్వీసుదార్ల పేర్లు తొలగించి సర్వీసు పేరు వుంచమని **T. Q. A. - 6-1381/38** ది. 26-4-38 ఉత్తర్వు గ్రామస్థుల కందజేసినది దానితో కొందరు సర్వీసుపేర్లు తొలగించి సర్వీసుదారు పేరును దృఢపఱచినారు. సెటల్‌మెంటు కాబడిన తదుపరి కొందరీపంథా ననుసరించినారు, దీనితో వ్యక్తులిప్పుడు పట్టాలు పొందుటకు అడ్డులేకున్నది. సెటల్‌మెంటు రికార్డు పునరాలోచించి పట్టాలు రద్దుపఱచుటకు ఉత్తర్వు పాలించుటకు అర్థించుచున్నాము.

## ఆంధ్రప్రదేశ్ H.R. & C.E. కమీషనరు శ్రీ పైడి లక్ష్మయ్య బి.ఏ.,బి.ఎల్., గారికొాకమనవి

*ఆర్యా!*

తాము వెలిగించిన నీ సభాజ్యోతి భారతావని దివ్యప్రకాశమొందుటకు భగవానుడనుగ్రహించుటకు ప్రార్థించుచున్నాము.

*దైవకార్యధురంధరా!*

తాము తలపెట్టిన దివ్యక్షేత్రోద్ధరణ పథకము భక్తుల గాఢముగా నాకర్షించి విజయవంతమైనది. ఇందుకు భక్తుల సహకార ధనప్రవాహమే నిదర్శనము. తామీశాఖన పదికాలములపాటుండుటకు భక్తులు శ్రీ విశ్వేశ్వరుని వేడుచున్నారు. అనుపమ అనుభవాలు గడించిన పుణ్యమూర్తులగు తాము నేడు దేవాలయముల, మఠముల కూల ద్రోయు అనంతశక్తుల నివారణోపాయములు తమకు తెలిసివుండియు తమ డిపార్టుమెంటునే మూసివేయవలసిన తరుణము చేరువయగుచుండగా తాము మిన్నకుండినందులకు లోకము విస్తుజెందుచున్నది. తమ డిపార్టుమెంటుకు, దేవాలయాలకు, మఠాలకు భారతావనిలో ఆదర్శమగు రక్షణమార్గాలు ఆలోచించి త్వరలో చట్టరూపమొందించి తమకేగాక, మన ఆంధ్రప్రభుత్వమునకు శాశ్వతకీర్తి చేకూర్చవలెనని అనంతకోటి భక్తులు ఆశించి ఆదుర్దా జెందుచున్నారు.

మీకెల్లరకు శ్రీశైలవాసు డాయురారోగ్యైశ్వర్యము లొసగి రక్షించుగాక!

*[తీర్మానాల వివరాలు తక్కిన ఉపన్యాసాలు జనవరిసంచికలో ప్రకటింపబడుతాయి. –ఎడిటర్]*

★

దేవీనవరాత్రోత్సవ సందర్భంలో విజయవాడ శ్రీ కనకదుర్గగుడిలో

## కమీషనర్ శ్రీ పైడి లక్ష్మయ్యాగారికి

శ్రీ తమ్మిశెట్టి వెంకటస్వామిగారు సమర్పించిన

# దేవీ దండకము



శ్రీ శాంకరీ! దేవి! చిద్రూపిణీ! దుష్ట సంహారిణీ! శిష్ట సమ్మోదినీ! పాహి దుర్గా! కృపాదత్త భక్తావన వర్గా! జితానేక దేవారి వర్గా! సదా సాధు రక్షైక మార్గా! దయంజూచి రక్షించుమో స్వర్ణ దుర్గా! మహాదేవి! ఈ పృథ్వినింగల్గు నిర్జీవ జీవాళి సర్వంబు నెవ్వేళ నీ శక్తిచే జన్మ సార్థక్యముం జెందు నీ శక్తి లేకున్న జీవాళి ప్రేతంబెకా! వస్తుజాలంబు వ్యర్థత్వమున్ జెందునో యమ్మ? సర్వేశ్వరీ! సర్వ దేవాంశ సద్రూపిణీ! తల్లి, నారీమతల్లీ! త్రిలోకైక మాతా! జగన్మోహినీ! ఇట్టి నీ సర్వ శక్తిత్వముం శుద్ధ చిత్తంబునన్, భక్తి తత్త్వంబునన్, నిండు మోదంబునం బారవశ్యంబునన్ డెందమందుంచి యెవ్వారు ధ్యానింతురో, వారలానంద వారాశిలో జేరు భాగ్యంబు వర్ణింపగా శక్యమే! ఇష్ట కామేశ్వరీ! మేటి విశ్వేశ్వరీ! పాహి, మహేశ్వరీ! దుష్ట సంహార మూహించి రౌద్రంబునన్ మించి, క్రోధంబు సంధించి, యష్టాదశంబైన హస్తంబులం జాచి, చక్రంబు ఖడ్గంబు శూలంబు పాశంబు, వజ్రంబు దండంబు, విల్లంబులన్ బూని, వ్యాఘ్రాజినం బొప్పుగా దాల్చి, బల్ భీకరంబైన సింహాసనం బెక్కి, గ్రుడ్లెఱ్ఱగాజేసి గర్జించి హ్రీంకారివై, యట్టహాసంబునన్ బెట్టుగా నొక్క ఘింకారముంజేయ, బ్రహ్మాండ భాండంబు లొక్కుమ్మడిన్ దారుమారౌచు గంపింపవే! కొండలున్ బెండులై గాలి కల్లాడిపోవే, మహాశక్తి! వేదుష్టలోకంబునుం బట్టి, చెండాడి పాదంబులన్ మెట్టి, మర్దించి మర్దించి, బాధించి బాధించి, వేధించి వేధించి, శీఘ్రమ్ముగా దుమ్ముగా ధూళిగాజేసి, బోకార్చవే దుష్ట సంక్షోభిణీ! భైరవీ! అంబ! ఓ దేవి! నీ రూపు గన్నంతనే, పేరు విన్నంతనే శాకినీ ఢాకినీ గాలిదయ్యంబులున్, ధూళి భూతంబులన్ గోలుగోలంచు గగ్గోలునుంబొంది భీతిల్లి వెయ్యామడల్ పాఱి నిశ్చేష్టులై నాశముం జెందవే, శాంభవీ! కాళి, క్లీంకారి! నీ భక్త సందోహమున్ బ్రోవ నెవ్వేళ సంసిద్ధవై యుండు మాయమ్మ మత్ప్రార్థనం బొందు శాంతాత్మవై నిండు ప్రేమంబుతో జక్క నాలింపుమమ్మా! జగన్మాత! శ్రీ పైడి వంశాబ్ధిసోముం డుదారుండు శాంతుండు దాంతుండు లక్ష్మయ్యనామాభిరాముండు నిత్యంబు నీ దివ్య లీలా ప్రదేశంబులన్ జూడగా నోచుకొన్నట్టి దివ్యుండు, నీ సేవలం దెట్టి లోపంబు రానీక సద్భక్తి నీక్షించు భక్తుండు నీ మ్రోల నిచ్చోట నీనాడు నున్నాడు జూడమ్మ! భాగ్యంబు నైశ్వర్య భోగంబు దీర్ఘాయు రారోగ్యము న్నిచ్చి కాపాడగా నిన్ను ప్రార్థింతుమో యమ్మ! మా మాట మన్నింపుమోయమ్మ! మీవారమమ్మా నమస్తే సమస్తే నమస్తే నమః.



# స్తుతులు - నుతులు

[నవరాత్రోత్సవాల సందర్భంగా దేవాదాయ ధర్మాదాయ శాఖాధ్యక్షులు శ్రీ పైడి లక్ష్మయగారి అధ్యక్షతను విజయవాడలో జరిగిన కవయిత్రుల సన్మానసభలో కవయిత్రులు చదివిన వారివారి రచనలలో నుంచి ముఖ్యమైనవాటిని యిక్కడ ప్రచురిస్తున్నాము. ఈ సన్మానసభలకు సంబంధించిన వార్తలు క్రిందటి నెల సంచికలోనే ప్రచురించాము. ఎడిటర్.]

౧

శ్రీ రాజ్యప్రజితాద్రిమాద్రి జెలువై, కృష్ణాస్రవంతీ పయో
ధారాధౌతదరీమణీ విలసితోదాత్త ప్రభాహార్య శో
భారమ్యాగ్రతటీనివాసినిని, సమద్వాణీ రమారక్షణో
దారన్ దుర్గ మదంబిక న్గొలుతు భక్తశ్రేణి పాలింపగన్.

దుర్గా మల్లీశ్వరు లప
వర్గప్రాపకులు, దళితపాపౌఘతమో
వర్గపరిరక్షణా సై
సర్గదయాపరులు పరమశాంతుల నెంతున్.

గంగారూపిణి, కృష్ణవేణి, నిజభంగ స్ఫూర్తినుత్తుంగమై
గంగాజూటుని, లోగొనంగడగ, వీకన్ గౌరి భూమీధరో
త్తుంగ ప్రాంగణసీమ నిల్చుటకు నెంతో శక్తిరూపంబునన్
గంగాస్పర్శవిముక్తి, భర్త కిడు దుర్గాదేవి మిమ్మోనుతన్.

రచన : శ్రీమతి దేశిరాజు భారతీదేవి



# శ్రీ కనకదుర్గ మల్లేశ్వరస్వామి ఆరాధనోత్సవములు

౨

శ్రీమన్మహా స్వర్ణదుర్గా! సమస్తాపవర్గా! త్రిలోకేశ! సర్వేశ! మల్లేశ్వరాత్మప్రియా! సుప్రియా! సర్వలోకాభయా! విశ్వజనయిత్రి! గాయత్రి! కారుణ్యగాత్రి! త్రినేత్రి! జగద్ధాత్రి! కల్యాణచారిత్రి! ప్రజ్ఞానదాత్రీ! విధాత్రీ! నమస్తే!

త్రైలోక్యసౌందర్య చిద్రూపిణీ! సచ్చిదానంద పీయూష సంవర్షిణీ! దీనసంరక్షిణీ! భక్తచింతామణీ! సర్వమాంగళ్య దాక్షాయణీ! దివ్యవాణీ! త్రివేణీ! నమస్తే!

శివా! చారుశీలా! భవా! శాంభవీ! వేదమూలా! కృపాపాంగ వీక్షావిలోలా! సదా పుణ్యమూలా! మహాపాప నిర్మూల! సర్వాంధతామిస్రజీమూతవాతూల! సర్వంసహాభార నిర్వర్తితాఖేల! సర్వావనీపాలనోద్వేల! బాలా! నమో!

విశ్వలీలావినోదా! జగత్త్రాణపారీణ దీక్షాప్రమోదా! పరాశక్తి! ముక్తిప్రదా! వేదవేదాంత వేద్యా! నమస్తే!

సమస్తప్రపన్నార్తి విచ్ఛేదకర్త్రీ! మహాయోగమూర్తీ! ప్రశాంత ప్రసన్న, ప్రసాదాత్మమూర్తీ! స్వయంజ్యోతి! స్వర్భూతి! శ్రీ పార్వతీ మాతృదేవీ! నమస్తే!

శ్రీ విజయవాటీపురీ! శాంకరీ! రాజరాజేశ్వరీ! రాజమల్లేశ్వరీ! శ్రీమహాగౌరి! మాహేశ్వరీ!

శ్రీకృష్ణవేణీమహావాహినీ తీర మాహేంద్ర కీలాద్రి సంవాసినీ! సర్వతోభద్ర సంధాయినీ! విశ్వసమ్మోహినీ! సర్వసౌలభ్య సందర్శినీ! సింహికావాహినీ! శ్రీభవానీ! మందహాస ప్రఫుల్లారవిందాననా! చిద్విలాస ప్రబోధాత్మ యోగాసనా!

రత్నమాణిక్య గాణిక్య కోటీర భాస్వత్ప్రభాభాసితా! వజ్రవైడూర్య తాటంక కేయూర మంజీర హారావళీరాజితా! దివ్య సౌభాగ్య సంపన్న సంశోభితా! భవ్యతేజో విరాజత్ప్రభావాన్వితా! నవ్యతారుణ్య లావణ్య సుశ్రీయుతా! సర్వసంస్తుత్య సంపూజితా! నిత్య సత్యస్వరూప ప్రదీపా నమో! శుద్ధబుద్ధాత్మ చిద్రూప దీపా నమో! ముక్తరూపా నమో! జ్ఞానదీపా నమో! శ్రీమదోంకార రూపా నమో! సర్వసంశ్రేయ రూపా నమో! పాహిమాం పాహి శ్రీ కనకదుర్గా మహాదేవదేవీ! నమస్తే! నమస్తే! నమః.

రచన: శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ



# దివ్య యాత్ర

## 3

కృష్ణవేణీతటంబున నింద్రకీల
పర్వతంబున వసియించి భక్తులకును
భుక్తిముక్తుల నిత్తువు భూరి మహిమ
కనకదుర్గమ్మ నా నమస్కృతులు నీకు.

నిత్యకల్యాణి నీ నిలయంబు నిరతంబు
నిత్యకల్యాణమై నెగడునమ్మ
వినవచ్చునెప్పుడు వేదగానంబులు
మేళతాళములతో మేళగించి
శాస్త్రాది గ్రంథముల్ బహు పురాణంబులు
శ్రుతిపేయ మగుచుండు శ్రోతలకును
నిత్యోత్సవంబులు నిరతాన్నదానముల్
భక్తుల సందడి పరిఢవిల్లు
దినదినంబును సేవింత్రు దివిజవరులు
అడుగులకు మడుగులొత్తుదు రవని సురులు
యోగదృష్టిని నిన్గాంత్రు యోగివరులు
రమణి యేమందు నీ హజారపు బసందు!

నీకొండ నివసించి నిష్ఠతో మునివరుల్
తపము లెస్సగఁజేసి ధన్యులైరి
నిన్నాశ్రయించియే నిరుపేద జనులెల్ల
దారిద్ర్యమును ద్రోచి ధనికులైరి
నీ ప్రాపు గాంచియే నియతులై భూసురుల్
ఇహపరంబులను సాధించినారు
నిను కోరి కొల్చియే నిత్యసౌభాగ్యంబు
సాధించుకొనినారు సాధ్వులెల్ల
జనని నీ చూపు పన్నీటిజల్లు మాకు
మాత నీ దరహాసంబు మల్లెసరులు
తల్లి నీ ప్రేమ మమృతంపు ధామమమ్మ
దేవి నీ దర్శనమె మాకు దివ్యయాత్ర

ఒకవేళ తల్లివై యుత్సంగమున జేర్చి
పసిబిడ్డలటు జూతు ప్రజలనెల్ల
ఒకనాడు తండ్రివై సకలమ్ము సమకూర్చి
హితముగోరుచు నుందు వెల్లప్రొద్దు
ఒక్కొక్క సమయాన నొజ్జవై విద్దెల
తెల్పుచు మము తీర్చి దిద్దుచుందు
వొకట నార్తుల బాధ లుపశమింపగజేసి
ప్రాణదాయినివౌచు ప్రణతిగాంతు
వన్నియును నీవయై ప్రజ కన్నియెడల
కామితార్థము లొసగెడు కల్పవల్లి
వగుచు వెలసిన నీశక్తి నరసి తెలియ
నల్పమతులైన మాబోంట్లకలవియగునె!

సాటి మగువవుగాన నేనాటికైన
భక్తి భజియించి ముక్తిని బడయవచ్చు
ననెడి యాశను నిను గొల్తు నహరహంబు
నెలమి పూజించు నీవారి నేలు మమ్మ!

రచన : శ్రీమతి రావూరు వెంకట సుబ్బమ్మ



దేవాదాయ, ధర్మాదాయశాఖ కమీషనర్

# శ్రీ పైడి లక్ష్మయ్యగారి పర్యటన విశేషాలు



7-11-59 వ తేదీన శ్రీ లక్ష్మయ్యగారు గుంటూరునుంచి అమరావతివెళ్ళి అక్కడ అమరేశ్వరాలయానికి వెళ్ళారు. అక్కడ చురుకుగా జరుగుతున్న పనులను పరిశీలించారు.

## ముట్లూరు

నవంబర్ 8 వ తేదీ గుంటూరుకు ఏడుమైళ్ళ దూరంలోఉన్న ముట్లూరులోని రామలింగేశ్వర స్వామి చెన్నకేశవస్వామి వార్ల దేవాలయాలను దర్శించారు. ఈ దేవాలయాల్లో జరుగుతున్న అభివృద్ధికరమైన పనులన్నిటినీ సావధానంగా పరిశీలించారు. ఈ సందర్భంలో జరిగిన మహాసభకు సుమారు వేలమందిజనం తిరునాళ్ళ రోజులలోవలె వచ్చారు. శ్రీ లక్ష్మయ్యగారు సభకువచ్చిన మహాజనాన్ని ఉద్దేశించి భారతీయసంస్కృతీ వైశిష్ట్యాన్ని గురించి విపులంగా గంభీరమైన ఉపన్యాసంచేశారు. ఆసభలోనే అనేకమంది ప్రజలు "ఈ దేవాలయం అభివృద్ధికి యింకా హెచ్చుగా సహాయపడా"లని శ్రీ లక్ష్మయ్యగారికి విజ్ఞప్తిచేశారు.

## సింహాచలం - విశాఖపట్నం

శ్రీ లక్ష్మయ్యగారు నవంబర్ 12 వ తేదీన విశాఖపట్నంనుంచి సింహాచలం వెళ్ళారు. అక్కడ అతిచురుకుగా జరుగుతున్న రోడ్డుపనిని పరిశీలించారు, ఇప్పటికి మైలుదూరం రోడ్డుపని పూర్తి అయినది. జనవరినాటికి కొండపైనున్న దేవాలయం వద్దకు జీపు ప్రయాణంచేసే అవకాశం యీరోడ్డు కల్పించగలదని శ్రీ జి. యస్. యన్. రామమూర్తిగారు శ్రీ లక్ష్మయ్యగారికి వివరించారు. అక్కడ అతి చాకచక్యంతో జరుగుతున్నపనికి శ్రీ లక్ష్మయ్యగారు సంతృప్తి ప్రకటించారు.

## అన్నవరం

శ్రీ పైడి లక్ష్మయ్యగారు ఆంధ్రప్రభుత్వ హోం శాఖ డిప్యూటీ సెక్రటరీ శ్రీ వి. పి. రామారావు శ్రీ జె. సి. నాగిరెడ్డి M. L. A. శ్రీ మండలి వెంకటకృష్ణారావు M. P. గార్లతో అన్నవరం వెళ్ళారు. కార్తీక శుద్ధఏకాదశినాడు అన్నవరంలో జరిగే శ్రీ సత్యనారాయణస్వామి వారి వ్రతాలను పెక్కింటిని చూచారు.

అక్కడ జరుగుతున్న నాలుగులక్షల రూపాయల విలువగల పనులను సమీక్షించారు నూతనంగా నిర్మితమైన యాత్రికుల మందిరాన్ని పరిశీలించారు. ఈ మందిరానికి త్వరలో మన ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు ప్రారంభోత్సవం జరుపనున్నారు.

## రాజమండ్రి

నవంబర్ 16వ తేదీన కమీషనర్ శ్రీ లక్ష్మయ్యగారు రాజమండ్రి వెళ్ళారు. మార్కండేయస్వామి కోటిలింగేశ్వరస్వామి దేవాలయాలను దర్శించారు.

10 వేల రూపాయలఖర్చుతో కోటిలింగేశ్వర స్వామివారి దేవాలయానికి ప్రహారీ గోడకట్ట

డానికి గర్భగుడిలో స్ఫటికపురాళ్ళు వేయించడానికి అనుమతి యిప్పించవలసిందని శ్రీలక్ష్మయ్యగారికి ధర్మకర్తలు విజ్ఞప్తి చేశారు.

సాయంత్రం రామకృష్ణ సేవాసమితిలో జరిగిన మహాసభలో శ్రీ లక్ష్మయ్యగారు ఆంధ్ర సాహిత్య చరిత్రను వివరించారు. ద్వ్యర్థి, త్ర్యర్థి, చాతురర్థిక ప్రబంధాలపై అనర్గళంగా వుపన్యసించారు. అదే సభలో ఆస్థానకవి శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారు రచించిన "శ్రీకృష్ణ స్వీయచరిత్ర" అనే పద్యాత్మకమైన ఆత్మకథను ఆవిష్కరించారు. ఈ పుస్తకాన్ని ఆస్థానకవి తమ తల్లిదండ్రుల కంకితమిచ్చారు. ఈ మహాసభకు దాదాపు 2 వేల మంది జనం వచ్చారు. శ్రీ లక్ష్మయ్యగారు ఈ సభలోనే లలితకళలపై ప్రసంగిస్తూ "రాష్ట్రంలో వివిధ దేవాలయాల ఆదాయాన్ని బట్టి ఆ చుట్టుపక్కల గ్రామాల ప్రజల్లో మన మతంపైన పురాణాలపైన కవిత్వం శిల్పం మొదలైన వివిధ లలితకళలపైన అభిరుచికలిగేట్లు ప్రచారంసాగించాలని దేవాదాయ ధర్మాదాయ శాఖ యత్నిస్తున్నదనీ దానికి ప్రజలంతా సహకరించాలని" విజ్ఞప్తి చేశారు.

"ఈ రాజమహేంద్రవరం నన్నయభట్టారకుని నాటినుండి నేటి ఆస్థానకవి వరకూ ఆంధ్ర భాషకు సంస్కృతికి నిలయంగానే ఉన్నది. కవితా కళ దైవదత్తమైనది. అభ్యసిస్తే అలవడేది కాదు. ప్రపంచంలోని అన్ని భాషలకు సంస్కృతం తల్లి భాష. అటువంటి సంస్కృతంలో కూడా శ్రీ కృష్ణమూర్తిశాస్త్రిగారు సరళమైన కవిత్వం చెప్పగల్గడం ఆంధ్రుల అదృష్టం" అని కూడా శ్రీ లక్ష్మయ్యగారన్నారు.

రిటైర్డ్ జిల్లా జడ్జి శ్రీ టి. హెచ్. యం. సదాశివయ్యగారికి "ధర్మజ్ఞశేఖర" అనీ, శ్రీ వైడి లక్ష్మయ్యగారికి "కవి చకోర చంద్రోదయ" అని శ్రీ కృష్ణమూర్తిశాస్త్రిగారు బిరుదప్రదానం చేశారు.

## గూడూరులో త్యాగరాజస్వామి ఆరాధనోత్సవాలు

నెల్లూరు జిల్లా గూడూరులో ఉన్న శ్రీప్రసన్న వేంకటేశ్వరస్వామివారి దేవస్థానంలో గూడూరు తాలూకా నాయీ బ్రాహ్మణ సంఘం అధ్వర్యాన శ్రీ త్యాగరాజస్వామి ఆరాధనోత్సవాలు 25-10-59 మొదలు 27-10-59 వరకు వైభవోపేతంగా జరిగాయి.

శ్రీ వెంకటేశ్వరస్వామి దేవస్థానం ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ శ్రీ ఎ. యల్. నరసింహయ్యగారి అధ్యక్షతను విద్వాంసుల గాన కచేరీలు జరిగాయి. ఈ ఉత్సవాలలో అనేక మంది పండితులు భక్తులు పాల్గొన్నారు.

## పుత్తూరు చెన్నకేశ్వర హనుమదీశ్వర స్వామివార్ల పునఃప్రతిష్ఠ

### అసిస్టెంటు కమీషనర్ శ్రీ కె. గోపాలన్ అధ్యక్షతను మహోత్సవం

నెల్లూరుజిల్లా సూళ్లూరుపేట తాలూకా నాయుడుపేట సమీపంలో ఉన్న పుత్తూరు గ్రామంలో సుమారు రెండు సంవత్సరాలుగా పూజలు పునస్కారాలు లేకుండా మూతపడిఉన్న శ్రీ చెన్నకేశ్వర, హనుమదీశ్వరస్వామివార్ల పునఃప్రతిష్ఠాపనోత్సవం నవంబర్ 1 వ తేదీన నెల్లూరు అసిస్టెంటు కమిషనర్ శ్రీ కె. గోపాలన్‌గారి అధ్యక్షతను మహావైభవంగా జరిగింది. అనేకమంది ప్రజలు ఈ ఉత్సవంలో పాల్గొన్నారు.

ఆ దేవస్థానాలఎగ్జిగ్యూటివ్ ఆఫీసర్ శ్రీ ఎ. ఎల్ నరసింహయ్యగారుప్రతిష్ఠ చేశారు.

రెండు సంవత్సరాలుగా పాడుపడి ఉన్న దేవళాన్ని పునరుద్ధరించినందుకు గ్రామస్థులంతా తమ సంతోషాన్ని వెల్లడించారు.

## ఉంగుటూరులో ఉపన్యాసాలు

పెనుగొండ వాస్తవ్యులు శ్రీ కె. కామేశ్వర రావుగారు ది 13-11-59 నుండి 19-11-59 వరకు ఉంగుటూరు శ్రీ భీమేశ్వరస్వామివారి దేవాలయమంలో హిందూమత ప్రాశస్త్యము, దేవాలయములు, భక్తి మొదలగు విషయములనుగురించి నాలుగు భాషలలోని ఉదాహరణలతో చక్కగా ఉపన్యసించిరి. వేలాదిప్రజలు వచ్చి వినుటతోబాటు చైతన్యమును పొంది నామసంకీర్తన కూడ చేసిరి. వీరికి దేవాలయపు అధికారులు రు 116-0-0 లు ఇచ్చి సన్మానము చేసిరి.



## చందాదారులకు మనవి

రెండు సంవత్సరాలకు మించకుండా అనేకమంది చందాదారులు ఆరాధనకు తమ చందాలను చెల్లించనివా రున్నారు. మరికొందరు క్రిందటి సంవత్సరం చందా చెల్లించలేదు. బాకీ ఉన్న చందాదారు లందరూ తా మివ్వవలసిన చందాలను వెంటనే మనియార్డరు ద్వారా పంపగోరుతున్నాము. చందాదారులు వ్రాసే ఉత్తరాలలో కొందరు తమ చందా నెంబరు వేయడంలేదు. ఇకమీదట చందా నెంబరు వ్రాయనివారికి ప్రత్యుత్తరం వ్రాయడం సాధ్యంకాదని మనవిచేస్తున్నాము. కొందరు ఆరాధనలు తిన్నగా అందడంలేదని వ్రాస్తున్నారు. ఆరాధన ఇకమీదట ఏ నెల దా నెల 1 వ తేదీకే వెలువడుతుంది. సంచికలు అందనివారు ప్రతీ నెలా 7 వ తేదీలోగా మా కార్యాలయానికి తెలియపరచాలి. లేకపోతే మరో సంచిక పంపడం గాని, తగు ప్రత్యుత్తరం యివ్వడంగాని సాధ్యంకాదు. కొందరు M. O. లలో వెనుకవైపున తమ చిరునామా వ్రాయడానికి మారు ఆరాధన చిరునామా వ్రాస్తున్నారు. అటువంటి పొరపాట్లు ఎవ్వరూ చెయ్యవలదని కోరుతున్నాము.

# कनकदुर्गा दण्डकम्

**श्री निष्ठल सुब्रह्मण्य सन्यासि शर्मा**
साहित्याध्यापक : श्री. भा. ना. स्वा. संस्कृत कलाशाला, सुवर्णपुरम्

भो भो महालक्ष्मि हेमप्रभे देवि सौवर्णतेजोभिरामेऽम्बिके दुर्गतिच्छेदिनीशी त्वमेवासि सत्यं स्मृतं सर्वथा नाम तत्कानकं ते महालक्ष्म्यभिख्यं महामन्त्रबीजं शुभं कामराजाह्वयं मायिकं वाग्भवं सर्वसौभाग्यदं संस्मृतं शुद्धचित्तेन येनैव तस्यास्ति हस्ते समस्तं निधानं प्रधानं जगच्चक्रमाद्यम् प्रकृष्टं तदस्तीह सौदर्शनम् कालकालार्चितम् राजराजादिभिस्संस्तुतं जन्ममृत्युप्रथाहारि तन्निर्गुणं निर्मलं निश्चलं सच्चिदानन्दरूपं तुरीयं निरीहं तुरीयातिगं सर्वथा शैवमार्षं निरालम्बनं नामरूपात्मसर्गादि लीलाविलासप्रकर्षस्य जेगीयते वेदवेदान्तसिद्धान्तसारात्मकं मातरेह्येहि चिद्रूपिणी सम्यगुत्तिष्ठ किं पूर्षु शेषे किमर्थं स्वपिष्येव शक्यं भवेन्नैव शक्यं भवेत्सर्वकार्यं कृपापूर्णदृष्ट्या सुसिद्धं सदाकर्तु मर्हासि सर्वान्तरस्थासि सत्साक्षिणी साक्ष्यसन्दर्शने भक्तसंरक्षणे दुष्टसंशिक्षणे धर्मसंस्थापनेऽधर्मनाशे च दीक्षां वहस्येव यो मां सदान्तस्सदान्तिः प्रशान्तः परं चिन्तयत्येव तस्यैव भक्तस्य योगं च तत्-क्षेममर्हामि वोढुं शुभेयं प्रतिज्ञा चकास्त्येव गीतासु वेदान्तसिद्धान्तभूतासु सर्वेश्वरी सर्वविद्याप्रभे दादिहेतुस्त्वमुक्ता त्वदीयाद्यवर्णत्रये मध्यगं मायिकं शिष्ट मन्यत्ककारात्मना ब्रह्मसंबोधकं तत्त ते कानकं दिव्य माद्यं महत्तेज एतच्चकास्त्येव लक्ष्मीप्रदं सुन्दरं श्रीमणिद्वीपगं मन्दिरं नान्दनं सर्वगं चिन्मयं पश्यत श्शृण्वतो जिघ्रतो गच्छतोऽप्यश्नतो हीन्द्रियाणीन्द्रियार्थेषु वर्तन्त इत्येवमालोचनं कुर्वतो वै हृदन्तःस्थिताज्ञाननाशाय सुज्ञानदीपं विभातं करिष्यस्यहो ते महत्त्वं कथं ज्ञातुमर्हं कथं द्रष्टुमर्हं सदा मातुरन्यत्तु दैवं परं चक्रराजात्सुचक्रं तथा श्रीयुताद्वृक्षराजात्प्रियो वृक्षराड्वासुकूट त्रयाद्वै परो मन्त्र इष्टः कृपापूर्णचित्ते त्वदंघ्र्यब्जयुग्मात्तरिस्संसृतिं सागरं तर्तुकामैश्च संसेव्यमन्यत्तु नास्त्येव नास्त्येव नास्तीति सर्वात्मनोद्घुष्यते देवि ते चित्कलाएव पञ्चात्मनो ब्रह्मणश्चैव चन्द्रस्य सूर्यस्य वह्नेश्च मुख्याः कला गीयमानास्त्रिशत्या सुषष्ट्या लसन्त्यश्च संवत्सरात्मा भवत्कालरूपो महेशश्च तद्व्योमजातं सुशब्दं तथा वायुरासीत्तु संस्पर्शशब्दात्मको ह्यग्निरासी त्परस्तत्र शब्दस्तथा स्पर्शरूपे स्त एवं सदापस्समुद्भूतिमत्य स्तथा तत्र चानंदरूपो रसो भाति पूर्वे त्रयश्चैव तस्मात्परं भूमिरासीत्तु गन्धोधिक स्तत्रचैवं नु तत्पञ्चभूतात्मिका सृष्टिरासीत्समेषां कला एव चन्द्रे च सादाख्यया भास-मानेभिवृद्धिं क्रमेणापकर्षं च गच्छन्त्यतश्शुक्लकृष्णात्मना मास एष प्रभातीव संपूर्ण मेतत्तु तन्मास-चक्रं हि संवत्सरो भाति य स्तस्य मूलं विजानाति स स्वप्रतिष्ठांगतो वैभवे देवमेवोक्तमेताश्शुभाः पञ्चभिः पूरितास्स्यु र्दशाह्वाः समष्ट्या महामन्त्रराजोभवत्पञ्चदश्यात्मना सूक्ष्मगायत्र्यभिन्नेन

रूपेण भातीवपूर्ण स्तथा नामरूपात्मसर्वप्रपञ्चोपि बीजत्रयेणैव रक्ताभिधं शुक्लसंज्ञं च मिश्रं च तत्त्रैपुरं भाति सर्वं गुरोः पादुकाद्वन्द्वचिन्ताहितम् स्यात्सदा नामरूपाङ्कुरद्वन्द्वशब्दार्थसंबन्धमूलं चिदाख्यं सदाख्यं सदानन्दरूपं महालक्ष्म्यभिख्यं सदामातृरूपं ह्यतो दौर्गमेतत्तु शाक्तं परं स्तोत्र मुक्तं परेश्याः कृपालोकनादेव सुव्यक्तमासीत्तु गैर्वाणवाचाविशिष्टं शुभं निष्ठलाभिख्यसन्यासिशर्माभिधेनेरितं वै सदा भातु भक्तार्तिदुर्गापदुद्धारकं भातु जेगीयमानं पराम्बत्वमेवासि सर्वात्मिका कृष्णया पाविते चेन्द्रकीलाभिधे पर्वते भासि दुर्गाम्बिकादेवि वैशाखपुर्यां महालक्ष्म्यमोघाह्वयेनासि ते स्तोत्रमेतत्तु विद्वल्लभं पातु भक्तान् प्रपञ्चेऽद्यसर्वत्र पूर्णो जयोस्त्वेव, नाशोऽस्त्वधर्मस्य विश्वस्य कल्याणपारम्परी- चास्तु सर्वेष्टदा प्राणिसद्भावना भातु सत्यप्रतिष्ठा भवेद्दिव्यवाणी प्रचाराभिपूर्णा जयत्यद्य सर्वेऽपि ये मानवास्तेह्यभेदेन सर्वात्मना भ्रातृभावेन सर्वस्वतन्त्रे प्रजाभिस्सदङ्गीकृते वै प्रभुत्वे तथा भारता- म्बाकृपापूर्णचित्ता भवे देवमेत न्नुतेर्वै वरान्देहि भो लक्ष्मि ते कानकी वै महत्यस्ति लक्ष्मीस्तनू- स्सर्वलोकेषु संस्तूयमाना सदा भोगमोक्षौ सुसौभाग्यसिद्धिं सदा शत्रुनाशम् सुवंशाभिवृद्धिं कुरुष्वेति नित्यम् परां शक्तिमीडे नमाम्यद्य वन्दे सदाप्रार्थयाम्येव मां पाहि दीनम् महालक्ष्मि हेमप्रभे पाहि भो देवि तुभ्यम् नमस्ते नमस्ते नमस्ते नम : ॥



# दुर्गा नवरत्नी

श्री निष्ठल सुब्रह्मण्य सन्यासि शर्मा

श्रीभारतोर्वीवलये पवित्रे
ह्यान्ध्रप्रदेशाभिधराष्ट्रमेकम्
कृष्णानदीदिव्यतरङ्गभङ्गा
नदी लसत्यत्र शुभेन्द्रकीलः ॥

तच्छैलपादेऽस्ति नदी पवित्रे
वाटी शुभा सा विजयप्रयुक्ता
यत्रास्ति शैलाग्रगता परेशी
दुर्गाह्वया स्वर्णमहःप्रकृष्टा ॥

वन्दे सदा तां कनकाभिरामां
दुर्गामगस्त्यादिमुनिप्रतुष्टां
श्रीचक्रसंपूजितबिन्दुरूपां
नित्यां कलां षोडशिकां परेशीम् ॥

रहस्यसाहस्रसुनामपूज्यां
श्रीमातृनाम्नीं ललितांबिकामीं
तिथौ च सम्पूर्णकलालयेस्मिन्
मेषादिसंक्रान्तिपवित्रकाले ॥

भृगोर्दिने वा निशि पूजनीयां
देव्या अभीष्टे शरदुत्सवे वा
श्रीबिल्वपत्रै रपि कुङ्कुमेन
प्रपूजितां विश्वशुभंकरीं ताम् ॥

नवार्णसन्मन्त्रविभावनीया
वाकाम मध्यस्थितबीजमाया
चण्डञ्च मुण्डञ्च निहत्य यास्ते
डेन्तोहि मन्त्रः खलु यां व्यनक्ति ॥

यस्याः परं तत्त्व महो नितान्तम्
श्रीसप्तशत्या प्रतिपाद्यमानम्
त्रिवर्गलाभः परमं फलं स्या
न्महत्त्वपूर्णाः खलु देवताः स्युः ॥

वेदत्रयार्थस्सुनिरूपितोऽयं
दुर्गाम्बिकाभोगसुमोक्षदात्री
तत्स्याच्चरित्रत्रितयै रहस्यं
वृत्तै नितान्तम् पठितं स्वशक्त्यै ॥

एषा त्रिरत्नी नवरत्नमाला
नवा शुभास्यात्प्रणवाभिरामा
कण्ठे धृता मानवमानवत्वं
निगूह्य तां मानवतां व्यनक्तु ॥

विमर्शानन्दगीतेयम्
नुतिः प्राकाश्यसिद्धिदा
सुप्रकाशविमर्शाढ्य
वन्दे तत्सद्गुरोः पदम् ॥



శ్రీశైలంలో రాష్ట్రపతి ప్రసంగిస్తున్న దృశ్యం.
ప్రక్కనే ఉన్న మంత్రి శ్రీ జె వి నరసింగరావుగారిని కూడా చూడవచ్చు.



రాష్ట్రపతికి స్వాగతం చెబుతున్న తిరుమల తిరుపతి దేవస్థానం బోర్డు ఛైర్మన్
శ్రీ ఏ. సి. సుబ్బారెడ్డిగారు.

(తిరుమల తిరుపతి దేవస్థానంవారి సౌజన్యంతో)

# Message of Lord Sri Krishna

SRI PARSA V. RAO, B.A.,LL.B.

Gita contains the gist of Vedanta. While Brahman is both Saguna, and Nirguna it is open to the Sadhaka to adopt either way. Bhakthi and Sagunopasana ultimately leads to Janna and Nirgunopasana. Whether one should attempt Bhakthi or Jnana in the first instance, always the choice should be Bhakthi alone. Bhakthi Marga takes one towards Brahman step by step. So there is no chance of a fall in Bhakthi Marga, whereas Jnana Marga is straight, smooth, steep and slippery. There is the grave danger of a Sadhaka, becoming a charvaka due to imperceptible vanity that may creep in him. Without achieving real Jnana, he is likely to miss the certain foothold of Bhakthi and Karma and become an "ubhaya bhrashta". One should emulate the example of Sree Sankara, a great Bhaktha himself, who worshiped and consecrated 'Panchayatana' at Badarika Ashrama. He accepted Vishnu, Hiranyagrabha-Aditya, Maheswara, Devi and Ganapathi, as Visible (Saguna) symbols of the Nirguna-Para-Brahman. His 'Bhaja Govinda Slokas' and 'Laxmi-Nrisimha Karavalamba Strotram' are consistent with 'Soundarya Lahari and Sivananda-Lahari'. He has also approved Dvaita and Vishishtadvaita, but gave them only relative importance as halfway truth, whereas advaita is the full and complete Reality. The three theories are like concentric circles, one fitting well into the other without crossing each other. If Sree Ramanuja has criticised Advaita, it is merely to show, that Saguna Brahman is good enough for the common lay man, why worry about knowing Nirguna Brahman. Sree Ramanuja was addressing himself to the common lay man which is also evident from his biography. Sree Sankara was addressing only the highest intellectuals in the land and taught that Advaita is the ultimate Reality and Visishtadvaita and Dvaita are apparently Real. There are three types of commentaries on Gita, (1) Dvaita, (2) Visishtadvaita and (3) Advaita; all quoting the same words of the text from Gita in support of their theory. It only means they have understood the context in three different ways. They formed a conviction first, and then searched Gita for support. In interpreting the text of Gita, Mukhyardha should be accepted in preference to Gaunardha. Only words found in the text should be commented upon, Pada-Vibhaga should be done according to wellknown conons of grammar, only sampradayardha should be accepted when several ardhas (interpretations) suggest themselves.

I shall attempt and give a summary of the three schools of Vedanta (1) Dvaita, (2) Visishtadvaita and (3) Advaita, so that we could all the more clearly understand, what Lord Krishna meant in the original text of Gita. In Gita God incarnate has himself spoken. So we cannot discover anything more authentic than His spoken word to reveal the Brahma-Jnana.

Always we should follow the path dictated by our concience, to select the Sadhana that will suit our level of development.

In the beginning, I shall discuss a few fundamentals of Vedanta, which it is necessary to understand, before Gita could be correctly understood. Starting with Vedanta Samanvaya I shall now discuss Drik Drishya Viveka.

---

# The Discovery of God

*Original :*

Sri Kakaraparthi Krishna Sastri

*Translation :*

Sri P. Venkateswarlu, M.A.

**( Continued from the previous issue )**

*San :* All this world is 'Paramatma'. That is why all this has been expressed in a human form.

*Gopal :* Ah ! Ah ! Just wait uncle ? Why should God be compared to a human form instead of a big tree, a mountain or a lion ?

*Bhu :* Gopala ! To say like that is not natural: For it is not the trees, the hills and the beasts that have fancied this but men alone. If an ant were asked to imagine God, it would say that God is in the form of a big ant. A bird can think of an eagle as a God and an eagle of a vulture as a God. In their species, God seems mightier not only in power but also in form. Similarly man thinks of God as man. Moreover...

*Gopal :* True, True: That will do. I could not grasp such a small thing: Uncle ! now go on.

*San :* As they conceived God in a human form, they also made these four castes as his organs. Look here ! intellectual people were formed into a group i. e., head: Some of them who had physical strength and were of a very independent nature were made shoulders. The Vaisyas who were abundantly rich were the thighs and the Shudras who were the prop of the above three castes and who had to bear the burden of them were the feet. Are not these the bodily organs of a single God ? Among these which one can neglect and ruin the rest ? If any one is harmed, the rest have to share it as they are mutually interdependent.

*Gopal :* Uncle ! You said that the Shudras are the feet of the God. Don't you mean to say that the feet have to bear the brunt of the trunk i. e.. the rest of the body ? Our be-all and end-all of life is their service. It is a 'must' for ever. Is it not so ?

*San :* Why do you wrest a wrong view of it ? Look here, Shudras are the labourers and their duty is to produce food. If it is not so, the very same day all the castes will perish. That is why I said that upon the feet depend the rest of the organs. If the legs were to stop moving, what can the other organs do but lie like logs ? That is why having realised the reality, our leaders at present are giving importance to them and are devising ways and means to improve their lot.

*Gopal :* Now I understand. Uncle ! why did not you tell me before even though I was racking my brain about this matter all these days?

*San :* Till now I did not know the secret. After hearing the discourse of Sri Swami, it immediately dawned upon my mind. This is nothing but a brain-wave.

*Gopal :* Well, Uncle ! Is it not a fact that the fourth caste, which holds the

life and death of other castes in its hands, is superior to others? Should not the other castes be under its control?

*San:* Gopal! If there is no head, where can your feet go without eyes? Can they do anything independently? What is the use of your going to the fields if your hands do not help you? Supposing your thighs are hurt severely and are unable to move, where can your legs go? So the fact is that each organ is interlinked and interdependent. One cannot work without the other. There is difference in the works. There is variance in the strength and there is clear-cut distinction in the efforts. But unless all are combined, nothing can be achieved. All creatures live on mutual cooperation. So also all these castes. If they quarrel amongst themselves and get themselves compartmentalised, all of them will be wiped out root, stock and barrel. No special importance is attached to anyone of them. Look here! Tell me which is important for a cart to move? Bullocks? Wheels? axle? or Yoke?

*Gopal:* All are essential. None can be overlooked.

*Bhu:* Bravo! Sangayya!

*San:* There is a differenee in shape of the shelter and the wheels; there is difference between strength and weekness and also high and low. There is variance in the area and in the burden to be borne. Like this there are many. So also in our castes. If we shed our intellectual stupor and un-necessary jealousy and progress hand in hand with mutual co-operation and foresight and wisdom, our country will be the strongest one and will lead to the welfare of the World.

*Gopal:* (Overjoyed) Oh! wonderful! excellent! To-day I learnt many good things. I am very fortunate.

*Bhu:* Gopala! I think till now you have not got the answer for your first question completely? Many of your questions are still untouched.

*Gopal:* In this single discussion, I got all very good replies. I have learnt that it is mere foolishness that is the cause for the bickerings of brahmins and non-brahmins. Our ancestors were great intellectuals. Out Maharishis were 'Mahajnanis'. In the old days, all the four castes lived like a single family and were happy and contented

*Bhu:* Son! I think you have a doubt about the reading of Vedas?

*Gopal:* That doubt has been cleared. The all-sustaining labour is in our hands. The whole day will be spent in observing the opportune time and carrying out the work. It is not possible to sit calm and composed and read the Vedas. If we engage oursleves in reading the Vedas, the whole system of our agriculture will be jeoparadised and will result in the ruin of the humanity. If we do not perform the right work in the right time, the whole labour done for the whole year will be fruitless. The most important duty of food production is ours. So they might have thought that if we take to other professions, everything will be in sixes and sevens.

*Bhu:* Gopala! You have understood very well. Now let us summarise the discussion. The whole humanity has been conceived as a God in the human form and among them those who are physically weak but have keen intellect and Sattwric quality have been named as *Brahmins*. Because they have intellectual capacity, they are said to be born from the *head*. Some of them who have valour, strength and Rajasic quality have been entrusted with the administration of the society in proper

way so that everyone follows his profession in accordance with 'Dharma'. So they are symbolised to be born from the *shoulders* and are named as *Kshatriyas*. Some of them have been called *Vaisyas* and their duty is to help the people by taking the things produced in one place to another place and buying the things that are scarce and supplying them to the people. They have got close contact with the Kshatriyas that rule and the Shudras that produce food. They are symbolised to be born from the *thighs*. Their strength is wealth. That is why the strong and sturdy thighs are their symbol. Without wealth, there is no buying and selling. So also without strong thighs, the whole trunk of the body will fall down, and the legs without proper circulation of food and blood will wither away. Now the fourth caste are called the *Shudras*. They are superior in strength and huge in number. They are endowed with the physical strength to bear the brunt of the trails, troubles and tribulations. Previously we have discussed at length about this group. The all-sustaining labour is their important profession. Moeover the defence of the country also depends upon them. Warfare is also their duty because they are huge in number and have physical strength and valour.

*San :* Oh ! Swamy ! Everything is as clear as daylight. Every doubt has been cleared. All these castes are essential for the sweet running of man's life.

( **To be continued.** )

# "ART AND BEAUTY"

"NEVIL"

Art is the 'Beauty' of the 'Heart'. Beauty is the 'Heart' of the 'Art'. The beauty of the heart is love and hence the heart of art is love. Love, is not as is commonly understood and interpreted, cupidity which is a stark stupidity. Love is harmony; it is the expression of the inner light; it is the language of the heart; it is the sublimest Divine light of the soul. As Emerson puts it

> "Heave thine with Nature's heaving breast,
> And all is clear from East to West."

It is feeling in All in all. "Unless you feel all, you cannot know all," says Walt Whiteman.

So Art is catching and conditioning the 'Divine flame' in eternity through spiritual vision or what is called 'Divya Drishti'. Here is a beautiful story in the World's greatest book 'The Mahabharatha'. A Princess sees the vision of a most beautiful prince and falls deeply in love with him. Under the severe passion of love she falls sick. Her father sends for all sorts of doctors and physicians and it is of no avail. At last somebody discovers that her disease is the blessed disease of love. The Prime Minister of the King comes up, puts his hand upon the pulse and orders one of the greatest painters to come up and paint the pictures of all the beautiful Kings in India. This painter was a woman. This woman-painter comes up and on a board against

the wall, she draws picture after picture of the great Kings that lived in India in those days. The Prime Minister is watching the beating of the pulse of the Princess. The paintress draws a picture of Sri Krishna. Then her pulse beats faster and the Prime Minister stops short. He thinks that here is the man whom she had seen in her vision. But he sees that the pulse does not beat fast enough and orders the paintress to go on painting pictures. Then, she paints the picture of youngest son of Krishna and when that picture is painted, lo! not only to say nothing about the pulse, but her whole heart begins to heave and beat upto the very earth as it were. Then, the Prime Minister comes to the conclusion "here is the man who will drive away her sadness".

This Divyadrishti or the Higher vibration with the All makes the book of Nature no longer a sealed book. It was an open book to her.

Every work of art is the product of the inspiration. Inspiration is the spark of the Nature's fire: it is living in harmony with the Nature; it is being in tune with the Divinity. Moreover it is the crucifixion of the little false copy-righting self.

Nature provides us with a familiar and every day example of inspiration. The atmosphere when inspired blesses us with rain. When it reaches the point of saturation it begins to rain. As the science tells us the atmosphere consistsof Nitrogen, Oxygen, Carbondioxide, Organic matter, material particles and also aqueous vapour. There comes a time when it gets saturated with acqueous vapour. But when the atmosphere is highly saturated with aqueous vapour, and a little more of it added, then the air can no longer hold its water. The superfluous water–the water above the quantity of vapour that will saturate the atmosshere—cmes down in the form of rain. Thus when the atmosphere is more than saturated with water, we have rain in this World; we have dew-fall; we have storms and we have drizzling. Similarly here is the mind; it might be compared to the atmosphere or the air. When the mind gets saturated with an idea, it fills the mind, conquers it, permeates and pervades it, fills the whole soul and saturates it. When the mind exceeds or goes beyond the point of saturation, the ideas drop down in a condensed form in black and white; that is inspiration.

Whenever we reach that point of saturation, when the mind is filled with the idea, when the whole being is lost and merged in the thought, the machine, the organ, the musical instrument is taken up by the great musician, by God, by Divinity and through this organ are produced beautiful, magnificent and sublime tunes. Great notes, splendid music emanates from the organ but so long as the child–the ego–wants to keep the organ to itself and does not want the great organist or musician to handle the organ, only notes of discord will come out of the organ. So long as this self, this false ego, this unreal self which is enjoying self is present and wants to keep hold of the body and does not let go this body, through this body or musical instrument notes of discord will come out. We have to make over this instrument or this body to the Divinity; we have to get rid of this false ego and be away with this little self; we have to sacrifice it and rise above it. Then, when the point of saturation is exceeded, God himself takes up this instrument, the great musician handles this instrument Himself and through this instrument, melodious music comes out, magnificent notes spring forth. There you are inspired. Inspiration is God-doing. When the little self gives up possession of this body, the person is inspired.

Artists, teachers, philosophers, poets and thinkers in their lines get inspiration

but this inspiration comes only through crucifixion. It is not for man to enjoy anything in accordance with the laws of Nature. The enjoyer is the false self; it is not the real self. All thinkers, philosophers will see that their bodies, their minds, and their whole beings are enjoyed by the whole World. Their bodies, their minds and everything of theirs is enjoyed by the Divinity and eaten up by Divinity. As Christ says, "Here, eat my flesh, eat it". "Here you will have to drink my blood!" at the Lords' supper! Very happy is he and blessed is he whose life is a continuous sacrifice.

In fact enjoyment is nothing else but 'Yoga' or renunciation. There is no real enjoyment except in renunciation, there is no inspiration except renunciation, there is no prayer except in renunciation. The little personality, the enjoying self and the joy cannot co-exist. The very moment when joy is there, the enjoying self is not there. The very moment inspiration is there, the idea of "I know" and "I do it" is absent, it cannot be there. Plato says, "The man who is his own master knocks in vain at the doors of poetry". One cannot be in a state to write poetry and at the same time be an enjoyer of poetry. Nobody can write and be conscious of the fact that he is writing. When he becomes the consciousness itself, then is the point of inspiration reached. The artist must be sacrificed to his art. When anyone plays the part of the greatest artist, there in the eyes of others he is a great artist but from his point of view, he is not. No thought of "I am doing" is present; he has become one with the All. He is no artist from his own stand-point. There, the interpreter, the interpretation, the writer and the writing all have become one. There all the differences have been annihilated. This is the Nature, the secret of inspiration.

People look at the rainbow and admire the colours, the beautiful magnificent tints. They like them, they admire them but when they go there where they see the rainbow, there they find no rainbow, examine or see however carefully they may. The rainbow is present in the eyes of others, but from the stand-point of the exact place or from the stand-point of the person who is seated at the place where others see the rainbow, there is no rainbow. Similarly from the stand-point of others, a person is called inspired, a great man, a writer, a painter, a thinker, a philosopher but from his own stand-point at that time, there is no delusion of this kind present—"I am writing" or "I am inspired". Like the bees, the artists must put their lives into the sting they give. The bee, when it stings you, dies after it. So he is inspired who gives his whole life into the sting he gives. A man cannot be inspired and at the same time enjoy. Others will enjoy him, the World will enjoy him when he is inspired, but he himself cannot be an enjoyer and an inspired man at the same time. He will be no enjoyer, but he will be better still joy itself. He will be a man of 'Yoga'.

An artist or a painter goes into the street and there he sees many faces; the eyes of one person charm him, those eyes are unconsciously stored up in his mind; he meets another person and the chin of that person impresses him, he stores up that chin in his mind; the eyes taken from one person and the chin stolen from another. Another man comes to his shop to purchase a picture. A picture is sold to that man, the customer goes away with the picture, knows not that he has left his hair behind in the mind of the artist. Then comes another man who wants the painter to do something for him; the painter does that something for him but he snatches the remarkable ears from this man and so impersonally the mind of the painter is at work. While the painter is appropriating the eyes, chin, nose, etc., of different people, he is not living in the idea that he is taking these but impersonally, unconsciously, this

work is being done. After a few days, the painter sits in his studio before the canvas. He wants to produce a striking portrait, and there the eyes of one person, the remarkable nose of another person, the attractive hair of another, all these are blended into one painting, and the artist brings out a most magnificent piece of work: a picture which excells all the originals. All this work was by no meens personal but purely impersonal. All this work was done by living continually in a mood free from egotistical, selfish taint, above the "I am doing" mood. Let the artist suffer from hatred or cupidity, often miscalled Love; the watch of his mind becomes magnetized, remains no longer in working order; he is deranged or out of gear. The impersonal tone of his mood is lost, he is hypnotized into selfishness, the serene mood has disappeared, the spirit that keeps him in touch with the All is replaced by limiting attachment or repulsion, and no longer can the artist's mind do the impersonal work of abstracting from the features of this man or that. The masterpower of producing exquisite work of art is gone. Thus if an artist avails himself of that higher mood, he can always keep himself at his best and the work through his hands will be perfect and the most beautiful. That higher mood is nothing else but being in perfect hormony with the universe, being in tune with the 'Divinity', practically living in the true Atman or God within and being raised above the little, proprietary and favour-currying ego or selfish desires.

Here is an illustration: Once a King wanted to get one of his most glorious palaces painted in a marvellous way. Many painters turned up hoping that the King would select the very best painter for the job. He gave them a test. Two walls stood side by side parallel to each other, and two painters were asked to paint these walls. Curtains were hanging on these walls so that the work of one painter could not be seen by the other. About two weeks were allowed to them to finish their work. One of the painters reproduced on the wall all the scenes of the 'Mahabharatha', the grandest book of the World, and his work was most marvellous and glorious indeed. The other painter was also absorbed in his own work. Two weeks passed, and the King, with his retinue came to the scene and the curtain was lifted from the work of the first painter and there were thousands and thousands of pictures on the wall. Everybody who looked at the wall was wonder-struck. How glorious was the work ! All the spectators cried out, "give him the reward, select him for the highest work which you want to be done ! Let him be the Victor, Let him be rewarded." Then the King ordered the other painter to lift up his curtain. When the curtain was lifted, all the people stood there with bated breath, their lips half open their breathing suspended, and their eyes wide open, with amazement. They could not utter a word;they were pictures of amazement and surprise. Why? What had this second man done? Everything on the wall of the first man was inscribed on the wall of the second man,with the difference that while the first man'spaintings were relatively rough and rugged and uncouth, the second man's paintings were so smooth, neat and clean and so soft and polished that even a fly in its attempt to sit upon the wall would slip away. So beautiful was the work ! And further, they saw that in the second man's paintings, there was a curious beauty in the paintings which were inscribed within three yards of the wall. How had this work been done? The second man had been polishing, purifying and smoothening his wall to such an extent that he made it transparent and it became a veritable mirror, a looking-glass. Like a looking-glass, it took in all that the first man had done, and everything was painted within it. It is well known that the picture within a mirror reflects within it as far as the object is out-side it.

